సంపుటము 1 | పరీధావి సం॥ భాద్రపద మాసము. | సంచిక 1



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

(Journal of the Telugu Academy)

## ప్రధాన వ్యాసములు.



చెన్నపురి.

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక

---

చెన్నపురి ఆంధ్రసాహిత్య పరిషత్తువారిచే మూఁడుమాసముల కొకసారి ప్రకటింపఁబడును.

| సంపుటము 1. | పరీధావి సంవత్సర శ్రావణపూర్ణిమ (ఆగస్టు తే 27 ది 1912) | సంచిక 1. |
|---|---|---|

## స్వవిషయము.

ఆంధ్రసాహిత్య పరిషదుద్దేశముల నెఱవేర్చుటకునై యొకసాధనముగా "తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించుట కొకపత్త్రికను బ్రకటించుట." యొకటి నిశ్చయింపఁబడినదిగదా. ప్రకృతమున దానిని మూఁడుమాసముల కొకతూరి ప్రకటించునట్లుగాఁ బరిషత్తువారు తీర్మానించి యున్నారు. తదనుసారముగా నీప్రథమసంచిక వెలువడుచున్నది.

ఈ పత్త్రికయొక్క విశేషప్రయోజనముల వివరించుటకుఁ బూర్వ మిట్టిపత్త్రికల సాధారణప్రయోజనములఁ గొన్నిటి నిరూపింప వలసియున్నది. ప్రసిద్ధములుగావున సంగ్రహముగా వివరించెదము. మానవజాతియొక్క జ్ఞానవిజ్ఞానాభివృద్ధికిఁ బరస్పర భావప్రకటన మావశ్యకసాధనమన్న విషయము సర్వజనులకును విదితమేకదా. ఇట్టి భావప్రకటనము బడులు, సభలు, కూటములు లోనగు వానిమూలమున నపరోక్షముగను, బత్త్రికాగ్రంథాది ముఖమునం బరోక్షముగను, సాగుచుండును. అపరోక్షముగ సాగుచుండుబోధ వక్తలును శ్రోతలును బ్రతిపాద్యాంశములను దమతమశక్తి కొలందిని బూర్ణముగా నాకలించికొని సమావిష్టులయినచో నెక్కువ హృదయంగమముగను లాభప్రదముగను నుండును. ఆత్మాత్మపరస్పర సన్నికర్ష ఝటితిబోధస్ఫూర్తి కుత్కృష్టసాధనము.

దీని విషయప్రతిపాదనము వాగ్రూపమున సాగి శ్రుతిమూలమున గ్రహింపఁబడు
టచే, నిది సాక్షరులకును నిరక్షరులకునుగూడ నుపచరించును. కాని యనేకు
లొకచో సమావేశమగుటకు విశేషవ్యయప్రయాసలు గావలసియుండును.
భుక్తికై శక్తియుక్తులనెల్ల ధారవోయవలసిన యిక్కాలమున నిర్ణీత దేశకాల
ములఁ బలువురు సమావేశమగుట కవకాశము చిక్కుటరుదు. ఇన్నిటికిని విశేష
సౌకర్యముల నలవఱిచికొని, దేశములో నూరూరబాలురకు బడులును, పెద్ద
లకు కూటములును, విద్యాధికుల యుపన్యాసములకు సభలును బ్రతిష్ఠించి,
జ్ఞానవిజ్ఞానబీజముల నెల్లెడల వెదచల్ల నవకాశము నొదవించుకొనిన సందర్భముల
లోఁ గూడ, నీ మూలమునఁ బ్రతిపాదింపఁబడినదాని మననముచేసి యుపస్థితిలో
నుంచుకొనుపనికై పత్త్రికాగ్రంథాది సామగ్రి యవశ్యాపేక్షణీయము. పైని
బేర్కొన్న యపరోక్షబోధసాధనములపనికి సహకారులుగాఁ బత్త్రికాదులకుఁ
గల ప్రయోజనమిది.

పలువురుప్రజలు చదువను వ్రాయను నేర్చియుండి నాగరికత నందియున్న
దేశములలోఁ బత్త్రికాగ్రంథాదులు స్వతంత్రబోధమునకుఁగూడ నుత్కృష్టసాధ
నములుగా నుండును. అమెరికా యింగ్లండులోనగు దేశములలో వీని మూలమున
నగు జ్ఞానాభివృద్ధి యింతయని మనల కూహింపనలవికాదు. ఆదేశములలోఁ బ్రతి
ప్రతిష్ఠాపనమునకును నొకపత్త్రిక యేర్పాటై యుండును. తదనుసారముగా మన
పరిషత్తునకుఁగూడ నొకపత్త్రికయొక్క యావశ్యకతను గ్రహించి పరిషత్తు వా
రాంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక నేర్పాటుచేసి యున్నారు.

ఇది ప్రకృతమందు మూఁడుమాసములకొకతూరి వెలువడునట్లు తీర్మానము
చేయఁబడినను, గ్రమక్రమముగ నవకాశములొదవిన కొలఁది నభివృద్ధినొంది యింత
కంటెఁ దఱచుగా వెలువడునుగాక. ఏతత్పత్త్రికా ముఖమునఁ బ్రకాశితములగు
విషయముల సంగ్రహముగా నీక్రిందవివరించెదము.

సాధారణసాహిత్య విషయములు:—ఆంధ్రవాఙ్మయమునఁ, బద్యకావ్య
ము, వచనకావ్యము, నాటకములోనుగాఁగల కావ్యభేదములలోని గుణదోష
విచారము; ఇట్టి విషయములకు సంబంధించి యాంధ్రవాఙ్మయమునకును దది
తరవాఙ్మయములకును గల తారతమ్యవిచారము; శృంగారాది వర్ణనములు;
గ్రామ్యప్రయోగములు; అన్యభాషాపదప్రయోగములు; లోనగు సర్వవిషయ
ములు నిందంతర్భూతములై యుండును.

కవిజీవితములు, కావ్యచరిత్ర, కృతివిమర్శ:—ఏయేకవు లేయేకాలముల నుద్భవిల్లి యేయేయుద్గ్రంథముల రచించి వాఙ్మయమున నేయేగుణదోషములఁ బెంచిరో, ఏయేకవు లేయేతత్పూర్వకవుల కృతుల మాతృకలుగాఁ గొని యందుత్కర్షాపకర్షలఁ జేర్చిరో, పురాణములు, కావ్యములు, ప్రబంధములు లోనగు కావ్యభేదము లెప్పుడెప్పుడు వెలసి యెట్లెట్లు వికాసమును బరిణతియు నందినవో, ఇంకను, ఏయేసంస్కారముల నలవఱచికోవలసియున్నవో, ఇట్టి విషయములును; అన్యైకవుల కృతులయందుఁ గల గుణదోషముల విమర్శించి విమర్శాదర్శముల సిరూపించుట; అన్యైకావ్యభేదములలో, రసభావవిషయములలోను, శయ్యారచనలోను, గుఱి నుంచుకోవలసిన యాదర్శముల నిరూపించుట; లోనుగాఁగలవిషయము లిందుఁబొందుపడి యుండును.

భాషాచరిత్ర:—ఆంధ్రభాషయొక్క యుత్పత్తి వికాసములు; సంస్కృతభాషతోడను, ఇతర ద్రవిడభాషలతోడను దానికిఁ గల సంబంధములును సాదృశ్యములును వివరించుట మొదలగువిషయము లిందుఁ జేరి యుండును.

చరిత్ర:—దేశచరిత్రము; సాంఘిక రాజిక ప్రతిష్ఠాపనముల చరిత్రము; తదితరప్రతిష్ఠాపనముల చరిత్రము; శిల్పకలాదుల చరిత్రము; ఆర్థిక పారిశ్రామిక విషయములు; మహాపురుష చారిత్రములు; శాసనములును, వానివివరణమును; లోనగు విషయము లిందు వివరింపఁబడును.

ఆధునిక శాస్త్రము:— భూగోళశాస్త్రము, ఖగోళశాస్త్రము, భౌతికశాస్త్రము; జీవశాస్త్రము, జంతుశాస్త్రము, లోనగు శాస్త్రప్రపంచమీ సందర్భమునఁ బ్రకాశితమగును.

పద్యములు:— హృదయంగమములును ననతిదీర్ఘములునగు పద్యావళులుగూడ నిందుఁ బ్రచురింపఁబడును.

మఱియు నాంధ్రవాఙ్మయాభివృద్ధి కుపచరింపఁ గల సర్వవిషయము లిందుఁ జర్చింపఁబడును.

శ్రీ

ఆంధ్ర సాహిత్య

# పరిషత్పత్త్రిక

చెన్నపురి ఆంధ్రసాహిత్య పరిషత్తువారిచే మూఁడుమాసముల కొకతూరి ప్రకటింపఁబడును.


| సంపుటము 1. | పరీధావి సంవత్సర భాద్రపదమాసము. | సంచిక 1. |
|---|---|---|


## ఆంధ్రసాహిత్యపరిషత్ప్రయోజనములు.

ఆంధ్రవాఙ్మయ మహావృక్షము విపులస్కంధశోభితం బయ్యును, అలక్షితమూలబంధంబును, ఫలకుసుమభరితం బయ్యును, కతిపయశాఖామాత్ర నిరాజితంబును నయి కవిసంతతి కిప్పటి కపర్యాప్తానంద సంధాయకంబయి యున్నయది.

అందలి మూలాన్వేషణ మవశ్యకర్తవ్య మయిన యొకమహాకార్యముగానున్నది. ఇటీవల నీపనికి విశేషసౌకర్యములు గూడ నెదవియున్నవి. దేశమున శాంతి నిల్చి, అయోమార్గాది విన్యాసముచే తెలుఁగుభాష ప్రచారములోనున్న గహనప్రదేశము లెల్ల సుగమంబు లగుటచే ప్రాచీనగ్రంథసంచయము సుకరమయిన పనియైనది. దొరతనమువారు ప్రాచీన శాసన ప్రచురక శాఖను బ్రతిష్ఠించి యెక్కడెక్కడనో యున్నశాసనములను బరిష్కరించి ప్రచురించుటచే నీరూపముననున్న విపులవాఙ్మయము ప్రకాశ మగుచున్నది. ప్రాచీన గ్రంథసంచయమునకును, భాషాచరిత్ర రచనకును, దేశచరిత్ర రచనకును విపులావకాశము లిప్పు డేర్పడి యున్నవి.

ఆధునిక విద్యావ్యాప్తిచే విద్యాధురీణుల హృదయసీమల నేతద్విషయవిచారమునకై దినదినప్రవర్ధమాన మగుచున్న యుత్సాహముగూడ నీ మహోద్యమమునకుం దోడ్పడుచున్నయది. ఇప్పటివఱకును ప్రకాశములుగాని ప్రాచీన గ్రంథము లనేకములు ముద్రితములయి వెలువడుచున్నవి. ఇందు కొన్ని నన్నయాదుల కృతులకంటెను బురాతనములని యెంచఁబడుచున్నవి. ప్రచారములోనున్న గ్రంథములు గూడ వ్రాతప్రతు లనేకములు లభ్యమగుటచే సుపరిష్కృ

తములయి ప్రచురమగుచున్నవి. గ్రంథసామగ్రి యలవడుటచే శబ్దరత్నాకరము ఆంధ్రపదపారిజాతము లోనగు కొన్ని నైఘంటిక గ్రంథములును, శాసనములు ప్రకాశము లగుటచే దేశచరిత్రను గుఱించియు కావ్యచరిత్రను గుఱించియుకొన్ని గ్రంథములును, భాషాపరిశీలన ప్రారంభ మగుటచే భాషావ్యుత్పత్తి విషయమున నొకటి రెండు గ్రంథములును బయలుదేఱినవి కాని యీవిషయమున సాగుచున్న పని మిగుల స్వల్పముగను మందముగను సాగుచున్నయది. ఆంధ్రశబ్ద వ్యుత్పత్తి విషయమునను, భాషాచరిత్ర విషయమునను, కవిచరిత్ర విషయమునను, కావ్యచరిత్ర విషయమునను, దేశచరిత్ర విషయమునను, ఇంకను ననేకములగు ప్రాచీనాంశ విషయమునను అనేక గ్రంథములు బయలుదేఱవలసి యున్నవి. జరిగినపని గోరంతయు జరుగవలసినది కొండంతయుఁ గానున్నయది. కేవలపాశ్చాత్త్య విద్యాసంస్కారవశమున ప్రాచీనగ్రంథ సంచయవిషయమున సడలుచున్న మనయాదరము శూన్యమై పోవకమున్న, తాళపత్ర లిఖితములయి శతాబ్దముల నుండి పడియున్న ప్రాచీనగ్రంథప్రతులు, పాండిత్యవాసనావివర్జితులగు పండితప్రతినిధుల యవజ్ఞకును ఆఖుశుక్షుణిపుత్తికా ద్యుపద్రవములకును లోనయి ఖిలము గాకమున్న ప్రాచీనగ్రంథ సామగ్రిని సంపాదించి, పరిష్కరించి, ముద్రించి ప్రకటింపవలసి యున్నది. వీని యాధారమున భాషావిషయమునను, గావ్యవిషయమునను, శిల్పవిషయమునను, గళావిషయమునను, ఇంకను ననేకాంశవిషయమునను, సవిస్తరమైన చరిత్రగ్రంథముల వెలయింపవలసి యున్నది. ఈవిషయములను గుఱించి బహుశతగ్రంథరచనకవకాశ మున్నయది. మఱియును, దెలుఁగునఁ బద్యకావ్యములు అవి వెలసిన నాఁటికి దేశమునఁ గల జీవితాదర్శనములనుబట్టి విచారించినచోఁ బరిణతికి వచ్చిన వనియే చెప్పవచ్చును. ఈగ్రంథసామగ్రిలోఁ దెలుఁగుభాష దేశభాషలలో దేనికిని దీసిపోక సంస్కృతముతో రమారమి తులదూఁగుచున్నది. ఈకావ్యములు రచించిన గ్రంథకర్తలు పాండిత్యవిషయమునను బ్రతిభావిషయమునను అసదృశులగుటయే కాక, వారి కాలమున ముద్రణప్రకటనసౌకర్యములు లేమింజేసి, సహృదయహృదయంగమములయిన యుత్తమకావ్యములు మాత్రమే సాహిత్యమందభినివేశముగలవారిపరిశ్రమమూలమున నిలుచుటయు,నీరసము లయిన కృతులు నశించుటయుఁగారణములుగా, నిప్పుడు మనభాషలో నిల్చియున్న పూర్వగ్రంథము లన్నియు మిక్కిలి యుత్కృష్టములుగా నున్నయవి. అయినను ఈకాలమువారు వీని యుత్కర్షను

గ్రహింపనేరక వీనిని నిరసింతురు; కాని సాహిత్యవిషయమున కొంత పరిశ్రమము చేసి, అం దభిరుచి సంపాదించినవారు, ఆధునికకవులలో నుత్కృష్టప్రతిభాశాలురుగా నెంచఁబడువారి కావ్యములను బూర్వకవుల కావ్యములతో సరిపోల్చి చూచినచో, పూర్వగ్రంథకర్తల ప్రతిభావిశేషము స్ఫుటముగాఁ దేటపడును. మనపూర్వకవులలో గుణాపకర్ష తోఁచుటకుం గారణము మనయనభిజ్ఞత గాని వారిన్యూనత గాదు.

మఱియు నొకకారణ మిందుకుఁ దోడ్పడుచున్నయది. అ దెద్ది యన: ఈకాలమున ధూమనౌకాధూమశకటాదులమూలమున విశ్వమానవకుటుంబములో నెచ్చటెచ్చట నవతరించిన ప్రతిభాశాలురయొక్కయు మహాకవులయొక్కయు నుదారాశయములెల్ల నెల్లెడల వ్యాపించుటచే జనులహృదయముల నూత్నవికాసము విస్తరించుటంజేసి యీకాలపుజనుల యాదర్శములు దినదిన ప్రవర్ధమానములుగాఁ బెంపొందుచున్నవి. అభ్యుదయము గన్న యింగ్లండు ఫ్రాన్సుజర్మనీ లోనుగాఁగల దేశములలో నీయాదర్శవికాసముతోఁ బాటు సాహిత్యవికాసమును దినదినప్రవర్ధమానమై సాగుచున్న కారణమున నాదేశములలో జనులహృదయములలోని యాదర్శములకును సాహిత్యమందలి యాదర్శములకును మహాంతరము లేమింజేసి వారివాఙ్మయము వారికి రుచించుచున్నయది. అట్లు గాక శతాబ్దములనుండి శాంతియనున దెఱుంగక కేవలము భుక్తికయి శక్తియుక్తుల ధారవోయవలసిన మనదేశస్థులలో నొకసాహిత్యవిషయమున నన నేల, సర్వవిషయములలోను, అభివృద్ధి శతాబ్దములు వెనుకఁబడియున్నది. ఇట్లుండఁగా నాంగ్లేయప్రభుత్వము స్థిరపడి, శాంతియు విద్యాభివృద్ధియుఁ జేకూఱిన యీకాలమున, ప్రచారములో నున్నవిద్య ప్రాయికముగా (ప్రాయికముగా నన నేల యనేకవిషయములలోఁ గేవలముగా) నాధునికవిద్య యగుటచే, విద్యాధురీణుల హృదయముల నాధునికాదర్శములు పాదుకొనినకారణమున పూర్వగ్రంథములు వారి కెంతమాత్రమును రుచించుట లేదు. మనపూర్వగ్రంథములఁ జదువుచో వారల లక్ష్యములు పదితలలును వేయిచేతులును లోనగు నందలి యసంభవాంశములపైఁ దగులునే కాని, యుత్కృష్టనీతిబోధకమగు నందలిపరమతాత్పర్యముపై నిలువవు. ఇట్లగుటచే వాల్మీకిరామాయణము చదువునప్పుడు గూడ నది వారికి హృదయంగమముగా నుండనేరదు. ఆధునికవిద్య లేనివారిలోఁ గూడ నిట్టి యవజ్ఞ పలువురిలోఁ గానవచ్చుచున్నయది.

ఇందలి కారణ మే మన: కాలానుసారముగా వచ్చినమార్పులమూలమునఁ బట్ట ణములందే కాక పల్లెలయందును, బాఠశాలలందే కాక గృహములందును జీవితా దర్శములు మాఱి పూర్వాదర్శముల కనేకవిషయములలో భిన్నమై యుండుటచే నిప్పటివారిలో పలువురియొక్క హృదయక్షేత్రములఁ బూర్వవాసనలు మాసి పోయి, భక్తివిశ్వాసములు సన్నగిల్లుటచే మనపూర్వగ్రంథములు వారికి రుచిం పకున్నయవి. కావున నీకాలమునఁ బూర్వగ్రంథములు మూలఁబడి యెక్కడఁ జూచినను మనపురాణములకు మాఱుగా నరబ్బీనైట్సుకథలు, గ్రీకుపురాణకథలు ఆంగ్లోసాక్సను గాధలు, నవలలు లోనుగాఁ గల గ్రంథములు వెలయుచున్నయవి.

ఈయనర్థ మింతటితోఁ దీఱుట లేదు. తొలుత నెకవిధమయిన నాగ రకతకు లోనయి, దానిని మఱచియు మఱవకున్నట్లున్న మన యీ కాలపువా రికి పూర్వాదర్శములు మెట్టువడుచున్నవి, నూత్నాదర్శములు పట్టువడకున్న యవి. సంఘములో నధికభాగ మీవిధమువా రగుటచే, నీయుభయసంస్కార ములయొక్కయు సంక్షోభముచే, వారి హృదయములలోనే కాక వారితో నధికకాలము గడపుచు జీవితములఁ బుచ్చు విద్యాధికుల హృదయములలోఁ గూడ, నేయాశయములును, పుష్కలముగను సువ్యక్తముగను ఉద్భవిల్లి యనర్గళముగా సాగకున్కిచే కవితాలతయు కాలానుగుణముగ నూత్నసం స్కారముల నలవఱుచుకొని కొనలు సాగ నేరకున్నయది. మనవారుపిన్ననాఁట నుండియు నన్యభాషాపరిశ్రమచే మాతృభాష నుపేక్షించి, యుత్తరములు వ్రా యునపుడు గూడ నాంగలభాషాపదముల తోడ్పాటు లేక భావములు ప్రకటిం చుకొననేరమి గూడ నిందుకుఁ దోడ్పడుచున్నయది.

ఇట్టిహేతుబాహుళ్యముచే మనయాంధ్రవాఙ్మయము, సాగినంతవఱకు సమగ్రమముగా సాగినదయ్యును ఇప్పటి స్థితిగతుల కపర్యాప్తముగా నున్నది. అందలి యాదర్శములును లోకవృత్తములును, మహాపురుషచారిత్రములును కొన్నికొన్ని సందర్భములలో మన కనేకశతాబ్దములు వెనుకవడియున్నవి.ఈకా లపులోకవృత్తమునకు సరియైన ప్రతిచ్ఛందములుగా నుండునట్లుగ నాధునికాదర్శ ముల ననువుపఱచి యిప్పటివారికి హృదయంగమముగా నుండురీతిని పద్యకా వ్యములు గూడ ననేకములు వ్రాయవలసి యున్నది. మఱియును వాల్మీకివ్యా సాదుల యుదారాశయముల నాంధ్రవాఙ్మయమునఁ బొందుపఱచినట్లే, షేక్సి యరు, వర్డ్సువర్తు, షెల్లీ, బ్రౌనింగు, మొలియరి, గీటీ లోనగు వారియాశయ

ములఁ గూడనాంధ్రలోకమునకుఁ బ్రకటింపవలసి యున్నది. మనభాషలో పూర్వకవులు నాటకములను రచింపరైరి. శకుంతలాపరిణయమును దెనుంగున రచించిన పినవీరనాదులు దానిని చంపూకావ్యరూపమున రచించిరి కాని నాటకరూపమున రచింపరైరి. కాళిదాసాదుల నాటకముల నీకాలమున ననేకు లాంధ్రభాషలో ననువదించిరి. కాని, వారు నన్నయాదులవలెఁ గాక యట్టియనువాదవిషయమున నించుకైన స్వాతంత్ర్యము నంగీకరింపకపోవుటచే నట్టియనువాదములు హృద్యములు గాఁజాలకున్నవి. ఒకనాటకవిషయమున నొకరు చేసిన యనువాదమున నొకచోట 'తు' అనునది పొందునడలేదని మఱియొకరు మఱియొక యనువాదమును, వారు చేసిన దాన నొకచో 'చ' అనునది పొందువడలేదని మఱియు నొకరు మఱియు నొకదానిని రచించుటవలన నొకమాతృకకే యనువాదము లనేకములు వెలయుటయు, సారభూత మగు కవిహృదయము ననుసరించు యత్న మల్పముగను 'తూ చా' తప్పకుండ రచించు యత్న మధికముగను జేసినకారణమున, నీయనువాదములలో దేనివలనను మూలగ్రంథకర్త హృదయ మటుండఁగా, అనువాదగ్రంథకర్తల హృదయ మైనను గోచరింపకపోవుటచే ననేకసందర్భములలోఁ బాఠకలోకము "అనధీతే మహాభాష్యే వ్యర్థా సా పదమఞ్జరీ అధీతేఽపి మహాభాష్యే వ్యర్థా సా పదమఞ్జరీ" అనుదానిచే నిర్దేశింపఁబడిన యవస్థపా లగుచున్నారు. మూలము చదివిననే కాని మూలగ్రంథకర్త యాశయము గోచరింపకుండుటచే నిట్టి యనువాదము లనేకములు మూలగ్రంథములఁ జదువనివారికి నిరర్థకములు; చదివినవారికి నిరర్థకము లని వేఱ చెప్ప నక్కఱయే లేదు గదా? ఇట్లగుటచే షేక్స్పియరు గీటీ లోనగు పాశ్చాత్త్యకవిశిఖామణుల నాటకములనే కాక, కాళిదాసాదిసంస్కృత మహాకవుల నాటకములను గూడ ప్రసాదాదిగుణపోషణమునకు వలయునంత స్వాతంత్ర్యము నవలంబించి యాంధ్రీకరింపవలసియున్నది. మఱియును, ఈకాలపు నితివృత్తమును గైకొని, యాధునికాదర్శములను గుఱినుంచి, స్వతంత్రనాటకము లనేకముల రచింపవలసియున్నది.

ఈదేశమున వచనకావ్యరచన తెనుఁగుననే కాక, దేశభాషలం దెల్లను, సంస్కృతముననే కూడను, మిగుల శైశవావస్థలో నున్న దన్నవిషయము ఆంగ్లేయులు మొదలగు పాశ్చాత్త్యులవాఙ్మయముతో నేపాటి పరిచితి గలవారికిని స్పష్టముగ గోచరింపకమానదు. ఒక యింగ్లీషుభాషలోని వచనకావ్యప్రపంచ

మును బరికించినచో, మనపద్యకావ్యప్రపంచమున నన్నయ తిక్కన కేతన పోతన పెద్దన సూరనాదు లొండొరులఁ బోలక యొకరి నొకరు మఱపించుచు కావ్యరచనయందు చిత్రగతుల విహరించినట్లే, గిబ్బను, మకాలే, డికెన్సు, థాకరే, డిక్వెన్సీ, రస్కిను లోనుగాఁ గల యాంగ్లేయవచనకావ్యకర్తలును అంగల భాషాప్రపంచసృష్టిని, ఆనంత్యమునను వైచిత్ర్యమునను ప్రపంచసృష్టిని మించునట్లు చేసియున్నారు. వారిచేతులలో నాంగలభాష దినదినప్రవర్ధమానమై శబ్దార్థసామగ్రిలో నెల్లభాషలనతిశయించి యున్నయది. వచనరచనవిషయమున మనభాష శతాబ్దములు వెనుకఁబడియున్నది. వచనరచన యీఫక్కి నుండవలె ననికూడ నిప్పటికి నిర్ధారణకాలేదు. ఈవిషయమున నింకను బలువురు బహువిధాభిప్రాయములు గల్గి యుండుటచే నేకభావము చొప్పడక వివాదములు పెచ్చుపెరుఁగు చున్నయవి. తిక్కన రచితభారతములోని వచనమును మాతృకగాఁ గొని చిన్నయసూరి జిగిబిగియు ప్రౌఢియు నిమిడికయుఁ గల యొకవచన శైలిని వెలయించినం గొంతకాలము వచనరచన దాని ననుకరించుచు వచ్చినది. అటుపిమ్మట వీరేశలింగము పంతులవారీశైలి సామాన్యజనులకు సుగమముగా దనియు, నేభావము చేపట్టిన నాభావమునకు సుకరముగా నొదుగ దనియును దలంచి సులభశైలి నొకదానిని నిర్మించి గ్రంథరచనచేసిన నిటీవల పలువుర కది ప్రమాణ మాయెను. నేఁడదియు విశేషసంస్కార మపేక్షించుచున్నదని కొందఱుద్ఘోషించుచున్నారు. ఎదిమెట్లయినను ఇప్పటి కింగ్లీషు వచనకావ్యములతో సాటిగా నుత్తమ సాహిత్యగ్రంథములుగాఁ బరిగణింపఁదగిన వచనప్రబంధములు తెనుంగున మృగ్యములనియే చెప్పవలసి యున్నది. దేశచరిత్ర, మహాపురుష చరితములు, నీతిమతతత్త్వవిచారము, రాజికసాంఘిక విషయవిచారము, నవలలు మొదలగు నభినవగద్య ప్రబంధములు, విమర్శగ్రంథములు, వ్యాఖ్యాగ్రంథములు లోనుగాఁ గలవివిధకావ్యభేద రూపమున నాంధ్రవచనకావ్యము, వివిధశయ్యారచనల నలరి, శాఖోపశాఖలుగాఁ బెంపొందవలసియున్నది. మఱియును భూగోళశాస్త్రము, ఖగోళశాస్త్రము, భౌతికశాస్త్రము, జీవశాస్త్రము లోనగు నాధునికవిజ్ఞానమును, అష్ట్యైకలలను శిల్పములను, బోధించు విపులశాస్త్ర ప్రపంచ మొకటి నిర్మింపవలసి యున్నది. ఇంతియే కాక యాంగలభాషలోవలె స్త్రీలకును పిల్లలకును సుగమముగను మనోహరముగను వివిధ విషయములను సంగ్రహముగాఁ దెల్పు గ్రంథము లనేకముల రచింపవలసి

యున్నది. బడులలో పఠనీయములగు ననేక గ్రంథములను యుక్తరీతిని వ్రాయ వలసి యున్నది. భాషావిషయమున నింకను గొఱంత లనేకములఁ దీర్పవలసి యున్నది.

ఈ కొఱంతలఁ దీర్ప నక్కడక్కడఁ గొన్ని కొన్ని ప్రయత్నములు తల సూపినవి గాని యం దనేకములు సంభావితజన ప్రోత్సాహమును, సామాన్యజన సంఘీభావమును అలవడమిచే క్షీణదశలో నున్నయవి.

"ఉ. రాజులు తొల్లి యిందుఁ గవిరాజులఁ బూజల నాదరించి వి
భ్రాజితమైన కీర్తిఁ గరుబంతముల న్వెలయంగఁ జేసిరా.
రాజులు నేడు చూడఁ గరిరాజుల వాజుల నాదరించుచు
న్వ్యాజనకోటిపై నిడిరి పూజ్యుల భారము పల్వు రిమ్మహిన్."

అని యొక కవి చెప్పినట్లుగా దేశభాషా గ్రంథకర్తలకుం బ్రభుసమ్మానమునకుఁ గాలము గడచినట్లున్నది; ప్రజల యాదరమును జేకూఱినట్లు గాన్పింపదు. ఈ విషమ సంధిలో గ్రంథరచన వలన నెట్టి ప్రతిభాశాలికిని జీవయాత్ర సాగకున్న యది. కావుననిప్పటి స్థితిలోరసజ్ఞులయిన ప్రభువులు తమ యసదృశౌదార్యమును జూపియు ప్రాజ్ఞు లయిన సామాన్యజనులు సంఘములఁ బ్రతిష్ఠించియు, నీయుద్య మములకు నిలువు గావించి ప్రోత్సాహ మొసంగవలయును. ఇట్లుకొంతకాలము సాగించి జనసామాన్యమునకు గ్రంథావలోకనమున నభిరుచి కల్గించినచో నీ యుద్యమములు దేశమున నెల్లెడల వ్యాపించి స్వశక్తిచేఁ గొనసాగఁ గలవు. ఇందులకు నిదర్శనముగా నిట్టి యుద్యమములు ప్రభువుల సమ్మానమును, సంఘ ములప్రాపును జేకూఱినచో కొంతనిల్కడగాంచి వృద్ధినందుటయు, చేకూఱనిచోఁ గృశించి యడుగంటుటయు మనము చూచుచున్నారము. ఈద్వివిధ సాహాయ్య మును విరివిగా బడవడని కారణమున నేఁటివఱకును, ఈ యుద్యమము సర్వతో ముఖముగ సాగనేరక కతిపయ మార్గములనే నడచుచున్నయది. అముద్రిత గ్రంథప్రకాశవిషయమునను, అభినవప్రబంధ ప్రకటన విషయమునను, ఆధుని కవిజ్ఞాన బోధవిషయమునను. దేశచరిత్రరచనా విషయమునను, మహాపురుష చరిత్రరచనా విషయమునను, కొంత పని సాగుచున్నది కాని యిది కూడ నస మగ్రముగను మందముగను సాగుచున్నది గాని పర్యాప్తముగను సత్వరముగను నడచుట లేదు. కొన్నినవలలు రచింపఁబడినవి. కాని తక్కిన యనేకాంశముల విషయమున నెత్తుగడయే కావలసియున్నది.

పైఁజెప్పిన విజ్ఞానాది విషయమున వెలయు గ్రంథములన్నియు వచన రూపముననే యున్నవి కాని, అందలి కొన్ని చరిత్ర గ్రంథములును నవలలును మాత్రముతప్ప తక్కిన వెవ్వియును శుద్ధసాహిత్యమునకు సంబంధించిన వచన కావ్యములుగాఁ బరిగణింప నర్హములుగావు. చరిత్ర గ్రంథములకును బ్రధాన ప్రయోజనము చరిత్రాంశ ప్రతిపాదనము కాని రసప్రధానమగు కావ్యరచన కాదు. అట్లగుటచే నవి కవనప్రతిభాశాలురగు గ్రంథకర్తలచే నిర్మింపఁబడి రస వద్వస్తు వర్ణనములచే నిండియుండినం గాని శుద్ధసాహిత్య కావ్యములుగా పరిగ ణింప నోపవు. ఇటీవల నవలలు మొదలగు కొన్ని వచనకావ్యములు బయలు దేఱినవి కాని మన వచనరచన యింగ్లీషు వచనరచనతో సరిఁబోల్చి చూచినచో శూన్యప్రాయముగా నున్నది. ఈవిషయమున నుపక్రమమే క్రమముగాఁ జేయ వలసి యున్నదని చెప్పవచ్చును.

ఆంధ్రవాఙ్మయ విషయమునం బైనివివరించిన కొఱంతలన్నియుం దీర్పఁ బ్రభుసమ్మానంబును సంఘశక్తియును దగిన సాధనములగుటచే, నీ ద్వివిధసాహి త్యమును జలపఱిచి యాంధ్రభాషాభిమానులు గొందఱీమధ్య, 'ఆంధ్రసాహి త్యపరిషత్తు' అను పేరనొక మహాసంఘమును స్థాపించియున్నారు. తెలుఁగుభా షను, వాఙ్మయమును అభివృద్ధి నొందించుటయు, ఆ విషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీ పరిషత్తుయొక్క ప్రయోజన ములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీ క్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి:—

*i* తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగు వానిని నిరూపిం చుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకషమగు నిఘంటువు నొక దానిని రచించి ప్రచురించుట;

*ii.* తెలుఁగుభాషకు సజాతీయేతర భాషలతోఁగల సాదృశ్యములను సాక ల్యముగ నిరూపించుచు నొక వ్యాకరణమును రచించి ప్రచురించుట.

*iii.* ఆధునిక శాస్త్రగ్రంథ రచనయందుఁ బ్రయోగించుటకునై పారిభా షిక పదములను నిర్ణయించి వివరించునొక శబ్దకోశమును సిద్ధము చేయుట.

*iv.* ఆంధ్రదేశ ప్రాచీన చరిత్రాంశ పరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగు టయు, లభ్యములయిన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశము యొక్కయుఁ బ్రజలయొక్క

యు చరిత్రమొకటి రచించి ప్రచురించుట;

v. సర్వవిషయములను గురించిచేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi. ఆంధ్రభాషలోని మంచి గ్రంథములం బండితపరిష్కారము చేసి నిర్దుష్ట ముగఁ బ్రచురించుట;

vii. తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయము లను జర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix. తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁగావించి పారితోషికము లను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్త్రికల, నొసంగుట;

x. ఒకపుస్తక భాండాగారమును స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధాన ముగాఁ దెలుఁగు గ్రంథములుండవలయును; వ్రాఁతప్రతులు గూడ నుండ వలయును;

xi. తెలుఁగు భాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికినుప చరించు నన్నికార్యములను జేయుట;"

"చ॥ధరపయి సర్వభాషలకుఁ దల్లి యనందగు దేవవాణికిన్
మురిపములింపుసొంపెసఁగ ముద్దులపుత్త్రికయై రహించి, మే
ల్తెరఁగుల దేశభాషలను లెస్స యనంజను నాంధ్రవాణిము
న్నరసులు సత్కలానిధులు సారవచోవిభవాభిరాములై
పరఁగునృపాలశేఖరుల ప్రాపున నూత్నవిలాససంపదం
బెరఁగియు, మధ్యకాలమునఁ, బేరిమిదక్కి, యొకింతనేఁటికి
శ్వరకరుణన్దరిత్రి బహుభంగులఁదాఁదలనూపుటొప్పగున్.
విరివిగదేశమందిపుడు వేయివిధంబుల సాగుయత్నము
ల్పరిపరిభంగులై లయను పాల్పడకుండఁగ దిద్దితీర్ప, సుం
దరరచనాచమత్కృతుల నన్యతరంబగు భావబంధము
ల్వరమతినేర్చికూర్చి యఖిలప్రజకు న్హృదయంగమంబుగాఁ
గ రససమంచితంబులగు కావ్యముల న్రచియింప, నెంతకు
న్దరుఁగనికార్యభారము ఘనంబయియున్నది గానఁ బండితు
ల్నరసులు సత్ప్రభుల్కవులు సర్వవిధంబుల సౌమనస్యము
ల్నెరవుచు నీమహాద్యమము నేర్పునఁ దీర్పఁగ దక్షులౌదయన్.

పరమతియన్నపార్యుఁడును వాఙ్మయలోకవిధాత యజ్వయు
న్నురుచిరబంధదక్షుఁ డల సూరివరేణ్యుఁడు శంభుదాసుఁడు
న్నరియును వన్నెగన్న కవిమాన్యులనేకులు చిత్రచిత్రమౌ
విరచనలింపుసొంపెసఁగ వేయివిధంబులఁగూర్చి కానుకగా
సొరిదినొసంగఁ బొల్పెసఁగు శుద్ధసువర్ణమయాచ్ఛభూషలం
బరఁగెడు నాంధ్రభారతికిఁ బ్రాపునుబ్రోపును జూపి పండితు
ల్సరసులుసత్ప్రభుల్ఘనులు సర్వవిధంబుల నాదరింపుఁడీ॥

చ. అఁదిరసజ్ఞశేఖరులు నంచితధీయుతు లౌచునిమ్మహి
న్వరలుప్రభుల్ప్రజల్ఘనులుఁ బండితవర్యులు నాంధ్రవాణికిం
గరమనురక్తి సేవ లొనఁగంగను నేఁడిటఁ గూడియుండుటం
గొరఁతలుదీరి పెంపు సమకూరక యున్నె నిరంతరాయమై॥

గీ. భూరిసాహిత్యసుకవి కేదారములను
జీవనాధార మొదవమిచేఁ గృశింప,
నబ్బెఁ గవితాలతకు నేఁటి కమృతవృష్టి
యాంధ్రసాహిత్య పరిషదభ్యాగమమున॥

గీ. రససమృద్ధినిఁదొంటి నీరసతవాసి
యాంధ్రకవితాలతాంకూరమన్ని దిశలఁ,
గొనలుసాగించి వెస నల్లుకొనుచు నేచి
పల్లవితకోరకితలక్ష్మిఁ బ్రబలుగాత॥ ”

అని యొకకవి తన యాశంసను దెల్పినదాని కనుగుణముగా నీ యాంధ్రసాహిత్య పరిషత్తు నిరంతరనిరవధికాభివృద్ధినంది యాంధ్ర భాషను మహోన్నత స్థితికిం దేఁదగి యున్నయది. సర్వసదుద్యమములకును బ్రాపైయుండు సర్వేశ్వరుఁడీ పరిష.దుద్యమముల నిరంతరాయములుగ సఫలము లగునట్లు ప్రసాదించుఁగాత !

చెన్నాప్రగడ - భానుమూర్తి.

శ్రీమత్పరదేవతాయై నమః.

# ఆంధ్ర మహాకవి ప్రశంస.

ఉ॥ శ్రీకరమాంధ్రభారతము చేయఁగఁ జేసె నెనండు నన్నయా
ఖ్యాకమహాకవిప్రవరు నంజలిబంధముతోడ వేఁడి సు
శ్లోకుఁ డతం డుదారగుణశోభితుఁ డాంధ్రకవిత్వదివ్యధా
రాకుతుకీ కృతాంతరుఁడు రాజనరేంద్రుఁడు వొల్చు నేఁటికిన్॥ ౧

ఉ॥ ఏగతినో కవిత్వము ననేకులు సెప్పెడువార లుండ స
ర్వాగమవేది నన్నయమహాకవియే యని నిశ్చయించి యు
ద్యోగినిఁ జేసె భారతమహోదధి నీఁదు మటంచు నెవ్వఁ డా
హా! గణుతింపఁ జెల్లదె మహామహు రాజమహేంద్రు నాతనిన్॥ ౨

ఉ॥ చచ్చి శరీరముల్ విడిచి చన్ననృపుల్ గల రెందఱేని వి
ద్వచ్చయమాన్యమున్ సుకవివంద్యమునై తగు కీర్తికాయమీ
సచ్చరితుల్ భరించె నిది శాశ్వత; మీనృపు సన్నుతించి స
ర్వోచ్చపదంబుఁ గైకొనుట యొప్పదె యిప్పటి యాంధ్రజాతికిన్॥ 3

తే॥గీ॥ రాజరాజనరేంద్రుండు పూజనీయుఁ
డైననన్నయ సుకవియు నాంధ్రభాష
భారతం బనునిధిలోన భద్రపఱచి
యుంచుటను గాదె మనకు సుయోగమబ్బె॥ ౪

ఉ॥ నన్నయగారి త్రోవఁ గొని నవ్యగుణంబులు కొన్ని చేర్చి తి
క్కన్నమహాకవి ప్రవరుఁ డాంధ్రకవిత్వము వృద్ధిచేసె నె
ఱ్ఱన్నయు వీరి త్రోవఁ గొని యర్వాత యింకొక కొంత యిచ్చె, స
ర్వోన్నతి తెచ్చె సోముఁడు మహోదధినాఁ జను నాంధ్రభాషకున్॥ ౫

ఉ॥ పెక్కుమహాకవుల్ పిదపఁ బెక్కు పురాణము లాంధ్రభాషలోఁ
దిక్కనగారి త్రోవను సుధీహిత మొప్పఁగఁ జేసి రంతకో

నెక్కడ నాంధ్రమున్ సలుప నేది పురాణము లేక పోయె స
మ్యక్కృతికర్త నై ప్రథమమహాకవిమౌళి జనించె నంతటన్॥ ౬

చ. ఇతనికవిత్వపుం గరిమ నెన్నఁగ నన్నయ యంతవానిఁగాఁ
గృతిమను లెల్లఁ జెప్పుదు రహీనమహాకవితాసురాపగా
వితతమహీతలుం డితఁడు విశ్వజనీనము నైషధంబుకా
వ్యతతిశిరోవిభూషణము నాంధ్రము చేసి యొసంగె భూమికిన్॥ ౭

ఉ॥ ఈతనికాలమందుఁ గల రెందఱొ సత్కవు లందఱున్ మహా
ఖ్యాతిపరుల్ కృతిప్రవరకల్పకు లాఢ్యత నాగ్రహారవి
ద్యోతను లుద్యదాశుకవితోద్ధతు లందఱియందు నీతఁడే
నేతగ ద్యోతిలెన్ దను మనీషిమణుల్ సతతమ్ము మ్రొక్కఁగన్॥ ౮

శా॥ శ్రీనాథుండు యశశ్శరీరమును దాల్చెం గొంతకాలాన కా
పై నాంధ్రావనిభాగ్యపుం గరిమకున్ బ్రాపై జనించెన్ రసా
నూనాత్యాశుకవిత్వ తత్త్వసతతోద్యోగ ప్రవీణుండు భా
షానంతుం డల పెద్దనార్యుఁడు బుధానందానుసంధాత యై॥ ౯

ఉ॥ ఆశుకవిత్వతత్త్వ మిది యా నిది కాదని కృష్ణరాడ్యశో
రాశిసభాస్థలమ్మున ధురంధరు లౌ కవులున్ ధరాంగనా
ధీశుఁడు కృష్ణరాట్కవియు హెచ్చుగ మెచ్చఁగఁ బెండెరంబు నూ
రీశుఁడు పెద్దనార్యుఁడు గ్రహించె, రచించె స్వతంత్ర కావ్యమున్॥ ౧౦

తే॥గీ॥ ఆంధ్రకవితాపితామహు ననుసరించి వసుచరిత్రంబు రచియించె బట్టుసుకవి
ధారలో భేద మున్నను దానికన్న మిన్న యని దీనిఁబలువురు మెచ్చుకొంద్రు॥

తే॥గీ॥ నారికేళపాకమ్మున సూరివరుల నలరఁ జేయు నాముక్తమాల్యద రచించి
నట్టి శ్రీకృష్ణరాయల యనుఁగు మేన యల్లునిక వీంద్రుఁడగుచు శోభిల్లె బట్టు॥ ౧౨

క. బట్టయ్యు నితఁడు నన్నయ భట్టారకముఖ్య సుకవివరులకు దీటై
దిట్టయయి శ్లేషకవితకుఁ బెట్టిన పేరై యశస్సు పెంచె జగమునన్॥ ౧౩

ఉ॥ పిమ్మట నుద్భవించె నలపింగళి సూరన యాతఁ డెంతయున్
గమ్మనిపల్కులన్ గవితకల్పన సేయు సుధీవతంసుఁ డిం
కమ్మహనీయు లెందఱొ జగమ్మున నాఁడుగలారు వారిలో
నిమ్మహితుండె పేరు వడె నీతనిధార మహాద్భుతంబుగన్॥ ౧౪

ఉ॥ బమ్మెర పోతరాజనెడి భాగవతాంధ్రకవీంద్రునిన్ జగ
త్సమ్మతు రామభక్తు సరసప్రథితాంధ్రకవిత్వరాశినీ
విమ్మటఁ జెప్పఁగాఁ దగదు పెద్దకవీంద్రుల కెల్లఁ బెద్దగా
సమ్మహితార్థ వచింపవలె నీతనిశక్తి యనన్యసాధ్యమౌ॥ ౧౫

చ॥ ఘనమతు లెందఱో గలరు గాని యదేమొ తెనాలిరామకృ
ష్ణుని కవితామహత్త్వ మతినుత్య మటంచుఁ గవీంద్రులందు రా
యనఘుని ధాటిఁ జూచిన నహా! యనకుందురె యేరు గాని యె
వ్వనినని యెన్న నేరుతు మపారు లనేకకవీంద్రు లుండఁగన్॥ ౧౬

చ॥ విజయవిలాసకర్త సువివేకి మహాకవి, యన్యజాతికిన్
ద్విజునకు నుద్భవించిన సుధీతిలకుం డితనిన్ మహాకవి
వ్రజమసమానుఁ డంచును బ్రబంధము చూచి నుతింతు రింతది
గ్విజయము గొన్న కావ్యమె భువిన్ రసధోరణిఁ గానరాదుగా॥ ౧౭

తే॥గీ॥ స్త్రీలలోఁ గూడఁ గొందఱు శ్లేషలాది
గాఁగలుగు ప్రౌఢపద్ధతుల్ గలయఁ గూర్చి
చెప్పి రొకకొన్ని కావ్యముల్ మెప్పు గనిరి
నాఁటి సుకవులచే ధరానాథసభల॥ ౧౮

మ. తతవిద్యారసికప్రచారుఁ డగు శ్రీతంజాపురీవల్లభా
చ్యుతశ్రీమద్రఘునాథభూపు డనుకన్ శోభిల్లె నానాఁట ను
న్నతికిన్ వచ్చుచు నాంధ్రసత్కవిత పై నానాఁట క్షీణించుచున్
గతికిందక్కి యధోగతిం బడియెటో కాలూది మూలం బడెన్॥ ౧౯

ఉ॥ అంతట హూణరాజ్యపుసమాదరణంబునఁ జేసి యెట్టులో
వంత యొకింతతగ్గె నటువాడిన యాకవితాలతాంగికిన్;
సుంతవిచార మాపె విడి శోభకు వచ్చెనునంత నేదియో
చింత యొకండు వచ్చె నది చెప్పఁగ నేల జగత్ప్రసిద్ధమే॥ ౨౦

ఉ॥ దానిని దెచ్చి పెట్టిన విదగ్ధులుఁ గూడ మహోపకారమున్
బూని యొనర్ప నెంచిన ప్రబుద్ధులె కాని మఱేరుఁ గారు వీ
ర్మానస మందు నొజ్జగను మాఱుపఁ బోయినఁ గోఁతి యాట సం
ధానము చేసె దేన్రఁ డదితజ్జ్ఞులు తీరుపఁ బూసి రంతటన్॥ ౨౧

తే॥గీ॥ ఆంధ్రభాషాపరిషదాఖ్యనలరు మీదు
సభ విమర్శించి కవితకు సంభవించి
నట్టి కష్టమ్ము దీర్చెనో యనఘులార
ప్రాజ్ఞులార మద్రాస్పురీ వాసులార ॥ ౨౨

సీ॥ మీయాంధ్రపరిషత్తు మేదినీనాథుల యాదరణకుఁ బాత్రమగును గాక
మీయాంధ్రపరిషత్తు మేటివిద్వత్కవీంద్రులకు నానందమ్ము గొలుపుఁ గాక
మీయాంధ్రపరిషత్తు జాయమానానేకకృతుల కానందమ్ము నిచ్చుఁ గాక
మీయాంధ్రపరిషత్తు రాయలవారి యాస్థానంబుతో గొండ్లి సల్పుఁ గాక॥

తే॥గీ॥ దీనిఁ బోషించు నృపులకు, దీనియందుఁ
బట్టుదల గల్గి పని చేయు పండితులకు,
నాయురారోగ్యముల నిచ్చి యాంధ్రకవుల
కబ్బములు పేర్మి మన్నించి కాచుఁ గాక॥ ౨౩

ఇట్లు,
తిరుపతి వేంకటేశ్వరులు.

శ్రీ ర స్తు.

ఓమ్నమః పరబ్రహ్మణే.

---

# ఆంధ్ర భాష.

"దృష్టంకిమపిలోకేఽస్మి న్ననిర్దోషం ననిర్గుణం,
ఆవృణుధ్వమతోదోషాన్ వివృణుధ్వంగుణాన్ బుధాః"

---

"భాషవ్యక్తాయాంవాచి" యనుభాషధాత్వర్థముచేతను, "భాష్యత ఇతి" యనువ్యుత్పత్తిచేతను లోకముచే నుచ్చరింపఁబడుచున్న స్పష్టోచ్చారణముగల శబ్దజాలమునకే భాషయని పేరువచ్చినట్లు తెలియుచున్నది. అనఁగా నొకరి యభిప్రాయ మింకొకరికిఁ దెలియుటకై జనసంఘమేర్పఱుచుకొనిన వాగ్రూపములైన గుర్తులే భాషయని చెప్పవచ్చును. మొట్టమొదట వాగ్రూపముగా నుండుటయుఁ గాలక్రమమున లేఖ్యాకృతినొందుటయు భాషకు స్వాభావికము. ఇట్టి భాష యొక్కొక్కదేశంబున నొక్కొక్కవిధముగా నుండుటచే దానికాయాదేశ నామము వచ్చినదనుట యెల్లరకును దెల్లమే? కావుననే యాంధ్రరాజులచేఁ బరిపాలింపఁబడిన మనదేశమందు వ్యవహరింపఁబడు భాషకాంధ్రభాషయను పేరు వచ్చినది. దీనికిఁ ద్రిలింగదేశవ్యవహారసిద్ధంబగు దేశ్యము మూలముగానున్నను దద్భవాత్మకమగు సంస్కృతభాషాసాహాయ్యమును జెంది యున్నతస్థితికి వచ్చుటచే నీభాషకు వికృతియనిపేరు గలిగినది. ఎల్లహిందూదేశ భాషలకు నందును ద్రావిడభాషలకును భరతఖండము చేసికొన్న యనంతపుణ్యరాశియో యనఁదగు సంస్కృతభాష స్వహస్తపరహస్తములఁబెంచిన తల్లియగుననుట సర్వవిదితమైన స్వభావోక్తియేకాని, యందును మనభాషకది నిజముగాఁ గన్నతల్లి యగు నని చెప్పుట యతిశయోక్తిగాదు. కావుననే మనభాష తల్లివలెనే సత్కావ్యసంతానమునుగని "దేశభాషలందుఁ దెలుఁగులెస్స" యను మహారాజోక్తికి నిలయమై యఖండయశస్సు గాంచుచున్నది. దీనికంతకును గారణము సంస్కృతమే స్వభాషగాఁగలిగి తత్కావ్యరత్నసంపదతో వెడలివచ్చిన యార్యులీదేశమున నతిప్రాచీనకాలము క్రిందటనే స్థిరముపడుటయని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు.

ఆర్యులీదేశమునకు రాకమున్నే భాషలో నిపుడు తద్భవములుగాఁ జేరి వ్యవహరింపఁ బడుచున్న "మట్టి, గోడ, కత్తి, గొడ్డలి, కంబము, బల్ల, దివ్వె, కుండ, కడవ, అద్దము, ప్రొద్దు, తాడు, ఈత, పాలు, పువ్వు, పండు, మేఁక, కాకి," యనునివి మొదలుగా నిత్యవ్యవహారములో నుండఁదగిన యనేకశబ్దంబులకు సమానార్థకంబులగు దేశ్యపదంబు లీదేశభాషలో నున్నట్లే కనుపడవు. మఱియు, నొక్కపదార్థమును దెలుపుపద మొక్కటియే యుండుటయు నట్టివాని యర్థములనే తెలుపు తద్భవపదములు చేరినవెనుకఁగూడ వానియర్థము నెఱుంగఁజాలని యప్పటి వారిచే నాతద్భవదేశ్యములు రెండునుగలిసి యొక్కయర్థమునందే నిరర్థకముగా "అగ్గినిప్పు, బట్టగుడ్డ, కట్టెపుల్లలు, కడముంత, బల్లచెక్క" అను నివ్విధముగా నిప్పటికినట్లే హీనజాతులందుఁ గ్రమాగతమై వినఁబడునట్లుగా వ్యవహరింపఁ బడుటయుఁ దుదకు స్త్రీపురుష సామాన్యనామవాచకమగు మనుష్యశబ్దమునకు నింద్యగ్రామ్య రూపముగా "మనిషి" యనుపదము చేరువఱకు నిం దట్టిపదమే కనుపడకుండుటయుఁ జూడఁగా నిపుడు దేశ్యమని మనము వ్యవహరించుకొనుచున్న భాషలోఁగూడ మనము స్థూలబుద్ధితో గ్రహించుటకు వలను పడకుండఁగా మాఱిపోయినతద్భవపదములే యధికముగా నుండుననియు, నట్టియీ భాష మొదలు గ్రాంథికస్థితిలోనికి రాఁదగిన స్వతంత్రభాషగాక యార్యుల యవలంబనంబువలననే క్రమముగా వృద్ధిలోనికివచ్చి గ్రాంథికావస్థను జెందినదనియు, మనము గ్రహింపవచ్చును.

ఏభాషయైనను వ్యావహారికదశనుండి గ్రాంథికావస్థకు వచ్చునపుడు తొలుఁదొల్తఁ బద్యకావ్యరూపముగా బయలువెడలుట నైజము. దీనినే భాషకు ఛందోలక్షణ స్థితియందురు. ఇది యథేచ్ఛ సంభాషణ లేఖనంబులకు సరిపడక, నియమబద్ధంబై సర్వజనసామాన్యంబుగాక సంపూర్ణ లౌకిక జ్ఞానంబుగల యతిప్రతిభావంతుల వాక్కులకు వశ్యమై, విలసిల్లును; ఇదియే వ్యావహారిక భాషనుండి గ్రాంథికభాష వేఱగుటకుఁ గారణము. మనభాష నిట్టిస్థితికిఁ దెచ్చుటలో నంతకుమున్ను గొందఱుకవులు నిజంబుగా నుండియుందురని నమ్మవచ్చును గాని వారి పేరు నూరును దెలియక పోవుటచే మొత్తముమీఁద వాగనుశాసనుండగు నన్నయభట్టారకుఁడే మార్గదర్శకుఁడగు మహర్షి యని చెప్పవచ్చును. ఏమహోమహుం డాంధ్రభాషా మహాసౌధంబున కనశ్వరంబును, నసదృశంబును, బలవత్తరంబును నగు భారతరూపంబైన పునాది వేసెనో, యప్రతిహతంబుగ వేఁగి

దేశంబునేలిన సకలైశ్వర్యసంపన్నుఁడగు రాజరాజనరేంద్రుఁ డెవ్వని వాక్కులకు వశ్యుఁడై యాంధ్రభాషాపోషకుఁడను యశఃకాయంబున నిప్పటికిని జీవించి యుండెనో యట్టినన్నయభట్టారకుఁడే యాంధ్రభారతికిఁ గన్నతండ్రియని చెప్ప నొప్పును. ఈ ప్రసంగంబున సత్కవికృత్యంబు నీక్రింది కల్యాణపండిత వాక్యంబులచేఁ గొంచెము ప్రశంసించి ప్రకృత మనుసరింతము.

1. "కోఽన్యఃకాలమతిక్రాంతం నేతుంప్రత్యక్షతాం క్షమః।
కవిప్రజాపతీన్ త్యక్త్వా రమ్యనిర్మాణశాలినః॥
2. భుజవనతరుచ్ఛాయాం యేషాం నిషేవ్య మహౌజసాం
జలధిరశనా మేదిన్యాసీ దసా వకుతోభయా
స్మృతిమపి న తే యాంతి క్ష్మాపా వినా యదనుగ్రహం
ప్రకృతిమహతే కుర్మ స్తస్మై నమః కవికర్మణే॥
3. యేఽప్యాస న్నిభకుంభశాయితపదా యేఽపి శ్రియం లేభిరే
యేషా మ ప్యవన న్పురా యువతయో గేహే ప్వహశ్చంద్రికాః।
తాన్ లోకోఽయ మ్నైతి లోకతిలకాన్ స్వప్నేఽ ప్యజాతా నివ
భ్రాత స్సత్కవికృత్య! కిం స్తుతిశతై రంధం జగ త్త్వాం వినా॥

(అర్థసంగ్రహము) రమ్యనిర్మాణ సమర్థులగు కవి బ్రహ్మలుగాక యతిక్రమించిన కాలంబును దృష్టిగోచరంబుఁ గావింప నెవ్వఁడు సమర్థుఁడగును? దేనియనుగ్రహంబు లేక యభయప్రదముగాఁ జలధిపరీతమహీతలంబు నేలిన చక్రవర్తులు గూడ స్మరణకు రాఁజాలరో యట్టికవికృత్యమునకు నమస్కరించెదను. ఓయన్నా, సత్కవికృత్యమా! నీ యనుగ్రహంబు లేనికారణంబున, సకలైశ్వర్యముల ననుభవించి నవారేమైనను, ననేకపూర్వరాజులు పుట్టినట్లే లోకమునకుఁ దెలియకుండఁగఁ బోయిరి. నిన్నేమని నుతింతును? నీవు లేనిచో జగ మంతయు నంధప్రాయం బగును.

ఈషద్వైషమ్యముగా మూఁడువంతుల తత్సమపదంబులును, ఒకవంతు తద్భవదేశ్యపదంబులునుగల యీనన్నపార్యుని కవిత్వముంబట్టి చూడఁగా నంతకుఁ బూర్వము చిరకాలముక్రిందటనుండియే సంస్కృతభాషతో మనభాషకు నిరంతర సంబంధము గలిగియున్నట్లును, అదియే కావ్యనిర్మాణంబున, నుభయభాషాభిజ్ఞులఁ బ్రోత్సాహపఱచినట్లును దెలియుచున్నది. కావుననే 6 వర్ణంబులమాత్రము దానధికమయ్యును, 31 వర్ణంబుల సంస్కృతంబును సరిగాఁబోలి, 19 వర్ణంబు

లను దానినుండి తెచ్చికొని, సంపూర్ణతంజెందిన యాంధ్రభాష, వర్ణసమా మ్నాయంబున దానితో నేకీభవించినట్లే యెల్లవిధంబుల ఛందోవ్యాకరణ లక్ష ణంబులను, సకలకావ్యాలంకార లక్షణంబులను, దాని ననుకరించి, కావ్యస్థితికి వచ్చి శ్రావ్యమై, సరసమై, మనోహరమై, విశ్రాంతిఁ జెందియున్న తల్లిని, నిరంత రను స్మరింపఁజేయుచు, 11 వ శతాబ్దము మొదలుగా నేఁటివఱకును లోకవిఖ్యా తింగాంచుచున్నది. ఈవిషయంబునఁ "తత్సమాత్మకమగు సంస్కృతసంబంధము చేతనే యీభాష కావ్యస్థితికి వచ్చినదన నేల? అచ్చతెలుఁగు కబ్బములు మా త్రములేవా?" యని యాక్షేపణము రావచ్చునుగాని, యాతత్సమగ్రంథము లకుఁ బూర్వమాచ్ఛికకావ్యములే కన్పడకపోవుటయు, 16 వ శతాబ్దము మధ్య భాగములోని పొన్నిగంటి తెలగన్న రచించిన యయాతిచరిత్రము మొదలుగాఁ దరువాత వెడలిన యల్పసంఖ్యాకంబులైనవైనను దద్భవసాహాయ్యమునొందిన విగానుండుటయు నారెండుమూఁడైనను సర్వజన సమ్మతంబులై విఖ్యాతింగాంచ కుండుటయుఁజూడఁ దప్పక తత్సమసంబంధముచేతనే యిది సరసకావ్యస్థితికివచ్చి నదనుట విశ్వాసపాత్రము గాకపోదు ఇందులకుఁ గృష్ణదేవరాయలకాలమందలి మాదయగారి మల్లన్న రాజశేఖరచరిత్రంబునఁ జెప్పిన యీక్రిందిపద్యము ప్రబలా ధారముగాఁ గలదు.

"సరససంస్కృతపుష్పగుచ్ఛప్రభూత, మగు తెనుంగను నెత్తావికఖిలదిశలఁ
దరుణపవమాన మగుకవిత్రయవిశేష, చతురవాచానిరూఢి కంజలియొనర్తు॥

కావున సంస్కృతభాషలోని మర్యాదలెల్లఁ దెలుఁగుబాసలోనికాదిమ కవులు, దెచ్చిరనియు, వానిని సగౌరవముగాఁ దరువాతికవులు పోషించుచు వచ్చిరనియు నెఱింగినవిద్వల్లోక మింకను వానినభివృద్ధిలోనికిఁ దెచ్చి దేశభాషను బోషింపఁ బ్రయత్నింపవలయునని తలంచెదను.——

## పద్యకవిత్వము.

ఇందు, మనభాష గీర్వాణభాషాసామ్యమును బుడికిపుచ్చుకొనెనని యెల్ల రకును దెలియును. అపారంబగు సంస్కృతవాఙ్మయంబున దశకుమారచరితాదులు నాలుగైదువచనకావ్యములు దక్కఁ దక్కినవెల్లఁ బద్యకావ్యంబులే యగుటచే వానిం జదివియుఁ, గనియు, వినియు, నాంధ్రీకరింపఁ ననుకరింపనినవా రనఁగా మొ న్న మొన్నటి చిన్నయసూరికిఁ బూర్వకవులందఱు, పద్యకవిత్వము, కల్పనాచాతు ర్యమున కనువుగానుండుననియో, చదువనింపుగా విననింపుగా నుండుననియో

తమ్ముఁబోషించువారి యనుమతినో గతానుగతికన్యాయంబుగఁ బద్యకావ్యసాగ
రముం దుదముట్టఁజూచిరిగాని, వారిలో నొక్కఁడైన గద్యకావ్యరచనకుఁ గడఁగఁ
డయ్యె. మఱియు, దండికవికృత దశకుమారచరితంబును, విష్ణుశర్మకృత పంచ
తంత్రంబును, దెలిఁగింపఁబూనిన కేతననారాయణకవులు గూడ వానిని బద్య
ములుగా మార్చిరి గాని సరిగా నాంధ్రీకరింపరైరి. ఇంత యేల? సర్వజనోపయో
గముగా సులభవచనముగాఁ దెల్గున వ్రాయఁదగిన, ధర్మశాస్త్రము, గణితశా
స్త్రము, కావ్యలక్షణాదులు, నిఘంటువులును, గూడ సంస్కృతానుసరణ
ముగాఁ బద్యకావ్యములుగానే రచింపఁబడుటయుఁ దిక్కన మొదలగు కొందఱు
నిర్వచనముగానే కావ్యములు వ్రాయుటయుఁ జూడ మనపూర్వకవులకుఁ బద్య
కవిత్వమన్న నెంత ప్రీతియో గద్యకవిత్వమన్న నంత యరుచి యని తెల్లమగుచున్నది.
దేశమునకు మంచినాగరకత రాకపోవుటయే ముఖ్యకారణముగా భాషకు సంభ
వించిన యీవచనలోప మొక్కటియే పూర్వకవుల లోపముగాఁ గనఁబడుచున్నది
గాని యీపద్యకవిత్వశైలిమాత్ర మెన్నటికిని, ననుకరింపఁదగినదై యెప్పటికప్పు
డభినవరసంబొలికించుచు నాంధ్రలోకంబు నలంకరించుచున్నదనుటలో సందే
హము లేదు.

ఈ పద్యకవిత్వము మొదట నాంధ్రీకరణమై, పిదప విపులీకరణమై, తరువాత
ననుకరణమై, తుదకు స్వకపోలకల్పనంబై, క్రమక్రమంబుగ నభ్యున్నతస్థితికి వచ్చి
న ట్లాయామహాకవుల కావ్యపరంపరయే చాటుచున్నది—ఇందు:—

ఆంధ్రీకరణము "మక్కికిమక్కి" యన్నట్లుండక, సంస్కృతే సమంబు
గాఁ దెలిఁగించినఁ బునరుక్త్యాది దోషంబులను, గథాంశంబున కభ్యంతరంబు
గలిగించు విస్తృతవర్ణనంబులను, జనరంజకంబుగా నుండదని, మూలకథను
మాత్ర మతిక్రమింపక స్వేచ్ఛగా భారతంబును దెలిఁగించిన కవిత్రయము మార్గ
మునే యనుసరించి తరువాతి కవులు రామాయణ మార్కండేయపురాణ విష్ణుపు
రాణ, వరాహపురాణహరివంశ భాగవతాదులయందుఁ బ్రశస్తిని గాంచినది.
ఈ యితిహాసపురాణంబులలోనేకాక యీధర్మము శృంగారనైషధాదికావ్యంబుల
యందుఁ గూడనట్లే కనుపడుచున్నది. ఈవిషయంబునఁ గవిత్రయము తరువాత
నాంధ్రీకరణమందేమి స్వకపోలకల్పనమందేమి నిరంకుశుఁడై పెక్కుగ్రంథము
లరచియించి రాయలయొద్దఁ గవిసార్వభౌమబిరుదంబు గాంచి వేంకటగిరి మహీపా
లకుఁడగు సింగభూపాలునాదరంబువడసి నిరుపమానయశస్సును గాంచినవాఁ

డును, బెద్దనాదుల ప్రబంధనిర్మాణంబునకు రాచబాటవేసిన సుకవితాశైలి గల వాఁడు నగు శ్రీనాథుఁడెంతయు లోకంబునకు వంద్యుఁడని నమ్మఁదగును. ఈతని శైలి తరువాతి కవులకే సరిగా ననుకరింప నసాధ్యమైనదిగాని లేకున్న నైషధముఁబోలిన తక్కిన సంస్కృత మహాకావ్యములఁ దెలిఁగింపఁబూనినచో నాంధ్ర భాష మహాభాగ్యమింకను వర్ణింపనగునా?

విపులీకరణము. అనఁగా సుప్రసిద్ధపురాణములలోని కథనుగ్రహించి దానిని సరసకల్పనంబున నలంకరించి వివరించివ్రాయుట. ఈకృత్యంబునకుఁ గడంగిన వారిలో నాంధ్రకవితాపితామహుఁడగు పెద్దనార్యుఁడే మొదటివాఁడని విశ్వసింపనచ్చును. ఇందుఁలకీతనికిమున్ను మనుచరిత్రఁబోలిన ప్రబంధములు నిర్మించిన వారు లేకుండుటయు, నీతని తరువాతివారీతని ధోరణినే యనుసరించి యనేక ప్రబంధములు రచించుటయు నిదర్శనముగాఁ గలవు. స్వభావవర్ణనమం దధికచాతుర్యముగల యీతని సత్కవిత్వము లోకమునకెంత మూలధనముగానున్నదో వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. ఈయంశంబున నీమార్గంబునకుఁ గ్రొత్తవన్నె దెచ్చి సరసకల్పనంబులను, రమ్యవర్ణనంబులను శృంగారవైరాగ్యంబు లొక్కవిధముగా మనస్సునకు నాటునట్లు కవికర్ణరసాయనంబు రచించిన సంకుసాలనృసింహకవి ప్రబంధకవితాపోషకుఁడని చెప్పవచ్చును.

అనుకరణము. ఇందు మనుచరిత్ర ననుకరించి వసుచరిత్ర వ్రాసిన రామరాజభూషణుఁడు ఘనుఁడు. ఇతఁడు సరసశ్లేషయమకాది శబ్దాలంకారంబులను, బహుచిత్ర్యరసౌచిత్యంబులను,నసమానంబగు కవిత్వము సెప్పి యనంతరకవులకుఁ గల్పనావర్ణనాతిశయమార్గము సూపినవాఁడు. కాని, యీమనువసుచరిత్రలనే యనుకరించి వ్రాయఁబూనిన తక్కిన కవులెల్లరు, వీనిని మించియధికముగాఁ దమకావ్యంబులఁ బురవర్ణనాదికంబులను, సర్వావయవవర్ణనంబులను జంద్రకందర్పాద్యుపాలంభనమందలి, విప్రలంభశృంగారమును నతిశయోత్ప్రేక్షాద్యలంకారప్రధానంబుగా మిన్నంట వర్ణించుచువచ్చిరి. ఇక్కారణంబుననే పూర్వకావ్యంబులలో వివిధత్వము లేకపోవుటయు, విసుగుపుట్టునట్లుగా శృంగారరసమే ప్రధానంబుగా నుండుటయు, స్వభావవర్ణనమంతరించుటయు ననులోపములు తటస్థించినవని మనము తలంచుచుంటిమి. అయినను, దారాశశాంకవిజయము మొదలుగాఁ గల నాలుగైదుప్రబంధములలో మాత్రము శృంగారరసము కొంచెమధికముగా

వర్ణింపఁబడినదిగాని, మిగిలిన గ్రంథములలో నది యంతగా మితిమీఱితిలేదనియు నాశృంగారభాగంబులలోనే యందందుపయోగింపఁబడిన—

1. "కలంచు నేసతులమాయల్ ధీరచిత్తంబులన్ మనుచరిత్రము.
2. జ్ఞాతిశ్ఛేదన లేన కిమ్మనెడి వాచారూఢిసత్యంబుగన్ వసుచరిత్రము.
3. రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే రాజౌటదోషార్థమే వసుచరిత్రము.
4. ఉద్ధతులమధ్యమునఁ బేద కుండఁదరమె. కవికర్ణ.
5. క్షితినిటుగాదె యొక్కొకనికిన్ నడుమంత్రపుఁ గల్మిగల్గినన్. విజయ.
6. ఎక్కడిసత్య మేడవల పెక్కడిశీనేమము వారకాంతకున్. వైజ.
7. మొదల రోయుంతులకు రొక్కము హపుఁగాక
నీసదాచారమేలయ్య దాసరయ్య? వైజయ.
8. పతికిఁగీడౌట బంట్లపాపంబుగాదె?— పాండురంగ.
9. నిందల్ సేయఁగానేల? నా। తనువేనిత్యము
ప్రాణమేమిధ్రువమే? తర్కింపుఁడీయాదెసన్. సాంబోపా.
10. పేరలుకంజెందిన యట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే. పారి.
11. కలుగదుగదా? వివేకంబు కాముకులకు. పురూరవశ్చరిత్ర.
12. చక్కఁదనమె గుణంబుగా సంస్మరించుఁ
గాని, వ్యభిచారదోషంబుగాంచఁడయ్యొ
సజ్జుఁడనఁ బ్రాజ్ఞుఁడన నెవ్వఁడవనినింక? పురూరవశ్చరిత్ర.
13. పృథివిఁ ధర్మికెన్నఁ బరపీడయె యుత్తమలాభమెప్పుడున్
14. "నహి మాయామా మసంభావ్య మస్తి" యంటం
చన్ బుధులాడుమాట మదిఁజింతింపంగబొం కేలగున్. ప్రభావతీ.

అను నివి మొదలుగా నసంఖ్యాకంబులగు నర్థాంతరన్యాసంబులు, లోకోక్తులు, స్వభావోక్తులును, లోకానుభవంబును, నీతినిబోధించుచు నాయాగ్రంథముల రత్నములవలెఁ బ్రకాశించుచున్నవనియు మనకుఁ దెలియకపోలేదు. పైఁజెప్పిన తారాశశాంకవిజయాదులుగూడ 17 వ శతాబ్దము పూర్వమందున్న శ్రీకృష్ణ, రామచంద్రాదికవులు, సంస్కృతమున రచించిన తారాశశాంకరసికజనరంజనాదుల పరిపూర్ణవిపులీకరణంబులే యైనను శృంగారరసవిషయంబున మన భాషసంస్కృతభాషను మించినట్లున్నదని చెప్పవచ్చును. ఎట్లైనను సమగ్రముగా నెల్లజాతులయందు, విద్యయంతగాఁ బ్రాఁకక, దేశమనాగరకతంజెందియున్న యక్కా-

లంబున, భాషాజ్ఞానంబుగల బ్రాహ్మణజాతిలోఁ జాలమంది వేదవేదాంగప్రియులై కలిమిలేములఁ బాటింపక ప్రపంచముతో నిమిత్తములేక, "పంచమేఽహని షష్ఠేవా శాకంపచతి స్వే గృహే" యనునట్లు జీవించుచు నాముష్మికపరాయణులై సంస్కృతభాషామతగ్రంథములతోనే కాలము వెళ్లఁబుచ్చినవారగుటచేతను, నైహలౌకిక పరాయణులగు కొందఱు మాత్రమే సంస్కృతసహాయంబున నాంధ్రభాషాభివృద్ధికై పాటుపడిన వారగుటచేతను, వారైనను దఱచుగా, నుదరపోషణార్థమై కేవలభోగపరాయణులగు భూస్వాములను, ధనాఢ్యులను నాశ్రయించి జీవింపఁ దగిన వారగుటచేతను నట్టివారి చిత్తములను రంజింపఁజేయుటకై కొందఱును, వారినిఁజూచి యింకఁ గొందఱు నివ్విధముగాఁ బ్రకృతిజ్ఞానంబునకై పాటుపడక, యందఱు నొక్కవిధముగా శృంగారరసప్రబంధములనే క్రమముగా రచించుచు వచ్చిరి గాని, యప్పటి దేశకాలపాత్రముల నిజస్థితులను, బదార్థతత్త్వంబును, లోకజ్ఞానమును బోధించు వివిధవిషయక గ్రంథములను, రచింపఁ బ్రయత్నింపరైరియనియు దీనికంతకును గారణము దేశముయొక్క యనాగరకతయేయనియు నూహింపవచ్చును. దేశమట్టిస్థితిలో నుండుటచేతనే మనభాషయెన్ని శతాబ్దంబులకైన గద్యస్థితిలోనికి రాకపోవుటయు, నట్లది రాకపోవుటచేతనే, దేశోపయోగంబులై స్వభావసిద్ధంబులగు వివిధవిషయములను దెలుపు చక్కని గ్రంథములు జనింపకుండుటయు ననునన్యోన్యాశ్రయదోషంబున దేశంబును భాషయుఁగూడ నొక్కవిధముగానే చిరకాలము మునుఁగుచుఁ దేలుచువచ్చినవి. ఏమైనఁగానిండు. ఆకావ్యంబులన్నియు నాధునికుల సాహిత్యసంపదలకు రత్నపేటికలై తాదృశగ్రంథంబులింక భాషలోఁ బుట్టఁబోవనునంతటి చక్కని శైలిలో మాత్రమున్నవని సంతసింపవచ్చును.

స్వకపోలకల్పనము. "జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెమేలా?" యనునట్టి ప్రతిభాసాధ్యంబై సుకవితానికషోపలంబగు నిమ్మహాకార్యంబునకు ముదుగా నడుము గట్టుకొనినవాఁడు, ఉభయకవితాసార్వభౌముఁడగు పింగళిసూరనార్యుఁడని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. అత్యద్భుతకథాసన్నివేశంబగు నీతని కళాపూర్ణోదయము ముమ్మాఱుచదివినంగాని బుద్ధిగోచరంబు గాదనుటకంటె నీతనికల్పనాచాతుర్యమును గూర్చి వచింపనక్కఱలేదు. ఈకావ్యంబునకు సాటియైన దీతనిప్రభావతీప్రద్యుమ్నమేగాని యింకొకండు లేదనుటకంటె నితఁడాంధ్రవాఙ్మయంబునకుఁ గావించిన మహోపకారమును నుతింపనక్కఱలేదు.

ఈతని యీరెండుకావ్యములతో నన్నయభట్టారకుఁడు, గట్టనారంభించిన యాంధ్రభాషామహాసౌధము, తుదముట్టినదని చెప్పుటయు నతిశయోక్తిగాదు. ఎవ్వని సులభకవితాశైలి యనుకరింప నసాధ్యాంబైనదయ్యు నర్వాచీనులకుఁ బద్యకవిత్వంబున నాదరంబుగలిగించెనో యాసూరనార్యుఁడు కల్పనావర్ణనారసంబులఁ ద్రొక్కిపుచ్చెనని యందురు ఇతఁడు తనకావ్యంబుల నుపయోగించిన మనోహరంబులగు లోకోక్తులు న్యాయంబులు నొక్కశతంబుకంటె నధికముగాఁగలవని చెప్ప నచ్చును. వానినుండి రుచిచూపుటకు నాలుగైదుదాహరించెదను.—

" వసుధమానిసిఁబోలు మానిసులు లేరె?

" నాఁడుసంపదకు దిక్కగుచున్ మగమొల్కనీకిఁకన్। బుట్టునెయంటిమే నితని పోఁడిమి గంటిమివట్టిగొడ్డు తాకట్టితఁడౌతయున్న.

" నీపల్కుల్ మనోవర్తనం। బును నేకంబగు నేని నాలుకతుదన్ ముక్కంటికొమ్మావిలాసిని? యేనమ్మెద...

" ఘుట్టకుటీప్రభాతమనఁగా నిది వ్రాపరికించిచూడఁగన్...

" గోముఖవ్యాఘ్రము మననిట్టివాఁడు సుమ్ము"

" ఎందుఁబెరఁటిచెట్టుమందుగాదు.

" ఓడలబండ్లువచ్చు బండ్లోడలనచ్చు

" వసుధనెందైనఁ జండాలనాటిలోన, బ్రాహ్మణగృహంబు వెదకుట భ్రాంతిగాదె?

మఱియు నీతని కవిత్వము శిరీషకుసుమపేశలంబుగా నుండుటయేగాక వర్ణనాంశంబుల వృథాకాలముపుచ్చక, కథాభాగంబును విస్తరింపఁజేయునదియై, సద్భావగర్భితంబై మనోహరంబుగా నుండును. ఇట్లితనితోఁ బద్యకవిత్వమత్యున్నతస్థితికిరాఁగా నీతనితరువాతికవులీతని వఱకునుగల పూర్వుల గ్రంథములనే యథాసంభవముగా ననుకరించుచు 19వ శతకము మధ్యభాగమువఱకు నుత్తమకావ్యములనే రచించుచువచ్చిరి; గాని మున్ను చెప్పినట్లుగా వైవిధ్యమును మాత్రము చూపరైరి. ఎట్లైన నివ్విధంబుగాఁ జతుర్విధంబుగా విజృంభించిన పద్యకవిత్వము సకలరసంబులకును, నలంకారంబులకును, సంపూర్ణశబ్దజాలంబునకును, ఛందోవ్యాకరణజ్ఞానంబునకును, నీతికిని నాకరంబై త్రివర్గఫలంబొసంగి యాంధ్రలోకంబు నుద్ధరింపఁజేయుచున్నదనుటలో సందేహము లేదు.

## పూర్వకవిత్వవ్యాప్తి.

కవులచరిత్రను బట్టి చూడఁగా, 11. వ శతాబ్దము మొదలుగా 15 వ శతాబ్దము తుదవఱకునుగల 5 శతాబ్దములలోను భారతము మొదలుగాఁ బురాణములును, గణితగ్రంథములును, ఛందోవ్యాకరణగ్రంథములును, నలంకారకావ్యంబులును, సాహిత్యప్రబంధములను గలిసి 22 ఱు, కవులురచించినవి 35 కంటెనధికముగాఁ గనుపడకుండుటచే నపుడాంధ్రభాష మిక్కిలి బాల్యదశలోనున్నదని తెలియుచున్నది. దీనింబట్టిచూడఁగా నూఱేసి యేండ్ల కేడేసి గ్రంథముల చొప్పునఁ గిట్టిన యాకాలంబున మనదేశమందు విద్యాభివృద్ధియు, నాగరకతయు నెట్లుండునో వేఱుగా నాలోచింప నక్కఱలేదు. పిదప 16 మొదలుగా 17 తుదవఱకునుగలరెండు శతాబ్దములయందును నాంధ్రభాషాపోషకుఁడును, ప్రజాపాలకుఁడునగు శ్రీకృష్ణదేవరాయల కాలము మొదలుగాఁ గొంచె మెచ్చుతక్కువగా 80 మందికవులు రచించిన ప్రబంధములు నూటికంటె నధికముగానున్నవి. ఇదియే భాషకు వర్ధమానదశ. ఈదశలో వెడలిన కృతులే భాషకుఁ బుష్టినిగలిగించి యిప్పటికిని లోకంబున, నుత్తమ యశస్సుగాంచుచున్నవి. తరువాత 18 వ శతాబ్దము మొదలుగా 19 వ శతాబ్దములోఁ జాలవఱకు నీ నడుమనున్న కాలంబున నీషద్వైషమ్యముగా 140 మంది కవులు 200 కంటె నధికముగాఁ బ్రబంధములు రచించిరి. ఇదిభాషయొక్క యౌవనదశయని చెప్పవచ్చును. కాని తరువాతఁ గూడఁ బెక్కు కావ్యములు బయలుదేరినను గాళిదాసు మొదలుగా భవభూతి వఱకునుగల మహాకవుల కావ్యనాటకాదులే యిప్పటికిని గూడ సంస్కృతభాషలోఁ బఠన పాఠన వ్యవహారంబున నెట్లు ప్రసిద్ధిఁ గాంచుచున్నవో యట్లే యాంధ్రభాషలోఁగూడ, మున్ను చెప్పినట్టి భాషయొక్క బాల్యవర్ధమాన దశలలోఁ బుట్టినకావ్యములే యిప్పటికిని లోకప్రసిద్ధిని గాంచుచున్నవిగాని యీ మూఁడవ దశలోని కావ్యములకు మాత్రమట్టి విశేషవ్యాప్తిరాలేదు. ఆంధ్రలోకము చేసి కొన్న యభాగ్యమో యన వీనిలోఁగొన్ని పేరు గూడ లేకుండఁ గఁబోవుటయుఁ గొన్నినామ మాత్రావశిష్టంబులగుటయు, మఱికొన్ని యిప్పటికిని గూడ నముద్రితంబులేమై యున్నట్లే తెలియఁబడుటయు నను లోపములు చాలవఱకు సంప్రాప్తంబులై యున్నను, ప్రకటితంబులై యున్న మిఁగిలినవానిలో నైనఁ బెక్కుకావ్యములు శైలియందుఁగాని, సారస్యమందుఁగాని, వెనుకటి వానినిఁబోల కుండుటచేతనే యివి తమకాలంబునఁగాని, పిదపఁగాని, ప్రసిద్ధికిరాలే

దనియు నందుచే నీదశలో వెడలినవి భాష కంతపుష్టిని గలిగించునవిగావనియుఁ దలంపవచ్చును. ఎట్లయినను, ఇప్పుడు చెప్పిన యీమూఁడు దశలను బట్టిచూడఁగా నడుమనడుమ, దేశారిష్టంబులెన్ని సంభవించినను, మనభాష యొకదశ కంటె నింకొకఁ దశలోఁ గ్రమక్రమముగా వృద్ధిఁబొందుచునే వచ్చినట్లు కనుపడు చున్నది. ఇవ్విధముగాఁ బూర్వకవులు దేశభాషను గ్రమముగాఁ బోషించుచు వచ్చిన తరువాతఁ బ్రకృతంబున మనభాష యెట్టిస్థితికి మాఱినదో యాలో చింతము.

## వచనకవిత్వము.

భాషయొక్క మూఁడవదశలో, వేదాంతసారసంగ్రహము, హాలాస్య మాహాత్మ్యము నని రెండు వచనకావ్యములు పుట్టినట్లు తెలియుచున్నదిగాని యీ రెంటికిని గూడ లోకమున వ్యాప్తి లేదు. వీనిలో రెండవది భాషాభివృద్ధికిఁ దగిన సత్కావ్యముగానున్నదని దాని గుణములం బ్రకటించిన శ్రీ వీరేశలింగముపంతు లవా రాకావ్యముం బ్రకటింపఁ బ్రార్థితులు. ఇవిగాక భారత భాగవతాది పురాణములయందును మనుచరిత్రాది ప్రబంధములయందును, అక్కడక్కడఁ గథా సందర్భానుసారముగా వచనము కనఁబడుచున్న, నది వచనకవిత్వ మనిపించు కొనదనియుఁ బూర్వులు కేవలవచనకావ్యములు వ్రాయలేదనియు, మనమింతవఱకుఁ దెలిసియుంటిమి. పిదప నీగద్యరచనమున మొదటిదియు నుత్తమంబునైన నీతిచంద్రికపూర్వభాగంబును రచించిన చిన్నయసూరియే యగ్రగణ్యుఁడని మన మెఱుంగుదుము. ఇతఁడు తాను రచించిన బాలవ్యాకరణమునకు లక్ష్యగ్రంథముగాఁ బాఠశాలలలోని విద్యార్థులకు భాషాజ్ఞానము క్రమముగా వృద్ధియగునట్లుగాఁ దనవచనశైలినిఁగూడఁ బెంచి నీతిచంద్రికలోఁ జాతుర్యముఁ జూపిన పండితుఁడు. తరువాత నీతని శైలినే యనుసరించి మిగిలిన సంధివిగ్రహతంత్రముల రచించియుఁ గొన్ని నాటకంబు లాంధ్రీకరించియు, నాంగ్లేయ గ్రంథముల సులభశైలిని దెలిఁగించియు స్వయముగాఁ గొన్నికల్పించియుఁ బండితపామర సాధారణంబుగా నిర్దుష్టంబగు శైలితో విద్యార్థులకు, స్త్రీలకుఁగూడ నుపయోగించునట్లు పెక్కుకావ్యములు రచించి యాంధ్రభాషకుఁగల వచనలోపమును దీర్పసమకట్టిన శ్రీ వీరేశలింగము పంతుల వారెంతయు నాంధ్రలోకంబునకు శ్లాఘ్యులు. మఱియు వీరు రచించిన శాస్త్రి చరిత్ర గ్రంథములకు సహాయముగా విజ్ఞా

నచంద్రికా గ్రంథమాలనుండి ప్రకృతి, జంతు, రసాయనారోగ్యాది శాస్త్ర గ్రంథములు వెడలినవై లోకోపకారము గావించుచున్నవి.

## నాటక కవిత్వము.

శ్రావ్యములు, పాఠ్యములు, దృశ్యములు, ననికావ్యములు త్రివిధముగా సంస్కృతభాషలోఁ బ్రసిద్ధములై యుండఁగా వాని నాంధ్రీకరింప ననుకరింపఁ బూనిన మన పూర్వు లెవ్వరును గాళిదాసాదుల ప్రసిద్ధరూపకంబులఁ దెలిఁగించి కాని, వాని ననుసరించి కల్పించి కాని తెలుఁగులో నాటకములు వ్రాసియుండ లేదు. శ్రీనాథుని వీథినాటక మొకటి పేరునకుఁ గలదుగాని యది వీథిలోఁ జదువఁదగిన స్థితిలో లేదని యెల్లరకుఁ దెలియును. మఱియుఁ గొందఱు శాకుంతలము, మాలతీమాధవము, చిత్రభారతము మొదలుగాఁ గల సంస్కృతనాటకంబుల కథల ననుసరించి పద్యకావ్యములు, రచించిరిగాని వానిని నాటకములుగా మార్చ్వరైరి. పోనిండు. ఆకాలమున సంస్కృతముతోఁ గూడ నాటకరచనము లేదేమోయని యాలోచింత మన్నఁ బ్రబోధ చంద్రోదయము, సంకల్పసూర్యోదయము, ప్రసన్నరాఘవము, చైతన్య చంద్రోదయము మొదలుగాఁ గల రూపకములు 12 వ శతాబ్దము మొదలుగాఁ దరువాతనే జనించినట్లు కనుపడుచున్నది. "వీరన్యదేశీయులు. ఆంధ్రకవులకు సమకాలికులగు నాంధ్రదేశీయసంస్కృతకవు లెవ్వరును, నాటకములు రచింపలేదేమో" యని యూహింతమన్నను, ఆంధ్రరాజులసభలకేగుచు నాంధ్రకవుల సహవాసము చేసిన కాంచీనివాసుఁడగు వేఁకటాధ్వరి, ప్రద్యుమ్నానంద నాటకమును, ఆంధ్రదేశస్థుఁడగు నారణాసి ధర్మసూరి, నరకాసురవ్యాయోగమును, ఇంకను గొందఱు గొన్ని నాటకంబులను, రచించినట్లు కనుపడుటచే మనకవుల కాలంబునఁ గూడ సంస్కృతనాటకంబులు మన దేశమున, వెడలినట్లే కనుపడుచున్నది. ఇంకనో, మహామహోపాధ్యాయభట్టారబిరుదాంకితుఁడగు నెలకూచి బాలసరస్వతికవి, రాఘవయాదవ పాండవీయమునందుఁ జెప్పికొనిన "కవిసమీహితరంగకౌముదీనామ నాటకవిధాన ప్రతిష్ఠాఘనుండ" అనుదానింబట్టి యాతఁడు రంగకౌముదీనాటకము రచించినట్లు తెలియుచున్నదిగాని, దాని శైలియెట్లున్నదో తెలియుటకొక్క పద్యమైన లోకంబున వ్యాపింపక పోవుటగూడ నాంధ్రభాషయొక్క దుర్దశయే యని తలంపవచ్చును. ఏదియేమైనను బూర్వకాలమునఁ దెలుఁగులో నాటకములు లేక పోవుటయు ఛందోవ్యాకరణ కావ్యాలంకారంబులకుఁ దెలుఁగులో లక్షణంబులు

రచించినవారినాటకంబులకు, లక్షణము వ్రాయకుండుటయుఁ జూడ మొన్న మొన్నటి వఱకుఁగూడ మనదేశమున నాటకప్రదర్శనవ్యవహారముగాని, రాజులకుఁ గవులకుఁ బ్రజలకు నాటకములయందు, రుచిగాని, లేదనియు నెక్కడనైన నున్న నేవిజయనగర మహారాజులవంటివారో సంస్కృతనాటక సమాజము నే క్వాచిత్కముగాఁ గూర్చుచు వచ్చిరనియుఁ దెలియుచున్నది. తరువాతననఁగా ముప్పదినలువది సంవత్సరములనుండి హిందీపార్సీ నాటక సంఘములు, దేశమంతట సంచార మొనరించిన పిదప మనవారు సంస్కృతమునుండి తెలిఁగించియు, పూర్ణనాటకంబుల ననుకరించియు మనభాషలో నాటకలోపంబును దీర్పఁజొచ్చిరి. అట్టియీనాటక కవిత్వమిప్పుడొక్క మాఱుగాఁ దెలుఁగు బాసలో నొక సముద్రమువలెఁ బ్రవహించుచున్నదని చెప్పవచ్చును.

## పత్రికలు-కల్పితకథలు-(Novels.)

ఇవ్విధంబుగా శ్రావ్య, పాఠ్య, దృశ్యప్రబంధములతో వృద్ధి నొందుచున్న మన భాష యాంగ్లేయ భాషాసంబంధ విశేషంబునఁ బత్రికలు, కల్పితకథలు నను నూతనాలంకారములు ధరించి వన్నె కెక్కనారంభించినది, ఈపత్రికలు గ్రామపుర దేశవిషయకంబులగు వార్తలను, సంఘముయొక్క దురాచార సదాచారములను రాజకీయవ్యవహారంబులను దెల్పుటయేకాక లోకజ్ఞానదాయకంబులగు వివిధాంశంబులను భాషావిషయకప్రసంగంబులను సులభముగాఁ దెల్పుట కనువగు చక్కని వ్యాసములతోనుండి జ్ఞానాభివృద్ధి నొసంగుచు నాంధ్రలోక మలంకరించుచున్నవి. మఱియు వీనిమూలముగా సర్వజనసామాన్యముగా భాషయందభిరుచి గలుగుటయు నేదోయొక విషయముంగూర్చి పదిబంతులు వ్రాయఁదగు సామర్థ్యముగలుగుటయు నను నుపకారంబులు గూడ లోకమునకు లభించుచున్నవి. పెక్కేల? ఇవిలేనికాలమందలి మనదేశస్థితిని విచారించినచో నిపుడు వీనివలనఁ గలుగులాభములన్నియుఁ దేటపడఁ గలవు. కాని, ఇవి ప్రయత్నంబున నాంగ్లేయపత్రికల ననుసరించినవేయైనను బ్రకటనంబున మాత్రము వీసమంతైన వానింబోలక పట్టుమని పదిసంవత్సరములైన నడువక, ధైర్యస్థైర్యములులేక యెన్నోవారపక్షమాసపత్రిక లడుగంటినవని మన మెఱుంగుదుము. దీనికి "ఒకరేపనిచేసిన నింకొకరుగూడ వేలము వెఱ్ఱిగాన కార్యము చేయుటయే మన వారికి స్వాభావికమగుటయెఁ బత్రికనారంభించు నపుడున్న యావేశము వెంటనే క్రుంగుటయు" నను దోషంబులు గారణంబులుగా

నచంద్రికా గ్రంథమాలనుండి ప్రకృతి, జంతు, రసాయనారోగ్యాది శాస్త్ర గ్రంథములు వెడలినవై లోకోపకారము గావించుచున్నవి.

## నాటక కవిత్వము.

శ్రావ్యములు, పాఠ్యములు, దృశ్యములు, ననికావ్యములు త్రివిధముగా సంస్కృతభాషలోఁ బ్రసిద్ధములై యుండఁగా వాని నాంధ్రీకరింప ననుకరింపఁ బూనిన మన పూర్వు లెవ్వరును గాళిదాసాదుల ప్రసిద్ధరూపకంబులఁ దెలిఁగించి కాని, వాని ననుసరించి కల్పించి కాని తెలుఁగులో నాటకములు వ్రాసియుండ లేదు. శ్రీనాథుని వీథినాటక మొకటి పేరునకుఁ గలదుగాని యది వీథిలోఁ జదు వఁదగిన స్థితిలో లేదని యెల్లరకుఁ దెలియును. మఱియుఁ గొందఱు శాకుంత లము, మాలతీమాధవము, చిత్రభారతము మొదలుగాఁ గల సంస్కృతనాటకం బుల కథల ననుసరించి పద్యకావ్యములు, రచించిరిగాని వానిని నాటకములుగా మార్వరైరి. పోనిండు. ఆకాలమున సంస్కృతముతోఁ గూడ నాటకరచనము లేదేమోయని యాలోచింత మన్నఁ బ్రబోధ చంద్రోదయము, సంకల్పసూర్యో దయము, ప్రసన్నరాఘవము, చైతన్య చంద్రోదయము మొదలుగాఁ గల రూప కములు 12 వ శతాబ్దము మొదలుగాఁ దరువాతనే జనించినట్లు కనఁబడుచున్నది. "వీరన్యదేశీయులు. ఆంధ్రకవులకు సమకాలికులగు నాంధ్ర దేశీయసంస్కృతకవు లెవ్వరును, నాటకములు రచింపలేదేమో" యని యూహింతమన్నను, ఆంధ్ర రాజులసభల కేగుచు నాంధ్రకవుల సహవాసము చేసిన కాంచీనివాసుఁడగు వేంక టాధ్వరి, ప్రద్యుమ్నానంద నాటకమును, ఆంధ్రదేశస్థుఁడగు నారణాసి ధర్మ సూరి, నరకాసురవ్యాయోగమును, ఇంకను గొందఱు గొన్ని నాటకంబులను, రచించినట్లు కనుపడుటచే మనకవుల కాలంబునఁ గూడ సంస్కృతనాటకంబులు మన దేశమున, వెడలినట్లే కనుపడుచున్నది. ఇంకనో, మహామహోపాధ్యా యభట్టారబిరుదాంకితుఁడగు నెలకూచి బాలసరస్వతికవి, రాఘవయాదవ పాండవీ యమునందుఁ జెప్పికొన్న "కవిసమిాహితరంగకౌముదీనామ నాటకవిధాన ప్రతి ష్ఠాఘనుండ" అనుదానింబట్టి యీతఁడు రంగకౌముదీనాటకము రచించినట్లు తెలియుచున్నదిగాని, దాని శైలియెట్లున్నదో తెలియుటకొక్క పద్యమైన లోకం బున వ్యాపింపక పోవుటగూడ నాంధ్రభాషయొక్క దుర్దశయే యని తలంప వచ్చును. ఏదియేమైనను బూర్వకాలమునఁ దెలుఁగులో నాటకములు లేక పోవు టయు ఛందోవ్యాకరణ కావ్యాలంకారంబులకుఁ దెలుఁగులో లక్షణంబులు

రచించినవా రీనాటకంబులకు, లక్షణము వ్రాయకుండుటయుం జూడ మొన్న మొన్నటి వఱకుంగూడ మనదేశమున నాటకప్రదర్శనవ్యవహారముగాని, రాజులకుం గవులకుం బ్రజలకు నాటకములయందు, రుచిగాని, లేదనియు నెక్కడనైన నున్న నేవిజయనగర మహారాజులవంటివారో సంస్కృతనాటక సమాజమునే క్వాచిత్కముగాఁ గూర్చుచు వచ్చిరనియుఁ దెలియుచున్నది. తరువాతనంగా ముప్పదినలువది సంవత్సరములనుండి హిందీపార్శి నాటక సంఘములు, దేశమంతట సంచార మొనరించిన పిదప మనవారు సంస్కృతమునుండి తెలిఁగించియు, హూణనాటకంబుల ననుకరించియు మనభాషలో నాటకలోపంబును దీర్పఁజొచ్చిరి. అట్టియీనాటక కవిత్వమిప్పుడొక్క మాఱుగాఁ దెలుఁగు బాసలో నాక సముద్రమువలెఁ బ్రవహించుచున్నదని చెప్పవచ్చును.

### పత్రికలు-కల్పితకథలు-(Novels.)

ఇవ్విధంబుగా శ్రావ్య, పాఠ్య, దృశ్యప్రబంధములతో వృద్ధి నొందుచున్న మన భాష యాంగ్లేయ భాషాసంబంధ విశేషంబునఁ బత్రికలు, కల్పితకథలు నను నూతనాలంకారములు ధరించి వన్నె కెక్క నారంభించినది, ఈపత్రికలుగా మపురదేశవిషయకంబులగు వార్తలను, సంఘముయొక్క దురాచార సదాచారములను రాజకీయవ్యవహారంబులను దెల్పుటయేకాక లోకజ్ఞానదాయకంబులగు వివిధాంశంబులను భాషావిషయకప్రసంగంబులను సులభముగాఁ దెల్పుట కనువగు చక్కని వ్యాసములతోనుండి జ్ఞానాభివృద్ధి నొసంగుచు నాంధ్రలోక మలంకరించు చున్నవి. మఱియు వీనిమూలముగా సర్వజనసామాన్యముగా భాషయందభిరుచి గలుగుటయు నేదోయొక విషయముంగూర్చి పదిబంతులు వ్రాయఁదగు సామర్థ్యముగలుగుటయు నను నుపకారంబులు గూడ లోకమునకు లభించుచున్నవి. పెక్కేల? ఇవిలేనికాలమందలి మనదేశస్థితిని విచారించినచో నిపుడు వీనివలనఁ గలుగులాభములన్నియుఁ దేటపడఁ గలవు. కాని, ఇవి ప్రయత్నంబున నాంగ్లేయపత్రికల ననుసరించినవేయైనను బ్రకటనంబున మాత్రము వీనమంతైనవానింబోలక పట్టుమని పదిసంవత్సరములైన నడువక, ధైర్యస్థైర్యములులేక యెన్నోవారపక్షమాసపత్రిక లడుగంటినవని మన మెఱుంగుదుము. దీనికి "ఒక శేపనిచేసిన నింకొకరుగూడ వేలము వెఱ్ఱిగాన కార్యము చేయుటయే మన వారికి స్వాభావికమగుటయెఁ బత్రికనారంభించు నప్పుడున్న యావేశము వెంటనే క్రుంగుటయు" నను దోషంబులు గారణంబులుగా

నున్నవి. వీని మూలముగా భాషాభివర్ధన సాధనంబులగు పత్రికలకుం గూడ హాని సంభవించుట యెల్లరు నెఱింగిన యదియే. కావునం గార్యనిర్వాహణ దక్షులగు వా రందందు సమర్థులగు లేఖకులం గూర్చికొని దృఢప్రయత్నంబునం బత్రికల కొనసాగింతురనియు, నట్టిపత్రికలను భాషాభిమాను లాదరింతురనియు, నిదియే భాషాభివృద్ధికిం గారణమనియుం దలంచెదను.

కల్పితకథలు:—ఆంగ్లేయ భాషయొక్క సంపర్కవిశేషంబున వచ్చిన యీకథారచనము భాషయొక్క వర్ధమానదశను దెలుపుచున్నది. ఆరంభ దశలోనున్న యివి కాలక్రమమున నాంగ్లేయ కథాపుస్తకములవలెనే యభివృద్ధిని గాంచఁగలవని యూహింపనగును. సంస్కృతభాషలో వీనిం బోలినవి కథాఖ్యాయికలను పేరంగాదంబరీ వాసవదత్తలు, కనుపడుచున్నవిగాని, యవి యమానుషంబులగు నద్భుతప్రసంగములం దెలుపుచున్నవిగాని నైజముగా లేవు. తెలుంగులో నిట్టిది పద్యకావ్యమగు కళాపూర్ణోదయము గలదుగాని యదియు నత్యద్భుతంబుగానే యున్నది, ఈకథ లిట్లు జరిగియుండునని తలంచుట కనువుగానుండి, తత్కాలమందలి దురాచార సదాచారములను గథాపాత్రముల మూలముగాం దెల్పుచు, నయోగ్యతకు నపజయంబును, యోగ్యతకు జయంబును, సూచించు నభిప్రాయముల ధ్రువపఱచుచుం జదివినకొలంది నాసక్తిని గలిగించు కథా చమత్కారముగలిగి, యొకసారి చదివి విడువఁదగినట్లుగా నుండక యెన్నిసారులైనం జదువ నింపు పుట్టించు కథగలిగి, నీతిబోధకంబుగా, నాతిమృదుకఠినముగానుండు శైలిగలిగియుండుట యీకల్పితకథా కావ్యములకు లక్షణమైయుండనోపు. మఱియు నిట్టికావ్యముల సారస్యము గ్రహించుట భాషలోం గొంచెము పరిజ్ఞానము గల వారికే గాక విద్యాభ్యాసదశలోనుండు బాలురకుంగాని పామరులకుంగాని స్త్రీలకుంగాని, శక్యముగాదని స్పష్టమగుటచే వీని రచనశైలిగూడ గథాసందర్భమును బట్టి యర్థముచేసికొనఁదగినట్లుగాం గ్రమక్రమముగా భాషాజ్ఞాన మభివృద్ధిపఱచు శబ్దజాలముతో నిండియుండవలయునుగాని కావ్యమంతయు వెదకిన నూఱుపదములకంటె నధికముగా లేవనునట్లుగా నుండఁగూడదని తలంచెదను. భాషాగరిమ లేని కావ్యమునకు, స్థైర్యమును గౌరవమును గలుగునా?—

### ఆధునికభాషాస్థితి—వ్యాకరణము.

రాజావలంబనము లేక యేభాషయు వృద్ధికి రాఁజాలదు. దేశభాషాపరిజ్ఞానముండినంగాని యన్యదేశభాషలలో సంపూర్ణజ్ఞానము కలుగఁజాలదు. ఇందు

లకుఁ (దాక్షిణముగా) మనదొరతనమువారు మధ్యమోత్తమహూణపాఠశా
లలో నాంగ్లేయభాషతోఁ దుల్యముగాఁ బ్రాధాన్యముగలిగించి యాంధ్రభాష
నింతవఱకును గూడఁ బరిపాలించుచువచ్చిరి. కావుననే భాషయొక్క సారస్య
మును లోకమెఱుంగుటయుఁ బూర్వకవుల సత్కావ్యములు గొన్ని లోకమున
వ్యాపించుటయు నాధునికులుగూడఁ గొందఱు ప్రోత్సాహము గలిగి గ్రంథ
ములు వ్రాయుటయు నను సల్లక్షణంబులు భాషకు సంభవించినవి. ఈవిషయం
బున జనసంఘమునకు విద్యయం దభిరుచిగలిగించిన యాంగ్లేయ ప్రభుత్వమునకు
ముందుగాఁ గృతజ్ఞతాపూర్వకవందనంబు లర్పించి యిప్పటి యాంధ్రభాషాస్థి
తిని గూర్చి కొంచెము ప్రసంగింతము.

మున్ను చెప్పినట్లుగా శ్రీరాజరాజనరేంద్రుని కాలమునుండి శ్రీకృష్ణరా
యలకాలము వఱకు నప్పటినుండి కొంతకాలముక్రిందటివఱకునుగూడ మహా
రాజరాజసామంతుల యాదరంబు వలననే క్రమక్రమముగా నభివృద్ధి నొందుచు
నిప్పటికి మన భాష కవిసంఖ్యను గ్రంథసంఖ్యనుగూడ విశేషముగాఁ గాంచి
"దేశభాషలందుఁ దెలుఁగులెస్స" యను కృష్ణదేవరాయల వచనంబును మిక్కిలి
సార్థకము చేయుచున్నదని మనము దెలిసికొంటిమి. ఇందులకుఁ దగినట్లుగా
హిందూదేశమునందలి ముఖ్యభాషలలో నొకటి యగునిది జనసంఖ్యను బట్టి దేశ
భాషలలో మూఁడవదియై రెండుకోట్లకంటె నధికమగు జనసంఘముచే వ్యవహ
రింపఁబడుచుఁ బ్రశస్తిని గాంచుచున్నదనియు, మనమెఱుంగుదుము. ఇఁకనో ము
న్మున్ను లేని కావ్యరత్నంబుల నిపుడిపుడు సేకరించుకొనుచు, నెల్లలోపంబులఁ
దీర్చికొని మనభాషయింకను, దేశభాషలనెల్ల మించఁదగియున్నదనియుఁ "దండ్రి
చే నుపేక్షింపఁబడిన తల్లినిఁ బోషించుట పుత్త్రులకర్తవ్యకృత్యమైనట్లు"గా నిట్టి దశ
లో దొరతనమువారిచేఁ గొంచె ముపేక్షింపఁబడిన మనతల్లి భాషనుబోషింపఁ
దత్పుత్త్రులమగుమనకు విధేయకృత్యమనియు మన మెఱుంగవలయును.

సంస్కృతము మొదలుగాఁ గల యాద్యభాషలవలెఁ గాక యెల్లదేశభా
షలును వ్యావహారికమనియు, గ్రాంథికమనియు రెండుతెఱంగుల నొప్పుచున్నవి.
ఈవ్యావహారికము గ్రామ్యమనియు, నీగ్రాంథికము దేశ్యమనియు మనభాషలోఁ
బూర్వులచే వ్యవహరింపఁబడుచు నేఁటివఱకు నట్లేవచ్చుచున్నవి. ఈదేశ్యమతి
ప్రాచీనకాలంబున గ్రామ్యముతో నేకీభవించి యేపేరఁబిలువఁ బడినదో యివ
దూహింప శక్యముకాదు గాని యిది తద్భవాదిసాహాయ్యమును జెంది సలక్షణం

బై గ్రాంథికస్థితికివచ్చు స్వదేశమందలి యెల్ల జనులకుఁ దెలియఁ దగిన స్థితిఁ జెందినప్పటినుండి దేశ్యమని పిలువఁబడుచు వచ్చినట్లూహింపవచ్చును, మఱియు దేశమందలి యా యాభాగంబుల నాయావిధముగా వ్యవహరింపఁబడుటచే గ్రాంథికస్థితికి రాఁజాలక నింద్యంబై యున్న యీ వ్యావహారిక మీ దేశ్యమునుండి వేఱుపడి గ్రామ్యంబనుపేరఁ బరఁగుచు వచ్చినట్లూహింపవచ్చును. దీనింబట్టి భాషకు గ్రామ్యదేశ్యభేదము మొదటఁ గావ్యస్థితికి వచ్చునపుడే కలిగినదని యూహింపవలయును. అట్టియీగ్రామ్యము, శబ్దదూష్యము, నర్థదూష్యమునని రెండు విధంబుల శాస్త్రవిరుద్ధమైనట్లుగా లక్షణకర్తలచే నిర్ణయింపఁబడి కావ్యకర్తలచేఁ బరిత్యజింపఁబడి యిప్పటివఱకును సంభాషణ వ్యవహారంబుననే యుపయోగింపఁబడుచున్నది. ఈవ్యవహారమైన నాంధ్రదేశ మంతట నొక్కవిధముగానే యున్నదేమో చూతమన్న నొకమండలమునందున్న ట్లింకొక మండలమునందును, నొక జాతియందున్న ట్లింకొక జాతియందు నుండక వేఱువేఱుగ నున్నది. ఇంతేకాక యాయామండలంబులకు సమీపమందున్న యితరదేశముల యందలి పదములతోఁ గలయుచున్న యీవ్యావహారికభాష యొకమండములోని వానిమాటలింకొక మండములోని వానికిఁ గ్రొత్తయగునట్లుగానుండి వింతవింత యర్థములను గలిగించుచు హాస్యకరముగా నున్నది. ఇందులకే క్రిందఁజూపిన కొన్ని కొన్ని మాట లుదాహరణములు కాఁజాలును. "ఉన్నాది. ఉంది, ఉండాది; ఆడు పోయేడు; నేరుగపో, కాలింది చూశేవా; గుంటున్నాది, జాస్తిగాఉంది, నా బొక్కువాడు దొబ్బేడు" మొదలగునవి. నీచజాతులయందలి గ్రామ్యమింతేకంటె వ్రాయుటకేకాక వినుటకుఁగూడ నసహ్యకరముగా నుండునని మనమెఱిఁగినదియే. ఇంతయేల? సమానార్థమిచ్చు, దేశ్యపదములే యొకచోటివారి వింకొకచోటివారికిఁ గ్రొత్తవగుచున్నవి చూడుఁడు? "(చాల), లావు, సేస, మస్తు" "కాని, డబ్బు, దుడ్డు, బొట్టు" మొదలగునవి. వీనికే పూర్వకావ్యంబులఁ బ్రయోగము మృగ్యముగా నున్నదన, నింకగ్రామ్యము గతిచెప్పనేల? అపార్థబును, నీచార్థంబును, వివిధార్థంబులను, దెల్పునానావిధంబైన, యీ వ్యావహారికభాష నింద్యమగుటచేతనే గ్రామ్యంబైనను దీనిని బూర్వులు, నింద్యగ్రామ్యమనింద్యగ్రామ్యము నని రెండువిధములుగ విభవించి "కపిలకన్నులు, ప్రాణగొడ్డ" మిత్యాద్యనింద్యగ్రామ్యంబులను, దేశ్యము నాంధ్రవర్ణయుక్త మనాంధ్రవర్ణయుక్తమని రెండువిధముల విభజించి "తావు, తవర" యితాద్యన్య దేశ్యంబు

లను లెక్కకుఁ గొన్నింటిని మాత్రము "ఇహతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ పదం" అనఁగా నార్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబను సమాధానముతోఁ గలిపి మిగిలిననింద్య గ్రామ్యాన్య దేశ్యంబులు ప్రయోగానర్హములని నిషేధించిరి. మఱియు,—"సిద్ధిర్లోకాద్దృశ్యాల్లోకోఽనన్యాదృశశ్చ నిత్యశ్చ। సంస్కారాద్ధో నియమోఽనియమాద్గ్రామ్యం హియత్త్వపభ్రంశః। శాస్త్రిమపాఠుషమాద్యం ప్రాయికనిత్య ప్రయోగలక్ష్మైతత్ । దృశ్యమతిస్థవిరంయద్ జ్ఞాత్వా శబ్దః ప్రయుక్త ఆర్షసమః । ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషాతయోర్భవేద్వికృతిః । కేవలతన్మానుసర్పత్యభేచయేఽయం యథాతథా భాషా।" అని యివ్విధముగా లోకమునుబట్టి శబ్దసిద్ధిని, నిర్ణయించి, నియమము లేక యపభ్రంశముగానున్న శబ్దసంఘాతంబును గ్రామ్య మప్రయుజ్యమని పరిగణించి, దేశ్యతద్భవాత్మకముగ నాంధ్రభాషా స్వరూపంబును స్థిరపఱచి దీనినొక స్వతంత్రభాషగా నిరూపించిరి. అట్టి యీ భాషయందు వారివలెనే గ్రామ్యాన్యదేశ్యంబుల నేల ప్రయోగింపరాదని సాహసించితిమేని భాషపుట్టిన నాటినుండి నేటివఱకుఁ గలసిన యీ పదములు పదిపదియేనుకంటె నధికముగా లేకున్న నిపుడొక సంవత్సరములోఁ గొన్ని వేల పదములు గలియుటయేకాక యింతవఱకున్న యాంధ్రభాష కొన్ని సంవత్సరములలో నర్థముగాని స్థితిలోనికి రాకపోదు. ఇదియుఁగాక వాడుకలో గ్రంథభాషవలెనే పుస్తకములలో గ్రామ్యభాష యుపయోగించుట యర్థసారస్యము గలిగింపక పరిహాసపాత్రమగు ననుటకు సందియము లేదు. అట్టిచో గ్రామ్యభాషతోనే గ్రంథములు వ్రాయుటయు వానిని సరసలోకం బాదరించుటయు నుత్తమగ్రంథభాష కనర్థదాయకములగు ననుటలో నాశ్చర్యమేమున్నది? ఇట్టి దురవస్థ యీకాలంబున మనభాషకు మెల్లగా సంప్రాప్తమగుచున్నట్లు కనుపడుచున్నది. దీనివలన నింతత్వరలో సంభవించు మహాప్రమాదమేమియు లేకున్న నీయవస్థయే కొంతకాలము సాగెనేని, కాలముగడచిన కొలఁదిని భాష మర్యాదలెల్ల నశించిరాఁబోవుతరము వారికి భారతాది సద్గ్రంథముల పేర్లైనఁ దెలియక పోవునేమోయని మాత్రము సంశయము పొడముచున్నది.

సంస్కృతనాటకంబులఁ బ్రాకృతంబువలెనే యాంధ్రనాటకంబులలోను బ్రహసనములలోను నీచపాత్రములకు గ్రామ్యభాష నుపయోగించుటయందును, దాని ననుసరించి గ్రంథ మానూలాగ్రముగా నీచభాషలోనే వ్రాయుటయందును, గలయనౌచిత్యమును, భాషాసారస్య మెఱింగిన విద్వల్లోకమే చర్చించుకొనఁ

గలదు. కావున సత్కావ్యరచనయందు సామర్థ్యముగల కవు లట్టిగ్రంథములు రచించి మాతృభాషకు హానికలిగింప కుందురుగాక.

మఱియు వివిధంబుగా మనభాషలో వెడలుచున్న కొన్ని యాధునిక కృతులలో సంధులయందును, సంస్కృతాచ్ఛిక మిశ్రసమాసంబుల యందును, రేఫ శకటరేఫ నియమంబునను అన్వయంబునందును, గొన్నికొన్నిచోట్ల వ్యాకరణ దోషంబులు గనుపడుచున్నవి. అవి వ్యాకరణజ్ఞానము లేక పోవుటచేతను గాని, సంస్కృతభాషాజ్ఞానము చాలక పోవుటచేతను గాని గలుగుచున్నవని చెప్పఁజాలను. ఎట్లైన నిట్టి దుష్ప్రయోగంబులు భాషకుఁ బుష్టిని, భాషాభిజ్ఞులకుఁ దుష్టిని గలుగఁజేయ వనుట నిక్కము. కావున సత్కావ్యరచనయందు సామర్థ్యముగల కవు లట్టి దోషంబులకుఁ దమకావ్యంబులఁ జోటీయక తమకృతులు శాశ్వతంబులు పరిశుద్ధంబులు నగునట్లుగాఁ జేయఁబూని మాతృభాషను బోషింపఁ బ్రయత్నింతురుగాక. గ్రాంథిక భాషకు వ్యాకరణమే ప్రాణ మనియు, నది లేనిచో నిర్జీవమై పడిపోవుననియుఁ జెప్పుటకంటె భాషకును వ్యాకరణమునకును గల సంబంధమును గూర్చి విశేషముగాఁ బ్రసంగింపఁ బని లేదని తలంచి యీప్రసంగంబు నింక ముగించెదను.

## ఆంధ్రవాఙ్మయాభివృద్ధికిఁ జేయవలసిన కృత్యములు.

పైని చెప్పినట్లుగా నాధునికులు దృఢయత్నముతోఁ బెక్కుకావ్యములు రచించుచుండిరి. ఆంధ్రదేశమందలి మహారాజులు, రాజులు, జమీందారులును భాషాభిమానమును బూని యథావకాశంబుగఁ గవులకుఁ బ్రోత్సాహ మొసంగుచుండిరి. హూణభాషాప్రవీణులై యుత్తమపదవులయం దున్న యాంధ్రదేశీయులు పరమోత్సాహముతో భాషాభివృద్ధికిఁ బాటుపడుచుండిరి. దేశంబున స్త్రీలకును, పామరజనంబునకును గూడ విద్యయం దభిరుచి హెచ్చుచుండెను. ఇంతకంటె భాష కౌన్నత్యము రాఁదగిన సమయము రాఁబోదు. కావున నీ సమయముననే యాంధ్రవాఙ్మయంబునకుఁ గల లోపంబులను దీర్ప విద్యాభిమానులు ప్రయత్నింపవలయును.

ఏగీర్వాణభాష యాధారముగా నాంధ్రభాష యింతవఱకును విస్తరిల్లెనో దానినుండి యింకను, మార్వఁదగిన మహాకవుల యుత్తమకావ్యంబు లనేకములు గలవు అట్టివానిని జక్కని శైలిలోఁ బద్యగద్యాత్మకంబుగ నాంధ్రీకరింపవలయును.

సంస్కృతభాష నెప్పటికిని మాఱుపోవఁ బడకుండఁగఁ గాచునట్టి శబ్దా నుశాసనమువలె నాంధ్రభాషకుఁ జాలినంత వ్యాకరణము లేదు. ఇది మిక్కిలి లోపముగాఁ గనఁబడుచున్నది.

ఈయున్న యాంధ్రశబ్దచింతామణి, అథర్వణకారికలు, బాలవ్యాకరణ ముగూడ నొక్కస్థితిలోనే యున్నవి గాని శబ్దజాలమంతయు వశపఱచుకొనుటకుఁ దగినట్లుగాఁ గాని భాషాజిజ్ఞాసువులకు సుబోధకముగాఁ గాని లేవు. కావున నిప్పుడు తెలుఁగులో నున్న వ్యాకరణగ్రంథములను బ్రయోగశరణంబులగు భారతాది సద్గ్రంథములను, నాధారముగాఁ జేసికొని యెల్లప్రకరణంబులను, సిద్ధాంత కౌముదిని బోలునట్లుగా విపులముగా ధాతుపాఠాదికమును జేర్చి సుబోధక మగు శైలితో నొకయాంధ్రకౌముదిని రచింపవలయును.

సంస్కృతంబున శబ్దకల్పద్రుమమువలె నాంధ్రంబున నెల్లశబ్దముల కాదర్శముగా సవ్యుత్పత్తికముగా సోదాహరణముగా నొకమహానిఘంటువును నిర్మింపవలయును.

సంస్కృతంబు ననుసరించి కొన్నియలంకారగ్రంథములు తెలుఁగులో నున్నవి గాని కేవలపద్యాత్మకంబులగు వాని శైలి కేవలాంధ్రభాషాజిజ్ఞాసువులకు సులభంబుగా లేదు.

కావున నెల్లకావ్యాలంకారలక్షణంబులు కరతలామలక మగునట్లుగా నెల్ల విధములఁ గావ్యప్రకాశికం బోలిన యలంకారగ్రంథ మొకటి మనభాష కత్యావశ్యకము. మఱియుఁ దెలుఁగులో నాటకలక్షణము బొత్తిగా లేదు. కావున నిప్పటి భాషకుఁ దగినట్లుగాఁ గొన్నిమార్పులఁ గావించి దశరూపకంబు నాంధ్రీకరింపవలయును.

సంస్కృతములో వలెనే మనభాషలోఁగూడ దేశచరిత్ర యొకటియును లేదు. కావున దేశజ్ఞానదాయకంబులగు చరిత్రగ్రంథము లావశ్యకములు. మఱియుఁ బ్రపంచజ్ఞానదాయకంబులగు ప్రకృతిరసాయన జంతువృక్షారోగ్యశాస్త్రంబుల నింకను మిగిలియున్న గ్రంథముల నతిసులభముగా నాంధ్రీకరించుటయు సంస్కృతంబున నధికముగానున్న జ్యోతిశ్శాస్త్రంబు, నాంగ్లేయుల జ్యోతిశ్శాస్త్ర గ్రంథములతో సరిపుచ్చి యాంధ్రీకరించుటయు ననువిషయంబులు ముఖ్యంబులు. మఱియు నండలి పరిభాషల కొకనిఘంటువుగూడఁ గావలయును.

జనసంఘము నభివృద్ధికిఁ దెచ్చు నెల్ల కృషికర్మతంత్రములను దెల్పు గ్రంథము లత్యంతావశ్యకములు. వేయేల? ఆంగ్లేయప్రభుత్వము మనకు లభించిన భాగ్యము సార్థక మగునట్లుగా నేయేగ్రంథములు దేశమునకు భాషకుఁ గావలయునో యవియన్నియుఁ జక్కని వచనకావ్యములుగాఁ దెలుఁగులో నుండవలయును.

ఓయాంధ్రభాషాభిమానులారా! ఈవ్యాస మాద్యంతము నాయెఱింగిన కొలఁది నేవో కొన్ని విషయంబులను గూర్చి వ్రాసినాఁడను. ఇందలి దోషంబులను మన్నించి, గుణముల నుద్ధరింపఁ బ్రార్థించెదను. మఱియు నందందుఁ బూర్వగ్రంథములను నాధునికములను సందర్భానుసారముగాఁ గొన్నిటిని మాత్రము పేర్కొంటిని. ఇంతమాత్రమున నవియే యుదాహరింపఁదగినవనియు మిగిలినవి గావనియు నాయభిప్రాయముగాదు. గ్రంథవిస్తరభీతిచే నెల్లవానిం బేర్కొనలేదనియు నన్నికావ్యములయందుఁ గూడ నాయాగుణంబు లధికముగాఁ గల వనియు విన్నవించెదను. మఱియు నిపుడు భాషలోఁ గావలసిన గ్రంథములనుగూర్చి నేను జెప్పిన విషయ మొక్కనికి సాధ్య మగునది గాదనియుఁ, బెక్కండ్రు విద్వాంసులు గూడి చేయఁదగినది యనియు నిట్టిమహాకార్యము ప్రభువులయాదరంబునను, విద్యార్థులప్రయత్నంబునను గాఁదగినది యనియు విన్నవించుచు నింతటితో దీనిని ముగించెదను.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

# దేశచరిత్రస్వరూపప్రయోజనములు.

చరితము, చరిత్రము, చారిత్రము, అనుసీశబ్దములకు ఆచరింపఁబడినది అనఁగాఁ జేయఁబడినది యని వ్యుత్పత్త్యర్థము. ఒకఁ డొనరించిన కార్యము లాత నిచరిత్ర మని చెప్పవచ్చును. సాధారణముగా నాచారమువలన నాచారవంతుని స్వభావము తెలియును గాన చరిత్రశబ్దమునకు స్వభావము, శీలము అనునర్థము కూడఁగలదు. దీనికింగ్లీషులో (character) అందురు. చరిత్రశబ్దమునకు వృత్తాంతమను నింకొక యర్థము సహిత మున్నది. ఒకఁడు తా నొనరించినకా ర్యములు నాతనివిషయమై యితరు లొనరించిన కార్యములును జేరి యాతనివృ త్తాంత మగును. దేశచరిత్రమన్నపుడు చరిత్రశబ్దము వృత్తాంతార్థమునందే ప్రయు క్తమగుచున్నది.

ప్రతిపురుషునకుఁ జరిత్రమున్నట్లు ప్రతిదేశమునకును జరిత్రము కలదు. దేశచరిత్ర మనఁగా దేశమునందు నివసించు జనులచరిత్రము. ఇట్లన్నమాత్రాన జనులయొక్క ప్రత్యేకచరిత్రముల సముదాయమే దేశచరిత్రమని చెప్పనొప్పదు. ప్రతిపురుషుని వృత్తాంతమును విమర్శించి చూచినచో నందుఁగొంత కేవలమాత్మ సంబంధముగను, గొంత స్వకుటుంబ సంబంధముగను, మఱికొంత స్వజాతిసంబంధ ముగను, ఇంకను మఱికొంతస్వదేశసంబంధముగను విభజింప వచ్చును. కేవల స్వీయ వృత్తాంతము స్వీయచరిత్రమగును. స్వకుటుంబసంబంధ వృత్తాంతము కుటుంబచరిత్రలోను, స్వజాతిసంబంధ వృత్తాంతము తజ్జాతి చరిత్రమునందును దేశసంబంధ వృత్తాంతము దేశచారిత్రము నందును జేరును.

లోకు లనేకులు స్వోదర నిజదారసుతాది పోషణార్థమయి పాటు పడిపడి యంతఁగాలమాసన్న మగుడు విరమింతురు. అట్టివారి చెయిదములు దేశచారిత్రార్హములుకావు. ప్రజ్ఞావంతులు కొందఱు స్వకుటుంబ పోషణము చేయుచు నంతటితో విరమింపక స్వజాతి దేశములం గుఱించి కూడఁ బాటుపడు దురు. భూపతులు తన్మంత్రులు ప్రజాపరిపాలన మూలమునను, మహా శూరులు

యుద్ధాది శూరకర్మల మూలమునను, విద్యావంతులు విద్యాభివృద్ధి నొనర్చుట మూలమునను, మతోద్ధారకులు మతోద్ధారణ మూలమునను తదితరు లితర మార్గములను సంఘోపకార మొనర్తురు. కొందఱు సంఘాపకారము సయిత మొనర్తురు. వీరిచేఁతలు దేశచరిత్రమం దిమిడియుండును.

ఇంతియకాక యాయాప్రదేశము లందలి జనులు సంఘరూపముగను సంఘోద్దేశముగను జేయుకార్యము లన్నియు దేశచరిత్రమున కాధారము లగును. అనఁగా మొత్తముమీఁద సంఘవిషయక వృత్తాంతము దేశచరిత్రమని తేలుచున్నది. పురుషుల స్వీయచరిత్రము దేశచరిత్రములోఁ జేరదని యంటిమి కదా. ఇది సామాన్యవిధి. దీనికి భిన్నముగా లోకోత్తరమహిమాన్వితుల స్వీయచరిత్రములు కూడ దేశచరిత్రములోని భాగములే యని చెప్పవలసియున్నది. ఇందునకు రెండుమూఁడుదాహరణములు మాత్ర మిచ్చెద.

భగవాన్ గౌతమ బుద్ధుఁడు గర్భైశ్వర్యవంతుఁడుగా నుండియు వైరాగ్య మధికమయి కళత్రపుత్రాది బంధువర్గమును రాజ్యము నైహికసౌఖ్యమును విడిచి సన్యాసియై భిక్షాటనము చేసెను. భార్యయం దాగ్రహము వచ్చియో లేక యప్పులవాని బాధకోర్వఁ జాలకయో సన్యాసులయిన వారిని గొందఱిని జదువరులు గొంద ఱెఱిఁగి యుందురు. వారి నామములు సహితము స్మరణార్హములు కావు. గౌతముని సన్యాసము జగద్విస్తృత బౌద్ధమత ప్రతిష్ఠకు మూలమగుటచే హిందూదేశచరిత్రమునందు మాత్రమే కాక లోకచరిత్రమునందు సైతము ముఖ్యాంశములలో నొకటిగా గ్రహింపఁబడినది. ఆప్రకారమే శ్రీజగద్గురు శంకరాచార్యుల చెయిదములును. పూర్ణానదిలో స్నానము చేయుచుండఁగా నాతని మొసలి పట్టెననియుఁ దక్షణమె సన్యసించినచో విడుచునట్లు తటస్థింపఁగాఁ దల్లియనుమతి వడసి సన్యాసి యయ్యెననియు శంకర చరిత్రము చెప్పుచున్నది. అప్పుడా మహామహుఁడు సన్యాసి కాకయుండెనేని యనన్యసాధ్యములును జగద్విస్మయ కారకములును సంసారోత్తారకములునగు ప్రస్థానత్రయ భాష్యాది మహాగ్రంథములు పుట్టియే యుండవు కదా. కావున నీ పరమపవిత్రుని చరిత్రముకూడ దేశచరిత్ర లోకచరిత్రములలో నంతర్భాగమే.

ఇంగ్లాండునందు షేక్స్పియరు అనుమహాకవి యుండెను. అతఁడాంగ్లేయ కవులలో నుత్తముఁడుగను, లోకమునందలి కవిరాజులలో నొకఁడుగను బరిగణింపఁబడుచున్నాఁడు. ఆయన ఆవన్ (Avon) అనునదీతీర

మండలి స్ట్రాట్ఫర్డు (Stratford) అను చిన్న గ్రామమున నివసించుచుండెడి వాఁడు. బాల్యమునందు విద్యాధిక్య సూచనము లేమియుఁ గనపఱచి యుండ లేదు సరిగదా చిన్నతనపుఁ జేష్టలుకూడఁ జేయుచుండెనఁట. ఒకప్పు డాయూ రిలో నొక సంపన్నుని యుద్యాన వనమునం దున్న జింకలను దస్కరింప యత్నిం చెనఁట. అందున కాగృహస్థుఁడాతనిని బట్టి దండింపఁ దలఁచినాఁడని తెలిసి షేక్స్పి యరాగ్రామమునుండి రాత్రికి రాత్రి బయలుదేరి రాజధానియగు లండను నగరమునకుఁ బాఱిపోయి యచ్చట నాటక సమాజములలోఁ జేరియుండి క్రమ ముగా జగద్విఖ్యాతములగు ముప్పదియాఱు నాటకములను గొన్ని కావ్యము లను రచించి యాంగ్లేయ వాఙ్మయమునకు శిరోభూషణమును గల్పించెను. ఈచిన్నవృత్తాంతము షేక్స్పియరుయొక్క స్వీయవృత్తాంత మయినను దన్మహా కవికృతగ్రంథ నిర్మాణమునకు ముఖ్య హేతువులలో నొకటి యగుటచేత నాంగ్లేయ వాఙ్మయచరిత్రమునందు మాత్రమేకాక తద్దేశచరిత్రమునందు నయితము చేరఁ దగియున్నది.

ఇట్టిదే శ్రీరామచంద్రుని యరణ్యవాసముకూడ. ఎంతమంది ప్రాకృత జను లడవులయందు వన్యాహారములచే శరీరపోషణముచేసి కొనుచు లోకము యొక్క దృష్టిపథమునందుఁ బడక యే దినదినము కాలధర్మము నొందుచున్నారు? శ్రీరామచంద్రుని వనవాసము కొన్ని విషయములలో నట్టిదేయయినను లోకోత్తర కార్య నిర్వహణమునకు హేతువై యుంటచే నాదిమకవివర్ణనీయమై లోకము నకు సర్వకాల స్మరణీయ మయినది.

ఇట్టివృత్తాంతము లనేకములింకను గలవు. గ్రంథవిస్తర భీతిచే వానినిచట స్మరింపకుండెద.

పైఁ జెప్పినదానిని బట్టి దేశచరిత్రమనఁగా దేశమునందలి జనసంఘము యొక్క పురావృత్తమని తేలినది. అనఁగా జను లేకాలమం దేస్థితిలో నుండిరో, వారల రాజకీయపద్ధతులు, ఆచారవ్యవహారములు, మతములు, విద్యావివేక ములు మొదలగునవి యెప్పుడెప్పు డేయేవిధముగానుండెనో, ఏయేసందర్భముల యందు వా రేయేవిధమునఁ బ్రవర్తించి యేయే యిక్కట్టులఁ దప్పించికొనఁ గలి గిరో, లేక, యేయే యిక్కట్టులకులోనయిరో, ఎప్పుడెప్పుడు వారిస్థితి గతుల యం దేయేమార్పు లేయేకారణములవలనఁ గలిగెనో, వారి వృద్ధిక్షయము లే యే రీతుల ననుసరించెనో యివి యన్నియుఁ జరిత్రము నివేదించును.

చరిత్రకథనమునకు నైపుణ్యము కావలయును. ఏదయినను నొక సాధారణ కథను జెప్పవలయునన్న, నేర్పరులగువారు చెప్పిన చొప్పున నేర్పు లేనివారు చెప్పలేరు. కొందఱు కొంచెపుమాటలతో జెప్పినను కథాసారమంతయు శ్రోతలమనస్సునం బట్టును. మఱికొందఱు ఆకథనే గ్రంథము పెంచి క్రమహీనముగా జెప్పుటచే వినువారికి బోధపడకుండును. ఆప్రకారమే చరిత్రకథనమును. అన్ని విషయములందును ముఖ్యాంశములు అముఖ్యాంశములు నుండును. ముఖ్యత్వాముఖ్యత్వములు ఉద్దిష్ట వక్తవ్యాంశము ననుసరించియుండును. ముఖ్యాముఖ్యవిచారము చేసి యప్రధానములం ద్యజించి ప్రధానముల గ్రహించుట నేర్పరితనము. అప్రధానాంశముల గ్రహించుటవలన వాని సాహచర్యముచే ప్రధానాంశముల ప్రాధాన్యముయొక్క స్ఫురణను బాధకలిగి యుండుటవలన నాయావృత్తాంతముల వ్యంగ్యార్థము గోచరింపకుండుట తటస్థమగును.

చరిత్రములలో వివరింపఁబడు నితివృత్తములు వస్తురూపములు. వస్తుకథాశ్రవణమాత్రమువలన నానందరూపకమగు తాత్కాలికఫలము కలుగును. కాని యదియే ముఖ్యఫలము కాదు. సామాన్యన్యాయరూపతద్వస్తువ్యంగ్యార్థబోధమే ముఖ్యఫలము. అట్టి న్యాయములు మానసైకగోచరములు. చారిత్రశాస్త్రమునకు జీవభూతములు. వ్యంగ్యార్థమును బోధింపక కేవలవస్తుకథనము మాత్రమే చేసినచో నది చారిత్రశాస్త్ర మనిపించికొనదు. వ్యంగ్యములగు సామాన్యనియమములనిరూపణమే చరిత్రముయొక్క ముఖ్యప్రయోజనమయినచో వస్తుసామగ్రి తదనుకూలముగా నుండవలయును. నియమనిష్పాదనమున కావశ్యకములగు విషయములు ప్రధానములు. తదితరము లప్రధానములు.

సత్యచారిత్రధర్మములలో ముఖ్యమైనది యథాకథనము. ఉన్నదియున్నట్లు చెప్పుట. ఈవిషయమునం జరిత్రమునకును నిర్దుష్టమయిన యద్దమునకును సామ్యము చెప్పనొప్పును. బింబమునకు సరియైన ప్రతిబింబము నిచ్చునదియే మంచియద్దముగా భావింపఁబడును. అట్లుకాక వికారరూపమును గనఁబఱచునవి కొన్ని కొన్ని సందర్భములం దుపయోగించినను జనులట్టివాని నద్దములుగా వాడరు. అద్దమునం దుండు దోషములు ప్రతిబింబమందు సంక్రమింపకుండున ట్లద్దము నిర్దుష్టముగా నుండవలయును. అదియే దాని కుత్తమగుణము. ఆరీతినే గ్రంథకర్త యిష్టానిష్టములు, రాగద్వేషములు మొదలగుదోషములు వస్తుకథనమునందు సంక్రమింపకుండ నున్నది యున్నట్లు చెప్పుట చరిత్రముయొక్క యుత్తమగుణము.

పూర్వోక్తరీతి నప్రస్తుతములగు నంశములఁ దిరస్కరించి ప్రస్తుతములను యథారూపముగాఁ దెలుపవలయును. అప్పుడే చరిత్ర ప్రమాణవాక్యమనిపించు కొనును. మనుష్యకర్తృకములగు గ్రంథములలో నీ నియమమును బాటించుట దుస్సాధ్యము. బుద్ధీంద్రియజన్యదోషములకు లోఁబడనివాఁడుండు. కర్తృనిష్ఠములగు దోషములు కార్యములందుఁ దోఁపకమానవు. కావుననే మనుష్య వాక్యము పరమప్రమాణముగా గ్రహింపఁబడదు. అయినను సాధ్యమయినంత వఱకట్టి దోషములుపట్టకుండ యథారూపముగా వ్రాయుటకే యైతిహాసికు లుద్యమింపవలయును.

ముఖ్యాముఖ్యవస్తువివేకము వలయునని చెప్పియుంటిమిగదా! అందొక విశేషముగలదు. కొన్ని విషయములు తత్కాలమం దధికముగాను ముఖ్యములుగాను దోఁచును; కాలాంతరమున విపరీతముగాఁ దోఁచును. మఱికొన్ని తొలుతస్వల్పములుగాను, అముఖ్యములుగాను దోఁచినను తుదకు ముఖ్యములయినవిగాఁ బరిణమించును. సముద్రములకు సంధిగావించు చిన్నకాలువలవలెను, పెద్దభూఖండముల కొకదానితో నొకటికి సంబంధము కలుగఁజేయు స్వల్పప్రదేశముల వలెను, కొన్నిచిన్నకార్యములు గొప్పకార్యముల కన్యోన్యసంబంధమును దెలుపుచుండును. అల్పకారణములవలన నధిక కార్యము లుద్భవించుట కలదు. స్థూలదృష్టిచేఁ జూచినప్పు డట్టికారణములు గ్రహింపఁబడకుండును. ఐతిహాసికుఁడీప్రమాదమునకు వశుఁడు కాకుండవలయును. ఒకటి రెండుదాహరణములిచ్చెద. శ్రీరాముని వనవాసము, ఆవనవాసమందయిన రాక్షసవధ, సీతాహరణాదులు, పిదపరావణవధ ఇత్యాదిమహాకార్యములకన్నిటికిఁ గైకవలనఁ గలిగిన పట్టాభిషేకభంగము ముఖ్యకారణము. కైకకురామునియందుఁ దొలుతఁ బ్రేమ యతిశయముగా నుండినట్లును, మంథరయుపదేశముచే మతిచెడెననియు రామాయణమందే చెప్పఁబడియున్నది. సర్వజనప్రేమాస్పదుఁడగు రామునియందు మంథరకు మాత్రమీద్వేషమేలయని విచారింపఁగా, నతిబాల్యమున రాముఁడు విలాసార్థము మంథరను వెక్కిరించుచుండెననియు నాదాసి యాకారమునందు వలె హృదయమందును గుటిలయగుటచే నాబాల్యచాపల్యమును మహాపరాధముగా భావించి దానికిరీతిని బ్రతీకారము చేసెననియు నాగ్రంథమునందే గ్రహింపనగును. మఱియు మాయలేడి సీతకగపడుటయు నది కావలయునని యామె కోరఁగాఁ దెచ్చియిచ్చుటకు రాముఁడు యత్నించుటయు, సీతాపహరణమునకును, అదికారణము

గాఁ గలిగిన యనంతర కార్య జాలమునకును గారణము. యుధిష్ఠిరుఁడు మయ నిర్మితసభయందుపవిష్టుఁడై యుండ దుర్యోధనుఁడచ్చటికిఁ బోయినప్పుడు శిల్ప చాతుర్యాతిశయముచే నాసభాభవన నిర్మాణమంతయు నతనికి విపరీతముగాఁ దోఁపఁగా నావిపరీత భావనానుసారముగా నతఁడు సంచరించుటఁజూచి ద్రౌపది యవశముగా మందస్మిత మొనర్చెననియు, నాచిఱునవ్వారాజరాజుహృదయ మందంతకుముందెరవులుచున్న క్రోధానలమున కింధనమయి క్రోధోద్రేక మొనర్చెననియు సభాపర్వమునందున్నది.

ఇట్టివిషయములను విడిచినయెడలఁ గథాసందర్భము కుదురదు. విషయ సమన్వయమునుగాదు. ఇట్లని ముఖ్యాముఖ్య వివేచన చేయక ఊఁక, బియ్యము కలిపినట్లు విషయములన్నిటిని గ్రహించినచో నవి క్రమముగా సమన్వయింపవు. మఱియు నింకొకవిశేషముకలదు. కేవలేతివృత్తకథనముకంటెఁ దన్మూల మున సాధింపఁబడు సామాన్య న్యాయములు ముఖ్యములు. ఈన్యాయములకు సర్వకాలములయందును వ్యాప్తికలదు కావున నవియే ప్రధానములు. న్యాయ సాధనకుపకరించుటయే యితివృత్తకథనము వలని ప్రయోజనము. కాఁబట్టి న్యాయసాధనకుఁ గావలసిన విషయములను విడువక గ్రహింపవలయును.

ఇతిహాస మాప్తవాక్యము. ఆప్తవాక్యము సాధారణముగా "ప్రాయేణా నృతవాదిత్వా త్పుంసాం భ్రాంత్యాది సంభవాత్" అని పొరపాటు అసత్యముచెప్పుట యనెడు ద్వివిధమయిన దోషమున కాస్పదమయి యుండును. చరిత్రగ్రంథకర్త యీదోషమును దప్పించికొనవలయును. అవిచారపూర్వకముగా నెవ్వియో కొన్ని సిద్ధాంతముల నేర్పఱిచికొని వానిని సమర్థించు బుద్ధితో, విపరీతభావనలఁ గల్పించికొన్నయెడల దానివలన గ్రంథప్రామాణ్యమునకుభంగముగలుగును. మఱియు నేవియో యొకటిరెండు సంగతులం బట్టి వానియర్థము నితరసాధనములచే స్థిరపఱుపకయే యలసతచేఁ గాని బుద్ధిమాంద్యము, లేక, బుద్ధి వక్రతచేఁగాని యపసిద్ధాంతముల నేర్పఱచి కొనువారి వ్రాతలు ప్రమాణములుగా నంగీకరింపఁ బడవు. న్యాయాధిపతి వాదిప్రతివాదుల సాక్ష్యమును బరిశీలింప వలసినట్లు చరిత్రగ్రంథము వ్రాయునతఁడు సత్యాసత్యనిర్ణయమును నిపుణమునిష్పక్షపాతమునగు బుద్ధితోఁ జేయవలయును. అటుగాక వాది ప్రతివాదుల వలె నేదోయొకపక్షము నవలంబించి దానిని దృఢ

పలుపయత్నించినను దెలివితక్కువచే నసత్యమును సత్యముగా గ్రహించినను ఆనిర్ణయములు కలకాలము నిలువవు.

ఇక దేశచరిత్రమువలని ప్రయోజనములం గుఱించి కొంచెము విచారింతము. "వర్తమానావస్థయే యందఱకు ననుభవములోనున్నది. కావున నదియే ప్రధానము, భావ్యవస్థ వర్తమానముకాఁదలఁచి యున్నది గావున దానిం గూర్చి తెలిసికొనఁ గలుగుదుమేని యదికొంత లాభకరమే. గతించిన దేమో గతించినది. వర్తమానమందు లేదు. ఇకముందు రాఁబోదు. కాఁబట్టి గత వృత్తాంతమును దెలిసికొనుటవలన నేమి ప్రయోజనము?" అని కొందఱకుఁ దోఁపవచ్చును. కాని యిది సరికాదు. స్వదేశచరిత్రాధ్యయనమువలన రెండు ముఖ్యప్రయోజనములు కలవు. అందు మొదటిది ఆత్మవిశ్వాసము, ఆత్మ గౌరవము. ఆత్మ విశ్వాసమనఁగాఁ దనకు లేని శక్తి కలదని భ్రమించి తనకంటె నధికులగువారిని దిరస్కరించుచుఁ దన్నుఁదా నుత్తమునిఁగా నెంచుకొని విఱ్ఱవీఁగుట కాదు. అది దుర్గర్వ మనిపించికొనును. దుర్గర్వము చేటునకు మూలము. ఆత్మసంభావన మనఁగా నిజశక్తి స్వరూపముల సరిగా నెఱుఁగుట. తనశక్తి తా నెఱుంగనివాఁడు శక్త్యనుగుణములగు కార్యములఁ జేయ యత్నింపలేఁడు; యత్నించినను నెఱవేర్పఁ జాలఁడు. ఆరంభింపఁదలఁచిన కార్య మొనర్చుటకు సామర్థ్యము తనకుఁ గలదను నమ్మకము కార్యనిర్వాహమునకుఁ దోడ్పాటుగానుండును. అది లేనప్పుడు, పిఱికితన మబ్బును. ధైర్యమడుగంటును. కార్యము భ్రష్టమగును. సాధారణముగా భారత దేశీయుల కాత్మసంభావనము తక్కువనియు నీలోపము తీఱునఱకు దేశ మున్నతస్థితికి రాఁ జాలదనియుఁ బలువురు దేశాంతరుల యాశయము. లేని నైచ్యము నారోపించికొనుట సాధారణముగా మనకాచారమయి యున్నది. దీనికిఁ గారణము లనేకములుండును. వానిలో స్వదేశ పూర్వ వృత్త స్వరూపాజ్ఞానమే ముఖ్యము. సాధారణముగా నిప్పటి నవనాగరికులు పాశ్చాత్య విద్యలయందును, పాశ్చాత్య దేశచరిత్రములందును ఎక్కువ యభినివేశము గలవారుగానుండి స్వదేశవృత్తాంతమును స్వదేశీయ విద్యలను నంతఁగాఁ బరిశీలింపకున్నారు. కావున వారికిఁ బశ్చిమదేశవాసుల నాగరికతయందధికవిశ్వాసమును, బహుకాలసంచితమగు స్వదేశ నాగరికతయందు నిరసనమును, గలుగుచున్నవి. అనుష్ఠేయములగు నాచారములు మనలోనంతగా లేవనియు, స్వధర్మముల నన్నిటిని విడిచిపెట్టి పరధర్మముల నవలంబించుటయే శ్రేయస్కరమునియు, ధార్మికమునియుఁ, గొందఱిగట్టినమ్మ

కము. ఈ నమ్మకమునకు ముఖ్యకారణము నిజవృత్తాంతము నెఱుంగక పోవుటయే. లోకము బహుశః పరాఙ్ముఖమయి యున్నది. ప్రత్యఙ్ముఖమయినఁగాని స్వస్వరూపజ్ఞాన మావిర్భవింపదు. పరాఙ్ముఖత్వము తొలంగుటకాత్మ వృత్తాంత శ్రవణము ముఖ్యసాధనము.

దేశాభివృద్ధికై యత్నింపవలసిన రీతుల నిరూపించుట దేశచరిత్రము యొక్క రెండవప్రయోజనము. ప్రతివ్యక్తియొక్కయుఁ బూర్వానుభవసారము వాసనారూపమున నిలుచుననియు నావాసనాసంచయముచేత నావ్యక్తికనితరసాధారణమగు నొక స్వభావ మేర్పడుననియు సిద్ధాంతము. కావుననే లోకములో బురుషున కొకస్వభావము సిద్ధించుచున్నది. దానినిబట్టియే పురుషుఁడే సందర్భమున నేప్రకారము సంచరించునో యాతని స్వభావము నెఱింగినవారు చెప్పఁగలరు. ఆప్రకారమే సాంఘికానుభవమువలన జనసంఘములకు నియతము స్వభావములేర్పడును. దానివలన జాతివిభాగ మేర్పడుచున్నది. లోకములో మనుష్యులుచేయు కార్యములు కొంతవఱకు వారివారి జాత్యనుసారముగా నుండుట సుప్రసిద్ధము. వ్యక్తులకుఁ గాని సంఘములకుఁ గాని స్వభావవిరుద్ధములగు కార్యములొనర్చుట యసాధ్యము. పూర్వానుభవములవలన వర్తమాన ప్రకృతు లేర్పడును. వర్తమానానుభవములు గాని, భావ్యనుభవములు గాని ప్రకృతి విరుద్ధములుగా నుండవు. అట్లనుటవలన, వృద్ధిక్షయముల కవకాశము లేదనియుఁ బురుషునకు స్వాతంత్ర్యము బొత్తిగా లేదనియుఁ దాత్పర్యముకాదు. స్వాతంత్ర్యము బొత్తిగా లేనియెడల శాస్త్రమప్రయోజకమగును. అంతయు దైవమేకాని పురుషకారమున కవకాశము లేదనుట లోకానుభవమునకు విరుద్ధము.

పురుషప్రయత్నమున కవకాశమెంతయినను గలదు. కాని, యొకబట్టను విడిచి మఱియొక బట్టను గట్టికొన్నట్లు స్వస్వభావము నిచ్ఛామాత్రముగాఁ బాఱవైచి యన్యస్వభావమును ధరింపవచ్చు ననుకొనుట యసంగతము. తనలో నుండెడి యీశ్వరాంశప్రభావమునఁ బ్రతిజీవునకును స్వాతంత్ర్యము సహజముగానున్నను, ఈశ్వరాంశమున కుపాధిభూతమయిన ప్రకృతిసామర్థ్యముచేతనా స్వాతంత్ర్యమునకు మితి యేర్పడుచున్నది. కావున సాధారణముగా స్వభావానుగుణముగానే పనిజరుగును. దాని కధికముగాఁ బనిచేయవలెనన్నచో, సంకల్పపాటవమున స్వభావమును మార్చుకొనవలెను. ఇది క్రమాభ్యాసమువలన సాధ్యమగును గాని, యిచ్ఛామాత్రముచేఁ గాదు. ఈ నియమమెఱుంగక నిజశక్త్యనుగుణ

ములుగాని యత్నములు సలుపుటవలన స్వధర్మములు శిథిలములగుటయు, బర ధర్మము లబ్బకపోవుటయుఁ దటస్థించును. లేనిది సంపాదించి కొనుటకంటె నున్నది పోఁగొట్టుకొనుట సులభము.

ఆప్రకారమే సాంఘికాచార ధర్మములు మాఱవలెననిన సాంఘిక స్వభావము మాఱవలెను. అది యుపదేశబలముననను, గ్రమాభ్యాసముననను గలుగును. తానధికుఁ డయ్యును, శిష్యునియధికారానుగుణముగాఁ గొంచెకొంచె ముప దేశించి క్రమక్రమముగా నతనిని గృతార్థుని జేయు సద్గురునిఁబోలి, సంఘమునకు నాయకులు గాఁగోరువారు సంఘములోఁ గలిసియుండి సాంఘికులయధికారమును, గష్టసుఖములను గనిపెట్టి తదనుగుణముగా బోధించుచుఁ గ్రమముగా నుత్తమస్థితిని నొందింపవలెను. సంఘ స్వభావమున కనుగుణములుగాని యేర్పాటు లొనరింపవలెనని యత్నించిన నవి బహుశః కొనసాగవు. ఎవరో కొంతమంది మాత్రమా ప్రయత్నముల నామోదింతురు గాని సామాన్యముగా జనులందఱును ద్వేషింతురు. ఒకవేళ నొకానొక యత్నము సాగినట్లగపడినను, దానిఫలము సిలుకడగానుండదు. పునాదిలేనియిల్లు కట్టుటయేకష్టము. కట్టినను, గలకాలముండదు. సంఘము తోడ్పాటుచే సమర్థింపఁబడిన కార్యములట్లు సంఘవిరుద్ధములగు కార్యములు మనఁజాలవు. శాస్త్రమునకు విరుద్ధములయిన యాచారములు పుట్టుచుంట మనము చూచు చున్నాము. అట్టి యాచారముల ననుసరించి శాస్త్రమప్పటప్పటికి మాఱుటయుఁగలదు. దీనికంతకు జనానుమోదమే మూలము. ప్రస్తుతస్థితియందు మనలకు స్వదేశచరిత్ర జ్ఞానమత్యావశ్యకముగాఁ గనఁబడుచున్నది. కొంతకాలమునుండి మనకు యూరోపుదేశస్థులతో సంబంధమును వారివిద్యల మన మభ్యసించుటయుఁ గలిగినది. ఈకారణమున మనకు బుద్ధివైశాల్య మతిశయించినదనుట నిస్సందేహము. పలువురము కొన్ని కొన్ని విషయములలో నా యూరోపియనుల ననుకరింపవలెనని యత్నించు చున్నాము. వారి యాచార వ్యవహారములు మనయాచార వ్యవహారముల కంటె మంచివనితోఁచి య్యాప్రకారము మనస్థితిని మార్చుటకు యత్నించుచున్నారము. మత విషయములందును, సాంఘికాచార విషయములందును రాజకీయ వ్యవహార విషయములందును సంస్కార ప్రయత్నములు జరుగుచున్నవి. ఈ సంస్కరణాభి షంగము క్రమముగా నేఁటికి భాషదాఁకఁ బ్రాకినది. కొందఱాంగ్లేయభాషాసంప్రదాయములఁ బట్టి తెనుఁగుభాషను మాఱుప యత్నించు చున్నారు.

ఆంగ్లేయ విద్యాభ్యాసమువలన మొత్తముమీఁద సర్వతోముఖమగు సంస్కరణాభిలాషము దేశములోఁ బొడమినది. ఇది మొదట బంగాళా దేశమందుఁ బుట్టినది. చాలసంవత్సరముల క్రిందటనే బంగాళా దేశస్థు లనేకులు వేషభాషలయందు మాత్రమేగాక యాచారములందును పాశ్చాత్యుల ననుకరించుట కారంభించి, యందు దృఢప్రజ్ఞులయి యితరుల కుపదేశికు లయినారు కాని యిటీవలఁ గొన్ని కారణముల వలన నీపరకీయాభిరతి తగ్గి స్వీయానుసరణమున కుపక్రమించిరి. దీనింబట్టిచూడఁగా వేషభాషలతోఁ బాటు వారి యంతఃకరణవృత్తు లంతఁగా మాఱినట్లు కనఁబడదు. అంతఃకరణవృత్తి మాఱనిమార్పులు స్థిరములు గావు. ఒకప్పుడావేశరూపమున నంతఃకరణము మాఱినను మాఱవచ్చును. కాని యది యస్థిరము. ఆవేశ మున్నంతవఱకే యుండును. అది తగ్గినపిదప "యథామూషకః మూషకః" యన్నట్లు పూర్వస్థితి మఱల నావిర్భవించును. వ్యావహారిక విషయములలో నీయావేశ ప్రభావమునకు లక్ష్యములు దూరము వెదుక నక్కఱలేకయే కనిపెట్టవచ్చును.

లోకములో సాధారణముగాఁ బెరఁటిచెట్టు మందునకుఁగాదు. పొరుగింటి పుల్లకూరరుచి. ఇది మంచిదికాకపోయినను మనకంటె నధికులగు వారినిఁజూచి మనమునేర్చికొనుట యుచితము. అట్లొనర్చుటలో "పిండికొలఁదిరొట్టె" యను న్యాయమున స్వశక్త్యనుసారములు స్వస్వభావానురూపములునగు యత్నములనే యొనర్పవలయును. శక్తికిమించిన పరుగులెత్తిన లాభము లేదు. (సశేషము)

జయంతి రామయ్య.

# చాలుక్యరాజరాజు నంపంపూడి శాసనము.

## శ. స. 976.

---

ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును దెలిసికొనుటకు శాసనవిమర్శనము ముఖ్య సాధనములలో నొకటి. శాసనములు సాధారణముగా రాళ్లమీఁదను రాగిరేకుల మీఁదను జెక్కఁబడియున్నవి. అట్టి శాసనములు దేశమునం దనేకములు గలవు. అందు ముఖ్యమగువానిఁ గ్రమక్రమముగా నీపత్త్రికయందు సవిమర్శముగాఁ బ్రకటింపఁదలచినారము. రాజరాజుచే నారాయణభట్టున కియ్యఁబడిన యగ్రహార దానమును గుఱించిననన్నయభట్టారకకృత శాసనమును బ్రకటింపఁబడెడి శాసన మాలకు నాయకమణిగాఁ దొలుత ముద్రించుచున్నారము. దీనికంటెఁ బ్రాచీనములగు శాసనములున్నను ఆంధ్రవాఙ్మయ నిర్మాణమున కత్యంతసంబంధముగల మూర్త్రిత్రయమునకు సంబంధించిన దగుటచే నీశాసనము బ్రకటింపఁబడఁ బోవు శాసనములకెల్ల ముఖమండనముగా నుండఁదగినదని సహృదయులగు పండితులకుఁ దోఁపకమానదు. ఈశాసన మింతకుముందు కీల్‌హార్ను అను జర్మనీ దేశీయవిద్వాంసునిచే హిందూదేశ శాసనావళి (Epigraphia Indica.)యను రాజకీయపత్త్రికయందుఁ బ్రకటింపఁబడియె. చెన్నపట్టణమునందలి వస్తుప్రదర్శన భవనము (Museum,) నందున్న మూలతామ్ర పత్త్రముల సహాయముచేఁ బాఠమును బరిష్కరించి యీశాసనమును సవిమర్శముగా నాంధ్రలోకావబోధార్థమై యిందుఁ బ్రకటించుచున్నారము. మూలమున్నది యున్నట్లుగా ముద్రింపఁబడును. సవరణలు చేయవలసియున్నప్పు డవి పుటయడుగున సూచింపఁబడును. నన్నయభట్టారకుని కాలమునం దాంధ్రలిపి యెట్లుండెనో తెలుపుటకీ శాసనపత్త్రముల ప్రతిబింబములిందుఁ బొందుపఱుపఁబడును. ముందుఁగూడ నీరీతి నుచితములగుపట్టులందు శాసనప్రతిబింబములు ముద్రింపఁబడుచుండును.

శాసనస్వరూప వృత్తాంతములు. ఈశాసనపత్త్రములు అయిదు. గోదావరిజిల్లా కలెక్టరుగారిచే నంపఁబడి చెన్నపురి వస్తుప్రదర్శన భవనమందు భద్రము చేయఁబడి యున్నవి. శాసనమేయూరిలో నెవరి కెప్పుడుదొరకినది తెలియదు. రాగిరేకులపొడవు 10 అంగుళములు. వెడలపు 5 అంగుళములు. ఆద్యంతపత్త్రములకు లోపలిప్రక్కనుమాత్రమే యక్షరములు గలవు. తక్కిన మూఁడు రేకుల

కిరుప్రక్కల నక్షరములు చెక్కఁబడియున్నవి. శేకులజవ లెత్తుగానున్నవి. అక్ష
ములు స్పష్టముగాఁ గనఁబడుచున్నవి. శేకుల కెడమభాగమునడుమ గుండ్ర
చిల్లులు పొడిచి యాచిల్లులగుండ శేకులొకరాగి కంకణమునకు గ్రుచ్చఁ
యున్నవి. కంకణ మతిగిన చోట నొకదిమ్మయున్నది. దిమ్మనడుమ నుబికినయక్ష
ములతో "శ్రీ త్రిభువనాంకుశ"[1] యని చెక్కఁబడియున్నది. ఈయక్షరములపై
దక్షిణముఖముగా నొకవరాహమును దానిపయిని సూర్యచంద్రులును వాని
రుప్రక్కల రెండుచామరములును జెక్కఁబడియున్నవి. మఱియు వరాహమున
ముందుశంఖమును వెనుకడమరుకము నున్నవి. అక్షరములక్రింద నంకుశము
దానిక్రింద వికసించినపద్మమును గలవు. ఇవి చాలుక్యరాజ్య లాంఛనముల
శాసనమువలనఁ దెలియుచున్నది.

లిపి: శాసనలిపి మొదటనుండి మూఁడవపత్త్రిము రెండవపుట యాఱ
పంక్తిలో "శత్రూన్స" అను నక్షరములవఱ కొక్క రీతిగను పిదపఁ జివరవఱ
నొక్క రీతిగను నున్నది. దీనినిబట్టి కీల్హార్నుగారు రెండుభాగములు వేఱువేఱ
కాలములందుఁ జెక్కఁబడియుండునని యూహించినారు. ఈయూహ సరియ
కాని యీరెండు కాలములకు నంతరమంతయెక్కువగా నుండదని చెప్పవలసి
యున్నది. ఏలననఁ బూర్వభాగములోనికథ శక్తివర్మ రాజ్యపాలనారంభమువఱ
కునున్నది. శక్తివర్మ పన్నెండు సంవత్సరములును విమలాదిత్యుఁడే యేఁడుసంవత్స
ములు భూమినేలిరి. రెండవభాగము విమలాదిత్యునిపుత్త్రుఁడగు రాజరాజు రాజ్య
కాలములో ముప్పదిరెండవయేటఁ బుట్టినది. కాన నీరెండు భాగములకు నంత
మేఁబది సంవత్సరములకంటె నెక్కువయుండదు. తక్కువయైయుండిన నుండ
వచ్చును. ఈపాటికాలములో లిపిస్వరూప మంతగా మాఱియుండునా యని
సంశయింపవలసి యున్నది. రెండుభాగములకుఁ గలలిపిభేదము కాలభేదముకంటె
లేఖకభేదము ననుసరించి యధికముగాఁ గలిగియుండవచ్చునని నాయభిప్రాయము
పూర్వము శాసనములలోని వంశావతార భాగములు "ముసాయిదా"లుగ
ముందు చెక్కించి యుంచికొని దానముచేయు నవసరమునఁ దరవాయి పూర్తి
చేయు నాచారమున్నట్లు గనఁబడుచున్నది. ఆప్రకారము ప్రస్తుతశాసనమ

1. త్రిభువనాంకుశబిరుదమునకు భారతప్రయోగము. త్రిభువనాంకుశదీప్తినిధీసమ|స్త భువనా
యధర్మధురంధరా| శుభయశఃపరిశోభిత పూర్వదిక్ప్రభువిలాసకృపారసబంధురా. (అది. ప. 4.27)

యొక్క మొదటినలువదితొమ్మిదిపంక్తులు తొలుత "ముసాయిదా"గాఁ జెక్కఁబడియుండి దానకాలమున మిగిలినభాగము లిఖింపఁబడియుండును. ఏఁబదియవ పంక్తినుండియే గండాచార్యులు లిఖించినది. ఈలిపి గండాచార్యులులిఖించిన రాజరాజుకాలమునాఁటి కోరుమిల్లిశాసనపులిపిని [2] బోలియున్నది. మొదటినలువదితొమ్మిదిబంతులును వేఱొకలేఖకుఁడు లిఖించియుండును. జయసింహాది శబ్దములలో హకారమునకుబదులు ఘకారమును లిఖించుటచే నీలేఖకుఁడౌత్తర సంప్రదాయాభిలాషియని బుద్ధిపొడముచున్నది. నన్నయభట్టు రచించినగ్రంథము కూడ నీరెండవభాగముమాత్రమే యయియుండును.

<u>భాష</u>. దత్తగ్రామమగు "నందమపూండి" యొక్క హద్దులఁదెల్పుభాగము తప్ప మిగిలినశాసనమంతయు సంస్కృతభాషలో రచింపఁబడియున్నది. సంస్కృత భాగము గద్యపద్యాత్మకముగా నున్నది. లేఖకదోషము లచ్చటచ్చటఁ గొంచె మున్నను కవిత్వము మొత్తముమీఁద నిర్దుష్టమయినదని కీల్హార్నుగారి యభిప్రాయము.

<u>(ఆంధ్రశబ్దవిమర్శనము.)</u> శాసనమునందలి యాంధ్రశబ్దముల స్వరూపమును గూర్చి యించుక విచారింతము. గ్రామనామములలో నందమపూణ్డి, పెద్దపూణ్డి మడకుఱితి అను రూపములు విశేషములు. ఇక్కాలమున పూణ్డికి పూఁడియనియును కుఱితికి కుర్తియనియు వాఁడుకగలదు. వీరచోడుని పిఠాపుర శాసనమునందు (హి. శా. 5. 70) పూణ్డిశబ్దము ఉపగ్రామము (సీవారు) అను నర్థమునఁ బ్రయోగింపఁ బడినది. "పొలగరుసు" అనఁగా పొలిమేరయని యర్థము. గరుసుశబ్దము సీమార్థమునం దిక్కాలమున నంతగాఁ బ్రయోగింపఁబడుట లేదు. కాని

ఏకభోగంబుగాఁగ నేలేటుగరుసు, గడలిసీమయు గౌతమీగంగమేర
కప్పురపుఁగ్రోవి కాశ్మీరఖండ మవధి, యేలె విశ్వకుటుంబి భీమేశ్వరుండు."

(భీమఖండము. 5. 88)

అని శ్రీనాథుఁడు ప్రయోగించెను.

"గురునకు నాకును బాండవు, లరయఁగఁ గూరిమికిఁ బాత్రమగుదురవైనన్
దురమునఁ జుట్టఱికంబును, గరుసిడికొను టేల కలుగుఁ గౌరవనాథా"

(ద్రోణపర్వము. ఆ 5. 123)

---

2. ఇండియన్ ఆంటిక్వరీ. సం. 14. పు. 46.

అనుభారతపద్యమునందు గరుసుశబ్దమునకు మర్యాదార్థము శబ్దరత్నాకరమందుఁ జెప్పఁబడినది. ఆంధ్రపదపారిజాతమునం దీప్రయోగము మోమోటమి యనునర్థమున కుదాహరణముగాఁ జూపఁబడినది. ఇదియే యధికసందర్భోచితముగానున్నట్లు కనఁబడుచున్నది. ప్రస్తుతశాసనమునందు గరుసుశబ్దము సీమార్థమునందుఁ బ్రయోగింపఁబడినదనుటకు సందేహము లేదు. పొలి "శబ్దము "పొల" యని అకారాంతముగా లిఖింపఁబడినది. ఇది "బలి" శబ్దభవము గ్రహింపఁబడుచున్నది. అకారాంతరూపము లేఖకదోషముగ నుండవచ్చునా? పొలిమేర యనఁగా గ్రామదేవతల కర్పింపఁబడు బలి విసర్జించెడి చోటు. బ సాధారణముగా గ్రామముచిట్టచివర విడుచుట యాచారము. "నడుమ" ప్రథమై వచనరూపము. మధ్యభాగమని యర్థము. ముయ్యలికుట్రు" అనఁగా మూఁ హద్దులు (ఎల్లలు) కూడుచోటు. సాధారణముగా నీశబ్ద మిప్పుడు "ముయ్యే గుట్ట"యనురూపమున వాడఁబడుచున్నది. వ్యుత్పత్తినిబట్టిచూడ నీరూపమె సా వుగాఁ దోఁచుచున్నది. "ముయ్యాలి' యనురూప మక్కాలమున వ్యవహారము నుండి పిదపలాక్షణికులచేఁగాని కవులచేఁగాని ప్రస్తుతరూపముగా సవరింపఁబ యుండిన నుండవచ్చును. "కుట్రు" అన సంయోగస్థానము. కూడుధాతు వలనఁ బుట్టినదని నాయభిప్రాయము. "గుట్ట" దీనివికారమే యయియుండనోపు విమలాదిత్యుని కాలమునాఁటి రణస్తిపూఁడిశాసనమునందు(హిం. శా.. 6. 34 "ముయ్యలికుట్టు" "ముయ్యలకుట్టు"అనియు రెండవకులోత్తుంగ చోళునిచిట్టె రు శాసనమందు (ఇం.ఆం. 14. 55) "ముయ్యనికుట్రు" అనియు నీశబ్దము ప్రయోగింపఁబడినది.

"తాడ్లతేవ"—తాడిచెట్లతేవ., తాడ్ల, తాళ్లశబ్దమునకుఁ బూర్వరూపముగ నూహింపఁదగియున్నది. తేవశబ్దమునకుఁ బ్రయోగాంతరము స్ఫురింపకున్నది. సందర్భమునుబట్టి దానికి సమూహము అనియర్థము చెప్పికొనవచ్చును. "గో తేవ" "ఏలువగడ్డయ." వీనియర్థము విచార్యము.

"మట్టితోఁడి." ఇందు తోఁడియనఁగా తోడనున్న, కలిసియున్న య యర్థము చెప్పికొనవలయును. గడ్డయ, చింతయ, ఇవి గడ్డ, చింతశబ్దము విశేషరూపములు. యకారమవధారణార్థకమనుట సమంజసముగాఁ గనఁబడదు

---

3. విజయాదిత్యామ్మరాజునాఁటి కలుచుంబఱ్ఱు శాసనములోఁగూడ "పొలగరుసు" అని యున్నది. (హిం. శా. 7. 177.)

స్థలనిరూపణము:—రెండేఋలనడిమిదేశమునఁ గల నందమపూండియను గ్రామము నగ్రహారముగా రాజరాజు నారాయణుఁడను కవీశ్వరున కిచ్చినట్లుశాసనమునఁ దెలుపఁబడియున్నది. రెండేఋలనడిమిదేశమనఁగా గోదావరిజిల్లాలో గౌతమీనైన తేయముల నడుమనున్న అమలాపురముతాలూకాయనియు నందమపూండి యనఁగా నాతాలూకాలోనినందంపూఁడియనియు నూహింపఁదగియున్నది. ఈగ్రామమునకు హద్దులుగాఁ బేర్కొనఁబడిన యితరగ్రామములలో బిల్లెమపెద్దపూండియను గ్రామ మిప్పుడు కృష్ణారాయునిపెద్దపూఁడి యనియు, ముందరము, ముంజవరము, ముంజారము అనియుఁ బిలువఁబడుచున్నవి. తక్కిన గ్రామనామము లిప్పుడు వాడుకలో లేవు. గ్రామము లేనశించెనో లేక నామములు మారెనో తెలియదు.

కథాసంగ్రహము.—శాసనపూర్వభాగమందు శ్రీమన్నారాయణుఁడాదిగ రాజరాజు పర్యంతము చాలుక్యవంశావతారము వర్ణింపఁబడినది. విష్ణునాభీసంభూతుఁడగు బ్రహ్మమొదలు జనమేజయునిమనుమనిమనుమఁడగు నుదయనునివఱకు నుండిన పురుషులందరు పేర్కొనఁబడిరి. ఉదయనునియనంతరము ఏఁబదితొమ్మిదితరములవా రయోధ్యాసింహాసనాసీనులయి భూపరిపాలన మొనరించిన పిమ్మట విజయాదిత్యుఁడనురాజు విజిగీషుఁడయి దక్షిణాపథమునకుఁ జని యచ్చట రాజ్యముచేయుచుండిన త్రిలోచనపల్లవునితో యుద్ధమొనర్చి నిహతుఁడయ్యెను. అంతర్వత్నియగు నాతనిమహాదేవి పురోహితునితోడ ముడివేము అనునగ్రహారముచేరి యచ్చట విష్ణుభట్టసోమయాజియను బ్రాహ్మణునిచే నతనికూఁతురువలెఁ బెంపఁబడి విష్ణువర్ధనుఁడను కుమారుఁగనెను. ఆశిశువు మానవ్యసగోత్రహారీతపుత్త్ర ద్విపక్షగోత్రోచితకర్మలచే సంస్కృతుఁడై దినదినప్రవర్ధమానుఁడగుచు నొక్కతఱిఁ దల్లివలనఁ బూర్వవృత్తాంతమంతయు నెఱిఁగి చలుక్యగిరికేగి యచ్చటి నందాదేవి నారాధించి కుమారనారాయణమాతృగణముల సంతృప్తులఁజేసి తద్దేవతానుగ్రహంబున శ్వేతాతపత్త్రైకశంఖపంచమహాశబ్దపాలికేతనప్రతిఢక్కావరాహలాంఛన పింఛకుంతసింహాసన మకరతోరణ కనకదండ గంగాయమునాది సామ్రాజ్యచిహ్నములం బడసి కదంబగంగాదిపార్థివుల నిర్జించి సేతునర్మదామధ్యస్థమగు సార్ధసప్తలక్షదక్షిణాపథమునంతయు నాక్రమించి యేలెను. చాలుక్యులకుఁ బూర్వ మాంధ్రదేశముమాత్రమె గాక కర్నాటద్రావిడ

దేశములు సయితముపల్లవులచే బరిపాలింపఁబడుచుండిన ట్లనేకశాసనములు తెలుపుచున్నవి. పల్లవరాజులలోఁ ద్రినేత్రుఁడు లేకముక్కంటి యనునతఁడు సుప్రసిద్ధుఁడు. తొమ్మిదిసంవత్సరములకుముందు నేను కడపమండలముజమ్మలమడుగులో నున్నప్పుడు వ్రాసిన యొకచిన్న వ్యాసమున విష్ణువర్ధనుఁడుపుట్టిన ముడివేము అనుగ్రామము జమ్మలమడుగుతాలూకాలో కుందేటియొడ్డున నున్న "పెద్దముడియము" అయి యుండవచ్చునని యభిప్రాయపడియుంటిని. ఇప్పటికిని నాయభిప్రాయ మదియే. విష్ణువర్ధనున కాపేరును హారీతపుత్రగోత్రసంజ్ఞయు మాతామహునమానుఁడగు విష్ణుభట్టసోమయాజివలనఁ గలిగెనని యూహింపఁ దగియున్నది. శాసనములోని "దుహితృనిర్విశేష"మ్మను క్రియావిశేషణ మీయూహను బలపఱచుచున్నది. దక్షిణాపథమునకు సేతునర్మదలు దక్షిణోత్తర సీమలు. పూర్వపశ్చిమసముద్రములు పూర్వపశ్చిమసీమలు. ఆదేశమునం దానాఁటి కేడులక్షలయేఁబదివేలగ్రామములు గలవనువ్యవహారమునుబట్టి సార్ధసప్తలక్షమను సంజ్ఞకలిగినది. ఈప్రకారమే పాకానాఁటి కిరువదియొక్కవేలదేశమనియుఁ గమ్మనాఁటికిఁ బదియాఱువేలదేశమనియు సంజ్ఞలుగలవు. షట్సహస్రదేశముకూడఁ గలదు. ఇదియే యాఱువేలవారు పూర్వముండెడిదేశమని నిశ్చయింపఁదగియున్నది.

ఇఁకఁ గథననుసరింతము. విష్ణువర్ధనుఁడాదిగాఁ జాలుక్యరాజులు తొలుత పశ్చిమదేశము నాక్రమించి మహారాష్ట్రదేశములోనున్న కల్యాణపట్టణము రాజధానిగా భూపరిపాలనమొనర్చి క్రమక్రమముగా రాజ్యమభివృద్ధిచేసి తుదకు వేంగీదేశమునుగూడ స్వాధీనముచేసికొనిరి. ఈవిస్తృతరాజ్యమునఁతయు నేకఛత్రముగానేలిన సత్యాశ్రయునితమ్ముఁడు కుబ్జవిష్ణువర్ధనుఁడు తొలుత వేంగీదేశము నన్నగారియాజ్ఞానువర్తియై పాలించుచుఁ దుదకు స్వతంత్రుఁడయ్యెను. నాఁటినుండి చాలుక్యవంశము ప్రాక్పశ్చిమసంజ్ఞలచే రెండుశాఖలుగా విభజింపఁబడియె. కుబ్జవిష్ణువర్ధనుఁడు ప్రాక్చాలుక్యవంశకర్త.

శాసనమందు కుబ్జవిష్ణువర్ధనుఁడాదిగా రాజరాజువఱకు నుండినరాజుల పేరులును వారివారిరాజ్యకాలమును వివరింపఁబడినవి. అవియెట్లన.

1. కుబ్జవిష్ణువర్ధనుఁడు 18 సంవత్సరములు రాజ్యము చేసెను. అతని కొడుకు 2. జయసింహుఁడు 33 సంవత్సరములును, అతని తమ్ముఁడు 3. ఇంద్ర

రాజు 7 దినములును, అతని సుతుఁడు 4. విష్ణువర్ధనుఁడు 9 సంవత్సరములును, అతని కొడుకు 5 మంగి యువరాజు 25 సంవత్సరములును, అతని పుత్రుఁడు 6 జయసింహుఁడు 13 వర్షములును, అతని తమ్ముఁడు 7 కొక్కిలి 6 మాసములును, అతనిని బాఱఁదోలి యతని యన్న 8 విష్ణువర్ధనుఁడు 37 వర్షములును, అతని పుత్రుఁడు 9 విజయాదిత్య భట్టారకుఁడు 18 యేండ్లును, అతని తనయుఁడు 10 విష్ణువర్ధనుఁడు 36 ఏండ్లును, అతని సూనుఁడు 11 విజయాదిత్య నరేంద్ర మృగరాజు 48 యేండ్లును, అతని సుతుఁడు 12 కలివిష్ణువర్ధనుఁడు 1½ యేండ్లును, అతని కొడుకు 13 గుణగవిజయాదిత్యుఁడు 44 సంవత్సరములును, అతని భ్రాత యగు విక్రమాదిత్య భూపతి కొడుకు 14 చాలుక్యభీముఁడు 30 సంవత్సరములును, అతని సుతుఁడు 15 కొల్లభిగండ విజయాదిత్యుఁడు 6 మాసములును, అతని సూనుఁడు 16 అమ్మరాజు 7 సంవత్సరములును, అతని పుత్రుఁడు విజయాదిత్యుఁడను బాలుని ద్రోసివైచి 17 తాడపుఁడు 1 మాసమును, అతని యుద్ధమందు జయించి చాలుక్యభీముని తనయుఁడు 18 విక్రమాదిత్యుఁడు 11 మాసములును, పిమ్మట తాడపరాజ సుతుఁడగు 19 యుద్ధమల్లుఁడు 7 సంవత్సరములును, అతని దేశమునుండి వెడలఁగొట్టి యితర శత్రువుల నిర్జించి అమ్మరాజు తమ్ముఁడు 20 రాజభీముఁడు 12 సంవత్సరములును, అతని సూనుఁడు 21 అమ్మరాజు 25 సంవత్సరములును, అతని సవతి తల్లి కొడుకు 22 దాననృపతి 3 సంవత్సరములును భూపరిపాలన మొనర్చిరి. దానార్ణవుని (దాననృపతి) యనంతర మిరువదియేడు సంవత్సరములు దైవదుశ్చేష్టచే వేంగీదేశ మనాయకమయ్యెను. తదనంతరము దానరాజు తనయుఁడు 23 శక్తివర్మ శత్రులను జయించి రాజ్యము స్వాధీనము చేసికొని 12 సంవత్సరములు పాలించెను. అతని యనంతరమ మతని తమ్ముఁడు 24 విమలాదిత్యుఁడు 7 సంవత్సరములు రాజ్యమేలెను. విమలాదిత్యునకు రవికుల లక్ష్మి యనందగు కుందవయందు రాజరాజు అను సుతుఁడు గలిగెను. ఆరాజరాజు 944 (వేదాంబురాశినిధి) శక సంవత్సరములు గతించిన పిమ్మట ననఁగా 945 సంవత్సరమున సూర్యుఁడు సింహరాశి యందుండఁగా నుత్తరాభాద్రానక్షత్రయుక్త కృష్ణద్వితీయా గురువారమున వణిజ్లగ్నమందుఁ బట్టాభిషిక్తుఁ డయ్యె.

ఇచ్చటఁ గొంచెమాగి పై వ్రాయఁబడిన గ్రంథమునందలి విశేషములు సంగ్రహముగా విమర్శింతము. చాలుక్యభీముడు చాలుక్యరాజులలో సుప్రసిద్ధ

లగు నారిలో నొకఁడు. ఈతఁడే గోదావరి జిల్లాలోఁ జాళుర్లకోటకుఁ జేరి యున్న భీమవర గ్రామమునందు భీమేశ్వరునిఁ బ్రతిష్ఠించెను. ఈదేవునకుఁ జాళుక్య భీమేశ్వరుఁడనియు, గ్రామమునకుఁ జాళుక్య భీమవరమనియుఁ బేళ్లు కూడఁ గలవు. పంచారామములలో నొకటియగు భీమారామమను క్షేత్ర మిదియె. (శ్రీనాథుని భీమఖండముఁ ఆ. 4 చూచునది.) కొన్ని శాసనములలో దాననృపతి 30 సంవత్సరములు రాజ్య మొనర్చినట్లున్నది. కాని పెక్కు శాసనములలో నీశాసనమునం దున్నట్టులే దానరాజు మూఁడేండ్లు మాత్రమె దేశపరిపాలన మొనర్చినట్లును బిదప 27 సంవత్సరములు రాజ్యము నాయకమైయుండినట్లును జెప్పఁబడి యున్నది. దీనినే విశ్వసింపఁదగియున్నది.—

అనాయకశబ్దార్థ వివరణ మెక్కడను జేయఁబడి యుండ లేదు. చోళ రాజులిక్కాలమున వేంగీదేశము నాక్రమించికొని యున్నట్లు చోళచరిత్రమును దెలుపు కొన్ని పుస్తకములలో నున్నది. ఇందునకు నిదర్శనముగ గంజాము జిల్లాలో మహేంద్రగిరి శిఖరముమీఁదఁ జోళులనాఁటి చిన్న శాసన మొక్కటి యున్నదఁట. దానికి మించి మఱియే యాధారములును వేంగీదేశమునఁ గానరావు. మహేంద్రగిరి శాసనముం బట్టి దానార్ణవుఁ పిదపఁ జోళులీదేశము నాక్రమించిరను కొన్నను శక్తివర్మ వారలఁ బారఁదోలి రాజ్యమును దిరుగ సాధించుకొన్నట్లుస్పష్టముగా నీ శాసనముఁ జాటుచున్నది. శక్తివర్మ తమ్ముఁడగు విమలాదిత్యుఁడు చోళ రాజగు రాజరాజుకూతువివాహమగుటకూడఁ జాళుక్యులు చోళులతోఁ బోరి గెల్చిరనియె ధ్రువపఱచుచున్నది. ఈ దేశమునందు విజయుఁడగు రాజు విజితుఁడగు నాతనికూఁతుఁ బెండ్లియాడుట సుప్రసిద్ధమగు నాచారమయి యున్నది గాని తద్విపరీతాచార మశ్రుతపూర్వము. మనరాజరాజు కొడుకు కులోత్తుంగ చోళుఁ చోళసింహాసనమునకై తనతోఁ బెనఁగిన చోళులజయించి యాదేశ మాక్రమించి చోళవేంగీదేశముల నేకచ్ఛత్రముగా నేలితొలుతఁజోళులు వేంగీదేశము నాక్ర

4 రాజరాజునకు విజయాదిత్యుఁడను తమ్ముఁడుండినట్లును అతఁడు కులోత్తుంగ చోళుని ప్రతినిధిగాఁ గొంతకాలము వేంగిదేశమును బాలించినట్లును వీరచోళుని పిఠాపురశాసనము (హిం. శా. 5. 70) వలనఁ దెలియవచ్చుచున్నది. రాజరాజునకుఁ దమ్ముఁడుండినట్లు భారతమునందలి "సత్యాశ్రయకులశేఖర, నిత్యోదయ, రాజరాజనృప సుకవిజన, స్తుత్యమహాగుణవిమలా, దిత్యాగ్రజ విమలధీ మణీయా" (ఆ.ప. 4. 172) అను పద్యముకూడఁ దెలుపుచున్నది. రాజమహేంద్రవర రాజరాజుచేఁ గట్టింపఁబడినది. ఇందునకుఁ బ్రమాణము. "రాజమహేంద్రపురస్థాత రాజనరేంద్రుఁ డెక్కువ తాతయే విభునకు" (కావ్యాలంకారచూడామణి. ఆ 1. 4.)

మించిన నాఁటి ఋణము ద్విగుణముగాఁదీర్చెను. విమలాదిత్యుని దేవియగు కుందవ్వ రాజరాజను చోళరాజు కూఁతురు.ఆరాజరాజునామమే మన రాజరాజున కిడియుండును. ఈపేరు తత్పూర్వముచాలుక్య రాజులలో నెవ్వరికి లేదు.

నారాయణ కవికి రాజరాజు నందమపూండి గ్రామమును దానముచేసెనని తెలుపుట యీశాసనముయొక్క ముఖ్యోద్దేశము. ఈకవి హారీతసగోత్రుఁడు; అపస్తంబ సూత్రుఁడు; అతని తల్లి సామెకాంబ ; తండ్రి అకలంకాశంకనామాత్యుఁడు; పితామహుఁడు, కంచెనార్యుఁడు; ప్రపితామహుఁడు కంచెన సోమయాజి. ఈకవి సంస్కృత కర్ణాట ప్రాకృతపైశాచి కాంధ్రభాషలయందుఁ గవిరాజశేఖరుఁ డను ప్రతీతిని గాంచుటయగాక కవీభవ్రజాంకుశాష్టాదశావధారణ చక్రవర్తి సరస్వతీ కర్ణావతంసేత్యాది బిరుదముల నందినాఁడు. ఏతత్కవినామాంకితము లగు గ్రంథము లేవియు నింతవఱకుఁ గానరాలేదు. శ్రీమదాంధ్రభారతారంభమునందు

"ధరామరవంశ విభూషణుండు నా। రాయణభట్టువాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుఁడుం౯ సహా। ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగ౯॥ అని నన్నయభట్టారకునిచేఁ జెప్పఁబడిన నారాయణభట్టితఁడే యనుటకు సందేహము కానిపింపదు. ఇమ్మహాకవి కర్ణాటభాషయందుఁ గూడఁ బ్రౌఢకవి యఁట. పూర్వకాలమునం దాంధ్రకర్ణాటములయందు సమానముగాఁ గవిత్వము చెప్పెడువారు పలువు రుండినట్లగపడుచున్నది. పూర్వ చాలుక్య రాజ్యము ప్రత్యేకముగా విభజింపఁబడకముం దాంధ్రకర్ణాట దేశములు రెండును జాలుక్యుల యేలుబడికి లోఁబడి యుండుటంబట్టి యక్కాలంబున నీరెండు దేశంబులకు సంబంధ మెక్కువగా నుండి యచ్చటి వారిచ్చటికి నిక్కడి వారక్కడకును దఱుచుపోవుచుండుటచే నుభయభాషలయందుఁ బాండిత్యముండినవా రనేకు లుండినట్లు తోఁచుచున్నది. పూర్వచాలుక్యరాజ్య మేర్పడినపిదపఁగూడ నిప్పటి హైదరాబాదురాజ్యములోఁ జేరియున్న తెలుఁగు దేశమంతయుఁ బశ్చిమచాళుక్య రాజ్యములోఁ జేరియున్నది. కావున నాంధ్రకర్ణాటుల కత్యంత సంబంధము చాలుక్యరాజ్య కాలమునందుఁ గలిగియుండెను. సుప్రసిద్ధకర్ణాట కవియగు నాగవర్మతన జన్మభూమి వేంగీదేశమని ఛందోంబుధిలోఁ దెలిపె. ఇటీవల సుప్రసిద్ధాంధ్రకవులలో నాచనసోముఁడు పాల్కురికి సోముఁడును గన్నడమునందు సయితము కవులే. సకలభాషావాగనుశాసనబిరుదాంకితుఁడగు నన్నపార్యుఁడు గూడఁ గన్నడమునఁ గవితచెప్పఁ గలిగియుండెనని నిరాక్షేపముగాఁ జెప్పనొప్పు.

<u>శాసనకాలము.</u>—రాజరాజు పట్టాభిషేకదినము క్రైస్తవమానముచే 1022 సంవత్సరమున ఆగష్టు 16 వ తేదియు, నందంపూఁడిదానదినము 1063 సంవత్సరమున నవంబరు నెల 28 వ తేదియు నగునని కీల్హార్నుగారు నిర్ణయించినారు.

<u>కావ్యకర్త.</u>—శాసనకావ్యమును రచించినకవి నన్నియభట్టుగా నిందుఁ బేర్కొనఁబడిన సకలభాషావాగనుశాసనుఁడగు నన్నయభట్టారకుండు. నన్నశబ్దము పూర్వమికారాంతముగాఁ బ్రయోగింపఁబడుచుండి నట్లిందువలనఁ గనఁబడుచున్నది. నన్నినారాయణుఁడనుచో విశేషణముగా వాడఁబడినది. నన్నిచోడుఁడను నప్పుడుగూడ విశేషణముగనే గ్రహింపవలయును. నన్నిశబ్దమునకుఁ గన్నడభాషయందు బ్రియము, సుందరము అనియర్థము. అరవమునందు నన్నుశబ్దమునకును గూడ నిదియే యర్థము. తెలుగున ననుపుశబ్దమునకు నీశబ్దమునకు సాజాత్య మూహ్యము.

## చాలుక్యరాజరాజు నందంపూఁడిశాసనము. (శ. స. 966.)

1



(55 వ పుట కెదురుగ)

# మూలము.

## మొదటి పత్రము.

1. శ్రీధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో ర్నాభీ పంకరుహా ద్బ(భూ)వ
2. జగత స్స్రష్టా స్వయంభూ స్తతః। జజ్ఞే మానససూను రత్రి రితి య స్తస్మా న్మునే రత్రిత స్సోమో వం(శ)
3. కర స్సుధాంసు(శు) రుదిత శ్శ్రీకంఠచూడామణిః॥ తస్మా దాసీ త్సుధా సూతే ర్బుధో బుధనుత స్తతః। జాతః
4. పురూరవా నామ చక్రవర్తీ సవిక్రమః॥ (2) తస్మా దాయు రాయుషో నహుషః। నహుషా ద్యయాతి చక్రవ
5. ర్తీ వంశకర్తా। తతః ప్రాచీశః ప్రాచీశా త్సైన్యయాతి(ః)। సైన్య యాతే ర్హాయపతి[1] ర్హాయ
6. పతే స్సా(ర్వ)భౌమః। సార్వభౌమా జ్జయసేనః। జయసేనా న్మహా భౌమః। మహాభౌమా
7. దైశానకః। ఐశానకా త్క్రోధానః। క్రోధానా ద్దేవకిః। దేవకే రిచుకః। రిచుకా[2] దృక్షుకః। ఋ
8. క్షుకా న్మతివరః। సత్రాయోగ[3] యాజీ సరస్వతీనదీనాథః। తతః కాత్యాయనః। కాత్యాయనా న్నీలః।
9. నీలా ద్దుష్యంతః। తత్సుతః। ఆర్యః। గంగా యమునాతీరే యదవచ్ఛి న్నమ్ నిఖాయ యూపా న్క్రిమశః। కృ
10. త్వా తథా స్వ(శ్వ)మేధా న్నామ మహాకర్మా భరత ఇతి యో లభ తః[4] (3). తతో భరతా ద్భూమన్యుః। భూమన్యో స్సుహోత్రః।
11. సు(హో)త్రా ద్ధస్తీ। హస్తినో విరోచనః। విరోచనా దజమీలః అజమీలా త్సంవరణః। సంవర(ణ)స్య

---

1. తిః। హా. 2. ఋభుకః। ఋభుకా. 3. వరసత్రయోగ. 4. త.

## రెండవ పత్రము, మొదటిపుట

---

12. తపనసుతాయా స్తపత్యా శ్చ సుధన్వా। సుధన్వనః పరిక్షిత్ । పరిక్షితో భీమసేనః । భీమసేనా త్ప్రదీ

13. పనః। ప్రదీపనా చ్ఛ[5]ంతనుః। శంతనో ర్విచిత్రవీర్యః। విచిత్రవీర్యా త్పాండురాజః॥ పుత్రా స్తస్య చ ధ

14. ర్మజభీమార్జున నకులసహదేవాః । పంచేంద్రియవత్ పంచ స్వ విషయగ్రాహిన స్తత్ర॥ (4)
వృత్తం।

15. (యే) నాదాహి విజిత్య కా(ఖా) ండవ మథో గాండీవినా వజ్రిణా యుద్ధే పాశుపతా స్త్రమ(ం)ధకరిపో శ్చాలాభిదై

16. (త్యా) స్పహూ [6] నింద్రార్ధాసనమధ్యరోహి జయినా యత్కాలికే యాదికా న్హత్వా స్వైర మకారి

17. (వం)శవిపినచ్ఛేదః కురూణాంవిభోః॥ (5) తతోర్జునా దభిమన్యు। అభిమన్యో(ః) పరిక్షిత్ (1)

18. పరిక్షితో జనమేజయః। జనమేజయాత్ క్షేముకః । క్షేముకా న్నరవాహనః। నరవా

19. హనా శ్చ తానీకః। శతానీకా దుదయనః॥ తతఃపరంతత్ప్రభృతి ష్వవి చ్ఛిన్న సంతానే ష్వయోధ్యాసింహా

20. సనాసీనే ష్వేకా(ద్నా) [8]షష్టిచక్రవర్తిషు గతేషు తద్వంశ్యో విజయాదిత్యో నామ రాజా విజిగీషయా దక్షి

21. (ణా)పథం గ(త్వా) త్రిలోచనపల్లవ మధిక్షిప్య దైవదురీహయా లోకాంతర మగమత్ । తస్మి న్సంకులేపు

22. (రోహి)తేన పా(ర్ధ మ)ంతర్వత్నీ తస్య మహాదేవీ ముడివేము నామాగ్రహార ముపగమ్య శ్రద్ధా స్తవ్యేన

---

5. చ్ఛ. 6. స్పహూన్ । ఇంద్రా. 7. వ్వ. 8. ష్వేకోన.

## చాలుక్యరాజరాజు నందంపూండిశాసనము. (శ. స. 977.)

అ (2)



(56 వ పుట కెదురుగ)

చాళుక్యరాజరాజు. నందంపూఁడిశాసనము. (శ. స. 976)

ఇ (2)



(57 వ పుట కెదురుగ)

రెండవ పత్రము, రెండవపుట.

---

23. విష్ణుభట్టసోమయాజినా దుహిత్రి (తృ) నివ్విశేష మభిరక్షితా సతీ విష్ణువర్ధన న్నామ ప్రసూయ। తస్యచరు
24. మారకస్య మానవ్యసగోత్ర హారీతీ పుత్రద్విపక్షగోత్రక్రమోచితాని కర్మాణి కారయిత్వా తమ వర్ధయత్। సచ మా
25. (తాఏది) తవృత్తాంత స్స న్నిర్గత్య చలుక్యగిరా నందాం భగవతీం గౌరీ మారాధ్య కుమార నారాయణ మాతృగణాన్ సం తర్ప్య[9](ప్ప్య)
26. (శ్వే)తాతపత్రైకశంఖపంచ మహాశబ్దపాలికే (త) న్ప్రతిఢక్కా వరాహ లాంఛనపింఛకుంతసింహా(హా)సన
27. మకరతోరణ కనకదండ గంగాయము (నా) దీని స్వకులక్రమాగతాని (ని)క్షిప్త నీవ తత్సాంబ్రా[10]
28. జ్యచి(హ్న)ని సమాదాయ కదంబగంగాదిభూమిపా న్నిర్జిత్య సేతున ర్మదా మధ్యం సార్ధ
29. స ప్తలక్షం దక్షిణాపథం పాలయామాస॥ శ్లోకం(కః)। తస్యాసీ ద్విజయాదిత్యో విష్ణు
30. వర్ధనభూపతేః । పల్లవాన్వయజాతాయా. మహాదేవ్యాశ్చ నందనః॥ (6) తత్సుతః పొలకేశివల్లభః । తత్పుత్రః
31. కీర్తివర్మా। తస్య తనయః। స్వస్తి। శ్రీమతాం సకలభువనసంస్తూయమాన మానవ్యసగోత్రాణాం(o) హా
32. రీతిపుత్రాణాం కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యానాం మాతృగణపరిపాలితానాం. స్వామిమహాసేనపా
33. దానుధ్యాతానాం భగవన్నారాయణప్రసాద సమాసాదిత వరవరాహ లాంఛనే క్షణక్షణవశీకృతారా(తి)

---

మూడవ పత్రము. మొదటిపుట.

---

34. మండలానా మశ్వమేథావభృత (థ) స్నాన పవిత్రీకృతవపుషాం చాలుక్యానాం కుల మలంకరిష్ణో స్సత్యాశ్ర

---

9, సంత. 10, త్సామ్రా.

35. యవల్లభేంద్రస్య భ్రాతా కుబ్జవిష్ణువర్ధనో ష్టాదశ వర్షాణి వేంగీదేశ మపాలయత్। తదాత్మజో జయసింఘ (హ)

36. వల్లభ(ః)[11]త్రయ స్త్రింశతం। తదను జేంద్రరాజ స్స ప్త దినాని। తత్సుతో విష్ణువర్ధనో నవ॥ తత్సూను ర్మంగియు

37. వరాజః పంచవింశతిం। తత్పుత్రో జయసింఘ (హ) వల్లభ స్త్రయోదశ। తదవరజః కొక్కిలి ష్షణ్మాసాన్। తస్య

38. జ్యేష్ఠో భ్రాతా విష్ణువర్ధన స్త ముచ్చాట్య స ప్తత్రింశతం। తత్పుత్రో విజయాదిత్యభట్టారకో ష్టాద

39. శ। తద[12]నుజో విష్ణువర్ధన ష్షట్త్రింశతం। తత్సూను ర్విజయాదిత్య నరేంద్ర మృగరాజ శ్చాష్టా

40. చత్వారింశతం। తత్సుతః కలివిష్ణువర్ధనో ద్వ్యర్ధవర్షం। తత్సుతో గుణగ విజయాదిత్య

41. శ్చతు శ్చత్వారింశతం। తద్భ్రాతు ర్విక్రమాదిత్య భూపతే స్తనయ శ్చాలుక్యభీమ స్త్రింశతం। తత్సుతః కొల్ల

42. బిగండవిజయాదిత్యఃషణ్మాసాన్। తత్సూను రమ్మరాజ స్స ప్తవర్షాణి। తత్సుతం విజయాదిత్యం బా

43. ల ముచ్చాట్య తాడపో మాస మేకం। తం జిత్వా యుధి చాలుక్యభీమ తనయో విక్రమాదిత్య ఏకాద

44. శమాసాన్। తత్తా[13]డపరాజసుతో యుద్ధమల్లః స్స[14] ప్తవర్షాణి। తం యుద్ధమల్లం పరిహృత్య దే

---

మూఁడవపత్రము, రెండవపుట.

---

45. శా త్ప్రేషీతశేషా మపి శాత్రవాణాం। జ్యేష్ఠో మమ్మరాజానుజ రాజభీమో భీమ స్సమా ద్వాదశ రక్షతి స్మ॥ (7)

46. తత్సూను ర్విజనతారాతి రమ్మరాజో నృపాగ్రణీః। పంచవింశతి వర్షాణి వేంగీభువ మపాలయత్॥ (8) ద్వైమాతు

---

11. భత్రయ. 12. తత్తనుజో. 13. తత్సూదప. 14. స.

చాళుక్యరాజరాజు నందంపూడిశాసనము. (శ. స. 976.)

3 (౨)



(58 వ పుట కెదురుగ)

చాలుక్యరాజరాజు నందంపూండిశాసనము. (శ. స. 976.)

3 (౮)



(58 వ పుట కెదురుగ)

47. రోమ్మనృపతే ర్దానార్ణవనృపో రాజభీమ నృపతనయః। విద్యాకలాపచతురః। చ[15]తురంతధరా మశా త్సమా స్త్రి

48. స్త్రిః॥ (9) అనుదానార్ణావా ద్దా[16]సీ ద్దైవదు శ్చేష్టయా తతః। సప్త వింశతి వర్షాణి వేంగీమహీ రనాయకా॥ (10)

49. అత్రాంతరే దానవకేంద్రసూను శ్శ్రీశక్తివర్మా సురరా ట్సధర్మా। య శ్శౌర్యశక్త్యా వినిహత్య

50. శత్రూ న్స ద్వాదశాబ్దా న్సమరక్ష దుర్వీం॥ (11) తత స్తదనుజో వీరో విమలాదిత్యభూపతిః। మ

51. హీమండలసామ్రాజ్యప్రాజ్యలక్ష్మీ మ్ముదా దధాత్॥ (12) తేజో యదీయ మఖిలక్షితిపాలమౌలిమాలా స్వభా

52. దమలరత్నరుచిచ్ఛలేన। పాతిస్మ సప్త స సమా స్సకలా న్ధరిత్రీం భీమప్రతాపమహితో బిరుదాంకభీమః॥ (13)

53. తస్మా ద్విమలాదిత్యా ద్రవికులలక్ష్మ్యాశ్చకుందవమహాదేవ్యాః। [17] నిజ గుణవశీకృతాఖిలరాజన్యో రాజరాజవిభు ర

54. జని॥ (14) య స్సోమవంశతిలకః శకవత్సరేషు వేదాంబురాశినిధివర్తిషు సింహగే ర్కే। కృష్ణద్వితీయదివసోత్త

55. రభాద్రికాయాం వారే గురో ర్వణిజిలగ్నవరే భిషిక్తః॥ (15) ఇంద్రో యథా దివ ముదారయశ [18] స్తథోర్వీం శౌర్యేణ

---

నాలుగవపత్రము, మొదటిపుట.

---

56. శ (శ్వ) దఖిలా మభిరక్షితుం యః। శ్రీవిష్ణువర్ధననృపో మకుటం పరార్ధ్యం మూర్ధ్నా దధా న్మణిమయూఖవి

57. భాసితాశం॥ (16) సంరక్షతి క్షితితలం క్షపితారివర్గో మార్గేన యేన నయశాలిని మానవేన[19]। ప్రీతాః

58. ప్రజా(నిజపవి)త్రచరిత్రతో మైః ప్రక్షాలయంతికలికాలకలంకపంకః(కం)[20]॥ సన్మగ్గేన [21] కులం కలాగమ

---

15. చతురశ్చతురంత. 16. దా 17. కుందవామదేవ్యాః. 18 శాస్త. 19. శ్రీమచ్చలుక్య వంశశి। ఖామణిమనుమార్గ రాజకంఠీరవ ... (భార. ఆ. ప. 3. 1.) 20. ఘనదురితానుబంధ కలికాలజదోషతుషారసంహతిం। దనయుదయప్రభావమునదవ్వ గజోపిజగజ్జనానురం। జనమగు... (భార. ఆ. ప. 1. 5) 21 సన్మార్గేణ.

59. (ప)రిజ్ఞానేన(కుర్వ్వ)న్ ధియం దీనానాథజనార్థితార్థ నివహత్యాగే లక్ష్మీం స్థి(స్థి)రాం। సంపూర్ణ్ణామలచంద్రికా

60. (విశ)దయా కీర్త్యా జగద్గీతయా యో దిక్చక్ర మలంకరోతి సుతరాం చాలుక్యచూడామణిః॥ (18)[22]యస్యస్ఫారభుజా

61. కృపాణదళితా రాతీభకుంభస్థల ప్రోన్ముక్తామలవృత్త మౌక్తికచయ స్సంగ్రామరంగాంతరే। ధత్తే వీ(ర)

62. రసక్రియాభినయనప్రస్తావనా లక్షితాం వీరశ్రీర (చి) తాంజలిప్రవికస త్పుష్పోపహారశ్రి

63. యః[23] ॥ (19)[24] పిత్రో ర్వ్వంశగురుర్బభూవతు ద్వలం యస్య స్ఫుర త్తేజసా సూర్య్యాచంద్రమసా నిరస్తతమసా

64. (దే)వౌ జగచ్చక్షుషీ। దంష్ట్రాకోటిసము ద్ధృతాఖిలమహీచక్రం మహ త్క్రీడయా విష్ణో రాదివరాహరూపమ

65. భవ ద్యచ్ఛాసనే లాంఛనమ్॥ (20) స సర్వ్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధ నమహారాజాధిరాజో రాజపరమేశ్వరః పర

66. మభట్టారకః॥ పరమమాహేశ్వరః పరమబ్రహ్మణ్యః శ్రీరాజరాజదేవో రెండెఱులనడిమి విషయనివా

67. సినోరాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినః సమాహూయ మంత్రిపురోహిత సేనాపతిమై[25] వరాజదౌవారిక

68. ప్రధానసమక్షం మిత్థ మాజ్ఞాపయతి యథా[26]॥ హారీతగోత్రే హారిమూర్తి రాపస్తంభ[27] ద్విజశ్రేష్ఠవిభు

---

నాలుగవపత్రము, రెండవపుట.

---

69. ర్వ్వినీతః। సదా పురోడాశపవిత్రవక్త్రో విద్వానభూ త్కంచెనసోమ యాజీ॥ (21) తస్య శ్రీమా

---

22. ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునన్, మనీషి వి। ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగు ణాభిరతిన్ సమస్తవ। ర్ణాశ్రమధర్మరక్షణ మహామహిమన్ మహినొప్పుసర్వలో। కాశ్రయుఁడాదిరా జనిభుఁడత్యకలంకచరిత్ర సంపదన్ (భార. ఆ. ప. 1. 6)

23. యమ్. 24. ఘో, రాజిముఖోపలబ్ధ విజయప్రమదాశ్రితబాహుదండ. (భార. ఆ. ప. 1. 161.) 25. యువరాజ. 26. మంత్రిపురోహిత సేనాపతిదండనాయకదౌవారిక మహాప్రధా నానంత సామంతవిలాసినీపరివృతుండయి (భార. ఆ. ప. 1. 8. వచనము.) 27. స్తంబ.

చాళుక్యరాజరాజు నందంపూండిశాసనము. (శ. స. 976.)

4 (ఇ)



(61 వ పుట కెదురుగ)

70. న్ హిమకరకరప్రస్ఫురత్కీర్త్తిరాశే రాసీ త్సూనుః సకలవిదుషా మం చితః కంచెనా

71. ర్య్యః। యమ్ మన్యంతే యమ మరిగణాః కామధేనుం కవీంద్రాః క్రీడారామం పరమసుహృదో (జీ)

72. వితం బంధువర్గాః॥ (22) తస్యాత్మజో మహాత్మా సమజని శో [28] చాంజ నేయ ఇతి విదితః। ప్రజ్ఞాజితవాచస్ప

73. తి రకలంకాశంకనామాత్యః॥ (23) తస్యచ సుధర్మ్మపత్న్యా గుణశా లిన్యా శ్చ సామెకాంబాయాః। అథ

74. (వ) దను (ప్తి)తజగదుపకరణో నారాయణ స్తనయః॥ (24)యః సం స్కృతకర్ణ్ణాటప్రాకృతపైశాచి

75. కాంధ్రభాషాసు। కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వవిభవేన॥ (25) కవీ న్మనీషాలవ

76. దుర్వ్విదగ్ధాన్ మనోహరాభి ర్న్నిజసూక్తిభి ర్య్యః। కుర్వ్వ న్న గర్వ్వా న్పటుభి ర్బిభర్త్తిః [29] కవీభవజ్రాంకుశనా

77. మ సార్థమ్॥ (26)తస్మై సకలజగదభినుతగుణశా(లి)నే సరస్వతీకర్ణ్ణా వతంసా యాష్టాదశావధారణచక్ర

78. వర్త్తినే నన్నినారాయణాయ భవద్విషయే నందమపూణ్డినామగ్రా మోగ్రహారీకృత్య సోమగ్ర

79. హణనిమిత్తే ధారాపూర్వ్వక మస్మాభిస్సర్వ్వకరపరిహారేణ దత్తమితి[30] విదితమస్తువః॥ అస్య సీమా

80. నః॥ పూర్వ్వతః ఇయ్యూరియుంబిల్లెమపెద్దపూణ్డియుం బొలగరుసున పల్లమున కొండియగుంట

81. నకుమసీమా॥ ఆగ్నేయతః ఇయ్యూరియుం బిల్లెమపెద్దపూణ్డియు నెర పులయుం బొలగరు

82. సున ముయ్యలికుట్రు సీమా। దక్షిణతః ఇయ్యూరియు నెరపులయుం బొల గరుసున తాడ్లఫ్లే

83. వ సీమా। నైరృత్యతః ఇయ్యూరియు నెరపులయు ముందరమునయుం బొలగరుసున ముయ్యలికు

28. శో. 29. బిభర్త్తి. 30. దత్తఇతి.

84. ట్రుసీమా। పశ్చిమతః ఇయ్యూరియు ముందరమునయు మడకుఱితియు బొలగరుసునముయ్యాలి

85. కుట్రు సీమా। వాయవ్యతః ఇయ్యూరియు మడకుఱితియుం బిల్లెమపెద్ద పూణ్డియుం బొలగరుసున

86. ముయ్యాలికుట్రున గొల్లచేవ సీమా। ఉత్తరతః ఇయ్యూరియుంబిల్లెమపెద్ద పూణ్డియుం బొలగరు

87. సున(యే)ఉువగడ్డయ సీమా । ఐశాన్యతః ఇయ్యూరియు బిల్లెమపెద్ద పూణ్డియుంబొలగరు

88. సున మట్టితో డితాటియాద్ద చింతయ సీమా॥ అస్యోపరి న కేనచి ద్బాధా కరణీయా। యః క

89. రోతి స పంచమహాపాతకయుక్తో భవతి॥ తథా చోక్తం భగవతా వ్యా సేన ॥ స్వదత్తం పరదత్తం వా యో

90. హరేత వసుంధరాం షష్టిం వర్షసహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥ (27) బహుభి ర్వసుధాదత్తాబహు

91. భి శ్చానుపాలితా। యస్య యస్య యదా భూమి స్తస్య తస్య తదా ఫలమ్ (28) ఇతి॥ ఆజ్ఞప్తి రస్య

92. కటకాధ [31] రాజః కావ్యానాం కర్తా నన్నియభట్టో లేఖకో గండ చార్యః॥ ద్వాత్రింశత్తమే విజ

93. యరాజ్యవర్షే వర్ధ(మా)నే కృత మిదం శాసనః[32]॥

జయంతి - రామయ్య

---

31. కాధిరాజః. 32. శాసనమ్.

# ప్రకృతిశాస్త్రములు—వానియభివృద్ధి.

విద్య కళయని, శాస్త్రమని రెండు తెఱంగులు. చిత్రలేఖనము, శిల్పము మొదలగునవి కళలు. వైశేషికము, న్యాయము, మీమాంస మొదలగునవి శాస్త్రములు. మన ప్రాచీనులు చిరకాలముక్రిందటనే, న్యాయవైశేషికాది శాస్త్రములను రచించి, అప్పటికిఁ దమకుఁగల జ్ఞానమునువినియోగించి, ప్రకృతి పదార్థముల స్వభావము,స్వరూపముల విషయమై యాయా శాస్త్రములలోఁ జర్చించిరి. మనవారివలెనే, ద్వీపాంతరస్థులగు పాశ్చాత్యపండితులుగూడ నీ శాస్త్రములలోఁ గొంతవఱకుఁ బరిశ్రమము చేసియుండిరి. కాని, వీరు, అల్పసంతుష్టులును వేదాంతవాదులునగు మనవారివలెఁ దమకప్పుడు గలిగిన యసంపూర్ణజ్ఞానములోఁ దృప్తినొందక, శాస్త్రాభివృద్ధికిఁగాను, ఎందఱో తమతమ ధనమును, ఆయువును ధారవోసి, పట్టుదలతోఁ బనిచేసి, కాలక్రమమునఁ గ్రొత్తక్రొత్త సంగతులను గ్రహించి, భూగోళశాస్త్రము, రసాయనశాస్త్రము, భూశాస్త్రము, జీవశాస్త్రము, మొదలగు క్రొత్త శాస్త్రములను నెలకొల్పి, లోకమునకు మహోపకారము నొనర్చిరి. వీనినే ప్రకృతి శాస్త్రములందురు.

ఈప్రకృతి శాస్త్రాంశముల నన్నిటినిఁ జిన్నవ్యాసములో సవిస్తరముగ వివరించుట కవకాశములేదు. కాఁబట్టి, ముఖ్యాంశములను మాత్రము కొన్నిటి నిందు సంక్షేపముగ వ్రాయఁబూనితిని.

పూర్వకాలమునందు మనుష్యులు తమ సహాయార్థము కొన్ని పనిముట్లను వాడుకొనుచుండిరి గాని వానిని శాస్త్రానుసరణముగాఁ బరీక్షించి యుండలేదు. అట్టి పరీక్ష ప్రథమమున నిరువదిరెండు శతాబ్దములక్రిందట ఆర్కిమెడీసు అను సిసిలీద్వీప వాసస్థునిచేఁ జేయఁబడెను. ఇతఁడు తులాదండము మొదలగు నాని విషయమైన సమవస్థితిని విచారణచేయుటయే గాక క్రొత్తపనిముట్లు కొన్నిటిని నిర్మించెను. ఇంతేగాక నీటిలో ముంపఁబడిన వస్తువులు తమకు సమాన పరిమాణముగల నీటినిఁ దొలఁగించుననియు, నీటిలోఁదేలు వస్తువులు తమ భారమునకు సమానమైన భారముగల నీటినిఁ దొలఁగించుననియు విశదీకరించెను.

ఆర్కిమెడీసు కాలము తరువాత సుమారు 1800 సం॥ ల వఱకుఁ బైని జెప్పఁబడిన యంశములను గూర్చి చర్చ జరుగలేదు. కనుకనే పాశ్చాత్యులు గ్రీకు దేశీయుఁడైన ఆరిస్టాటిలు అను వేదాంతశాస్త్రజ్ఞుని యొక్క యభిప్రాయము నామోదించుచుండిరి. ప్రతివస్తువునకు బరువుగాని చులకఁదనముగాని సహజ గుణము గనుక భారమైనవి క్రిందుగాను జులకనైనవి మీఁదుగాను నుండునని ఆరిస్టాటిలు చెప్పెను. ఈకారణముచేతనే చులకనైన వస్తువులకంటె భారమైనవి భూమివైపు శీఘ్రముగాఁబడునని పూర్వులు నమ్మిరి.

గెలిలియో (1564-1642) అను నిటాలియాదేశీయుఁడు 16 వ శతాబ్దమునఁ బీజాపట్టణమున నొక పెద్దసభ గావించి పై యభిప్రాయము సరియైనది కాదనిబోధించెను. నిదర్శనమునకుఁగాను అతఁడా పట్టణములో నొకవైపునకు గొంచె మొరిగి యున్న గోపురమునెక్కి దాని శిఖరమునుండి పౌనుగుండు నొక దానిని నూరుపౌనులగుండు నొక దానిని నొక్కక్షణమందే విడిచెను. ఆ రెండు గుండ్లును భూమిని నేకముహూర్తమందే చేరి తాఁకెను. ఈ ప్రయోగము చూచినవారిలోఁ గొందఱు తమ మొదటి నమ్మకము తప్పని యొప్పుకొనిరి. తక్కిన వారు పూర్వాభిప్రాయమును మార్చుకొనుట కియ్యకొనని వారగుటంజేసి యింటికిఁబోయి యారిస్టాటిలు వ్రాసిన దానినిఁ బునః పఠనముచేసి తమ కన్నులారఁజూచినది యసత్యమని భ్రాంతిపడియుండిరి. గెలిలియో యిట్టి సులభమైన ప్రయోగముచేసి వాయు నోదనము (Pressure of air.) వలని యాటంకము కలుగని యెడల వస్తువులు భూమికి నొక్కక్షణమున వచ్చి చేరునని సిద్ధాంతము చేసెను.

మఱియు భూమివైపు పడుచున్న వస్తువులకు గతివేగము (Velocity) ప్రతిక్షణమధికమగుచున్నదనియు, ఏవస్తువయినను ఒకనిమిషమున నొకయడుగుదూరము పడినయెడల రెండునిమిషములకు నాలుగడుగులదూరము పడునని యుఁగని పెట్టెను. ఈప్రమాణము కనఁబఱచుటకు నతఁడొకబల్లను నేటవాలుగానుంచి దానిపైనొక గుండును జారవిడిచి యదిపడుచున్న కాలనిర్ణయము చేయుటకై యొకకుండలో నీళ్లుపోసి దానియడుగున నొకచిన్న రంధ్రముచేసి యాగుండు ఒక యడుగుదూరము పడునంతలోఁ గుండనుండికారిన నీటినిఁదూఁచెను. అట్లనే గుండు నాలుగడుగులు పడినంతలోఁ గారిననీటినిఁగూడఁ దూపఁగా నిది మొదట కారిన దానికంటె రెండింతలు తూఁగెను. దీనినిబట్టి మొదటికాలముకంటె రెండవది రెండింతలని తెలిసికొనెను.

ఇంతేగాక యేవస్తువయినను గొంతయెత్తుననుండి పడినప్పుడు భూమిని నెంతవేగముతో వచ్చిచేరునో యంతవేగముతో దానిని భూమినుండి పైకివిసరిన యెడల నది మొదటి యెత్తునకేయెగయుననియు, నేవస్తువయినను జలించుటకుఁ బ్రారంభించినయెడల నిరోధము లేకున్నచోఁ దానుపొందిన వేగముతోఁ దిన్నని మార్గమున నిరంతరము పోవుచుండుననియు గెలిలియో సిద్ధాంతపఱిచెను ఇట్లు గెలిలియో పూర్వసిద్ధాంతములను గల్లోలపఱిచి యాకాలపుశాస్త్రజ్ఞులబుద్ధిని నవీనమార్గములయందుఁ బ్రసరింపఁజేసెను.

ఈమహనీయునిచే విమర్శింపఁబడిన మఱియొక యంశమును జెప్పవలసి యున్నది. ఇతఁడు బాల్యమందొకనాఁడు పీజానగరమున నొకదేవాలయములోఁ బ్రార్థనచేయుచుండ వెలిఁగించి విడిచినతరువాత లాంతరొకటి వ్రేలాడుచు నూఁగుచుండుటనుజూచి, అది యొకనిమిషమునకు నెన్నిపర్యాయము లూఁగునోయని నిదానించెను. అప్పుడతనికిఁగల గడియారము తన చేతినాడియే. దీనినిబట్టి లాంతరెక్కువబారుగా నూఁగినను దక్కువబారుగా నూఁగినను నొకసారి యిరుప్రక్కలఁబోవుటకు నొకేకాలమవునని కనిపెట్టి, ఏవస్తువయినను ఒకదారమున వ్రేలాడఁగట్టియూఁచిన దానియూఁగుటనుబట్టి కాలనిర్ణయము చేయనగుననియు, దారము పొడవయినకొలఁది నొకసారి యిరుప్రక్కల నూఁగుటకు హెచ్చుకాలము పట్టుననియు నుదహరించెను.

17 వ శతాబ్దమున న్యూటను అనునతఁడు గెలిలియో యొక్క సిద్ధాంతములను బలపఱిచి యేవస్తువునకయినను దనకున్న స్థితిని మార్చుకొనుశక్తి సహజధర్మముగాదనియుఁ జలింపని యేవస్తువయినను గదలునట్లు చేయుటకుఁ బ్రోత్సాహకశక్తి యుండవలెననియు, అట్లావస్తువు కదలునపుడు ఆశక్త్యతిశయమునుబట్టి యావస్తువునకు గతివేగమేర్పడి యది నిరంతరము ఆశక్తికిలోనయి చలించుననియు, రెండువస్తువు లొకదానినొకటి తాఁకినపుడు మొదటిది యెంతశక్తితో రెండవదానినిఁ దాఁకునో అంతశక్తితోనే రెండవదిగూడ మొదటిదానినిఁ దాఁకుననియు వెల్లడిచేసెను.

ఈ సిద్ధాంతములఁబట్టి గ్రహములమార్గములు తిన్నగానుండక ప్రతిక్షణము మార్పుపొందుటకుఁ గారణము తెలిసికొనవచ్చును. ఈయంశము పరీక్షించుటకుముందు ఖగోళశాస్త్రము న్యూటను కాలము నాఁటికి నెట్టి స్థితిలోనున్నదో విమర్శింతము,

ప్రాచీనులు ద్వాదశ రాసులు సూర్యచంద్రులు గురుశుక్రాది పంచగ్రహములు మొదలగు వానియొక్క పరిచయమును గలిగియుండిరి. ఆగ్రహసంచారములఁ గనిపెట్టి కాలనిర్ణయముచేయఁ బ్రయత్నించుటచే ననేకఖగోళసిద్ధాంతములు పుట్టెను. సూర్యచంద్రనక్షత్రములు తూర్పుననుదయించి పడమట నస్తమించుచు భూమినిఁజుట్టి వచ్చుచుండుటచే భూమి అంతరాళమున వ్రేలాడుచున్నదనియు, అది గుండ్రముగా నున్నదనియు, దానిపరిమాణము కనిపెట్టవచ్చుననియు నూహించిరి.

రెండవ శతాబ్దమున టాలమీ అనునతఁడు భూమి బ్రహ్మాండమునకు మధ్యస్థమై యున్నదనియు, నితర గ్రహములన్నియు దానిఁజుట్టి వలయాకారమయిన కక్ష్యల (Orbits) గుండనిరోధములేనివై తిరుగుచున్నవనియు స్థిరపఱచెను. ఈసిద్ధాంతము పాశ్చాత్యులచే 1300 సం॥ వఱకు నంగీకరింపఁబడెను. మనపూర్వుల సిద్ధాంతముగూడ నించుమించుగా దీనినిఁ బోలియున్నది. పిమ్మట కోపర్నికసు (1473-1543) అనువాఁడు సూర్యునికిఁ జలనము లేదనియు, భూమి బ్రహ్మాండమునకు మధ్యస్థముగా నుండలేదనియు, సూర్యునిచుట్టు గ్రహములన్నియుఁ దిరుగుచున్నవనియుఁ గొన్నిగ్రహముల కక్ష్యలు భూమియొక్క కక్ష్యకంటె సూర్యునికిసమీపమనియు సిద్ధాంతపఱచి గ్రహముల స్తంభము వక్రగతి మొదలగువానిని శాస్త్రసమ్మతముగాఁ జేసెను. ఇంచుమించుగా నీసిద్ధాంతమును మనపూర్వులలో ఆర్యభట్టు అనునతఁడు చిరకాలము క్రిందటనే చెప్పెను. గెలిలియో కోపర్నికసుయొక్క సిద్ధాంతమును బోధించుచు, 1610 సం॥ దూరదర్శిని యంత్రము నొకదానినిఁ జేసి సూర్యునియందు నల్లనిమచ్చలున్నవనియుఁ, జంద్రునియందుఁ గొండలున్నవనియు, గురునికి నాలు గుపగ్రహములున్నవనియు, శుక్రునికి వృద్ధిక్షయములున్నవనియుఁ బ్రజలకుఁ గనఁబఱచు సిద్ధాంతమును బలపఱచెను. అందుచేత నతఁడు డెబ్బది సం॥ ల వయస్సుగలవాఁడై రోగపీడితుఁడైయున్నను వానిని రోమకపురీ మతాధికారులు వారిమతవిరుద్ధ సిద్ధాంతమును బోధించినందుకుఁగాను దండింపఁదలఁచి వానినిఁ గుటుంబజనమునుండి యెడఁబాపి చెఱసాలలోఁబెట్టి 'నీవిప్పుడైన నీవిరుద్ధ సిద్ధాంతములను సవాసనగా విడిచెదనని మాయందఱిమెదుటఁ గరారుచేసినయెడల నిన్నుహింసింపక విడిచిపెట్టెద"మని యాజ్ఞాపింపఁగా నతఁడు తత్కాలోచితముగా "నన్ను క్షమింపుఁడు. ఇటపైనీ సిద్ధాంతమును వెల్లడిచేయఁబోనని"పలికి వారికంధతికి భూమియందు సాగిలఁబడి మ్రొక్కి లేచుచున్న

ప్పుడు తనపాదతలముచే భూమినిందట్టి "అయిననపి చలించుచునే యున్న" దని మెల్లగా నుచ్చరించెను.

గెలిలియో సమకాలీనుఁడగు కెప్లరు అనునతఁడు గ్రహములయొక్క కక్ష్యలు (Orbits.) దీర్ఘవర్తములనియు (Ellipse), ఆదీర్ఘవర్తములలో సూర్యుఁడు కేంద్రమందుండి (Focus,) గ్రహముల నాకర్షించుటచే వాని గతుల యందు మార్పు కలుగుననియు, సూర్యునకు బహుదూరమందుండు గ్రహముల గతివేగము తక్కువగా నుండుననియు, నేగ్రహమునకైనను గతివేగవర్గను (Square of velocity.) దద్గ్రహమునకును సూర్యునికినిగల దూరముచే గుణించిన లబ్ధమొక్కటియేయనియుఁ గనిపెట్టెను.

ఖగోళశాస్త్రమీస్థితిలో నుండఁగా 1687 సం॥న న్యూటను మహాశయుఁడు భూమికి నాకర్షణశక్తి యున్నదనియు, నందుచేఁ జంద్రుఁడు భూమిచుట్టు వలయాకారమైన కక్ష్యగుండఁ దిరుగుచున్నాఁడనియు సమర్థించి చంద్రునికి భూమికినిఁ గల దూరము లెక్కించెను. ఇంతేగాక యట్టి యాకర్షణశక్తి గ్రహము లన్నిటికిని సూర్యునకును బ్రపంచమందుండు నన్ని వస్తువులకును గలదనియు, నాశక్తి యాయావస్తువులకుఁ గల దూరవర్గు(Square of distance,) అధికమైన కొలఁదిఁ దగ్గుచుండుననియు సిద్ధాంతము చేసెను. దీని సహాయముననే భూమి గుండ్రముగా లేదనియు ధ్రువములయందుఁ గొంచెము నొక్కి వేయఁబడినట్లున్న దనియు వక్కాణించెను. మఱియు న్యూటను సమకాలీనుఁడగు హాలీ అను నతఁడు 1682 వ సం॥ నఁ గనఁబడిన తోఁకచుక్క గూడ (దీనినే మనము 1910 వ సం॥ చూచితిమి) దీర్ఘవృత్తమునఁ బోవుచు 75 సం॥ ల కొకమాఱు మనకగుపడునని లెక్కించెను.

1781 వ సం॥ న హెర్షలు మహానుభావునిచేఁ బోల్పఁబడిన యురేనసు అను క్రొత్తగ్రహము గణితశాస్త్రజ్ఞులచే నియమింపఁబడిన స్థానమునకుఁ గాక దానికి కొద్ది దూరమునఁ గనఁబడుచుండుటచే నాగ్రహము నాకర్షించు మఱియొక గ్రహముండవలయునని యూహించి దీనికిని సూర్యునకును గల దూరమును దీని గరిమను ఆకాశమున నిది గోచరమగు స్థానమును లెక్కించి 1846 సం॥ సెప్టెంబరు తే 23 దిని దీనిని వెదకగా నియమితస్థానమున నిది కనఁబడెను. దీనికి నెప్ట్యూను అను పేరిడిరి. ఇట్టి నిదర్శనములచే న్యూటను సిద్ధాంతములకుఁ బ్రాబల్యము హెచ్చెను.

ప్రాచీనులు గ్రహసంచారములను బట్టి కాల నిర్ణయము చేయుచుండిరని పైనిఁ జెప్పఁబడెను. 1492 సం॥ న కొలంబను అమెరికాఖండము కనిపెట్టిన పిమ్మట నావికులు వర్తకవ్యాపారముమీఁద మహా సముద్రములు దాఁటి దూర దేశ యాత్రలు చేయ నారంభించిరి. వారు సముద్రమధ్యమం దున్నప్పుడు కాలము సరిగాఁ దెలియుటకై 1675 సం॥ న గ్రీనిచు అను పట్టణమున నక్షత్ర శాల నొకటి స్థాపించి నావికుల కుపయోగించు పంచాంగములను బ్రకటించు చుండిరి. వీనిని బట్టి చూడ ఖగోళశాస్త్రాభ్యాసమువలనఁ మనకుఁ గలిగిన మేలి తయని చెప్పఁజాలము.

గెలిలియో కనిపెట్టిన దూరదర్శిని యంత్రమును నవీనులు మిక్కిలివృద్ధి పొందించి దానిసహాయమున గ్రహబింబములను శోధించి చంద్రునియందు గాలి గాని నీరుగాని లేదనియు, నంగారకునియందు వాయువు మేఘములు ఉన్నను అదిదట్టమైన మంచుచేఁగప్పఁబడి వాసయోగ్యముకాదనియుఁ గనిపెట్టిరి. సూర్య బింబమునిట్లు పరీక్షించినచో దాని ధ్రువములనుండి మధ్యభాగము వఱకుఁ బుట్టు చుఁబోవుచునున్న యనేకములైన నల్లని మచ్చలుగానవచ్చును. ఈమచ్చలు 11సం॥ లకొకమా రదృశ్యమగుచుఁ దిరిగి క్రమక్రమముగా నభివృద్ధి నొందుచుండును వానిలోఁగొన్ని పెద్దవి దినమునకు 8000 మైళ్లు వేగముతోఁ బరుగిడుచుం డును. ఈమచ్చలు విశేషముగాఁ గనఁబడినప్పుడు సూర్యుని వేడిమి తగ్గిమనభూమి యంద నావృష్టి కలుగునని కొందఱు భ్రాంతినొందిరిగాని అందుకుఁ దగినంత నిద ర్శనము లేదు. సూర్యునియందు మిగులపెద్దమచ్చలు పుట్టినప్పుడు సూర్యునిబిం బమునందనేకాణువులు వెలువడి దిక్కులయందే వ్యాపించి యతివేగముతో భూమినిఁదట్టి దాని అయస్కాంతశక్తి (Magnetism) యందు మార్పులు కలుగఁ జేయును. ఈ కారణముననే 1905 సం॥ న సూర్యునియం దైరోపాఖండమునకొక పెద్దమచ్చకానవచ్చినప్పుడు భూమియందంతటను గొన్నిగంటలవఱకుఁ, దంతీవా ర్తలుసంపుటకు వీలులేకపోయెను.

పూర్ణగ్రహణము పట్టినప్పుడు సూర్యుని బింబముచుట్టు కాంతిపుంజ ములు వెలువడుచుండును. ఇందుఁ గొన్నియక్కడక్కడ గులాబిరంగు గలవియై యొకానొకప్పుడు రమారమి రెండుమూఁడు లక్షలమైళ్ల వఱకు వ్యాపించును. ఇవి జ్వలించుచున్న హైడ్రోజను (Hydrogen) కాల్సియము (Calcium) హీలి యము (Helium) మొదలగు మూలద్రవ్యములవలనఁ గలుగుచున్నవి. సూర్యుని

యందున్న మూలద్రవ్యములను శాస్త్రజ్ఞులు ఎట్లు కనుఁగొనిరో కాంతి స్వభావ మెట్టిదియో యించుక విమర్శింతము.

మనము నేత్రములను గొంచెముమూసి వెలుతురును జూచినయెడల నది బహుసూక్ష్మములై ప్రకాశమానమైన సూటిగానుండు గీతలవలెఁ గానవచ్చును. ఆగీతలగుండఁగాంతి ప్రసరించు చున్నదనుటకనేకప్రమాణములు కలవు. ఈకారణమునుబట్టి న్యూటను మహాశయుఁడు కాంతిదాయకమగు ప్రతివస్తువునుండియు బహుసూక్ష్మము లయిన కణములు వెలువడి నలుదిక్కులఁ దిన్నని మార్గముల నతివేగముతోఁ బోవుచున్నవని యభిప్రాయపడెను. ఈ సిద్ధాంతము వలన ననేకాంశములు సమర్థింపఁ బడకుండుటచే 19-వ శతాబ్దమున యంగు, ప్రెనెలు, మొదలగు ప్రకృతి శాస్త్రజ్ఞులు దాని నంగీకరింపలేదు. ఒకచెఱువునందు నిశ్చలముగానున్న నీటిమీఁద మనమొక చిన్నరాతిని విసరినయెడల నారాయి నీటికిఁ దగిలినస్థలముచుట్టు గుండ్రములైన చిన్న చిన్న యలలుపుట్టి చాలదూరము వ్యాపించును. అటువలెనే సర్వవ్యాపకమయి బ్రహ్మాండమంతయు నావరించుకొని యున్న యాకాశముయొక్క యణువుల పరిస్పందము (Vibration) చేఁ బుట్టిన చిన్న చిన్న యలలగుండఁ గాంతి మనలను జేరుచున్నదనియుఁ గాంతి యొకవిధమైన శక్తి (Energy) యనియు యంగు మొదలగు వారి యభిప్రాయము.

స్వచ్ఛమైన యద్దపుముక్కలవంటి రెండు టూర్మలీను అను ఖనిజము యొక్క ముక్కలను మన కంటియెదుట నొకదాని వెనుక నొకటి సమముగా నుంచి వానిగుండ నొక కిరణమును బోనిచ్చిన యెడల వెలుఁగు కొంచెము తక్కువయి కానవచ్చును. ఆ ముక్కలలోఁ గంటికి దగ్గఱగా నున్నదాని నడ్డముగాఁ ద్రిప్పిన వెలుఁగు గానరాదు. ఈ ప్రయోగమునుబట్టి యాకాశముయొక్క యణువుల పరిస్పందము (Vibration) రెండు విధములైన దనియు నది కిరణము ప్రసరించుచున్న మార్గమునకు నడ్డముగా నుండుననియుఁ గనిపెట్టఁబడెను. త్రిభుజాకారముగల యొకయద్దపుఁ బట్టకము (Prism) గుండఁగాంతిరేఖలు పోయి యొక తెల్లని తెరమీఁదఁ బడినప్పుడు తెరమీఁద నింద్రధనస్సువలె నేడు రంగులయొక్క పఙ్క్తి యొకటి గనఁబడును. ఈరంగుల పఙ్క్తికి (Spectrum) అనిపేరు. కాంతి యేదైన నీ పట్టకముగుండఁ బోవునప్పుడు ప్రతికిరణము వేరువేరు రంగులుగల యనేకసూక్ష్మకిరణములుగా విభజింపఁబడును. ఈ సూక్ష్మకిరణములాపట్టకమందు సమముగా వంపఁబడక పోవుటచే నొకదానివెనుక

నింకొకటి తెరమీఁదఁబడి యొకరంగుల పఙ్త్తి నేర్పరచును. ఇట్టి ప్రయోగములవల్లఁ బ్రతికాంతి రేఖయు నేడుభిన్న రేఖలసమ్మేళనమునఁ గలుగు చున్నదను టకు సందియము లేదు.

ఈరంగుల పఙ్త్తినిఁజక్కఁగాఁ బరీక్షించుటకుఁగాను గాంతివిభాజకయంత్రము (Spectroscope) నొక దానినిఁ గనిపెట్టిరి. ఈ యంత్రముతో సూర్యరశ్మిచేఁ గలిగినరంగుల పఙ్త్తిని శోధించిచూడ దానియందనేక నల్లని గీతలు గానవచ్చును. దీపపుఁగిరణములచేఁ గలిగిన రంగులపఙ్త్తియందు గీతలు కానరావు. దీపము వెలుఁగుచున్నప్పుడు దానియం దుప్పుపొడిని వేసిన నదివాయురూపము చెందును. దానినుండి వచ్చుకాంతి నీ యంత్రమునఁ బరీక్షించిన యెడల దాని రంగుల పఙ్త్తియందు స్వర్ణవికారములైన రెండు రేఖలు స్ఫుటముగాఁ గానవచ్చును. ఆ యుప్పునుండి వచ్చుచున్న కాంతికంటె నెక్కువ ప్రకాశమానమైన మఱియొక దీపపుఁగాంతిని దానిగుండఁ బోనిచ్చి పిమ్మటఁ గాంతివిభాజక యంత్రమునుబట్టి పరీక్షించిన యెడల నీ రేఖలుకనఁబడక యవియుండుచోట రెండు నల్లని గీతలు కానవచ్చును. దీనినిఁబట్టి చూడ నాయుప్పు ఆదీపపుఁగాంతినుండి యీ రేఖలనిచ్చు కిరణములను హరించుటచే మొదటి ప్రకాశమానమైన రేఖలుపోయి వానిస్థానమందు నల్లని గీతలు కనఁబడుననియు నా కాంతియే లేనప్పుడు ఆ కిరణములను దానే ప్రసరింపఁజేసి యీ రేఖలనిచ్చుననియుఁ దోఁచుచున్నది. ఈ రేఖల సంఖ్యయు అవి కనఁబడు స్థలమును ఒక్కొక్క మూలద్రవ్యము (Element) నకొక్కొక్క విధముగా నుండుటచే వానినిబట్టి, పరీక్షింపఁబడు వస్తువునందుండు మూలద్రవ్యములను గనిపెట్టవచ్చును. సూర్యబింబము నావరించుకొని యున్న హైడ్రొజను, హీలియము మొదలగువాయువులు అతని కిరణములలోఁ గొన్నిటిని హరించుటచే వానిరంగుల పఙ్త్తియందు నల్లని గీతలగపడుచున్నవి. ఈగీతలేవస్తువుయొక్క కిరణములచేఁ బోఁగొట్టఁబడుచున్నవో కనుఁగొని సూర్యబింబముననుండు మూలద్రవ్యములన్నియు భూమియందుండునవియే యని సిద్ధాంతపఱిచిరి.

మన మొక గంటను వాయించినప్పుడు ఆగంటయొక్క యణువులు పరిస్పందమునుబొంది దానిచుట్టునున్న గాలియందుఁ జిన్నయలలు పుట్టించును. ఈ యలలు మనచెవిఁ దాఁకుటచే మనకు ధ్వని యను జ్ఞానము కలుగును. అటువలెనే యొకరాయిబడి యీాలవేసినప్పుడు కూడ నీ యలలుపుట్టి మనశ్రోత్రేంద్రియ

మును జేరి మనకాజ్ఞానము నిచ్చును. ఈ రైలుబండి మనలను సమీపించుచున్న కొలఁది నాయలలు అనేకములు మనచెవినిఁ దాఁకుటచే నాధ్వని స్ఫుటముగాను బిగ్గరగాను వినఁబడును. అది దూరముగాఁ బోవుచుండిన యెడలఁ గొన్ని యలలు మనచెవినిఁ జేరలేక ధ్వని హీనమవును. కావున రైలుబండి యెంతవేగముతో మనలను సమీపించుచున్నదో లేదా దూరముగాఁ బోవుచున్నదో ధ్వనిని బట్టియే మనము చెప్పఁగలము. అటువలనే చలించుచున్న యేనక్షత్రమైనను భూమిని సమీపించుచున్న యెడల నదిమిగుల స్ఫుటముగాఁ గనఁబడి దూరముగాఁ బోవుచున్నప్పుడు సూక్ష్మమై పోవును. అట్టి నక్షత్రకిరణములను గాంతి విభాజక యంత్రమునఁ బరీక్షించునపుడు దానియందగపడు గీతలు పూర్వస్థానములయందుండక కొంచెము ప్రక్కకుఁబోవుటను బట్టియు స్ఫుటముగాఁ గనఁబడుటను బట్టియు ఆనక్షత్ర మెంతవేగముతో భూమివైపు వచ్చుచున్నదో లేదా దూరముగాఁ బైకిఁబోవుచున్నదో కనిపెట్ట వచ్చును. (సశేషము.)

ఆ. నరసింహము.

## ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రికానుబంధము.

---

### పరిషన్నిబంధనలు.

I. పేరు.—ఈ సంఘమునకు "ఆంధ్రసాహిత్యపరిషత్తు" (Telugu Academy) అనిపేరు. శ్రీ పిఠాపురము రాజాగారగు శ్రీ రాజారావు కుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారును, శ్రీవేంకటగిరి రాజాగారగు మహారాజా సర్ వెలుగోటి శ్రీ రాజగోపాల కృష్ణ యాచేంద్ర బహద్దరు కె. సి. ఐ. ఇ, పంచహజారీ మన్సబ్దార్ గారును, దీనికిఁ బ్రతిష్ఠాపకులు.

II. దీని ప్రధాన వ్యవహారస్థానము మదరాసులో నుండవలెను.

III. ప్రయోజనములు.—తెలుఁగు భాషను, వాఙ్మయమును అభివృద్ధినొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహమొసంగుటయు నీ పరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈ పనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీ క్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి:—

i. తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకషమగు నిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii. తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁగల సాదృశ్యములను సాకల్యముగ నిరూపంచుచు నొకవ్యాకరణమును రచించిప్రచురించుట;

iii. ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషిక పదములను నిర్ణయించి వివరించు నొక శబ్దకోశమునుసిద్ధముచేయుట;

iv. ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహమొసంగుటయు, లభ్యము లయిన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్రమొకటి రచించి ప్రచురించుటయు;

v. సర్వ విషయములను గుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహమొసంగుట;

vi. ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii. తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించునొక పత్త్రికను బ్రకటించుట;

viii. తెలుఁగు వాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరిక సభలనేర్పాటుచేయుట;

ix. తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁగావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్త్రికలను, నొసఁగుట;

x. ఒకపుస్తక భాండాగారమును స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాతప్రతులుఁగూడనుండవలయును;

xi. తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్నికార్యములను జేయుట ;

విశేషము.—ద్రవ్యసంపత్తిని స్థితిగతుల ననుసరించి పైఁజెప్పిన మార్గములను గాలక్రమమున నవలంబించి కొనసాగింపవచ్చును.

IV. సంఘస్వరూపము.—ఈ పరిషత్తునకు స్థాపకులు, ఉద్ధారకులు, పోషకులు, యావజ్జీవ సభ్యులు, సాధారణ సభ్యులు, గౌరవార్థ సభ్యులును, సభ్యులుగానుందురు.

పరిషత్తుయొక్క మూలధనమునకు

(1) రు 5,000 లకుఁ దక్కువకాని మొత్తము నిచ్చువారు ఉద్ధారకులు.

(2) రు 1,000 లకుఁ దక్కువకాని మొత్తము నిచ్చువారు పోషకులు.

(3) రు 100 లకుఁదక్కువకాని మొత్తమునిచ్చువారు యావజ్జీవ సభ్యులు.

(4) రు 6 లకుఁ దక్కువకాని సంవత్సరపుఁ జందానిచ్చువారు సాధారణ సభ్యులు.

(5) సాహిత్యాతిశయకారణమునఁగాని, గ్రంథరచనకారణమునఁగాని, యితర కారణములచేఁగాని, తెలుఁగు వాఙ్మయమున కుపకార మొనరించి నట్లెంచి కార్యనిర్వాహకసభవారు సభ్యులుగా గ్రహించినవారు గౌరవార్థ(honorary) సభ్యులు.

V. పదునెనిమిది సంవత్సరములకు లోఁబడని వయస్సుగలవారెల్ల నీ పరిషత్తులో సభ్యులుగా నుండనర్హులు. సభ్యుఁడుగాఁ గోరు ప్రతి మనుష్యుఁడును బరిషత్తులో సభ్యులుగానున్న యిద్దరు ప్రస్తావన (nomination) చేసినమీఁదటఁ గార్యనిర్వాహకసభ్యులలో నధికసంఖ్య గలవారు తాము స్వయముగా సభకువచ్చియైనను, లేనిచోఁ దమకుఁ బ్రతినిధులుగాఁ బరిషత్తులో సభ్యులుగానుండు మఱియొకరినిబంపి వారిద్వారమునన్నైనను, అంగీకరించినయెడలఁ బ్రవేశముఁ గాంచును.

VI. కార్యనిర్వాహకసభ— పరిషత్తులోని సభ్యులెన్నుకొనునట్టి యేఁబదిమంది సభ్యులు కార్యనిర్వాహకసభ (senate) గా నేర్పడి పరిషత్తుయొక్క కార్యముల నిర్వహించుచుండవలయును. కార్యనిర్వాహక సభాసదులు మూఁడు సంవత్సరముల వఱకును అధికారమునందుందురు. అనంతరము వీరినే మఱల నెన్నుకొనవచ్చును. మధ్యకాలమున నేర్పడు ఖాళీలు భర్తీచేయుటకుఁగావలసిన సభ్యులను మిగిలిన కార్యనిర్వాహక సభ్యులెన్నుకొనవలయును ; ఇట్లేర్పడినసభ్యులు వ్యవహితానంతరమున జరుగు కార్యనిర్వాహక సభసాధారణనియమనము (general election) వఱకును అధికారములో నుండవలయును. పారిషదులు కార్యనిర్వాహక సభవారిలో నొకరిని అగ్రాసనాధిపతిగను, మూవురను గార్యదర్శులుగను నియమించుకొనవలెను. అగ్రాసనాధిపతిరానిసభలలో, సభవారు తమలో నొకరిని దాత్కాలికాగ్రాసనాధిపతిగా నెన్నుకొనవలయును. కార్యనిర్వాహక సభవారియాలోచన లోనికి వచ్చు ప్రతివిషయమును సమావేశమయియున్న సభ్యులలో నెక్కువమంది యభిప్రాయానుసారముగఁ దీర్మానింపఁబడవలయును. సభ్యులు రెండుఘంటలు

రెండుపక్షములును సమానసంఖ్యగల వయినప్పుడు అగ్రాసనాధిపతి యభిప్రాయము అందేపక్షముం డునో యాపక్షానుసారము తీర్మానింపఁ బడవలయును. ఎన్నుకొనిన సభ్యులుగాక ప్రతిష్ఠాపకులును ఉద్ధారకులును గార్యనిర్వాహక సభయందు అధిక సభ్యులుగా నుండవలయును. ఇట్టి యధిక సభ్యులలో నెవరైనను సభకు స్వయముగా రాలేనప్పుడు కార్యనిర్వాహకసభలోఁ జేరియుండని పరిషత్సభ్యులలో నొకరినిఁదమకుఁ బ్రతినిధిగా నియమించి కొనవచ్చును.

VII. పరిషత్తుయొక్క ప్రయోజనములను నెఱవేర్చుటకు వలయునధికారమెల్ల కార్యనిర్వాహకసభవారికిఁ గలదు.

VIII. కార్యస్థానమునఁబనిచేయవలసిన వారిని నియమించుటకును, వారికి వేతనముల నిర్ణయించుటకును, వాఙ్మయ సంబంధమయిన పనిచేయుటకొఱకుఁ బండితుల నేర్పాటు చేయుటకును, వారి కీయవలసిన పారితోషికముల నిర్ణయించుటకును, బరిషత్తువారు సాధారణసభలో వెచ్చించుట కనుజ్ఞ యిచ్చినట్టి యావశ్యకమయిన యావత్తు వ్యయమును జేయుటకును గార్యనిర్వాహక సభవారి కధికారము కలదు. వెచ్చించుట కనుజ్ఞ పొందిన సొమ్మును లిఖితపూర్వకముగా హేతువుల నుదాహరించి యొకబాపతునుండి మఱియొక బాపతునకు మార్చుటకును గార్యనిర్వాహకసభవారి కధికారముగలదు.

IX. అగ్రాసనాధిపతిగారి యుత్తరవునకులోఁబడి కార్యస్థానమునఁబనిలోనుండువారిని నియమించుటకును దొలఁగించుటకును అధికారము కలిగి యగ్రాసనాధిపతిగారి పైపరామర్శకులోనై కార్యనిర్వాహక సభవారికిబదులు ఉత్తరప్రత్యుత్తర రూపకమగు వ్యవహారమును జరుపుచు పరిషత్తునకు రావలసిన సొమ్ములు రాఁ బట్టుచు నియ్యవలసినసొమ్ముల నిచ్చుచుండుటకును గార్యదర్శుల కధికారము కలదు.

X. గవర్నమెంటు ప్రత్రములు కొనుట మూలమునఁ గాని, యిండియా దేశపు ట్రస్టు ఆక్టులో వివరింపఁబడి అప్పుడప్పుడు కార్యనిర్వాహక సభవారిచే నిర్దేశింపఁబడిన యితర మార్గములఁ గాని పరిషత్సభ్యులనుండి పరిషత్తువారిచే నేమింపఁబడిన యిద్దఱు ట్రస్టీల పేరఁ బరిషద్ధనమును నిలువ చేసి భద్రపఱుపవలయును. తత్కాలమునకై పరిషద్ధనమును గార్యనిర్వాహకసభవారిచే నిర్దేశింపఁబడు బ్యాంకీలలో దేనియందైనను ట్రస్టీల పేరనుండవచ్చును. సాధారణవ్యయమునకుఁగాను రు 100 లు కార్యదర్శుల స్వాధీనమందు స్థిరముగా నుంపవలయును. ఇతర విధములగు వ్యయములకుఁ గావలసినసొమ్ము కార్యదర్శు లగ్రాసనాధిపతి యంగీకారముతోఁబంపు బిల్లులననుసరించి ట్రస్టీలు చెక్కుల రూపముగా నిచ్చుచుండవలయును. కార్యదర్శు లాయవ్యయములకు లెక్క నుంపవలయును; సాధ్యమయిన విషయములలో నెల్ల వ్యయమునకు నిదర్శన పత్త్రిముల (vouchers)ను సంపాదించి యుంపవలెను. ఆలెక్కను బ్రతి సవత్సరమును బరిషత్తువారు నియమించు తనికీదారు (auditor) తనికీచేయవలెను. ఈ తనికీదారు కార్యనిర్వాహక సభవారిలో నొకఁడై యుండరాదు.

XI. అధమపక్షము మూఁడుమాసముల కొకతూరియైనను గార్యనిర్వాహక సభవారు సమావేశము గావలయును.

XII. కార్యనిర్వాహకసభవారు సమావేశమయి జరుపవలసినకార్యములను నెఱవేర్చుట కధమపక్షము ఎనమండ్రు సభ్యులు సమావేశము కావలయును,

XIII. కార్యనిర్వాహకసభవారుచాంద్రమాన సంవత్సరము ముగిసిన పిమ్మట సాధ్యమై నంత త్వరలోఁ బరిషత్తువారి సాధారణసభనొకదానిని సమావేశము చేయింపవలయును. అసభ యందు సంగ్రహముగా గతసంవత్సరములో జరిగినపనియొక్క వివరమును, లెక్కలతనిఖీదారుని విమర్శన పత్త్రము (report) తోఁ గూడ నాయవ్యయవిజ్ఞాపనమును విన్నవించినపిమ్మట రాఁ బోవు సంవత్సరములో జరుగవలసిన కార్యక్రమము యొక్కయు, వ్యయవివరము యొక్కయు నిర్ణయముకావలయును. విన్నవించిన వివరముల (reports) యొక్క ప్రతులను, సభప్రారంభము కాక పూర్వము సభ్యులకీయవలయును.

XIV. కార్యనిర్వాహక సభవారి ప్రస్తావన ననుసరించి పరిషత్తువారొక యధ్యక్షుని గౌరవార్థముగా నియమించికొనవలెను. ఆయధ్యక్షుఁడొక సంవత్సరమువఱకు నా యధికారమునం దుండవలయును.

XV. ఈ విధుల తాత్పర్యముననుసరించి పరిషత్కార్య నిర్వాహణార్థమై యుపవిధుల నిర్మించి కొనుటకుఁ గార్యనిర్వాహకసభవారికధికారము గలదు.

XVI. పరిషత్తువారి సభ సమావేశము కావలసిన కాలమునకుఁ బూర్వమున నిరువది దినముల నోటీసును, గార్యనిర్వాహకసభా సమావేశమునకుఁ బూర్వము పదునైదు దినముల నోటీసును సాధారణముగా నియ్యవలెను.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు.

## (TELUGU ACADEMY)

యొక్క—

## విరోధికృత్సంవత్సరకృత కార్యనివేదనము.

ఆంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యచ్చటచ్చటఁ గొందఱు భాషాభిమానులీకాలమున పలుపు యత్నములను ఏకముఖముగావించుచు సామాన్యసమాజముల కలవిగాని ఘనకార్యములఁ బూనుటకు సమర్థమైన మహాసంఘ మొకటియుండుట యవశ్యమని పలువురకుఁ దోఁచియుండకపోదు. ఇట్టి యూహయే మ॥రా॥శ్రీ। జయంతి రామయ్యపంతులుగారికిఁగూడఁ బొడమి దానిం గుఱించి 1911 సంవత్సరోత్తరభాగమున సహృదయులగు పలువురు పెద్దలతోఁ బ్రశంసింపఁగా దానికి వారలందఱును సంతోషపూర్వకముగా నామోదించిరి. పిదప విద్వత్ప్రభువులగు శ్రీ వేంకటగిరి పిఠాపుర పురవరాధీశ్వరులతోఁ బ్రశంసచేయఁగా వారు తమ పూర్ణాంగీకారముద్రచే నాయుద్యమమును సాధ్యకోటిలోఁ జేర్చిరి.

1911-వ సంవత్సరారంభమందు రామయ్యపంతులుగారీవిషయమయి "యాంధ్రపత్రిక" యందొకవ్యాసమును బ్రకటించుటయేకాక యింగ్లీషుభాషను వేఱొక వ్యాసమును రచించి పూర్వోదాహృత ప్రభువరులకును శ్రీబొబ్బిలి మహారాజుగారికినిఁ బంపిరి. శ్రీపీఠాపురము రాజుగారప్పుడీపట్టణమునందే యుండుట తటస్థించినది. వారు సర్వజనవిదితంబగు తమసహజమాతృభాషాభిమానముచేఁ బురికొల్పంబడి యావ్యాసములోని విషయములఁ జర్చించుటకుఁ దమ భవనము (Dunmore House) లో నొకచిన్న సభ గావించిరి. ఆసభను

మ-రా-రా-శ్రీ, 1. రావుబహద్దూరు కందుకూరి-వీరేశలింగంపంతులుగారు.
,, 2. బ్రహ్మశ్రీ వేదము-వేంకటరాయశాస్త్రిలుగారు.
,, 3. మొక్కపాటి-సుబ్బారాయఁడుగారు.
,, 4. చెన్నాప్రెగ్గడ-భానుమూర్తిగారు.
,, 5. జయంతి-రామయ్యపంతులుగారు.
,, 6. గోటేటి-కనకరాజుగారు.
,, 7. వావిలికొలను-సుబ్బరావుగారు.
,, 8. దినవహి-హనుమంతరావుగారు.
,, 9. కొమర్రాజు-లక్ష్మణరావుగారు

అలంకరించిరి.

*

వ్యాసములో సూచింపఁబడిన ప్రకారము భాషాభివృద్ధికై మహాసంఘమొకటి స్థాపింపఁబడుట యావశ్యకమని సభ్యులందఱు నైకకంఠ్యముగా నంగీకరించి, దాని స్థాపించుట కొకసభను గావింప వలసినటులఁ దీర్మానించిరి.

ఆసభ 1911 మేనెల తే 12 దిని దిరువల్లిక్కేణి హిందూ హైస్కూలు సభాభవనమున సమకూడెను. శ్రీ పిఠాపురము రాజుగారు సభాధిపతిగా నుండిరి. అందు ఆంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యీక్రింద నుదాహరింపఁబడు వారు ప్రథమసభ్యులుగా 'ఆంధ్రసాహిత్యపరిషత్త'ను పేర నొక్క సమాజము స్థాపింపఁబడెను.

## ప్రథమసభ్యుల నామధేయములు.

మ-రా-రా-శ్రీ, శ్రీ వేంకటగిరి మహారాజుగారు, కె. సి. ఐ. ఇ,
,, శ్రీ బొబ్బిలిమహారాజుగారు, కె. సి. ఐ. ఇ.,
,, శ్రీ పిఠాపురమురాజుగారు.
,, యం. అంకినీడు ప్రసాదబహద్దరుగారు బి. ఏ., (చల్లపల్లి కుమారరాజు)
,, నడిమి తిరువూరు జమీాన్దారుగారు
,, శ్రీ మునగాల జమీాన్దారుగారు
,, శ్రీ పోలవరము జమీాన్దారుగారు
,, శ్రీ భద్రాచలము జమీాన్దారుగారు
,, శ్రీ రాజా వేంకటరంగయ్య అప్పారావు బహద్దరుగారు
,, శ్రీ మైలవరము జమీాన్దారుగారు
,, శ్రీ విక్రమదేవవర్మగారు
,, శ్రీ నాౘ్రేవు వేంకటకృష్ణరావు బహద్దరుగారు
,, శ్రీ ఉర్లాం పెద్దజమీాన్దారుగారు
,, శ్రీ ఉర్లాం చిన్నజమీాన్దారుగారు
,, శ్రీ పానుగంటి రామారాయనింగారు, ఎం. ఏ.,
,, ఆనరబిల్ న్యాపతి సుబ్బరావుపంతులుగారు, బి. ఏ. బి. ఎల్.
,, ఆనరబిల్ రాయబహద్దరు పిట్టి త్యాగరాయసెట్టిగారు, బి. ఏ.
,, ఆనరబిల్ ఎం. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. ఎల్.,
,, ఆనరబిల్ జి. రాఘవరావుపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.,
,, దివాన్బహద్దర్ ము. ఆదినారాయణయ్యగారు.
,, దివాన్బహద్దర్ కంచి. కృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.,
,, దివాన్బహద్దర్ ఎస్. వేంకటరామదాసునాయుఁడుగారు, బి. ఏ., బి. ఎల్.,
,, రాయబహద్దరు కం. వీరేశలింగముపంతులుగారు.
,, రాయబహద్దరు బ. న. శర్మగారు, బి. ఏ., బి. ఎల్.,
,, రావుసాహేబ్ టి. రాఘవయ్యగారు, బి. ఏ.,
,, పి. వి. కృష్ణస్వామిసెట్టిగారు, బి. ఏ. బి. ఎల్.,
,, గు. వేంకటరంగరావుగారు, ఎం. ఏ.,

" జ. రామయ్యపంతులుగారు, బి. ఏ. బి. ఎల్.,
" గో. కనకరాజుపంతులుగారు, బి. ఏ. బి. ఎల్.,
" వే. వేంకటరాయశాస్త్రిగారు.
" మొ. వేం. సుబ్బరాయుఁడుగారు, బి. ఏ.,
" నెమలి పట్టాభిరామరావుగారు, బి. ఏ.,
" చె. భానుమూర్తిపంతులుగారు, బి. ఏ.,
" కె. వి. లక్ష్మణరావుగారు, ఎం. ఏ.,
" ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి. సి. ఎం.,
" వి. సుబ్రహ్మణ్యంగారు, బి. ఏ., బి. ఎల్.,
" ఓ. రామదాసుగారు, బి. ఏ., బి. ఎల్.,
" పి. నారాయణమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్.,
" పు. నాగభూషణంపంతులుగారు, ఎం. ఏ., బి. ఎల్.,
" వి. రామేశంగారు, బి. ఏ., బి. ఎల్.,
" రెం. వేంకటసుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్.,
" టి. ప్రకాశంగారు, (బారిస్టర్-అట్-లా.)
" నాళం పద్మనాభముగారు, బి.ఏ,
" నాళం లక్ష్మీకాంతముగారు.
" పి. అయ్యన్న సెట్టిగారు.
" గు. వేం. అప్పారావుగారు, బి. ఏ.,
" ది. వే. హనుమంతరావుగారు.
" ధ. కృష్ణమాచార్యులుగారు (బళ్లారి)
" మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు.
" చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు.
" భిషఙ్మణి. పండిత డి. గోపాలాచార్యులుగారు, ఎ. వి. యస్.,
" సి. తిరుమలయ్యనాయుఁడుగారు, ఎం. ఆర్. ఏ. ఎస్.,
" ఏ. సి. పార్థసారథినాయుఁడుగారు.
" గట్టుపల్లి శేషాచార్యులుగారు.
" వావిలికొలను సుబ్బరావుగారు
" ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసునాయుఁడుగారు. బి.ఏ.,
" వి. రఘునాథశాస్త్రిగారు, బి.ఏ., బి.ఎల్.,
" టి. రామచంద్రరావుగారు, బి.ఏ, బి.ఎల్.,
" పి. వెంకటేశ్వరులుగారు, బి.ఏ., బి.ఎల్.,
" వి. వి. జోగయ్యగారు, బి.ఏ.,
" ఏ. కాశేశ్వరరావుగారు, బి.ఏ., బి.ఎల్.,
" కే. పి. పూర్ణయ్యగారు

,, స. రామానుజం సెట్టిగారు, ఎం.ఏ., బి.ఎల్.,

,, రివరెండ్. డి. అనంతంగారు, బి.ఏ.,

,, కె. రామానుజాచార్యులుగారు, ఎం.ఏ. బి.ఎల్.,

ఇట్లేర్పఱుపఁబడిన పరిషత్తుయొక్క కార్యనిర్వహణార్థము నిబంధనలరచించుటకు మ-రా-రా-శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారును, దినవహి వే. హనుమంతరావుగారును కార్యదర్శులుగాను, మ-రా-రా-శ్రీ పానుగంటిరామారాయనింగారు,యార్లగడ్డ అంకినీడు ప్రసాదబహద్దరుగారు, నెమలిపట్టాభిరామరావుగారు, మొక్కపాటి వేంకటసుబ్బారాయుఁడుగారు, పి. వి. కృష్ణస్వామిసెట్టిగారు, జయంతి రామయ్యపంతులుగారు, గోటేటి కనకరాజుపంతులుగారు, పండిత డి. గోపాలాచార్యులుగారు, వీరందఱును సభ్యులుగాఁ గల యొక యుపసంఘ మేర్పఱుపఁబడెను.

ఈసభయందే నిఘంటు నిర్మాణమునకుఁ గావలసిన ధనమంతయు శ్రీపీఠాపురమురాజాగారిచ్చెదరని వారియభిమతానుసారముగఁ దెలుపఁబడెను.

పై సంఘమువారు రచించిన నిబంధనలు తరువాత జఱిగిన మూఁడునాలుగు సభలలోఁ బరిష్కరింపఁబడి, ముద్రింపఁబడెను.

పిదప 1911 అక్టోబరు నెల 29 తేదిని పచ్చయప్పకాలేజి మందిరములోఁ బారిషదులు మఱియొకమాఱు సమావేశమైరి. ఈ సభకును శ్రీ పిఠాపురము రాజుగారే యగ్రాసనాధిపతులుగానుండిరి. పై యుపసంఘమువారు సిద్ధపఱచిన నిబంధనలు కొన్ని సవరణలతో నవలంబింపఁ బడినవి. నిబంధనలననుసరించి యేఁబదిమంది సభ్యులుగల కార్యనిర్వాహకసభ యేర్పఱుపఁబడి, దానికి మ-రా-రా-శ్రీ, జయంతి-రామయ్యపంతులుగారు అగ్రాసనాధిపతిగను, మ-రా-రా-శ్రీ, పురాణం నాగభూషణముగారు, వేదము-వేంకటరాయశాస్త్రిగారు, ఆచంట-లక్ష్మీపతిగారు, వీరు ముగ్గురును కార్యదర్శులుగను, దివాన్ బహద్దర్ కంచి-కృష్ణస్వామిరావు సి. ఐ. ఇ. గారు ఆనరబిల్ రావుబహద్దర్ పిట్టి - త్యాగరాయసెట్టి బి. ఏ., గారు వీరిరువురును ట్రస్టీలుగను నియమింపఁబడిరి.

మఱియు నీక్రింద వివరింపఁబడిన కార్యములను కొనసాగింపవలసినట్లు తీర్మానింపఁబడెను.

1. నిఘంటు నిర్మాణము.

2. ఆధునికశాస్త్ర విషయకగ్రంథములఁ బ్రయోగించుటకు పారిభాషికపద నిరూపణము.

3. పుస్తకభాండాగారము నేర్పఱచుట.

4. సాధారణముగా లోకులకందఱకుఁ దెలియవలసిన ముఖ్యాంశములఁ దెలుపు బాలశిక్షరూపమగు నొకగ్రంథమును రచించుట.

5. త్రైమాసిక పత్త్రికా ప్రకటనము.

6. విషయసూచకముగ నాంధ్రగ్రంథములపట్టీనొకదానిని సిద్ధపఱచుట.

7. పఠనీయ గ్రంథనిర్ణాయక సంఘములో ముప్వురు సభ్యులుమాత్రమేయుండి వారిలో నొకరును ఆంధ్రులుగాకపోవుటచే నాసంఘమంతయుపయుక్తముగా నుండనేరదు కావున సంఘములో నధమపక్షమైదుగురు సభ్యులైనను ఉండునట్లును సాధ్యమైనంతవఱకును వారాంధ్ర విద్వాంసులుగానుండునట్లును సెలవొసంగవలయునని గవర్నమెంటువారికిఁ బరిషత్తొక విజ్ఞాపనము బంపుకొనవలసినట్లు తీర్మానింపఁబడినది.

పరిషత్తునకు మూలధనముగా శ్రీ పిఠాపురమురాజుగారును, వేంకటగిరి మహారాజుగారును జెఱియొక పదివేల రూప్యముల నొసంగుటయకాక, శ్రీ పిఠాపురమురాజుగారు నిఘంటువునకుఁ గావలసిన యావద్ధనవ్యయమును దామేభరింప నంగీకరించిరి. వీరిరువురును బరిషత్తునకుఁ బ్రతిష్ఠాపకులు. మఱియు మునగాల జమీందారుగారు, ముక్త్యాల జమీందారుగారు, పోలవరము జమీందారు గారు, శ్రీపానుగంటి రామారాయనింగారును, జెఱియొక వేయిరూప్యములనిచ్చి పరిషత్పోషకులు గానుండుటకుఁ దమయంగీకారమును దెలిపిరి.

మఱికొందఱు యావజ్జీవసభ్యులుగను, ఇంకఁ గొందఱు సాధారణసభ్యులుగ నుండుటకంగీ రించిరి.

తర్వాత శ్రీ నడిమి తిరువూరు జమీందారుగారు పోషకులుగానుండనంగీకరించిరి.

## నేఁటివఱకుఁ బరిషత్తులోఁ జేరిన యావత్సభ్యుల వివరము.

2 ప్రతిష్ఠాపకులు.
5 పోషకులు.
25 యావజ్జీవసభ్యులు.
58 సాధారణ సభ్యులు.
90 మొత్తము సభ్యులసంఖ్య.

ఈ సంవత్సరము ఫిబ్రవరి నెల తే 11 దిని కాస్మోపాలిటన్ క్లబ్బునందు కార్యనిర్వాహకసభా ప్రథమసమావేశముజరిగి యందు నైనుదహరింపఁబడిన కార్యములు జరుపు పద్ధతుల నిర్ణయించుట కుపసంఘము లేర్పఱుపఁబడినవి.

1. నిఘంటునిర్మాణము:—నిఘంటు నిర్మాణ పద్ధతులనుగూర్చి మ-రా-రా-శ్రీ జయంతి - రామయ్యపంతులుగారొక వ్యాసమును వ్రాసియున్నారు. దానిని విద్వాంసులకుఁబంపి వారియభిప్రాయములు తెలిసినంతటనే కార్యారంభమునకుఁ దగిన యేర్పాట్లొనర్పఁబడును.

2. బాలశిక్షానిర్మాణము:—ఇందునకొక యుపసంఘ మేర్పఱుపఁబడెను. సాంఘికులు దమ యభిప్రాయములను వ్రాయుచున్నారు. ఈగ్రంథమునందు సర్వసాధారణముగా జనులకందఱకుఁ దెలియవలసిన ప్రాచీన నవీనవిద్యావిషయములన్నియుఁ గరతలామలకముగాఁ దెలుపఁబడవలసియున్నది. కావున విషయ నిర్ణయమధిక శ్రద్ధతోఁ జేయుట యావశ్యకము. ఆయా విషయములందారితేరినవారే యాయా భాగముల రచించునట్లేర్పఱుపఁబడును. వర్తమాన సంవత్సరమధ్యమున నీ గ్రంథము సిద్ధమగునని తలఁచెదము.

3. పుస్తకభాండాగారము:—దీనికి గ్రంథముల సేకరించుటకై నియమింపఁబడినవారు గ్రంథ విక్రేతల కందఱికినివ్రాసి వారువారు విక్రయించుగ్రంథముల పట్టీలను దెప్పింపవలసినట్లు తీర్మానించుకొనిరి. అనేకులయొద్దనుండి పట్టీలు తెప్పింపఁబడినవి. శీఘ్రకాలములోనే యీపని పూర్తియగును

ఇదివఱకచ్చుపడని గ్రంథముల నచ్చువేయుటకుఁగాని యచ్చుపడిన గ్రంథములలోని స్ఖాలిత్యములను నిర్ణయించుటకుఁగాని పాఠభేధములఁదెలిసికొనుటకుఁగాని తాటియాకుల వ్రాఁత ప్రతులు మిక్కిలి యుపయోగకరములనుట విశదమైనయంశమే. తిరుచినాపల్లిజిల్లా వాస్తవ్యుఁడును ఆంధ్రుఁడునగు మ-రా-రా-శ్రీ హరి. వి. సేతురామయ్యగారు పరిషత్తున కుచితముగా 14 తాటియాకుల పుస్తకముల నొసంగిరి. వీనిలో నొకటి రెండుదప్పఁ దక్కిన వన్నియు దక్షిణదేశమందుఁబు

ట్టిన గ్రంథములు. ఈయనయొనర్చిన సాహాయ్యమునకుఁ గృతజ్ఞతను దెలుపవలసియున్నది. దక్షిణదేశమందుఁగల యాంధ్రగ్రంథములను సాధ్యమగునంతవఱకు సంపాదించుట కీసేతురామయ్యగారిని ఆ యాప్రదేశములకుఁ బంపునట్లు నిశ్చయింపఁబడినది. ఆంధ్రభాషాభిమానులలో నగ్రేసరులుగానుండి కీర్తిశేషులైన రాయబహద్దర్ పి. అనంతాచార్లు సి. ఐ. ఇ., విద్యావినోది విశారదగారి భార్య శ్రీమతి రుక్మిణమ్మగారు వారి యాంధ్రభాండాగారమునుండి 3 గ్రంథముల నొసంగినందుకు మిక్కిలి కృతజ్ఞులమై యున్నారము. మఱియు కర్నూలు జిల్లాలో డిప్యూటీ కలెక్టరుగానుండు మ-రా-రా-శ్రీ, జయంతి-వెంకన్న పంతులుగారు పరిషత్తునకై యాజిల్లాలో రమారమి యేఁబది గ్రంథముల సంపాదించియున్నారు. ఇరువదియైదు గ్రంథముల నంపియున్నారు. వీరికి మనమెంతయుఁ గృతజ్ఞతాబద్ధులమై యున్నారము. శ్రీపుతాపురమురాజుగారు 5 గ్రంథముల నీపుస్తక భాండాగారమున కొసంగిరి. ఈగ్రంథములన్నిటి నామములను దీనికనుబంధముగానున్న పట్టికలోఁ గననగును.

4. కావ్యములందుపయోగింపఁబడుచున్న గ్రాంథికభాష సామాన్య పాఠకుల కగ్రాహ్యముగా నున్నదనియుఁ గావున నుత్తమజనులువాడెడి సంభాషణ భాషతో గ్రంథముల రచించినచో నది భాషాభివృద్ధికి దేశాభివృద్ధికి నుపకరించుననియుఁ గొందఱును, కావ్యములందుఁ దఱుచుగా శృంగారవర్ణనములు పచ్చిపచ్చిగానున్న వనియు, నట్టి వర్ణనములు పాఠకులకు దుర్బుద్ధులను గలుపు ననియుఁ, గావున నాగ్రంథముల నిషేధింపవలయుననియుఁ గొందఱును వాదించుటయేకాక తమ మతానుసారముగా వాఙ్మయమునందు మార్పులను గలుగఁజేయ యత్నించుచున్నారు. మఱికొందఱీ సంస్కరణ వాదమును ఖండించుచున్నారు. ఏతద్విషయమై వార్తాపత్త్రికలందుఁ గొంతవఱకుఁ జర్చలు జరిగి యున్నవి. ఈరెండువిషయములును భాషాక్షేమమున కత్యంతము సంబంధించియున్నవగుటచే నుభయపక్షవాదముల బలాబలములు నిర్ణయించి యెద్దియోయొక సిద్ధాంతమును సాధించుట పరిషత్తున కవశ్యకర్తవ్యమనియెంచి తద్విషయములంగూర్చి పండితాభిప్రాయ పురస్సరముగాఁ దమ సిద్ధాంతమును దెలుపుటకు రెండుపసంఘము లేర్పఱుపఁబడినవి. ఇంతియకాక యీ రెండు విషయములను సమగ్రముగాఁ జర్చించుట కీపట్టణమునఁ బండితగోష్ఠి యొకటి కూర్చుట యుక్తమని తోఁచి రాఁగల మేనెలయందట్టి సభ సమావేశమగునటుల నిర్ణయింపఁబడినది. ఈసభ కావించుటకుఁ గావలసిన ధన మంతయు శ్రీవేంకటగిరి మహారాజుగారిచ్చెదమనినారని తెలుపుటకు సంతసించుచున్నారము. ఏతద్గోష్ఠీనిర్ణయములంబట్టియుఁ దమకు లభ్యములగు నితరాధారములంబట్టియు నుపసంఘ సభ్యులు తమ యభిప్రాయముల నేర్పఱుచుకొని కార్యనిర్వాహక సంఘమునకు విశదపఱచిన మీఁదట సిద్ధాంతము లేర్పడి ప్రకటింపఁబడును.

5. పత్త్రికాప్రకటనము శీఘ్రకాలములోనే ప్రారంభింపఁబడును.

6. పఠనీయ గ్రంథనిర్ణాయక సంఘమునుగూర్చి గవర్నమెంటువారికి మనవి చేసికొనినమీఁదటఁ బరిషత్సభ్యులగు మ॥ రా॥ శ్రీ॥ జయంతి-రామయ్య పంతులుగారిని, వానిలికొలను సుబ్బరావుగారిని దత్సంఘ సభ్యులుగానియమించిరి. మనభాషాభివృద్ధికై గవర్నమెంటువారివలనను యూనివర్సిటీవారివలనను మనము పొందవలసిన వరము లింకనుగలవు. ఇంతవఱకు మన మనవి నంగీకరించినందులకు గవర్నమెంటువారికి మనము కృతజ్ఞులమై యుండవలసి యున్నది. మనవియు నందుపై వెలువడిన గవర్నమెంటువారి యుత్తరువును దీనికనుబంధముగాఁ జేర్పఁబడినవి.

శ్రీ మేరి సమేతజార్జి సార్వభౌమ ఢిల్లీపట్టాభిషేక సమయమున మన సభాపతిగారగు పీఠాపురమురాజాగారామహోత్సవసమయమున బరిషత్సభ్యులు [illegible] యానందమును దెలుపుచు శ్రీరాజ

దంపతులకొక తంత్రీవార్తను బంపఁగాఁ జక్రవర్తిగారావార్తను దయాపూర్వకముగా స్వీకరించి నట్లు ఆంతరంగిక కార్యదర్శి ద్వారమునఁ దెలిపిరి. పిదప "సార్వభౌమ సమ్మాననన" మను నొక చిన్న యుత్పలమాలికను ఆంగ్లేయార్థముతోఁగూడ ముద్రింపించి రెండు ప్రతులు శ్రీ రాజదంపతు లకు సమర్పింపఁబడుటకును మఱియొకటి శ్రీగవర్నరు గారికిఁగాను గవర్నరుగారి యాంతరంగిక కార్యదర్శిగారికిఁ బంపఁబడినవి. గవర్నరుగారు తమ ప్రతిని బ్రీతిపూర్వకముగా నంగీకరించిరి. కాని శ్రీసార్వభౌమ దంపతులకు సమర్పించుటకుఁగా నంపఁబడిన ప్రతులు వ్యవహార నిబంధనలఁబట్టి పంపుటకు వీలుపడదని గవర్నమెంటు ప్రధానకార్యదర్శిగారు తెలియపఱచిరి.

పరిషత్తును కంపెనీల ఆక్టు ప్రకారము రిజిష్టరుచేయుట కర్తవ్యమని తోఁచుచున్నది. సభ్యు లందునకు నంగీకరింతు రేని యట్లుచేయఁబడును.

గతసంవత్సరమునందలి యాయవ్యయము లీక్రింద సంగ్రహముగా వివరింపఁబడుచున్నవి.

| | | రు. అ. పై. |
|---|---|---|
| చందాముాలమున నిప్పటివఱకు ఆయము | | 261-0-0 |
| ఇందులకు వ్యయము. | రు. అ. పై. | |
| జీతములు ... ... | 62—8—0 | |
| కాగితములు, కలములు, ఇత్యాదులు | 5-15—6 | |
| అచ్చుకూలి మొదలగునవి ... | 61—8—0 | |
| తపాలాకర్చు ... ... | 23—1—9 | |
| బాడుగలు మొదలగునవి ... | 10—11—6 | |
| ప్రకటనకర్చు ... ... | 7—8—0 | |
| పుస్తకభాండాగారము ... | 4—8—0 | |
| ఇతరములగు చిల్లరవ్యయములు | 5—8—9 | |
| | మొత్తము | 180-13—6 |
| | నిలువ ధనము | 80-2—6 |

పరిషద్ధనము మదరాసు బ్యాంకీలో నిరువురు ట్రస్టీలపేర నుంపఁబడియున్నది. వర్తమానసం వత్సరమున సభ్యులందఱియొద్దను చందాలు వసూలు చేయఁబడును. క్రొత్తసభ్యులను జేర్చుటకును దగినయేర్పాట్లు చేయఁబడును.

ఇప్పటివఱకు నెక్కువపని జరిగియుండలేదని కొందఱకుఁ దోఁపవచ్చును. కృత్యాద్యవస్థ యగుట దీనికొక ముఖ్యకారణము. అంతియకాక. "అల్పారంభః క్షేమకరః" అని పెద్దలు చెప్పు దురుగదా. మఱియును, బరిషత్కార్యములు విద్వత్సమ్మతముగా నుండవలయుటంజేసి కొంతకాల విలంబ మనివార్యము. కొలఁదికాలముననే సాధనసంపాదనము పూర్తియగునుగాన వర్తమాన సంవ త్సరమునం దధికారంభములంగననగునని చెప్పసాహసించుచున్నారము.

చేసినపని కొంచెమైనను పరిషదుద్దిష్ట ప్రయోజనాత్కృష్ట్యముచేతను, ఆప్రయోజనములు పరిషత్సాధ్యములగునను విశ్వాసముచేతను మనపరిషత్తు తెలుఁగువారికి మాత్రమేకాక యన్యులకు సైత మాదరణీయమైనట్లు సూచనలగపడుచున్నవి. గతించిన నవంబరునెలలో పట్టపరీక్షలం గృతా ర్థులగువారికి యోగ్యతాపత్రికల నొసంగు నవసరమున యశశ్కాయులగు ఆనరబిల్. వి. కృష్ణస్వా

మయ్యరుగారు విద్యార్థుల కనుగ్రహించిన యుపదేశ మధ్యమున మన పరిషత్తును శ్లాఘాపాత్రముగ స్మరించియున్నారు. మఱియుఁ బలువురస్మద్దేశీయులేమి యాంగ్లేయులేమి మనయుద్యమమును ప్రశంసించినారు. సర్వజనాదరణీయమగు నీ సమాజమును స్థాపించుటకుఁ దత్ప్రతిష్ఠాపకులయొక్కయుఁ బిదపఁ దత్పోషకులయొక్కయు దేశభాషాభిమానౌదార్యములు ముఖ్యహేతువులు. మాతృభాషాసేవకులగు భూభర్తలు కలుగుట యాదినుండి యాంధ్రభాష చేసికొన్న సుకృతములలో ముఖ్యమైనదిగానున్నది. అట్టివారిప్పుడును బెక్కురు గలరు. కొందఱిదివఱకే సహాయభూతులైనారు. తక్కినవారుంగూడఁ దమ సహకారలాభము పరిషత్తునకుఁ గూర్తురుగాక. రెండుమూఁడు లక్షలరూపాయల మూలధనమైన నుండినఁగాని పరిషత్కార్యములు నిర్విఘ్నముగా నెఱవేఱఁజాలవు. సర్వేశ్వరుని కృపచేతను, వర్తమానభావి విద్వత్కవులయు భాషాభిమానులయు సాహాయ్యమునను మన యీపరిషత్తు నిరంతరాయముగాఁ బ్రబలుఁగాత.

మఱియు

> "మహిమున్వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
> న్మహనీయ స్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్మహా
> మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటించు నీ
> బహుళాంధ్రోక్తి మయ ప్రపంచము"

తన్మహాకవి సంకల్ప సామర్థ్యంబున నానాఁటి కభివృద్ధినొందుఁగాక.

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రథమసాంవత్సరిక సభావృత్తాంతము:

---

గడచిన యేప్రిల్ నెల 6-7 తేదులలో పచ్చెయప్పకాలేజి సభా భవనమున ఆంధ్రసాహిత్య పరిషత్తుయొక్క ప్రథమసాంవత్సరికసభ జరిగెను.

6-వ తేదిని జరిగిన వ్యావహారిక సభకు శ్రీ పిఠాపురము రాజుగారగ్రాసనాధిపతిగా నుండిరి. సభారంభమున అగ్రాసనాధిపతిగారు చేసిన యుపన్యాసములో—

పరిషత్తు స్థిరముగ వర్ధిల్లుటకై కార్యనిర్వాహకు లొకరితో నొకరు కలసి మెలసి పనిచేయుట యత్యావశ్యకమనియు, ఇతర భాషాపదముల మన లిపితో వ్రాయవలసి వచ్చినప్పుడు మనభాష కిపు డుండునక్షరములు కాక మూఁడు క్రొత్తయక్షరములఁ గల్పింప వలసియున్నదనియు ఆంధ్రులు తమలోఁ దాము మాట్లాడునపుడు జాబులు వ్రాసికొనునపుడును ప్రాయికముగా నారగ్లేయభాషనే వాడుటయు లేక యాంగ్లేయ పదము లెక్కువగాఁ గలసిన తెనుఁగును వాడుటయు మన భాష క్రమముగ నడుగంటి పోవుటకుఁ గారణములుగ నేర్పడుచున్నవి కావున, మనభాష యభివృద్ధి చెందవలె నన్న మనభాషయందే వ్యవహరించుట యవశ్యకర్తవ్య మనియు,మనవారు దీనిని బాటింపమి శోచనీయ మనియు, పాఠశాలలందాంగ్లేయభాషకుం గల ప్రాముఖ్యమాంధ్రభాషకును గలుగఁ జేయునట్లును, పఠనీయాంధ్ర గ్రంథ నిర్ణాయక సంఘములో నందతి నాంధ్రవిద్వాంసులనే నియమించునట్లును మనము సర్వథా ప్రభుత్వము వారిం బ్రార్థింప వలసిన దనియు, పరిషత్తువారు చేయఁబూనుకొన్న నిఘంటునిర్మాణ పత్త్రికాప్రకటన పారిభాషికపదనిరూపణాది మహాకార్యముల నతిశీఘ్రముగఁ బ్రారంభించి కొనసాగింప వలసిన దనియు, స్వకపోలకల్పితము లగు నాటకములు గాని, నవలలుగాని యుత్తమములనం దగినవి గత సంవత్సరమున నెవ్వరును బ్రకటింపకుంట మన దురదృష్టప్రభావ మనియు నిట్టిగ్రంథ రచనకుఁబరిషత్తువా రెక్కువగఁ బ్రోత్సాహ మొసంగ వలె ననియు, గ్రంథవిమర్శన విషయమున ననూయాపరత్వము మాని నిష్కల్మషబుద్ధియు స్నేహభావం బును వహించుట యావశ్యక మనియు, నిదివఱ కచ్చుపడని ప్రాచీనగ్రంథము లెవ్వరియొద్ద నేని యున్నచో వారు వానిని దాఁచి యుంచుకొనక స్వయముగాఁ గాని, యితరుల సాహాయ్యమునఁ గాని, వానిని ముద్రింపించి లోకోపకార మొనర్ప వలసిన దనియు నుడివిరి.

ఈసభయందుఁ జేయఁబడిన విరోధికృత్సంవత్సర కార్య నివేదనముంబట్టి పరిషత్తులో నిప్పటికి సుమారు 90 మంది సభ్యులున్నట్లు తెలిసినది. వారిలో శ్రీపిఠాపురము రాజుగారు, శ్రీ వేంకటగిరి మహారాజుగారు, వీ రిరువురును బ్రతిష్ఠాపకులు. శ్రీపానుగంటి రామారాయనింగారు (ఎం-ఏ) శ్రీనడిమి తిరువూరు జమీన్‌దారుగారు, శ్రీమునగాల జమీన్‌దారుగారు, శ్రీముక్త్యాలజమీన్‌దారు గారు, శ్రీపోలవరము జమీన్‌దారుగారు, వీ రైదుగురును పరిషత్పోషకులు. వీరుగాక 25 గురు యావజ్జీవ సభ్యులు. తక్కినవారు సాధారణ సభ్యులు.

విరోధికృత్సంవత్సరమునఁ బరిషత్సభాపతిగా నుండిన విద్వత్ప్రభువులు శ్రీపిఠాపురము రాజు గారే పరీధావిసంవత్సరమునఁ గూడ సభాపతిగానుండఁ బ్రార్థితులై తత్పదవి నంగీకరించి పారిషదుల నెంతయు ననుగ్రహించిరి.

* *

'దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స' యను శ్రీకృష్ణదేవరాయమహాకవి వాక్యము పరిషదుద్దేశ సూచకసంగ్రహ వాక్యము (Motto) గాను, శ్రీ సరస్వతీ ప్రతిమ లాంఛనము (Crest) గాను నిర్ణయింపఁబడినవి.

పిదప పరీధావి సంవత్సరమున కాదాయవ్యయనిర్ణయము చేయఁబడెను.

8-వ తేదిని కూడిన మహాసభకు, ఆరంభకాలమున శ్రీపిఠాపురము రాజుగారు రామిచ్చే వారు వచ్చువఱకును, రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు అగ్రాసనాధిపత్యమువహించిరి. శ్రీపిఠాపురము రాజుగారు అపరాహ్ణము రెండుగంటలకు విచ్చేసి, 4½ గంటలవఱకు నగ్రాసనమున నుండి తర్వాతఁ గార్యాంతరమున వెడలిపోయిరి. పిదప సభ ముగియువఱకు శ్రీపానుగంటి రామారాయనింగారగ్రాసనంబు నధిష్ఠించిరి.

ఈసభను పరిషత్సభ్యులుకాక యితరులనేకు లలంకరించిరి.

ఈసభలో నీక్రింద వివరింపఁబడురీతిని ఏడువ్యాసములు చదువఁబడినవి. సభాంతమున అగ్రాసనాధిపతులకును, ఉపన్యాసకులకును వందనము లొసఁగఁబడి, కార్యనిర్వాహకులచే నాగంతుకుల కెల్లరకు నుపహారతాంబూలాది సత్కారపూర్వకంబుగ నాతిథ్య మొసంగఁబడెను.

మొదటివ్యాసము.—శ్రీకాళహస్తి పురనివాసులైన బ్ర॥ శ్రీ॥ శతఘంటము వేంకటరంగ శాస్త్రులుగారు వ్రాసిపంపినది.

ఆవ్యాసమందు లక్షణము భాషకావశ్యకమనియు, లక్షణలక్షితమైన భాష వీనులకు విందు గావించు ననియు, సంస్కారనియమములఁ దొలఁగించి తెలుఁగుభాష వ్రాసినయెడల దానియొక్క సౌకుమార్యమునకును బరిశుద్ధతకును భంగముగలుగు ననియు నుడివి, గ్రంథభాషయు గ్రామ్యభాషయు నేకమైనచో గ్రంథభాష యడుగంటి భాషకు దుర్దశవాటిల్లు నని వక్కాణించిరి.

రెండవవ్యాసము.— 'ఆంధ్రవ్యాకరణము మార్పవలసి యున్నదా' యను శీర్షికతో శ్రీయనమండ్రి నారాయణమూర్తి పంతులుగారు వ్రాసిపంపినది.

వ్యాకరణ నియమముల నుల్లంఘించి గ్రామ్యభాష ప్రచరింపఁజేసి, తన్మూలమున గ్రాంథిక భాషకు నాశము గావింప వలయునని కొందఱు భాషాభిమానులు సేయు ప్రయత్నము కేవల దుష్ప్రయత్నమనియు, వాస్తవముగా గ్రాంథికభాషకును వ్యావహారికభాషకును విశేషభేదము లేదనియుఁ జెప్పుచు నందుకుఁ దగు నిదర్శనములం జూపి గ్రాంథికభాషకును వ్యావహారికభాషకు నుచ్చారణయందుఁ దప్ప వేఱుభేదములే దని తేల్చిరి.

మఱియు, తెలుఁగుభాష కిప్పుడు కావలసిన సంస్కరణము వ్యాకరణమును ద్రవ్వివేయుట కాదనియు, శైలిని సులభపఱుచుట, దీర్ఘసంస్కృతసమాసముల వదలివేయుట, రచన రసభరితముగఁ జేయుట, అర్థగాంభీర్యమును బాటించుట, శుద్ధమైన తెలుఁగునానుడి నుజ్జీవింపఁ జేయుట, ఇత్యాదు లవశ్యకరణీయము లనియుఁ బ్రతిపాదించిరి.

మూఁడవవ్యాసము.—అమలాపురనివాసులగు బ్ర॥ శ్రీ॥మల్లాదిసూర్యనారాయణశాస్త్రిగారిచే వ్రాసిపంపఁబడినది.

ఆర్యు లీదేశమునకు రాకమున్నే భాషలో నిపుడుతద్భవములుగాఁ జేరియుండు పదములకు సమానార్థకంబులగు దేశ్య పదంబు లీదేశభాషలో నున్నట్లే కనఁబడ దనియు, నొకపదార్థమును దెలుపు పదమొక్కటియే యుండుటచే నట్టివాని యర్థములనే తెలుపు తద్భవపదములు చేరిన

పిమ్మటఁ గూడ వాని యర్థము నెఱుంగఁ జాలని యప్పటివారిచేత నాతద్భవ దేశ్యములు రెండును గలసి యొక్కయర్థమునందే నిరర్థకముగా, అగ్గినిప్పు, కట్టెపుల్ల, బల్లచెక్క, అను నివ్విధముగా నిప్పటికి నల్లే యనేకులచే వ్యవహరింపఁబడుటయుఁ జూడ నిదేవిధముగా నిపుడు దేశ్యమని మనము వ్యవహరించు కొనుచున్న భాషలోఁ గూడ మనము గ్రహింప వలనుపడనట్లు మాఱిపోయిన తద్భవ పదములే యధికముగానుండుననియు, కావున నార్యులు రాక పూర్వము గ్రాంథికస్థితికి రాఁదగిన స్వతంత్రభాష యీదేశమున నుండలే దనియు విశదీకరించిరి.

నన్నయభట్టారకునిచే గ్రాంథికస్థితికిఁ దేఁబడిన యాంధ్రభాష మొదల నాంధ్రీకరణమై, పిదప విపులీకరణమై, తరువాత ననుకరణమై, తుదకు స్వకపోల కల్పనంబై, క్రమక్రమంబున నభ్యు దయస్థితికి వచ్చె నని చెప్పి, ఆయాకవులం బేర్కొని వారివారి కృతులను సంగ్రహముగాఁ బ్రశంసిం చిరి. మఱియు నాంధ్రభాష కవిత్రయమునాఁడు మొదలిప్పటివఱకు, బాల్యదశ, వర్ధమానదశ, యౌవనదశ, యను మూఁడుదశలలోఁ గ్రమక్రమాభివృద్ధి జెందె నని చెప్పి, ప్రకృతదశలో వచన రచన ప్రబలుచున్న దనియు, దానికిఁ జిన్నయసూరిగారు మార్గదర్శకులనియుఁ దన్మార్గానుసారులై శ్రీరావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగా రనేకగద్యప్రబంధములను నాటకములను సులభశైలిని రచించి భాష కుపకారమొనర్చి రనియుఁ జెప్పిరి.

వ్యాసాంతమున, సంస్కృతమునుండి యింకను ఆంధ్రీకరింపఁబడని కావ్యంబుల నాంధ్రీకరిం చుటయు; ఆంధ్రభాష కాధారములుగ నిప్పుడుండు వ్యాకరణములు శబ్దజాలమునంతయు వశపఱు చుకొనఁదగిన స్థితిలోలేవు గావున సిద్ధాంతకౌముదినిఁ బోలునొకయాంధ్రకౌముదిని సులభశైలిని విపులముగా రచించుటయు, మహానిఘంటు వొకటి నిర్మించుటయుఁ, గావ్యప్రకాశికంబోలు నలం కార గ్రంథము నాంధ్రమున రచించుటయు, దశరూపకంబును గొన్ని మార్పులతో నాంధ్రీకరించు టయు, చరిత్రగ్రంథముల వెలయించుటయు, జంతుశాస్త్రవృక్షశాస్త్రాదుల రచించి, వానికిఁ బారి భాషికపద నిఘంటువు రచించుటయు, నిత్యాద్యనేకకృత్యముల నాంధ్రభాషాభివృద్ధికై యింకను జేయవలసియున్న దని నుడివి విరమించిరి.

నాల్గవవ్యాసము.—తిరుపతివాసులగు బ్ర॥ శ్రీ॥ నాగపూడి కుప్పుస్వామయ్య, బి. ఏ, గారి చే ఆంధ్రగద్యపద్యకావ్యములంగూర్చి చదువఁబడెను.

పద్యకావ్యములంగూర్చి చర్చించుచుఁ గవిత్రయమువారి భావగాంభీర్యము, శబ్దసౌష్ఠవము, సందర్భశుద్ధి మొదలగు మహాగుణముల వర్ణించి, పిదపఁ గొంతకాలమునకుఁ గవులు పూర్వకవుల సామర్థ్యము లేమింజేసి శబ్దాడంబరముచే భావదారిద్ర్యమును గప్పఁబూని రని చెప్పి, సరస మగు కావ్యములో శబ్దాలంకారములును అర్థాలంకారములును ఉచితముగాను మితముగాను ఉండుటయే రసపోషణమును గలుగఁజేయు ననియు, శైలిద్రాక్షాపాకముగా నుండవలె ననియు, నిప్పుడు కవి త్వము చెప్పఁదలఁచినవారు వాగనుశాసనాది పూర్వకవులనే యనుసరింపవలయు ననియు, నుపపా దించి, కవిత్వవైలక్షణ్యముం జూపుటకుఁ గొన్ని గ్రంథములనుండి కొన్నిపద్యముల నెత్తిచదివివాని యందెల్ల గుణదోషములఁ గనఁబఱచిరి. మఱియు గద్యకావ్యములు పూర్వ మాంధ్రమందు లేవనియుఁ బద్యకావ్యములం దచ్చటచ్చటఁ గొన్నిగద్యము లున్నను, అవియుఁ బద్యశైలి నేరచింపఁబడిన వని యు, గద్యప్రబంధముల రచించుట యిటీవల నారంభమైన దనియు, గద్యము వ్రాయునపుడు చదువరులకు సులభగ్రాహ్య మగునట్లుగా మృదుశైలిని వ్రాయుట యుచితమనియు నొక్కి చెప్పిరి.

ఐదవ వ్యాసము.—శ్రీగిడుగు రామమూర్తిపంతులు, బి. ఏ. గారిచే నాంధ్రభాషాచారిత్ర ముం గూర్చి చదువఁబడెను.

భాష యొకరి యభిప్రాయముల నితరులకుఁ దెలియపఱచుటకు ముఖ్యసాధనమనియు, లోకములో సమస్తపదార్థములకును మాఱుటయే స్వభావ మనియు, జనులయొక్క స్వభావములు ఆచారవ్యవహారములు, ఊహాపోహలు, మాఱఁగాఁ దదనుసారముగా వారి భాషసైతము మాఱుచుండు ననియు, ఆప్రకారమే యాంధ్రులభాషసైతమప్పటప్పటికి మాఱుచువచ్చెననియు, జనులు సర్వసాధారణముగా వాడుచుండుభాషయే వారి భావములం జక్కఁగాఁ దెలుపఁగలదనియు, ఈ భాషకువ్యతిరేకముగా మన యాంధ్రభాషయందు గ్రాంథికభాషయొకటి కల్పింపఁబడిన దనియు, అది జనులకు దుర్గ్రాహ్యమనియు, ఉత్తమజాతి వారు వాడుకచేయు వ్యావహారికభాషయందు గ్రంథములు వ్రాయుట యింగ్లీషు మొదలగు ననేకభాషలలో నాచారమై యున్నదనియు, నాప్రకారమే తెలుఁగునఁగూడఁ జేయుట న్యాయమనియు నుపన్యసించిరి. మఱియు వారు కొన్ని పూర్వగ్రంథములలోఁ గళింగదేశమునకుఁ బశ్చిమమున నాంధ్రదేశమును, దానికి దక్షిణమునఁ దెనుఁగు దేశము నున్నట్లు చెప్పఁబడి యున్నదనియు, నాంధ్రదేశములోని వారు తమకు దక్షిణమున నున్న దేశము వారిని 'దక్షిణపువారు' అను నర్థమిచ్చునట్లు 'తెనుంగా' (తెన్=దక్షిణము, గా=బహువచన ప్రత్యయము) అని పిలుచుచుండుటవలనఁ 'దెనుంగు' అనుపదమును, పిదప దాని కాభాసమగు 'తెలుంగు' అనుపదమును బుట్టియుండవచ్చుననియు, ఈరీతి శబ్దములు, కుయింగా (కోదువారు), కళింగా (కాళింగులు) అనునవి కలవనియుఁ గొంతవఱకుఁ జెప్పి, యీవిషయమై చర్చవిపులముగా జరిగి పిదప సిద్ధాంత మేర్పడవలసి యుండుననియుఁ జెప్పిరి. వీరు ఇంకను జెప్పవలసిన యంశములు పెక్కులున్నను కాలహరణ మగు నని చెప్పకయే విరమించిరి.

ఆఱవవ్యాసము.—'ఆంధ్రభాష, దాని యుత్పత్తివికాసములు' అనుశీర్షికతో బ్రహ్మశ్రీ. చెన్నాప్రెగడ భానుమూర్తి బీ. ఏ., గారిచేఁ జదువఁబడెను.

ఈ వ్యాసమున మొదట నాంధ్రభాషయొక్క యుత్పత్తియు, నభివృద్ధియు సోదాహరణముగా వర్ణింపఁబడి, తుదను విమర్శనముం గూర్చి విపులముగాఁ జర్చింపఁబడెను.

సముచితమైన కావ్యవిమర్శ దేశమున వెలసి, కావ్యగుణదోషవిచక్షణయందభిరుచి సార్వజనీనముగ నుదయించి స్వతంత్రాభిప్రాయములు నిర్మించుకొను సామర్థ్యమలవడిననే కాని, కేవలముగాఁ బరప్రత్యయనివేదన మూలముననను, ఉపపత్తిప్రతిపాదన మూలముననను జనులకు భాషయొక్క యుత్కర్షవిషయమున జ్ఞానము పుట్ట దని చెప్పిరి.

మనభాషలో లక్షణగ్రంథములు నలంకారగ్రంథములును బెక్కులున్నను, ఆలక్షణములం బ్రత్యేకముగాఁ గృతులకన్వయించి వ్రాసిన కృతివిమర్శనరూపములగు గ్రంథములు లే వనియు, మొదట కావ్యసృష్టియుఁ బిదప విమర్శయు బయలుదేరవలె ననియు, నీరెండుకార్యములు నన్యోన్యసంస్కారకములై సదా సాగుచుండి భాషాభివృద్ధికిం దోడ్పడవలెననియుఁ జెప్పిరి. కవిహృదయమును గుర్తెఱుఁగుటకును, సారాసారవివేకమును దత్త్వ తత్త్వవిచక్షణయు లేక నిర్మింపఁబడు కావ్యాభాసములలోని దోషములం బ్రకటించుటకును, ఇంగ్లీషుపదము పడనిచో నాగరికలేకు లోపము వచ్చునను భయమువలననో యన సదా యింగ్లీషుపదములనే ప్రయోగించుచు దత్సమశబ్దములు జీర్ణముకాకయు నచ్చతెనుఁగుపదము లర్థముకాకయుఁ బూర్వకావ్యములఁ గ్రిందికిఁ ద్రో

క్కవైచి యట్టికావ్యరచనకుఁ దిలాంజలి యొసఁగి సానివాడలలోను, చాకిరేవులలోను, సారాదుకాణములలోను వ్యవహరింపఁబడుభాషతో నాధునికులు గొందఱు రచించు నాభాస కావ్యములఁ దూరు పాఱఁబట్టి యుత్తమకావ్యములం గొనియాడి భావికావ్య రచనకుం గార్యగతుల నిరూపించుటకును విమర్శగ్రంథము లావశ్యకము లనివక్కాణించిరి.

కావ్యమునకు విమర్శ కనకమున కగ్నిపరీక్షవంటి దనియు కవికిం బోలె విమర్శకునికిం గూడఁ బ్రతిభ కావలె ననియుఁ బ్రతిభలేని విమర్శకునకుఁ గవిహృదయము గోచరింపదనియుం జెప్పి యింకను గవికిని విమర్శకునికిని గావలసినపాశ్చాత్త్యసంప్రదాయ సిద్ధములగు పరికరముల నిరూపించి వ్యాసమును ముగించిరి.

ఏడవవ్యాసము.—బ్ర॥ శ్రీ॥ జయంతిరామయ్య పంతులు, బి. ఏ., బి. ఎల్., గారు దేశచరిత్ర పఠనమావశ్యక మనునంశమును గూర్చి యుపన్యసించిరి.

తొలుత చరిత్రశబ్దవ్యుత్పత్త్యర్థము నిరూపించి, దేశ చరిత్రమనఁగా దేశమునందలి జనులు సంఘరూపమున సలిపిన కార్యముల వృత్తాంతము, అనఁగా ఏయేకాలమునందు వా రేయే స్థితిలో నుండిరో,యేయేకారణములచేత వారి సాంఘికస్థితియం దేయే మార్పులు కలిగియుండెనో, ఏయే సందర్భములయం దేయే విధముగా నేయే యిక్కట్టుల వారు తప్పించి కొనఁగలిగిరో లేక యేయే యిక్కట్టులకు లోఁబడిరో యిత్యాది వృత్తాంతములను దెలుపుననియు, వృత్తాంతశ్రవణ మాత్రము వలనఁ గలుగు నానందాది తాత్కాలికఫలముకంటె వ్యక్తులయందు జాతివలె వృత్తాంతవిషయములయందు వ్యంగ్యార్థరూపకముగా నిమిడియుండు సామాన్యనీతులను(General principles) బోధించుటయే చరిత్రముయొక్క ప్రధానఫల మనియు, నట్టిసామాన్యనియమములను సాధించుట కుపకరించువిషయములు ముఖ్యములు తదితరము లముఖ్యములనియు, ఇట్లు ముఖ్యాముఖ్యవిచారము చేసి ముఖ్యాంశములనే చరిత్రమునందుఁ జేర్పవలయుననియుఁ జెప్పి చరిత్రస్వరూపమును నిర్ణయించిరి. అనంతరము చరిత్రమువలని ప్రయోజనములు ముఖ్యముగా రెండనియు, నందులో నొకటి యాత్మవిశ్వాసమును ఆత్మగౌరవమును గలిగించుటయనియు, ఆత్మవిశ్వాసములేనివాఁడు తనశక్తిని తా నెఱుఁగక శక్త్యనుగుణములగు కార్యములుచేయలేక పోవుననియు, ఆత్మసంభావనలేనివాఁ డధికారంభములఁ జొలికిఁ బోఁజాలఁడనియు, మనలకు సాధారణముగానాత్మగౌరవము తక్కువయని దేశాంతరుల యభిప్రాయమనియుఁ, నీలోపమును బోఁగొట్టుకొనినఁగాని యితోధికాభివృద్ధికి మనము కడంగ లేమనియు నీలోపమును బోఁగొట్టుకొనుటకు స్వదేశ పూర్వవృత్తాంతజ్ఞాన మావశ్యకమనియుఁ జెప్పిరి.

తదనంతరము పురోభివృద్ధికి మనము ప్రయత్నింప వలసిన మార్గములను నిరూపించుట చరిత్రమువలని రెండవప్రయోజన మనియు, జనులకువలె జనసంఘములకు సైతము పూర్వానుభవమువలన పృథక్పరికృతు లేర్పడుననియు, సాధారణముగా వారు చేయుకార్యములు తమప్రకృత్యనుసారముగానుండు ననియు, ప్రకృతిస్వభావము నెఱుంగక తత్ప్రతికూలము లగుయత్నము లొనర్చిననవి విఫలము లగుననియుఁ, గావున జనులకువలె సంఘములకును స్వస్వరూపజ్ఞానమావశ్యక మనియు నట్టి జ్ఞానము పూర్వవృత్తాంతశ్రవణము వలనఁ గలుగు ననియుఁ జెప్పి స్వదేశచరిత్రపఠన మత్యావశ్యక మని నిరూపించిరి.

# ఆంధ్రపండితసభావృత్తాంతము.

గతమేమాసము 15, 16 తేదులను చెన్నపురి పచ్చైయప్పకాలేజి సభాభవనమున నాంధ్రసాహిత్య పరిషత్తు వారొక యాంధ్రపండితసభం గూర్చిరి. ఆసభకు—

మ-రా-రా-శ్రీ. శ్రీచల్లపల్లి కుమారరాజుగారు.
,, మా. పాపారావునాయుఁడుగారు.
,, వే. రామదాసు పంతులుగారు
,, గూడూరు. రామచంద్రరావు పంతులుగారు.
,, మ. సాంబశివరావుగారు.
,, పోతరాజు. నరసింహముగారు.
,, గాడిచెర్ల. హరిసర్వోత్తమరావుగారు.
,, ఆర్. కృష్ణమాచార్యులు (విద్యానిధి. ఎం. ఏ.) గారు.
,, కే. వి. లక్ష్మణరావుగారు.
,, వేదము. వేంకటరాయ శాస్త్రిలుగారు.
,, తల్లాప్రగడ. సూర్యనారాయణరావుగారు.
,, డి. వి. రమణారావుగారు.
,, గురిజాడ. అప్పారావుగారు.
,, పురాణము. నాగభూషణముగారు.
,, జయంతి. రామయ్యపంతులుగారు.
,, టి. వరదరాజులునాయుఁడుగారు.
,, గోటేటి. కనకరాజుపంతులుగారు.
,, ఆచంట. లక్ష్మీపతిగారు.
,, యనమండ్రి. నారాయణమూర్తి పంతులుగారు.
,, పురాణపండా. కామేశ్వరరావుగారు
,, సుసర్ల. వేంకటసుబ్బారావుగారు.
,, ఆదిపూడి. ప్రభాకరరావుగారు.
,, చిలుకూరి. వీరభద్రరావుగారు.
,, చెన్నాప్రగడ. భానుమూర్తిగారు.
,, బొడ్డికూరపాటి. వేంకటరంగమునాయుఁడుగారు.
,, పండిత ది. గోపాలచార్యులుగారు.

మ-రా-రా-శ్రీ. పి. ఎస్. రామమూర్తిపంతులుగారు.
,, టి. రామకృష్ణపిళ్లగారు.
,, జి. సి. వి. శ్రీనివాసాచార్యులుగారు.
,, వి. రామచంద్రాచార్యులుగారు.
,, సోమంచి. భీమశంకరముగారు.
,, జి. రంగయ్యనాయుఁడుగారు.
,, పురాణపండా. మల్లయ్యశాస్త్రిలుగారు.
,, మల్లాది. సూర్యనారాయణశాస్త్రిలుగారు.
,, పేరి. కాశీనాథశాస్త్రిలుగారు.
,, కాశీ. కృష్ణాచార్యులుగారు.
,, భాగవతుల. రామమూర్తిశాస్త్రిలుగారు.
,, మేడేపల్లి. వేంకటరమణాచార్యులుగారు.
,, మానవల్లి. రామకృష్ణకవిగారు.
,, చెల్లపిళ్ల. వేంకట శాస్త్రిలుగారు.
,, దివాకర్ల. తిరుపతిశాస్త్రిలుగారు.
,, మంగు. వేంకటరామానుజరావుగారు.
,, గునుపాటి. యానాదిరెడ్డిగారు.
,, పి. వి. నరసింహరావునాయుఁడుగారు.
,, సి. దొరస్వామయ్యగారు.
,, వెదలువాడ. సుందరరామశాస్త్రిలుగారు.
,, దండిగుంట. సూర్యనారాయణశాస్త్రిలుగారు.
,, కేతవరపు. వేంకటశాస్త్రిలుగారు.
,, గట్టుపల్లి. శేషాచార్యులుగారు.
,, కాశ్లకూరి. సాంబశివరావుగారు
,, పురాణం. సూర్యనారాయణతీర్థులుగారు.
,, పంచాగ్నుల. దక్షిణామూర్తి శాస్త్రిలుగారు.
,, కాశీభట్ల. రామకృష్ణశాస్త్రిలుగారు.

ఇంకను అనేకులును వచ్చియుండిరి.

అందుఁ బ్రథమదినమున పగలు రెండుగంటలకు సభయారంభమాయెను. శ్రీపురాణం. నాగభూషణము ఎం. ఏ. బి. ఎల్., గారు సభాపతిగ నుండిరి. సభారంభకాలమున శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలుగారు వచ్చిన పండితులకెల్లరకు స్వాగతమొసంగిరి. పిదపఁ గావ్యములలో శృంగారవర్ణనౌచిత్యముంగూర్చి యీక్రిందఁ జెప్పఁబడువారు తమతమయభిప్రాయములం దెలుపు వ్యాసములం జదివిరి.

మ-రా-రా-శ్రీ. చెల్లపిళ్ల. వేంకటశాస్త్రిలుగారు. (బందరు)
,, పురాణపండా. మల్లయ్యశాస్త్రిలుగారు. (పిఠాపురము)

మ-రా-రా-శ్రీ, పేరి. కాశీనాథశాస్త్రిలుగారు. (విజయనగరము)
,, మల్లాది. సూర్యనారాయణశాస్త్రిలుగారు. (అమలాపురము)
,, కాశీ. కృష్ణాచార్యులుగారు. (గుంటూరు)
,, భాగవతుల. రామమూర్తిశాస్త్రిలుగారు. (విజయనగరము)
,, మేడేపల్లి. వేంకటరమణాచార్యులుగారు. (విజయనగరము)
,, కేతవరపు. వేంకటశాస్త్రిలుగారు. (బొబ్బిలి)
,, ఆదిపూడి. ప్రభాకరరావుగారు. (కాకినాడ)
,, కాళ్లకూరి. సాంబశివరావుగారు. (కాకినాడ)
,, చెల్లూరి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిలుగారు. (వేంకటగిరి)
,, గునుపాటి. యానాదిరెడ్డిగారు. (నెలూరు)
,, మంగు. వేంకటరామానుజరావుగారు. (నెల్లూరు)
,, చదలువాడ. సుందరరామశాస్త్రిలు గారు. (చెన్నపురి)
,, సి. దొరస్వామయ్యగారు. (చెన్నపురి)

మఱియు—

,, శ్రీ కల్లూరి. వేంకటరామశాస్త్రిలుగారు. (రాజమహేంద్రవరము)
,, కొప్పరపు. వేంకట సుబ్రహ్మణ్యశర్మగారు. (కొప్పరము)
,, వావిలికొలను సుబ్బరావుగారు. (చెన్నపురి)
,, పెద్దిభట్ల లక్ష్మీనరసింహముగారు. (తెనాలి)
,, వేటూరిప్రభాకరశాస్త్రిలు గారు. (పెద్దకళ్లేపల్లి)
,, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిలుగారు. (రాజమహేంద్రవరము)
,, వడ్డాది సుబ్బారాయుఁడుగారు. ,,
,, కూచి నరసింహముగారు. (పిఠాపురము)
,, కొంతి భద్రాద్రిరామశాస్త్రిలుగారు. (కాకినాడ)
,, విక్రమదేవవర్మగారు. (విశాఖపట్టణము)
,, పెద్దాపురము జగపతిరాజుగారు. (పెద్దాపురము)
,, పురాణం రామచంద్రశాస్త్రిగారు. (ముక్త్యాల)
,, కోరాడ దుర్గానాగేశ్వరశాస్త్రిగారు. (బందరు)
,, అమరవాది రామయ్యగారు. (బాలేశ్వరు)
,, జనమంచి శేషాద్రిశర్మగారు. (కడప)
,, పుగులూరి రామచంద్రయ్యగారు. (గుంటూరు)
,, శృంగారకవి సర్వారాయుఁడుగారు. (కాకినాడ)
,, నిట్టల వేంకటశాస్త్రిలుగారు. (తుని)

మొదలగువారు వ్యాసములను వ్రాసిపంపిరి.

,, జి. రంగయ్యనాయుఁడుగారు. (చెన్నపురి)
,, దివాకర్ల తిరుపతిశాస్త్రిలుగారు. (కాకినాడ)

మ-రా-రా-శ్రీ, వి. రామచంద్రాచార్యులుగారు. (నెల్లూరు)
,, జి సి వి. శ్రీనివాసాచార్యులుగారు. (చెన్నపురి)
,, వే. రామదాసుపంతులుగారు. (తణుకు)

తమయభిప్రాయముల నుపన్యసించిరి.

సభాంతమున నగ్రాసనాధిపతిగారు సర్వోపన్యాసములలోని యభిప్రాయసారమును వివరించిన పిమ్మట నీ క్రింద వివరించిన ప్రకారము తీర్మానింపఁబడినది. ఈ తీర్మానమునకు శ్రీ కనకరాజుపంతులుగారు తప్ప మిగిలిన సభ్యు లందఱు సమ్మతించిరి. కనకరాజుపంతులుగారు తమ యభిప్రాయమును స్పష్టపఱుపలేదు.

శృంగారవర్ణనను గుఱించిన తీర్మానము.

1. ఒక్క తెలుఁగునందు మాత్రమే గాక సాధారణముగా నన్నిభాషలయందును శృంగారరస ముత్తమరసముగా గ్రహింపఁబడుచున్నది. కావ్యములలో సర్వసాధారణముగా నిదియే ప్రధానరసముగా నంగీకరింపఁబడి యున్నది. సంస్కృతభాషలోఁ గావ్యరచనాపద్ధతులను శాసించు విపులశాస్త్రము కలదు. ఆ శాస్త్రమాంధ్రకవులచే సయితి మనుసరింపఁ బడుచున్నది.

2. ఏ తచ్ఛాస్త్రానుసారముగా రచింపఁబడిన పూర్వకవికృత కావ్యములు నేఁటిదనుక నిరాక్షేపముగా నాంధ్రలోకముచే నంగీకరింపఁబడి యున్నవి. అనుచితవర్ణనలు కావ్యశాస్త్రమునం దశ్లీలాదిదోషములుగాఁ బరిగణింపఁబడి నిషేధింపఁ బడినవి. కొందఱు కవు లొకానొకస్థలమునం దొక్కొక్కరసము నించుకనొక్కి వర్ణించినను అట్టిపట్టులందు సాధారణముగా భావము పండితైకవేద్య మగు ప్రౌఢభాష నుపయోగించియున్నారు. అట్టి భావములు విప్పిచెప్పినఁగాని స్పష్టపడవని యాంధ్రభాషాపరిచయము గలవారికి విశదము.

3. ఏభాషయందైన నన్ని కావ్యములును సర్వసామాన్య జనపఠనీయములుగా నుద్దేశింపఁబడియుండవు. పాఠకాధికారానుగుణముగాఁ బఠింపఁబడును. ఈ యంశ మాంధ్రకావ్యరచనయందుఁ గూడఁ బాటింపఁబడినది.

4. పూర్వము గ్రీకుదేశమందలి ప్రౌఢశిల్పులచే నిర్మింపఁబడిన శిలావిగ్రహములందును, ప్రస్తుతము పాశ్చాత్త్యకళాకోవిదులచే రచింపఁబడుచున్న చిత్రపటములయందును శిల్పనైపుణ్య ప్రకటనమున కధికావకాశ మొసంగుటచే నగ్నప్రతిమలే శ్లాఘాపాత్రములుగా గణింపఁబడుచున్నవి. కేవలశ్రవ్య ప్రబంధములకంటె దృశ్యప్రబంధములును వానికంటె దృశ్యపదార్థములును మనోవికారమును గలుగఁజేయుటయం దధికసామర్థ్యము గలవని యందఱకు విదితమే.

5. శృంగారకావ్యములం జదువుటవలన జనులకు దుర్వృత్తులయందుఁ బ్రవేశము కలుగుచున్నదనుట యుక్తముకాదు. అట్లనుటకుఁ బ్రమాణము లేదు. సర్వసాధారణముగా నట్టివ్యాపారములందుఁ బ్రవేశించువారు ప్రౌఢకావ్యములం జదివి యర్థముచేసికొనఁ జాలనివా రయి యున్నారు. చదివెడి వారియందా దోష మొక్కొక్కచోటఁ గనుపడినను దానికి గ్రంథపఠనము కారణముగాదు.

6. కావ్యములలోఁ గొన్ని, యాయాకాలములయందుఁ బ్రభుత్వము చేయుచుండిన ప్రభువులచే రచింపఁబడియున్నవి. అనేకములు తత్తత్కాలములందలి ప్రభువులకుఁ గాని వారిమంత్రులకుఁగాని యంకితములు చేయఁబడి యున్నవి. ప్రభుసమ్మానము వడయుటచేతనే తత్తత్కాలములందా గ్రంథములు దూష్యములుగా నెన్నఁబడియుండలేదని స్పష్ట మగుచున్నది.

* * *

ఉచితానుచితవివేకము కాలభేదమునుబట్టి భేదించును. భావభేదము కలిగినప్పుడెల్లఁ బూర్వగ్రంథములను సవరింపవలయు నని నిర్ణయించినచో నందువలన ననేకానర్థములు పుట్టు నను టకు సందేహము లేదు. అట్టి సిద్ధాంత మే దేశమందు నెవరు నంగీకరించియుండలేదు. ఇప్పు డంగీకరించినయెడల సాధారణముగా నన్నిభాషలయందు నమూల్యములుగాఁ బరిగణింపఁబడుచున్న గ్రంథములనుగూడ సవరింపవలసి వచ్చును. తుదకు మతగ్రంథములకుఁ గూడ నాదశ పట్టవలసి వచ్చును.

7. శృంగారవర్ణన లెక్కువగా నున్న గ్రంథముల రూపుమాప యత్నించుటవలన భాషా వాఙ్మయములకు విపత్తు కలుగు ననుట నిస్సందేహము. అట్లు చేసినచోఁ దెలుఁగులోమాత్రమే కాక భరతఖండములోని యితరభాషలలో సయితము గల యనేకగ్రంథము లదృశ్యములు కావలసి వచ్చును.

8. లాక్షణికు లనేకులు శృంగారరసప్రధానకావ్యముల నాధారముచేసికొని లక్షణము నేర్పఱచియున్నారు. తెలుఁగులో శబ్దస్వరూపమును నిర్ణయించుటకుఁ బూర్వకవిప్రయోగములు ముఖ్యాధారములు. అట్టి యాధారముల నాశనముచేయుట భాష కపకారక మగును.

కాఁబట్టి పూర్వకవికృత శృంగారప్రబంధముల రూపుమాపుటగాని యందలి భాగముల లోపింపఁజేయుటగాని కూడదని యీసభవారి దృఢాభిప్రాయము.

16-వ తేదిని ఉదయము 7 గంటలు మొదలు 10 గంటలవఱకును, సాయంకాలము 3 గంటలు మొదలు రాత్రి 9 గంటలవఱకును సభ జరిగెను. ఈసభకు చల్లపల్లి కుమారరాజాగారగు శ్రీ యార్లగడ్డ అంకినీడు ప్రసాద బహద్దరు బి. ఏ. గారు అగ్రాసనాధిపతిగా నుండిరి. ఇందు గ్రంథము లందు వ్యావహారికభాషాప్రయోగౌచిత్యము, సంధి, అర్ధానుస్వారము, శకటరేఫము, అన్యదేశ్య పదప్రయోగము, వీనింగూర్చి చర్చజరిగెను.

మొదట శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారు వ్యావహారికభాషాప్రయోగముం గూర్చి వ్రాసిపంపిన వ్యాసము చదువఁబడెను. పిదప పూర్వోక్తపండితులు తమతమవ్యాసములం జదివిరి. కొంద ఱుపన్యసించిరి.

అంతట శ్రీ గురిజాడ అప్పారావు పంతులుగారు వ్యావహారికభాషలో గ్రంథములు గూర్పఁ దప్పనవల దనియు నుత్తమజాతివారు సంభాషించుభాష సకలజాతులవారును సద్భాషగా గ్రహించువాడుక కల దనియు, ఇదివఱ కంగీకరింపఁబడిన లక్షణము ననుసరించి గ్రాంథికభాషను గ్రంథముల రచించుట ప్రాయశః సాధ్యముకానందున వ్యావహారికభాషను రచించిన గ్రంథములు గూడ నాదరణీయము లనియు నుడివిరి. దీనిం గూర్చి విశేషముగా చర్చజరిగెను. శ్రీపురాణం నాగభూషణముగారు, వేదము వేంకటరాయశాస్త్రిలుగారు, పేరి కాశీనాథశాస్త్రిలుగారు, పురాణపండా మల్లయ్యశాస్త్రిలుగారు, చెన్నాప్రగడ భానుమూర్తిగారు, సోమంచి భీమశంకరముగారు, దివాకర్ల తిరుపతిశాస్త్రిలుగారు, మఱికొందఱును, ఈవిషయముం గూర్చి ప్రసంగించుచు వ్యావహారికభాషయు గ్రాంథికభాషయు వేఱు వే ఱని చెప్పఁదగదనియు, వ్యావహారికభాషయందు జనులుచ్చారణాసౌలభ్యము ననుసరించి లక్షణవిరుద్ధములగు పదముల విశేషముగా వాడెద రనియు, వ్యావహారికభాషయందలి పదములు కేవలము గ్రామ్యములుగా నున్నయెడల సంస్కరించి యుపయోగింప వచ్చుననియు, కేవలము వాడుకలో నున్న వ్యావహారికభాషను గ్రంథముల రచించుట యేదేశములోను లే దనియు వక్కాణించిరి.

శ్రీ సేరి కాశీనాథశాస్త్రిలుగారు సంస్కృతమందు వైదిక భాషకును లౌకికభాషకును వ్యాకరణసిద్ధమైన భేద మెట్లు కలదో ఆతెఱఁగుననే యాంధ్రమందును గ్రాంథికభాషకును వ్యావహారికభాషకును భేదము గ్రహింపవచ్చు ననియు, లౌకికభాష కేవలము గ్రామ్య మని విసర్జింపక దానికిం దగునట్లు వ్యాకరణ మేర్పఱచి యట్టి వ్యాకరణము ననుసరించి వ్యావహారిక భాషను గ్రంథములం బ్రయోగించుట కాక్షేపణ యుండఁగూడ దనియుఁ దమయభిప్రాయముగాఁ జెప్పిరి.

సభాంతమున వ్యావహారికభాషాప్రయోగముం గూర్చియు, అర్ధానుస్వారము, శకటరేఫము, సంధి, అన్యదేశ్యములు, వీనింగూర్చియు నీక్రిందిరీతి నేకగ్రీవముగాఁ దీర్మానింపఁబడెను. తీర్మాన కాలమందు అప్పారావుపంతులుగారు లేకుండిరి.—

## తీర్మానములు.

### I. గ్రామ్యభాషా ప్రయోగము.

గ్రంథరచనయందుఁ బూర్వలాక్షణికమతానుసారమగుభాషను బ్రయోగింపవలయునుగాని లక్షణవిరుద్ధమగు భాషను బ్రయోగింపఁగూడదు. గ్రంథములను మృదుమధురశైలిని రచింపవలయు ననుట సర్వజనసమ్మతము. అట్లొనరించుటకు లక్షణభంగ మవశ్యముకాదు. లక్షణభంగము కాకుండభాషావైచిత్ర్య మెంతయైనం గనుపఱుపవచ్చును. అందువలన శైలిభేదము లేర్పడును.

### 2,3, అర్ధానుస్వారము, శకటరేఫము:

అర్ధానుస్వారశకటరేఫములు శబ్దస్వరూపావయవములగుటను శబ్దవ్యుత్పత్తుల నిరూపించుటకు సాధనము లగుటను త్యాజ్యములు కావు.

### 4. సంధి:—

గద్యరచనయం దచ్చటచ్చట నర్థావబోధనార్థమును, బఠనసౌకర్యార్థము నావశ్యకమని తోఁచినపట్టులందు సంధిచేయకున్నను దోషము కాదు. కాని సంధి యెప్పుడును జేయనక్కఱలేదని వాదించువారి వాద మంగీకార్యముకాదు. సంధిచేయుటయుఁ జేయకుంటయుఁ, గొంతవఱకుఁ జాలకాధికారము ననుసరించియుండును. పసిపిల్లలనిమిత్త ముద్దేశింపఁబడిన పుస్తకములందు శాస్త్రవిరుద్ధము గాకుండ సంధిని దగ్గించుట మంచి దనియే చెప్పవచ్చును. పద్యరచనయందు సర్వదా విసంధి దుష్టమే.

### 5. అన్యదేశ్య పదప్రయోగము:—

పూర్వకవిమతానుసారముగా రసపోషణమునకై యచ్చటచ్చట యథోచితముగా నన్యదేశ్యపదములం బ్రయోగింపవచ్చును. కాని యథేష్టముగాఁ బ్రయోగింపఁగూడదు. అన్యభాషలలో నుండు భౌతికశాస్త్రాది గ్రంథములఁ దెలుఁగులోనికిఁ బరివర్తనము చేయునపుడు తత్తచ్ఛాస్త్రోచిత పారిభాషికపదంబులు తెనుఁగునఁ గాని సంస్కృతమునఁ గాని నిర్ణయించి వానినే యుపయోగింపవలయును. ఏకపదములు దొరకనిచో నాతిదీర్ఘసమాసపదంబుల నిర్మింపవచ్చును. అట్లొనర్చుటకు సాధ్యముకానిచో నన్యదేశ్యమూలపదంబుల నాంధ్రభాషా సంప్రదాయానుసరణముగా సంస్కరించి గ్రహింపవచ్చును. పారిభాషికపదములు సంస్కృతమున నుండినచో భరతఖండములోని యన్నిభాషలకును సమానములుగా నుండును గాన నట్టిపదములు బహుళః సంస్కృతములోనే యుండుట మేలు. ఆంధ్రసాహిత్య పరిషత్తువా రిట్టిపదముల నిర్ణయించి ప్రకటించిన బాగుగ నుండును,

తదనంతరము పూర్వోక్త సభానిర్ణయములను సభవారిపక్షమున దొరతనమువారికి సమర్పించి, వారికి సభవారి యుద్దేశములను సవిస్తరముగ విన్నవించుటకు క్రింద నుదాహరింపఁబడిన వారిని ప్రతినిధులుగ నియమించుటయైనది.

మ-రా-రా-శ్రీ,

1. ఆనరబిల్., మోచెర్ల రామచంద్రరావుగారు.
2. రాయబహద్దరు బయ్యానరసింహేశ్వర శర్మగారు
3. పండిత ది. గోపాలాచార్యులుగారు.
4. తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు.
5. గునుపాటి యేనాదిరెడ్డిగారు.
6. వేమవరపు రామదాసు పంతులుగారు.
7. నెమలి పట్టాభిరామరావుగారు.

---

# ఆంధ్రసాహిత్యపరిషత్తు రాయబారము.

పండిత సంభావితమండలి తీర్మానముప్రకారము పూర్వోక్తపరిషత్సభ్యు లీ సంవత్సరమాగష్టు నెల 7 తేది పగలు 11 గంటలకుఁ జెన్నపురి గవర్నరుగారి కడ కేగి శృంగారప్రబంధములను గూర్చియు గ్రామ్యభాషనుగూర్చియు విన్నవించిరి. పూర్వపుఁబ్రబంధములను నశింపఁజేయుటగాని మార్చుటగాని భాషకునష్టమనియు, వానియందచ్చటచ్చట నత్యధికశృంగార వర్ణనమున్నను నదిసామాన్యులకుఁ దెలియని కఠినశైలిలోనున్నదనియు వీనివలనఁ బూర్వకాలపువారుగాని యిప్పటివారుగాని నీతియందు దౌర్బల్యము చెందలేదనియు, నీప్రబంధములపై నభియోగములు తెచ్చినచోఁ బూర్వగ్రంథప్రకటనమునకు నిరుత్సాహమును భంగమును గలుగుననియు నెప్పుడైనఁ బ్రభుత్వమువా రట్టి ప్రబంధములలో దేనినైన హానికరమని తలఁతురేని నావిషయ మాంధ్రసాహిత్యపరిషత్తువంటి పండితసంఘమునకుఁ దెలిపిన నాసంఘమాపలోపమును నివారించుననియుఁ గనుకఁ బూర్వపుఁబ్రౌఢవాఙ్మయముజోలికిఁ బ్రభుత్వమువారు పోఁగూడదనియు మనవిచేసిరి. మఱియు జనసామాన్యమునందు విద్యావ్యాప్తికై సులభశైలిలో గ్రంథముఁ వ్రాయుట యత్యంతావసరమేయైనను గ్రామ్యభాషను గ్రంథములలోఁ జేర్చుట, మిక్కిలి యట్టిగ్రంథములు పాఠశాలలలోని బాలురకుఁ బఠనీయగ్రంథములుగా నిర్ణయింపఁబడుట యనర్థదాయకములనియుఁ దెలుఁగు మాతృభాషకానివారిని బఠనీయగ్రంథనిర్ణాయకసంఘములలో నుంచుట యసంతృప్తికరముగ నున్నదనియు విజ్ఞాపన మొనరించిరి. గ్రంథము నీతివిషయమున నింద్యమాయను ప్రశ్ననుగూర్చి లార్డుకుక్బరన్ గారు వచించినయు వారుచెప్పి నట్లు గ్రంథము ముద్రింపఁబడి సర్వసాధారణముగఁ గొలఁది వెలకమ్మఁబడుచు దుర్నీతిని బ్రోత్సాహపఱచు నెడల నది నింద్యమనియు నట్లుకాక యెక్కువ వెలకలిగి పుస్తకభాండాగారములకును బండితులకును మాత్రమే విక్రయింపఁబడుచుండినయెడలఁ బ్రకటనకర్తపై నేరముండదనియు మొదటివిన్నపమునకు శ్రీ గవర్నరుగారు ప్రత్యుత్తర మొసఁగిరి; గ్రామ్యభాషావిషయమై ప్రభుత్వమువారు మధ్యస్థముగ నుందురనియుఁ దెలుఁగుమాతృభాషగాఁగలవారి నింకను బఠనీయగ్రంథ నిర్ణాయకసంఘములలోఁ జేర్పవలను పడునా యని విచారింతుమనియు రెండవవిజ్ఞాపనమునకు సమాధానము వ్రాక్రుచ్చిరి. గవర్నరు గారి కభివందనము లొనర్చి పరిషత్తురాయబారులు తిరిగివచ్చిరి.

# ప్రకటనలు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు:—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజారావు కుమారవేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజాసర్ వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ. ఇ., పంచహజారీమున్సబ్దార్.

అగ్రాసనాధిపతి:—

శ్రీపిఠాపురము రాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. బి. ఏ., బి. ఎల్.

కార్యదర్శులు.

1 మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం. ఏ., బి. ఎల్.,
2 ,, వేదము. వేంకటరామశాస్త్రిగారు.
3 ,, ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి., సి. ఎమ్.,

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచికృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.,

ది ఆనరబిల్ రావుబహదూర్ పిట్టీత్యాగరాయసెట్టిగారు, బి. ఏ.

కార్యస్థానము.

192, ఎస్ప్లనేడు. చెన్నపురి.

పరిషదుద్దేశము:—ఆంధ్రశబ్దమునకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువురచించుట, తెలుఁగు భాషకితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్వమును నిరూపించు లక్షణశాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును బ్రమాణపూర్వకముగా నిరూపించుట, శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్యమొనర్చుట, భాషావిషయములఁ జర్చించుటకుఁ బత్రికనొకదానిని బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాదివిధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము.

చందానిర్ణయము.

| | | | |
|---|---|---|---|
| 1. | ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. | పోషకులకు | ,, | 1000. |
| 3. | యావజ్జీవసభ్యులకు | ,, | 100. |
| 4. | సాధారణసభ్యులకు సంవత్సరమునకు | ,, | 6. |

పరిషత్సభ్యులు పత్రికకు వేఱుగాఁ జందానియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేరవ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

# పల్నాటి వీరచరిత్రము

ఇది శృంగార నైషధ, కాశీఖండ, హరవిలాసాది ప్రబంధముల రచించి కవిసార్వభౌముఁడని ప్రసిద్ధికెక్కిన శ్రీనాథునిచే రచింపఁబడినది. 12 వ శతాబ్దాంతమునందలి యాంధ్రదేశచరిత్రమే పల్నాటి వీరచరిత్రముగనున్నది. చరిత్రముగ నమూల్యమైనదనియుఁ గావ్యముగ నాంధ్రవాఙ్మయాలంకారమనియు స్వాభావిక కవితాధిష్ఠానమనియు నైషధాదిప్రబంధములచేత శ్రీనాథునికిఁ గలిగిన యశస్సు దీనిచే ద్విగుణీకృతమైనదనియుఁ బలువురు పత్రికాధిపతులు పండితులు ప్రశంసించియున్నారు. ఇది ప్రకటింపఁబడుటకిదియే ప్రథమపర్యాయము. వీరచరిత్రకథాసారము, వీరచరిత్రచారిత్రము, శ్రీనాథజీవిత సంగ్రహమునను 90 పుటల యుపోద్ఘాతము బెజవాడ హిందూహైస్కూలునందలి తెలుఁగు పండితులును బ్రస్తుతమాంధ్రసాహిత్య పరిషత్తు మేనేజరునగు అక్కిరాజు ఉమాకాంతంగారిచే రచింపఁబడి దీనికిఁ జేర్పఁబడినది. దీనివెల రు 1—0—0. నిండుకాలికోబైండు చేసినది రు. 1—4—0. వలయువారీక్రిందివారికి వ్రాసి తెప్పించికొనవచ్చును.

అక్కిరాజు ఉమాకాంతం.

మేనేజరు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు.

192, ఎస్ప్లనేడు, చెన్నపురి.

---

# విజ్ఞానచంద్రికాగ్రంథమాల.

## నియమములు.

1. దేశాభివృద్ధికి ఆవశ్యకములైన గ్రంథములు ప్రచురించి భాషాభివృద్ధి చేయుటయే యీ గ్రంథమాలయొక్క యుద్దేశము. ఇందు సంవత్సరమునకు రమారమి 1600 పుటలుగల స్వతంత్రమైన గ్రంథములు నాలుగు ప్రచురింపఁబడును.

2. కొందరు తలచునట్లు ఇది మాసపత్రికకాదు. ఇందు (i) దేశదేశముల చరిత్రములును, (ii) పదార్థ విజ్ఞాన శాస్త్రము (Physics), రసాయనశాస్త్రము (Chemistry), జీవశాస్త్రము (Biology), వృక్షశాస్త్రము (Botany), మొదలయిన ప్రకృతిశాస్త్రములును, (iii) దేశోపకారులగు కొందరు మహనీయుల చరిత్రములును, (iv) ఇంగ్లీషునందలి ఉద్గ్రంథములభాషాంతరీకరణములును మాత్రము ప్రచురింపఁబడును. చరిత్రానుసారములగు కల్పిత కథలు (Historical Novels) కూడ ప్రచురింపఁబడును. కావ్యనాటకాదు లిందుండవు.

3. ఈగ్రంథమాలలో నిదివరకు అచ్చువేయఁబడిన గ్రంథముల నన్నిటిని కొనుచు, నికముందు సంవత్సరమునకు నాలుగు చొప్పున ప్రచురింపబడు గ్రంథముల నన్నిటిని గొనుటకు నొప్పుకొనువారు శాశ్వతపు చందాదారులు.

4. శాశ్వతపు చందాదారులకు ఈగ్రంథమాలలోని గ్రంథములన్నియు నంచెకూలి మేమేభరించి నూరుపుటలకు రు 0-4-0 చొప్పుననిచ్చెదము. ఇతరులకు ఈపుస్తకములు అంచెకూలి గాకనూరుపుటలకు రు0-6-0చొ॥ నీయబడును. సంవత్సరము ఒక్కింటికి 1600 పుటలకంటె నెక్కువపుటలుగల గ్రంథములు మేము ప్రచురింపముగాన, చందాదారులకు సంవత్సరమునకు రూ. 4-0-0 కంటె నెక్కుడు కర్చు కానేరదు.

5. శాశ్వతపు చందాదారులు సంవత్సరపుచందా మొదట నీయనక్కరలేదు. ఒక్కొకపుస్తకమచ్చుపడగానే అది వ్యాల్యూపేయబిల్ ద్వారా పంపబడును.

6. వెనుకటి పుస్తకములనన్నిటిఁగొను చందాదారులు 0-4-0లు ప్రవేశరుసుముక్రింద చెల్లించవలెను. ఈ సొమ్ము రొఖ్ఖముగా నైనను పోస్టు ద్వారా గాని ముందుగా మాకు పంపవచ్చును. లేదా మేము మొదలపంపు వి. పి. లో చేర్చి రాబట్టుకొందుము. వెనుకటి పుస్తకములనన్నిటిని ఒక్కసారి కొనలేని వారు రు 5-0-0ల వెలగల పుస్తకములు మొట్టమొదట కొనిన జాలును. మిగత పుస్తకములు తరువాత తెప్పించుకొనవలెను.

7. వెనుకటి పుస్తకములు అక్కరలేనివారును, లేక కొన్నిమాత్రమే కావలెనను వారును ప్రవేశరుసుముక్రింద రు 1-0-0 చెల్లించవలెను.

8. గ్రంథమాలలోని గ్రంథములన్నియు నునుపైన దళసరికాగితములమీద ముద్రింపబడును. అనేక చక్కనిపటములు నొప్పుచుండును. క్యాలికోబైండుచేయబడును. సరసమైన వచనశైలిని కలిగియుండును. ఇట్లు సర్వాంగసుందరములై చౌకవెలకు దొరకు గ్రంథములు తెలుగుభాషలో నరుదు.

# విజ్ఞానచంద్రికా గ్రంథమాల.

## ప్రచురింపబడిన గ్రంథములు.

| | | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|---|
| 1. | అబ్రహాములింకను (Abraham Lincoln) | 0- 8-0 | 0-12-0 |
| 2. | హిందూమహాయుగము (Hindu Period) | 0-11-0 | 1- 0-0 |
| 3. | జీవశాస్త్రము Biology)* | 1- 0-0 | 1- 8-0 |
| 4. | రాణీసంయుక్తము (Historical Novel) | 0- 9-0 | 0-12-0 |
| 5. | మహమ్మదీయమహాయుగము (Mahammadan Period) | 1- 3-0 | 1-12-0 |
| 6. | పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics)* | 0-14-0 | 1- 5-0 |
| 7. | రసాయనశాస్త్రము (Chemistry) | 0-13-0 | 1- 5-0 |
| 8. | ఆంధ్రులచరిత్ర (1-వ. భా.) (Andhra History I.) | 1- 0-0 | 1- 4-0 |
| 9. | విమలాదేవి (Historical Novel) | 0-13-0 | 1- 2-0 |
| 10. | కలరా (Cholera)* | 0- 4-0 | 0- 6-0 |
| 11. | 12. 13. ప్రకృతిశాస్త్రముల ప్రథమపాఠములు* | 1- 2-0 | 1-10-0 |
| 14. | భౌతికశాస్త్ర ప్రథమపాఠములు* | 0- 7-0 | 0- 9-0 |
| 15. | రా. బ. క. వీరేశలింగముగారి స్వీయచరిత్రము | 1- 0-0 | 1- 8-0 |
| 16. | భౌతికశాస్త్రము (Physiography) | 1- 0-0 | 1- 8-0 |
| 17. | ఢిల్లీదర్బారు (Dheli Durbar) | 1- 0-0 | 1- 8-0 |
| 18. | ఆంధ్రులచరిత్రము (2-వ. భా.) (Andhra History II.) | 1- 0-0 | 1- 8-0 |
| 19. | చంద్రగుప్తచక్రవర్తి (Emperor Chandra Gupta) | 0- 8-0 | 0-12-0 |
| 20. | చలిజ్వరము (Malaria) | 0- 5-0 | 0- 7-0 |

☞ ఇందు చందాదారులు పోస్టేజి భరించ నక్కర లేదు. ఇతరులు పోస్టేజి భరించవలెను. పుస్తకము లన్నియు చక్కని క్యాలికోబైండు చేయబడినవి. * ఈగ్రంథములు ప్రస్తుతమందు లేవు.

చింతాదిపేట 1912 }
మద్రాసు. }

ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం,
మేనేజరు:

---

# ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల.

## నిడదవోలు, కృష్ణాజిల్లా.

ఇందు చక్కని క్యాలికోబైండుగల నవలలు రెండుమాసముల కొక్కొక్కటిగా వెలువడును. ఈ నవలలు చరిత్రబోధకములును మనోహరకథాకల్పితములునై చదువరుల హృదయముల నాకర్షించుచుండును. ఈనవలలనుగూర్చియు, ప్రస్తుతకాలమున నాంధ్రభాషాభివృద్ధికి నవలలయొక్కయవసరమును గూర్చియు, ననేకు లనేకాభిప్రాయముల నిచ్చియున్నారు. ఆంధ్రభాషాభివృద్ధి కీనవలలు ప్రథమసోపానములని చెప్పవచ్చును. ఇందు శాశ్వతచందాదారులుగా చేరువారికి మంచి క్యాలికోబైండుచేయబడిన నవలలు డెమ్మీ సైజున 100 పేజీలకు రు 0—6—0 చొ॥ వెలయేర్పఱచి వి. పి. గాబంపుచుందుము. ఇతరులకు పోస్టేజిగాక100 పేజీలకు రు 0—8—0ల చొ॥నిచ్చెదము.

ఏనవలయైనను ఒకరూపాయి వెలకు మించియుండదు.

చందాదారులుగా చేరువారు 0—2—0అడ్మిషను ఫీజు నీయవలెను.

# ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల.

## ఈ గ్రంథమాలికనుండి వెలువడిన నవలలు.

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| 1. దుర్గేశనందని. 231 పేజీలు | 0—12—0 | 1—0—0 |
| 2. వసుమతీవసంతము. 300 | 1—0—0 | 1—8—0 |
| 3. లలితచంద్రహాసము. 166 పేజీలు | 0—10—0 | 0—14—0 |
| 4. మృణ్మయి. 256 పేజీలు | 1—0—0 | 1—5—0 |
| 5. సీతారామ. 320 పేజీలు | 1—0—0 | 1—8—0 |
| 6. నూర్జహాను. 340 పేజీలు | 1—0—0 | 1—8—0 |
| 7. రాజసింహ. 280 పేజీలు | 1—0—0 | 1—8—0 |

## అ ను బం ధ గ్రం థ ము లు.

| | |
|---|---|
| 1. రాధారాణి | 0—4—0 |
| 2. యుగళాంగుళీయకము | 0—3—0 |
| 3. రాజభక్తి | 0—2—0 |
| 4. లీల | 0—4—0 |
| 5. దుర్గేశనందని విమర్శనము | 0—3—0 |

వలయువారు:—

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము

నిడదవోలు కృష్ణాజిల్లా.

అని వ్రాయవలయును.

## పత్రికాపాఠకుల కొక్క విన్నపము.

---

ఆంధ్రసాహిత్యపరిషత్తువారు తాటియాకుపుస్తకముల సంపాదించుచుండుటయు, పూర్వరాజుల కాలమందుఁ బుట్టిన శాసనముల నీపత్రికయందు ప్రకటించుచుండుటయు మీకు విదితమే. ఈరెండుకార్యములందును భాషాభిమానుల సాహాయ్యము కావలసియున్నది. దేశమం దనేక తాళపత్రగ్రంథములు గలవు. భద్రముగా నుంచకపోవుటచేత కొన్నిగ్రంథము లిదివరకే నశించిపోయినట్లు కనపడుచున్నది. ఇఁక ముం దట్లు జరుగకుండ సాధ్యమగునంతవఱకు గ్రంథము లన్నియు నొక్కచోటఁ జేర్చి క్రమక్రమముగా ముఖ్యమగు గ్రంథముల నచ్చు వేయించి ప్రకటించుట యవశ్యకర్తవ్యము. పరిషత్తీపనికిఁ బూనుకొన్నది. సుమారు 500 పుస్తకము లిదివరకు సంపాదింపఁబడినవి ఇంక ననేకపుస్తకములు సంపాదింపవలసియున్నది. పుస్తకములు గలవారు తమయొద్దనుండు పుస్తకము లన్నిగాని కొన్నిగాని యిచ్చిరేని కృతజ్ఞతాపూర్వకముగా గ్రహింతుము. పుస్తకముల పంపుట కయినవ్యయ మంతయు మేమే పెట్టుకొందుము. తాముపంపుటకు వీలుగా నుండని పక్షమున మా పేర వ్రాసినయెడల మేమే యవి తెప్పించుకొను ప్రయత్నము చేసెదము.

రాగి శాసనము లప్పుడప్పుడు భూమిత్రవ్వినప్పుడు బయలుదేరుచుండును. ఇవి దేశచరిత్రాంశముల నిర్ణయించుట కత్యంత ముపయోగించును. శాసనముల విలువ తెలియనివారు కొందఱు రేకులు కరగించి చెంబులు చేయించుకొన్నట్లు వినియున్నాము. ఇది గొప్పయపచారము. దొరకిన శాసనములన్నియు ప్రకటించుట కర్తవ్యము. అట్లు శాసనము లెవరివద్దనైన నున్నయెడల వారు మాయొద్దకు పంపింప వేడెదము. శాసనము బొత్తిగా పరిషత్తున కియ్య నిష్టము లేనియెడల మేము దాని ప్రతిబింబము తీసికొని అసలు శాసనము తిరిగి వారి కంపివేయుదుము.

కార్యదర్శులు.

# మాతృభాషాసేవ.

భాష యనఁగా నొకరి భావమును వేఱొకరికిఁ దెలుపు నుపాయము. మనోగతార్థమును వ్యక్తపఱచు నుపాయములు క్రియారూపములును ధ్వని రూపములు నని రెండు విధములు. మనుష్యుల సుఖదుఃఖాదిభావములు కొంత వఱకు వారి ముఖవర్చస్సునందాయాభావములవలనఁ బుట్టు వికారముల మూలముననే దెలియును. ఈ వికారము లప్రయత్నక్రియారూపములు. హస్తా ద్యవయవవిన్యాసరూపకము లగు సంజ్ఞలు ప్రయత్నపూర్వకక్రియలు. మూఁగవాళ్లకును మనభాష నెఱుంగని వారలకును మన యభిప్రాయములు దెలుపవలసి వచ్చినప్పుడు మన మందఱము సంజ్ఞల నుపయోగింతుము. మాటలాడు నప్పుడు కూడ తమ యభిప్రాయములు శ్రోతలకు స్పష్టముగాఁ దెలియుటకై హస్తాద్యభినయములఁ జూపుచుండుట పలువుర కభ్యాసమై యున్నది. సంజ్ఞా రూపకభాష కొంతవఱ కుపయుక్తముగా నున్నను వాగ్రూపక మగు భాష యంతకంటె ననేక విధముల శ్రేష్ఠతర మయినది కావున లోకమం దెల్లెడల నదియే వాడుకలో నున్నది. అర్థవంతము లగు ధ్వనులు శబ్దము లనంబడును. శబ్దజాలమునకే భాష యను సంజ్ఞ లోకమందుఁ జెల్లుచున్నది.

శబ్దములకు ధ్వని శరీరమనియు, అర్థము జీవమనియుఁ జెప్ప నొప్పును. ఈ రెండును కల్పితములే, కాని, యెవరి యిష్టము వచ్చినట్లు వారు శబ్దములఁ గాని యర్థములఁ గాని కల్పింప స్వతంత్రులు గారు. సర్వజన సమ్మతములు కాని శబ్దార్థములు నిరర్థకములు గావున భాష యనిపించుకొనవు. మహాకవు లప్పు డప్పుడు నూతన శబ్దములను నూతనార్థములను గల్పించుటయు, వారియం దుండు గౌరవముచే లోక మాకల్పనల నంగీకరించుటయుఁ గలదు. అప్పు డయి నను లోకానుమతి యావశ్యకము.

శబ్దోచ్చారణ మాస్యప్రయత్నములవలనఁ బుట్టును. ఈరెండును దేశ భేదమును బట్టి మాఱుచుండును. ఒక్కదేశమువా రుచ్చరించు కొన్నికొన్ని ధ్వనుల వేఱొకదేశమువారు సాధారణముగా నుచ్చరింప లేరు. బంగాళీలు గాని,

ఓఢ్రులు గాని సంస్కృతము చదువునప్పుడు తెలుఁగువారికిఁ గొన్ని శబ్దముల స్వరూపమే తెలియదు. పాశ్చాత్త్యుల సంస్కృతోచ్చారణ మంతకంటె నన్యాయము. ఆప్రకారమే మన మింగ్లీషు మాట్లాడు నపుడు పెక్కుమాట లింగ్లీషు వారి కపశబ్దములుగాఁ దోఁచును. అరబ్బీభాషలోని కొన్నిహల్లుల మన ముచ్చరింప నేలేము. ఈయుచ్చారణభేదము లాస్యప్రయత్నభేదములవలనఁ గలిగినవి. ఈభేదములు జాతిని బట్టియు వృత్తిని బట్టియుఁ గొంతవరకుఁ గలుగును. కాని, జాతివృత్తు లొక్కభాషయందు స్వల్పభేదములనుమాత్రమే పుట్టింపఁజాలును గాని భాషాభేదములకుఁ గారణములు కానేరవు. సంస్కృతము, పారసీ, అరబ్బీ, గ్రీకు, ల్యాటిను, ఇంగ్లీషు ఇత్యాది మహాభాషాభేదములు దేశభేదములవలననే కలిగిన వని చెప్పవలసియున్నది.

భౌతికవస్తుతత్వము కొంతవర కన్నియెడల నొక్కరీతిగనే యున్నను, కొన్నిగుణములు దేశభేదమువలన భిన్నము లగుట సుప్రసిద్ధము. ఈ గుణభేదమునలన తత్తద్దేశములందు నివసించు జనుల శరీరతత్వమునందుఁ గూడ భేదము కలుగుచుండుట యెల్లరకు ననుభవసిద్ధము. ఈ భేదము భాషోత్పత్తికిఁ గారణము లగు నాస్యప్రయత్నములందును గలుగుటచే భాషాభేదము లేర్పడినవి. పరిశీలించి చూడ సాధారణముగా లోకమం దెవరి యుచ్చారణము వారిదే యయినను, స్థూలదృష్టిని చూచినచో నొక్కొక్కదేశమం దుండు జనుల యుచ్చారణము చాలవర కొక్కొక్క రీతిగా నుండును. అనఁగా నన్యోన్యసాహచర్యముచేత నేకదేశమందు నివసించు జనుల పలుకుబడి చాలమట్టు కొక్క విధముగానే యుండును. ఆ జనులు పలుతెగలయి యొకతెగవా రొకదేశమునకును వేఱొక తెగవారు వేఱొక దేశమునకును జని యచ్చటనే నిలిచిపోయి పరస్పరసంబంధము లేకుండిన యెడలఁ గాలక్రమమున వారి భాష మాఱి తెగ కొక్క భాష యేర్పడి యొక తెగవారి భాష మఱియొక తెగవారి కర్థము కాకుండున ట్లేర్పడును. ఇట్లు మాఱిన భాషలకు సమానభాగములు కొన్నియున్నను వికారములఁ బొంది యున్న వగుటచే స్థూలదృష్టికి గోచరములు కాకుండును. తెలుఁగు, అరవము, కన్నడము మొదలగు ద్రావిడ భాషలకును, ఓఢ్రము, బంగాళీ, మహారాష్ట్రము మొదలగు ప్రాకృతభాష లకును, ఇంగ్లీషు, జర్మను, డచ్చి మొదలగు ట్యూటానికు (Teutonic) భాష

లకును, సంస్కృతము, పారశీ, ల్యాటిను మొదలగు నార్యభాషలకును భేద మీప్రకారమె కలిగిన దని యూహించునది. ఇంతియ కాదు. మనము పృథగ్భాషలుగా నెంచుచున్న భాషలలో నెక్కొక్క దానియందు ప్రదేశభేదములచేతను, వృత్తిభేదములచేతను భాషాభేదములు కలుగుచున్నవి.ఇవి యవాంతర భేదములు. భేదము స్వల్పమగుటచే పృథగ్భాషలుగా గ్రహింపఁబడఁ దగవు.

ఒక్కొక్క దేశమున కొక్కొక్క మహాభాష యేర్పడి యున్నది. ఆ భాష యాదేశస్థులకు స్వభాష యగును. ఆ భాషచేతనే వారి వ్యవహారము నడుచును. అదియే వారి విద్యాసంపాదనకు సాధనము. మాటలు నేర్చిన దాదిగా వారు స్వభాషను వ్యవహరింతురు. తల్లిపాలు పిల్ల శరీరపోషణమున కెట్లు సాధనమో స్వభాష జ్ఞానాభివృద్ధి కట్లు సాధనము. కావున నది మాతృభాష యనఁదగును. పరిశీలించినచోఁ గన్నతల్లికంటె తల్లిభాషయే కొన్ని విధముల హెచ్చని చెప్ప నొప్పును. స్తన్యాపేక్ష శైశవమునందు మాత్రమే యుండును. అన్నప్రాశన మభ్యాస మయినపిదప స్తన్య మక్కఱలేదు. మాతృభాష సర్వకాలములందుఁ గావలసియున్నది. మఱియు శరీరముకంటె నాత్మ యధికము గావున ఆత్మసంరక్షణమునకు సాధన మగు భాష కేవల శరీరపోషక మగు మాతృస్తన్యముకంటె మే లని చెప్పవలశియున్నది.

ఎల్లరకును ముగ్గురు తల్లులు కల రని చెప్పవచ్చును. తొమ్మిదినెలలు మోచి కని పెంచిన దొక తల్లి. బ్రతికియున్నంతకాల మన్నపానాదు లొసంగి సంరక్షించిన స్వదేశ మొక్క తల్లి. విద్యాబుద్ధు లొసంగి సమస్తలోకవ్యవహారనిర్వాహమునకు మాత్రమే కాక యాత్మసంరక్షణమునకుఁ గూడ సాధన మగు స్వభాష యొక తల్లి, ఈ ముగ్గురిలో నాత్మసంరక్షణసాధన మగుటచే మాతృభాషయే యధికము. ఆ భాషను దగురీతిని సేవించుట మాతృపూజ యొనరించుట. మాతృభాష కనిష్ట మొనర్చినచో తల్లిని కష్టపెట్టి నట్లే. ఆంధ్రుల మగు మన కెల్లవారికి నాంధ్రభాష మాతృభాష గావున నాభాషను సేవించుచు సర్వవిధముల నాభాషాభివృద్ధికిఁదగు నుపాయముల నన్వేషించుచుండుట మన కవశ్య కర్తవ్యము. మన మట్లుచేయమేని, అన్నవస్త్రము లీయక కన్నతల్లిని చావున కొప్పగింప నెంచిన నీచాత్ముల దుర్గతి పాలగుదుము.

తెలుఁగు లోకమందలి మహాభాషలలోఁ జేరినదికా దనియు, దాని నంతఁగాఁ జదువవలసిన పని లేదనియు వాదించువారు కొందఱు గలరు.

ఈ వాదము పరిహాసాస్పదమే. కాని, యంతటితోఁ గొట్టి వేయక యీ వాదమందు సార మేమయినఁ గలదేమో చూతము. తెలుఁగునకు వ్యాప్తి యంతగా లేదనియు, సర్వసాధారణముగా తెలుఁగు గ్రంథము లన్నియు సంస్కృతభాషనుండియే పరివర్తనము కాఁబడినవియు నాభాషలోని గ్రంథముల ననుసరించి రచియింపఁబడినవియుఁ గాని యన్యభాషాగ్రంథ సంబంధములేని గ్రంథము లంతగా లేవనియు, కాఁబట్టి యాంధ్రభాష నభ్యసింపకపోవు టవలన నష్టము లేదనియు వీరల యభిప్రాయము.

ఈ యాక్షేపమునకు రెండు ప్రత్యుత్తరములు గలవు. మొదటిది.— తెలుఁగులో గ్రంథజాలము చాలవరకు సంస్కృతభాషా సంబంధమువలనఁ గలిగిన దన్న మాట సత్యమే. ఇట్టి యనస్థ యొక్క తెలుఁగునకు మాత్రమే పట్టినది కాదు. భరతఖండమునందలి దేశభాషలు కొంచె మెచ్చుతగ్గుగా నన్నియు సంస్కృతమువలనఁ బోషింపఁబడి వృద్ధికి వచ్చినవే. యూరోపుఖండములోని యాధునికభాషల కన్నిటికి గ్రీకు ల్యాటినుభాషలు మాతృకలు. మొన్న మొన్నటివరకు నాంగ్లేయాదు లాప్రాచీనభాషా గ్రంథములఁ దమదేశభాషలలోనికిఁ బరివర్తనము చేసికొనియు, వాని ననుసరించి తాము వేఱు గ్రంథముల రచించికొనియు మాతృభాషాభివృద్ధి చేసికొనుచుండి క్రమక్రమముగా నిటీవల స్వతంత్రగ్రంథరచనయందు నిపుణులైరి. నేఁటుగూడ ల్యాటిను భాషాగ్రంథము లాంగ్లేయ విశ్వవిద్యాలయములలో నవశ్యపఠనీయములుగా నున్నవి. మన తెలుఁగునందు స్వతంత్రగ్రంథము లింకను బుట్టియుండ లేదు. భాషాభిమాను లీలోటును దీర్ప యత్నింపవలయును గాని లోప మున్నది కదా యని స్వభాషను విడిచిపెట్టుట యుక్తము కాదు. తన యిల్లు శిథిలముగా నున్న దని దానిని విడిచిపెట్టి పొరుగింటికిఁ బోయి ఆయింటివాని చెప్పుచేతలకుఁ లోఁబడి తలదాచుకొను వానికంటె కష్టపడి తన యిల్లు బాగు చేసుకొని స్వతంత్రముగా బ్రతుకువాఁ డధికుఁడు కదా! స్వభాషను విడనాడి పరభాష నాశ్రయించి వృద్ధిలోకి వచ్చిన వా రెవరు కనపడరు. గంజి పోసి పెంచినను, అంబలి పోసి పెంచినను కన్నతల్లి పెంచునట్లు పరవనిత యెంతభాగ్యవంతురా లయినఁ బెంచనేరదు. భక్ష్యభోజ్యము లెక్కువ పెట్టునే యందము. అవి తల్లిపోసిన గంజి వలె ఇంది బలముచేయవు. స్వభావమూల

మున నేర్చికొన్న విద్యవలె నన్యభాషమూలమున నేర్చికొన్నది నెవఱకురాదు. వచ్చినను కాలవిలంబమునఁ గాని రాదు.

అన్యభాషలు నేర్చుకొనఁగూడ దని నాయభిప్రాయము కాదు. జ్ఞాన మన్ని విధముల సాధింపవలసినదే. ప్రాచీనవిద్యల నభ్యసించుటకు సంస్కృత భాషయు, నవీనవిద్యల నభ్యసించుట కాంగ్లేయభాషయు మిక్కిలి యుపయుక్త ములు. వీలు గలిగినంత వఱకు నందఱు నీభాషల నభ్యసింపవలయును. అందు లో సంస్కృతము హిందువులు భక్తివిశ్వాసములతో నభ్యసింపఁ దగినది. హిందువుల మతాభిప్రాయములకును, ఆచారవ్యవహారములకును మూలా ధారము లాభాషయందే కలవు. అవి యవశ్యపఠనీయములు. మఱియు సంస్కృతాంధ్రభాషల సంబంధము దృఢమయినది. సంస్కృత మాంధ్రమునకు కన్నతల్లి యని కొందఱందురు, గాని పెంపుడుతల్లి యని నాయభిప్రాయము. సంస్కృతమే తెలుఁగును చిన్నప్పటినుండి పెంచి పెద్దదానిని చేసినది. ఈ పెంపువలనఁ దెలుఁగునకుఁ జేటువాటిల్లినదని సామాన్యు లనుకొన్న నను కొందురు గాక. అది ప్రాజ్ఞుల మతము కాదు. ఆంధ్రభాష ననేకవిధములఁ బోషించి దానికి "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యను ఖ్యాతిని దెచ్చినది సంస్కృతమే. ఒకవేళ సంస్కృతభాషా సాహచర్యము తెలుఁగునకు లాభకారిగా నుండలేదని యనుకొన్నను వానికిఁ గల సంబంధ మింత కాలమయిన పిదప నెవ్వరు త్రెంపఁ గలరు? మేలో కీడో యా సంబంధ మట్లుండవలసినదే. కావున సంస్కృతభాష యాంధ్రులు ముఖ్యముగానభ్యసింపవలసినదే యగును.

ఆంగ్లేయభాష కూడ సాధ్య మగునంతవర కందఱు నభ్యసింపవలసినదే. అది మనకు వ్యవహారక్షమ మగు రాజభాష యగుటయె గాక యీ కాలమున లోకమందెల్లెడలఁ బొడముచున్న నూతనవిద్య లన్నియు దాని మూలమునఁ గరతలామలకములు కాఁగలవు.

కాని, యాంధ్రులందఱు నీసంస్కృతమును గాని, యింగ్లీషును గాని యభ్యసింపఁ గలుగుదు రనుమాట కల్ల. తెలుఁగున కెంత సంబంధము కలది యయినను సంస్కృతము కష్టసాధ్యము. ఇంగ్లీషు భాషయన్ననో దాని తెన్నే వేఱు. కాఁబట్టి తెలుఁగువారలందఱు సంస్కృతాంగ్లేయభాషల నభ్యసించి తన్మూ లమునఁ బ్రాచీనాధునికవిద్యల నేర్తు రనుమాట కలలోని వార్త యని గ్రహింప

వలసియున్నది. తా మభ్యసించిన భాషలయం దుండు విశేషార్థముల నాం ధ్రజనసామాన్యహితార్థ మాంధ్రభాషచేఁ దెలుపు భార మన్యభాషావేత్తలగు విద్యాధికులపై నున్నది. కనుకనే నన్నయభట్టారకాదిమహాకవి నావికులు సంస్కృతవాఙ్మయరత్నాకరమునుండి వెలలేని మణులఁదెచ్చి యాంధ్రలోక మం దెల్లెడల వెదజల్లినారు. అట్లు వా రొనర్పకుండి రేని, విద్యావిషయమున నాంధ్రలోక మంతయు నంధకారబంధురముగా నుండవలసియుండును గదా.

ఈ మహాకవుల ఋణము తీర్చుకొనుటకు వారి గ్రంథములఁ జదివి బాగు పడుట తప్ప వేఱెయుపాయము మనకు లేదు. కొందఱా ఋణము దీర్చుటకు యత్నించుట లేదు సరిగదా, ప్రాచీనగ్రంథములలో విలువగలది యొక్కటియుఁ గూడ లేదనుచున్నారు. అప్పు నెగపెట్టి యూరకున్న వానికంటె, ఎగపెట్టి మీఁదుమిక్కిలి నీ విచ్చినవి పిచ్చరూపాయ లనువాఁడు ఘనుఁడు కదా!

పలువురు మూలగ్రంథములఁ జదివి యర్థముచేసికొనఁగలవారే యనుకొం దము. అయినను, ప్రయత్నపూర్వకముగా మాతృభాషను మఱచిపోయిన వారికిఁ దప్ప, యితరుల కేయర్థమయినను స్వభాషలోఁ జెప్పినపుడు రుచించి మనస్సునకుఁ బట్టినట్లు, అన్యభాషలోఁ జెప్పినప్పుడుపట్టదు. ఒకానొకప్పుడు సంస్కృతములోఁ బదిమాటలతోఁ జెప్పవలసిన యర్థమే తెలుగున మూఁడునాలుగు మాటలలో నిముడును. ఒకవేళ సంస్కృతముననే తక్కువ మాటలు పట్టు ననుకొన్నను శబ్దార్థవిచారము చేసినఁ గాని సంస్కృతమునందలి యర్థము సుబోధము కాదు. తెలుఁగుననో చెప్పవలసి నట్లు చెప్పినచో వినినంత మాత్రముననే యర్థ మయి యానందమును బుట్టించును. తెలుఁగున నేరసమునయినను సమగ్ర ముగా స్ఫుటపఱచుటకుఁ గావలసినంత యవకాశ మున్నది. వీరభయానకాదిర సము లాంధ్రభారతయుద్ధపంచకమునందును, భక్తిరసము పోతన భాగవతమం దును, శృంగారము మనుచరిత్రవసుచరిత్రాదులందును, కరుణారసము భారత స్త్రీపర్వశంకరకవికృత హరిశ్చంద్రోపాఖ్యానాదులయందును వర్ణించిన దాని కంటె నితరభాషయం దధికముగా వర్ణించుట కవకాశ మున్నట్టు తోఁచదు. సం స్కృతమున కన్నఁ గూడ తెనుఁగే మిన్న యని కొంద ఱుభయభాషాకోవిదుల యభిప్రాయము.

జనని సమ స్తభాషలకు సంస్కృతభాష, ధరాతలంబునన్
ఘనలలితార్థగౌరవవికాసి తెనుం గభిరమ్య మంతకన్

గనుఁగొనఁ జాతబీజమున కంటెను గోమలపత్రపుష్పశో
భనమృదుపల్లవాభినవబాలరసాలము సొంపు నింపదే.

(శ్రీశైలఖండము.)

దేవతల భాషగావునఁ దెనుఁగు కన్న
సంస్కృతమె మిన్న యాయుక్తి సరియె తెలిసె
రసికుఁ డగు వాఁడు తనదు జారు సిగలోనఁ
దులసి నే యిడుకొనునో జాజులనె యిడునో. (ఆంధ్రభాషార్ణవము)

ఇది యట్లుండనిండు. లోకములో నెక్కొక్క జాతి పుష్పముల కనితర సామాన్యమగు నొక్కొక్క సౌరభవిశేష మున్నట్లు, ఒక్కొక్క భాష కొక్కొక్క శక్తివిశేషము కలదు. ఏయర్థమయినను సాధారణముగా స్వభాషలోఁ జెప్పినప్పు డర్థరసానుభవమయిన ట్లితరభాషలతోఁ జెప్పినప్పుడు కాదు. కావున స్వభాషాగ్రంథము లవశ్యపఠనీయములు.

ఆయా దేశము వారికి
నాయా దేశంబు భాష నమరిన కావ్యం
బాయత పురుషార్థంబులఁ
బాయక సమకూర్చు దేవభాషయుఁ బోలెన్. (అప్పకవి)

కావ్యముచే మనస్సు కరఁగింపవలెనన్న భాషామర్యాదల వీడక, జాతీయమును దిరస్కరింపక, సంప్రదాయసిద్ధ మగు మాతృభాషచేతనే యాకావ్యమును రచింపవలయును.

మాతృభాషాభిమానము వలయు ననుటకు వేఱొక హేతువు గలదు. దేశభాషాభిమానము లేనిది దేశాభిమానము కలుగదు. జనులకు దేశాభిమానము లేక దేశాభివృద్ధి యెన్నటికిని గాదు. స్వభాషాభివృద్ధియె స్వదేశౌన్నత్యమునకుఁ బ్రథమచిహ్నము. స్వభాషను వృద్ధిపొందింపక స్వదేశాభివృద్ధిని గలిగించుకొనఁ జాలినవారు లోకచారిత్రమునందుఁ గన్పట్టరు. తమ తల్లి భాషయం దభిమానము లేని వారి కాత్మగౌరవ ముండఁ జాలదు. ఆత్మగౌరవము లేని వారల నితరులు గౌరవించుటెట్లు? దైన్యప్రదర్శనముచేత పొట్టపోసికొనవచ్చు నేమో కాని గౌరవైకసాధ్యమగు స్వతంత్రజీవనశక్తి కలుగదు. దేశ మభివృద్ధి నొందవలెనన్న దేశాభిమాన మాబాలగోపాలము పుట్టినఁ గాని కాదు. విద్యగల్గినఁగాని దేశాభిమానముపుట్టదు. దేశభాష మూలమునఁ గాని జనుల కందఱకు విద్య లభింప నేరదు.

దేశాభిమానమునకే కాక, జనుల యన్యోన్యానురాగమునకుఁ గూడ దేశభాషాసేవ ముఖ్యసాధనము. తెలుఁగువార మనుకొనువారికందఱకు ముఖ్యమగు సమానధర్మము తెలుఁగుభాషయే. తెలుఁగువారు మదరాసు రాజ్యమునందుఁ గల తెలుఁగు దేశమందుఁ గలరు. ద్రావిడదేశమందుఁ గలరు. కర్నాటదేశమందుఁ గలరు. హైదరాబాదు దేశమందుఁ గలరు. మఱి యితరస్థలములందుఁ గూడఁ గలరు. వీరలలో ననేక వర్ణభేదములు, మత భేదములు, ఆచారభేదములు, వృత్తిభేదములు గలవు. కాని యందఱకును స్వభాష యొక్కటి యగుటం బట్టివా రందఱు నొక్క తల్లిపిల్లలవలె నన్యోన్య ప్రేమపాత్రు లగుచున్నారు. ఇటులనే యన్ని భాషలయందును.

"మీకు షేక్స్పియరు (Shakespeare) కావలెనా లేక హిందూసామ్రాజ్యము కావలెనా" యని ఇంగ్లీషు మాతృభాషగాఁ గలవారి నెవ్వరి నడిగినను "హిందూసామ్రాజ్య మున్ననునరే, లేకున్ననునరే, కాని, షేక్స్పియరు మాకుండక తప్పదు. అతనిని విడిచి మే ముండలేము" అని యందఱును ప్రత్యుత్తరమిత్తు రని కార్లైలు (Carlyle) అను నాంగ్లేయవిద్వాంసుఁడు చెప్పియున్నాఁడు. ఆప్రకారమే నన్నయతిక్కన పోతన శ్రీనాథాది మహాంధ్రకవులు మీకుఁ గావలయునా అక్కఱలేదాయని యడిగినచో నక్కఱలే దను వాఁ డాంధ్రుఁ డెవ్వఁడయిననుండునా? ఉండఁడు. స్వభాషవిషయ మయి యెట్టి వాఁ డయిన నట్టి ద్రోహము తలంపఁ డని నా నమ్మకము.

ఒక్కమాధుర్యమునందు మాత్రమేగాక యన్నివిధముల దేశభాషలలో నాంధ్రభాష సర్వోత్తమ మయిన దను ఖ్యాతి దానికిఁ గలిగింపఁ దలచి "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యను శ్రీకృష్ణరాయవాక్యమును దమ యుద్దేశమును సూచించు వాక్యముగ నాంధ్రసాహిత్యపరిషత్తువారు గ్రహించియున్నారు. ఆంధ్రలోక మంతయు నిందుకుఁ దోడ్పడును గాక.

జ. రామయ్య.

# సంధివివేకము.

“సంహితైకపదేనిత్యా, నిత్యాధాతూపసర్గయోః, నిత్యాసమాసే వాక్యేతు, సా వివక్షా మపేక్షతే” యను సూక్తిచొప్పున సంస్కృతమున వాక్య మధ్యమునందు సంహిత వైవక్షికమగుటచే సంహిత వివక్షింపఁబడనపుడు సంధి శాస్త్రము సంహితాధికారాంతర్గతమగుటచే విసంధి వ్యాకరణ దోషముగాదను మొదలగు సంస్కృత నియమములను దెనుఁగునందుఁ జొనిపి రచించిన బ్ర॥శ్రీ॥ వేదము, వేంకటరాయశాస్త్రులవారి విసంధివివేక మాంధ్రభాషాభిమానులకెల్ల రకుఁ దెలిసియే యున్నదిగదా? సంస్కృత భాషానియమములన్నియుఁ దెలుఁగునఁ దోఁపవలయునను నిర్బంధముగలదాయని కొంతవఱకుఁ జర్చించిచూతము.

సంస్కృతముననున్న కొన్నియక్షరములు తెలుఁగునలేవు. సంస్కృతమునలేని కొన్నియక్షరములు తెలుఁగునఁగలవు. సంస్కృతమున గుణవృద్ధి పరరూప పూర్వరూపా ద్యనేకవిధములగు స్వరసంధులుగలవు. తెనుఁగుభాషలో స్వరసంధి యొక్కపరరూపసంధియే. ఇట్టిభేదము లనేకములుగలవుగాని గ్రంథవిస్తరభీతిచే నిట నుదాహరింపలేదు. మఱియు, సంస్కృతమునఁ బ్రచురప్రయోగసిద్ధములుగాని పదములును బ్రయోగార్హములే. ఆంధ్రభాషయందన్ననో, “విరళా పేచోపాదిక శబ్దాః, ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః, ఇహతు ప్రవ్యాహార్యం, సంకేతిత సుప్రసిద్ధమేవ పద” మ్మనువాగనుశాసను సూక్తిచొప్పున సుప్రసిద్ధపదములే ప్రయోగార్హములై యున్నవి. ఈరీతినే సంస్కృతమునఁ బ్రకృతిభావాదికముచే నచ్చుల సంహితయందును సంధిలేనపు డాయచ్చులనడుమ యకారము లేదు. ప్రాకృతమునం దవర్ణోపరిస్థితావర్ణమునమాత్రము యశ్రుతిగలిగి యుండును. తెనుఁగునందన్ననో “స్వరంబుకంటెం బరంబైన స్వరంబునకు యడాగమంబగు” నను బాలవ్యాకరణ సూత్రిచొప్పున యకారాగమము వచ్చును.

“యశ్రుతి మార్యాలఘు యంప్రవదంతి ప్రాణతః పరంప్రాణ”మ్మనువాగనుశాసను సూక్తిలో శ్రుతిశబ్ద స్వారస్యముచే యకార ముచ్చారణములో మాత్రము వినఁబడుననియు, వ్రాతలో వ్రాసినను మానినను సరేయనియును శాస్త్రులవా రభిప్రాయపడుచున్నారు. ఉచ్చారణానుమాపకమగు రేఖ లేదు

న్న నెట్లు సరిపడును. ఉచ్చార్యమాణధ్వన్యనుమాపకములుగదా రేఖలు. య
శ్రుత్యనుమాపక మజ్రేఖామాత్రమా? లేక హల్రేఖాసహితాజ్రేఖయా? రెండు
ను దదనుమాపకములే యనుట సరికాదుగదా? పై రెండుపక్షములలో మొదటి
పక్షమున స్వరానుమాపక రేఖలకును యశ్రుత్యనుమాపక రేఖలకును భేదమేమి?
పురాతనాధునాతనలిపులందెల్లెడ హల్రేఖా సహితాజ్రేఖయే వ్రాయఁబడుచుం
డుటకుఁ గారణమేమి? మఱియుఁ గేవలాజ్రేఖయే వ్రాసినచో "నాయతివసుశో
భనాకృతియును" నను మొదలగు శ్లేషస్థలములందు నాయతియనియు, నాయతివ
యనియు నర్థద్వయ స్ఫురణమెట్లుగలుగును. ఇంతియగాక "ఇదమద సేతద్యత్త
చ్ఛబ్దా శ్శబ్దాంతరాన్వయే బహుళం, హ్రస్వం ప్రపద్యదీర్ఘా, ద్విత్వముపర్యక్షర
స్య జనయంతి" యను వాగనశాసన సూక్తిచొప్పున నయ్యది, యియ్యదియను
మొదలగుచోట్ల వచ్చిన ద్విత్వానుమాపక రేఖలేవి? యశ్రుత్యనుమాపకరేఖ
యజ్రేఖయే యైనయెడల ద్విత్వవిధి నిష్పన్నవర్ణానుమాపకరేఖయు నజ్రేఖ
యేకావలెను. అట్లయినచో నయ్యదియను రూపమునకు మాఱుగా, "నలఅది"
యనురూపము సిద్ధించును. ఒకవేళ ద్విత్వవిధినిష్పన్న వర్ణానుమాపకరేఖ హ
ల్రేఖారూపమని గ్రహించినను, నయ్యది యనుదానికి మాఱుగా "నలయది"
యను రూపముసిద్ధించును. ఇట్టి యనిష్టరూపములను నంగీకరింతురా? మఱియు,
"నెయ్యముగల్గిన నతనికి, నయ్యాతివకు." నను మొదలగు కందాదులయందుఁ
బ్రాసములెట్లు సాధువులగును.? కాఁబట్టియె "యశ్రుతిమార్యా" యనుదానికి
నచ్చునకుఁ బరమగునచ్చు యశ్రుతిమత్తగుననియు, నట్టి యశ్రుతిలోని యకార
మే లఘుయకారమనియు నహోబలపతి వ్యాఖ్యానముచేసియున్నాఁడు. చిన్న
యసూర్యాదులును యడాగమము విధించిరి. ఈరీతిని సంస్కృతమునకు విలక్షణ
ములగు మార్పులు వ్యవహారమునుబట్టియు, సౌచిత్యమునుబట్టియు నాంధ్రవై
యాకరణులు చేసియున్నారు.

కావునఁ దెనుఁగున వాక్యమధ్యమున సంహిత నిత్యమయి యార్యవ్యవహా
రసిద్ధమగుటచే, "వాక్యేతుసావివక్షా మపేక్షతే," యను దానినిమాఱ్చి వా
క్యాంతమందు సంధివికల్పమని, "నస్యాద్వాక్యవిరామేతు, సంధ్యభావోపిదోష
కృత్త" నుకారికచే నథర్వణుఁడు స్పష్టపఱచెను. మఱియు వాక్యము విలంబో
చ్చరితమగునపుడు దాసత్తికి భంగముగలుగును. వేయేల! వ్యాకరణముయొక్క

గంధమునైన నాఘ్రాణింపనిబాలునిచే మాటలాడించినచోఁ దెనుఁగుభాషయం దలి వాక్యగర్భమున నిత్యసంహితయొక్క నైసర్గికత స్పష్టపడును. కాఁబట్టి సంస్కృతభాషా నియమముల నన్నిటిం దెలుఁగునఁదోఁపింపఁ బ్రయత్నించుట యతి సాహసము.

సంహిత వివక్షింపనిచో "దధి + అత్ర" యనుచోట "దధిఅత్ర" యని విసంధిగ సంస్కృతమున నెట్లుండవచ్చునో యట్లే తెనుఁగునందును "పెరుగు ఇక్కడ" నని విసంధిగనుండవచ్చునని శాస్త్రులవారు సిద్ధాంతీకరించియున్నారు. ఒకప్పుడు సంహిత వివక్షించినపక్షమున సంస్కృతమునందువలె యణాదేశము రాఁగాఁ "పెరుగ్విక్కడ" ననియు నగునని సిద్ధాంతముచేయుదురు కాఁబోలు!

"ఏకఃశబ్దః సుప్రయుక్తస్సమ్యగ్జ్ఞాతస్స్వర్గే లోకే కామధుగ్భవతి"యను మొదలగు శ్రుతిప్రపంచముచొప్పున నిహపర సాధకములగు సుశబ్దములెవ్వి? కేవల గీర్వాణపదములా? లేక తత్తద్భాషలలో నార్య వ్యవహారమూలకము లగు వ్యాకరణములకు సమ్మతములగు పదములా? మొదటిపక్షమునఁ దెలుఁగు భాషయే సంస్కృత ప్రాకృతాపభ్రంశమగుటచే నిందు సుశబ్దాపశబ్దముల నెంచుకొనుటయే యసంగతము. రెండవపక్షమున నట్టివ్యాకరణము లాంధ్రశబ్దచింతామణి ప్రభృతులేగదా? అట్టిగ్రంథములం దెచ్చటనైన వాక్యగర్భమున సంహిత వైవక్షికమనిగాని, సంహిత వివక్షింపనపుడు సంధిలేదనిగాని చెప్పఁబడియున్నదా? ఒకప్పుడు సంధివిషయమున సంహితాధికారము చెప్పకున్నను న్యాయ సిద్ధమగునందమన్న "నస్యాద్వాక్య విరామేతు, సంధ్యభావోపి దోషకృత్త"ను నాథర్వణికసూక్తి విరోధించును. వాక్యమధ్యంబుననె సంధి వివక్షాధీనమయిన పుడు వాక్యాంతమున సంధిలేకున్నను దోషముగాదని చెప్పవలసియుండునా?

ఇఁకశాస్త్రులవారు పైయథర్వణసూక్తి సంస్కృతమునకు సరిగాలేదు గనుక నది యాదరణీయముగాదని యభిప్రాయపడిరి. "మ్లేచ్ఛామాభూమేత్యధ్యేయం వ్యాకరణ" మ్మను మొదలగుసూక్తుల నుదాహరించి వ్యాకరణాను సారముగా భాషవాడవలెనని చెప్పుచు వ్యాకరణముల నుల్లంఘించుటసరియా? లేక తెలుఁగుభాషయు నుత్తమమగు సంస్కృత వ్యాకరణముచొప్పున వ్యవహరింపఁబడుగాక యని యుద్దేశమా? "సంహితైక పదేనిత్యా" యను కారిక యాంధ్రభాషోపయోగి గాదని యాంధ్రవైయాకరణుల యభిప్రాయమని శాస్త్రుల వారు గ్రహింపకుండుట యాశ్చర్యముగనున్నది. మఱియు "నిత్యాధాతూప

సర్గయో” యనునదియే యాకారిక యాంధ్రభాషోపయోగిగాదనుటకుఁ బ్రమాణము. ఇంతియెగాక మహాభారతమంతటి పెద్దగ్రంథమున నొకచోటనైన వాక్యమధ్యమున సంధ్యభావము లేకుండుటయే శాస్త్రిలవారివాదము సమాదరణీయము గాదనుటకుఁ బ్రబలాధారము. ఇఁక సీతారామాచార్యులవారి యాంధ్రశబ్దమంజరిలోని విసంధిప్రయోగములు నిర్దుష్టములై సీతారామాచార్యులవారికి సమ్మతములె యైనయెడల వారు తమప్రౌఢవ్యాకరణమున వాక్యమధ్యమున సంధి మాననగునని సూత్రించియేయుందురు.

ఇఁక నజ్బహుళమగు ప్రాకృతభాష “గిరః శ్రవ్యాదివ్యాః ప్రకృతిమధురాః ప్రాకృతధురా” యను సూక్తిచొప్పున నెట్లు మధురమైనదిగ నంగీకరింపఁబడెనో యట్లే “యతఁడు అప్పుడు అక్కడఉండె”నను విసంధిగల తెనుఁగువాక్యములును శ్రవ్యములయియే వినఁబడునని శాస్త్రిలవారు చర్చించియున్నారు. హల్వ్యవధానములేని యచ్చుల యుచ్చారణమే శ్రుతిసుఖమైనయెడల యశ్రుతికిఁ బ్రయోజనమేమి? ప్రాకృత భాషామాధుర్యమున కజ్బాహుళ్యము కారణమనుట యనుభవవిరుద్ధము. శ్రుతికటువులు నుచ్చారణమున శ్రమనిచ్చునవియు నగు విజాతీయహల్సంయోగాదుల వీడి సజాతీయవర్ణసంయోగాదులతోనుండుటచే నది మనోహరముగానుండుననుట లెస్స.

సంహిత వివక్షింపనపుడు విరామకార్యమగుననియు, నట్టియెడవిరామకార్యమగు ద్రుతలోపమురాఁగా “సుగ్రీవునితో అంగదుండు అంబుధిని ఉత్తరించె” ననియుండుననియు శాస్త్రిలవారొకయాకాశహర్మ్యమును నిర్మించినారు. సంహితవివక్షింపనపుడు విరామకార్యమగునని యాంధ్రవైయాకరణు లెచ్చటనైన విధించిరా? లేదు. సంహితవైవక్షికమని వారిసిద్ధాంతము కానపుడు తదాశ్రితమగు విరామకార్యము నెట్లువిధింతురు? మఱియు విరామమున ద్రుతలోపము వికల్పముగదా? అట్టియెడల ద్రుతలోపము రానిపక్షమున “సుగ్రీవునితోన్ అంగదుండున్ అంబుధిన్ ఉత్తరించెన్న” నియు నుండవచ్చుననియే గాఁబోలు శాస్త్రిలవారిసిద్ధాంతము! వాక్యోచ్చారణమువలె నుండక బాలురు పదచ్ఛేదము వల్లించుకొనుచుండు రీతినుండి మిగుల స్వభావవిరుద్ధముగా నుండునట్టియాస్థితియు సులువుగా నుచ్చరించిన నింపుగనే యుండునుగాఁబోలు! ఇష్టమయినవుడింపుగానుండదా?



వఝుల, చినసీతారామస్వామిశాస్త్రి.

# కౌ ర వ గౌ ర వ ము.

ఉ॥ పాండవపక్షపాతమునఁ బన్నిన భారతకావ్యకల్పనా
కాండమునన్మి యందఱును గౌరవపక్షమునం దసూయఁ గై
కొందురు గాని పాండవుల గోఁటును గౌరవపాళిలోటు నె
క్కుండును దుల్యబుద్ధి 'నిదికాదిదియా' నని యాడఁడే మొకో?

గీ॥ ధర్ము నంశమ్మునం బుట్టె ధర్మమూర్తి
నందనుఁడు పాండు ధారుణీనాథునకని;
యాంబికేయున కవగుణుం డైనకొడుకు
గలిగెఁ గలియంశమున నని కవిరచించె   2

మ॥ అలఘుప్రాభవభాసమానుఁడు మహీయశ్శౌర్యసంపన్నుఁడు
జ్జ్వలసౌందర్యధురంధరుం డఖిలశాస్త్రజ్ఞానవారాశిని
స్తులసల్లక్షణలక్షితుండు నగునాదుర్యోధనుం గేలిగాఁ
గలియంశమ్మునఁ బుట్టినాఁడనుచు వక్కాణింపగాఁ జెల్లునే?   3

ఆ॥ కుంతి ధర్మపుత్త్రకునిఁగనె నన విని
సుబలతనయ కడునసూయ నొంది
యుదరతాడనంబు నొనరించుకొనెనంట
యస్వభావవృత్తియగును? కాదో?   4

గీ॥ సదమలచరిత్ర మానినీజనమతల్లి
సౌబలేయి యుధిష్ఠిరు జన్మవార్త
విని యుదరతాడనంబు గావించుకొనునె
తలఁకి యాత్మీయగర్భపాతంబుగాఁగ?   5

చ॥ చిరపరివృద్ధహింస్రశతశృంగమహానగభూములన్ యుధి
ష్ఠిరుఁ డుదయించినప్పు డొకచీమచిటుక్కున లేదు హస్తినా
పురమున నాంబికేయునకుఁ బుత్త్రుఁడు పుట్ట సృగాలరాసభో
త్కరముల యూళలోండ్రలును గల్గుట కబ్బపడంగనేటికిన్?   6

సీ॥ దుర్యోధనుండని దుర్ముఖుండనియును,
దుష్కర్ణుఁ డనియును దుర్మదుఁడని
దుశ్శాసనుండని దుశ్శలుఁ డని వికటాననుండనియు బహ్వాశియనియు
దుర్మర్షణుండని దుర్ధర్షుఁడని దుష్పరాజయుఁడనియు దురాధరుఁడని
దుర్విమోచనుఁ డని దుస్సహుఁడనియు మహోదరుండనియు ననూదరుఁడని

గీ॥ దుష్ప్రధర్షణుఁ డనియును దుర్విగాహుఁ
డనియు నిట్టులు ధృతరాష్ట్రునాత్మభవుల
యందుఁ గొందఱ కసమంజసార్థదాయ
కములు పేళ్లు మహాభారతమునఁ గలవు. 7

క॥ కలరుగదా? యేవురు పు
త్రులు పాండునృపాల శేఖరున కాకౌంతే
యులలో నొక్కని కేనియుఁ
గలదె? యిటులపార్థనామకరణం బెందున్. 8

ఆ॥ వెలయఁ బంచపాండవులకును నశరీర
వాణియట్టిపేర్లు వలికెనందు
రాంబికేయసుతుల కట్టినామంబుల
నెవ్వరుంచినారొ? యెఱుకపడదు. 9

చ॥ జలనిధివేష్టితమ్మయిన సర్వమహీవలయమ్ము నేలును
జ్జ్వలమతి యాంబికేయుఁడు నిజప్రజకి ట్లసమంజసార్థముల్
గలిగినపేళ్లు వెట్టునె జగంబులు నవ్వఁగ; నవ్విపాండవే
యులపయిఁ బక్షపాతమున నొవ్వనివారలు నువ్వకుండిరే? 10

గీ॥ అకట! పెదతండ్రి సుతులన కభయవృత్తిఁ
దొలుత భీముఁడు పెనఁగి పదుండ్రఁ బదియు
నేవురను బట్టిపడఁగొట్టె యాడ్వఁదగునె
వీఁపులొలియంగ ధృతరాష్ట్రవిభుతనయుల? 11

చ॥ కెళకుళులందు వేడ్కజలకేళు లొనర్చుచువేళ ధార్తరా
ష్ట్రులను బలంబుమైఁ బెనఁగుచున్ దనమూఁపుపయి న్వహించినెం

జెలిమొఱవెట్టినన్ సరకుసేయక మచ్చరికంబుపేర్మి వ
_ర్తిలి యడుగంట ముంచుచును దేల్చుచుఁ గాటియపెట్టుటొప్పునే? 12

గీ॥ పంఙ్లకయి కౌరవులు చెట్లపైకి నెక్క
బలిమిభీముఁడా వ్రాఁకులఁ బట్టియూఁపఁ
బండ్లతో వారు ధారుణిఁబడుట నూచి
పరిహసింపఁగఁ దగునోటు పాండవులకు? 13

మ॥ అనుఁగుందమ్ముసి బిడ్డలంచుఁ దముసత్యంతానురాగమ్మునన్
మనుజాధీశ్వరుఁ డాంబికేయుఁడు సధర్మస్వాంతుఁడై పెంప నా
తనిగారాబు తనూజులం గలసి చేతః ప్రీతిమైనుండ కి
ట్లనుకామీనతనూని భీముఁడెడ సేయంజెల్లునే వారలన్? 14

గీ॥ చీటికిని మాటికిని జెల్మిసెడఁగ నిట్లు
వాయుపుత్త్రుఁడు కౌరవావళికి నెగ్గు
తలఁప వానికి వారెగ్గు దలఁపఁబోలు
నోడలు నెచ్చిన నేవార లూరకుంద్రు? 15

గీ॥ తమకు ననిలజుఁ డెన్ని చందాల నెగ్గు
లాచరించెనో కాక బాహాబలంబు
గల్గువాఁ డన్నమాత్ర నిష్కారణముగఁ
జంపఁజూతురె కౌరవేశ్వరుని సుతులు? 16

చ॥ క్రమమునఁ గ్రోధముల్బలియఁగా ధృతరాష్ట్రతనూజు లెవ్విధే
ని మిషలు వన్ని పాండుధరణీపతిసూనులనోర్వ నెట్టికృ
త్యము లొనరించి రన్ననది తప్పను టొప్పదు తొల్తవారిచి
_త్తము లెరియంగ వర్తిలుట ధర్మమె పాండుకుమార పాళికిన్? 17

ఆ॥ ముసలిచీఁకురాజు మూలమింతకు నని
బాదరాయణుండు పల్కెను గద?
యాంబికేయు నేరమావంత చూపెనే?
యాత్మజులను వీడఁడనుట దక్క. 18

క॥ తనతనయులకును దమ్ముని
తనయులకును భేదమైనతలఁపినంధమహీ

జనపాలుఁడు సుతపక్ష
మ్ముననుండక యొరులపక్షమున నెట్లుండుర్? 19

చ॥ ప్రవిమలకీర్తి పాండునరపాలుఁడు మద్రమహీశపుత్త్రియుర్
దివికరుగంగనప్డు వసుదేవసహోదరి పుత్త్రులుర్ ఋషి
ప్రవరుల వెంబడిం గరిపురంబున కేగిన, వారికంధపా
ర్థివుఁడిసుమంతయేని పొసఁగించెనె లోపము పాపవృత్తియై? 20

ఉ॥ ఎక్కడి పాండురాజపుడె యేగెదివంబున కవ్వసుంధరా
భుక్కునకాత్మసంభవులపుట్టుక యేడ? నఁటంచువీటిలోఁ
జెక్కురు పెక్కురీతులుగఁ జెక్కులు వల్కుచు నున్న నన్నిటిన్
లెక్క యొనర్పకే సుతుల లీల భరింపఁడె పాండుపుత్త్రులన్? 21

ఉ॥ అంచితమైన కూర్మి వెలయర్ ధృతరాష్ట్రుఁడు తండ్రిలేనివా
రంచుఁ దలంచి పాండువసుధాధిపసూనుల గౌరవించి పో
షించుటెకాక యర్హుఁడయి జ్యేష్ఠసుతుండు సెలంగుచుండినన్
గొంచకధర్మనందనునకుం దయసేయఁడె యౌవరాజ్యముర్? 22

ఉ॥ ప్రీలని యింపురర్ విదురభీష్ముల పంపునఁజేసి యంధభూ
పాలుఁడు యౌవరాజ్యపదబంధురుఁ జేసినమాత్ర భాగమే
లాలభియించుఁ బాండుతనయాగ్రణి? కాతఁడపేక్ష సేసినర్
గూలికివచ్చి పాలడుగఁ గొంకనియట్లగుఁ గాక యొప్పునే? 23

క॥ ధృతరాష్ట్రుని సామ్రాజ్యము
నతని పరోక్షమునఁ దాల్పనర్హుండగుఁ ద
త్క్షితినాథాగ్రతనూజుం
డితరుల నారాజ్యలక్ష్మి యెటువరియించుర్? 24

మ॥ సవిశేషమ్ముగఁ జర్చసేయమహిరాజ్యంబుర్ విభాగించి పాం
డవులం జేర్పమి దోషకృత్యమనియాడర్ రాదు దుర్యోధనుం
డవనీరాజ్యముఁ బంచి యీననుట తప్పా? పాండుపుత్త్రాళి క
య్యవిభాజ్యంబగు రాజ్యమందు నగఁబాలాసింపఁగాఁ జెల్లునే! 25

ఉ॥ అన్యకిరీటరంజితపదాబ్జుఁడు పాండునృపాలు పాలుసా
జన్యముమీఱి నిండని యజాతవిరోధి యొకండు రాజ సా

మాన్యవిధానముల్ విడి యమార్గము ద్రొక్కెనుగాక పూర్వరా
జన్యులలోన నెక్కఁడును సంతతికిన్ మహిఁబంచియిచ్చెనే? 26

తే॥ గీ॥ తనదు దౌహిత్రులకుఁ బ్రభుత్వంబురామి
దాశజనపతి గూఁతు శంతనున కీయ
సంమతింపమిఁ గాదె రాజ్యంబు వీడి
పెండ్లిమాని గాంగేయుఁడు భీష్ముఁడయ్యె? 27

తె॥ గీ॥ అంధభూపతి యర్ధరాజ్యం బిడినను
జెల్లదది కొడుకు సమ్మతి సేయఁడేని
భావిసుతశంకనే గదా పరిణయంబు
వదలి సన్యాసియయ్యె దేవవ్రతుండు? 28

గీ॥ సూదిమొన మోపినంత యిచ్చుటకునైన
మనసుపుట్టని యట్టులు మసలి తుదకుఁ
గుటిలవృత్తి నైదూళ్లేని కోరుకొనని
రాకరింపక యిచ్చునే రాజరాజు? 29

ఆ॥ పైతృకంబు రాజ్యభారంబు వహియింప
రాజరాజునకుఁ గరంబుసెల్లు
నతనిరాజ్యమెల్ల నాక్రమింపఁ గడంగు
పాండుపుత్రులేడ? భాగమేడ? 30

తే॥ న్యాయమున్నెడ జయము నన్యాయమున్న
యెడఁబరాజయమును గల్గు నింతయేల
పాండవుల పక్షమే న్యాయబద్ధమగుట
జయము సేకుఱెనని జను ల్వాలుకఁదగదు. 31

ఉ॥ ఏరిని నమ్మి కౌరవన రేశ్వరపుత్త్రులు పోరఁ జొచ్చిరో
వీరలు భీష్మముఖ్యులగు వీరులు పాండవపక్షపాతులై
నారుగదా? యిఁకెవ్వరు రణంబున నెట్లు పెనంగులాడిరన్
గౌరవపాళికిన్ జయము గల్గెడు భాగ్యము సంభవించెడున్? 32

ఆ॥ కర్ణు నర్ధరథుఁడుగాఁ బల్కుటయు నాజి
ధర్మసుతునితోడ దానమబచ్చు

తెలుఁగుఁ జెప్పుటయును గుఱితింప గాంగేయు
పక్షపాతబుద్ధి బయలుపడదె? 33

ఉ॥ ఉత్తరప్రగల్భముల్ వలుకు నుత్తరుకంటెను భారతమ్ములో
నెత్తఱిబాదగానఁ బడఁడెవ్వఁడు; వీనిని నిందుకొల్పులో
నెత్తి మహారథుం డనియె నీకురువృద్ధుఁడు వానికంటె లో
కోత్తరుఁడైన కర్ణుఁ డసదో తన కర్థరథుం డఁటంటకుర్ణ? 34

తే॥ పార్థుఁ డేయు నమస్కారబాణములకు
నుబ్బి ద్రోణుఁడు సైంధవు నుక్కడంపఁ
బోవు నరునకుఁ దెరువిచ్చె భూమిసురులు
కల్లదండము లిడువారి గారవింత్రు. 35

తే॥ కర్ణుఁ డన్యాయమున కొడిగట్టఁ డేని
పెక్కుతడవలు తనచేతఁ జిక్కినపుడు
ధర్మనందనునిన్ వృకోదరునిఁ గవలఁ
బోవనిచ్చునె ప్రాణముల్ పుచ్చుకొనక? 36

ఉ॥ ఓహరి సాహరిం బరుల నోర్చుచుఁ బట్టపగంటి సూర్యుఁడై
సాహసవృత్తి సంగరము సల్పెడు కర్ణునిమ్రోల విద్విష
ద్బాహుబలంబు మాటికినిఁ బ్రస్తుతి సేయుచు నాతని న్నిరు
త్సాహు నొనర్చి చంపఁడొకో శల్యుఁడు నామము సార్థకమ్ముగన్? 37

సీ. గాంగేయు బాహువిక్రమమునఁ బరిమార్చి
రే కాళ్లఁబడిదేవురించిగాక?
త్రుంచిరే బలిమిమై ద్రోణు నశ్వత్థామ
హతుఁడయ్యె నని కల్లలాడిగాక?
నిజశక్తి రాధేయునిం గూల్చిరే చేత
విలులేని సమయంబు వెదకిగాక?
సమయించిరే శల్యు సమరపాండితి బాంధ
వమ్మున మోమోట పఱచిగాక?

గీ. బీరమునఁ గురునాథునిఁ బిలుకుమార్చి
రే నయముమాలి తొడలపై వ్రేసిగాక?

పాండవులగెల్పు కపటకార్పణ్యముల నె
ఖడ్గమునఁ గాదు న్యాయమార్గమునఁ గాదు. 38

గీ. అకట! గోరంతలున్నఁ గొండంతలగుచుఁ
గౌరవులతప్పిదమ్ములు గణనకెక్క-
నట్లు గోరంతలున్నఁ గొండంతలగుచుఁ
బాండవులయొప్పిదమ్ములు బయలుపడియె. 39

ఉ. వ్రాయఁగవచ్చు వ్యాస మునివర్యుఁడు వ్రాసినయట్టి భారతా
మ్నాయములోని యంశములు మాఱిచి కూరిచి వేఱె భారతా
మ్నాయము ధార్తరాష్ట్రులదిన్యాయము పాండుకుమారపాళి ద
న్యాయమఁటంచు లోకములు నమ్మఁగ, నమ్మరుగాక పండితుల్.

క. కవి తన చాతుర్యంబున
నవునది కాదనియుఁ గానిమది యగు ననియున్
వివరింపఁజాలు నద్దా
ని విచారణసేయు టొప్పు నిజమెఱుఁగంగన్. 40

రామకృష్ణకవులు.

# ద్రావిడభాషా పంచక నిరూపణము.

(రెండవ భాగము.)

## ఆంధ్ర భాష.

ప్రకృతకాలపుఁ దెలుఁగుదేశమువారు స్వదేశమును విడిచి సులభముగా నన్యదేశములకుఁ బోఁదగిన ధైర్యసాహసములు గలవారు గాకున్నను ద్రావిడజాతులలో మిక్కిలి విపులమయినశాఖవా రనుటకు సందియము లేదు. తొంటికాలమున నౌన్నత్యముఁగాంచిన పాండ్యచోళరాష్ట్రములఁ దొలఁగఁద్రోసినమహాయోధులయొక్క సంతతివా రగు రెడ్లు నాయఁడ్లు మొదలగు తెలుఁగుజాతివారు తమిళదేశములో స్థిరనివాసులుగా నేర్పడినను దెలుఁగుభాషనే మాట్లాడుచున్నారు. ఇట్టివారిసంఖ్య సుమా రొకకోటియేఁబదిలక్షలున్నది. ఇప్పటి తెలుఁగుజాతివారు ద్రావిడశాఖవారిలో విదేశముల వెంబడిఁదిరుగుచో అవగలవారు కాకపోయిన నొకకాలమందుఁ దక్కిన జాతివారికంటె వీరే ప్రచురముగా విదేశగమన మొనర్చినట్లు చరిత్రమువలనఁ గానవచ్చుచున్నది. ఈకాలమునందు పౌరస్త్యద్వీపగుచ్ఛము (Eastern Archipelago.) నందుఁ గానవచ్చు కాళింగులనఁబడుహిందువులందఱు నిజముగాఁ దమిళజాతివారు. వీరు తూర్పున వ్యాపారముచేయుచు నచట స్థిరపడినవా రయి పూర్వము తెలుఁగువారిచే నాక్రమింపఁబడిన ప్రదేశములను స్వాధీనపఱచికొని తమపూర్వు లయిన తెలుఁగుజాతివారు పొందిన కళింగశబ్దవ్యవహారమును గూడ నొందిరి. క్రీస్తుశకముయొక్క ప్రథమాబ్దశతకములయందు జావా సుమత్రా మొదలగుదీవులయందు రాజ్యములను స్థాపించి దేవాలయములను నిర్మించి స్థిరపడిన హిందూజాతివారు తెలుఁగువారు గాని తమిళజాతివారు గారు. ఎట్లనఁగా బదునాలు పదునేడవశతాబ్దములలోఁ దమిళదేశము తెలుఁగువారిచే నశింపఁ జేయఁబడినది. పదునొకండవశతాబ్దములో తెలుఁగుదేశమందు చోళరాజులవంశము స్థాపింపఁబడినతరువాత నీతమిళజాతివా రచట మఱల రాజ్యమును స్థాపించి స్థిరపడినటులఁ గానరాదు.

సంస్కృతపండితులచే నీతెలుఁగుభాష యాంధ్రభాష యని వ్యవహరింపఁబడుచున్నది. ఆంధ్రభాష యనఁగా నాంధ్రదేశస్థులయొక్క భాష. ఆంధ్రులని

యుఁ గళింగులనియుఁ దెలుఁగువారు రెండు తెగలవారు. ఈయాంధ్రు లనెడువారు కళింగులకంటెఁ బ్రాచీనార్యుల కెక్కువపరచితు లన్న విషయమును ఋగ్వేదబ్రాహ్మణమయిన మైతరేయబ్రాహ్మణకృతాంధ్రప్రస్తావనచే స్పష్టమగుచున్నదని యుపోద్ఘాతములో నుడివియుంటిని. ఆంధ్రరాజవంశ మొకటి యుత్తరహిందూస్థానమందుఁ బరిపాలన మొనర్చినట్లు విష్ణుపురాణాదులయందుఁ గానవచ్చుచున్నది. మెగాస్థనీస్ తరువాతివాఁడైన ప్లినీ(Pliny)యనువాఁడుగూడఁ దా నీయాంధ్రుల నెఱింగి నట్లొకగ్రంథమందు వ్రాసియున్నాఁడు. క్రీస్తుశక మేడవశతాబ్దియందు చీనాదేశీయుఁడగు హుయాంథసాం గనుయాత్రికుఁ డొకఁడు లిపులకుఁ బరస్పరసాదృశ్య మున్నను నాంధ్రులయొక్కభాష మధ్యహిందూస్థాననివాసులయొక్కభాషకంటెఁ గొంచెము విజాతీయముగా నుండె నని నుడివెను. ఇందువలన నీయాంధ్రశాఖవారిలోఁ దెలుఁగుభాష కొంతయభివృద్ధి నొందెనని స్పష్ట మగుచున్నది. భాషావిషయమయినసంస్కార మంతగా లేని కళింగులు నీయాంధ్రులు ననుశాఖాద్వయము వారు వ్యవహరించెడు నుభయసాధారణభాషకు సంస్కృతపండితులాంధ్ర మనుపే రిడుట స్వాభావికముగా సంభవించెను. తెలుఁగుజాతివారు తమభాషను దెలుఁగని వ్యవహరించిరి. త్రిలింగము తెలుఁగు ననునవి దీని కర్థాంతరములు. మహమ్మదీయులు మొదలయిన విదేశీయుల నోళ్లలోఁబడి యీశబ్దము మఱింతవికృతి నొందెను. తెలుఁగనుశబ్దమే మొదటిరూప మనియు నీభాషామాధుర్యమునుబట్టి చూడ తేనె యనుశబ్దమునుండి యిది యుద్భవించిన దనినచో దీనివ్యుత్పత్తి బాగుగ నుండు ననియుఁ గొందఱు పాశ్చాత్యపండితులు వక్కాణించిరి. తేనె, తెనుఁగు నను నీశబ్దములయొక్కపరస్పరసాదృశ్యమునుబట్టియు విచారింపఁగా నీవ్యుత్పత్తి సరిగానున్న దనియు మఱికొందఱు దోషజ్ఞులు సమర్థించుచున్నారు.

తెలుఁగుపండితులు తెలుఁగనుశబ్దము త్రిలింగశబ్దతద్భవ మని సిద్ధాంతీకరించిరి. క॥ శ్రీశైలభీమ కాళే శ్వర। దాక్షారామంబు లనఁగఁ దనరారెడునీ। త్రిక్షేత్రంబులలింగములీక్షితినిఁ ద్రిలింగసంజ్ఞ నెన్నిక కెక్కెన్॥ అనునీపద్యమును బట్టి శ్రీశైలము దాక్షారామము కాళేశ్వరము నను త్రిక్షేత్రముల లింగములమధ్యమున నుండుదేశము త్రిలింగదేశ మనియుఁ దెలుఁగు త్రిలింగశబ్దభవ మగుటం జేసి యీదేశమునకుఁ దెలుఁగుదేశ మను పేరు గలిగె ననియు మనపండి

తుల యభిప్రాయము. (Campbell) అను నొక యాంగ్లేయపండితుఁడీవ్యుత్ప
త్తియొక్క సామంజస్యము మిక్కిలితృప్తికరముగా నున్నదని తా నొకగ్రంథము
లో వ్రాసెను. కాని యాంధ్రనిఘంటుకర్త యగుబ్రౌనుమహాశయుఁడీవ్యుత్పత్తి
నాధునికపండితులు గల్పించిరి గాని యథార్థము గాదనియుఁ దెలుఁ గనుశబ్దము
ధాతునిష్పన్న మయినది కాదనియుఁ జెప్పి ఖండించెను. ఇది సరికాదు. తెలుఁగ
నునది త్రిలింగశబ్దభవ మనుటకు లేశమును సంశయము లేదు. ఇది మనపండితుల
స్వకపోలకల్పిత మని పడమటిపండితు లాక్షేపించినను నీ కల్పనయందుండు చమ
త్కారము నైన మన మొప్పుకొనక తీరదు. పురాణములలో వక్కాణింపఁబడిన
దేశనామములలోఁ ద్రిలింగ మనుపే రెచ్చటను గానరాకపోయినను నట్టిపే రుం
డుట యితరమూలముల వలన సంపాదింపఁబడు ప్రమాణాంతరములచే సమ
ర్థింపఁదగియున్నది. బౌద్ధమతగ్రంథసమితిని బాగుగ విమర్శించిన తారానాథుఁ
డనుగ్రంథకర్త తెలుఁగుదేశమునకుఁ ద్రిలింగ మనుపేరు గలదనియుఁ గళింగ మను
నది త్రిలింగదేశములో నొకభాగ మనియుఁ దఱుచుగాఁ జెప్పియున్నాఁడు. పురా
ణములకాలముకంటెఁ బ్రాచీనతరమయినకాలమందున్న టాలమీ యను గ్రీకుదే
శీయుఁ డిండియాలోఁ ద్రిలింగమనుదేశమునుగూర్చి తాను వినియున్నట్లును నది
గంగానదికిఁ దూర్పుభాగమం దున్నట్లును వ్రాసెను. కాని యతఁడు చెప్పినదేశ
నామములు విశ్వసనీయము లయినట్లు నతఁడు నిర్దేశించిన దేశస్థానము లంతనమ్మఁ
దగినట్లును గానరాదు. హిందూదేశమునకు వచ్చిన వర్తకులవలనను నావికులవల
ను నతఁ డీసమాచారమును వినియున్నా నని వ్రాసెను. ఇతని కావర్తకులు త్రి
లింగదేశము గంగానదికిఁ దూర్పుభాగమందో దక్షిణభాగమందో యున్నదని
నిశ్చయముగాఁ జెప్పక గంగానది కవతలిభాగమం దున్నదని చెప్పియుందురు. రో
మకశాసనములను వెల్లడిచేసిన రోమకదేశీయుఁడగు ప్ల్యూటుంజ రనువాఁడు వి
లదేశవృత్తాంతమును పూర్ణముగా సంగ్రహించి కృషిచేసి వ్రాసినగ్రంథములో
గూడ Andre-Indi అని స్వదేశభాషానామముచే మనయాంధ్రదేశమును వి
మర్శించి యది గంగానదికవతల నున్నదని వ్రాసెను. Try-glypton లేక Trigly
phon అనుగ్రీకుభాషాపదముచే నీత్రిలింగశబ్దమును దర్జుమాచేసి గ్రీకుదేశము
వాడుకచేసిరి. కావునఁ ద్రిలింగ మనునది యొకరాష్ట్రముయొక్క పేరుగా
గాని యొకరాజ్యముయొక్క రాజధానిపేరుగాఁగాని టాలమీ యనువాఁ
కాలమునకు ముందుగానే వ్యవహారములో నున్నట్లు చరిత్రప్రామాణ్యము

మన మొప్పుకొనవలసియున్నది. ఇంతియ గాక గ్రీకుదేశీయుఁడైన ప్లినియ నువాఁడు మోడగలింగమ్ (modagalingom) అను మఱియొకపేరు నీత్రిలింగదేశమున కిచ్చియున్నాఁడు. ఇందుకు కాంబెల్ మహాశయుఁడు తానువ్రాసిన తెలుఁగువ్యాకరణముయొక్క యుపోద్ఘాతములో "మోడగ" యనునది మన మిప్పుడు వాడుకచేయు "మూఁడు" అనుసంఖ్యావాచకమునకుఁ బ్రాచీనరూపమని చెప్పి మోడగలింగము, త్రిలింగము నొక్కటియే యని సమర్థించెను. ఈరెండింటికి నైక్య మంగీకరింపఁబడినయెడలఁ ద్రిలింగముయొక్క ప్రాచీనత దృఢముగా స్థిరపఱుపఁబడుటయే గాక తమభాషకుఁ బ్రాచీననామము త్రిలింగ మనియు నిదియే క్రమముగా మాఱి తెలుఁగనుపదముగా నేర్పడిన దనియుఁ జెప్పు మనపండితులసిద్ధాంతము గూడ స్థిరపఱుపఁబడుచున్నది. కొందఱు త్రికళింగశబ్దములోని కకారమును లోపింపఁజేయఁగాఁ ద్రిలింగమయినదనియు నాత్రిలింగమునుండి తెలుఁగనుపదము పుట్టినదనియు నొకయపసిద్ధాంతమును గల్పించియున్నారు. ఇదిసరిగాదు. త్రికళింగశబ్దవికృతి యగు త్రిలింగమునుండి తిరిగి తెలుఁగను వికృత్యంతర మెట్లు జనించును?

ఈయాంధ్రభాష ప్రాచీనతలో నరవభాషకు రెండవదియని లోఁగడఁజెప్పియున్నాఁడను. దీనికి బృహస్పతి, కణ్వుఁడు, పుష్పదంతుఁడు మొదలగువారు ప్రథమవ్యాకరణ కర్తలు. వీరువ్రాసినగ్రంథములు కాలక్రమమున నంతరించినవి. వీరి తరువాత నథర్వణాచార్యు లనుమహాపండితుఁడు తనకాలమునకుఁ బండితజనవ్యవహారములో నున్నభాషకు నిబంధనల నేర్పఱచి కారికారూపముగా నొకవ్యాకరణమును రచియించెను. దీనికే యథర్వణకారిక యనిపేరు. పదునొకండవశతాబ్దములో రాజమహేంద్రనగరమందుఁ బరిపాలన మొనర్చినరాజరాజ నరేంద్రుని యాస్థానపండితుఁడైన నన్నయభట్టారకుం డాంధ్రభారతమును రచియించి యాంధ్రశబ్దచింతామణి యనునొకవ్యాకరణగ్రంథమును వ్రాసెను. ఇతనికంటెఁ బూర్వులయినకవులు గ్రంథకర్తలు తత్కృతగ్రంథములు నుండఁబోలును గాని కాలవశమున నంతరించుటచేఁ దన్నామవ్యవహారమునైనఁ గానము. అట్టిగ్రంథంబులు లేకుండినచోఁ దద్భాషానిబంధనల నన్నయభట్టారకాదు లెట్లు నేర్పఁగలిగిరి? పిమ్మటఁ బదునైదవశతాబ్దములో నాంధ్రభోజుఁడని ప్రఖ్యాతిఁగాంచిన కృష్ణదేవరాయలకాలమం దీయన్యభాష పొందవలసినయుచ్చస్థితి నొందెను.

లోఁగడఁ జేర్కొనఁబడిన తూలూభాషకుఁ బ్రత్యేకముగా లిపిలేక కర్ణాటాక్షరములతో లేఖనవ్యవహారము నడిచినట్లు తొలుత నీయాంధ్రభాషకు స్వతంత్రలిపి లేకుండుటచేఁ గర్ణాటాక్షరములతో లేఖనకర్మము కొంత కాలము నడిపింపఁబడిన దనియుఁ బిదప నేర్పాటు నొందింపఁబడిన యీయాంధ్రాక్షరములు కర్ణాటాక్షరవికృతులనియు దాక్షిణాత్యదేశ లిపికోవిదులయిన బర్నెల్ పండితుఁడు మొదలగువారు సిద్ధాంతీకరించిరి. ఇంతియగాక మఱియొకవిశేషము. ఆంధ్రభాషకుఁ గన్నడభాషకు లిపిసాదృశ్యమే గాక కర్ణాటభాషాపదములు గూడ నాంధ్రభాషలో బహుళముగా సంక్రమించియుండుటచే శ్రీనాథకవి తానురచించిన భీమఖండమందు,

గీ॥ పలుకునుడికారమున నంధ్రభాషయండ్రు।
ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాషయండ్రు।
ఎవ్వ రేమన్న నండ్రు నాకేమి కొదువ।
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష॥

అని వ్రాసియున్నాఁడు. అరవము, కన్నడము, ఆంధ్రము, తూలూ అనునీనాల్గుభాషలయొక్క పదములకుఁగల పరస్పరసంబంధమును బరస్పరసాదృశ్యమును దెలియఁజేయుపట్టికను వానికిఁదగినయుపపత్తులను ముందు రాబోవువ్యాసభాగములోఁ గనఁబఱుపఁ దలంచియున్నాను గావున నింతతో నీప్రసంగమునుండి విరమించుచున్నాను.

## ఈద్రావిడభాషలు సంస్కృతభాషానిరపేక్షములు.

మనసంస్కృతపండితులు ప్రాచీనులయిన పాశ్చాత్యపండితులు నీద్రావిడభాష లుత్తరహిందూస్థానమందు వ్యవహరింపఁబడుచున్న బంగాళీ, హిందీ మొదలగుభాషలకు విజాతీయములై యున్నను నివియు వానివలెనే సంస్కృతభాషనుండియే యుత్పన్నము లయినవని స్థూలదృష్టితోఁ దలంచుచున్నారు. కాని యీభాషలు ప్రాచీనకాలమునుండియు స్వతంత్రము లనియు నీభాషలలో సంస్కృతశబ్దములు కొన్ని తత్సమరూపముగాను మఱికొన్ని తద్భవరూపముగాను గొంతమట్టునకుఁ గలిసియున్నను నీభాషాకుటుంబములోఁ బ్రతిభాషకును సంస్కృతశబ్దసాంకర్యగంధరహిత మయిన స్వతంత్రశబ్దజాలమే హెచ్చుగ నున్నదనియు మనవారు గాని పాశ్చాత్యపండితులు గాని కొన్నిసంవత్సరములక్రిందటి

వఱకు నెఱుంగరు. శబ్దశాస్త్రసిద్ధాంత (Philogical principles) వేత్తలయికొంచెముభాషాతారతమ్యజ్ఞానముగలవారయి ద్రావిడభాషాపదజాలములందునువాని వ్యాకరణములందును గృషిచేసి సంస్కృతశబ్దశాస్త్రనిబంధనలతోఁదైపారు వేయఁగలవా రెవ్వరైనను ద్రావిడభాషలయొక్క-ధాతురూపములుగాని క్రియాపదములుగాని వ్యాకరణనిబంధనలుగాని సంస్కృతభాషనుండిపుట్టినవని చెప్పుటకిష్టపడరు. బంగాళీ, హిందీ మొదలగునౌత్తరీయగౌడభాషలవలె నివి సంస్కృతమునుండి యుత్పన్నము లయినవని చెప్పుట కేవలము భ్రాంతికల్పనము. ఈభాషలలో లేశమును సంస్కృతపదసంబంధములేనిశబ్దజాలము వీనిలోఁ గలిసిన సంస్కృతశబ్దములకంటె దశగుణ మధికము. సర్వనామములు, సంఖ్యావాచకములు, ధాతునామాదినిష్పత్తులు, వాక్యసంగ్రథన ప్రకారముననునవి యన్నియు సంస్కృతమునుండి కేవలము విభిన్న మయినమఱియొకజీవద్భాషయొక్క- ప్రాణ మనిపించుకొనఁబడుచున్నవి. సంస్కృతమునుండి యీభాష లుత్పన్నము లయినవని సిద్ధాంతీకరించు తూర్పుదేశభాషలఁజదివిన పడమటిపండితులు (Orientalists) ద్రావిడభాషానిఘంటువులలో వ్రాయఁబడిన మారని సంస్కృతపదములను గాని తద్భవపదములను గాని కొన్నిటి నీక్షించి సంస్కృతములోనుండి యీభాషలు పుట్టినవని యొకయపసిద్ధాంతమును గల్పించిరి గాని యట్టిశబ్దములు దేశభాషాపండితులచే ద్రావిడభాషాశబ్దములుగాఁ బరిగణింపఁబడక తద్భవములుగా నెన్నఁబడుచున్న వనియును వారెఱుఁగరు. దాక్షిణాత్యభాషాపదసంఘములో స్వచ్ఛద్రావిడపదములే బహుళముగా నున్నవనియు నవి తద్భవములనుండి వేఱుచేయఁబడి నిఘంటువులలో వ్రాయఁబడిన వనియు నవి స్వచ్ఛమయిన దేశభాషాపదములను విశేషణముచే వ్యావర్తితము లయినవనియుఁ గూడ వారు దెలిసికొన వలసియున్నది.

ఆర్యులీభరతఖండమునకుఁ జేరకమునుపటినుండియు నీద్రావిడభాషలు దేశమం దెల్లెడల వ్యాపించియున్న వన్నందు కనేకప్రమాణములు గలవు. ఆర్యులీభరతఖండమునకు రాకమును పుత్తరహిందూస్థానము నాగరకత లేని యాదిమ నివాసులచే వ్యాప్తమయి యుండెను. వీరినే వారు దస్యువులని నిషాదులని మ్లేచ్ఛులని వ్యవహరించిరి. ఆర్యులీదేశమందంతటను వ్యాపించినతరువాత వీరి సంస్కృతభాషాపదములు వీరితోఁ దఱుచు సంబంధము గలిగి యుండు నాదిమ

నివాసులభాషలోనికి బహుళముగాఁ బ్రవేశింపవలసివచ్చినది. అట్లే యాయాద్య మ నివాసుల భాషాపదములు గొన్ని యార్యులభాషలోనికిఁగూడ సంక్రమించి యందులోఁ గలిసిపోయినవి. అట్లు ప్రవేశించి వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్య యాది వికారముల నొంది వ్యవహరింపఁబడుపదములకే తద్భవపదము లనిపేరు. కన్నడము, అరవము మలయాళము మొదలగుద్రావిడభాషలను జిరకాలము నుండి కూలంకషముగా వ్యాసంగము చేసి నిఘంటువ్యాకరణాదిగ్రంథములను వ్రాసి యాయాయిభాషలకు గొప్పనిర్వాహకులనిప్రసిద్ధినొందిన(Dr Gun dart) డాక్టరుగుండర్టు, (Kittel) కిట్టెల్, (Caldwell) కాల్డువెల్ మొదలయిన పాశ్చాత్యపండితులు ద్రావిడభాషలలోనుండి సంస్కృతములోనికి నెరువుగాఁ దెచ్చుకొనఁబడినవియని వందలకొలఁది పదములజాబితాలను దమతమగ్రంథము యం దుదాహరించియున్నారు. వానిలోఁ గొన్నిటి మాత్ర మీదిగువను వ్రాయుచున్నాను.

| సంస్కృతము. | ద్రావిడము. |
|---|---|
| ఎడ-ఎడక=మేక | ఆడు=ఆడుధాతువు |
| కరవాల=కత్తి | కై-వాల్-కై=చేయి-వాల్=కత్తి |
| కేయూర=అంగదము | కై=చేయి + ఉరు=ఉపయోగించునది. |
| మర్కట=కోఁతి | మరం=చెట్టు |
| భిల్ల=కొండవాఁడు | విల్-బిల్=విల్లు |
| కూల=తీరము | కుళం=చెరువు |
| ఖట్వా=మంచము | కట్టిల్ |
| మీన=చేప | మీన్ |
| నీర=నీళ్లు | నీర్ |

శవ=శవము { శాల్ = పోవుట-తమిళము
శా = తమిళము
చా = మలయాళము
శా = కన్నడము
సెయి = తూలు }

ఇట్టిశబ్దములు సుమారునన్నూటయేఁబదింటిని కిట్టెల్ పండితుఁడు తాను గూర్చిన కర్ణాటాంగ్లేయనిఘంటువుయొక్క భూమికలో వ్రాసియున్నాఁడు

కుమారిల భట్టాచార్యుఁడు తానురచించిన తంత్రవార్తికమనుపూర్వమీమాంసాగ్రంథమం దీదిగున వ్రాసియున్నాఁడు. "ఆర్యావర్తవాసుల కజ్ఞాతములయినమ్లేచ్ఛపదములను (దేశభాషాపదములు) మనము స్వీకరింపఁదగునా తగదా యని శంకించి మనసాంస్కృతిక ప్రత్యయముల నాపదములకొనకుఁ జేర్చినయెడల వానిని సంస్కృతపదములుగా మార్చువచ్చును. అవి మనకుఁ బ్రయోగార్హము లగును" అనియుపదేశించినాఁడు. ఆతనిచే నుదాహరింపఁబడిన యట్టిశబ్దములలో 'చరు' శబ్దము మొదటిది. ఇది యరవభాషాలో 'శోరు' అను దానినుండి పుట్టినది. కాని యిట్లుచెప్పుట యిప్పటిమన శుద్ధపండితులకు మనస్సున నెంతయు నాగ్రహమునుబుట్టించును. వారు 'చర' గతిభక్షణయోః అనుధాతువునుండి నిష్పన్నమయిన యీచరుశబ్దము చిరకాలమునుండి శ్రౌతస్మార్తాదికర్మబోధకగ్రంథములయందు వాడుకచేయఁబడుచున్నదే, ఇట్లు చెప్పనగునా యనిఖండించెదరు. కాని వారికే, కొంచెము శబ్దశాస్త్ర(Philology) రహస్యము సంస్కృతవాఙ్మయచరిత్రము(History of Sanskrit Literature) దెలిసినచో నిట్లు కోపింపరని నానమ్మకము. నిలింపశబ్దము నిట్టిదియే. నిల్ + ఇమై=నిలువఁబడుతెప్ప అనునర్థమిచ్చు తమిళశబ్ద మిట్లు మాఱినది.

కంబల = (కర్ = నల్లని. బలి = వస్త్రము)

కీలాల = (కీ ల ఆల = ఎఱ్ఱనినీరు.)

కుంతల = కుడల్ అనుదానినుండి.

గండ = (కుండల — అరవము.)

కనక = (కెంకు — అరవము.)

ముదిర = (ముగిల్ — అరవము.)

పక్ష = (పక్క.)

మీన = (మిను = మెఱయుట.)

ఇట్లనేకశబ్దము లున్నవి గాని గ్రంథవిస్తరభీతిచే నిచట వ్రాయుట మానితిని. తెలుఁగు, అరవము, కన్నడము, మలయాళము, మొదలగుద్రావిడభాషలకును, సంస్కృతభాషకును, వ్యాకరణాంశములయందుఁ గలముఖ్యమయినభేదముల నీదిగువ వక్కాణించుచున్నాను.

I. ఈద్రావిడభాషలలో నచేతన పదార్థములగు నామవాచకములు చతుష్పాజ్జంతువులును నపుంసకలింగములు. ఉ॥ మలె-ఆడు-కొండ-మేఁక.

II. సర్వనామములలోఁ బ్రథమపురుషక్రియలకు లింగప్రత్యాయకప్రత్యయములఁ జేర్చుటవలన లింగత్రయభేదము స్పష్ట మగుచున్నది. ఈరూపము లేకవచనమందు మూఁడును, బహువచనమందు రెండు నగును. ఉ॥ అవర్ వందార్. అవళ్ వందాళ్. అదువందదు.

అవర్‌గళ్ వందార్‌గళ్ - అవై వందన. సంస్కృతములో నిట్లుగాదు. లింగత్రయకర్తృక మయినను క్రియ యేకరీతిగా నుండును. ఉ॥ సః ఆగచ్ఛతి. సా ఆగచ్ఛతి - తత్ ఆగచ్ఛతి - తే ఆగచ్ఛన్తి - తాని ఆగచ్ఛన్తి.

III. ద్రావిడభాషలలో నామవాచకములకుఁగాని, సర్వనామములకుఁగాని, సప్తవిభక్తిరూపములు సంస్కృతమందు వలె విభక్తిప్రత్యయములచే సిద్ధింపవు. మఱియెట్లన - నామములకుఁ బరముగాఁ జేర్పఁబడు వేఱుపదములచే నిష్పన్న మగుచున్నవి. బహువచననామవాచకములకు నేకవచననామవాచకములకు విభక్తిరూపనిష్పత్తిలో భేదమే లేదు. విభక్తిసూచకపదము లేకవచనమందు, అంగ (Base) మునకే చేర్పఁబడును. బహువచనమందు బహువచనప్రత్యయమునకుఁ జేర్పఁబడును.

ఉ॥ అవనాలే - అవర్గళాలే
అవనోడు = అవర్గళోడు
అవనై - అవర్గళై
అవనుక్కు - అవర్గళుక్కు
అవనిల్ - అవర్గళిల్

నామమునకు బహువచనప్రత్యయము చేర్చినపిమ్మట సకలపదములును నన్ని లింగములయందును నన్ని విభక్తులయందు నేకవచనమందువలెనే విభక్తికార్యముల నొందును.

IV. నపుంసకలింగములకు బహువచన మరుదు. నపుంసకలింగకర్తృక క్రియాపదములకు బహువచన మంతకంటె నరుదు.

V. చతుర్థీవిభక్తి షష్ఠీవిభక్తి ప్రత్యయములయిన కొఱకు - కు - కి మొదలయినవి సంస్కృతములోఁగాని మఱియే హిందూయూరపియన్భాషలలోఁగాని వాడుకచేయఁబడుచతుర్థీషష్ఠీవిభక్తి ప్రత్యయములతో సంబంధించియుఁ గాని సిథియన్భాషాకుటుంబములోని వయిన టర్కీ, బహిస్టన్, ఫినిష్, మంగోలియా మంచూ మొదలగుభాషల విభక్తిప్రత్యయములను బోలియున్నవి

VI. సంస్కృతములోను హిందూయూరపియన్ భాషలలోను నుపసర్గము లు వాడుకచేయఁబడుచోట్ల నీద్రావిడభాషలు సిథియన్ భాషలవలెఁ బ్రత్యయ ములను (Post - Positions) వాడుకచేయును.

VII. సంస్కృతములోను హిందూయూరపియన్భాషలలోను విశేష్య ములకువలె విశేషణములకుఁ గూడ లింగవచనవిభక్తులయందు రూపము మా ఱును. ఉ, శుష్కో-వృక్షః, శుష్కం-ఫలం, శుష్కా-యష్టిః॥

ఈ ద్రావిడభాషలలోను సిథియన్ భాషలలోను నట్లుగాదు. విశేషణము లకు మార్పులేదు. గుణవాచకములయినవిశేషణములు స్వతంత్రముగా నుప యోగింపఁబడునపుడు నామవాచకములకువలె వీనికిని విభక్తులయందు రూపము మాఱును.

VIII. హిందూయూరపియన్భాషలయందువలెఁ గాక మంగోలియా, మంచు మొదలగు నితరసిథియన్భాషలయందువలె నీద్రావిడభాషల యందును విశేషణములకు బదులుగా సంబంధముఁ దెలియఁజేయుక్రియాజన్య విశేషణము లుపయోగింపఁబడును. ఉ. వంద + ఆళ్—వంద + అవు. (Relative partici-pel) వరుగిర + ఆళ్-వరుం + ఆళ్.

IX. సర్వనామములలో నుత్తమపురుషబహువచనమున కీభాషలలో రూపద్వయము కలదు.

ఉ: నామ్—యామ్ - (అరవము).
మేము—మనము - (తెలుఁగు).
ఎంకుళు—నమె (తూలు).

ఇట్టిరూపద్వయము ద్రావిడభాషలలోఁదప్పఁ దదితరభాషలలోఁగానము.

X. సంస్కృతభాషలయందు వలె నీభాషలలోఁ గర్మణిప్రయోగము (Passive voice) మృగ్యము. ఈయర్థము 'పడు' మొదలగు సహాయక్రియలచేఁ దెలుపఁబడుచున్నది. అకర్మకనపుంసక క్రియారూపములచే నీకర్మణిప్రయోగము తఱచుగాఁ దెలియఁజేయఁబడుచున్నది. ఉ. ఒడిందదు=విఱిగినది. దీనికిఁదృతీయా విభక్తిలోనుండుకర్తృవాచిపదము చేర్చిన యెడల నీయర్థము స్పష్టతర మగు ను. ఎన్నాల్ ఒడిందదు. నాచేతవిఱిగినది.

XI. ఈ భాషలయందు మఱియొక చమత్కారము కలదు. సంస్కృత మందువలె నఞర్థకశబ్దము ప్రత్యేకముగఁ జేర్పఁబడక ధాతువునందే భావార్థక

రూపము (Affirmative) వ్యతిరేకార్థకరూపము (Negative) గనుపట్టును. ఉ: వందాన్ - వారాన్ = వచ్చినాఁడు - రాఁడు. సంస్కృతములోనయిన - గచ్ఛతి- నగచ్ఛతి, అనియుండును.

ప్రాకృతభాషోత్పత్తి.

సంస్కృతభాషకుఁ బ్రాకృతభాషకు దేశభాషలగు ద్రావిడభాషలకుఁ గల పరస్పరసంబంధము.

క్రొత్తగా నీదేశమునకుఁ జనుదెంచినవిద్వాంసు లగునార్యులయొక్క భాష వ్యాకరణనియమవిరుద్ధములగుప్రయోగములఁ బరిత్యజించి పారిశుద్ధ్యమును సంపాదించినకొలఁది వ్యాకరణజ్ఞానగంధహీనులయిన యాదిమనివాసులగు పృథగ్జనులవాడుక కది మఱింత విదేశభాషవలెఁ గానుపించె. ఈవిధమునఁ గ్రమముగా నొకసంస్కారయుక్తమయినభాష దేశభాషలసంబంధమునుండి బొత్తిగాఁదొలఁగిపోయి జనులలో విద్వాంసులయినవారికే సొత్తుగా నేర్పడినది. ఇందువలనఁ బండితులయినవారిభాషకుఁ బామరులభాషకు భేదము స్ఫుటముగా వృద్ధినొందఁ బామరజనులభాష తనయిచ్చకొలఁది మఱికొన్ని మాఱ్పుల నొందెను. ఇట్టిభాషాపరిణామము బ్రాహ్మణశాఖలతో నత్యంతసంబంధసహవాసములుగల యాదిమనివాసులయొక్క ప్రాబల్యమువలనఁ గలిగెను. ఆర్యభాషాపదములలోనుండు వ్యంజనముల నుచ్చరించుట స్వదేశస్థులకు మిక్కిలిదుర్ఘటము కాఁగా నాదిమనివాసు లార్యులభాషలోని కనేకము లయినస్వదేశభాషాపదములను గలిపియు నార్యభాషాపదముల యక్షరవిన్యాసమును విశేషముగా నుచ్చారణమును మాఱ్చివేసిరి. భాషలోనుండెడియిట్టిప్రతిబంధకములను శుభ్రముగాఁ దొలఁగించునౌన్ముఖ్యమును గలిగియుండుట ప్రతిభాషకును స్వభావము గావున నార్యభాషయు నీవిధమున మార్పునొందినది. ఈరీతి నార్యభాష కాలక్రమమున వర్ణాగమవర్ణలోపవర్ణవ్యత్యయముల నొంది మాఱుటవలన దాని నుండి క్రొత్తభాష లుద్భవించినవి. ఇట్లుపుట్టినభాషలకే ప్రాకృతభాష లనిపేరు. ప్రాకృతమనఁగాఁ బ్రకృతియగుసంస్కృతమునుండి వచ్చినది. "ప్రాకృతాస్తు పృథగ్జనాః" అనినిఘంటువు. ప్రాకృతులనఁగా వర్ణాశ్రమాచారవిహీనులును విద్యారహితులు నగునీచజాతులు. ఇచట ననాగరకులయిన యాదిమనివాసులభాష యని యర్థము. వీరికే మ్లేచ్ఛులని నామాంతరము. మ్లేచ్ఛ మన నపశబ్దము. "మ్లేచ్ఛోవాఏషయదపశబ్దః" అని శతపథబ్రాహ్మణము. అట్టియపశబ్దముల మాటలా

డువారు మ్లేచ్ఛులనఁబడుదురు. అపశబ్దమన నపభ్రంశము. "అపభ్రంశోఽ పశబ్ద స్స్యాత్" అని యమరము. అపభ్రంశము,అపశబ్దము,మ్లేచ్ఛము అనునీమూఁడును బర్యాయపదములు. ఇట్టిప్రాకృతపదములు వేదమందుఁ బురాణములందుఁ గూడ వాడుకచేయఁబడియుండుటచే నీప్రాకృతభాషమిక్కిలిప్రాచీనమయినదిగాఁ గానవచ్చుచున్నది. ఇందుకుదాహరణములు; వ్యాకరణమహాభాష్యప్రణేత యగు పతంజలి తానురచించిన మహాభాష్యములో గ్రంథారంభమందు వ్యాకరణాధ్యయనావశ్యకత్వమును జూపుటలో నీదిగువవ్రాయఁబడినశ్రుతి నుదాహరించి యున్నాఁడు. "తేఽ సురా హేలయో హేలయ ఇతికుర్వంతః పరాబభూవుః- తస్మాద్బ్రాహ్మణేన నమ్లేచ్ఛితవై నాపభాషితవై మ్లేచ్ఛోహవా ఏష యదపశబ్దః. మ్లేచ్ఛా మాభూమేత్యధ్యేయం వ్యాకరణం" (మనముమ్లేచ్ఛులమనఁగా నపశబ్దములాడువారము కాకుండనుండుటకు వ్యాకరణమును నేర్చుకొనవలయును- ఇందులో- "హేలయ" అనుపదముప్రాకృతము. యజ్ఞకర్మయందు రాక్షసు లిట్లపశబ్దముల నుచ్చరించి పరాజయమునొందిరి.) "యర్వాణ స్తర్వాణో నామ ఋషయో బభూవుః" ఇందులో యర్వాణ, తర్వాణయనుపదములు ప్రాకృతపదములు. మహాభారతము, ఆదిపర్వము, తెలుఁగుప్రతి 145 అధ్యాయము 22-23 శ్లోకములలో విదురుఁడు ధర్మరాజుతో దుర్యోధనునివలన సంభవింపఁబోవు లాక్షాదహనరూపవిపత్తును సమీపమందున్నవా రెవ్వ రెఱుంగకుండ రహస్యముగా మ్లేచ్ఛభాషతో నిట్లనెను. "అలోహం నిశితం శస్త్రం శరీరపరికర్తనం। యో వేత్తి న తు తం ఘ్నంతి ప్రతిఘాతవిదం ద్విషః॥ కక్షఘ్న శ్శిశిరఘ్న శ్చ మహాకక్షే వివౌకసః। సదహే దితి చాత్మానం యో రక్షతిజీవతి॥" ఈశ్లోకములలో అల = అగ్ని ; ఊహ = సమూహము ; శస్త్ర = మేడ ; కక్షఘ్న = దగ్గఱ నుండువాఁడు ; శిశిరఘ్న = అగ్నిగలవాఁడు; మహాకక్ష = శత్రువు; అనుశబ్దములు సంస్కృతశబ్దములవలెఁ గానవచ్చుచున్నను బ్రాకృతపదములని మహాభారత వ్యాఖ్యానమయిన నీలకంఠీయవ్యాఖ్యానమువలనఁ దెలియనగును. ఈయధ్యాయములోనే యీశ్లోకములకుఁ బైనున్న యిరువదియవశ్లోకమును దానికున్న నీలకంఠీయవ్యాఖ్యానమును జూడుఁడు. శ్లో॥ ప్రాజ్ఞః ప్రాజ్ఞప్రలాపజ్ఞః ప్రలాపజ్ఞ మిదం వచః। ప్రాజ్ఞఃప్రాజ్ఞం ప్రలాపజ్ఞః ప్రలాపజ్ఞంవచోఽ బ్రవీత్ ॥దీనివ్యాఖ్యానము:— ప్రాజ్ఞః బుద్ధిమాన్ అనేకభాషాభిజ్ఞ ఇత్యర్థః। ప్రాజ్ఞప్రలాపజ్ఞః = ప్రకర్షేణ అజ్ఞాః ప్రాజ్ఞాః। పశుప్రాయాః మ్లేచ్ఛాః। తేషాంప్రలాపంప్రకృతిప్రత్యయవిభాగేన అని

ష్పన్నత్వాత్ అర్థానవభోదకం। లుప్తాధిక వికృతవర్ణ వత్పదకదంబ నిబద్ధం దేశ భాషారూపంవచనం। జానాతీతిప్రాజ్ఞప్రలాపజ్ఞః విదురః। ప్రలాపజ్ఞంమ్లేచ్ఛభాషాభిజ్ఞం యుధిష్ఠిరంప్రతి। ప్రాజ్ఞః ప్రకర్షేణ అజానతః।షష్ఠ్యేకవచనేరూపమిదం। ప్రాజ్ఞంప్రకర్షేణ అర్థానామనవభోధకం। ఏతాదృశం వచః వచనీయం ఇదం వక్ష్యమాణంవచః అబ్రవీత్.

పైనివ్రాసిన ప్రమాణములవలన నుపపత్తులవలనను బ్రాకృతభాషాపదములార్యభాష కెక్కి వేదము, మహాభారతము మొదలగు బహు ప్రాచీనగ్రంథములలోఁ బ్రయోగింపఁ బడియుండుటచే నీదేశభాషయగు ప్రాకృతభాష ప్రాచీనతలో నార్యభాషకుఁ దుల్యముగా నున్నట్లు స్పష్టమగుచున్నది.

ఈప్రాకృతభాష ననేకు లనేకవిధములుగా విభజించియున్నారు. కాని యిచ్చట మన కావిభాగవైవిధ్యముతోఁ బనిలేదు. ప్రకృతమున కావశ్యకమయిన యహోబల పండితకృతవిభాగవచన ప్రామాణ్యము నవలంబింతము. "ప్రాకృతి స్సంస్కృతీ భాషా వికృతిః ప్రాకృతీభవేత్। షడ్విధేయం ప్రాకృతీచ శౌరసేనీ చ మాగధీ। పైశాచీ చూళికా పైశా చ్యపభ్రంశ ఇతిక్రమాత్॥" ప్రకృతియనఁగా బ్రాకృతము. ఆప్రాకృతభాషయాఱు తెఱఁగులుగలది. 1 ప్రాకృతము 2 శౌరసేని 3 మాగధి 4 రెండువిధములగు పైశాచి 5 చూళిక 6 అపభ్రంశము. మహారాష్ట్రదేశమందు వాడఁబడుభాష ప్రాకృతము. శౌరసేన దేశమందలిభాష శౌరసేని. మగధదేశమునందు వ్యవహరింపఁబడుభాష మాగధి. నేపాళము, గాంధారము, బాహ్లికము, మొదలగువానికి పిశాచదేశము లనిపేరు. ఈదేశములయందు వాడఁబడుభాష పైశాచి. పశ్చిమసముద్రతీరదేశ మాభీరదేశమని పిలువఁబడుచున్నది. అచ్చట నుండుగొల్లలుమొదలైనవారిమాటలపభ్రంశము లనిచెప్పఁబడును.

## ఆంధ్రభాషా విభాగము.

ఈప్రాకృత మాంధ్రభాషకు ద్వితీయప్రకృతి. సంస్కృత మాద్యప్రకృతి. ఇందుకుఁ బ్రమాణము:

శ్లో॥ ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయో ర్భవే ద్వికృతిః।
కేవలతద్భవసత్త్వా త్సూత్రే చ యథాతథం భాషా॥

టీక॥ అన్ని భాషలకు మూలమయినదగుటచేత నాంధ్రభాషకు హేతు వయినదగుటచేతను మొదటిదగు సంస్కృతము నాలువిధములగు ప్రాకృతము నను నీరెండు నాద్యప్రకృతియనియుఁ బ్రకృతియనియుఁ గ్రమముగాఁ జెప్పఁబడు చున్నవి. సంస్కృతము మొదటిది యగుకారణముచే నాద్యప్రకృతియని పిలువఁ బడుచున్నది. ప్రకృతి యనుపేరుగూడ సంస్కృతముద్వారా శుద్ధప్రాకృతమ యిన భాషకు సార్థకమయినదియే. శౌరసేని మొదలగుభాషలు ప్రాకృతము ద్వారావికృతములయ్యును నాంధ్రముద్వారా యాలువిధములగుప్రాకృతభాషల వలనఁ బుట్టిన వగుటచే నిది ప్రకృతియనుట సంభవించుచున్నది. వేఱగుటచేతను స్వేచ్ఛగా వికృతియని ప్రసిద్ధినొందిన యే యీయాంధ్రభాష గలదో యది సంస్కృతప్రాకృతములను రెండుభాషలను దత్సమాదులచే ననుసరించుచున్నది. ఈయాంధ్రభాష యిరువదిరెండుతెఱగతులుగా విభజింపఁబడియున్నది. ఎట్లనఁగాఁ బ్రాకృతదేశీయపదసమ మాలువిధములు. సంస్కృతభవప్రాకృతభాషాసమ మాలువిధములు. సంస్కృతభవము, సంస్కృతము, ఆంధ్రదేశీయము, గ్రామ్యము. ఇందుకు నన్నయభట్టుమూలసూత్రమును దానికహోబలపండితునివ్యాఖ్యా నమును జూడుఁడు.

సూ॥ ప్రాకృతభవ సంస్కృతభవ సంస్కృతవత్ప్రాకృతభవ వికృతభవాః.

వ్యా. ప్రాకృతభవవికృతిభవాః ప్రాకృతభాషాభవాంధ్రభాషాభవా శ్శబ్దాః సంస్కృతభవ సంస్కృతవత్.

వతిప్రత్యయస్య ప్రత్యేక మంతర్గతైః పదై స్సంబంధః. ప్రాకృతభవవత్ ప్రాకృతోపదేశః. తస్మాద్భవతియశ్శబ్ద స్సప్రాకృతభవః. తద్వత్ప్రాకృతభవవత్. ప్రాకృతదేశీయవ దితి యావత్. సంస్కృతభవవత్, సంస్కృతభవప్రాకృతవత్. సంస్కృతవత్, సంస్కృతసమప్రాకృతవ త్తిష్ఠంతీత్యర్థః. ప్రాకృతభవవికృత్యాం ప్రాకృతభాషాసంబంధినస్త్రివిధాశ్శబ్దాః ప్రవిశంతీతి ఫలితం.

తా॥ ప్రాకృతభవవికృతిభవాః. ప్రాకృతభాషవలనఁ గలిగిన యాంధ్ర భాషయందుఁ బుట్టినశబ్దములు. ప్రాకృతభవ సంస్కృతభవ సంస్కృతవత్. వతి ప్రత్యయమునకుఁ బ్రత్యేకముగా సమాసములోని శబ్దములతో సంబంధము, ప్రాకృతభవవత్. ప్రాకృతమనఁగాఁ బ్రాకృతదేశము. దానివలనఁ బుట్టినశబ్దము ప్రాకృతభవ మనిపించుకొనును. దానితో సమానముగను బ్రాకృతదేశీయము

వంటిదని నిశ్చయార్థము. సంస్కృతభవవత్ -సంస్కృతమువలనఁ బుట్టిన ప్రాకృతమువంటిదియు, సంస్కృతవత్ - సంస్కృతసమప్రాకృతముతో సమానముగా నుండు ననియర్థము. ప్రాకృతమువలనఁ బుట్టినవికృతిభాషయందుఁ బ్రాకృతభాషాసంబంధముగల మూఁడు తెలుఁగులగుశబ్దములు ప్రవేశించు నని ఫలితార్థము.

సూ॥ వ్యతిరిక్తా భూయాంసః.

వ్యా. వ్యతిరిక్తాః, వర్ణాగమవర్ణలోపై రీష ద్వికృతత్వేన భిన్నా స్సంస్కృతభవప్రాకృతభవాః. భూయాంసోఽపరిమితా వర్తంతే. సంప్రదాయతో వేద్యాః ఇత్యుత్తరసూత్రేణ తు నాన్వయః. సంస్కృతభవప్రాకృతానాం సంస్కృతభవాదివత్. సంప్రదాయైకశరణత్వాభావాత్.

తా॥ వర్ణాగమవర్ణలోపములచేత నించుక వికారమును బొందినవాటచేత వేఱైనసంస్కృతమువలనఁగలిగిన ప్రాకృతమువలనఁ బుట్టినశబ్దములు విస్తారముగా నున్నవి. సంప్రదాయతో వేద్యాః అను పైసూత్రముతో నన్వయము లేదు. సంస్కృతమువలనఁ బుట్టినప్రాకృతశబ్దములకు సంస్కృతభాషాదులతోఁ దుల్యముగా సంప్రదాయశరణత్వము లేదు గదా.

సూ. వ్యతిరిక్తా స్సంప్రదాయతో వేద్యాః.

వ్యా. వ్యతిరిక్తాః తద్భిన్నాః సంస్కృతభవాదేశా శ్చ లింగవచనభేదాదివిశేషా శ్చ సర్వే సంప్రదాయతో వేద్యాః. సంప్రదాయోఽత్ర తద్వివేకవిచక్షణశిష్టపరంపరాప్రయోగః. సంస్కృతసమాస్తు శాస్త్రైరేవ వేత్తుం శక్యా ఇతి న వ్యతిరిక్తపదేన తేషాంసంగ్రహః. తథాచ అహో-హో-ఇత్యాదీనాం సంస్కృతసమప్రాకృతసమత్వం. అంబరాదీనాం ప్రాకృతదేశ్యసమత్వం - తత్రతామ్రమస్యతంబరః - ఆమ్రస్య అంబరః - ఇతి వ్యవహారాత్ - జమాదిశబ్దానాం సంస్కృతభవప్రాకృతసమత్వం. మూగ ఇత్యాదీనాం సంస్కృతభవప్రాకృతభవత్వం. చందురుఁడు, చందమామ, సంతసము, సతంతరము, సంద్రము, ఇత్యాదీనాం సంస్కృతభవత్వం. నవలా ఇత్యాదీనామాంధ్రదేశ్యత్వం - వనము ఇత్యాదీనాం సంస్కృతసమత్వంచ. స్పష్టమేవ. ఏవంచేయం వికృతిస్సాంకర్యేన ద్వావింశతిభేదా - తథాహి - ప్రాకృతభవవికృతిరష్టాదశధా - దేశ్యాదిభిస్త్రిభిరనువర్తనాత్ - సంస్కృతభవస్త్వేధా - తత్సమభవభేదాత్ - దేశ్యాగ్రామ్యేతిద్వ

భేదా ఇతి - యద్యపి - 'అహేయమన్యదేశీయం యత్తదేవప్రయుజ్యతే-' ఇత్య
థర్వణోక్తే ర్దేశాంతరభాషా పదప్రయోగోప్యత్ర నవిరుద్ధస్తథాప్యాద్య ద్వయా
పేక్షమైవాస్యా వికృతిత్వంనిరుక్తమితి ప్రాధాన్యేన భేదగణనైవంకృతేతిధ్యేయం.

తా. వ్యతిరిక్తాః - వీనికంటె వేఱగు సంస్కృతభవములును, దేశ్యము
లును, లింగము వచనము మొదలగువాని భేదములును, సంప్రదాయమువలనఁ
దెలియఁదగినవి. ఇచట సంప్రదాయమనఁగా వానిని విభజించుటయందు సమర్థు
లగు శిష్టసమూహముయొక్క ప్రయోగము. సంస్కృతసమములు శాస్త్ర
ముచేతనే తెలియ శక్యమైనవి. కావున వ్యతిరిక్తశబ్దముచే దానికి గ్రహణము
లేదు. ఇట్లుండగా-అవ్వా-ఆ ఇత్యాదులకు సంస్కృతసమప్రాకృతముతోఁ దుల్య
త్వము.అంబరాదిశబ్దములకుఁ బ్రాకృతదేశ్యముతో సమానత్వము.అచటఁ దామ్ర
శబ్దమునకుఁ దంబరము, ఆమ్రశబ్దమునకు అంబరము, అని వ్యవహారము గలదు.
జముఁడు మొదలగుశబ్దములకు సంస్కృతమువలనఁ బుట్టిన ప్రాకృతముతో సమా
నత్వము. మూఁగ ఇత్యాదిశబ్దములకు సంస్కృతమువలనఁ బుట్టిన ప్రాకృతమువల
నఁ బుట్టుట. చందురుఁడు, ఇత్యాదులకు సంస్కృతమువలనఁ బుట్టుట. నవలా
ఇత్యాదిశబ్దముల కాంధ్రదేశ్యత్వము. వనము ఇత్యాదులకు సంస్కృతసమత్వ
మును స్పష్టమే. ఇట్లుండ నీ వికృతిభాషయంతయు నిరువదిరెండుభేదములు
గలది. ఎట్లనఁగాఁ బ్రాకృతమువలనఁ బుట్టిన వికృతి పదునెనిమిది తెఱంగులుగలది.
దేశ్యాదులగు మూఁడింటిచేత గుణించుటవలన. తత్సమమనియుఁ దద్భవ మనియు
సంస్కృతభవము రెండువిధములు. దేశ్యమని గ్రామ్యమనియు రెండువిధములు.
విచారింపఁగా హేయముగాని యన్యదేశ్యశబ్దమే ప్రయోగింపఁబడునని యథర్వ
ణోక్తివలన నితరదేశభాషాపదముగూడ నిచటఁ బ్రయోగించుట విరుద్ధముగాదు.
అయిన నీభాషకు సంస్కృతప్రాకృతభాషలనుబట్టియే వికృతియగుట నిశ్చ
యింపఁబడినది. కావునఁ బ్రధానత్వముచేత భేదమునకు లెక్క యిట్లుచేయఁ
బడినదని తెలియఁదగినది.

## దేశ్యభాషావిచారణ.

"దేశ్యమార్షంచ రూఢత్వా త్స్వతంత్ర త్వాచ్చభూయసా । లక్ష్మ
నా పేక్షతే తస్య సంప్రదాయో హి బోధకః । దేశ్యమవ్యుత్పత్తి మత్త్రాత్ప్రా
కృతత్వేన కథ్యతే॥" అని యథర్వణాచార్యులు. దేశ్యము నార్షమును రూఢిమైన

వగుటవల్లను దఱచుగా స్వతంత్రము లగుటవల్లను వానికి లక్షణాపేక్ష లేదు. సం ప్రదాయమే వాని రూపమును దెలియఁజేయును. నన్నయభట్టారకుఁడుఁగూడ నీ దేశ్యమును గుఱించి 'ప్రవాహినీదేశ్యా' అని చెప్పియున్నాఁడు. ప్రవాహమనఁ గా నిత్యమయినలోకము. అట్టి లోకవ్యవహారముచేఁ దెలియఁదగినది గావునఁ బ్రవాహిని యనిపించుకొనుచున్నది. ఇది వ్యుత్పత్తి (Derivation) శూన్యమైనది. "హంతి అనయా ఇతి హేతిః" దీనిచే శత్రువులను గొట్టుదురు గావున హేతి (ఆయుధము. "చమతి భక్షయతి శత్రూన్ ఇతిచమూః।" శత్రువులను దిని వే యును (నశింపజేయును), కావున 'చమూః' సైన్యము. ఇట్లు ప్రతిసంస్కృత శబ్దమునకు ధాతుప్రదర్శనపూర్వకముగాఁ బ్రకృతిప్రత్యయవిభాగముచేసి వ్యు త్పత్తిచెప్పుట సులభము. ఆంధ్రకర్ణాటాది ద్రావిడభాషల నొకదానితో మఱి యొకదానినిఁదైపారువేయఁగాఁ దత్తచ్ఛబ్దముల కాయాయిభాషలలోనమానశబ్ద ములు గనుఁగొనవచ్చును గాని వ్యుత్పత్తులఁదెలియుట కష్టము. వానిసహాయము వలన మన యాంధ్రశబ్దములలోఁ గొన్నిటికిమాత్రము వ్యుత్పత్తులఁ గనుఁగొనవ చ్చును. ఆంధ్రము, కన్నడము, అరవము, తూలు మొదలగుభాషలలో నేదో యొకభాషనుండి కొన్నిశబ్దములు వర్ణలోపవర్ణాగమవర్ణవిపర్యయాది వికార ములనొంది జనవ్యవహారములచేఁ దదితరభాషలలో మెండుగాఁ గలిసియున్నట్లు తత్తద్భాషాతారతమ్యపరీక్షవలనఁ గొంతవఱకుఁ గానవచ్చుచున్నది. విమర్శింపఁ గాఁ దద్భవతత్సమరూపములతో సంస్కృతపదము లీ యాంధ్రమం దుత్కటము గాఁ గలిసినట్లు విశేషముగా నరవము, కన్నడము మొదలగు భాషలయొక్క ప దములుగూడఁ గలిసియున్నవి. అట్టి యన్యభాషాపదసాహాయ్యముచే నాంధ్ర శబ్దములకుఁ గొంతవఱకు వ్యుత్పత్తి గనుఁగొనవచ్చును.

ఎట్లనఁగానీద్రావిడభాషలలోఁ(Dravidian Languages) దఱచుగా మాటలాడు వారు తమ తొందఱచేఁ గాని లేక సుఖోచ్చారణకొఱకుఁ గాని పదములయం దుండు హల్లులకు స్థానవ్యత్యాసముగలుగఁ జేయుదురు. ఈమాఱ్పు (Euphonic displacement)నీచజాతులు మాటలాడుమాటలలో విశేషముగాఁ గనుపట్టు చున్నది. ఇందు కరవభాషనుండి యుదాహరణము:—తశై =మాంసము. ఇది శదైయని మాఱినది. తకార శకారములు తమతమ స్థానమును మార్చికొన్నవి. కుదిరై =గుఱ్ఱము ఇది గ్రామ్యభాషలో కుర్దై అని మాఱినది. కుదిరై, కుర్దై

శబ్దములు రెండును, 'గెంటుట' అనునర్థమిచ్చు 'కుది' యనుధాతువునుండి యుత్ప న్నమయినవని నిస్సంశయముగా మనము చెప్పఁజాలినను నీ శబ్దద్వయమందు నెద్ది శుద్ధమయిన యరవశబ్దమో దేనినుండి గుఱ్ఱమను తెలుఁగుపదముపుట్టినదో నిర్ణయించుట శక్యముకాదు. ఇట్లు "కుదిరై" అనునది మాఱి గుఱ్ఱ మయిన దని చెప్పుటకుఁదప్ప తిరుగ గుఱ్ఱమనుదాని కేది వ్యుత్పత్తియో చెప్పుటకు వీలు లేదు. ఇట్లు హల్వర్ణములమార్పు (Euphonic displacement) చే నొకశబ్దము నకే యరవమందొక రూపమును దీనికి విభిన్నమయిన రూపాంతరముగల శబ్ద ములు తెలుఁగులోను గన్నడములోను గానవచ్చుచున్నవి. ఉదాహరణము,

| అరవము | తెలుఁగు | కన్నడము |
|---|---|---|
| కప్పల్ | ఫొక్కిలి | ఫొక్కల్ |
| పదర్ | ... | పరదు |

అచ్చులయొక్క స్థానవ్యత్యాసము వలనఁ గలుగు మార్పులను వాని నిబంధనల నిఁకఁ గొంతవిచారింతము.

అచ్చులయొక్క విచిత్రమయిన విపర్యాసమును గుఱించి తెలుఁగులో ననేకోదాహరణము లుపలబ్ధములగుచున్నవి. అజాదులయిన త్రివర్ణకశబ్దముల యందుఁ దఱచుగా నీవ్యత్యాసము సంభవించునపుడు పదములలో మొదటి యచ్చునకులోపము వాటిల్లును. అట్లులోపించిన యచ్చుయొక్క కొఱఁతను బూర్తి చేయుటకు ద్వితీయవర్ణమునకు దీర్ఘమగును. దీని కుదాహరణముగ నరవములో నిర్దేశకసర్వ నామముల (Demonstrative pronouns) బహువచన రూపము లను గ్రహింతము.

అవర్=వారు. ఇవర్ = వీరు. కన్నడభాషలో నీశబ్దముల కొనకు ఉకా రము చేర్పఁబడును. ఉదాహరణము, అవరు=వారు, ఇవరు=వీరు, ఈసాదృశ్యా నుగుణముగాఁ దెనుఁగులోఁగూడ నీశబ్దములు పూర్వోక్తశబ్దములకు సమాన ముగా నుండవలయును. కాని పైని వ్రాసినప్రకారముగా అజ్వర్ణలోపము ద్వితీయవర్ణమునకు దీర్ఘమువచ్చుట మొదలయిన మార్పులచే దెనుఁగులో 'వారు' 'వీరు' అని యయినది. వీనియొక్క నపుంసకలింగ రూపములను జూడుఁడు. "అది,ఇది" ఈ శబ్దములు ద్వివర్ణకములు గావున నిట్టిమార్పు వీనిలో సంభవింపదు

కాని విభక్తిప్రత్యయము చేర్పఁగా నివి త్రివర్ణకము లయినవు డీమాఱ్పులేకపోవు. ఎట్లన, అదనై = అదిని, ఇదనై = ఇదిని, అనియగుటకు బదులుగా 'దాని' 'దీని' అనిరూపము లగుచున్నవి. ఇట్టిమాఱ్పుకొన్ని నామవాచకములయందుఁ గూడఁ జూపట్టెడి. అరవము ఉరల్ = రోలు. ఇదితెలుఁగుగా 'ఒరల్' అనియుచ్చరింపఁబడుచున్నది. ఈరూపమునకు సదృశముగాఁ దెనుఁగులో 'ఒరలు' అనియగుటకు బదులుగా 'రోలు' అని అయినది.

ఈ యజ్వర్ణ వ్యత్యాసన్యాయమును (Law of Euphonic Displacement) మనము ప్రతిభాషాశబ్దమునకుఁ జక్కఁగాఁబట్టించి విమర్శించినయెడల నాంధ్రము, కన్నడము, అరవము మొదలగుభాష లొకదానికంటె మఱియొకటి వేఱైనవిగావని స్పష్టమగును.

| తెలుఁగు | అరవము |
|---|---|
| కాదు | ఆగాదు |
| లేదు | ఇల్లదు |

ఏకాక్షరవిభక్తిప్రత్యయములందుఁగూడ నిట్లే ఉ॥ షష్ఠ్యేకవచనములేక సప్తమ్యేకవచనము తెలుఁగులో "లో"- అరవములో- "ఉళ్"-కన్నడములో- "ఒళ్."

ఒకానొకప్పు డొకభాషలోనుండు ధాతుసంబంధమయిన హల్లులుగూడ మఱియొకభాషలో లోపించును.

| అరవము | తెలుఁగు | కన్నడము | |
|---|---|---|---|
| నెరుప్పు | నిప్పు | ,, | రేఫలోపము |
| ఎలుంబు | ఎమ్ము | ,, | లకారలోపము |
| ఉడల్ | ఒళ్లు | ,, | డకారము |
| పొఝుదు | పొద్దు | ,, | |
| ఎఱుదు | ఎద్దు | | |
| మరుందు | మందు | మద్దు | |
| ఎఝుపదు | | ఎప్పట్టు | ఎఝుధాతువు |
| కొఝుమై | కొవ్వు | కొబ్బు | |

ఇరుళ్ ఇరులు (ఇర్ ధాతువు-చీకటిగానుండుట)
ఇరా(రాత్రి) రేయి
అరుళ్ (కృప) అరుధాతువు(విలువగలిగియుండుట - అరుదు - దీనితో సంబంధించినది.)

తమిళ్ పదములలో లోపించినధాతుసంబంధమయిన హల్వర్ణము తెలుఁగుపదములలోఁ గొన్నిటియందు నిల్చియున్నట్లు గానవచ్చుచున్నది. అవనోడు, ఇవనోడు, ఇత్యాదులయందున్న తృతీయావిభక్తి ప్రత్యయమయిన ఓడు అనుదానితో సరియయినది యాంధ్రతృతీయావిభక్తిప్రత్యయము "తోడ" అనునది. ఇది తోళన్ అను అరవపదమునుండి పుట్టినది. అరవముయొక్క 'ళ' అనుదానికి బదులుగాఁ దెలుఁగులో డకారమురాఁగా "తోడు" అయినది. తోళన్ = సహచరుఁడు. తోళి = సహచరి. తోళమై = సాహచర్యము. ఈశబ్దము, తోళర్ లేక తుడర్ (అనుసరించుట) అనుధాతువునుండిపుట్టినది. తొగుప్పు అనుపదములో గకారములోపింపఁగా "తోపు" అయినది. తొగుప్పు అనునది తొగు కూర్చుట అను ధాతువునుండి నిష్పన్నమయినది. 'పాల్ = పాలు' ఇది విభజించుట 'పగు' అను ధాతువునుండి నిష్పన్నమయినది. దీనినుండి వెన్న విభజింపఁబడును — వంతుఅనునర్థమందుఁగూడ నిక్లేప్యుత్పత్తి చూడవలయును — కొందఱు పాపానే సంస్కృత ధాతువునుండి పుట్టినదని చెప్పుదురుగాని యదిసరిగాదు — ఈ పగుధాతురూపము పగల్ = పగలు అనుశబ్దములయందుఁ గాననచ్చుచున్నది. పగలుదినములో నర్థభాగము పళం = పండు (పళధాతువునకు పండుటయనియర్థము.) అలై = అల = తరంగము. (ఇది అలెయిధాతువు. తిరుగుటయను నర్థముగలది.) ఇట్లు మనమువిమర్శించిచూడఁగా వందలకొలఁది శబ్దము లరవభాషలోనుండియుఁ, గన్నడభాషలోనుండియుఁ, దెలుఁగులోఁగలసినట్లు గానవచ్చుచున్నది. ఆంధ్రభాషయొక్క దేశ్యశబ్దములేగాక గ్రామ్యపదములుగూడ నీతమిళభాషాసంపర్కవశమునఁ గొంతమట్టునకుఁ బర్యాకులితమయిన ట్లూహింపఁబడవచ్చును. పండితపామర సామాన్యముగా వాడుకచేయఁబడుచుండెడి "వస్తాను, ఇస్తాను - కొట్టేశాడు — వచ్చేశాడు—తినేశాడు మొదలయిన గ్రామ్యరూపముల కొకరీతిగా మనము గతి గల్పింపవచ్చునని నాతాత్పర్యము. ఎట్లన నరవములో "నాన్ దాన్" అవన్ దాన్ — అదుదాన్ ఇత్యాదులయందు "తాన్ + అనునొక ఊత

పద మర్థవిరహితమయి కానవచ్చుచున్నది. ఈ 'తాను' అనునది తెలుఁగులో 'ఆత్మన్' శబ్దమువంటిది. ఈ అరవపు 'తాను' తెలుఁగులోఁగూడఁ బ్రవేశింపఁగా "వచ్చు + తాను = ఇచ్చు + తాను—"అని ఉత్తమపురుషయందును 'వు', 'డు', 'లు', (మధ్యమపురుష ప్రథమపురుష ప్రత్యయములు) చేర్పఁగా "వచ్చు + తావు; ఇచ్చు + తావు; వచ్చు + తాడు; ఇచ్చు + తాడు;" అని వాడుక లోనికి రాఁగాఁ గాలక్రమమున "వస్తాను, వస్తావు, వస్తాడు" అను గ్రామ్య ప్రయోగములు సిద్ధించినవి. పలుకువారి యలసతచే నిట్టియపశబ్దములు సిద్ధించును; సామాన్యముగా నరవముమాటలాడు వా రన్ని జాతులవారును దెలుఁగుతోఁజెప్పినపుడు "చేసివిడిచినాఁడు, కొట్టివిడిచినాఁడు, తినివిడిచినాఁడు, అనిపలుకుదురు; ఇట్టి ప్రయోగము లరవములో మెండు—ప్రతిక్రియకు 'విట్టాన్' అనునది చేర్పఁబడఁగా 'పణ్ణివిట్టాన్' 'ఉండువిట్టాన్' అనియగును. ఇది క్రియాసాకల్యము దెలియఁజేయును— చేసివిడిచినాఁడనఁగా నాపనినిచేయనిది విడిచిపెట్టలేదు—పూర్ణముగాఁ జేసినాఁడని యర్థమిచ్చును—ఇదియాంధ్రభాషలోనికిఁ గ్రమముగ సంక్రమింపఁగా 'తినివైచినాఁడు' 'చేసివైచినాఁడు' అనియగునది. కాలక్రమమున 'వైచినాఁడు' అనుసహాయ క్రియ 'వేసినాఁడు' అనిమాఱినది. మఱికొంత కాలమునకిదియే 'వేశాడు' అని మార్పునొంది—చేసివేశాడు — తినివేశాడు — అని మార్పునొంది-చేసివేశాడు — తినివేశాడు— అనివాడఁబడి కొనకు 'తినేశాడు' 'చేసేశాడు' అని సిద్ధించినది. మనమాలోచించిచూచిన నిట్టి యపశబ్దముల యుత్పత్తిని గనుఁగొనవచ్చును.

ఈ క్రిందవ్రాసినశబ్దములపట్టికవలన నీద్రావిడభాషలకున్న పరస్పరసాదృశ్య సంబంధములను దెలియనగు.—

| అరవము | కన్నడము | తెలుఁగు | తూలు |
|---|---|---|---|
| అణ్ణ | అణ్ణ | అన్న | అణ్ణె |
| మామై | మావ | మామ | మామె |
| తందై | తందె | తండ్రి | |
| తంబి | తమ్మ | తమ్ముఁడు | |
| పెణ్ | హెండతి | పెండ్లాము | బొడెది |
| వెణ్ణై | బెణ్ణె | వెన్న | |

| అరవము | కన్నడము | తెలుఁగు | తూలు |
|---|---|---|---|
| కుడై | కొడె | గొడుగు | కొడె |
| పులి | హులి | పులి | పిలి |
| కణ్ | కణ్ణు | కన్ను | కణ్ |
| మూక్కు | మూగు | ముక్కు | మూంకు |
| కై | కై | కై(చేయి) | కై |
| నా | నాలిగె | నాలుక | నాలగె |
| నెత్తి | నెత్తి | నెత్తి | నెత్తి |
| తలై | తలె | తల | తరె |
| విరల్ | బెరళు | వ్రేళ్లు | పిరెల్ |
| తుడై | తొడె | తొడ | తుడె |
| వా | బాయి | వాయి | బాయి |
| ఎఱుదు | ఎత్తు | ఎద్దు | ఎరు |
| ఎలి | ఇలి | ఎలుక | ఎలి |
| తేర్ | తేరు | తేరు | |
| ముత్తం | ముత్తు | మొత్తము | |
| ఉడైయార్ | ఒడయను | ఒడయఁడు | |
| ఉయిర్ | ఉసిరు | ఉసురు | |
| అలరు | అలరల్ | అలరు | |
| తలిర్ | తళిరు | తలిరు | |
| నిలం | నల | నేల | |
| తిరై | తెరె | తేర | |
| వానం | బాణ | వాన | |
| ఎలి | ఇలి | ఎలుక | |
| ఆరు | — | ఏరు | |
| కేడు | కేడు | కీడు | |
| ముదల్ | మొదల్ | మొదలు | |
| పల | హాలవు<br>పలవు<br>పల | పలు | |

| అరవము | కన్నడము | తెలుఁగు | తూలు |
|---|---|---|---|
| పిణక్కు | — | పెనుగు | |
| పశై | — | పస | |
| అరిదు | — | అరుదు | |
| ఇడై | ఎడె | ఎడము | |
| కుఱై | కొరత | కొఱఁత | |
| మదిళ్ | — | మదిరు | |
| మాడ | కరలమాడ | మేడ | |
| మగన్ | మగను | మగఁడు | |
| ఆళ్ | — | ఆలు | |
| శెన్ను | | చని | |
| నడై | నడె | నడక | |
| ముగిల్ | ముగిలు | మొగిలు | |
| కార్ | కారు | కారు | |
| అల్లల్ | అళల్ | అల్లర | |
| కళ్వ్ | కళ్ల | కల్ల | |
| ఇరై | — | ఎర | |
| నాళ్ | — | నాడు | |
| నెడు | | నిడుపు | |
| ఉడల్ | ఒడలు | ఒడలు | |
| కడల్ | కడలు | కడలు | |
| ఓలక్కమ | ఓలగ | ఓలగము | |
| తళువు | | తడుము | |
| కరై | కల | కర | |
| శిదై | | చిదుగు (చితుకు) | |
| వాళి | బాళు | వాలు | |
| కూని | | గూని | |
| మరుందు | మద్దు | మందు | |
| మిక్క | | మిక్కిలి | |
| పణి | | పని | |

| అరవము | కన్నడము | తెలుఁగు | తూలు |
| --- | --- | --- | --- |
| ఈడు | ఈసు | ఈడు | |
| వణంగు | వణుకు, బగ్గు | వంగు, వణఁకు | |
| నిమిర్ | | నెమరు | |
| మగళ్ | | మగువ | |
| కడిందు | | గడచు | |
| ఇనై | ఇన్తై | ఎన | |
| నుదల్ | నొసల్ | నుదురు, నొసలు | |
| తోగై | తోగ | తోఁక | |
| ఇవై | ఇవు | ఇవి | |
| అవై | ఆవు | అవి | |
| యవరు | యారు | ఎవరు | |
| కీళ | కెళగె | క్రింద | |
| కుడిక్క | కుడిక్కు | కుడుచు | |
| నాట్టం | బాడు | పాడుట | |
| పాంబు | పావు, హావు | పాము | |
| నాణే | నాన | నాను | |
| కునిత్తు | కునియు | గెంతు | |
| వల్లవన్ | బల్లవన్ | వలతి | |
| వీడు | విడిడ, బీడు | వీసు | |
| వేంబు | బేవు | వేము | |
| మురై | మొరె | మొర | |

మేడేపల్లి వేంకటరమణాచార్యులు.

# ఆయుర్వేదాంగ శల్యతంత్రము.

## దాని నభ్యసించు క్రమము.

ఆయుర్వేదము. దాని విభాగములు.

ప్రాణికోటికి సంభవించు శారీరకాగంతుకములనెడి వ్యాధులను దొలఁగించుటకై జగన్నిర్మాతయగు నాపరమపురుషుఁ డాయుర్వేదమును గల్పించె. ప్రజల నాగరకతననుసరించి క్రమముగ నభివృద్ధిచెందిన యాయుర్వేదము వివిధచికిత్సల సౌకర్యమునకుఁ గాను శల్యతంత్రము (Surgery), శాలాక్యతంత్రము (Treatment of the special diseases of the eye, nose, throat, etc), కాయ చికిత్స (General treatment), భూతవిద్య (Treatment of demoniacal diseases), కౌమారభృత్యము (Management of children), అగదతంత్రము (Toxicology), వాజీకరణతంత్రము * (Science of Aphrodisiacs.), రసాయన తంత్రము (Science or rejuvenation) ననెడి యెనిమిది భాగములుగ దివ్యజ్ఞాన సంపన్నులగు మహర్షులచే విభజింపఁబడియెను. అందు శల్యతంత్ర (శస్త్రచికిత్స) మెల్లతంత్రములలోఁ బ్రధానభాగమై యున్నది.

అనేకప్రకారాకారములగు శల్యములు శరీరమునఁ బ్రవేశించురీతి, వాని స్థితి, గమనము, బైటకు వెడలించు నుపాయములు, వాని కావశ్యకమగు యంత్రములు, శస్త్రములు, వాని నిర్మాణము, ఆకృతి, పదును మొదలగునవియు, స్రావ, వర్ణ, గంధ, దోష, ఉపద్రవాది భేదములతోఁ గూడిన శారీర కాగంతుక వ్రణముల విజ్ఞానమును, నాయారోగభేదముల ననుసరించి కనఁబఱచిన శస్త్రచికిత్సాభివృద్ధియు, అక్రమప్రసవాదుల యందలి శస్త్రచికిత్సానిపుణతయు, నేత్ర శ్రోత్ర గళాది శాలాక్యతంత్రము నందలి శస్త్రచికిత్సాకుశలతయు మొదలగు శల్యతంత్ర సంబంధివిషయములను వానియందుఁ జిరకాలమునకుఁ బూర్వము మహర్షులు కనఁబఱచిన గౌరవమును వివరముగఁ బ్రత్యేకముగ వ్రాయఁదలఁచి, ప్రస్తు

* It seems that these two have not their equivalents in the western science of medicine.

తము మహర్షులు శల్యతంత్రమునెట్లు కనుఁగొనినది, దాని నెట్లు శిష్యులకుఁ గర్మ పథమున బోధించినదియు మాత్రము సుశ్రుతము ననుసరించి సంక్షేపముగ వ్రాయుచున్నాఁడ.

శల్యాశబ్దనిరుక్తి.
శల్యస్వరూపము.

"శలతి ఆశు గచ్ఛతి" అనువ్యుత్పత్తివలన శరీరమున వేగముగను జుఱుకుగను ప్రవేశించి సర్వశరీరమునకు బాధను గలిగించెడి వస్తువుకు "శల్యము" (బాణము)" అని పేరు.

అధర్వణవేదమున శల్యశబ్ద మనేకస్థలముల భిన్నభిన్నార్థములయందుఁ బ్రయోగింపఁబడియున్నను విషదిగ్ధమగు బాణ మనునర్థమందు బహుశః విని యోగింపఁబడియున్నది.

(అధర్వణవేద. కా. 4. పే. 542. 543)

మఱియు సుశ్రుత (సూ. 26 అ) మున, సన్ననిముఖములుగలిగి, చురుకు గలోన వెంటనే ప్రవేశించి ప్రాణములను హింసించెడి లోహమయము "శర ఏవాధికృతః" శల్యమని విస్పష్టముగ నున్నది. పరస్పరజయేచ్ఛచే యుద్ధ

శల్యతంత్రమును కని పెట్టిన మార్గము.

మందుఁ బ్రయోగించుకొనెడి యనేకాకారములగు శల్యములు (బాణములు) శరీరమునఁ బ్రవేశించి యమిత బాధలు గలిగించు. అయ్యవి శరీరమునఁ బ్రవేశించు మార్గములను, వాని యునికి, వాని గమనములు, పరిణామములును దెలిసికొనుటకుఁ గాను, అంగ ప్రత్యంగాది భేదమగు శారీరశాస్త్రము నభ్యసించిరి. అనంతరము వాని బాధలను దొలఁగింప ననేకోపాయముల నరయఁ బ్రయత్నించిరి. అందు విశేషోపాయంబులగు యంత్రశస్త్రములం గనుంగొనిరి. పిమ్మట శల్యముల యాకృతిభేదముల ననుసరించి కంకముఖము, సింహాస్యము మొదలగు యంత్ర భేదములను మండలాగ్ర, వృద్ధిపత్ర, వేతసపత్రములు మొదలగు శస్త్రములను, జలూక, అయస్కాంత, సూర్యకాంత మొదలగు సాధనములను దెలిసికొనిరి. పైనిఁ జెప్పఁబడిన యంత్ర శస్త్ర సామగ్రిచే శరీరమునఁ బ్రవేశించి బాధచేయు శల్యమును బైటికి వెడలించుటకై ఛేదనభేదనాది శస్త్రకర్మములం గనిపెట్టిరి. శస్త్రచికిత్సావిధానమునందు శరీరమును బ్రవేశించిన "శల్యము" అనువస్తువును వెలికిదీయుట కారంభింపఁ బడినదగుటచేతనే "శల్యతంత్ర" మని యాయుర్వేదమున మహర్షులు వ్యవహరించిరి. క్రమాగతమగు శస్త్ర

చికిత్సాకుశలతచేత శరీరమున గ్రుచ్చుకొని బాధను గలుగజేయు నినుపకు నకలు, దంతములు, ఎముకలు, రాతినలుసులు, ముండ్లు మొదలగు వానిని గూడ శల్యములనియే వ్యవహరించిరి. మరియు వాతాదిదోషములయొక్క యా ధిక్యతచేత శరీరమునఁ బుట్టి శస్త్రాదులచే నివారింపందగిన విద్రధిమొదలగు వ్యా ధులనుగూడ శల్యమనిరి. వెండియు, మఱికొందఱు మనశ్శరీరములకు బాధను గలిగించెడి వాతాదిదోషములచేఁబుట్టు సామాన్యవ్యాధులను గూడ శల్యమని నుడివిరి. ఈరీతిఁ గ్రమప్రాప్తమగు జ్ఞానగరిమచే శల్యశబ్దమును శరీరమునకుఁ గలుగు సామాన్య బాధలయందు వినియోగించినను, శల్యతంత్రజ్ఞులగు ధన్వంతరి మొదలగువారు వెలుపలనుండి శరీరములోఁ బ్రవేశించిన బాణములకే శల్యశబ్ద మును వ్యవహరించిరి.

చరిత్రకారుల యాశయము.

ఆదియందు గ్రీకుదేశీయు లీజిప్టు మతగురువుల వలన నార్యుల వైద్య శాస్త్రమును గ్రహించిరా, లేక ఆలెగ్జాండరు దండయాత్రకుఁ బిమ్మట గ్రీకుదేశీయుల వలన నార్యులే వైద్య శాస్త్రమును సంపాదించి చరక సుశ్రుతాది వైద్య గ్రంథముల రచించి, కాయ శస్త్రచికిత్సలను మహోన్నత పదవికిఁ దీసికొనివచ్చిరా యను విషయము చర్చలో నున్నట్లు చరిత్రకారులు వ్రాయుచున్నారు.

చరిత్రకారుల సిద్ధాంతము.

డాక్టరువైజు అనువారు తన "ఆసియాయీల యౌషధ చరిత్ర (History of Medicine among the Asiatics) మను గ్రంథమున మొదటి యూహనే రూఢిపఱచి యున్నారు. హిప్పక్రేటిస్ (Hippocratese) అనువారి సంగ్రహములయందలి వైద్య పద్ధతులను గూర్చినవిషయములు విఖ్యాత శల్యతంత్రమను సుశ్రుతము లోని విషయములతో సరిపోవు చున్నవనియు, మహర్షులచేఁ గనిపెట్టఁబడిన శస్త్రచికిత్సలు సుశ్రుతమున వర్ణింపఁబడిన వనియు, నిట్టి ఘనకార్యనిర్వాహణము ఋషిపుంగవుల వలననే యుద్భవించె ననియు, నలెగ్జాండరుదండయాత్ర కాలమునకే పూర్వదేశీయులగు నార్యులు కాయశస్త్రచికిత్సలయందమేయమైన జ్ఞానముగలవారై యపారమైన ఖ్యాతిని వహించి యుండిరనియు మొదలైన సంగతులను జరిత్రకారులు (Strabo & Arrian) చెప్పుచున్నారు.

కాన శస్త్రివైద్యశాస్త్రి జ్ఞానముగల వారిలోఁ, త్రైకాలిక జ్ఞానులగు మనమహర్షులే ప్రప్రథములని చెప్పవలయును.

శల్యతంత్రప్రాచీనత.

ఋగ్వేద. కాం. ప్ర. మం

యజ్ఞస్యశిరోచ్ఛిద్యత. 6 - 4 - 9

తస్మా అక్షినాసత్య ...
సద్యోజంఘాం ఆయసీంవిస్పలాయై
ఇత్యాది } 1-8-186-116

అని మంత్రబోధితమగు యజ్ఞశిరస్సంధాన, జంఘాసంధా, నాక్షిసంయోజన రూపమగు నాశ్వినేయుల శస్త్రిచికిత్సాకుశలత ఋగ్వేదాదులయందుఁ గనఁబడుటచేత శస్త్రిచికిత్సయొక్క ప్రాచీనత వ్యక్తమగుచున్నది. పౌర్వాపర్యమును గూర్చి చర్చించు నవనాగరకులగు కొందఱుచరిత్రకారులు ఋగ్వేదాదుల యందు విస్తరిల్లియు మంత్రపూర్వకముగా నుండుటం బట్టి యాశస్త్రిచికిత్సల ప్రాచీనతను గురించి యవగతము చేసికొనలేకుండుట విశేషాంశము గాదు.

శల్యతంత్ర పరంపర.

దేవవైద్యులనంబరగు నశ్వినీ దేవతలు తమశస్త్రిచికిత్సా కుశలతచే విశేషముగ ఋగ్వేదాదులయందుఁ బొగడఁబడుటచే శస్త్రి చికిత్స వైదికయుగమున నధికముగ వ్యాపకములో నున్నట్లు తెలియుచున్నది. అనంతరము కాయచికిత్సయం దగ్రగణ్యతను వహించిన "అగ్నివేశ, ఆత్రేయ" మతాను యాయి యగు చరకుఁడు తన గ్రంథము చికిత్స 25-వ అధ్యాయమున పాటన, వ్యధన, ఛేదన, లేఖన, ప్రచ్ఛన, సీవనములను శల్యకర్మ భేదముల నాఱువిధములుగఁ జూపుటచే వారికాలమున శల్యతంత్ర మభివృద్ధిని బొందినట్లు తెలియుచున్నది. పిదప ఔపధేనవ, ఔరభ్ర, పుష్కలావత, కరవీర, మార్కండేయ, పరాశర, ధన్వంతరి మొదలగు శల్యతంత్రజ్ఞుల మతముల ననుసరించిన సుశ్రుతుఁడు తన గ్రంథమున చరకునికంటె "ఆహార్య, విస్రావ్య" ములను రెండు విధములగు శల్య కర్మముల నధికముగఁ జేర్చి యెనిమిది యని చెప్పుటచేత చరకాచార్యుల కాలమునకంటె సుశ్రుతు కాలమున శల్యతంత్ర చికిత్సలు మిక్కిలి యభివృద్ధిలో నున్నట్లు తేటఁబడుచున్నది. పిమ్మట వాగ్భటుఁడు తన "అష్టాంగసంగ్రహ" మను వృద్ధవాగ్భటమున సూత్ర 34 అధ్యాయమున సుశ్రుతులు చెప్పిన యెనిమిది శస్త్రములు గాక

నాలిగింటి నధికముగఁ జేర్చి మొత్తమున శస్త్రకర్మములు పదిరెండని నిరూపించి యున్నాఁడు. మఱియు నీశస్త్రకర్మమున కుపయోగించెడు శస్త్రములను సుశ్రుతాచార్యులు వక్కాణించిన యిరువదిగాక మఱి యాఁటింటి నధికముగ వృద్ధవాగ్భటను 34 అధ్యాయమునఁ దెలుపుటచేత సుశ్రుతుల కాలమునందు కంటె వాగ్భటుల కాలమునఁ గ్రమాగతమగు జ్ఞానగరిమచే శల్యతంత్రచికిత్సలు మిక్కిలి ప్రచారములోనున్నట్లు తెలియుచున్నది. అనంతరము "ఉగ్రాదిత్య" ప్రభృతులు సుశ్రుతాది మతముల ననుసరించియె శల్యతంత్ర చికిత్సల నాచరించి యభివృద్ధికిఁ దెచ్చినట్లు దెలియుచున్నది.

చిరకాలమునకుఁ బూర్వము ధన్వంతరి మతావలంబియగు సుశ్రుతుఁడు తన గ్రంథమున అశ్మరి (Urinary calculus), మూఢగర్భ ( Difficult mal-presentation of foetus and difficult labour), నాసాభంగ (Rhinsplastic surgery), బద్ధోదర (Intestinal obstructions), జలోదర (ascites), పరిస్రావ్యోదరములు మొదలగు రోగములయందుఁ గనపఱచిన శస్త్రచికిత్సానిపుణతలిప్పటికిని శస్త్రచికిత్సాధౌరేయులని ఖ్యాతి గాంచిన యాంగ్లవైద్య విశారదులచేతఁ గొనియాడఁ బడుచున్నవి.

ముందు చెప్పఁబడినచొప్పున శరీరమునఁ జొచ్చిన శల్యములు వానిస్థితిగమనము మొదలగునవి శరీరమందలి యంగప్రత్యంగాది జ్ఞానము లేకయే తెలియుట దుర్లభము గాన నామార్గములు దెలిసికొను రీతిని నుపాయములను సుశ్రుతుఁడు తన సుశ్రుత శారీర పంచమాధ్యాయమున నీవిధముగా బోధించెను.

శారీరశాస్త్ర జ్ఞానము.

శారీరశాస్త్రమందుఁ బరిపూర్ణజ్ఞానమును గోరినయెడల మృతి నొందిన మనుజునియొక్క కళేబరమును దృష్టకర్మము (Dissection) నకుఁగాను సిద్ధము చేసి ప్రత్యవయవ విభాగమును బ్రత్యక్షముగఁ బరీక్షింపవలసినది.

పరీక్షార్థము నిర్దిష్టమైన మృతకళేబర మతివృద్ధునిదియు దీర్ఘకాలరోగపీడితమును విషాదులచే మృతినొందినదియుఁగాక సర్వావయవసూత్రగిలిగి యుండవలయును.

ముందుగ మృతకళేబరముయొక్క యాంత్రమును (intestines) వస్తికర్మము (Enima) చేఁ బురీషమును వెడలించి శోధన సేయవలయును. పిదప ముంజగడ్డి, దర్భ, నార మొదలగు వానిచే

పరీక్షావిధానము.

నన్నియవయవములను బాగుగఁ జుట్టి చాపలుమొదలగు నీటిజంతువులు తిన కుండగను ప్రవాహమునఁ గొట్టుకొని పోకుండగను బంజరస్థముగావించి నిశ్చ లోదకముగల వాగునందు కుళ్ళుటకుంచవలసినది.

*ఏడుదినములైన తరువాత బాగుగఁ గుళ్లిన శరీరమును పైకిఁదీసి దర్భ, గడ్డి, వీనివేళ్లతోఁ జేసిన కుంచెతోఁగాని లేక వెదురు కుంచెతోఁగాని చర్మము, మాంసకండరములు (Muscles), సిరలు(Veins), స్నాయువులు(Nerves), ధమను లు (Arteries), ఆంత్రము(Intestines), యకృత్తు(Liver), ప్లీహము(Spleen), హృదయము (Heart), వృక్కములు (Kidneys), పుప్పసము(Lungs), క్లోమము (Pancreas), మొదలగునాశయములను అస్థులు అస్థిసంధులు(Joints) మొదలగు త్వగా(Skin) ది బాహ్యాభ్యంతరమైన ప్రత్యవయవమును విభజించి బాగుగఁ బరీక్షింపవలయును.

ఈరీతి శారీరశాస్త్రమును జక్కఁగ నభ్యసించి బాహ్యాభ్యంతరావయ వములను మాటిమాటికిఁ బ్రత్యక్షముగఁ జక్కఁగఁ బరీక్షించి సందేహ నివృత్తి చేసికొనవలయును.

శల్యచికిత్సాశాల యందు ముందు సిద్ధముగ నుండవలసి వస్తుసముదాయము.

శస్త్రములు (Instruments, Lancet etc.), యంత్రములు (Surgical-appliances Forceps etc.), క్షారము (Alkali), అగ్ని (Fire), జలూక(Leeches), శలాక(Probe or Director), అలాబు(Prepared gourd) జాంబవోష్ఠము(Canterising instrument) పిచువు(Cotton), ప్లోతము(Lint), సూత్రము (Thread), పట్టము(tow), తేనె(Honey), నెయ్యి(Ghee), కొవ్వు (Lard), పాలు (Milk), నూనె (Oil), తర్పణము (Powdered Wheat soaked in Water), కషాయము (Decoctions), ఆలేపనము (Medicated Plasters), కల్కము (Paste), విసనకఱ్ఱలు (Fans), చన్నీళ్లు (Cold Water), వేడినీళ్లు (Hot-Water), కాగులు మొదలగు పాత్రలు (Cauldrons), కవలిక (Splints), మృత్కపాలము, (శరావములు మొదలగునవి), కంసము (శేరుకొలతపాత్ర), స్థాలి (చిన్నపాత్రలు), శయనము (మంచములు మొదలగునవి), ఆసనము (పీటలు - కుర్చీలు), మొదలగు పరికరములును, వెదురుపేళ్లు (Skin of-

* మృతకళేబర మందలి విషము (Sceptic Poison) యొక్క క్రూరతను దగ్గించుటకై బాగుగఁ గుళ్లుట కేడుదినములుంచు మనిరని తోఁచెడిని.

Bamboos), స్ఫటికము (కోణయుక్తమగు వస్తువులు Crystals), కురువిందపు రాళ్లు (Kuruvinda Stone), కాంతపురాళ్లు (Magnets), గాజుతునకలు (Bits of glass), ఏకు ఆకులు (Leaves of Shata patra, sephalit' Goje, etc.), మొదలగు పదార్థములును, క్షౌమాది బంధనోపయోగ పదార్థములును, మత్తును గలుగఁజేయు తీక్ష్ణమద్యములును, సంజ్ఞాకర (జటామాంసి వస, మొదలగు) ద్రవ్యములును, అనురక్తులును దృఢకాయులును సర్వకార్య సమర్థులును నగు సహాయులను పరిచారికులను సిద్ధముగా నుంచికొనవలయును.

మత్తునుగలిగించుట.

శస్త్రకర్మము చేయుటకుఁ గొంతపూర్వ ముచితాహారములతో భుజింపఁ జేయవలయును. శస్త్రచికిత్సా జన్యమగు బాధలు తెలియకుండునట్లు బాగుగ మత్తును గలిగించు మద్యములను ద్రాగింపవలయును. శస్త్రకర్మమునకుఁ బూర్వము భుజించుటచేత మూర్ఛ మొదలగునవి గలుగవు. మద్యద్రవ్యముల నుపయోగించుటచే బాధ తెలియకుండును. కాన శస్త్రకర్మమునకుఁ బూర్వము భుజింపఁజేయుటయు మద్యమును ద్రాగించుటయు నావశ్యకములు. 1872 సంవత్సరమున డాక్టర్. సర్. జేమ్సు దొరగారు క్లోరుఫారమును (Chloroform) కనుఁగొనుటకుఁ బూర్వమాంగ్ల వైద్యవిశారదులు కూడఁ బైమార్గముల నవలంబించుచు వచ్చిరి.

ఆయుధములు బట్టుకొను రీతి.

భేదనకర్మమునం దుపయోగించెడు వృద్ధి పత్రము మొదలగు శస్త్రములను బిడిసంధియందుఁ బట్టుకొనవలయును. లేఖ్యకర్మమునందు వృద్ధిపత్రము, మండలాగ్రము ననుశస్త్రములను గొంచెము చాపఁబడిన యఱచేతితోఁ బిడికిలియందుఁ బట్టుకొనవలయును. మఱియు నీ రెండుశస్త్రములను బిడియొక్క కొనను బట్టుకొని విస్రావణకర్మము చేయందగు. రాజులు, రాజపుత్రులు, ముసలివారు, సుకుమారులు, బాలురు, స్త్రీలు, శస్త్రమునకు భయపడువారు వీరలకు విస్రావణకర్మము చేయవలసిన చోఁ ద్రికూర్చకమను శస్త్రముచేఁ జేయవలయును. వ్రీహిముఖము నుపయోగించునపుడు పిడి నఱచేతియందు మఱుగుపఱచి యాయుధము నంగుష్ఠప్రదేశినులతోఁ బట్టుకొనవలయును. కుఠారిక నెడమచేతియందు మోపుచేసి బొటనవ్రేలితోఁగాని మధ్యమాంగుళితోఁగాని తట్టవలయును. ఆరా కరపత్రము, ఏషణి వీనిని పిడిదగ్గఱఁ బట్టుకొనవలయును. ఇతరశస్త్రముల నుపయోగము ననుసరించి వీలగునట్లు పట్టుకొనవలయును.

**అష్టవిధశస్త్రకర్మముల నభ్యసించు మార్గములు.**

శిష్యుఁడు శాస్త్రార్థములయందు జాగరూకుఁడైనను దృష్టకర్మములయందభ్యాసము లేనివాఁడైనచోఁ జికిత్సలం జేయుటయం దనర్హుఁడు గాఁడు గాన గురువు శిష్యుని ఛేదన భేదన లేఖనాదికర్మములయందును దైలాదులచేఁ జేయంబడు వస్తికర్మాదులయందును గర్మపథమును జెప్పంబోవు ప్రకారము సామ్యవస్తువులయందుఁ బలుమాఱు చూపి సుశిక్షితునిఁ జేయవలసినది.

**ఛేదనకర్మము. (Incising)**

ఛేదన విశేషములను బుష్పఫలంబులనంబరఁగు సొర, పుచ్చ, నూగుదోస, బుడమ, పెద్దదోస మొదలగు కాయలను గోసిచూపవలయును. అదేవిధముగ ఉత్కర్తనము, (పైకికోయుట) పరికర్తనము (దిగువకుకోయుట) మొదలగు వానినిఁ గూడ బోధింపవలసినది.

**భేదనకర్మము. (Excising)**

భేద్యకర్మమును నీరునింపిన తిత్తులను గాని మృతజంతువుల మూత్రకోశములను గాని జిగురువస్త్రములతోఁ, లేక పలుచనైన బురదతోఁ నింపినతోలు తిత్తులనుగాని చీల్చి చూపవలయును.

**లేఖనకర్మము. (Scraping)**

లేఖ్యకర్మములను రోమయుక్తమగు చర్మమునందను లోమవిలోమభేదములనెఱింగి గీఁకిచూపవలసినది.

**వేధనకర్మము. (Venesection)**

వేధ్యకర్మము మృత జంతువులయొక్క సిరలను కలువకాడలు మొదలగు వానిని వేధించి (Blood letting) చూపవలయును. ఇయ్యది కేవలము జలోదరము, మూత్రవృద్ధి మొదలగు వానియందుపయోగింపందగదు.

**ఏష్యకర్మము. (Probing)**

ఏష్యకర్మమును బురుగుతినిపోయిన బెజ్జములుగల కొయ్యలోట్టలయందును వెదురుగొట్టములు, తూటికాడలు, తామరకాడలు, ఎండిపోయిన సొరకాయలు మొదలగువాని ముఖములయందును "ఏషణీ" యను శలాక నుపయోగించు విధమును జూపవలయును.

**ఆహార్యకర్మము. (Extracting)**

ఆహార్యకర్మము పనస,మారేడు, దొండ మొదలగు ఫలములనుండి గింజలను బైటికిఁదీయుటచే నభ్యసింపఁ జేయవలయును. పండ్లనూడఁ దీయుటను జచ్చినజంతువుల పండ్లనూడఁదీయుటచే నేర్పవలయును.

విస్రావ్యకర్మము.
(Secreting and exudating fluids)

విస్రావ్యకర్మమును శాల్మలీఫలకమునందు మైనమును బూసి ప్రతిమలు వ్రాసి యాయాప్రదేశములనుండి చీము మొదలగు వానిని స్రవింపఁజేయు మార్గములను జూపవలసినది.

సీవనకర్మము.
(Suturing)

మృదువగు వస్త్రములను చర్మము మొదలగు వానిని గుట్టి సీవనకర్మమును జూపవలసినది.

స్థలభేదమున శస్త్రోపయోగభేదములు.

కనుబొమ, కణఁత, నొసలు, గండభాగము, కనుఱెప్ప క్రింది పెదవి, పంటిచిగురు, చంక, కటి, బొడ్డు, గజ్జ, వీని యందుఁ దిర్యక్ఛేదనము చేయవలయును.

అఱచేయి, అఱకాలు, వీనియందుఁ జంద్రమండలాకృతిగాఁ (గుండ్రగా) గోయవలయును. గుదము మేఢ్రము వీనియం దర్ధచంద్రాకృతినిఁ (Semilunar incisions) గోయవలయును. పైఁజెప్పిన చొప్పున నాచరింపనిచో నాయాప్రదేశములయందలి సిరలు (Veins) ధమనులు (Arteries) తెగిపోయి క్రమముగ మిగుల బాధను గలిగించును. శీఘ్రముగ మానుట యారంభింపదు. మాంసగ్రంథులను గలుగం జేయును గాన జాగరూకతతో నొనరింపవలయు.

బంధనములనభ్యసించుట.

బంధనాదికర్మములను గుడ్డలుఁ, మన్ను, కఱ్ఱ, చర్మము మొదలగు వానితోఁ జేయబడిన పురుషాకృతియొక్క కరచరణాదులయందుఁ గట్టుటచే నభ్యసింపవలయును. క్షౌమము, (అవిసినారతో నేసిన బట్ట) కార్పాసము (నూలుగుడ్డ), ఆవికము (కంబళి), దుకూలము (నారబట్ట), కౌశేయము (పట్టుబట్ట), పత్త్రోర్ణము (పౌండ్ర మగధదేశమందలి నాగ అను చెట్లనారచే నేయఁబడినగుడ్డ), చీనపట్టము (చైనాదేశపుఁబట్టుబట్ట), చర్మము (పదును చేయబడినతోళ్ళు) అంతర్వల్కలము (వలుపు లేక భుజపత్త్రి), అలాబుశకలము (సొరకాయ పైని తోలు), లతా (తెగడ మొదలగుతీగెలు), విదలము (వెదురు, పేము మొదలగు నవి), రజ్జువు (త్రాళ్ళు), తూలఫలము (దూది), సంతానిక (పాలమీఁగడ) వీని నాయా వ్యాధులయందు దేశమును గాలమును జూచి యుపయోగింపవలయును.

బంధనభేదములు.
(Kindsof bandages)

కోశ (సంచివలెనుండునది), దామ (మాలాకారముగలది), స్వస్తిక (+ ఈరీతి కాకపదాకృతి), అనువేల్లిత (మెలిగలది), ప్రతోలి మెలికలుగల త్రోవవంటిది), మండల (గుండ్రముగనుండునది), స్థగిక (తమలపాకు చుట్టవలె కొనగలది), యమక (జంటగకట్టవలసినది.), ఖట్వా (మంచము గళ్లవంటిది),

చినా (గాలిలోఁగదలున ట్లుండునది), విబంధ (ఉచ్చువలెనుండునది), వితాన (చాందినివలె నుండునది), గోఫణ (ఆవుకొమ్మువలె నుండునది), పంచాంగీ (అయిదుభాగములుగలది) అని బంధనములు పదునాలుగు విధములు. వీని యాకృతులు నామములను బట్టియే తెలియఁబడుచున్నవి.

స్థలవిశేషమునబంధనవిశేషములు.

అంగుష్ఠాంగుళి పర్వములయందుఁ గోశబంధమును, ఇరుకైన యవయవములయందు దామమును, సంధుల యందును గూర్చకమునను గనుబొమలు మణిబంధము, చెవులు, స్తనములు మొదలగు ప్రదేశముల స్వస్తికమును, గాలుసేతుల యం దను వేల్లితమును, మెడయందును మేఢ్రమందును ప్రతోలిని, గుండ్రని చోటులయందు మండలమును, అంగుళ్యగ్రమునను మేఢ్రాగ్రమునను స్థగికను, జంటయగుప్రణములయందు యమకమును, గణఁతలు దవడలు వీనియందుఖట్వాను, నేత్రాంతములయందుఁ జీనమును, బృష్ఠమునఁ గడుపున వక్షమునను విబంధమును, శిరస్సున వితానమును, చిబుకనాసికౌష్ఠాదులయందు గోఫణమును నిట్లే యే ప్రదేశమున నేయేబంధము సుబద్ధమగునో దానినచ్చోట బంధించి పిమ్మట ప్రణములకుఁ గ్రిందుగాను నడ్డముగాను ముడివేయవలయును.

యంత్రణ (ముడి.) భేదములు

యంత్రణము(Fastening of bandages) గాఢబంధము, సమబంధము, శిథిలబంధమునని మూఁడువిధములు.

గాఢబంధము.

పిరుదులు, పార్శ్వములు, చంకలు, నాభికిదిగువ ప్రదేశము, స్తనములు, తలచుట్టు, నీప్రదేశముల గాడబంధము వేయవలయును.

సమబంధము.

చెవులచుట్టు, భుజము చుట్టును, పాదములు, ముఖము చుట్టును, గంతముచుట్టును, బెదవులు, మేఢ్రము, అండములు, పృష్ఠము, నాభికిదిగువ, నీప్రదేశముల చుట్టును సమబంధము వేయవలెను.

శిథిలబంధము.

కన్ను, సంధులు, వీనిచుట్టును శిథిలబంధము (వదులుముడి) వేయవలయును.

యంత్రణవిధి సరియైనయెడల బాధల నణఁచి ప్రణముయొక్క చివరలను మెత్తచేసి యందలిరక్తమును శుభ్రపఱచి ప్రణమును మానునట్లుచేయును. బంధనములేనియెడల ప్రణము మశకాదులచే దష్టమై దుమ్ము మొదలగువానిచేఁ

గప్పఁబడి వాపును గలుగం జేయును. ఇదిగాక శీతాతపాదులచే దుష్టవ్రణముగ నైన మాఱును. చికిత్సకై యుపయోగించిన లేపము లెండి బాధను గలుగఁజేయును. రాలినైనను బోవును. కానజాగరూకుఁడై బంధనవిశేషములను జక్కఁగనభ్యసింప వలయును.

ఆచార్యానుశాసనము.

బాహ్యాభ్యంతరావయవములను బ్రత్యక్షమునఁ జక్కఁగఁ బరీక్షించుటచే లక్ష్యలక్షణములయందారితేరి సందేహ నివృత్తిగలవాఁడు, ఆయుర్వేదమునఁ బారంగతుఁడై రోగనివారకమైన చికిత్సలు జేయుట కర్హుఁడగును. కాన శుచిగలిగి తలను గోళ్ళను బెంచక ధౌతవస్త్రాదుల ధరించి భూతదయగలవాఁడై స్వాయత్తీకృతజ్ఞానమును బరీక్షావిధులచే తను దృష్టకర్మములచేతను దృఢపఱచుకొనవలసినది. అట్టిజ్ఞానమును బొందిన పిదపఁ బ్రవచనశక్తిని శాస్త్రవిషయకభాషాసౌష్ఠవమును సంపాదింపఁ బ్రయత్నింపవలసినది. అనంతరము, రాజాజ్ఞనుబొంది విశిఖానుప్రవేశమును (వైద్యవృత్తియందుఁ బ్రవేశించుటను) జేయవలెను.

వైద్యరత్న, పండిత. డి. గోపాలాచార్యులు.

# దేశభాషలలో శాస్త్రపఠనము

తల్లిపాలు త్రావిపెరిఁగిన బాలునకును, దాదిపాలు త్రావిపెరిఁగినబాలున కు నెట్టి భేదముండునో స్వభాషయందు శాస్త్రాభ్యాసము చేసినవారికిని బర భాషయందు జ్ఞానార్జనము చేసినవారికి నట్టిభేదమేయుండును. అన్య భాష మొదట నేర్చుకొని పిదప నాభాషయందు శాస్త్రములఁ గళలఁ జదువుకొనుట ద్రావిడ ప్రాణాయామమువంటిది. కాని యిట్టిప్రాణాయామమే మనదేశమునం దుఁ బ్రస్తుతము జరుగుచున్నది. తర్క-వేదాంతాదిపూర్వశాస్త్రముల నేర్చు కొనవలయు నన్న సంస్కృతము నేర్చుకొనవలెను. రసాయనపదార్థవిజ్ఞానాది శాస్త్రముల నభ్యసింపవలెనన్న నింగ్లీషునేర్చుకొనవలయును. ఈభాషల నభ్య సించుటకుఁ గొంతకాలము వ్యయపఱుపవలెను. ఇవి మనమాతృభాషలు కానం దున వీనినిఁ జక్కఁగ నభ్యసించుటకు విశేషముగాఁ బరిశ్రమను, కాలవ్యయ మును, ధనవ్యయంబును, గలుగుననుటకు సందేహము లేదు. స్వభాషయందే యన్నివిద్యల నేర్చుకొనుమార్గము లుండినయెడల నీవ్యయప్రయాసములన్నియుఁ దప్పిపోవునుగదా! ఉగ్గుపాలతో నేర్పఁబడిన స్వభాష. సహజముగఁ బ్రతిమనుష్యు నకువచ్చును. కొద్దిఁ బరిశ్రమతో దానినిఁ బ్రతిమనుజుఁడు నభ్యసించి యందుఁ బం డితుఁడు కావచ్చును. ఎట్టికఠినమైనగ్రంథమునైనను, విద్యనైనను, గళనైనను, దనభాషలో నుండెనేని మానవుఁడు సులభముగఁ దెలిసికొనఁగలఁడు. అంతియె కాదు. ఆభాష నెఱింగిన వారియందఱలో నాయావిద్యలు సులభముగను ద్వరి తముగను బ్రసరించి జనులయున్నతస్థితికిఁ గారణభూతములగును.

స్వభాషయందు విద్యలులేక పరభాష నభ్యసించి విద్యలసాధింపవలసిన వాఁడింట నన్నములేక పొరుగిండ్లుతిరిగి యన్నమును సంపాదించినవానితో సమానుఁడు. మనదేశములో మనకు, అనఁగా బ్రాహ్మణులకు, మొదటినుం డియుఁ బరాన్నమునుగోరుట విహితమైన ధర్మముగ నున్నందున మనవారిదియొక గొప్పతప్పుగ నెంచకపోవచ్చును. కాని ప్రాణముతోనున్న పాశ్చాత్య దేశ ముల వంకఁజూడుఁడి. విద్యావిషయమున నితరదేశములకంటె వెనుక బడకుం డుటకై వారు చేయుప్రయత్నములు చూచిన నెవ్వరిమానస మాశ్చర్యానం

దముల మునుంగకమానును? విద్యావిషయమై వారికింతకష్టమేల! కారణముస్ప ష్టము. నేఁడు వలసిన విద్యలన్నియు నేర్పు విద్యాపీఠములును, గ్రంథరాజములును ఇంగ్లండుదేశమునం దున్నందున వేఱు దేశమునకుఁ బోకయ వేఱుభాష నేర్చు కొనకయ, వారికన్ని విద్యలును, గళలును, వృత్తులును నేర్చుకొనుటకు వీలు న్నవి. దైవముయొక్క యద్భుతఘటనచే శాస్త్రసంబంధమయిన ఇంగ్లీషు గ్రంథములన్నియు నేఁడొక్కపెట్టున నశించిన వనుకొనుఁడు. పాపమిట్టి దురవస్థ యే దేశమునకు నెప్పుడును రాకయుండునుగాక! వచ్చినయెడల నింగ్లీషువారి వి ద్యాభ్యాసస్థితి యేమగును? ఏవిద్య నేర్చుకొనవలయునన్నను బరభాషయైన జర్మని భాషనో ఫ్రెంచిభాషనో మొదలభ్యసించి తద్వారమున నిష్టవిద్యనుగాని, కళ లనుగాని, వృత్తులనుగాని నేర్చుకొనవలెను. అప్పుడు వారిసాంపత్తికస్థితి యిప్పు డున్నట్లుండఁగలదా? పొగబండి నడపువిధములఁ దెలిసికొనుటకు జర్మనీదేశము నకు, నావికశాస్త్రి మెఱుంగుటకు ఫ్రాంసుదేశమునకు, నాకాశయానము నభ్య సించుటకు 'ఇటాలి' దేశమునకు 'దేహి' యనిపోవలసిన యింగ్లీషువారు తమదే శాభివృద్ధి యెట్లుచేయఁగలరు? కావున స్వస్వమాతృభాషలలో సకలవిద్యాసాధ నములుండుట నాగరకరాష్ట్రములయొక్క మొదటిలక్షణము.

## ఇంగ్లీషు నేర్చుకొనుట.

అట్లనెవ్వరును సంస్కృతమునుగాని యింగ్లీషునుగాని నేర్చుకొనఁగూడ దాయనియు, నాయాభాషల నేర్చుకొని విద్యలను సాధించుటకువీలున్నప్పుడు మా తృభాషలలో లేవన్న చింత మన కేలయనియుఁ గొందఱడుగవచ్చును. సంస్కృతభా షనుగాని, యింగ్లీషు భాషనుగాని, ఫ్రెంచిమొదలయిన తదితరభాషలనుగాని చే నైనవారు, ధనమున్నవారు, వీలుగలవారు, నేర్చుకొనవలయుననియే నాతాత్ప ర్యము. వానిలోను, రాజభాషయయినందునను, లోకమందలి యితరభాషలకం టె నన్నివిధములను గ్రంథభాండారమునం దత్యధికమైనదని ప్రఖ్యాతిచెందినది యు, నగుటచే నింగ్లీషుభాషను నేర్చుకొనుట మననాగరకతాభివృద్ధికిని దేశోన్న తికి నత్యంతావశ్యకమని నాయభిప్రాయము. కాని యది యెంతవఱకుసాధ్య మో! జనసామాన్యమున కంతకు నింగ్లీషుభాష చక్కఁగ వచ్చుటయు, నందఱు వారు సకలవిద్యలను సాధింపఁగలుగుటయు నింక వేయిసంవత్సరముల కయినను హిందూదేశమునందు సంభవించునా? ఎప్పటికిని సంభవింపనేరదు. అట్లే సు

స్కృతము. ఇదిదేవభాషయని మనకు భక్తియున్నను దేశమునం దెందఱు సం
స్కృతపండితులుకలరు? సంస్కృతము దేశభాషాభివృద్ధికి సాయముగానుండవల
సినదేకాని మరల నది దేశభాషయగు నన్నమాట కలలోనివార్త. సంస్కృత
ముగాని యింగ్లీషుగాని హిందూదేశములోని దేశభాషాస్థానము నాక్రమించు
కొననేరవు. దేశభాషలలో విద్యనేర్పుటకంటె యీభాషలలో విద్యనేర్పుట యె
ప్పుడును నేర్చుకొనువారికిని, నేర్పువారికిని నెక్కుడుకష్టముగానుండఁగలదు. కా
వున నాయాభాషలవారికి నాయాభాషలలోనే విద్యాదానముచేయుమార్గ
ముల నిర్మించుట యావశ్యకము.

ఇప్పుడు మనదేశస్థులు వేలువేలువిద్యల సాధింపనెంచి కొందఱింగ్లండునకు
ను, గొందఱు జపానుకుఁ, గొందఱమెరికాకును బోవుచున్నారు. దేశముయొక్క
భావిపురోవృద్ధికి మంచిచిహ్నమే. కాని యాలాగున నెందఱు పోఁగలరు? లక్ష
కొక్కఁడుగాని వేయికొక్కఁడుగాని వెళ్లగలఁడా? వేలకొలఁది ధనము వెచ్చించి
యితరబాధలకోర్చి లక్షకొక్కఁడు వెళ్లివచ్చిన నేమిప్రయోజనము? మిగిలిన
తొంబదితొమ్మిదివేలతొమ్మిదివందలతొంబదితొమ్మిదమందికి వివిధవిద్య లబ్బుట
యెట్లు? వీరిలోఁగొందఱు కొంచె మింగ్లీషు నభ్యసించెద రనుకొందము. మిగి
లినవారిగతి? వారికి జ్ఞానార్జనముచేయుదమన్నకోర్కె పొడమినను జ్ఞానము ల
భించుమార్గములేదా? అట్టి సాధనముల నిర్మించుట దొరతనమువారియొక్కయు,
విద్యాధికులయొక్కయు, ధనాధికులయొక్కయు సర్వకృత్యముకాదా? ప్రజలంద
ఱును విద్యనేర్చుకొనుటకు వీలయిన సాధనములను నిర్మించుట రాజధర్మము.
ఈయుద్దేశము తోడనే శ్రీశ్రీ చక్రవర్తివారు పట్టాభిషేకమహోత్సవకాల
మందుఁ బ్రాథమిక విద్యకై 50 లక్షుల ధన మొసంగిరి. కాని యీధనములో నేమి
యెన్నవవంతు దేశభాషాభివృద్ధికై కర్చుపడునో చూడవలసియున్నది. మనము
కేవలము రాజసాహాయ్యమును నమ్మియేయుండఁగూడదు. వారు చేయుసాయ
మునకై కృతజ్ఞులమగుచు మనము స్వతంత్రప్రయత్నములను జేయుచుండవలె
ను. ఈమార్గమునఁ బోయిన బాగుగనుండునని ముందంజవేయుటకు విద్యావంతు
లును విద్యావంతులచే నారంభింపఁబడిన కార్యములు శాశ్వతములుగ నుండున
ట్లుచేయుటకు ధనవంతులును సంసిద్ధులైయుండవలెను. శాస్త్రజ్ఞానాభివృద్ధికై
మనదేశమునందు జరుగవలసిన పనినిగూర్చియు, జరుగనున్న పనినిగూర్చియు వి
చారించెదము.

దేశమందంతటశాస్త్రజ్ఞానాభివృద్ధి కావలయునన్న దేశభాషయందు గ్రంథములు, నాశాస్త్రములను బోధించుపాఠశాలలు నుండవలయును. కేవలము విద్యాపీఠములుండి గ్రంథములు లేకపోయినను బ్రయోజనములేదు. కేవలము శాస్త్రములుండియుఁ జెప్పువారులేక పోయిన నుయోగములేదు! ఇందుకు దృష్టాంతముగ నొకచిన్న యుదాహరణమిచ్చెదను. చెన్నపట్టణమునందు నాయుర్వేద పాఠశాలయున్నదని మీరెఱిఁగిన విషయమే. అందు నింగ్లీషుపద్ధతి ప్రకారము శారీరశాస్త్రము (Physiology and Anotomy) అను విషయమొకటి విద్యార్థులకు బోధించెదరు. పాశ్చాత్యవైద్యశాస్త్రము నందారితేఱిన డాక్టర్లే యీవిషయమును బోధించెదరు. కాని యీవిషయమును బోధించు గ్రంథము దేశభాషలందు లేనందున, విషయబోధచేయుటలో నుపాధ్యాయులకును, విషయమును బోధచేసికొనుటలో విద్యార్థులకును మితిలేని పరిశ్రమ కలుగుచున్నది. తెలుఁగునందు శ్రీవీరేశలింగము పంతులుగారిచే రచింపఁబడిన చిన్న శారీరశాస్త్రముకలదు. కాని యది యీతరగతికిఁజాలదు. ఇంతకంటె నెన్నియోమడుంగులు విపులముగ వ్రాయఁబడిన గ్రంథముకావలయును. అట్లే శస్త్రవైద్యమునుగుఱించిన గ్రంథము తెలుఁగులో లేనేలేదు. ఇతరదేశభాషలందును లేదు. కావున నదినేర్పుటయే యసంభవమైనది. ఆవిషయము నాయుర్వేదవైద్యశాలలో నేర్పువిషయములలోనుండి తీసివేసిరి. అట్లె యాయుర్వేదసంబంధమైన యుద్గ్రంథములు సంస్కృతమునందేకలవు. తెలుఁగునఁగాని యితరభాషలందుఁగాని లేవు. కావున సంస్కృతము చక్కఁగ రానివారికి నాగ్రంథములవలని విశేషలాభముకలుగదు. ఈయిక్కట్టునాలోచించియే శ్రీభిషజ్మణిపండిత గోపాలాచార్యులవా రాయుర్వేద గ్రంథమాల నొకదానిని స్థాపించి గీర్వాణగ్రంథములను దెలుఁగుచేసి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులైరి. మచిలీపట్టణములో స్థాపింపఁబడిన జాతీయకలాశాలాధికారులుకూడ భిన్నభిన్నకళాకౌశల్యములు నేర్పుటకుఁదగిన గ్రంథములులేనందున నేగ్రంథములు పఠనీయములుగా నేర్పవలయునాయని త్రొక్కులాటపడుచున్నారు! ఇది చదువుచెప్పువారుండి చదువుకొను గ్రంథములులేనందునఁ గలుగు నిబ్బంది. ఇట్లే కొన్నియెడల గ్రంథములున్నను వానినిఁ జదువువారుగాని, చెప్పువారుగాని యుండరు. ఉపయోగములేక పుస్తకములు చెదలుపట్టిపోవును. తెలుఁగులో బీజగణితము (Algebra)

న్నది. క్షేత్రగణిత ము (mensuration) న్నది. అట్టి గ్రంథములకు విశేష ప్రచారములేక యవి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందు మూలడాగి యేలయుండవలయును? వాని నుపయోగించు గురువులు, నభ్యసించు విద్యార్థులును లేక. అట్లగుటచేఁ దెలుఁగులోఁగూడ 'నాల్జెబ్రా' చెప్పవచ్చునా? తెలుఁగులో 'జ్యామెట్రి' నేర్పఁగలమా? Progressions చెప్పిన నింగ్లీషులోఁ జెప్పవలయునేగాని తెలుఁగులో నేర్పుటకువీలులేదు. అని మనవారే వాదింపఁ జొచ్చిరి! ఇంగ్లీషు గణితమునకుమాఱుగా లీలావతీగణితమునే మనపాఠశాలలోఁ జెప్పుచుండినచో నిట్టిసంశయములు మనవారికేలపుట్టును? ఇప్పుడు మనపిల్ల వాండ్రు ఎఫ్. ఎ. తరగతిలో నేర్చుకొనుచున్న ప్రోగ్రెషనులు, ఫరముటేషన్ కాంబినేషనులు మనపిల్లలు నాలుగవ యయిదవ తరగతులలో "శ్రేణీవ్యవహారము, అంకపాశవ్యవహారము" అనుపేళ్లతో నేర్చుకొనియుందురు. నాతాత్పర్యము పాశ్చాత్యగణితశాస్త్రము మనగణితశాస్త్రమునకంటెఁ దక్కువ యభివృద్ధిలో నున్నది యనిచెప్పుటకాదు. ఇటీవలిగణితజ్ఞుల బుద్ధిసూక్ష్మతచేఁ బాశ్చాత్య గణిత శాస్త్రముయొక్క క్షేత్రమత్యద్భుతముగ వైశాల్యముఁ జెందినదియని నేనెఱుంగుదును. కాని యావిద్యయంతయుఁ దెనుఁగునఁ జెప్పరాదా? జ్ఞానమొకభాషయొక్క యబ్బసొమ్ముకాదు. ఏభాషమూలముననైనను దానిని సాధింపవచ్చును. ఎవరిమాతృభాషలో వారుసులభముగను గొలఁదికాలములోను, గొలఁది శ్రమలోపలను, దెలిసికొనవచ్చును. పరభాషలో నభ్యసించినయెడల నెక్కుడు కాలము నెక్కుడు శ్రమయు, నెక్కుడు ధనవ్యయమును, బట్టును. ఈభేదము కనిపెట్టి యింగ్లీషువిద్యలన్నియు మనభాషలోనికిఁదెచ్చి లోకులకు బోధించుట సమంజసము. అట్లుచేయక పరభాషలలోఁజెప్పుట స్వభావ విరుద్ధము.

ఇఁకనిప్పటి విద్యాభ్యాసపద్ధతి చూతము. 1-వ ఫారనుగాని 2-వ ఫారము గాని మొదలుకొని మనపిల్లవాండ్రకు భూగోళము, అంకగణితము, రేఖాగణితము, పదార్థవిజ్ఞానము మొదలయిన విషయములన్నియు నింగ్లీషునఁ జెప్పఁ బ్రారంభించెదరు. అప్పటికా బాలునికి నింగ్లీషు జ్ఞానమెంతవఱకుండును? తప్పులులేకుండ రెండువాక్యములుకూడ వ్రాయుసామర్థ్యము వానికుండదు. తనమనస్సులోని యూహల నింగ్లీషునందుఁ జెప్పఁజాలఁడు. అట్టివానికి నింగ్లీషునందు రేఖాగణితము చెప్పిన నేమి ప్రయోజనము? A point is that which has no dimension అనినవాక్యమునకునర్థము చక్కఁగఁ జేసికొన లేనివానికి యూక్లీడు

భూమితి యింగ్లీషులోఁ జెప్పినందునఁ బ్రయోజనమేమి? భట్టీపెట్టుట, యనఁగా నర్థము తెలిసినను దెలియకపోయినను వల్లించి తూచాతప్పకుండ నొప్పగించి పరీక్షలలోఁ గృతార్థులగుట, యిందువలన సిద్ధించుచున్నది. చెప్పినదానికి నర్థముచేసి కొనుటకుఁగాని మనస్సునందలి యూహలఁ జెప్పుటకుఁగాని తగినంత భాషాజ్ఞానము లేనివారు గ్రుడ్డిపాఠములుచేయక పరీక్షలోఁ గృతార్థులగుటకు వీలున్నదా? లేదు. కావున నింగ్లీషులో నీవిషయమును నేర్పి మనము మన విద్యార్థులయొక్క బుద్ధివైభవమును దగ్గించుచున్నామని నాయొక్క దృఢనిశ్చయము. ఇప్పుడు ప్రవేశపరీక్షవఱకుఁ జదువుచున్న విద్యార్థుల ధారణాశక్తి యంతయు, నింగ్లీషునందు భిన్న విషయముల నింగ్లీషుభాషలో వల్లించుటయందే వ్యయమగుచున్నది. స్వభాషయందు వారికీ విషయముల నేర్పిన నింతపరిశ్రమ యుండదుగదా. వారికి విషయము బహుసులభముగా బోధపడును. ఒక్కసారి బోధపడిన తరువాత విద్యార్థి గ్రంథమునంతయు వల్లింపఁ బనిలేదు. ప్రశ్నలకు విద్యార్థి ప్రత్యుత్తరము చెప్పునపుడు తనమాటలలోనే చెప్పఁగలఁడు. తనమాటలలోనే వ్రాయఁగలఁడు. అందుకై వేఱుపరిశ్రమగాని ప్రయత్నముగాని యక్కరలేదు. వచ్చిరాని యింగ్లీషులో నేర్చుకొనుటకంటెను, బదులుచెప్పుట కంటెను, స్వమాతృభాషలో నేర్చుకొనుటయు బదులుచెప్పుటయు నూఱురెట్లు సులభతరము. ప్రతిపాఠశాలలోను బ్రవేశపరీక్ష వఱకును, నింగ్లీషు సంస్కృతము మొదలగు వాఙ్మయ విషయములుతప్ప మిగిలిన విషయములన్నియు, అంకగణితము, బీజగణితము, రేఖాగణితము, క్షేత్రగణితము, పదార్థ విజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, మొదలయినవన్నియు, బాలకులమాతృభాషలయందు నేర్పినయెడల నిప్పుడు బి. ఏ. వారికి విషయములందు నెంత ప్రవేశముకలదో యంతప్రవేశము ప్రవేశ పరీక్షలోని విద్యార్థులకుఁ గలుగుననియుఁ గనీసము మూఁడు సంవత్సరములకాలము కలిసివచ్చుననియు, నందుకయ్యెడు వ్యయప్రయాసలు తప్పుననియు నాయొక్క దృఢమైనయభిప్రాయము. బడి జీతములు, భరించుటకువీలు లేకుండఁ బెరిఁగిన యీకాలమున నొక్కొక విద్యార్థికి మూఁడుసంవత్సరములనఁగా వేయిరూపాయలని వేఱుగఁ జెప్పనక్కరలేదు. నలుగురు పిల్లలుగలవారికి నాలుగువేలాదాయముగదా!

## ఒక యాక్షేపము.

కాని యిట్లు చేసినయెడల నింగ్లీషుభాష మనవారికిఁ జక్కఁగ నలవాటు కాదు. దానియందు మనవిద్యార్థులకుఁ గలుగుచున్న ప్రజ్ఞావిశేషంబులు తగ్గును. అందుచే నింగ్లీషుభాషాధ్యయనమువలన మనకు నిప్పుడు గలుగు చున్న యద్భుతమైన మానసోన్నతియు, నాదర్శోదయములును దొలఁగి మనకు మిక్కిలి హానిసంభవించునని కొందఱనవచ్చును. ఇంగ్లీషువిద్యార్థు లింగ్లీషు వాఙ్మయంబు నధికముగా నభ్యసింపవలయునన్నమాట నాకును సమ్మతమే. ఆయద్వితీయ వాఙ్మయప్రభావమును నేనెఱుంగుదును. దాని నభ్యసించి మన భాష నంతస్థితికిఁ దెచ్చుటయే విద్యార్థికుల యర్హాకృత్యమని నాతాత్పర్యము. కాని యాభాషయందు గణితమును, బీజగణితమును, గమ్మరమును, గుమ్మర మును, నేర్చినఁగాని యాభాష చక్కఁగా రాకపోవునని నేను దలఁపను. కావ్య ములను, వ్యాసములను, జర్చలను, జరిత్రలను, రాజకీయోపన్యాసముల నుద్గ్రంథములను, దత్త్వగ్రంథములను, జదివిన భాషాప్రావీణ్య మలవడునేగాని గణితాదికములు చదివినందునఁగాదు. కావున నింగ్లీషు చక్కఁగరావలయునన్న నిప్పుడింగ్లీషు వాఙ్మయము దినమునకు నొక్కగంట చెప్పుచున్నయెడల నికముం దు రెండుగంటలు చెప్పవచ్చును. శాస్త్రములు తెలుఁగులోఁ జెప్పవచ్చును. ఇ ట్లింగ్లీషు వాఙ్మయమును జక్కఁగఁ బూర్తిగ నేర్చుకొనవచ్చును. శాస్త్రము లను సాధింపవచ్చును. ఇప్పు డితోభ్రష్ట స్తతోభ్రష్టః అన్నట్టు మనబాలకులకు నింగ్లీషుబాగుగవచ్చుటలేదు. శాస్త్రములు చక్కఁగఁ దెలియుటలేదు. ఇఁక ముందు నేనుజెప్పిన యేర్పాటు చేసినయెడల విద్యార్థు లన్నివిషయములందును బాండిత్యకలవారగుదురు. ఇప్పుడు పరభాషలో శాస్త్రముల నేర్చుకొనుటకుఁ బట్టుచున్న పరిశ్రమనే, యింగ్లీషువాఙ్మయమును వశపఱుచుకొనుటకు నుపయో గించితిమేని యింగ్లీషుగ్రంథకారులతోఁ దులతూగునట్టి యాంగ్లసాహితి మనకుఁ దప్పక యలవడఁగలదు.

ఇంగ్లీషువిద్యను గఱుపుబడులలోనే శాస్త్రములను దెలుఁగునందుఁ జె ప్పుమన్నపుడు ప్రాథమిక పాఠశాలల నన్నివిషయములును దెలుఁగునందే నేర్ప వలెనని వేఱుగఁ జెప్పవలెనా? ఇంగ్లీషురాకయే మనవారు బీజగణితమందలి వర్ణ సమీకరణము(quadraticEquation) అనేకవర్ణసమీకరణము (simultanious

(Equations) రేఖాగణితమందలివృత్త (circle)దీర్ఘవృత్త (Ellipse) సంబంధమై
న సిద్ధాంతములును, భౌతికశాస్త్రమందలి విద్యుత్ప్రవాహకములను గుఱించిన సి
ద్ధాంతములును, దేటతెలుఁగున నొకరితో నొకరు సంభాషించుసమయము తె
నుఁగు దేశమున కబ్బెనేని యది మనదేశాభ్యుదయమునకు నిశ్చయమైన చిహ్న
మని చెప్పవచ్చును. ఇదిమనలోఁ గొందఱకు విశేషముగా నింగ్లీషుభాషతప్ప జ్ఞా
నార్జనమునకు వేఱుసాధనముండునాయని తలంచువారికి నేనుగోరినకోర్కె
గొంతమ్మకోర్కెవలెఁ దోఁచినఁ దోఁపవచ్చును. కాని మహారాష్ట్రదేశమునకు వె
ళ్లి చూచినయెడల నిందేమియు వింతలేనట్లు స్పష్టపడఁగలదు. నేను పదార్థవి
జ్ఞానశాస్త్రమును మొదట మహారాష్ట్రమునందె చదివితిని. ఎప్. ఏ. పరీక్షకుఁ
జదువువిద్యార్థులకు బీజగణితమందలి కొన్ని లెక్కలను మరాటీబోధచేయునట్టి
యింగ్లీషురానట్టి నార్మల్ స్కూల్ మరాటీవిద్యార్థుల నేనెఱుఁగుదును. కొన్నిదిన
ములక్రిందట విజ్ఞానసర్వస్వము నిమిత్తమై యార్యగణితమును గుఱించి కొన్నిసంగ
తులు తెలిసికొనుటకుఁ జెన్నపట్టణమందలి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము
నకుఁబోవుటతటస్థించెను. అప్పుడు నేనచ్చటబీజగణితములోని $\frac{n(n+1)}{2}$, $\frac{n(a+e)}{2}$ అను
సూత్రములను గాగితముమీఁద వ్రాసికొని లెక్కలువేసికొనుచుండఁగా నొక్క
వైష్ణవుఁడు వచ్చి యదియేమని నన్నడిగి విషయము కొంచెము తెలిసికొని మొ
ట నేవానితో సమానములైన సూత్రములను సంస్కృతములోఁ జదివి నాకెంతే
యు విస్మయమును గలుగఁజేసెను! ఈవైష్ణవున కింగ్లీషురాదు-సంస్కృతము,
అరవము, కొంచెము తెలుఁగుమాత్రము వచ్చును. ఈబీజగణిత సూత్రము లాతఁ
డు వీథిబడిలో నేర్చుకొనెనఁట! కావున నెట్టి ఘనమైనశాస్త్రములైన నాంధ్ర
మున బోధచేయవచ్చును. ఆంధ్రమున వ్రాయవచ్చును.

## గ్రంథనిర్మాణము.

కావున మనము మొట్టమొదట చేయవలసినపని శాస్త్రీయగ్రంథముల ని
ర్మించుట. శ్రమపడి యిట్టిగ్రంథములను వ్రాసిన నేమిప్రయోజనము? ఎవరుచది
వెదరు? గ్రంథకర్త కేమిలాభము? అనికొందఱడుగవచ్చును. కానిమనమిట్లు నష్ట
జాతకముల గుణించుచు నెన్నిదినములుండవలెను? ఇట్లు నష్టజాతకముగుణించువా
రెవ రేమియన్నను దానిని ఖండించుటకు సిద్ధముగా నుందురు. పాఠశాలలలోఁ
దెలుఁగున శాస్త్రములు చెప్పెడుసమయమున మాకుఁ దెలుఁగులో శాస్త్రగ్రం

థము లేవియనియడ్డము చెప్పుదురు. శాస్త్రగ్రంథములు వ్రాయఁ డనఁగానె 'ఆగ్రంథముల నుపయోగించు, బళ్లేపోయి' యనివీరె మరలనడ్డమువచ్చెదరు. వీరిసిద్ధాంతమనుసరించినఁ బిచ్చికుదిరినఁగాని పెండ్లికాదు; పెండ్లియైనఁగాని పిచ్చికుదురదు. వీరివాదము వినుచుండినఁ బిచ్చియుఁ గుదురదు; పెండ్లియుఁ గాదు. కావునఁ బరస్పరాశ్రయదోషభూయిష్ఠమైన వీరివాదమును చూచిమనము భయపడవలదు.

ఇదియుఁగాక క్రొత్తగా నిర్మింపఁబడు గ్రంథములు వ్యర్థముగా మూల పడియుండునని గ్రంథకర్తలు తలఁపవలదు. దొరతనము వారివలనఁ బ్రోత్సాహము కలిగినయెడల విశేషమే. అట్లు ప్రోత్సాహము కలుగకపోయినను బాఠశాలలలోఁ బఠనీయముగా నియమింపకపోయినను యోగ్యతగల గ్రంథమును - అది నవలగానిండు, చరిత్రగ్రంథము కానిండు, కఠినమైనశాస్త్రము కానిండు - ఆంధ్రలోకము తప్పక యాదరించుననియే నాతాత్పర్యము. ఇటీవల నాంధ్రదేశమునందు భాషాభిమానముకలిగినది. పూర్వమైదుసంవత్సరములలో నొకగ్రంథము యొక్క 500 ప్రతు లమ్ముడుపోవుట దుర్లభముగా నుండెను. ఇప్పుడొక్కొక్క గ్రంథముయొక్క 2000, 3000ల ప్రతులు విక్రయమగుటయేగాక రెండుకూర్పులు, మూఁడుకూర్పు లచ్చగుట తటస్థించుచున్నది! ఏపాఠశాలయందును బఠనీయగ్రంథములుగా లేకపోయినను విజ్ఞానచంద్రికాగ్రంథమాలలో నిదివఱకుఁ బదునొకొండు శాస్త్రీయగ్రంథములు ప్రకటింపఁ బడినవనియు నందుఁ బెక్కులు రెండుసారు లచ్చొత్తింపఁబడినవనియు, నేగ్రంథమును 3000ల ప్రతులకంటెను దక్కువయమ్ముడు పోలేదనియు, రసాయనశాస్త్రమువంటి కఠినశాస్త్రమునుగూడ నింగ్లీషురానిస్వర్ణకారులు కొందఱుచదివి యుపయోగించుకొనుచున్నారనియు, నింగ్లీషురానివారు పెక్కండ్రు గవర్నమెంటు టెక్నికల్ పరీక్షలకై యీగ్రంథముల నుపయోగించుకొనుచున్నారనియు నందఱకు బాహాటముగాఁ దెలిసినవిషయమే. కావున గ్రంథము లమ్ముడు పోవన్న భీతి గ్రంథకర్తలు మానవలయును. ఒకానొకపుస్తకము మంచి దగునేని యది పఠనీయగ్రంథము కాకపోయినను, "ఆగ్రంథము నుపయోగింపవద్దు; మాకిష్టమైన యీగ్రంథము నే ఉపయోగింపుఁ" డని ఇన్స్పెక్టర్లు చెప్పుచున్నను నుపాధ్యాయులును, శిష్యులు నీమంచిపుస్తకమునే తెప్పించి చదివెదరు. ఇన్స్పెక్టరు

వచ్చినప్పుడు దాచినఁ దాచెదరేమోగాని యోగ్యమైన గ్రంథములఁ జదువుట మానరు.

ఒకవేళఁ గొన్ని గ్రంథములకు లోకాశ్రయము లేకపోయినను, నాంధ్రదేశమందలి రాజులు, మహారాజులు మొదలయినవారును, శ్రీమంతులును, విద్యాసంఘములు, నిట్టిగ్రంథకర్తలకు సాయముచేసి వివిధశాస్త్రములను గుఱించి గ్రంథములను వ్రాయింపవలెను. భాషయందుఁ బ్రబంధములు, నాటకములు, నవలలు, మొదలయిన లలితవాఙ్మయ మభివృద్ధిఁ జెందుట యొకయెత్తు; శాస్త్రజ్ఞానాభివృద్ధి కనుకూలములైన గ్రంథములు నిర్మాణమగుట యొకయెత్తు. ఇట్టి గ్రంథములు దేశదారిద్ర్య వినాశకములు.

ఇప్పుడు మనదేశమునందు దేశభాషాభివృద్ధికిఁ గొంతప్రయత్నము జరుగుచున్నను, లలితవాఙ్మయాభివృద్ధియందే యెక్కుడు శ్రద్ధ కానవచ్చుచున్నది. ప్రకృతిశాస్త్రనిర్మాణమునకు నొకటిరెండుసంఘములుతప్పనితరములు ప్రయత్నించుటలేదు. ఇది యెంతయు శోచనీయము. భాషాభివృద్ధికై మనవారు చేయు ప్రయత్నములలో సగము ప్రయత్నము శాస్త్రజ్ఞానాభివృద్ధికిని, సగము ప్రయత్నమితర లలితగ్రంథాభివృద్ధికిని వ్యయపడునట్లు చూచుచుండవలెను. ఒకానొక సంఘము పదిగ్రంథములను బ్రకటింపఁదలఁచెనేని వానిలో నైదు భౌతికాదిశాస్త్రప్రవర్తకములుగను, మిగిలిన యయిదు వేఱువిషయములను బ్రతిపాదించునవిగను నుండునట్లు చూడవలయును. ఒకానొక జమీందారుగారు గ్రంథకర్తలకు బహుమతు లీయఁదలఁచిన నందు సగముధనము శాస్త్రములకును, సగముధనమితరవిషయములకును బంచియీవలయును. శాస్త్రగ్రంథములు వందలకొలఁది వెలువడిన తరువాత నీ నియమమును బాటించినను బాటింపవచ్చును. కాని యింతవఱకు నీ నియమమును మనవారు శ్రద్ధతోఁ బాటించినఁగాని యీదేశము యొక్క యార్థికావస్థ యభివృద్ధిఁ జెందనేరదు. ఇప్పుడిప్పుడు కొన్ని ప్రకృతిశాస్త్ర గ్రంథములు వెలువడినవి. కాని వెలువడినవి స్వల్పము. వెలువడవలసినవి యసంఖ్యములు. వేలకొలఁది గ్రంథములు పుట్టవలసినచోటఁ బదియిరువది పుట్టిన నేమూలకువచ్చును? బంగాళీభాషయందును మరాటీభాషయందును వ్రాయఁబడిన భౌతికశాస్త్రగ్రంథములను జూచిన నెట్టివానికైనను విభ్రమము కలుగక మానదు.

కె. వి. లక్ష్మణరావు

## పారిభాషికపదములు.

దేశభాషలలో శాస్త్రీయగ్రంథములు వ్రాయుటకు శాస్త్రీయపదముల యభావ మొకప్రబలకారణమని కొందఱు చెప్పుచున్నారు. కాని శాస్త్రీయపద ములకై యెవ్వరు నాగనక్కరలేదు. ఇదివఱకుఁ గొందఱిచే నేర్పాటు చేయఁ బడిన పదములుండెనేని వానినే స్వీకరించి గ్రంథము వ్రాయవచ్చును. 'ఇదివఱ కున్న పదములు బాగుగలేవు' అని మూతి విఱుచువారు పెక్కురుగలరు. అట్టి వారికీ క్రిందివిధమున "The Twentieth centnry English Maratta Dicticnary (Literary, Scientific and Technical) అనుమహాకోశము యొక్క కర్త యిట్లు ప్రత్యుత్తరమిచ్చి యున్నాఁడు. "It may be that a word newly coined by two or three experts may be found fault with as inaccurate by a fourth one. This fourth expert will offer his own coinage as an improvement forgething all along that there will be others who will find similar fault with his own creation ......what happens at present is that every new writer arbitrarily mints his own technical terms not taking pains to see what his predecessors in the same department have done. It is easy to say for one that a certain word is not an accurate rendering of its corresponding English word but if this very objector is requseted to make his own suggestion and from every point of view a faultless one, he often finds himself unable to do it and then atonce gives in his adhession to the old proposal." ఇట్లు వీరిపదములు వారికిఁ బనికి రావు వారిపదములు వీరికిఁ బనికిరావు. వీరికందఱకుఁ బనికివచ్చుపదము లేర్పడు వఱకు గ్రంథములు వ్రాయకుండఁ గూర్చుండినయెడలఁ గాలాంత మువఱకు నిట్లే యుండవలెను! కావున బుద్ధిమంతులు చేయవలసినపని యేమనఁగా నిట్టిగ్రంథములు వ్రాయునపు డదివఱకు గ్రంథముల వ్రాసి నవారిచే నుపయోగింపఁబడిన పదములనే వీలయినంతవఱకు వాడవలెను. అట్టి పూర్వగ్రంథములు లేకపోయినపుడును, నితరుల పదముల నుపయోగించుటకు నిష్టము లేనప్పుడును స్వయముగాఁ బదముల నిర్మింపవచ్చును. అదియు నిదియుఁ జేతకానప్పు డింగ్లీషు పారిభాషికపదములనే తీసికొని గ్రంథము వ్రాయ వచ్చును. కాని పదములులేవని శాస్త్రగ్రంథములు నిర్మించుట మానవలదు. శాస్త్రములు మొదటఁబుట్టును. పారిభాషిక పదములు పిదప స్థిరపడును. ఇదియే

యితరదేశమందలి శాస్త్రవాఙ్మయాభివృద్ధియొక్క మర్యాద. పాశ్చాత్యదేశ
మందు జంతుశాస్త్రము, మిక్కిలి యభివృద్ధినొంది యందలి పారిభాషిక పద
ములు పండిత పరిషత్తులచే నిర్ణయింపఁ బడుచున్నవని మీరందఱు నెఱింగిన
విషయమే. అట్టి శాస్త్రముయొక్క పారిభాషికపదములు నప్పుడప్పుడు మాఱు
చునేయున్నవి. 1766 లినాయిస్ అనుశాస్త్రజ్ఞుఁడు జంతువుల వర్గీకరణ మేర్ప
ఱచి యొకపరిభాష యేర్పఱిచెను. 1829 లో క్యువియర్ అనువాఁడు దానిని
గొంతవఱకుమార్చి క్రొత్తపరిభాష నిర్మించెను. 1835 లో జీవర్ అను శాస్త్ర
జ్ఞుఁడు మరల నీవర్గీకరణమును దిద్దెను. 1848లో ఆర్. ల్యూకార్టు అనువా
డును, 1855లో హెర్రి. ఎడ్వర్డ్స్ అనువాఁడును, 1859లో అగార్జి అను
వాఁడును, 1866లో హెకల్ అనుశాస్త్రజ్ఞుఁడును 1910లో ల్యాంకిష్టరు అను
వాఁడును మఱికొందఱును జంతుశాస్త్రములందలి వర్గీకరణ పరిభాష లిష్టము
వచ్చినట్లు మార్చిరి. తుదకు ఎన్సైక్లోపీడియా బ్రిటానికాయొక్క 11వ కూర్పు
నందు జంతుశాస్త్రమనుముఖ్యవ్యాసము వ్రాసిన లేఖకునకు నాశాస్త్రసంబ
ధమైన యితరవ్యాసములు వ్రాసిన లేఖకులకును వర్గీకరణమును గుఱించియుఁ
బారిభాషికపదములను గుఱించియుఁ బెక్కభిప్రాయభేదములు కలవు!
కావున నేఁడే యందఱకు సమ్మతములైన శాస్త్రీయపదములు గూడినఁగాని
గ్రంథములు వ్రాయమనుటగాని, వ్రాయవద్దనుటగాని వెఱ్ఱితనము.
కావున శాస్త్రమునందును భాషయందును నభిమానముగలవారు నిర్భయముగఁ
దమచేతనైనంతవఱకు శాస్త్రీయగ్రంథముల నిర్మించి యితర గ్రంథకర్తలకును
నూతనముగాఁ బుట్టుచున్న పుట్టనున్న భాషావిషయక పరిషత్తులకు మార్గ
దర్శకులగుదురుగాక!' యని నమ్ముచున్నాను.

పారిభాషికపదములనుగుఱించి యింకొక చిన్నసంగతి చెప్పవలసి
యున్నది. హిందూదేశమునందుఁ బ్రస్తుతము శాస్త్రీయపదములను సృజించు
టకునై మహాప్రయత్నములు చేయుచున్నవారు, కాశీలోని నాగరీ ప్రచారిణీ
సభవారు; రెండవవారు ట్వొంటియత్ సెంచురీ డిక్షనరీ సంపాదకులును. మొద
టిదానిలో ప్రొఫెసరు రే, ప్రొఫెసరు బోస్, ప్రి. సీల్ వంటి ఆంగ్ల సంస్కృత
భాషలయందును, పాశ్చాత్య శాస్త్రములయందును, మహామహోపాధ్యా
యు లనిపించుకొనువారు కలరు. ట్వొంటియత్ సెంచురీ డిక్షనరీలో ప్రొ. గజ్జర్.

డాక్టర్ సర్ బాలచంద్రవంటివారును గలరు. కావున మనభాషలో నూతనముగా శాస్త్రివాఙ్మయమును బుట్టింప నెంచినవారు తప్పక యీరెండుగ్రంథములను జూడనగును.

ఇంక నొకపూర్వపక్షమున్నది. కొందఱు నూతనపదములను మనము సృష్టింప నక్కరలేనేలేదు; ఇంగ్లీషుపదములనే గ్రహించుట మంచిదని వాదించెదరు. కాని దీనికి నేను వేఱుగ జవాబు చెప్పనక్కఱలేదు. జర్మనీవారే చెప్పఁగలరు. యూరోప్‌ఖండమునం దిప్పుడు నిర్మింపఁబడుచున్న శాస్త్రీయ పదములు గ్రీకు ల్యాటిన్‌భాషా భూయిష్ఠమై మూరెడుమూరెడు పొడవుగనుండునని శాస్త్రజ్ఞు లెఱుఁగుదురు. గ్రీకు ల్యాటినుభాషలు దేవభాషలుగాఁ గల జర్మనీవారికి వీని నంగీకరించుటకు నభ్యంతర ముండఁగూడదుకదా? కాని వారీదీర్ఘపదములకుఁ దమభాషలో మాఱుపదములను గల్పించుకొని విద్యార్థుల నిమిత్తమై వ్రాయఁబడు పొత్తములలో వానినే వాడుచున్నారు! జర్మనీ దేశజులే యిట్లుచేయఁ, బూర్తిగ భిన్నభాషాసాంప్రదాయముగలమన మాకర్కశపదంబులనే సంస్కారమైనఁ జేయక తీసికొనవలెననుట వింతగను, విపరీతంబుగను, గన్పట్టుటలేదా? కావున మనము వీలయినంతవఱకు దేశ్యపదములను, వాడుకలోనున్న సంస్కృతపదములను వాడవలయును. అట్టిపదములు లేనప్పుడు సంస్కృత వాఙ్మయమునుండి సమానార్థకముల నిచ్చుపదములనుపయోగించుకొనవలెను. అట్టిపదములును దొరకనప్పు డింగ్లీషు పదములఁ దీసికొనుట యపవాదము (Exception) గాను స్వభాషాపదముల నుపయోగించుట సామాన్య నియమము (General Rule) గను నెంచవలయును. అనఁగా విధిలేనప్పుడు మాత్ర మన్యభాషాపదములఁ దీసికొనవలయును.

విద్వాంసులారా? భాషాభిమానులారా? మీరిఁకనైన నౌదాసీన్యము మాని మహోత్సాహముతో శాస్త్రీయ గ్రంథరచనకుఁ బూనుకొనిమెదరని వేడుచున్నాను.

కె. వి. లక్ష్మణరావు.

# హిందువుల ప్రాచీనలోహ పరిశ్రమము.

## (Metallurgy in Ancient India)

పూర్వకాలపు హిందువులు తత్త్వవిచారమున మునిఁగి దేశాభివృద్ధి నైహికైశ్వర్యమునకును దోడ్పడు శాస్త్రముల నుపేక్షించి రనుకొనుట గొప్ప పొరపాటు. ఆధ్యాత్మిక శాస్త్రములలో మనపూర్వు లెంతప్రవీణులో భౌతిక శాస్త్రములయందు నయిత మొకప్పు డంతప్రవీణులైయుండిరి. వేదాంత శాస్త్రమున మనవా రసమానప్రతీతిఁ గాంచిరనినచో రమారమి 1500 సంవత్సరములకుఁ బూర్వమే నాగరక ప్రపంచమున కంతయుఁ గలాకౌశల్యములం దద్వితీయులని పేరువడసియుండిరి.

అనాదినుండి మనదేశమున బట్టలకు రంగులు వేయుటయు, నీలిచెట్లనుండి నీలిమందుఁ దీయుటయు, నినుమును దగుపక్వమునకుఁదెచ్చి యుక్కుగామార్చి వివిధరీతి నుపయోగకరములగు పనిముట్లు సేయుటయు వాడుకలో నుండెడివి. ఇప్పటికిని దేశీయపద్ధతుల ననుసరించి మూలికలతో వేసినరంగులు (Vegetable Dyes) సాధారణముగ వెలిసిపోక 'పక్కా-రంగుల' నిపించుకొను చున్నవి. ప్రస్తుతము మనదేశమునఁ జాలవఱకు నుపయోగించుచున్న జర్మనీ రంగులు వెలసులభమని తప్పఁ, గాంతియందును, వస్త్రములకుఁ బట్టుకొనుటయందును మనమూలికలతో సరిరావు. ఎఱుపునకును, గులాబికిని, మంజిష్ఠయు (మదారుచక్క)దొగరుచెక్కయుఁ బెట్టినపేరు. బట్టలద్దకమునందుఁబాశ్చాత్త్యుల పద్ధతులకంటె దేశీయులవే కొన్నివిషయముల మేలుగాఁ దోఁపకమానవు. వారిపద్ధతులవలన బట్టయద్దకమునందే జిగిచెడి శీఘ్రకాలములోనే చినుఁగనారంభించును. దేశీయపద్ధతులప్రకారము రంగులు వేయునప్పుడు బట్టయొక్క సత్తువ యొకింత మాత్రము తగ్గిపోదు.

పైనిఁ జెప్పఁబడిన మూఁడు విధములగు పరిశ్రమ లేకాక రాసాయనిక శాస్త్రజ్ఞానాభివృద్ధిని సూచించు మఱికొన్ని పరిశ్రమలుకూడ మనపూర్వులు చేయుచుండెడివారు. ఆఱవశతాబ్ద్యారంభమున వరాహమిహిరుఁడు తనబృహత్సం

హితలో దేవాలయములుగట్టుటకై "వజ్రలేపముల" (సిమెంట్లు) జేయుపద్ధతి చెప్పియున్నాఁడు. (ప్రాసాదహర్మ్యవలభీలింగప్రతిమాసు కుడ్యకూపేషు సంతప్తో దానవ్యో వర్షసహస్రాయుతస్థాయి— బృహత్సంహిత). ఈవజ్రలేపములతోఁ గట్టిన ఊర్ధ్వవిహారము లింకను గొన్ని శిథిలములుగాకుండ పూర్వము వలెనేయున్నవి. యంత్రశాస్త్ర ప్రవీణులనియు (యంత్రవిదః, యంత్రజ్ఞాః) బట్టలద్దకమునం దారి తేరినవారనియు (రాగగంధయుక్తివిదః) వరాహమిహిరుఁడు వేఱొకచో వర్ణించియున్నాఁడు. ఇంతియకాక వకుళ, ఉత్పల, చంపకమున్నగు పుష్పములనుండి యత్తరులు చేయువిధము మఱియొకచోటఁ జెప్పియున్నాఁడు. ఆఱవ శతాబ్దమున వ్రాసిన వాసవదత్త, దశకుమారచరిత్రలలో రాసాయనిక యోగములవలననే (Mical operatioans) తయారుచేయఁదగిన పదార్థములు కొన్ని పేర్కొనఁబడియున్నవి. (1) స్తంభీకరింపఁబడిన, అనగా, రాతివలెగట్టిగాఁ జేకొనిన పాదరసము (పారదపిండ ఇవకాలధాతువాదినః—వాసవదత్త) (2) నిద్రవచ్చుట కొకచూర్ణము (యోగచూర్ణ— దశకుమారచరిత్ర (3) శరీరావయవములను బనిచేయకుండ స్తంభించుట కొకచూర్ణము (స్తంభనచూర్ణమివ ఇంద్రియాణామ్—వాసవదత్త) ఈవివిధపరిశ్రమలఁ బట్టిచూడఁగాఁ జాలకాలమునకుఁ బూర్వము హిందువులు మిక్కుటమగు ప్రకృతిశాస్త్ర జ్ఞానమును సంపాదించి కలాకౌశల్యములయందుఁ బ్రవీణులైరని మనము చెప్పవచ్చును. ఇట్టి పరిశ్రమలలో నెల్ల హిందూదేశమునకు శాశ్వతకీర్తి సంపాదించిన లోహపరిశ్రమయొక్క వృత్తాంతమునుగూర్చిమాత్ర మిందు సంగ్రహించి వ్రాసెదను.

మొట్టమొదట, అనగా, చరకసంహితకుఁ బూర్వము "లోహము" అను పదము ప్రతిధాతువునకు నుపయోగించు చుండెడివారు. "పంచలోహముల"ని మనమిప్పటికిని వాడుచున్నాము. తరువాత నినుమునకు మాత్రమే లోహమనుపేరు వర్తింపసాగెను. నేటికి నినుమునకే యీపేరు చెల్లుచున్నది. వేదములలో సాధారణముగ వాడుకలోనున్న ధాతువులు కొన్ని పేర్కొనఁబడియున్నవి. వెండిబంగారము లాభరణములకు, నినుము కవచములకును నుపయోగించినట్లు కనఁబడుచున్నది. బంగారమునకు 'హరితమ'నియు (పసుపు వర్ణము) వెండికి 'శ్వేతమనియు', ఇనుమునకు కృష్ణాయసమనియు, రాగికి లోహి

కాయసనియు మారుపేరులున్నట్లు వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు. ఈనాలుగు ధాతువులేకాక సీసము, వంగము (తగరము) మనపూర్వులకుఁ దెలిసియుండి నట్లు శుక్లయజుర్వేద భాగమగు 'చమకము'లోని యీవాక్యమువలనఁ దేటపడఁగలదు. (హిరణ్యంచమే, అయశ్చమే, లోహంచమే, సీసంచమే, త్రపుచ యజ్ఞేనకల్పన్తామ్). ఛాందోగ్యోపనిషత్తులో ధాతువులను టంకముతో నతుకుట వర్ణించియున్నట్లు పాశ్చాత్యులు వ్రాసియున్నారు. కాని మనపూర్వులు లోహశాస్త్రజ్ఞానము నెంతవఱకభివృద్ధిఁ గావించిరో నిశ్చయముగ నిర్ణయించుటకుఁ దగినసాధనములు ప్రస్తుతము లేవు.

మొగస్తసీసను గ్రీకుచరిత్రకారుఁడు హిందువులు లోహశాస్త్రమునందును గలాకౌశల్యములందును బ్రజ్ఞావిశేషము గలవారని క్రీస్తుశకమునకుఁ బూర్వమే వ్రాసియున్నాఁడు. అటుతరువాత ఆయుర్వేదకాలమున వెలువడిన చరక సుశ్రుతాదులలో నౌషధములకై ధాతు సమ్మేళనము లనేకములను రాసాయనిక సంప్రదాయములఁబట్టి చేయుచువచ్చిరి. పతంజలి తనలోహశాస్త్రములో ధాతూత్పత్తియోగములను (assaying and extraction of metals) విపులముగ, వర్ణించినట్లు నిదర్శనములు గానవచ్చుచున్నవి. ఈగ్రంథము మనకుఁ దక్కకపోయినను బ్రాచీనభిషగ్వరులును, రసేశ్వరులును బతంజలినిఁ బ్రమాణముగఁ గైకొనుటనుబట్టి యాతని లోహశాస్త్రము రసవాదమున నుద్గ్రంథమై యుండవలెనని చెప్పవచ్చును. పిమ్మట బౌద్ధమతాచార్యశిఖామణియగు నాగార్జునుఁడు రసాయనశాస్త్రాభివృద్ధికిఁ గారకుఁడయ్యెను. రసవాదమునను నాగార్జునుఁడు మూలపురుషుఁడనికూడఁ బ్రతీతిగలదు. ఇతఁడు రసక్రియలకుఁ బెట్టినపేరు. పారదమును గుఱించి మిక్కిలి పరిశ్రమచేసి రసయోగముల ననేకములఁ గల్పించి జ్ఞానాభివృద్ధిఁ గావించెను. ఆఱవశతాబ్దమున హిందువుల ధాతుశాస్త్రజ్ఞానమును సూచించు నిదర్శనముల నిదివఱకే చూపియుంటిని. క్రీ॥ శ॥ 950 సంవత్సర ప్రాంతమున వ్రాసిన 'బ్రీంద' యనువైద్యగ్రంథములోఁ బారదమునుండి రసామృతచూర్ణమును (రససిందూరము), తామ్రమునుండి పర్పటి తామ్రమును జేయుపద్ధతులు సవిస్తరముగ వర్ణింపఁబడియున్నవి. పదుమూఁడవ శతాబ్దాంతమున వెలువడిన రసరత్నసముచ్చయమను వైద్యగ్రంథమును జూచిన యెడల నప్పటి ధాతుశాస్త్రజ్ఞానముయొక్క స్థితి తేటపడఁగలదు. హిందువుల రసాయనశాస్త్రజ్ఞాన

మును జక్కఁగఁ దెలియఁజేయు పుస్తకము వేఱొకటిలేదు. ఈపుస్తకమునం దనేకరాసాయనిక యోగములును వానికిఁగావలసిన యంత్రసామగ్రియుఁ జక్కఁగ వర్ణింపఁబడియున్నవి. ఇంగిలీకమునుండి రసమువండుట, మాక్షికమునుండి తామ్రముఁదీయుట, ఖర్పరము (calamine zinc carbonate) నుండి యశదమును (తుత్తనాగము) జేయుట మున్నగుధాతుక్రియావిధానము లీరసరత్నముచ్చయములోఁ జూడనగును. ఈధాతుక్రియలు చేయుటకుఁగావలసిన వివిధయంత్రములు వానినిఁ జేయుమార్గములు, నుపయోగించుపద్ధతులు, విపులముగఁ జెప్పఁబడియున్నవి. ఈ పుస్తకమునుగుఱించి సవిస్తరముగ నింకొకతూరి వ్రాయనుద్దేశముగలదు. కావున నీవిషయమున నింతట విరమించి లోహక్రియలలో హిందువులకుఁ గల ప్రజ్ఞావిశేషమునుగూర్చి యించుక తెలిపెదను.

పూర్వకాలమునఁ గుమ్మరివాఁడు కుండల నెంతలాఘవముగఁ జేసెడివాఁడో కమ్మరి యినుపపనిముట్ల నంతచాకచక్యముతోఁ జేసెడివాఁడని నిదర్శనము లగుపడుచున్నవి. పూర్వకాలమున మనదేశీయులు లోహపరిశ్రమయం దద్భుతశక్తి సంపాదించినను నీ పరిశ్రమ విషయమై వారువ్రాసిన పుస్తకము లేవియు మనకు లభింపకయున్నవి. కాని లోహపరిశ్రమయందు హిందువులు చిరకాలము క్రిందటనే ఖ్యాతిఁ గాంచిరని పాశ్చాత్యుల శోధనలవలన నేర్పడుచున్నది.

1837, 1839 సంవత్సరములలో లండను పట్టణములోనున్న రాయల్ ఏషియాటిక్ సొసైటీ (Royal Asiatic Society of London) సభ్యులయెదుట జెయమ్, హీత్ అనునతఁడు హిందువుల ప్రాచీన లోహపరిశ్రమను గూర్చి రెండువ్యాసములఁ జదివెను. ఆవ్యాసములలో సింహళమునుండి తనకులభించిన ప్రాఁతపనిముట్లు (ఇనుపవి) వర్ణించుచు హిందువులనుగూర్చి యిట్లువ్రాసియున్నాఁడు. ఈజిప్టుదేశీయులు రాతిపనిముట్లతోఁ గాలక్షేపము సేయుచు ననాగరకులై యున్నకాలమున హిందువులు తమకుఁ గావలసిన పరికరములన్నియు నినుముతోఁ జేసికొనఁగల శక్తిమంతులై యుండిరి. లోహపరిశ్రమాభివృద్ధివలన నాగరకత హెచ్చినది. లోహమునుండియుక్కు (steel) తయారుచేయువిధము హిందువులకుఁదప్ప ప్రాచీనులలో మఱియెవరికినిఁ దెలియదనుటకు నిస్సందేహము. ఈ శాస్త్రమున హిందువులు నవనాగరకులకు మార్గదర్శకులని నిస్సంశయముగఁ

జెప్పవచ్చును. ఈలోహపుఁ బనిముట్లు 1500. మొదలు 2000 సంవత్సరముల నాఁటివి. సింహళవాస్తవ్యు లీపరిశ్రమను హిందువులవలన నేర్చిరనుట నిశ్చయము.

పూర్వము డమాస్కసుపట్టణమునఁ జేసినకత్తులు కఠారులు మిక్కిలి ప్రసిద్ధిచెందియుండెను. 1500 సంవత్సరములపాటు డమాస్కసు కత్తులు యూరోపు, ఏషియాఖండములలో మిక్కిలిగ నమ్ముడువోవుచుండెను. కాని యీ పనిముట్లు చేయుట హిందువులనుండి యరబ్బులును, వారినుండి పారసీకులును నేర్చికొనినట్లు నిదర్శనములుగలవు. పశ్చిమహిందూస్థానములోను, కాఠ్యవాడలోని కచ్చిదేశమునను జేయుచుండిన పనిముట్లు ప్రస్తుతము పశ్చిమఖండములోనే గ్లాస్గో షెఫీల్డుమున్నగుపట్టణములలోఁ జేయుచున్న ప్రశస్తమగు నినుపసామానులతో సరితూఁగఁగలవని చరిత్రకారులు వ్రాసియున్నారు. పౌరవుల రాజగు పురుషోత్తముఁడు గ్రీకుప్రభువగు నలెగ్జాండరునకు ముప్పదిపౌనులలోహపు ముద్ద నజరానగా నిచ్చెననియు, నాకాలమున నది గొప్పగౌరవనీయమగు బహుమతిగఁ బరిగణింపఁబడుననియుఁ బ్రతీతిగలదు. ఈచరిత్రాంశము లిట్లుండ హిందువుల లోహపరిశ్రమచాతుర్యమును జాటు ప్రత్యక్ష నిదర్శనము లనేకములు ప్రస్తుతము మనదేశముననే యున్నవి.

హస్తినాపుర (ఢిల్లీ) సమీపమున కుతుబుమినోరా యను జయస్తంభము దగ్గరనున్న యినుప స్తంభము 23 అడుగుల 8 అంగుళముల పొడవుగలిగి 10 టన్నులబరువుగలది. ఉత్తరహిందుస్థానములోని ధార్ నగరమున 42 అడుగుల నిడివి గల మఱియొక స్తంభముగలదు. జగన్నాథదేవాలయమునకు వేసిన తనాబీలును, నూర్వారలో నిప్పటికినిఁజూడనగు 24 అడుగుల పొడవుగల పెద్దఫిరంగియుఁ బ్రశస్తమైన యినుముతోఁ జేయఁబడినవి. వీనిలోఁగొన్ని 1600 సంవత్సరములనుండి యెండకెండి వానకుఁ దడిసినప్పటికినిఁ ద్రుప్పుపట్టక చెక్కు చెదరక యథాప్రకారముగనున్నవి. ఇవియన్నియు స్థాణువులగు నిర్జీవ పదార్థములయ్యును హిందువుల ప్రాచీనలోహ పరిశ్రమ సామర్థ్యమును వేనోళ్ల ఘోషించుచున్నవి. పాశ్చాత్యులలో ననేకశాస్త్రజ్ఞులు వీనినిఁ బరీక్షించి, తుప్పుదినకుండుట కచ్చెరువంది వానినిఁ బోతవోసిన కమ్మరులను మిక్కిలి శ్లాఘించుచు వ్రాసిరి. ఒకానొకపాశ్చాత్యుఁడు లండను టైమ్సుపత్రికకు వ్రాయుచు "ఇనుప దోషిలిసామానులును, హిందువుల దేవాలయములలోని దూలములకుఁ

రాగిరేకులును, మూలతీపులనున్న పల్లెటూళ్లలో గూఢముగఁ జేసెడివార” నియుఁ బ్రస్తుత మీపరిశ్రమ యడుగంటినందున హిందువులు యూరోపుఖండము నుండి తమకుఁగావలసిన యినుపసామానులు దిగుమతిచేయుచున్నారనియు విచారపడెను. గూఢముగానుంచుటయే మనశాస్త్రము లడుగంటుటకు ముఖ్య కారణమని చెప్పవచ్చును. మితిమీఱిన యభివృద్ధిఁగాంచినయున్నత పరిశ్రమ లిట్లు రూపుమాసి నశించుట మిక్కిలి విషాదకరములగు చరిత్రాంశములలో నొకటి. హిందూదేశచరిత్రలో నీపట్టుఁజదువునప్పుడు ప్రతిభారతీయునకు హృదయము కరఁగకమానదు. కాని నిన్న నేఁడు మనపరిశ్రమలు పునర్జీవనమునందు శుభసూచనలు పొడకట్టుచున్నవి. ఇటీవల లోహపరిశ్రమకుఁగాను గర్మాగారముల నక్కడక్కడ మనదేశములో స్థాపించుచున్నారు. కలకత్తానగరమున రత్నతాతాయను సుప్రసిద్ధుఁడగు పార్సీవర్తకుఁ డొకగొప్పకర్మాలయమును మూఁడుసంవత్సరములక్రిందట స్థాపించెను. ధనవంతులగు దేశాభిమానులీపార్సీవర్తకునివలెఁ జొరవచేసి, కర్మాలయముల స్థాపించి లోహపరిశ్రమను బ్రాచీనోన్నతస్థితికిఁ దెచ్చినఁగాని హిందువులు నాగరకజాతులలోఁ దలయెత్తికొనుట కర్హులుగారు.

వే. వి. శర్మ.

---

శ్రీః

# ఆంధ్రభాషావిలాసము.

నాంది

మ. కవిమూర్ధన్యులు వాక్సుధారసము చిల్కన్, రాణ్మహేంద్రావనీ
ధవు కారుణ్యవసంత మావహిల, హృద్యం బౌ మృదూక్తిప్రవా
ళవితానంబును బద్యపుష్పములుఁ గ్రాలన్, గావ్యరాజీసుమా
సవ మాంధ్రాళికిఁ గూర్చుచుండు నిజభాషాకల్ప మొప్పార్చు సదా.

(నాంద్యంతమున సుకవి సకౌతుకముగ) చాలు; చాలు. నాసంతసము
నకు మితియే లేదు. ఆంధ్రభాషాభిమానులు సదస్యులు; ఆంధ్రభాషావిలాస
ప్రదర్శనమున కుద్యమము. ఇఁక మాప్రయత్నము జయప్రదమే యగు నని
నాకు నమ్మిక పుట్టుచున్నది. ఈ నావిధానమునకు మాశబ్దశాసనుఁ డొ
క్కఁడు తోడయ్యె నేని స్వర్ణమునకు సౌరభంబు సంఘటించిన ట్లగును. శబ్దశా
సనుఁ డెప్పుడు నన్ననుసరించియే యుండును. శబ్దశాసనా!

శబ్దశాసనుఁడు.—ఇదే వచ్చుచున్నాను (అనుచుఁ బ్రవేశించుచు.) ఏమి సెలవు?

సుకవి.—నేఁటి నిన యాంధ్రభాషానాటక ప్రయోగమున నీసాయమున కవ
సరము వచ్చినది.

శబ్ద.—మీరు చిన్ననాటనుండియు శ్రమపడి నన్ను సంపాదించుకొంటిరి. మీవం
టివారి సమాశ్రయభాగ్యమున నేను నుచితస్థానముల సముచితరీతి నుప
యోగింపఁబడి వాసిగాంచుచున్నాను. అర్థగౌరవము సర్వలోకహితము
నట్టిది తమబోఁటివారి దగ్గర తంగెటిజున్ను. భాషాపూర్వోన్నత గౌర
వంబుఁ జక్కఁగ నెఱింగిన మహామహులు. తాము చేబట్టిన భాష య
థాపూర్వస్థితికి రాఁగలదు. మావంటివారికిని బుట్టుగతులు పుణ్యగతులు
గలుగును.

సుకవి.—ఓయీ! కాలము ననుసరించి మానవ ప్రవృత్తులు మాఱుచుండు ట
లుంగవా? అట్లే భాషకును మార్పులు గలుగుచుండును. కాని లో

టిమర్యాదల నతిక్రమించుట స్వభావ విరుద్ధము. అట్లు జరుగదు. భాషా పక్షపాతు లప్పుడే భాషాసముద్ధరణ పరాయణత్వమున బద్ధకంకణులైరి. (యవనికాంతరమున.)

ఉ. పేరును బెంపుఁ గల్గి ప్రభవించుట నెంచఁగ స్వప్నవార్త; న
న్నారక పెంచువారన నభఃకుసుమంబగు; నాకు సౌఖ్య మే
తీరునఁ గల్గు? నెవ్వరు గతిం గలిగింతురొ యీశ్వరా! యఁటం
చారటమంది భాగ్యవతి నైతిని రాజమహేంద్రసంగతిన్.

శబ్ద.—అయ్యో! సుకవీ! వింటిరా, యీ యాక్రందనము. (అనిచూపుచు) ఎవ
రా పైపునఁ గూర్చుండి వాపోవుచున్నది?

సుకవి.—అయ్యో పాపము. (ఆదెసకుఁజూచుచు)

ఉ. శీలముపెంపునం బుధవశీకృతకల్పకసాలమై, క్షమా
పాలహృదబ్జసంస్థితవిభాసితరమ్యరమాలలామ యై
క్రాలి సమస్తసంపదలఁ, గాలవశంబునఁ జిక్కి యాంధ్రభా
షాలలితాంగి వందురు విషాదభరాకులచిత్తయై సఖా.

సత్వరమ్ము రమ్ము. వెళ్లి యోదార్చుదము.

(అని నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

## ప్రథమస్థలము.

(ప్రవేశము: ఆంధ్రభాషాయోష, సవిషాదముగ.)

'ఉ. పేరును బెంపుఁ గల్గి ప్రభవించుట నెంచఁగ స్వప్నవార్త' * *
* * * (అనుపూర్వోక్తపద్యమునుబఠించి)

నన్నుఁ దలఁచుకొనిన నాలో నాకే నవ్వువచ్చుచున్నది. నాపలుకుల ధ్వని గ్రహించిన రసికు లుప్పొంగుచుందురు. నాయలంకారములకు మెచ్చు చుందురు. పూర్వము నాపలుకులు మూఢజనమనోమహీధరంబులకు వజ్ర పుఁ బలుకులు.

మ. సదలంకారవినూత్నవస్తువిలసచ్ఛబ్దార్థవృత్తాంతముల్
పదవిన్యాసమునన్ రచించి, రసికవ్రాతంబులం దన్పి, నె
మ్మది శయ్యాసుఖమిచ్చి, భావము గ్రహింపంజేసి యాశ్లేషభా
గ్యదమం జెన్నుఁ జడంచెతిం దొలుత నీయాంధ్రప్రపంచంబునన్,

ఇప్పుడు నను గన్నులం జూచి యాదరించువారెవరు? నాతోంటి మహ దశ గణింపరుగదా ఇప్పటి నవనాగరకులు ?

ఉ. ఇమ్మలరార నన్నయకవీంద్ర మహాశ్రయమంది నీతివృ
త్తమ్మున మించి, తిక్కకవితల్లజపోషణమంది ధర్మమా
ర్గమ్ము గడించి, యెఱ్ఱన కరగ్రహణమ్మున భారతప్రపం
చమ్మున వాసిఁ గాంచితిని సారసుధీవిభవాంధ్రపూజ్యనై.

అదిమొదలు నానాటికిఁ బ్రవృద్ధినొందితిని.

సీ. ప్రీతి నెక్కొన గారవించుచు శ్రీనాథుఁ
డతులశృంగారరసాబ్ధిఁ దేల్చె;
పేర్మిఁ జెంతకుఁ జేర్చి పెద్దనకవిధాత
కల్పనాచాతురీగరిమఁ బెంచె;
కృష్ణదేవుండు నన్ గేలూని ముద్దాడి
విమలత విష్ణుచిత్తమునఁ జొనిపె;
రామకృష్ణుఁడు పాండురంగమాహాత్మ్యసం
పదఁ దులఁదూగించి పొదలఁజేసె;

గీ. శారదామూర్తిసాదరస్వాంతమలరఁ
గూరిమిం గూర్చె నాకలంకారవితతి;
రాగబంధురుఁడై రామరాజభూష
ణకవియాశ్లేష సౌఖ్యసంఘటన సలిపె.

నాపూర్వోన్నతవైభవము లొక్కొకటి జ్ఞప్తికి వచ్చి నాకు మఱింత సం తాపవర్ధనము చేయుచున్నవి.

మ. తలఁపం గష్టములొంది సౌఖ్యముల నొందన్వచ్చు, సౌఖ్యంబు లా
వలఁ గష్టంబులు రా భరింపఁదరమా? పర్వ న్విచారించు దా
తలతో నేఁగిరె సత్కవీశ్వరులు? నాంధ్రవ్యాప్తి మన్నించు రా
జులు లేరే కలికాననైన నిపు డెచ్చోఁ గాంచిరన్ సిగ్గగున్.

సుకవు లున్నమాత్రమున నాదరించువా రుండవలదా? పూర్వము రా జాధిరాజు లెట్లు సమ్మానించుచుండిరి! లుబ్ధత్వమున నాదరింప నిష్టములేని మహ

నాదాత లిప్పుడు కవిశ్రేష్ఠులే లేరనుచుండుటయు వినుచున్నాను. వారుచేయు ననాదరము ప్రత్యక్షానుభవవేద్యము.

చ. వనములలోన నోషధులు వార్ధిధులందు విచిత్రరత్నముల్
గనుల నమూల్యలోహములు గల్గి యదృశ్యముగా నడంగు చా
డ్పునఁ, గవిపుంగవుల్ గలరు పూజ్యతగన్న మహాంధ్రభూమి; భా
షను దయ నాదరించెడు రసజ్ఞులు లేని కొఱంత యొక్కఁడే.

అదియేమి నాగ్రహచారమోగాని న న్నిప్పుడు కడునీచముగాఁ జూచుచున్నారు. ఇదియెవరికిఁ జెడ్డకాలమో నే నూహింపఁ జాలకున్నాను.

సీ. పరమభాగవతప్రభావప్రసక్తిచే
యశముగూర్చినది పోతన్న కెఱుక;
సకలాంధ్రజనపారిజాతమై మితిలేని
మన్నన ల్గొనుట తిమ్మన్న కెఱుక;
రామాయణంబు భారతము నేకంబుగా
నభినుతించినది సూరన్న కెఱుక;
అరిదరకరమైన హరివంశమునకు వి
ఖ్యాతిదెచ్చినది సోమన్న కెఱుక;
గీ. లలితవాక్ప్రౌఢి విజయవిలాసవైభ
వముల వెలయుట వేంకటపతికి నెఱుక;
న న్నెఱింగిన వార లందఱుఁ దరలిరి
వసుధ దిక్కేది దీననై బ్రదుకవలసె.

మూలిగెడు నక్కమీఁదఁ దాటికాయపడినట్టు ప్రకృతదుర్దశం గూర్చి విలపించునా కీగ్రామ్యభాషాపిశాచ మొకటి వెంటఁబడినది. పాదములకుఁ జుట్టుకొనుచున్నది. మాటకు నడ్డుపడి నేను నే ననుచున్నది. (కొంచెము విసిన ట్లభినయించి) ఎవరో నాపేరుపెట్టి పిలుచుచున్నట్లున్నది. ఎవ రచ్చట? (వినుట నభినయించి) "ఆంధ్రభాషా యోషా నిన్నే వెదకుచున్నాను. నన్నెఱుఁగవా?" అనియనుచున్నావా? ఎఱుఁగకేమి? చక్కఁగా నెఱుఁగుదును. నీయల్పభోగమెన్నాళ్లు? (వినుచు) మఱల నేమనియెదవు? "నీవు పొరపడినట్లున్నావు. నన్ను గుఱుతుపట్టలేదు." అనియెదవా? నీవెవరో చెప్పెదనువిని సంతోషింపుము.

మ. కనువా రెల్లరు దూఱినం గులబహిష్కారంబు గావించినన్
జనువీయంగనె దొంగకుక్కవలెఁ బంచల్ దూఱి దుర్జాతివై
ఘనత న్నాదగు నాంధ్రలోకమున నిక్కంగోరి భూతంబవై
ననుఁ బీడింప జనించి మిట్టిపడు నింద్యగ్రామ్యమీవేకదా ?

ఇదినిక్కమేగదా! ఏమనియెదవు? (అని వినుట నభినయించి) 'పాపము శాంతించుఁగాక! పాపము శాంతించుఁగాక! ఆంధ్రభాషామతల్లీ, నీయనుగ్రహపాత్రమై యిపుడిపుడు వర్ధిల్లుచున్న చంద్రికనుగానా? ననుఁజూర్చి నీవెఱుఁగకుదువా?' అనియనుచున్నావా? నీవెంటనున్న వారు నీరెవరు? "నాసోదరీమణులగు నాంధ్రభాషాభివర్ధనియు నాంధ్రప్రచారిణియు" ననుచున్నావా? అమ్మయ్యా! చెదరిపోయిన ప్రాణములు మెల్లమెల్లఁగా మఱలఁ జేరుచున్నవి. చంద్రికా! మీరు నాకొఱకుఁ బాటుపడుచుండువారని యిప్పుడు జ్ఞప్తికివచ్చినది.

సీ. ఇనకరవ్యాప్తిచే దినదినాభ్యుదయంబుఁ
బొందుచుఁ గళలఁ బెంపొందినారు;
ఘనుల సంసర్గభాగ్యంబున సత్పథ
మరయుచు నమృతంబుఁ గురిసినారు;
నవలావినోదమై కువలయామోదమై
మించి బుధవ్యాప్తిఁ బెంచినారు;
సత్కీర్తిమూర్తులై సరసు లుప్పొంగఁగా
నిఖిలశాస్త్రజ్యోత్స్న నెగడినారు;
గీ. వితతసుమనఃప్రియంబుఁ గావించినారు;
దొఱయుఁ డక్షిణగతిని నిర్దోషమహిమ;
విమలవిజ్ఞానచంద్రికా! వెలయుఁడమ్మ
పుడమి నాచంద్రతారార్కముగఁ బ్రియముగ.

(అనివినుట నభినయించి) "మాతా! నీమంగళాశీర్వాదమే మాభావ్యున్నతికి సూచకము. నీయెడఁ గలభక్తి విశ్వాసములు నేనెన్నఁటికి మఱువఁజాలను అనుగ్రహింపుము. సంతాపము దక్కి శాంతివహింపుము. నీకుసౌఖ్యముగలుగఁగలదు" అనియోదార్చుచున్నావా? నాకింకెక్కడి సౌఖ్యము.

సీ. గ్రామ్యభాషనె గ్రంథరచన సేయుండంచు

వాదించు విపరీతవాదు లొకట ;

యతిఁ బ్రాస వీడి పద్యములు వ్రాయుండంచుఁ
దగవాడు నల్పవిద్వాంసు లొకట;
పద్య కవిత్వమే పనికిరాదంచు వి
ద్వేషించు భాషానభిజ్ఞు లొకట;
శృంగారరసమె యశ్లీలభావంబంచు
వేకరించుచునుండు విరసు లొకట;

గీ. బయలుదేఱిరి సంస్కరింపంగ భాష;
నందిఁ బందిని బందిని నందిఁ జేయు
కీర్తికాములు నూత్న సంస్కర్తలొకటఁ
దెలుఁగుబాస నశింపదే తెగులు దగిలి ?

ఈభాషాసంస్కర్తలచేతులలో, నీ కవుల కలహములలోఁ జిక్కినచో నెప్పుడో నామరూపములు లేక నశించియుండును.

క. ప్రాచీనసత్కవులు భువి
నాచంద్రార్కముగ వెలయు దనిరా పలుకుల్
బ్రోచెడునాఁటికి నేఁటికి
నీచెన్ను సజీవనౌచు నేపుఁగనంగన్.

కాఁబట్టియే యింకను గొనయూపిరితో నుండఁ గలిగియున్నాను. నీ వేమనెదవు ? (చెవియొగ్గివిని) "అమ్మా ! వెన్నెలకొన్నాళ్లు చీఁకటిగొన్నాళ్లుగదా? నీ కష్టదినములు గడముట్టినవి. భాషాసేవకులు కొందఱు బయలు దేఱిరి, బయలుదేఱుచున్నారు. బయలుదేఱుదురు. వగవకుము." అని యనెదవా ? కొందఱు బయలుదేఱినంతమాత్రమున నాకేమి సౌఖ్యము? పరభాషాంగనాలోలురైన యాంధ్రులు తల్లినగు నాంధ్రభాషాయోష ననాదరము సేయుచున్నారు.

ఉ. పూనిక మత్సమాశ్రయము బొందినవారు సమస్తరాజ సం
స్థానములం బహూకృతులఁ జాలఁగ నందిరి సత్కవీంద్రులై
దీనిధులొచు; నట్టినను దీనతఁ జూచెద రిప్పు డాంధ్రులుం
గానక తల్లిగర్భమునఁ గాళులు దాఁపెడి చందమే కదా?
స్వభాషావిముఖత్వమువలన దేశమున కరిష్టమనియెఱుంగరు కాఁబోలు.

మ. ధరలో నాంధ్రవధూటినై వఱలి సత్సంతానముం గంటిఁ గీ
ర్తరమం గూర్చిరి తొల్లి దానముకొలందిం బిడ్డ లన్మాట సు
స్థిరమా నట్టుల; నాంధ్రులై యిపుడు నిన్నీ నాకు జన్మించి భ
క్తి రవం తేనియు లేని వారయిరి మాతృద్రోహు లిల్లే కదా ?

నిష్కపటముగ సర్వజనులకును యథోచిత సాహాయ్యము చేయుచుం దును. మాతృదేశభక్తి, మాతృభాషాభక్తి స్వభావముగ నుండవలెనుగాని యొకరు చెప్పినరాదు.

చ. పరుఁడని బాంధవుండని వివక్షయ లేక సమానదృష్టినే
నరిగి మదాప్తిఁ గోరెడి జనావళికిం దలలోనినాల్కనై
పరఁగుదు, నట్టివారి తలవాకిట నే నివసింతు, రాట్సభాం
తరములఁ గీర్తిఁదెత్తు సుకృతమ్ము ఘటింతు నఖండపాండితిన్.

నాదినములు మంచివికావు. ఒకరి నని లాభ మేమి? నీయభిప్రాయమేమి చంద్రికా? (అనిచెవియొగ్గివినిన ట్లభినయించి) "భాషాజననీ! ని న్నుద్ధరించుటకు విద్వత్సంస్థానాధిపతులగు రాజులును, విద్వాంసులును బూనియున్నారు. అచిర కాలమున నీ కపారసుఖోన్నతిఁ గలుగును. నీమహోత్సవసమయమున నేనును వత్తును. అట్టియుత్సవమున నీమూర్తిని సందర్శించి సాష్టాంగదండప్రణామము నర్తును. సెలవు సెంగుము. పోయివచ్చెద" ననుచున్నావా ? సంతోషము నాయభ్యున్నతికిఁ బాటుపడువారిలోఁ గొందఱు జీవయాత్రచాలించిరి.

ఉ. చిన్నటనుండి నాదగుప్రసిద్ధి విచారము నేసి నాకుఁ బూ
ర్వోన్నతవైభవంబుఁ బరమోపకృతిం గలిగింపఁ బ్రీతి నె
న్నెన్ని విధాలఁ బాటువడె నింతకు నాదురదృష్టమే మొ యా
చిన్నయసూరి భూమివిడిచెన్ గతిమాలితి నాఁటినుండియున్.

ఇట్టిజగదుద్ధరణ పరాయణులకుఁ బునరావృత్తిఁగలిగించి లోకహితకార్యములు పరిసమాప్తినొందింపఁ బరిపూర్ణానుగ్రహ మాపరమేశ్వరుఁడు ప్రసాదించుఁ గాక. ఏ మీ మంగళారవములు (వినుట నభినయించును.)

(నేపథ్యమున)

మ. సుకవివ్రాతము స్వస్తిఁజెప్ప విబుధస్తోమంబు ఛత్రంబు లు
త్సుకతం గైనిడ, వీవనల్ విసర రాజుల్, వ్యాసతూర్యాళివా

రకక్రమోవర్ణ, బొలుపాఱఁ దోరణములై గ్రంథాళి, సాహిత్యవే
దిక నాసీనవుగమ్ము రమ్ము జనయిత్రీ యాంధ్రభాషాసతీ.

ఆహాహా! నే ధన్యనైతిని. నాసౌఖ్యంబు మిన్నందె. ఇంక నావ్యాప్తి తా మరతంపర యగును. నాయభివృద్ధికై శ్రమగొనిన మాతృభాషాభక్తులకు నేఁ గృతజ్ఞను.

సీ. నామావశేషనై యేమూలనోడాగి
యుండిన న న్నిదే యుద్ధరింప;
పూర్వసత్కవిపుంగవుల పాండితిప్రతి
భావిశేషములు శాశ్వత మొనర్ప;
భాషాభిమాన భూపాల మహోదార
చిత్తవైశాల్యముల్ స్థిరతఁజాట;
శిథిలాంధ్రకావ్యరాజిఁ సేకరించి సం
స్కరణంబుసేసి విఖ్యాతిఁ బెంప;
గీ. ఆంధ్రసాహిత్య పరిషన్మహాపవిత్ర
నామకరణం బొనర్చి చెన్నపురమందు
నన్ను నెలకొల్పినట్టి సంపన్నులకిదె
మంగళాశీస్సునర్తు సంపదలఁ బొదల.

మఱియు నింక నాప్రతిజ్ఞవినుఁడు.

సీ. పావనమూర్తుల జీవితలతికాచ
యమ్ము ప్రాకఁగఁ బట్టుఁగొమ్మ లౌచు,
నఖిలరసంబుల ననుభవింపఁగఁ జేయు
నవలలఁ గన్నట్టి నవల లౌచు,
సృష్టిసౌభాగ్య గరిమ మొక్కటనె చూపి
తనిపించు నిల్వుటద్దంబు లౌచు,
ననవరతంబుఁ దోడ్పై మంచిసెబ్బరల్
దెలుప వర్తిలు గాజుదివ్వె లౌచు;
గీ. మఱి యనేక విధంబుల మాతృభాష
భక్తిఁభోషించు సంఘముల్ బహుళముగను

దెలుఁగుదేశంబునం దెల్ల నిలువఁ జూతు
నాంధ్రపత్రిక లింటింట నలరఁజూతు.
(అని నిష్క్రమించుచున్నది.)

మున్నంగి లక్ష్మీనరసింహ శర్మ.

# శాస్త్ర పరిభాష.

ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకై కావలసిన పారిభాషికపదముల నిర్ణయించుట యాంధ్రసాహిత్యపరిషదుద్దేశములలో నొకటి.

ఆంగ్లేయ భాషాగ్రంథముల ననుసరించి తెనుఁగున శాస్త్రగ్రంథములు రచించునప్పు డట్టిపదముల కవసరము ముఖ్యముగాఁ గనపట్టుచున్నది. ఈవిషయమయి వంగీయసాహిత్యపరిషత్తువారును, నాగరీప్రచారిణీసభవారును, కొందఱు మహారాష్ట్రులును ప్రయత్నముచేసి కొన్నికొన్ని పదముల నేర్పఱచి యున్నారు. దొరకినంత వఱకు సంస్కృతభాషా గ్రంథములయందు రూఢములై యున్న శబ్దముల గ్రహింపవలయుననియు నట్టి శబ్దములు దొరకనప్పుడు నాతిదీర్ఘములగు శబ్దములఁ గల్పింపవలయుననియు నదియు వీలు లేనప్పు డన్యదేశ్యశబ్దముల సంస్కార పూర్వకముగాఁ దెచ్చుకొనవలయుననియుఁ బుధోక్త సంఘములవారు నిర్ణయించినట్లు కన్పట్టుచున్నది. ఇది యెంతయు సమంజసముగానున్నది. ఈపద్ధతి ననుసరించి సంస్కృతమందు రూఢములయి యున్న శాస్త్రసంకేతపదముల పట్టిక లప్పుడప్పు డీపత్రికయందుఁ బ్రచురింపఁ దలఁచినారము. ఈసంచికలో గణితశాస్త్రధర్మశాస్త్రములకు సంబంధించిన కొన్నిపదములు ప్రచురించుచున్నారము. ఈపట్టికలు సమగ్రములు కావు. సంస్కృతాంగ్లేయ భాషాభిజ్ఞులగు మాతృభాషాభిమాను లిట్టిపదములఁ బంపినచో నీపత్రికయందు కృతజ్ఞతాపూర్వకముగా ముద్రింపించెదము. (పత్రికాధిపతి)

## Law = ధర్మశాస్త్రము.

| | |
|---|---|
| Litigation | వ్యవహారము. |
| Dispute | వివాదము. |
| Duty, rule of conduct | ధర్మము. |
| Suit or case | న్యాయము, అభియోగము. |
| Justice | ధర్మము. |
| Administration of Justice | ధర్మాధికరణము. |
| Court | సభ, ధర్మసభ. |
| Stationary court | ప్రతిష్ఠితసభ. |
| Itinerating court | అప్రతిష్ఠితసభ. |
| Court martial | సైనికసభ. |

| | |
|---|---|
| Commercial court | వణిక్సభ. |
| Presiding judge | ప్రాడ్వివాకుఁడు. |
| Clerk | లేఖకుఁడు. |
| Accountant | గణకుఁడు. |
| Court keeper | సాధ్యపాలకుఁడు, స్వపురుషుఁడు. |
| Plaint or complaint | ప్రతిజ్ఞ. |
| Answer | ఉత్తరము. |
| Proof | క్రియ. |
| Decision | నిర్ణయము. |
| Evidence | ప్రమాణము. |
| Witness | సాక్షి. |
| Document | లిఖితము, లేఖ్యము, పత్రము. |
| Private document | లౌకిక లేఖ్యము. |
| Public document | రాజకీయ లేఖ్యము. |
| Partition deed | భాగలేఖ్యము. |
| Sale deed | క్రయలేఖ్యము. |
| Mortgage deed | ఆధిలేఖ్యము. |
| Mutual agreement entered into by several persons | సంవిత్పత్రము. |
| Bond | ఋణలేఖ్యము. |
| Contract to serve | దాసపత్రము. |
| Deed of gift | దానపత్రము. |
| Royal grant | శాసనము. |
| Order | ఆజ్ఞాపత్రము. |
| Judgement | జయపత్రము. |
| False document | కూటలేఖ్యము. |
| False Evidence | కూటసాక్ష్యము. |
| Human Evidence | మానుషప్రమాణము. |
| Supernatural Evidence | దైవికప్రమాణము, దివ్యము. |

| | |
|---|---|
| Enquiry or trial | వ్యవహారదర్శనము. |
| Summons | ముద్ర. |
| Vakil or pleader | నియోగి, ప్రతినిధి. |
| Surety | ప్రతిభువు. |
| Faults in pleadings | పక్షదోషములు. |
| Subject matter of suit | ద్రవ్యము. |
| Injury or grievance | పీడ. |
| Cause of action | కారణము. |
| Detective | సూచకుఁడు. |
| Plaintiff or complainant | అర్థి, అభియోక్త, వాది, స్తోభకుఁడు, ఆవేదకుఁడు. |
| Defendant or accused | ప్రతివాది, ప్రత్యర్థి, అభియుక్తుఁడు. |
| Legal restraint | ఆసేధము. (దురాయి) |
| Being restrained to a place | స్థానాసేధము. |
| Prohibition against certain acts | కర్మాసేధము. |
| Probibition against travel | ప్రవాసాసేధము. |
| Counter Suit | ప్రత్యభియోగము. |
| Title | ఆగమము. |
| Enjoyment | భుక్తి. |
| Admission of claim bya defendant | సంప్రతిపత్తి. |
| Denial | మిథ్య. |
| Conefssion and avoidance | ప్రత్యవస్కందనము. |
| Res judicata | పూర్వన్యాయవిధి, ప్రాఙ్న్యాయవిధి. |
| Burden of proof | క్రియ, క్రియాభారము. |
| Misjoinder of claims | ప్రతిజ్ఞాసంకరము. |
| misjoinder of pleas | ఉత్తరసంకరము. |
| Compromise | సంధి. |
| Scrutiny | శోధనము. |

| | |
|---|---|
| Relevant | ప్రకృతార్థానుబంధము. |
| Jus tertia | అన్యార్థము. |
| Obtained by sale | క్రీతము. |
| Obtained by inheritence | క్రమాయాతము, క్రమాగతము. |
| Barred by limitation | అతీతకాలము. |
| Brief | సంక్షిప్తము. |
| Well known | ప్రసిద్ధము. |
| Comprehens ive | నిఖిలార్థము. |
| Concise | అల్పాక్షరము. |
| Unequivocal | అసందిగ్ధము. |
| Clear | అనాకులము. |
| Causing no injury | నిరాబాధము. |
| Meaningless | నిరర్థకము. |
| Purposeless | నిష్ప్రయోజనము. |
| Boundary | వేల, సీమ. |
| Complete in itself | పరిపూర్ణము. |
| Adjournment | కాలదానము. |
| Inconsistent | ద్విష్టము. |
| Demand | చోదనము. |
| Oath | శపథము. |
| Challenging (witness &e) | దూషణము. |
| Punishment | దండము. |
| Warning | ధిగ్దండము. |
| Repremand | వాగ్దండము. |
| Fine | ధనదండము. |
| Corporal punishment | శరీరదండము. |

జయంతి రామయ్య

# "గణితశాస్త్రము" = Mathematics

| | |
|---|---|
| అంకగణితము | Arithmatic |
| బీజగణితము | Algebra |
| జ్యామితి, క్షేత్రగణితము | Geometry |
| త్రికోణమితి | Trigonometry |
| రాశి ... ... | Number |
| అంకము ... ... | Digit |
| పరికర్మములు. | Fundamental operations |
| సంకలనము. | Addition |
| యోగము | The sum |
| వ్యవకలనము. | Subtraction |
| అంతరము. | Difference |
| గుణనము, హననము | Multiplication |
| గుణ్యము. | Multiplicand |
| గుణకము | Multiplier |
| గుణనఫలము. / గుణనము | Product |
| భాగము, భాగహారము. | Division |
| భాజ్యము ... | Dividend |
| భాజకము ... | Divisor |
| భాజితము. ఛేదము | Quotient |
| శేషము | Remainder |
| వర్గము, కృతి | Square of a number |
| వర్గమూలము | Square root |
| ఘనము | The cube of a number or the volume of an object. |
| ఘనమూలము | Cube root |
| ఫలము | Result |

| | |
|---|---|
| రూపము. | Integer |
| భిన్నము, భాగము. | Fraction |
| ప్రభాగము | Subdivision of a fraction |
| దశాంశభిన్నము | Decimal fraction |
| హారము, హరము, ఛేదము. | Denominator |
| అంశము, లవము | Numerator |
| సమచ్ఛేదములు | Fractions with a common denominator |
| అపవర్తనము. | Common factor |
| భాగానుబన్ధము లేక అంశానుబన్ధము. | Fractional increase |
| భాగాపవాహము | Fractional decrease |
| శూన్యము | *Z*ero |
| అనంతము. | Infinity |

[This is the term actually used by Bhaskara to denote the quotient when any quantity is divided by Zero. It is here worth noting how he compares the immensity of Infinity with the immensity of God himself. Vide Bijaganita, Sunya Shadvidha Nirupana]

| | |
|---|---|
| వ్యస్తవిధి, విలోమవిధి | Inversion |
| ఇష్టకర్మము | False assumption (something like our "let the number be one") |
| త్రైరాశికము | Simple Rule of three |
| ధనము | Positive |
| ఋణము | Negative (usually denoted by a point over the symbol representing thequantity) |
| అవ్యక్తము | Variable quantity |

[Usually a variable is expressed by terms యావత్తావత్, కాలక, నీలక, పీతక, లోహితక, శ్వేతక and other such names of colours. The initials of these are the symbols employed.]

| | |
|---|---|
| భావితము | Product of two or more variables of different natures |
| కరణి | A Surd quantity |
| సమీకరణము | Equation |
| ఏకవర్ణసమీకరణము | An equaition in one variable of the first degree |
| అవ్యక్తవర్గసమీకరణము | quadratic equation |
| పక్షము | Side of an equation |
| కుట్టకము | Indeterminate equation |
| శ్రేఢి | Progression |
| సంకలితశ్రేఢి | Arithmatical progression |
| ముఖధనము | First term |
| మధ్యధనము | Middle term |
| అంత్యధనము | Last term |
| పదము, గచ్ఛము | Number of terms |
| చయము | Common difference |
| సర్వధనము | Sum of the series |
| గుణోత్తర శ్రేఢి | Geometric series |
| అంకపాశము | Combination of digits |
| రేఖ | Line |
| కోణము | Angle |
| సమకోణము | A right angle |
| త్రిభుజము, త్రికోణము | Triangle |
| భుజము | A side |
| భూమి | The base |
| లంబము | Altitude |
| ఆబాధలు | The intercepts of the base of a triangle by its altitude |
| త్ర్యస్రము | A right angled triangle |
| క్షేత్రఫలము, భూఫలము | Area |

| | |
|---|---|
| చతురస్రము | A square |
| దీర్ఘచతురస్రము | An oblong |
| కర్ణము | Hypotenuse or diagonal |
| వృత్తము | Circle |
| కేంద్రము | Centre |
| వ్యాసము, విష్కంభము | Diameter |
| వ్యాసార్ధము | Radius |
| ధనుస్సు | Arc |
| జ్యా, జీవము, మౌర్వి | A chord |
| బాణము | The height of an arc. |

(The arc with its chord and the perpendicular through the middle point of the chord, is likened to a bow with its string and its arrow. Hence the terms)

| | |
|---|---|
| పరిధి | Circumference |
| గోళము | Sphere |
| సమఖాతము | An excavatfon of the form of a prism or a cylinder |
| సూచీఖాతము | An excavation of the form of a pyramid or a cone |
| జ్యా | Sine of an angle |
| కోటిజ్యా | Cosine of an angle |
| ఉత్క్రమజ్యా | The versed sine |
| భాగము | Degree of an angle |
| కల | A minute |
| వికల | A second |

కపిస్థళం - కృష్ణమాచార్యులు.

# సర్వలోకాశ్రయుని శాసనము.

(క్రీ. శ. 672-96)

ఈశాసనము 7 అంగుళములు పొడవు, 2½ అంగుళములు వెడలువు గల 3 రాగిరేకులమీఁద చెక్కియున్నది. రెండవరేకునకు మాత్రము రెండువైపులను అక్షరములు కలవు. తక్కినరెండు రేకులకు లోపలి ప్రక్కను మాత్రమే కలవు. రెండవపత్రము రెండవవైపున 4 పఙ్క్తులును, తక్కిన పుటలన్నిటిలో నయిదేసి పఙ్క్తులును, వెరసి 19 పఙ్క్తులున్నవి. ముద్ర మీఁదిభాగమం దర్ధచంద్రరేఖయు, అడుగునఁ బద్మమును రెంటికి నడుమ "శ్రీవిజయసిద్ధి" యను నక్షరములును గలవు.

ఈశాసనము ప్రస్తుతపుకృష్ణాజిల్లా, కొవ్వూరుతాలూకాలోనున్న యాదవోలు జమీందారీలో ఏడువాడల పాలెము అనుగ్రామమునందు పొలములో దొరకినదఁట. దుగ్గిరాల ప్రకాశరావుగారి మూలమున నాకులభించినది. ఇది పూర్వచాలుక్యవంశకర్తయగు కుబ్జవిష్ణువర్ధనుని మునిమనుమఁడగు మంగియువరాజు కాలము నాఁటిది. ఈరాజునకు సర్వలోకాశ్రయుఁడు, విజయసిద్ధి యను రెండుబిరుదులు కలవు. ఈశాసనమునందు మొదటిపేరును రెండవది ముద్రయందును గనపడుచున్నవి. కాని మంగియువరాజను పేరిందుఁ గానరాదు. అనేక శాసనములలో నాపేరే యితనికి రూఢమయి యున్నది. ఈరాజు క్రీస్తుశకము 672 వ సంవత్సరము మొదలు 696 వ సంవత్సరము వరకు 25 సంవత్సరములు రాజ్యము చేసినట్లు శాసనాంతరముల వలనఁ దెలియవచ్చుచున్నది.

ఇదివరకు మంగియువరాజు శాసనములు మూఁడుమాత్రము లభించినట్లగపడుచున్నది. అందొకటి (నూతుల పట్టుశాసనము) Indian Antiquary, Vol 20 అను పత్రికయందును, ఇంకొకటి (చెందలూరు శాసనము) Epigraphia Indica, Vol 8 అను పత్రికయందును ముద్రితములయి యున్నవి. ఈ రాజు యొక్క మఱియొక యసంపూర్ణశాసనము విశాఖపట్నము జిల్లాలో లిమ్మాపురమను గ్రామమున దొరకినట్లు శాసనాధికారి 1907-08 సంవత్సరపు కార్యనివేదనము వలనఁ దెలియుచున్నది.

ప్రస్తుతపు శాసనము నాలుగవది. వీనియన్నిటియందును రాజునకు విజయసిద్ధి యను బిరుదు కనఁబడుచున్నది.

శాసనపులిపి పూర్వకాలపు తెలుఁగుది. భాషసంస్కృతము. చివరమూఁడు శ్లోకములు తప్ప తక్కిన భాగమంతయు గద్యరూపముగానున్నది. లేఖకదోషములు కొంచెమున్నవి. శాసనమంతయు స్పష్టముగానే యున్నదిగాని యచ్చటచ్చటఁ గొన్నియక్షరములుమాత్రము తెలియలేదు. శాసనప్రతిబింబమును బట్టి యాయక్షరముల రూపము పాఠకులు నిర్ణయింతురుగాక.

మహాసేన (కుమారస్వామి) పాదభక్తులును, మానవ్యసగోత్రులు నగు చాలుక్యుల కులమలంకరించిన శ్రీజయసింహ వల్లభ మహారాజు (అనఁగా కుబ్జవిష్ణువర్ధనుని జ్యేష్ఠపుత్రుని) ప్రియభ్రాతయయిన ఇంద్రభట్టారకుని పౌత్రుఁడును, విష్ణువర్ధనమహారాజు (విష్ణురాజు అని నామాంతరము కలదు) పుత్రుఁడును, అగు శ్రీసర్వలోకాశ్రయమహారాజు, అథర్వశాఖాధ్యాయులును, కౌశికసగోత్రులును, జీవశర్మపౌత్రులును, దాచశర్మపుత్రులు నగు ముగ్గురు బ్రాహ్మణులకు పాగుణూర విషయమందొక గ్రామములో రెండునివర్తనలభూమి తన యారోగ్యయశోభివృద్ధికై దానముచేసినట్లు శాసనమందున్నది. ప్రతిగ్రహీతలలో నొకనిపేరు జీవశర్మ. ఇంకొకనిపేరు యజ్ఞశర్మ. మఱియొకనిపేరు రెండక్షరములలో మొదటి అకారము స్పష్టముగానున్నది. రెండవయక్షరము తెలియలేదు. గ్రామనామము బొణ్డాడనొర్త్తి యని నాకుఁదోచినది. గ్రామమును పాగుణూర విషయమును ఎచ్చటనున్నవో, ఆపేళ్లిప్పుడెట్లుమాఱియున్నవో తెలియదు. బెజవాడలో నీదానముచేయఁబడి యుండుటచే నాప్రాంతమందే యాగ్రామముండెనేమోయని యూహింపఁదగియున్నది. శాసన పరిపాలకుని(అజ్ఞప్తి) పేరు నిస్సందేహముగా తేలలేదు. నిస్సమిణ్డి యనునక్షరములు కనపడుచున్నవి. నూతులపట్టుశాసనములో నీతనిపేరు నిస్సరమిజ యని యున్నట్లు డాక్టర్ ఫ్లీటుగారు వ్రాసియున్నారు. లేఖకునిపేరు రాఘువాచార్యుఁడు.

ఈశాసనము విజయవాడలోఁ బుట్టినట్లున్నది. విజయవాడ యనఁగా బెజవాడ. ఆకాలమందు బెజవాడ చాలుక్యులకు రాజధానిగా నుండియుండునని యూహించెద.

"అథర్వచరణేభ్యః" అనుచోట చరణశబ్దమునకు వేదశాఖాధ్యయన ము చేయువారని యర్థము. ఈయర్థమున నీశబ్దము నిత్యబహువచనాంతము. నివర్తనయన భూపరిమాణవిశేషము.

శాసనముపుట్టిన సంవత్సరముగాని, మాసముగాని, తిథిగాని, నిర్ణయిం చుటకుఁ దగిన సాధనములు లేవు. క్రీస్తుశకము 672 మొదలు 696 వ సంవత్సరము వరకుఁగల మధ్యకాలములో మాత్రము పుట్టినట్లు స్పష్టము.

జయంతి రామయ్య.

# మూలము.

## ప్రథమ పత్రము.

స్వస్తిశ్రీమత్ విజయవాడత (ః) భగవత్స్వామి మహాసేనపాదభ
2. క్తానా (౦) మానవ్యసగోత్రాణాం చలుక్యానా (౦) కులమలఙ్క-

రిష్ణోః
3. శ్రీజయసింహవల్లభ మహారాజ ప్రియభ్రాతు రిన్ద్రభ
4. ట్టారకస్య పౌత్రః శ్రీవిష్ణువర్ధనమహారాజస్య పుత్రః శ్రీసర్వ్వ
5. లోకాశ్రయ మహారాజః స్వవిషయ వాసినో[1] ఇత్థమాజ్ఞా

రెండవ పత్రము. మొదటి పుట.

6. యతి పాగుణూర విషయే బొణ్డాడనె (_ర్రి) గ్రామే అథర్వ్వచర
7. ణేభ్య (ః) కౌశికసగోత్రేభ్యః జీవశర్మ్మణ (ః) పౌత్రభ్య (ః)[2]

దాచశ
8. ర్మ్మణః పుత్రేభ్యః జీవశర్మ్మ అ*శర్మ్మ యజ్ఞశర్మ్మ
9 భ్యః అస్మదారోగ్యయశోభివృద్ధయే నివర్త్తనద్వయ
10 క్షేత్రోన్దత్తో[3] అస్య పురస్తా * * బు * మ * ది దక్షిణ

రెండవపత్రము, రెండవపుట

11 తో గ్రామభూమిః పశ్చిమతో మూపరిన్నామ క్షేత్ర (౦) ఉత్తరత
12. * * సుసగోత్రాయ స్వామిశర్మ్మణ (ః) పుత్రాయ విష్ణుశ
13. ర్మ్మణే క్షేత్రం[4] అస్యోపరి నకైశ్చిద్బాధా కరణీయా.
14. (య)ః కరోతి స పఞ్చభి ర్మ్మహాపాతకై సంయుక్తో[5] భతి[6]

బహుభి

మూడవ పత్రము.

15. ర్వ్వసుధా దత్తా బహుభి శ్చానుపాలితా యస్యయస్యయదాభూమి
16. స్తస్యతస్య తదాఫలం స్వదత్తాంపరదత్తాంవా యోహరేతవసు
17. న్ధరాం గవా (౦) శతసహస్రస్యః హన్తుః బిభర్తి[7] కిల్బిషం
18. ఆజ్ఞప్తిరస్య ధర్మస్య స్వధర్మ్మపరివర్ధితో నిస్సుమిణ్డి*
19. య తః*సారసర్వ్వరాజసు శ్రీరాఘవాచార్య్యేణ లిఖితం.

---

1 వాసిన
2 పౌత్రేభ్యః
3 క్షేత్రందత్తం
4 దత్తం క్షేత్రం అని చదువవలెను.
5 స్సంయుక్తో
6 భవతి 
7 హన్తు బిభర్తి

# మధురనాయకుల దానపత్రములు.

ఈక్రింద ముద్రింపఁబడు దానపత్రములు రెండు ను, రెండువిడి తాటియా కులమీఁద వ్రాయఁబడియున్నవి. ఆయాకులు గత సంవత్సరము పరిషత్పుస్తక భాండారమునకై దక్షిణదేశమందు సంపాదింపఁబడిన వ్రాఁతపుస్తకములలో నున్నవి. ఎట్టియాపురం గురునాథశాస్త్రిగారు వీనినొసఁగిరి. పుస్తకముల పట్టికలో వీనిసంఖ్య 382. రెండాకులుకూడ చివరకొంత భాగము చినిఁగియున్నవి. మొదటియాకున కొకవైపు 7 బంతులును రెండవవైపు 3 బంతులును చిన్న యక్షరములతో వ్రాయఁబడియున్నవి. సంతకము లేదు. సంవత్సర సంఖ్యలో ౹, ౮ అంకెలు సవరణకాఁబడి నట్లున్నవి. మఱియెక్కడను తుడుపులు లేవు. రెండవ యాకున కొకప్రక్కనైను పద్యములును మఱియొకప్రక్క నాలుపద్యములును గలవు. అక్షరములు కొంచెము పెద్దవి. చిట్టచివర 'విజయరంగ చొక్కనాథనాయన య్య వ్రాలు' అని పెద్దయక్షరములతో సంతకమువలె వ్రాసియున్నది, కాని యా యక్షరములు చొక్కనాథుని స్వహస్తలిఖితములని చెప్ప సాహసింపలేము. తాటియాకుమాత్రము మొదటిదానికంటె క్రొఁతది. రెండు పత్రములుకూడ అసలుపత్రముల ప్రతులని తోఁచుచున్నది.

పత్రములభాష సలక్షణమైనదికాదు. వ్రాఁతతప్పులుకూడ నచ్చటచ్చట నున్నవి. అయిన నాకాలమందు దక్షిణదేశములో తెలుఁగున పత్రములు వ్రాయు "మతలబు" చదువరులకుఁ దెలియుఁగాకయని పత్రము లున్నవి యున్నట్లు ముద్రింపించుచున్నారము. (   ) ఈగుర్తుల మధ్యముననున్న యక్షరములు మాత్రము సందర్భానుసారముగాఁ జేర్చుటవైనది.

ఈ దానములఁ జేసినవారు పాండ్యదేశమును పాలించిన యాంధ్రనాయకుల వంశములోనివారు. నాయకరాజ్యము విశ్వనాథనాయకునిచే 1559 వ క్రీస్తువాబ్దమున స్థాపింపఁబడి 1736 వ సంవత్సరమువరకు సాగినది. ఈవంశ క్రమము సుప్రసిద్ధుఁడగు తిరుమలనాయకుఁ డాదిగా నీ క్రిందఁ జూపుచున్నారము.

1. తిరుమలనాయకుఁడు
   **1623-1659**
2. (కొడుకు) ముద్దుఅలకాద్రి అను ముద్దువీరప్ప నాయఁడు.
   **1659-1662**

3. (కొడుకు) చొక్కనాథనాయఁడు
1662-1682
4. (కొడుకు) ముద్దువీరప్ప నాయఁడు
1682-1689
5. (తల్లి) మంగమ్మ
1689-1704
6. (మనుమఁడు) విజయరంగ చొక్కనాథనాయఁడు.
1704-1731
7. (భార్య) మీనాక్షి
1731-1736

ఈవంశక్రమము మధురజిల్లా గెజటీయరునుండి గ్రహింపఁబడినది. మొదటి పత్రములో చొక్కనాథనాయనికి విశ్వనాథనాయని చొక్కనాథనాయఁడను నామాంతరమును, రెండవ పత్రములో 4 వ ముద్దువీరప్పనాయనికి రంగకృష్ణ ముద్దువీరప్పనాయఁడను నామాంతరమును గలవు. ఈరంగకృష్ణుని యనంతర మతని తల్లియగు మంగమ్మ 15 సంవత్సరములు దక్షతతో రాజ్యము చేసి యంతట తన మనుమఁడు విజయరంగచొక్కనాథునకు యుక్తవయస్సు రాఁగా నతని కారాజ్య మొప్పగించెను. కాకతీయ వంశమున రుద్రమదేవి వలె నీమంగమ్మ రాజ్యతంత్రమున సుప్రసిద్ధురాలయి హిందువులలో స్త్రీలుకూడ ప్రజాపరిపాలనమందు సమర్థులను ఖ్యాతిని దృఢపఱచెను. ఆమె 1704 వ సంవత్సరమువరకు మాత్రమె రాజ్యము చేసిన ట్లున్నది కాని యీమెదానకాలము 1705-06 వ సంవత్సరములలో చేరియున్నది.

రెండవదానముచేసినది మంగమ్మ మనుమఁడగు విజయరంగ చొక్కనాథుఁడు. దానకాలము 1711 వ క్రైస్తవాబ్దములోఁ జేరును. చొక్కనాథుని యనంతర మతనిభార్యయగు మీనాక్షి యయిదు సంవత్సరములు రాజ్యము చేసిన పిదప మహమ్మదీయులు దేశ మాక్రమించికొనిరి. దీనితో నాయకరాజ్య మంతరించెను.

ఈనాయకులు తొలుత కర్నాటరాజుల భృత్యులై వారి యాజ్ఞానుసారముగా వ్యవహరించుచుండి యారాజుల బలము తగ్గినకొలఁది క్రమక్రమముగా

స్వతంత్రులయ్యును చిట్టచివరవరకు పేరునకైనను తామింకను కర్ణాటరాజుల భృత్యులమనియే భావించుకొనుచుండిన ట్లీ దానపత్రములవలనఁ దెలియుచున్నది. ఘనగిరి యనఁగా అనంతపురము జిల్లాయందలి పెనుగొండ. 1560 వ సంవత్సరములో జరిగిన తలికోట యుద్ధమందు మహమ్మదీయులచేఁ బరాజితులయిన పిమ్మట విజయనగరరాజులు పెనుగొండ రాజధాని చేసికొని కొంతకాలముండి, యనంతరము చంద్రగిరి, వేలూరు పట్టణములందుండి తిరిగి పెనుగొండకు వచ్చినట్లు కనపడుచున్నది. ఈపత్రములలో నుదాహరింపఁబడిన వేంకటపతిరాయలు సుప్రసిద్ధుఁడు కాఁడు.

జయంతి రామయ్య.

---

## 1

### శ్రీరామ.

స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలీవాహన శకాబ్దం ౧౬౨౭ అగునెటి పార్థివనామ సంవత్సరం పుష్యశ్శు ౧౦ అశ్వనీనక్షత్రం శుభనామయోగం తైతులాకరణం మకరసంక్రాంతి పుణ్య (కాలమందు) శ్రీమద్రాజాధిరాజ మహారాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర వెంక్కటదేవ మహారాయలయ్యవారు ఘనగిరినగరమంద్దు రత్నసింహ్హాసనాధ్యక్షులై యీపృథివీ సాంమ్రాజ్యం జేయుచుంన్నుండ్డగా కాశ్యప (సగోత్రం తిరుమలనాయనయ్యవారి పౌత్రు) లైన ముద్దువీరప్ప నాయనివారి పుత్రులైన విశ్వనాథనాయనిచొక్కనాథనాయని పట్టమహిషి మైనట్టి మంగ్గంమ్మగారు గార్గ్యసగోత్రం ఆపస్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన అనం(తశాస్త్రుల్లవారి పౌత్రులైన రామకృష్ణశాస్త్రుల్ల) వారి పుత్రులైన శీతారామశాస్త్రుల్లవార్కి యీ మకర సంక్రాంతి పుణ్యకాలమంద్దు సహిరంణ్యోదక ధారాపూర్వకముగా యిచ్చిన భూదానశాసనక్రమ మెట్లంన్నను. రాయలయ్యవారు మధురరాజ్యంలో చేరిన దిండ్డికంట్టి శీమలో శానిప్పట్టియల్ల

చతగ్రశ్రమం తూర్పు పారపప్పట్టి మెల్ల దక్షిణం కొట్టప్పట్టి మర్రిమాను - నిరుదు తిమూల పుంగ్గంగొళంపుంజ యల్ల పడమర...పులి వుత్తరం మీనాక్షినాయని పట్టి మెల్ల యీచతురశ్రములో చేరిన నంజపుంజ మావడ మరవడ తోట తోరపు నిధి నిక్షేప జల తరు పాషాణ అక్షిం ణ్యాగామి మోదలైనఅష్టభోగ స్వామ్యములుం...నుభవించుకొని ధర్మంచేసుక వుండ్డమని యీమకర సంక్రాంతి పుణ్యాకాలమంద్దు సహిరంణ్యోదక ధారాపూర్వకముగా యిచ్చినారు......
వుండ్డ గలవారు యిటని సంమ్మతించ్చి కాశ్యపగోత్రం తిరుమలనాయనయ్యవారి పౌత్రులైన ముద్దువీరప్పనాయని పుత్రులైన విశ్వనాధనాయనిచొక్కనాధనాయనివారి (పట్టమహిషియైనట్టి మంగ్గంమ్మగారు) గార్గసగోత్రం ఆపస్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన అనంతశాస్త్రుల్లవారి పౌత్రులైన రామకృష్ణశాస్త్రుల్లవారి పుత్రులైన శీతారామ శాస్త్రుల్లవార్కి యిచ్చిన భూదాన ధర్మశాసనం దానపాలనయోర్మధ్యే దానా) త్స్రియోనుపాలనం। దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతంపదం। స్వదత్తాద్విగుణం పుణ్యాం పరదత్తానుపాలనం। పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥ యీమేర్కు.

## 2

### శ్రీరామ.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలీవాహన శకాబ్దంబులు ౧౬౩౮ అగునేటి ఖరనామ సంవత్సరం మాఖశుద్ధ ౭ సోమవాసరం యీశుభదినమంద్దు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప...రాయలయ్యావారు ఘనగిరి నగరమంద్దు పృథ్వీ సాంమ్రాజ్యం శేయుచుంన్నుండ్డగా కాశ్యపగోత్రం విశ్వనాధ నాయనిచొక్కనాధనాయనయ్యావారి పౌత్రులైన రంగ్గకృష్ణ ముద్దు (వీరప్పనాయనయ్యావారి) పుత్రులైన శ్రీవిజయరంగ్గచొక్కనాధ నాయనయ్యావారు హారిదసగోత్రం ఆపస్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన శ్రీధర లక్ష్మీనృసింహశాస్త్రుల్లవారి పౌత్రులైన వెంకటాద్రి శాస్త్రుల్లవారి పుత్రులైన శ్రీధర వేంకటేశ్వర) శాస్త్రుల్లవార్కి భూదానధర్మశాసనం వ్రాయించియిచ్చిన క్రమమెట్లున్నను. రాయలయ్యగారు మాఅమరనాయకాన్కు పాలించ్చిన పాండ్యమండలముతో చేరిన దిండ్డిగంట్టికి తూర్పుపరక్కుడిగ్రామ * * * స్వామికోవిలకు శిలాశాసనం వేయించ్చి యిచ్చిన యల్ల చతురశ్రమ మధ్యమంద్దు యుండ్డే నంజపుంజ

లున్ను సహిరణ్యోదక ధారాపూర్వకముగా కోవిల వేదవృత్తిపురాణవృత్తిస్థాయిగా పుత్రపౌత్ర పారంపర్యముగా.....విక్రయములక్కు యోగ్యమానట్టుగాను అష్టభోగ్యస్వామ్యములున్ను అనుభవించుకొని సుఖానవుండ్డ (కాశ్యప) గోత్రం విశ్వనాథనాయని చొక్కనాథ నాయనయ్యవారిపౌత్రులైన రంగ్గకృష్ణ ముద్దువీరప్పనాయనయ్యవారి పుత్రులైన శ్రీవిజయరంగ్గ చొక్కనాథనాయనయ్యవారు హారిదసగోత్రం (ఆపస్తంబసూత్రం యజుశ్శాఖా) ధ్యాయులైన శ్రీధరలక్ష్మినృసింహ్మ శాస్త్రుల్లవారి పౌత్రులైన వెంకటాద్రిశాస్త్రుల్లవారి పుత్రులైన శ్రీధర వెంక్కటేశ్వర శాస్త్రుల్లవారిక్కి వ్రాయించియిచ్చిన భూదానధర్మశాసనం। దానపాలయోర్మ్మధ్యే దా(నాత్ఛ్రే)యోనుపాలనం। దా)నాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదం । నవిషం విషమిత్యాహుః బ్రంహ్మస్వంవిషముచ్యతే। విషమేకాకినం హంతి బ్రంహ్మస్వం పుత్రపౌత్రకం ॥ యీధర్మ్మశాసనం వ్రాశింద్ది సముఖం రాయసం గోవింద్దయ సంమ్మతిని తిరుకామేశ్వరయ్య వ్రాలు.

విజయరంగ్గ చొక్కనాథనాయనయ్య వ్రాలు.

---

# ఆంధ్రసాహిత్య పరిషద్ద్వితీయ వర్షోత్సవ వృత్తాంతము.

ఆంధ్రసాహిత్యపరిషత్తు ద్వితీయవార్షికోత్సవము రాజమహేంద్రవరమున జరుపవలయుననియు, దానికగువ్యయమంతయుఁ దామే భరించెదమనియుఁ, జెప్పి సహజౌదార్యసంపన్నులును, అత్యంత మాతృభాషాభిమానులును, బీఠికాపుర ప్రభువులు నగు శ్రీశ్రీరాజారావు వేంకటమహీపతి కుమార సూర్యారావు బహద్దర్‌గారు పరిషత్తు నాహ్వానించిరి. పరిషత్తువారు దానికి సమ్మతించి యీసంవత్సరము ఏప్రెల్ నెల 19-20 తేదుల రాజమహేంద్రవరమునఁ బరిషత్తు ద్వితీయ వార్షికోత్సవము జరుపఁబడునని పత్రికలయందుఁ బ్రకటించి పరిషత్సభ్యులకును, పరిషత్సభ్యులుగాని మఱికొందఱాంధ్రభాషాభిమానులకు నాహ్వానపత్రికలనంపిరి. ఈ యాహ్వానము గౌరవించి చెన్నపురి, విజయనగరము, విశాఖపట్టణము, అనకాపల్లి, ఏలూరు, కాకినాడ, తుని, పిఠాపురము, బెజవాడ, బందరు, సికంద్రాబాదు, కాళహస్తి, అమలాపురము, నిడుదవోలు, కొవ్వూరులో నగు ప్రదేశములనుండి పండితులును మాతృభాషాభిమానులును బెక్కురు రాజమహేంద్రవరమునకు దయచేసిరి. పిఠాపురము రాజుగారిచే నేర్పఱుపఁబడిన యధికారులును, విద్యార్థిబృందసహాయులైన బ్ర॥శ్రీ॥చిలకమర్తి-లక్ష్మీనృసింహము పంతులవారు నభ్యాగతుల కెదురేగి యాదరించి రాజుగారిచేఁ దన్నిమిత్తముగ నేర్పఱుపఁబడి యన్నిసౌఖ్యముల కాకరములైన వారి బంగళాలయందు వారికి విడుదులు కుదిర్చిరి. ఉద్దేశించినప్రకారము 19-ది మధ్యాహ్నముమీఁద 3 గంటలకు హితకారిణీ పాఠశాలయందలి విశాల చంద్రశాలయందు సభగూడెను. ఆసభయం దథమపక్షము వేయిమందియుండిరనుట యతిశయోక్తిగాదు. ఆ సభ

యందు గౌరవనీయులును, పోలవరము జమీందారులునగు కొచ్చర్లకోట రామచంద్రవేంకట కృష్ణారావు బహద్దరుగారు, కోణితివాడ జమీందారుగారగు తాడూరి జగన్నాథరావు పంతులుగారు, నెమలి పట్టాభి రామారావుగారు, దివానుబహద్దరు ముట్నూరి ఆదినారాయణయ్యగారు, జయంతి రామయ్యగారు, పిఠాపురము దివానుగారగు పప్పు సీతారామయ్యగారు, నెల్లూరి కలెక్టరువారగు రావుబహద్దరు దొడ్ల రాఘవయ్యగారు, గౌరవనీయులగు మోచెర్ల రామచంద్రరావుగారు, సబ్ జడ్జిగారగు వావిలాల వేంకటశివావధానులుగారు, డిస్ట్రిక్టు మునిసిబులగు గొల్లకోట గంగాధర సోమయాజులుగారు, ఆతే నారాయణ పంతులుగారు, కోట నరసింహముగారు, రావుబహద్దరు చిత్రపు వేంకటాచలంగారు, నిడమర్తి దుర్గయ్యగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, ఆచంట-లక్ష్మీపతిగారు, మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు, ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రులుగారు, శతావధాని దివాకర్ల తిరుపతిశాస్త్రులుగారు, వడ్డాది సుబ్బారాయుఁడుగారు, వావిలకొలను సుబ్బారావుగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు లోనగు ప్రముఖులు, పండితులు విరాజిల్లుచుండిరి.

సభ్యులభ్యర్థింపఁగా మ-రా-రా-శ్రీ, కొక్కొండ-వేంకటరత్నము పంతులుగా రగ్రాసనమధిష్ఠించిరి. పిదపఁ గార్యారంభమునకుఁ బూర్వము బ్ర॥శ్రీ, వావిలాల-వేంకటశివావధానులుగారు మనోహరముగ నర్థవంతములుగ రెండు ప్రార్థనా శ్లోకములఁజదివిరి. పిదప బ్ర॥ శ్రీ, జయంతి-రామయ్యపంతులుగారు పరిషదుద్దేశముల వివరించి తెలిపిరి. ఈసమయమునఁ గొందఱు పరిషత్సభ్యులుగాఁ జేరిరి.

అనంతరము బ్ర॥ శ్రీ, చిలకమర్తి - లక్ష్మీనరసింహముగారు మృదుమధురగంభీరోక్తులతో, నిరాఘాటధాటితో స్వాగతోపన్యాస మొసంగిరి. అన్నిబలములకన్న నభిమాన బలమెక్కుడనియు, నది యొక్కటి జనులయందు నెలకొనియుండినచో నసాధ్యమగు కార్యమే లేదనియు, నాంధ్రభాష క్షీణించుచున్నదనియు, మృతభాషయనియుఁ జెప్పఁబడు కాలములోఁ గేవల మాత్మభాషాభిమానముచేతనే చాల దూరదేశములందుండి యీ మండెడు నెండలకు

జడియక, ప్రవాసాయాసమునకు వెనుదీయక, యింత దూరము వచ్చుటయే మన భాషకు శుభోదర్క-చిహ్నముగా నున్నదనియు నుపన్యసించిరి. ఆవల సభకు రాజాలని పెద్దమనుష్యులు కొందఱు తమ యభిమానమును వ్యక్త పఱుచుచుఁ బంపిన తంత్రీవార్తలను, నుత్తరములను, గతసంవత్సరవృత్తాంతమును, కార్యదర్శిగారగు మ-రా-రా-శ్రీ, ఆచంట. లక్ష్మీపతిగారు చదివిరి. అవలఁ బిఠాపురమురాజుగారు దేహాస్వస్థతచే రాలేక వ్రాసిపంపిన ప్రారంభోపన్యాసమును మ-రా-రా-శ్రీ, నెమలి - పట్టాభిరామరావుగారు చదివిరి. అది యెట్లనఁగా :—

మహా జనులారా !

" మన యాంధ్రసాహిత్యపరిషత్తు తెనుఁగుదేశమున నందులో ముఖ్యముగ రాజమహేంద్రవరమున సమావేశమగుటెంతయు సమంజసముగనున్నది. మన గ్రంథములలో నెల్ల నుత్తమమైనదని యెన్నఁబడు భారతముయొక్క రచనకు ముఖ్యకారకుఁడగు రాజరాజనరేంద్రునకును దాని నారంభించిన నన్నయభట్టునకు నునికిపట్టీపట్టణమే. ప్రస్తుతము గద్యతిక్కనయని వన్నెకెక్కిన వీరేశలింగం పంతులుగారికిని నవలల నాటకముల రచించుటయందుఁ బ్రవీణులైన చిలకమర్తి లక్ష్మీనరసింహముగారికిని నివాసస్థలమై వెలయుచున్నది. ఈ సభకు నేను వచ్చి యానందించు భాగ్యముకలుగమికి నెంతయుఁ జింతించుచున్నాను.

గత వత్సరమున గ్రంథరచన మించుమించుగఁ దత్పూర్వ సంవత్సరము నందువలెనేయున్నది. మత గ్రంథములుమాత్ర మెక్కువగ బయలుదేరినవి. భాషాభివృద్ధికై పాటుపడు సంఘములు, పుస్తక భాండాగారములు నధికములగుచున్నవి. ఆంధ్రదినపత్రికలేనికొఱత యింకను దీరలేదు. ఆంధ్ర నిఘంటురచన త్వరలో నారంభించెదరుగాక యని కోరుచున్నాను. పరిషత్తువారు చేయించినసభలో నొకరిద్దఱుతప్పఁ బండితులందఱేకగ్రీవముగ గ్రామ్యము వలదనియే నుడివిరి. పాఠశాలలలో దీనినుపయోగింపఁగూడదని పెక్కుచోట్ల జనులు సభలుచేసి తీర్మానించిరి. అయినను మన ప్రభుత్వమువారు మన మనవిని మన్నింపకుండుటెంతయు వింతగనున్నది. గ్రామ్యభాషఁబాఠశాలలలో

నేర్పుటవలన దేశమునకుఁ గీడుమూడునని చెప్పక తప్పదు. ఇది యిటుండ మాతృ భాషా గ్రంథపఠన మావశ్యకము కాదని యూనివర్సిటీ సినేటువారనిరి. అప్పుడు జరిగినచర్యవలన గ్రామ్యవాదులకు మన భాషాభివృద్ధియం దెంత యభిమాన మున్నదో వెల్లడియైనది. ఇట్టివారినిఁ బరీక్షకులుగాఁగాని పఠనీయ గ్రంథ నిర్ణాయక సభ్యులుగాఁగాని యుంచుట కానిపని. పాఠశాలలందు మాతృ భాషాపఠన మావశ్యకముగఁ జేయుటయు గ్రాంథిక భాష నేయుపయోగించునట్లు చేయుటయు దేశాభివృద్ధికి మూలములుగావునను, అట్లు చేయనిచో జనులకు గొప్ప యాపద తటస్థించును గావునను మన ప్రార్థనల నంగీకరింపుఁడని పై యధికారులఁ గోరవలసియున్నది. వారు దాని కంగీకరింపనియెడల మన యధీనములోనున్న పాఠశాలలయందట్టి పఠనము నిర్బంధముగఁ జేయవలయును. ఇంకొక సంగతిచెప్పి విరమించెద. మన భాషాభివృద్ధికై యనేక కష్టముల కోర్చి వేయివిధములఁ బాటుపడుచున్న జయంతి - రామయ్య పంతులుగారి ఋణము మనము తీర్చుకొనుట దుర్లభము. ఈ పరిషత్స్థాపనకుఁగూడ వీరే ముఖ్యులుగనుండి పనిచేసిరి. ఈ రెండు కారణములఁబట్టి వీరి కాంధ్రప్రపంచ మంతయుఁ జెప్పనలవికానంత కృతజ్ఞతతో వందనములర్పింపవలసియున్నది. మహాజనులారా! నన్నిదివఱకు రెండవసారి పరిషదధ్యక్షునిగ నెన్నికొని గౌరవించి మీ ప్రేమను జూపినందుల కివె యనేక వందనములర్పించుచున్నాను. ఈ యాంధ్రపరిషత్తునకు జయమును జిరస్థాయిత్వమును బ్రసాదించుటకు భగ వంతునిఁ బ్రార్థించుచు మీ సెలవుగైకొని నేనిదె యధ్యక్షపదవిని వదలుకొను చున్నాను."

తదనంతరము, ఇంటర్ మీడియేటు, బి. ఏ., పరీక్షలకుఁ జదువు విద్యార్థులు దేశభాషాగ్రంథములు విధిగఁబఠింప నక్కఱలేదని యూనివర్సిటీ సినేటువారు చేసినతీర్మానము సరిగాలేదని తీరుమానించుటకై చర్చజరిగెను. దానిని మ-రా-రా-శ్రీ, వావిలాల - శివావధానులవారు యుక్తియుక్తముగ నుపపాదించిరి. ఈదేశమువారీదేశభాషలు చదువఁబనిలేదనియు నవ్యభాషలు

విధిగఁ జదువవలయుననియు అన్యదేశజులు సూచించుటయు మనవారు కొందఱు కారణాంతరములచే వారితోఁగలిసి వాదించుటయుఁ జాలవిషాదకర మైన విషయమనియు, దేశభాషాగ్రంథపఠనమువలదను వాదము నామో దించినవారు గ్రామ్యవాదులే యగుటచే వారి భాషాభిమానమెట్టిదో యెఱుక పడెననియు, భాషా గ్రంథపఠనము మన బాలురకవశ్యమనియు నుపన్యసించిరి. దీనిని మ-రా-రా-శ్రీ, పప్పు - సీతారామయ్య పంతులుగారు సముచితగతి బలపఱచిరి. ఈ తీరుమానము నేకగ్రీవముగ నెల్లరామోదించిరి.

పిమ్మట బ్ర॥ శ్రీ, వేదమూర్తులయిన మల్లాది సూర్యనారాయణ శాస్త్రిల వారు శృంగారరసమునుగుఱించి యొక యుపన్యాసము చదివిరి.

ఆపిమ్మట మ-రా-రా-శ్రీ,కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు ప్రకృతమున మన దేశమందుఁ బ్రకృతిశాస్త్రజ్ఞాన వ్యాప్తి మిక్కిలి యవశ్యముగనున్నదనిచక్కని వ్యాసమొకటి చదివిరి.

తరువాత బ్ర॥ శ్రీ, మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులవారిట్లుపన్యసించిరి.

“ ఈ యాంధ్రసాహిత్యపరిషత్తు మొట్టమొదటఁ జెన్నపురియందు జనిం చెను. మొదటిసంవత్సరోత్సవ మందే జరుగఁగా నీరెండవ సంవత్సరోత్సవ మీ రాజమహేంద్రవరములో జరుపఁబడుచున్నది. ఇందువల్ల నీసభకుం బ్రధానులైన బ్ర॥ శ్రీ॥ మహారాజశ్రీ, జయంతి రామయ్యపంతులు బి. ఎ., బి. ఎల్., గారును, మఱి వీరితోఁజేరిన యీ పరిషత్తు సభ్యులును సమధికాంధ్రభాషాభిమానుల నియు, సదౌచిత్యవిశారదులనియుం బ్రశంసింపఁబడుచున్నారు. ఎందువల్లననఁగా, నీపురవరము సామాన్యమయినదికాదు. ఆంధ్రభాషాయోషకు జన్మస్థానము. శ్రీమదాంధ్రభాషకు జనకులును శ్రీమత్సకలభాషావాగనుశాసనబిరుదాంచితు లును శ్రీమహాభారతాంధ్రీకరణ పరిణతులునునైన శ్రీమన్నన్నయభట్టారకులవారి కావాసస్థానము. ఇది యిపుడు రాజధానిగాకున్నను, ఆంధ్రదేశమునకు రాజ ధానియనియె యెన్నఁదగియున్నది. ఇట్టిచోట మునుపటివలె నాంధ్రభాషాసా

హిత్య పరిషత్తుకూడుట కరమొప్పియున్నది. శ్రీమచ్ఛబ్దానుశాసనుఁడక్కినను సంచియే యిదివఱకు నిప్పుడునున్న కవులనేకు లనేకగ్రంథములఁబద్యగద్యాత్మకములుగా రచియించిరి. రచియించుచున్నారు. మఱియు రచియింపఁగలరు. ఛందోవిషయమున గణయతిప్రాస నియమమత్యావశ్యకమని గ్రహించి, పద్యకావ్యములఁ జేయుచున్నారు. మఱి పూర్వమందు లేనినాటకంబులనిపుడు వర్ణించుచున్నారు. ఇట్లుండనీకాలమునఁ గొందఱు నవనాగరకులు యతిగణప్రాసములక్కఱలేదనియు, భాషా సౌలభ్యము, పాత్రోచిత భాష యనునెపమున గద్యకావ్యములందు వ్యాకరణ మనావశ్యకమనియుఁ దుదకుసంధిబంధము వ్వలదనియును, వాదింపసాగిరి. మఱి వ్రాయసాగిరి. ఇద్దిచూడ, నాంధ్ర భాషకు వినాశకాలమేమోయని గోచరించుచున్నది. "వినాశకాలేవిపరీతబుద్ధి" యనుటసుప్రసిద్ధమే కదా! కర్ణాటకభాషలోఁ బద్యములందు యతిలేదు. అందువల్ల నాభాషలోనే "కన్నడక్కె యతి యిల్ల, కోణక్కె మతియిల్ల" (అనఁగా కన్నడమునకు యతిలేదు. దున్నపోతునకు మతిలేదు.) అని యందే యొకసామెతకలిగెను. అఱవమునందు యతియునుఁ బ్రాసమునుగలవుగాని, ప్రాసమునందు నొక్కవర్ణమే యుండవలయునను నియమము లేదు. ఒక వర్గమునందు ననునాసికము తప్పఁదక్కిన వర్ణములలో నేదిగాని ప్రాసమునకుఁ జెల్లును. ఇందువల్ల విపరీతార్థములెన్నియేని యా భాషయందేపుట్టుచున్నవి. ఎట్టులన్న ? కాంచీపురమునందునొకభిక్షుకుఁడు భిక్షార్థియై సంచరించుచు "కంచివరదప్పా" యనెను, కంచివరదప్పా (కంచివరదరాజస్వామీ) యనియర్థము. తరువాత వానివెనుక నరుగుచున్న మఱియొకభిక్షుకుఁడు "కంచివరదప్పా," గంజివచ్చునప్పాయని యర్థముచేసికొని "యెంగెడా అప్పా" గంజియెక్కడవచ్చునప్పాయని యడిగెనట! కాఁబట్టి ప్రాసాక్షరమొకటిగానుండక, ఒకవర్గములోని నాలుగక్షరములలో నేదిగానియుండవచ్చునన్న నియము చేత నాయఱవవారికె యర్థసందేహము గలుగుచున్నది. అట్టియిక్కట్టులు మనయాంధ్రులకు లేవుకదా ? ఇట్లుండ "వర్ణాద్యమనంతరాక్షరంప్రాసః" "ప్రాసస్సర్వత్రచైక ఏవస్యాత్" అనునియమములఁగలిగి "దేశభాషలందుఁదెలుఁగు లెస్స" అని ఘనతఁగాంచిన మన

యాంధ్రభాషయందు యతిప్రాసముల మాననౌనా? ఇది యటుండ, సంస్కృతభాషయందు గణనియమము గలిగియు నౌపజాతిక వృత్తములయందు గణనియమముంగూడ వదలుట తటస్థించెను. మనలో నట్లు లేదుకదా? ఇట్లుండుట చేత సంస్కృత కర్ణాట ద్రావిడ భాషలకంటె మిన్నయని యెన్నఁదగినదియు, శ్రీమ త్తిక్కన సోమయాజి ప్రముఖ మహాపండిత కవిశూరులుగల మన తెనుంగు భాషయందు గణయతిప్రాసనియమముల మానవౌనా? మానఁగూడదు. సామాన్యముగా సామెతలుగూడ యతిప్రాసములతోడఁ గూడుకొనియున్నవి. ఉక్తనియమానుసారముగాఁ బద్యకవిత్వము చెప్పఁజాలనివారు వ్యాకరణ సిద్ధముగా గద్యకావ్యముల వ్రాయవచ్చును. అంతేకాని వ్యాకరణవిరుద్ధముగా గ్రంథముల వ్రాయఁజనదు. వ్యాకరణములేని భాషలవారు తమ భాషలకు వ్యాకరణముండవలయునని కోరుచుండఁగా, నున్నవారు దానిం బోఁగొట్టుకొనుట ధర్మమా? ఐన నదేమోకాని, మనపండితులు భాషావిషయమునఁ గేవలమనాదరము గలవారుగానున్నారని చెప్పవలసినందులకు నెంతయుఁ జింతిల్లవలసియున్నది. వారు వ్యవహారసౌలభ్యార్థముగా మేము గ్రామ్యమునే సంభాషించుచున్నామని చెప్పుదురు. ఇది సామాన్యముగా నన్యులతోనైనప్పు డొప్పవచ్చును. పండితులు పండితులతో భాషించునప్పుడును దమవిద్యార్థులకుబోధించునప్పుడును సలక్షణభాషను భాషింపవచ్చుఁగదా? అటులైన సముచితముగానుండును. అట్లుగాకెల్లప్పుడేకరీతిగా వ్యాకరణవిరుద్ధమయిన గ్రామ్యభాషనే భాషించుట యయుక్తముగాదా? ఇట్లున్న సలక్షణభాష యెట్లు వర్ధిల్లును? కాఁబట్టి మొట్టమొదటఁ బండితులు కృతకృత్యులు కావలయును. పిమ్మట విద్యార్థులు నట్లే కాఁగలరు. శ్లో॥ "బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవస్స్మయదూషితాః। అబోధోపహతాశ్చాన్యే జీర్ణమంగే సుభాషితమ్" అనునట్లిప్పుడొక విషముప్పతిల్లె. చెప్పవచ్చునా? పండితులకుం గవులకుం బరస్పర మీర్ష్యాసూయలు వర్ధిల్లె. అయ్యో! కష్టపడి గురుముఖమున నేదో యొక శాస్త్రము నభ్యసించినవారా శాస్త్రమునం బండితులగుదురు. కవులో యట్టి కష్టమేమియు లేకయే కేవలదే

వతానుగ్రహముచేతను, అభ్యాసాధిక్యముననుఁ గావ్యకర్తలవుదురు. కావునఁ బం డితులు వేఱు. కవులువేఱు. ఆరయఁగా నీయిరుదెగలవారును బూజ్యులే. పాం డిత్యమును గవిత్వమును నీ రెండుంగలవారు పూజ్యతరులు. వీరు సర్వోత్తముల నుట సార్వజనీనము. కాన న్వీ రొండొరులతో ద్వేషింపక కలసి మెలసియుండుట యందఱకు నపేక్షణీయము. ఇక్కడికీ ప్రసంగము ముఁగింపపచ్చును. ముఖ్యాంశ మింకొక్కటిగలదు. అదేమనఁ, గావ్యకర్తలు గ్రామ్యభాషం బొత్తిగఁ ద్యజించి గ్రాంథికభాషనే తమ గ్రంథములందు వాడవలయును. ఈనియమమును గాపాడు టచేతనే యీ యాంధ్రసాహిత్య పరిషత్తు సార్థకాభిధానసనాథమగుచు వర్ధిల్లవ లయునని యభ్యర్థింపఁబడుచున్నది. మనల నందఱం దద్దయుదయతో నేలు శ్రీ జార్జి చక్రవర్తిగారు సదయులగుచు సర్వసుఖములనందుచుండ వలయునని మన మందఱమును భగవంతుం బ్రార్థించుచున్నాము."

మఱునాఁడుదయమున శ్రీ పిఠాపురము రాజుగారి పెద్ద బంగాళాలోఁ బరిషత్సభ్యులుకూడి వర్తమాన సంవత్సరాదాయవ్యయ నిర్ణయమును, కర్తవ్య విధాన నిశ్చయమును జేసిరి. ఈ సంవత్సరమునకు శ్రీ వేంకటగిరి మహారా జుగారు సభాపతిగానుండునట్లును, కార్యదర్శిత్వమును వదలఁగొనిన వేదము వేంటరాయ శాస్త్రిలుగారికి బదులు నెమలి-పట్టాభిరామరావుగారు కార్యదర్శి గానుండునట్లును నిర్ణయమయినది. చందాధనములో రూ. 15,000లు మూలధ నముగా నుంచవలసినట్లును, పరిషత్తునకొక్కమాఱే యొక్కొక్క రూపాయ వంతున నిచ్చినవారు పరిషదామోదకులుగా గ్రహింపఁబడవలసినట్లును, వర్త మాన సంవత్సరమునఁగూడ లిఖిత ముద్రితగ్రథసంపాదనము చేయవలసినట్లును, కొన్ని యముద్రితగ్రంథముల నీసంవత్సరము ముద్రింపవలసినట్లును, గతసంవత్సర కృతకార్యశేషమీసంవత్సరము జరుగవలసినట్లును నిర్ణయింపఁబడినది. మఱియుఁ గడచిన డిసంబరుమాసమున మనరాజప్రతినిధియగు హార్డింజ్ ప్రభువుగారు ధర్మ పత్నీసహితముగా ఢిల్లీపురప్రవేశమొనర్చునపుడు దుర్మార్గులెవరో వారికిఁ బ్రా ణహానిచేయఁదలంచి యొనర్చిన ప్రయత్నమును సభ్యులేకగ్రీవముగా గర్హించిరి

ఆ మధ్యాహ్నము మరల రెండుగంటలకు మహాసభ పూర్వదినము చేరిన భవనమందే సమకూడెను. ఈసభకు గౌరవ నీయులగు మ-రా-రా-శ్రీ, పానుగంటి రామారాయనింగారు, ఎం. ఏ., అగ్రాసనాధిపతిగానుండిరి. తొలిదినమువచ్చినవారుగాక రావుబహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తిగారు, రావుబహద్దరు రఘుపతి వేంకటరత్నమునాయఁడుగారు,నాళం పద్మనాభముగారు మొదలగు సంపన్నులుకొందఱు వచ్చిరి. ఈదినమొక గొప్పవిషయము చర్చింపఁబడెను. అది యేదియనఁగా ఇంటరుమీడియేటు పరీక్షకుఁ జదువు విద్యార్థులు వ్యాసలేఖనమం దవలంబింపవలసిన శైలివిధము నిర్ధారించుటకు సిండికేటువారొక యుపసభ నేర్పఱిచిరి. ఇందు నలువురు గ్రామ్యవాదులు నలువు రగ్రామ్యవాదులు నియమింపఁబడిరి. గ్రామ్యవాదులసంఖ్యయే వ్రేళ్ల నెన్నఁదగియున్నది. అట్లుండ నల్పసంఖ్యగలవారిపక్షమున నలువురిని, దక్షిణ యాంధ్రదేశమంతకుఁగాను నలుగురిని నియమించుట యన్యాయమని దానిని సవరింపవలసినట్టు విశ్వవిద్యాలయవిచారణాధికారులఁ గోరవలయునని మ-రా-శ్రీ, తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారుపపాదించిరి. మ-రా-రా-శ్రీ, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు దానిని బలపఱిచిరి. అనకాపల్లినుండి వచ్చిన మ-రా-రా-శ్రీ, బులుసు పాపయ్యశాస్త్రిగారీ తీర్మానము నాదరింపవలసిన పనిలేదనియు, గుణాగుణములు బలాబలములు వాదమునందుండునుగాని సంఖ్యయందుండవనియుఁ జెప్పిరి. బ్ర॥ శ్రీ, తాడూరి లక్ష్మీనరసింహరావుగారు గ్రాంథికభాషాభిమానులయ్యు నీ తీర్మానమిపుడనావశ్యకమనిరి. శ్రుతిమించి రాగమునఁబడ్డట్టు లీవాదమటుపోయి యిటుపోయి గ్రామ్యభాషయాదరణీయమా, యనాదరణీయమా యనుచర్చలోఁబరిణమించెను. గ్రామ్యముకూడదని బ్ర॥ శ్రీ, దివాకర్ల తిరుపతిశాస్త్రులవారును, వడ్డాది సుబ్బారాయఁడుగారును, కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారును, కల్లూరి వేంకటరామశాస్త్రిగారును, ఉమ్రే అలీషాగారును యుక్తియుక్తముగను, నిజమైనభాషాభిమానముతోను నుపన్యసించిరి. ఉమ్రేఅలీషాగారివాగ్ధాటి ఝరీవేగవంతమై వీరావేశముతోఁగూడియుండెను. గ్రామ్యభాషాపక్షమున బ్ర॥ శ్రీ, రావుసాహేబ్ గిడుగు రామమూర్తిగారు వారి వాడుకప్రకారము వీరావేశముతోఁ బ్రసంగిం

చిరి. వారి యుక్తులనన్నిటిని మ-రా-రా-శ్రీ, జయంతి రామయ్యపంతులుగారు యుక్తియుక్తముగను సప్రమాణముగను ఖండించిరి.

తరువాత దివాన్‌బహద్దర్ ముట్నూరి ఆదినారాయణయ్యగారు లేచి విద్యాధికారు లేర్పఱచియుండు సభ సమంజసరీతి లేకుండుట నిక్కమనియు, సిండికేటులోఁ దెనుఁగక్షర మెట్టిదో తెలిసినవారెవ్వరు లేనికారణముచేతను వారితీర్మాన మీప్రక్క నెందఱు చెప్పినారు, ఆప్రక్క నెందఱు చెప్పినారని సంఖ్య నెన్నుటచేతనే చేయఁబడియుండుటచేతను, ఇప్పటి సభ చక్కఁగ లేదని దానిని సవరించుటయావశ్యకమనియుఁ జెప్పి యాంధ్రము రానివారిఁ దొలఁగించి విద్యావంతుల నెక్కువగ వేయఁగోరుట బాగని తీర్మానమును గొంచెము సవరించిరి. ఈసవరణను అయ్యదేవర కాళేశ్వరరావుగారు బలపఱచిరి. పిమ్మట సభాధ్యక్షులు తీరుమానముపై సభ్యులయభిప్రాయముఁ దెలుపఁగోరఁగా వెయ్యిమందిలో నిరువురు దప్పఁ దక్కిన యందఱు సవరణ కాఁబడిన తీర్మానమునంగీకరించిరి. ఈచర్య ముగియునప్పటికి ౫ గంటలాయెను.

తర్వాత జయంతి రామయ్యగారు మాతృభాషాసేవ యవశ్యకర్తవ్యమని యుక్తియుక్తముగ సాధించుచు నొక వ్యాసమును జదివిరి. తరువాత తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు ఆంధ్రనాటకములవిషయమున నొక వ్యాసమును వ్రాసికొనివచ్చిరి, కాని దానినంతయుఁ జదువ నవకాశము లేదని సారాంశము నుపన్యసించిరి. తుదకు మ-రా-రా-శ్రీ, పానుగంటి నరసింహారావుగారినాటకములు వర్తమానకాలమునఁ బయలుదేరుచున్న నాటకములలో నుత్తమనాటకములనివచించిరి. తరువాత కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారు శ్లేషాలంకార ప్రాశస్త్యమునుగుఱించి యుక్తియుక్తముగ దృష్టాంతపూర్వకముగ రవివర్మపటముల యందలి చిత్రశ్లేషఁగనఁబఱచి వసుచరిత్రయందలి శ్లేషయుత్తమోత్తమమని కొనియాడిరి. ఇప్పటికే చాలఁ ప్రొద్దుపోవుటచేఁ దక్కిన వ్యాసములు చదువవలనుపడదయ్యె. తరువాత నగ్రాసనాధిపతిగారు సభయందుఁ జర్చింపఁబడిన యన్నివిషయములంగూర్చి తమయభిప్రాయము సమంజసోక్తులవక్కాణించిరి.

పిఠాపురము రాజుగారికిని సభవిషయమై శ్రమవహించి పనిచేసిన పిన్న పెద్దలకును అభివాదనములతోను జయజయధ్వానులతోను సభముగిసెను.

సభాంతమున రావుబహాద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తిగారును నాళం పద్మనాభముగారును రాఁగల సంవత్సర మీసభ కాకినాడలోఁ గావింప వలసినదని యాహ్వానముచేసిరి. సభ యన్నివిధముల జయప్రదముగా జరిగినది. భాషాభిమానము పొంగి పొరలినదన్న నతిశయోక్తికాదు.

సభాంతమున తిరుపతిశాస్త్రిలుగారు, రామకృష్ణకవులు, మంగిపూడి వేంకటశర్మగారు, వేంకటపార్వతీశ్వరకవులు పద్యములు చదివిరి. కొన్నిపద్యము లీ దిగువ నుదాహరింపఁబడుచున్నవి.

సీ॥ కాలవైషమ్యముల్ • కారణంబులుగాఁగ భూరిప్రదోషముల్ • పొంగిపొరలఁ
దదనుగుణంబుగాఁ • దప్పుదారులఁబట్టి దుడుకున ధాతువుల్ • తడఁబడంగఁ
దదనుసారంబుగా • దారుణగతిఁజిక్కి క్రమమటి సంధిబం • ధములుచెదరఁ
దన్మూలకంబుగాఁ • దగులంబు నెడఁబాసి తలకెక్కి ప్రాణముల్ • తల్లడిల్ల

గీ॥ నతిభయదదుష్టసన్నిపా • తార్తివలన
నాంధ్రభారతి రూపుమా • యంగ నుండ
భవ్యదివ్యౌషధమునఁ గా • పాడుకొనుఁడు
పండితమహాభిషఙ్మణి • ప్రవరులార.

సీ॥ ఫలపుష్పభరితకో • మలవనంబును గొట్టి పెనుగాలి చీకాకు • పెట్టి నట్లు
శ్యామసుందరసస్య • సంతానమును బట్టి మిడుతగుంపడఁగింపఁ • దొడఁగినట్లు
సమ్మదాకలితప్ర • జాసంఘమునఁ బుట్టి విషవిశూచి కలంత • వెట్టి నట్లు
సంపత్సమృద్ధభూ • జనపదంబుల ముట్టి యేటివెల్లువ ముంప • నెగసి నట్లు

గీ॥ సదమలాంధ్రభాషాక్షీర • సాగరమున
గ్రామ్యహాలాహలము క్రమ్మి • కలఁచుచుండెఁ

దన్ని వారణోపాయంబుఁ • దలఁపుఁడయ్య
మహితమతులార కవిరాజ • మౌళులార.

సీ॥ సరిలేని దేశభా • షాపోషణంబునఁ బ్రథితాత్ము లగు మహీ • పాలురార
సకలభాషాప్రపం • చవిమర్శనంబున నెన్నికగన్న బు • ధేంద్రులార
మహితప్రబంధని • ర్మాణకౌశలమునఁ బ్రౌఢిఁ గాంచిన కవి • బ్రహ్మలార
అనయంబు సరసకా • వ్యరసామృతంబును జవిగాంచు పాఠక • ప్రవరులార

ఆ॥ మహితకీర్తులార • మహి ''సంఘశక్తిఃక
లౌయుగే'' యఁటన్న • లలితసూక్తి
నరసి యంద ఱొక్క • రై పాటులకు నోర్చి
మాతృభాష నెట్లొ • మనుపుఁడయ్య.

గీ॥ పండితులచేత సత్కవి • వరులచేత
సంఘములచేత నీరీతి • సభలచేత
నాంధ్రభాషాప్రపంచక • మన్ని యెడల
నీతిబాధలవిడనాడి • యెసఁగుఁగాత.

వేంకటపార్వతీశ్వరకవులు.

సీ॥ అష్టభావలకు వా • గనుశాసనుండైన నన్నయకవి పెంచి • నాఁడుమున్ను
ప్రేమానుబంధంబు • తోముద్దుముచ్చటల్ తిక్కనకవి మున్ను • తీర్చినాఁడు
పరువుగాఁబల్లకీ • పై సర్వదేశముల్ శ్రీనాథకవి మున్ను • త్రిప్పినాఁడు
లలితశయ్యారసా • లంకారవస్తువుల్ పెద్దన్నగారు • పంపించినారు

గీ॥ ఆంధ్రభాషావధూటికో • యార్యులార
యిచ్చవచ్చినయట్లుమీ • నచ్చినట్లు
నగలు నాణెంబులునుబెట్టఁ • దగునుగాని
సూత్రములు త్రెంపకుం డాంధ్ర • శూరులార.

మ॥ స్మయమానాంధ్రమయప్రసిద్ధకవితా • సామ్రాజ్యపట్టంబు న
న్నయ కర్పించిన నీపయఃప్రస్మృతి కీ • నాఁడాంధ్రసాహిత్యవా
ఙ్మయవల్లీతతి నాంధ్రలోకహృదయా • వాలస్థితం బెంచి భ
వ్యయశోభాతులు గూర్చు టొక్క విషయం • బౌతల్లిగోదావరీ.

సీ॥ చినిఁగిపోయిన ప్రాఁత • చీర కట్టక పట్టుకోక లేటి కఁటంచుఁ • గోరు వారు
ముసుఁగువేసి విభూతి • నొసటిపై వ్రాయక సింగార మేలంచుఁ • జెప్పు వారు
ఇష్టమైనట్టు లూ • రేగింప కేటి కీ పదసౌష్ఠవం బంచుఁ • బలుకు వారు
పదిసువర్ణములు సం • పాదింపఁ జాలక కై సేత లేలంచుఁ • గనలు వారు

గీ॥ నీ స్వరూపమ్ము నీమత • నియమవిధులు
పాడుసేయక యుండఁ గా • పాడుఁగాత
మాంధ్రసాహిత్యపరిషద • మహరహంబు
సరసగుణపేటి యాంధ్రభా • షావధూటి.

శతావధాని దివాకర్ల తిరుపతిశాస్త్రి.

Hoe & Co., Madras.

# ప్ర క ట న.

## ఆంధ్రసాహిత్య పరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు:—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజా రావు కుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజా సర్ వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ. ఇ., పంచహజారీమన్సబ్దార్.

అగ్రాసనాధిపతి:—

శ్రీవేంకటగిరి రాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. బి. ఏ., బి. ఎల్.

కార్యదర్శులు.

మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

,, ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి., సి. ఎమ్.,

,, దివాన్ బహద్దర్ నెమలి పట్టాభిరామారావు పంతులుగారు బి, ఏ.

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.,

ది ఆనరబిల్ రావుబహదూర్ పిట్టి త్యాగరాయసెట్టిగారు, బి. ఏ.

కా ర్య స్థా న ము.

**192,** ఎస్ప్లనేడు. చెన్నపురి.

చందానిర్ణయము.

పరిషదుద్దేశము:— ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగుభాష కితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించులక్షణశాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును ప్రమాణపూర్వకముగా నిరూపించుట, శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్యమొనర్చుట, భాషావిషయములఁ జర్చించుటకుఁ బత్రికనొకదానిని బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాదివిధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట,పరిషత్తుయొక్కయుద్దేశము.

| | | | |
|---|---|---|---|
| 1. | ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. | పోషకులకు | ,, | 1000. |
| 3. | యావజ్జీవసభ్యులకు | ,, | 100. |
| 4. | సాధారణసభ్యులకు సంవత్సరమునకు | ,, | 6. |

పరిషత్సభ్యులు పత్రికకు వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేర వ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

# ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల.

## నిడదవ్రోలు, కృష్ణాజిల్లా.

ఇందు చక్కని క్యాలికోబైండుగల నవలలు రెండుమాసముల కొక్కటిగా వెలువడును. ఈ నవలలు చరిత్రబోధకములును మనోహరకథాకల్పితములునై చదువరుల హృదయముల నాకర్షించుచుండును. ఈనవలలనుగూర్చియు, ప్రస్తుతకాలమున నాంధ్రభాషాభివృద్ధికి నవలలయొక్కయవసరమును గూర్చియు, ననేకు లనేకాభిప్రాయముల నిచ్చియున్నారు. ఆంధ్రభాషాభివృద్ధికీ నవలలు ప్రథమసోపానములని చెప్పవచ్చును. ఇందు శాశ్వతచందాదారులుగా చేరువారికి మంచి కాలికోబైండుచేయఁబడిన నవలలు డెమ్మీసైజున 100 పేజీలకు రు 0—6—0 చొ॥ వెలయేర్పఱచి వి. పి. గాఁ బంపుచుందుము. ఇతరులకు పోస్టేజిగాక 100 పేజీలకు రు 0—8—0 చొ॥ నిచ్చెదము.

ఏనవలయైనను ఒకరూపాయి వెలకు మించియుండదు.

చందాదారులుగా చేరువారు 0—2—0 అడ్మిషనుఫీజు నీయవలెను.

### ఈ గ్రంథమాలిక నుండి వెలువడిన నవలలు.

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| 1. దుర్గేశనందని. 231 పేజీలు | 0—12—0 | 1—0—0 |
| 2. వసుమతీవసంతము. 300 | 1— 0—0 | 1—8—0 |
| 3. లలితచంద్రహాసము. 166 పేజీలు | 0—10—0 | 0—14—0 |
| 4. మృణ్మయి. 256 పేజీలు | 1— 0—0 | 1—5—0 |
| 5. సీతారామ. 320 పేజీలు | 1— 0—0 | 1—8—0 |
| 6. నూర్జహాను. 340 పేజీలు | 1— 0—0 | 1—8—0 |
| 7. రాజసింహ. 280 పేజీలు | 1— 0—0 | 1—8—0 |
| 8. మాధవీలత 260 పేజీలు | 1— 0—0 | 1—5—0 |
| 9. మృణాళిని 247 పేజీలు | 1— 0—0 | 1—5—0 |
| 10. మనోరమ 255 పేజీలు | 1— 0—0 | 1—5—0 |

### అనుబంధ గ్రంథములు.

1. రాధారాణి 0—4—0
2. యుగళాంగుళీయకము 0—3—0
3. రాజభక్తి 0—2—0
4. లీల 0—4—0
5. దుర్గేశనందని విమర్శనము 0—3—0
6. మాలతి
7. ప్రభావతి
8. సాధన
9. కమలాకాంతుఁడు
10. హారావళి
11. కోహినూరు
12. నీరద
13. పరిమళ
14. అమృతపులినము
15. సీతావనవాసము
16. లలిత
17. ఉన్మాదిని

వలయువారు:—

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము
నిడదవోలు, కృష్ణాజిల్లా.

# విజ్ఞానచంద్రికాగ్రంథమాల

ఆంధ్రులపౌరుషము! ఆంధ్రులయౌన్నత్యము!! ఆంధ్రులబుద్ధివైభవము!!!

# ఆంధ్రులచరిత్రము.

## రెండవభాగము

ఇందు క్రీ. శ 1100 నుండి 1350 వరకుఁగల ఆంధ్రదేశచరిత్ర వర్ణింపఁబడినది.

పురాణములు, కావ్యములు, శాసనములు, విదేశీయుల వ్రాఁతలు, మొదలగువాని నన్నింటిని శోధించి తెలుఁగుచోడులు, నాగవంశోద్భవులైన మహారాజులు, కాకతీయచక్రవర్తులు, పల్నాటివీరులు, కమ్మవారు, రెడ్లు, వెలమలు మొదలగువారి చరిత్రలు, ఈ యుద్గ్రంథమునందు క్రోడీకరింపఁబడినవి.

రామానుజుఁడు, బసవేశ్వరుఁడు, నన్నెచోడ కవిశిఖామణి, ఖడ్గతిక్కన, కవితిక్కన, గణపతిదేవచక్రవర్తి, ప్రతాపరుద్రమహారాజు, మహారాణి రుద్రమదేవి, మొదలగువారల పవిత్రజీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఆయాకాలమందలి సాంఘిక, రాజకీయస్థితులు చక్కఁగ వివరింపఁబడినవి. ప్రదేశములయొక్కయు, కట్టడములయొక్కయు, పటములుకలవు.

పౌరుషమునందును, పాండిత్యాతిశయంబునందును రాష్ట్రపాలనయందును ఆంధ్రులు హిందూదేశములోని యితరదేశములవారికి తీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది.

ఇట్టిగ్రంథము తెలుఁగులోఁగాని మఱియే యన్యభాషలోఁగాని యెవ్వరును రచించియుండలేదు.

విఖ్యాతలేఖకులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారిచే నిది రచింపఁబడినది. 400 పేజీలుగలిగి మంచికాగితములమీఁద చిన్న యక్షరములతో ముద్రింపఁబడి చక్కని క్యాలికో బైండు చేయఁబడిన యీయమూల్యగ్రంథము మాచందాదారులకు పోస్టేజితో రు 1-0-0 కును, చందాదారులు కానివారలకు పోస్టేజిగాక రు 1-8-0 లకును ఇయ్యఁబడును.

☞ విజ్ఞానచంద్రికా బుక్కుడిపో యందు సంస్కృతాంధ్రగ్రంథము లనేకములు దొరకును. వలయువారికి క్యాటలాగులు పంపఁబడును.

చిరునామా:—

ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం.

మేనేజరు.—విజ్ఞానచంద్రిక,

చింతాద్రిపేట.—మద్రాసు.

# గ్రంథములు!

| | రు. అ. పై. |
|---|---|
| 1. పల్నాటి వీరచరిత్రము ... ... ... | 1—0—0 |
| మహాకవి (శ్రీనాథవిరచితము. విపులోపోద్ఘాత సహితము.) క్యాలికో. | 1—4—0 |
| 2. టిప్పుసుల్తాన్ ... ... ... | 0-12-0 |
| (నవల. విపులోపోద్ఘాతసహితము. గ్రంథకర్త అక్కిరాజు ఉమాకాంతం.) క్యాలికో. | 1—4—0 |
| 3. అరవ దేశమునందలి యాంధ్రవాఙ్మయము ... | 0—4—0 |
| 4. శ్రుతిరంజని.—గీత గోవిందవ్యాఖ్యానమునకు వసుచరిత్ర కృతిపతికినిఁ గల సంబంధమును, అప్పటి విజయనగర రాజ్యవ్యవస్థయుఁ దెలియఁజేయును. వాఙ్మయమునకును జరిత్రమును సంబంధించిన యొకచర్చ. కడపటి రెండు పుస్తకములు పైగ్రంథకర్తచేతనే రచింపఁబడినవి. | 0—2—0 |

వలయువారు:—

అక్కిరాజు ఉమాకాంతం.

మేనేజరు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు,

192, ఎస్ప్లనేడు, చెన్నపురి.

అని వ్రాయవలయును.

చందా సం॥ కు రూ. ౩.                    విడిసంచిక అ. ౮.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౧౭. { దుందుభినామసంవత్సరము. జ్యేష్ఠ—భాద్రపదమాసములు. } సంచిక ౨-౩.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి. ౧౯౨౩.

# విషయసూచిక.

శ్రీరస్తు.


# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౧. { దుందుభినామసంవత్సరము. జ్యేష్ఠ—భాద్రపదమాసములు. } సంచిక ౨, ౩.


శ్రీరస్తు.

## ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభావృత్తాంతము.

ఆ ౧౯౨౨ సంవత్సరము సెప్టెంబరునెల ది ౨, ౩ తేదులు, శనివారము, ఆదివారములయందుఁ బరిషదేకాదశవార్షికసభ గోదావరిమండలములోని పిఠాపురములో శ్రీమహారాజావారికోటలో నడచినది. పరిషత్తును దమరాజధానికాహ్వానించిన శ్రీమహారాజావారి కనారోగ్యముగానుండి చెన్నపురమునందు వసించుటవలనను, వేసవి యత్యధికముగాఁ దీర్చుటవలనను జైత్రవైశాఖములలో జరగవలసిన యీసభ భాద్రపదమాసమున జరగినది. విశేషదినములు సెలవులు లేనికారణమున నున్నరెండుదినములలోనైననుఁ బాఠశాలలవారికే గాని యితరోద్యోగములవారికి శనివారముపయోగపడనిహేతువున, దూరమునందున్న భాషాభిమానులగునుద్యోగులు పెక్కురు రాలేదు. కాని వచ్చినవారిలో సభకుఁ జాలినంతమంది యుండిరి. శ్రీమహారాజావారు స్వాగతసంఘాధ్యక్షులుగా నుండిరి. రైలుస్టేషనున కతిసమీపముననున్న మహారాజావారి ఆర్. సి. హెచ్. హైస్కూలుభవనములో స్థలాంతరములనుండి వచ్చినవారికి బసలును భోజనసదుపాయములును గావింపఁబడినవి. కోటలో మొదటిభూమికపై సభ గావింపఁబడినది.

— సభకువచ్చిన కొందఱ నామములు. —

మ-రా-రా-శ్రీ, శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు, పిఠాపురం మహారాజాగారు.

" గౌరవనేయులు రాజా శ్రీపానుగంటి రామారాయణంగారు, ఎం. ఏ., చెన్నపురము.

" రాయిసాహేబు గుమ్ముడూరి వేంకటరంగారావుగారు, ఎం.ఏ., చెన్నపురము.

" టి. మురుగేశము పిళ్లెగారు, పెరియకుళము, మధుర.

" గునుపాటి యేనాదిరెడ్డిగారు, కొత్తూరు, నెల్లూరు.

" టి. వి. వెంకన్నయ్యగారు, ఎం. ఏ., బెంగుళూరు, (కర్ణాట సాహిత్యపరిషత్పక్షమున.)

" ఆర్. వేంకటరామసోమయాజిగారు, నైజాముకాలేజి, హైద్రాబాదు.

" అయ్యంకి వేంకటరమణయ్యగారు, బెజవాడ.

" ఉపాధ్యాయుల వేంకటరమణయ్యపంతులుగారు, గుంటూరు.

" శ్రీరాజా వేంకటరంగయ్యప్పారావు బహద్దరుగారు, నూజవీడు.

" శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు, ఉయ్యూరు జమీందారుగారు.

" త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారు, సిద్ధాంతము, గంజాము.

" అడపా వాసుదేవరామానుజులు నాయుఁడుగారు, అల్లాజీపేట, గంజాము.

" ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు, విశాఖపట్టనము.

" నిడదవోలు సుందరముపంతులుగారు, విశాఖపట్టనము.

" బుఱ్ఱా శేషగిరిరావుపంతులుగారు, ఎం. ఏ., విజయనగరము.

" మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము.

" కవిరాజు శ్రీవత్సవాయ వేంకటనీలాద్రిరాజాగారు, తుని.

" కేతవరపు వేంకటశాస్త్రిగారు, విశాఖపట్టనము.

" నందగిరి వేంకటప్పారావుగారు, గుడివాడ.

" దామరాజు శోభనాచలముగారు, ఏలూరు.

" కొత్తపల్లి సుందరరామయ్యగారు, ఏలూరు.

మ-రా-రా-శ్రీ, తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు, కొవ్వూరు.
,, S. T. G. వరదాచారిగారు, ఎం,ఏ., కొవ్వూరు.
,, పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, బందరు.
,, విస్సా అప్పారావుగారు, ఎం.ఏ., రాజమహేంద్రవరము.
,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, రాజమహేంద్రవరము.
,, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, రాజమహేంద్రవరము.
,, సముద్రాల వేంకటప్పలాచార్యులుగారు, రాజమహేంద్రము.
,, భావరాజు వేంకటకృష్ణారావుగారు, బి. ఏ., బి. ఎల్., రాజమహేంద్రవరము.
,, వెన్నేటి రామచంద్రరావుగారు, బి.ఏ.,బి,ల్.. రాజమహేంద్రవరము.
,, తాడూరి లక్ష్మీనరసింహారావుగారు, రాజమహేంద్రవరము.
,, ధేరం వేంకటాచలపతిగారు, బి.ఎ., రాజమహేంద్రవరము.
,, దివాన్ బహద్దరు దురిసేటి శేషగిరిరావుపంతులుగారు, బి.ఏ., బి.ఎల్., కాకినాడ.
,, దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు, కాకినాడ.
,, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ.
,, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, కాకినాడ.
,, మోచెర్ల హనుమంతరావుగారు, కాకినాడ.
,, ములుకుట్ల అచ్యుతరామయ్యగారు, కాకినాడ.
,, దర్భా వేంకట శివరామరాసుగారు, బి.ఏ.,బి.ఎల్., కాకినాడ.
,, రవిపత్రికా ప్రకాశకులు, కాకినాడ.
,, ఆంధ్రపత్రికావిలేఖకులు, కాకినాడ.
,, శ్రీరావు అచ్చయ్యరావుగారు, క్రొత్తపల్లి.
,, శ్రీచెలికాని లచ్చారావుగారు, చిత్రాడ.
,, శ్రీచెలికాని ధర్మారావుగారు, చిత్రాడ.
,, శ్రీచెలికాని చినజగన్నాథరావుగారు, చిత్రాడ.
,, జయంతి రామయ్యపంతులుగారు, బి.ఎ.,బి.ఎల్., ముక్తేశ్వరము.
,, పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు, పిఠాపురము.

మ-రా-రా-శ్రీ, పురాణపండా మల్లయ్యశాస్త్రిగారు, పిఠాపురము.
,, పేరి పేరయ్యశాస్త్రిగారు, పిఠాపురము.
,, శతావధానులు ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, పిఠాపురము.
,, కూచి నరసింహంగారు బి. ఏ., పిఠాపురము.
,, శ్రీదామెర సీతారామస్వామిగారు, పిఠాపురము.
,, దేవులపల్లి లక్ష్మీపతిశాస్త్రిగారు, తుని.
,, కోకా వేంకటసుబ్బారావునాయుఁడుగారు, పిఠాపురము.
,, ద్రోణమురాజు రామమూర్తిగారు, పిఠాపురము,
,, దేవులపల్లి వేంకటరామయ్యగారు, బి. ఏ., పిఠాపురము.
,, గొల్లకోట వేంకటరామయ్యగారు, బి. ఏ., పిఠాపురము.

మఱియుఁ బౌరులు ననేకేతరాంధ్రభాషాభిమానులు దయచేసిరి.

ది ౨ సెప్టెంబరు శనివారము ౧౧ గంటలకు సభ ప్రారంభమైనది. మహారాజాగారికి దొరతనమువారు దయచేసిన మహారాజు బిరుదమునకు సభవారెల్లరుఁ దమయానందమును వెల్లడించిరి. బ్రహ్మశ్రీ పేరి పేరయ్యశాస్త్రిగారాశీర్వచనరూపకపద్యములం బఠించిరి. ఆహ్వానసంఘపక్షమున మహారాజావారు స్వాగతోపన్యాసముం జదివిరి. ఆచారప్రకారముగా నధ్యక్షునియెన్నిక జరిగినపిదప మ॥ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగా రధ్యక్షస్థానము నలంకరించి తదభిభాషణవ్యాసమును జదివిరి. గౌరవనేయులు రాజా శ్రీపానుగంటి రామారాయణంగారు ఎం. ఏ, గారు స్వాగతోపన్యాసములో మహారాజావారొనర్చిన శిష్టసభాప్రశంసకుఁ గొంత సమాధానరూపముగఁ దత్పురోవృద్ధిసూచన లగపడఁ బ్రతిభాషించిరి. పిదపఁ బ్ర-శ్రీ. పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి సూత్రభాష్యసంగ్రహము చదువంబడినది. సభకు రాఁజాలమని వ్రాసిన పలువురయుత్తరములుఁ దంత్రీవార్తలుఁ జదువఁబడినవి. మ॥ వెన్నేటి రామచంద్రరావు బి.ఏ., బి.ఎల్. గారు కొన్నిపద్యములం జదివిరి. పిఠాపురసంస్థానకవులు బ్ర॥ ఓలేటి వేంకటరామశాస్త్రిగారు నన్నయభట్టారకాది కవులపైఁ గొన్నిపద్యములను, ఔచిత్యవిషయవ్యాసమును జదివిరి. భావరాజు వేంకటకృష్ణారావు బి.ఏ, బి.ఎల్. గారు ది ౯-వ తేదిని రాజమహేంద్రవరములో నడవఁబోవు నైతిహాసికసభకు రమ్మని సభవారి నాహ్వానించిరి. విశాఖపట్టనము కళాశాలాంధ్రోపాధ్యాయులు బ్ర॥ కేతవరపు వేంకటశాస్త్రిగారు "ఆధునికాంధ్రభాషాపరిస్థితులు", పిఠాపురనివాసులు కూచి నరసింహము బి.ఏ.

గారు "పాఠశాలలలోని తెనుఁగు" అనువ్యాసములం జదివిరి. విజయనగరము మహారాజకళాశాల సంస్కృతపండితులు మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారును, విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారును పారిజాతాపహరణవిమర్శ, హైందవధర్మశాస్త్రములు ననువ్యాసములం జదివిరి.

ఆదివారము (ది 3 సెప్టెంబరు) మధ్యాహ్నము వార్షికసభ కొక్కింత ముందు పరిషత్కార్యనిర్వాహకసభ జరగినది. అందలివిషయము లీపత్రికలో స్థలాంతరమునఁ గనఁబడును.

కార్యక్రమము ననుసరించి చించినాడ వేంకటరత్నశాస్త్రిగారు బెజవాడనుండియు, మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు విజయనగరమునుండియు రానికారణమున వారివ్యాసములు లభింపలేదు. బొబ్బిలి సంస్థానవిద్వాంసులు బ్ర॥ మండలేముల సీతారామశాస్త్రిగారు తామువ్రాసిన "ప్రాచీనకవులుభాషకును దేశమునకును జేసినయుపకారము" లను వ్యాసమును బంపించినందున సభలో దానిని జదివిరి. నిఘంటుకార్య మెట్లుజరుగుచున్నది, యెంతవఱకైనది, దీనిలోని విశేషము లేమి యనువిషయమును స్వల్పకాలములో విపులముగాఁ దత్కార్యాలయ కార్యనిర్వాహకులు శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు వివరించి చెప్పిరి. బ్ర॥ కొమఱ్ఱాజు లక్ష్మణరావు ఎం. ఏ. గారు రానికారణమున నన్నయకుఁ బూర్వపుఁ దెనుఁగు పద్యములు చదువఁబడలేదు. అలంకారములను గూర్చి బ్ర॥ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, నాచన సోమనాథునివిషయము నడకుదుటి వీరరాజుగారు, రామాయణముంగూర్చి పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారువ్యాసములం జదివిరి.

నడుమనడుమ మ॥ బుఱ్ఱా శేషగిరిరావుపంతులుగారు ఎం.ఏ., వీరిపుత్రులును, శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారు, ఉస్మాక నారాయణమూర్తిగారు, శ్రోత్రపల్లి సుందరరామయ్యగారు మొదలగువారు కొన్నిపద్యములం జదివిరి. పద్యములు హృద్యముగానుండుటను జదువునట్టిధోరణి శ్రావ్యముగానుండుటను దొరగారిపద్యములు మరలఁజదువఁగోరి చదివించిరి. పరిషత్పక్షమున జయంతి రామయ్యపంతులుగా రధ్యక్షులను, సమ్మానసంఘమును, స్వచ్ఛందసేవకులను స్తుతించిరి. ఆనాఁటిరాత్రియే చాలమంది స్వగ్రామములకు వెళ్లిరి. మఱునాఁడు కొందఱుండి నిఘంటుకార్యస్థానమును జూడవచ్చిరి. కొందఱుపండితులకు మార్గవ్యయము లీఁబడినవి.

సభలోఁ జదువఁబడినవ్యాసము లీపరిషత్పత్రికలోఁ గ్రమక్రమముగఁ బ్రకటింపఁబడుచుండును. ముందు సభ యెక్కడజరుగునదియు నిర్ణయముకాలేదు.

---

ఓమ్.

# స్వాగతోపన్యాసము.

— (శ్రీపిఠాపురము మహారాజావారు.) —

సభ్యులారా!

ఆంధ్రసాహిత్యపరిషత్తుయొక్క వార్షికోత్సవము మా పీఠపురమున జరపింపవలయునని చిరకాలమునుండి కోరిక గలిగియుండెను. పరమేశ్వరుని కరుణాకటాక్షమున నది నేఁటి కిచ్చట జరుగుట తటస్థించినది. అదియు నామందిరమున జరగుటచే నత్యంత సంతోషముగ నున్నది. నా కోరిక నెఱవేఱినది. మా యాహ్వాన మంగీకరించి మమ్మనుగ్రహించిన పరిషత్తువారికిఁ గృతజ్ఞతాపూర్వకముగ నమస్కారసహస్రము లర్పించుచున్నాము. సభ నలంకరించిన పండితులకును భాషాభిమానులకును వందనశతంబు లర్పించుచున్నాము. మఱియొక విశేషమున్నది. పానుగల్లురాజాగారును, బరిపాలకసంఘమునఁ బ్రథమమంత్రివరులును, నాంధ్రమున శాస్త్రోపాధ్యాయపరీక్షయం దుత్తీర్ణులును, గౌరవనీయులనగు శ్రీరాజా పానుగంటి రామారాయణముగారు నేఁడు మనసభకు దయచేయుట మనకెంతయు సంతోషకరమైనది. వీరు చాలఁగాల మాంధ్రమునఁ బరీక్షకులుగాఁ గూడ నుండిరి. ఆంధ్రగీర్వాణములయం దసాధారణ పాండిత్యము గలవారు. ఆంధ్రభాషాభిమానులు. మనభాషాభివృద్ధికై పదివేలరూప్యములు మనవిశ్వవిద్యాలయమువారికి విరాళము నొసంగినవారు. పాఠశాలలయందు దేశభాషలలో విద్యాభ్యాసము చేయించుట మంచిదని యెంచెడివారు. ఇట్టి మహనీయులు మన యీసభకు విచ్చేయుట మనపరిషత్తుయొక్క భాగ్యమని యెన్నవలసియున్నది.

ఆంధ్రభాషను భద్రముగఁ గాపాడి దానినభివృద్ధికిఁ దెచ్చుటకుఁ దగినవారు, మన పరిషత్తువారిని మించినవా రెవ్వరును గానరారు. కొన్ని సంవత్సరములక్రిందట నీపరిషత్తువారు పండితసభ నొకదానిని సమావేశము చేయించియచ్చట జరుగవలసిన చర్చ బాగుగ జరిగినతరువాత గ్రామ్యభాషను బహిష్కరించి మనభాషను గాపాడిరి. ఇంకను బలువిధములఁ బాటుపడవలసియున్నది. మనభాషయొక్క దురదృష్టవశమున గ్రామ్యవాద మింకను బూర్తిగ నశించినదని నమ్ముటకు వీలులేదు. వీలైనయెడల గ్రామ్యభాష మఱలఁ దలయెత్తఁ జూచు

చున్నదనుటకు సందేహములేదు. ౧౯౨౦ సంవత్సరమునఁ గాఁబోలు, గ్రామ్యభాషలో వ్రాయఁబడిన యొకానొకగ్రంథము పాఠశాలలలోఁ బఠనీయగ్రంథముగ నియమింపఁబడినది. అప్పుడు దానిని దీసివేయించుటకై కొంతపని చేయవలసివచ్చినది. ఇఁకముందుఁగూడ నెపుడైన నట్లే జరుగవచ్చును. జరుగదని యెట్లుచెప్పఁగలము? కావునఁ బరిషత్తు మిక్కిలి జాగరూకతతో నావిషయమై పరిశీలించుచు నాంధ్రభాష దగ్ధముగాకుండఁ గాపాడుచుండవలయునని ప్రార్థించుచున్నాము.

చెన్నపురివిశ్వవిద్యాలయమున శిష్టసభ (Senate) యందు సభ్యులుగ నున్నవారిలో నాంధ్రులసంఖ్య బహుస్వల్పము. ఆంధ్రభాషావిషయముల బాగుగఁ గాపాడుట కింకను జాలమంది సభ్యు లుండవలయును. ఈశిష్టసభలోనున్న సభ్యులు మిక్కిలి తక్కువ యగుటచే విద్యాధికారులసభ (Syndicate) లో నుండుటకు మనవారి నెన్నుకొనఁ జేయుట బహుదుర్లభము. మొన్నమొన్నటి వఱకును విద్యాధికారులసభలో మనవా రొక్కరును లేరు. ఇప్పుడైనను మనవారొక్కరుమాత్రమే గలరు. ఈయననైనను దేలికగా నెన్నుకొని రనుకొనుచున్నారా? ఎంతయోకష్టపడి పనిచేసినఁగాని యెన్నుకొనలేదు. ఇఁక మనభాషను గాపాడుటయెట్లు? ఆమె దుస్థితి యిట్లున్నది. ఆంధ్రమహాజనులసంఖ్యఁ జూడుఁడు. ఈసభ్యుల సంఖ్యఁజూడుఁడు. ఇట్టి దురవస్థల నుండి మనలను దొలఁగించుటకుఁ బ్రభుత్వమువారు దప్ప వేఱెయాధారము లేదు. కాన మనమీవిషయము బాగుగ నాలోచించి చర్చించి తీర్మానముఁ జేసికొని దానినిఁ బ్రభుత్వమువారికిఁ బంపుకొనవలయును. ఈసందర్భమున నాంధ్రులును, నాంధ్రభాషాభిమానులును నైనగౌరవనీయులగు శ్రీ పానుగల్లు రాజాగారును, శ్రీ కూర్మా వేంకటరెడ్డి నాయఁడుగారును దగుసాహాయ్య మొనర్చి యాంధ్రలోకము యొక్క కృతజ్ఞతకుఁ బాత్రులగుదురుగాక యని ప్రార్థించుచున్నాము. అంధ్రరాష్ట్రమునకుఁ బ్రత్యేక మొక విశ్వవిద్యాలయ ముండుట యావశ్యకమని తోఁచుచున్నది. అది మనకు లభించినఁగాని మన భాషకుఁ దగినప్రోత్సాహ ముండదేమో యనుభయము గలుగుచున్నది. ఈ నడుమ మనప్రభుత్వమువా రొక యాలోచనచట్టము (Bill) తయారుచేయించిరి. దానివలన మనయాంధ్రదేశముననుండు విద్యాలయముల కెంతయు నష్టము సంభవించు నని నిస్సందేహముగఁ జెప్పవచ్చును. దానినిఁ బట్టిచూడ మనకు విశ్వవిద్యాలయ మొకటి ప్రత్యేకముగ నుండుట యత్యావశ్యకముగఁ గనుపట్టు

చున్నది. ఈవిశ్వవిద్యాలయము విషయమై మును పోకప్పుడు కొంతచర్చ జరిగి నది. అప్పు డీయంశము బాగుగఁ బరిశీలించి లాభ నష్టములు తమకు విన్నవించు టకుఁ బ్రభుత్వమువా రొకసంఘమును (Committee) నేర్పాటు చేసెదమని సెలవి చ్చిరి. తరువాత నాసంఘము నేర్పాటుచేయుటలో మాత్రము సరిగాఁ జేయలే దనిచెప్పకతప్పదు. ఆసంఘసభ్యులలో నాంధ్రులు స్వల్పసంఖ్యాకులు. అధ్యక్షు లన్ననో యఱవ న్యాయవాది. ఆంధ్రులైనవారు, ధీమంతులు, విద్యాధికులు, చెన్నపురి విశ్వవిద్యాలయమునందుఁ గొన్నిసంవత్సరములనుండి సభ్యులుగనున్న వారు, విద్యావిషయకమైన యనుభవము విశేషముగఁ గలవారును గావలసి నంతమంది శాసననిర్మాణసభలో నుండఁగా వారిని వదలివైచి యితరుల నధ్యక్షు లుగ నేర్పఱుచుట యెంతయు శోచనీయమైన సంగతి. ఆంధ్రులకై విశ్వవిద్యా లయ మేమి? దానిమంచిచెడ్డల నాలోచించుటకై యేర్పఱుపఁబడిన సంఘములో నాంధ్రేతరుల నెక్కువగ నియమించుట యేమి? దీని కధ్యక్షులుగఁ దమిళన్యా యవాది నేర్పఱుచుట యేమి? మనస్థితి యిప్పటి కిట్లున్నది. ముం దెట్లుండునో తెలియదు. ప్రస్తుతమున బడులలోఁ జెప్పు చదువు తెనుఁగునఁ జెప్పుటమంచిదో కాదో యోజింపవలసి యున్నది. ఇట్టి ముఖ్యములైన విషయము లప్పుడప్పుడు చర్చకు వచ్చుచునేయుండును. సందర్భానుసారముగ మనకు మంచివని తోఁచిన యభిప్రాయములను బ్రభుత్వమువారికి విన్నవించుకొనుచుండుట మనకర్తవ్యము. ఆంధ్రభాషకు సంబంధించినవిషయములలోఁ బరిపాలకు లనుగ్రహించి పరిష దభిప్రాయముల నడిగి తెలిసికొనుచుండుట యుచితమని తోఁచుచున్నది. మన యీపరిషత్తు కవులతోను బండితులతోను విమర్శకులతోను నిండియుండును గావున వీరియభిప్రాయములను బ్రభుత్వమువారు తెలిసికొనుట న్యాయమును లాభకరమును నగునని చెప్పక తప్పదు.

మనదేశమున నాంధ్రభాషాభిమానము క్రమక్రమముగ నభివృద్ధిఁ బొందుచున్నట్లు కనుపట్టుచున్నది. మునుపటివలెఁ గాక యిప్పుడు మానినీమణు లనేకులు విద్యనేర్చి సద్గ్రంథపఠనము నొనర్చి లాభము నొందుట యేగాక వారి లోఁ గొందఱు కవిత్వముఁ జెప్పువారునుగూడఁ గలరు. ఇదివఱకు విద్యయం దంత లక్ష్యముంచని బ్రాహ్మణేతరజాతులవారు గూడ నిప్పుడు శ్రద్ధతో విద్యా భ్యాసముఁ జేసి బాగుపడుచున్నారు. మాతృభాషాభక్తితత్పరులై కవితయుఁ జెప్పుచున్నారు. వారు వీ రననేల? జనసామాన్యము సాభిలాషమై స్వభాషను సేవించుచున్నది. మనదేశమున నిపుడు కవు లనేకులు గలరు. వారిలో సుకవు

లునుగలరు. కుకవులును గలరు. కుహానాకవులుఁగూడ నున్నారు. కుకవులను గుహానాకవులను నెల్లప్పుడు విడనాడవలసిన దే. మనము సత్కవులనే సన్నుతింతము. మనభాగ్యవశమున మహాకవులు కొందఱు లేకపోలేదు. వీరుమాత్ర మత్యంతగౌరవపాత్రులు. ఆంధ్రుల మందఱము శక్తివంచన లేకుండఁ దగినరీతిని గౌరవభావమున వీరి నాదరింపవలయును. వారు వ్రాయు సద్గ్రంథములఁ గొని చదువుకొని యానందించి లాభమును బొందవలయును. తన్మూలమున నాకవి పుంగవులకుఁ దగినరీతి ప్రోత్సాహ మొనరించి యింకను సద్గ్రంథములు రచించునట్లుచేసి దేశోపకార మొనర్పవలయును. ఇంతియే కాక, యాంధ్రభాషాభిమాను లెల్లరును బరిషత్తులోఁ జేరి సాహాయ్య మొనర్పఁ గోరుచున్నాఁడను. ఎవరిమట్టునకు వారికీయవలసిన సొమ్ము బహుస్వల్పము. ఇదియంతయుఁ గూడుట వలన, బరిషత్తునకుఁ గలుగులాభ మత్యధికము. ఇట్లు మనమిచ్చిన ధనము వలనఁగలుగు లాభము భాషాభివృద్ధిమూలమునఁ దిరిగి మన ప్రజలకే సమకూరును. ధనాధికులును జమీన్‌దారులు నుచితరీతి నీపరిషత్తు నుద్ధరింపఁ బ్రార్థించుచున్నాఁడను. తెలుఁగువారందఱు వారివారి స్థితిగతుల ననుసరించి మనభాషాభివృద్ధికిఁ దోడ్పడుదురుగాక! భాషాపోషణ మొనర్చి తన్మూలమున దేశసేవచేసి పుణ్యముఁగట్టుకొని ధన్యు లగుదురుగాక!

మన యాంధ్రసారస్వతమునకు వే ఱొకరీతినిగూడ నుపకార మొనర్ప నచ్చును. అది యె ట్లన? అముద్రితగ్రంథముల వెదకి సంపాదించి ప్రచురింపవలయును. ఉత్తమప్రాచీనగ్రంథములెన్ని దాఁపఁబడియున్నవో యెవ్వరు చెప్పఁగలరు? కష్టపడి వెదకినచో వానిలోఁ గొన్నియైన వెలువడవచ్చును. పింగళి సూరనార్యుని గరుడపురాణము, ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము, నాచన సోమనాథుని వసంతవిలాసము, బమ్మెర పోతరాజుచే రచింపఁబడి శిథిలమైన వని మనమనుకొనుచున్న భాగవతభాగములును బయటఁబడినచో మనయదృష్ట మింతింతయని చెప్ప నలవియగునా? ఆంధ్రవాఙ్మయమునకును, దేశమునకు నెంతలాభము గలుగును? ఇవి లభించినచో వీనికై వేలకొలందిరూప్యములనైన వెచ్చింపవచ్చునే! ఇట్టి గ్రంథరాజము లింక నుండవచ్చును. ఆంధ్రభాషాభిమానులట్టివానిని శ్రమపడి సేకరించి తా మచ్చొత్తించుటయో లేక వానిని ముద్రింప సంసిద్ధులై యున్నవారి కొసంగుటయో జరుపవలయును; గాని వానిని దాఁచి యుంచుటవలన లాభమేమి? కొందఱు తమ తావున మంచిపొత్తము లున్నను, నితరుల కీయరు సరికదా వానికిఁ బ్రతులనైన దీసికొననీయరు. దీనివలన వారికిఁ

గలుగులాభమేమో తెలియదు. ప్రచురించినయెడలఁ బ్రజలకందఱకు లభించునుగదా? అది లేకుండఁజేయనేల? కొందఱు సద్గ్రంథములు కొన్ని తమయొద్ద నున్నను లేవందురు. మఱికొంద ఱట్టిగ్రంథములు తమయొద్ద లేనప్పుడుకూడ నున్నవని చెప్పుచుందురు. దీనివలనఁ బేరు వచ్చునని కాఁబోలు వా రిట్లుపలుకుట! భాషాభిమాను లీమాదిరి దారులు త్రొక్కక దేశోపకారపరాయణులై యముద్రితగ్రంథరాజముల సంపాదించి ప్రచురింపవలయును; లేదా, ప్రచురించువారి కీయవలయును. అముద్రితగ్రంథములు ప్రచురించువారు తమతమ వాదముల కనువగురీతిగా వానియందలి పదములను, బద్యములను మార్పకయుఁ, బత్రములకుఁ బత్రములే వదలివేయకయు న్యాయబుద్ధితో నున్నదున్నట్లు ప్రచురింపవలయును. ఇది మిగుల ముఖ్యమైనయంశము. ఇవి యేవియుఁ గుదురనియెడల నట్టి యముద్రితగ్రంథములను సాహిత్యపరిషత్తునకు సమర్పింపవలయును. "పరిషత్కార్యాలయ మిపుడు చెన్నపురమున నున్నదే, మేమిచ్చిన పుస్తకము లచ్చట నుండుటవలన, మాకుఁ గావలసినప్పుడు మేము వ్యయప్రయాసములకుఁ బాలుగాకుండఁ బోయి చూచికొనుట తటస్థింపదని భయపడుదురేమో? అట్లు వెఱవవలసిన యవసరము లేదు. మొదట మే మీపరిషత్తును స్థాపించునపుడు మనరాష్ట్రమునకు రాజధానియైన చెన్నపట్టణమున నున్నచో నీసాహిత్యపరిషత్తు స్థాపింపఁబడినట్లు సకలాంధ్రప్రపంచమునకు బాగుగఁదెలియుట కవకాశముండు నని య ట్లొనర్చితిమి. ఇది స్థాపించి యిప్పటికిఁ బదునొకండు సంవత్సరములు గాఁబోలును గావచ్చినవి. ఇఁక దాని నచ్చటనుంచుట యనవసరమని తోఁచుచున్నది. ఆంధ్రదేశీయు లందఱును దఱచుగా దర్శించుట కనువుగ నుండునటుల మనదేశమునకు మధ్యభాగమున నుండు నొక యుచితస్థలమున నీకార్యాలయ ముంచుట యవసరమై యున్నది. ఇవుడింకఁ జెన్నపురమున నుంచినయెడల ధనవ్యయము గూడ నధికముగ నగుచుండును. కావునఁ గొలఁది కాలములోనే తెలుఁగుదేశములోనికిఁ దెచ్చుట విషయమై మనసభవా రాలోచింపవలసియున్నది. పెక్కువిధముల నెంచిచూడఁగా మా గోదావరీమండలమే దీనికిం దగినతా వని తోఁచుచున్నది. పరిషత్తువారి చిత్త మె ట్లుండునో?

భాషావిషయిక విమర్శనములు వాఙ్మయాభివృద్ధి కెంతయు నుపయోగకరములు. ఇవి దూషణములతో నిండియుండఁగూడదు. న్యాయములగు పద్ధతుల ననుసరించి యుండవలయును. కాని యీర్ష్యయే ప్రధానముగఁ జేసికొని

పరస్పరదూషణమునకు దిగుట యెంతమాత్రమును దగదు. సుప్రసిద్ధమహాకవుల జన్మస్థానము లెవ్వియో వారికాలము లేవియో తెలిసికొనఁగోరుట తగునుగాని యావిషయనిర్ణయములకై విరోధములు కల్పించుకొని యొకరికొకరు కర్ణకఠోరములగు పరుషవాక్యములతో వ్రాసికొనుట యెంతయు విచారకరము. నిందింపఁగడంగుట తమవాదముయొక్క బలహీనతను వెలువఱుచుటే యగునుగాని వేఱుకాదు. నింద యెన్నఁటి కైనను విషయనిర్ణయమునకు హేతు వగునా? వాదము సహేతుకమైనచోఁ గారణములఁ గనఁబఱుపవలయును. లేకున్న నూరకుండవలయును. అంతియే గాని నిందింపఁదగదు. ఇంతకును సుప్రసిద్ధకవి యెచ్చటివాఁడైన నేమి? యాతనిమత మేమైన నేమి? జాతి యేమైన నేమి? శాఖ యేమైన నేమి? ఆతఁడు మన కందఱకును వందనీయుఁడే. ఆంగ్లదేశీయుఁడును, క్రీస్తుమతావలంబుఁడును, పామరుఁడును, ఆంగ్లభాషాకవీశ్వరుఁడునునై "ప్రపంచములోని కవుల నెల్లరమించిన కవిశ్రేష్ఠుఁ" డని ప్రఖ్యాతి పడసిన "షేక్స్పియర్" మహాకవికి మనమందఱము నమస్కరించుటలేదా?

మఱియొక సంగతి. గ్రంథవిమర్శన మొనర్చునపుడు దాని గుణాగుణములను నిష్పక్షపాతబుద్ధితో నిర్ణయింపఁదగును గాని యాగ్రంథకర్తనుబట్టి నిర్ణయింపఁగూడదు. స్నేహితులైనను సరే, శత్రువులైనను సరే, పూర్వకవులైనను సరే, ప్రస్తుతకవులైనను సరే గుణాగుణనిర్ణయమునందు వారిగ్రంథముల నేకభావముననే చూడనొప్పును. "ఆముక్తమాల్యదామహాకావ్యమును రచించినవా రెవ్వ" రను విషయమును గుఱించి చర్చ జరుగుచున్నది. శ్రీకృష్ణదేవరాయ లని కొందఱును, అల్లసానిపెద్దనార్యుఁ డని కొందఱు వాదించుచున్నారు. గ్రంథములోఁ గృష్ణదేవరాయలే తత్కర్త యైనట్టు స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. అందట్లున్నపుడు దానికి వ్యతిరేకముగ బలవత్కారణము లుండినఁగాని యది కాదనుటకు వీలులేదు. అట్లయినచోఁ బ్రతిగ్రంథకర్తను గ్రంథకర్త కాఁడనియే చెప్పవచ్చును. ఈకావ్యము రాయలు వ్రాయలేదని రుజువుచేయఁగల బలమైన హేతువు లేవియుఁ గానరాకున్నవి. మనుచరిత్రలోని వంశాభివర్ణన పద్యములు విష్ణుచిత్తీయమునఁ గలవన్నంతమాత్రమున నీకావ్యము మనుచరిత్రకారుఁడే వ్రాసినాఁడనుట న్యాయముగాదు. కృష్ణరాయలు తనవంశవర్ణనము చేయవలసివచ్చినచోటఁ దన యాస్థానకవి రచించిన పద్యముల నందుఁ బొందుపఱిచిన నందముగ నుండునని యట్లు చేసియుండవచ్చును. ఆలోచించి చూడఁగా నిది యిట్లు చేయుటయే యత్యంతోచిత మని తోఁచుచున్నది. రాయలు తనగ్రంథమున నీపద్యముల

నిట్లు నిర్భయముగను నిస్సంశయముగను జేర్చుకొనుట, యీకృతికర్త శ్రీకృష్ణ
దేవరాయలే యని రుజువుచేయుటకుఁ బ్రబలకారణములలో నొకటియై
యున్నది. అట్లుకాక, కృష్ణరాయలు విష్ణుచిత్తీయమును పెద్దన్నచేత వ్రాయించి
తనపేరు పెట్టుకొని పేరుపొందవలయు నని తలంచినచోఁ పెద్దన రచించిన
మనుచరిత్రములోని పద్యముల నిందుండనిచ్చునా? ఆముక్తమాల్యదనుండి యెత్తి
వ్రాయఁబడిన యీక్రిందిపద్యమువలన నీతఁడు పెక్కు సంస్కృతగ్రంథములు
గూడ రచించినట్లు విస్పష్ట మగుచున్నది.

సీ. పలికితుత్ప్రేక్షోపమల జాతి పెంపెక్క రసికు లౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూ ప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి సకల కథాసారసంగ్రహంబు
శ్రోత్రఘచ్ఛటలు విచ్చగ రచించితి సూక్తి నైపుణి జ్ఞానచింతామణికృతి
గీ. మఱియు రసమంజరీముఖ్య మధురకావ్య
రచన మెప్పించికొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె? యందు నొక్క
కృతివినిర్మింపు మిఁక మాకుఁ బ్రియముగాఁగ.

ఇన్ని సంస్కృతగ్రంథములు రచియించిన రాయ లీయాంధ్రగ్రంథ
మును రచించుట యొక యబ్బురముగాదు. ఇదియునుగాక శైలినిఁబట్టి చూచి
నను ఆముక్తమాల్యదా మనుచరిత్రముల కెచ్చటను బోలిక గానరాదు. ఆముక్త
మాల్యద మనుచరిత్రముకన్న మిక్కిలి ప్రౌఢమైన ప్రబంధము. ఆంధ్రమున
నుండు నుత్తమోత్తమకావ్యములలో నొకటి. అందలి యుపమ లనుపమాన
ములు; శైలి నారికేళపాకము; సరళత తక్కువ. మనుచరిత్రశైలి మిగుల సరళమై
నది. పాకము కదళీపాకము. ఈ రెండుగ్రంథముల నొక్కఁడే వ్రాసియున్నచో
నాముక్తమాల్యదను మనుచరిత్రము వ్రాసిన వెనుకనో ముందో వ్రాసియుండ
వలయునుగదా? విష్ణుచిత్తీయము మనుచరిత్రముకన్న ముందు వ్రాసినదనుటకు
వీలుకనఁబడదు. ఏలయన: దీనికన్న నది మిక్కిలి ప్రౌఢతరముగా నున్నది.
అందుఁ జక్కనివర్ణనములు చేయఁబడియున్నవి. రసపోషణమునఁగూడ మిం
చియే యున్నది. ఇంక మనుచరిత్రముతరువాత నది వ్రాయఁబడినదనుటయు
సమంజసముగాఁ దోఁచుటలేదు. ఏలయన: దానిశైలి దీనిశైలికన్న నెక్కువ
సరళముగా నున్నది. కవిత్వముఁ జెప్పనలవాటధికమైనకొలఁది సరళత యెక్కువ
యగుచుండునుగాని యున్నసరళతగూడఁ బోవుట యసంభవముగదా? కావున

మనుచరిత్రకారుఁడైన పెద్దనార్యుఁడు విష్ణుచిత్తీయమును రచించె ననుట న్యాయముగాదు. ఆముక్తమాల్యదయందుఁ బేదవారి బ్రదుకు రీతులనుగుఱించి చాలఁ జక్కఁగ వర్ణింపఁబడియున్నది. కృష్ణరాయలకు వాని నంతబాగుగ నెఱుంగుట కవకాశము లేదని కొందఱందురు. ఇట్లనుట యుక్తముగాదు. రాజులుమాత్రము పేదల స్థితిగతులనుగుఱించి యేల తెలిసికొనరాదు? సేవకులవలనఁ దెలిసికొనఁగూడదా? ఆకాలమున రాజులు చారులను బంపి ప్రజ లెట్లుండిరో తెలిసికొనుచుండెడియలవాటు గలిగియుండెడివారుగదా. ఇంతయేల? ప్రభువు ప్రచ్ఛన్న వేషమునఁ దానే స్వయముగ నేఁగి ప్రజల కష్టసుఖములు గనుఁగొనుచుండెడినాఁడు గాదా? ఆయాక్షేపణ మొకయాక్షేపణము గాదు. ఈగ్రంథ రాజమునందు రాజనీతి యెంతయుఁ బ్రశస్తముగా వర్ణింపఁబడినది. స్వయముగ రాజ్యముఁ జేయుచు నష్టకష్టములఁబడి జనులఁ బాలించుచు స్వానుభవముగల జనవల్లభుఁడు దక్క మఱియొకరు వ్రాసినట్లు కనఁబడదు. వీని నన్నిటిని బట్టి చూడ నాముక్తమాల్యదాగ్రంథకర్త శ్రీకృష్ణరాయమహారాజే యని చెప్పవలసియున్నది. ఇదిగాక,

గీ. తెలుఁగదేలయన్న దేశంబు తెలుఁగేను, దెలుఁగు వల్లభుండఁ దెలుఁగొకండ
　　యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి, దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

ఈపద్యమునుబట్టిచూడ విష్ణుచిత్తీయకృతికర్త కితరభాషలందుఁ బ్రవేశ ముండుటచే నాభాషలకును దెలుఁగుభాషకును గలభేదము బాగుగఁ దెలిసియున్నట్లును దేశభాషలలోఁ దెలుఁగు బాస లెస్సయైనది గనుక తెలుఁగునందే కృతిరచింపుమని తెలుంగురాయఁడాజ్ఞాపించినట్లును దేలుచున్నది. మనుచరిత్రకారున కితరదేశభాషలయందుఁ బ్రవేశమున్నట్లు కానఁబడదు; మఱియును,

శ్రీకృష్ణదేవరాయలకుఁ బారిజాతాపహరణమును గృతియిచ్చిన ముక్కుతిమ్మనార్యుఁ డాగ్రంథములో నారాజసత్తము ని ట్లని స్తుతించెను.

కం. శ్రీ వేంకటగిరివల్లభ, సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ
　　జీవితనాయక! కవితా, ప్రావీణ్యఫణీశ! కృష్ణరాయమహీశా.

ఇందలి కవితాప్రావీణ్యఫణీశ! యనుదానింబట్టి యీయన కవిత్వము చెప్పుటయం దుద్దండప్రతిభ గలవాఁ డని విశద మగుచున్నది. ఈపద్యమున నే "శ్రీ వేంకటగిరివల్లభ సేవాపరతంత్రహృదయ!" యనుదాని కనుగుణముగ నాముక్తమాల్యదయందు గ్రంథాదినున్న:

ఉ. శ్రీ కమనీయహారమణిఁ జెన్న గుఁ దానును గౌస్తుభంబునం
　　దాకమలానభూటియు నుదారతఁ దోఁపఁ బరస్పరాత్మలం

దాకలితంబు లైన తమయాకృతు లచ్చట శైకిఁ దోఁప న
స్తోకతనందుఁ దోఁచెనన శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్.

అని రాయలు శ్రీవేంకటేశ్వరుల భక్తితోఁ గొల్చువాఁ డని తెలుపుచు చేయుచున్నది. ఈపద్యముతో మనుచరిత్రమునందలి మొదటిపద్యమును బోల్చి చూడఁదగును.

శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీతిన్ నిల్పినాఁడో యనం
గా వందారు సనందనాది నిజభక్తశ్రేణికిం దోఁచురా
జీవాక్షుండు కృతార్థుఁజేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్.

ఈ రెంటికినింగల తారతమ్యముం బరిశీలింపుఁడు! ఈ రెండువాక్కులు వేఱువే అని తెల్లమగుచున్నది. శ్రీకృష్ణదేవరాయలు స్వభావవర్ణనముల నతి మనోహరముగఁ జేసినాఁడు. అభూతోపమలు కల్పించినాఁడు. రసపోషణము బహుప్రౌఢముగఁ జేసినాఁడు. భక్తిరసమును గురిపించినాఁడు. ద్రావిడదేశా చారములను మిగుల లెస్సగ వర్ణించినాఁడు. అఱవదేశమును బాగుగ నెఱుంగుటకుఁ గృష్ణరాయల కనేకావకాశములు గలిగియుండును. ఆహా! ఈమహారాజకవి యెంతటిఘనుఁడు! కవిరాట్కంఠీరవుఁడు; పండితప్రవరుఁడు. రాజుల కిట్టి యఖండపాండితీపటిమ యుండియుండునా యని కొంద ఱందు రేమో? ఏల యుండరాదో తెలియకున్నది. ఇతరరాజు లెందఱు పుస్తకరాజముల రచియింపలేదు? నన్నెచోడుఁడు కుమారసంభవము, రఘునాథభూపాలుఁడు వాల్మీకిరామాయణము, మల్లె అనంతభూపాలుఁడు కుముద్వతీకళ్యాణము, నవరము చిననారాయణనాయకుఁడు కువలయాశ్వచరిత్రము, దామెర వేంగళభూపాలుఁడు బహుళాశ్వచరిత్రము, కోటిరాయ రఘునాథతొండమాన్ భూపాలుఁడు పార్వతీపరిణయము, కట్టా వరదరాజు శ్రీరంగమాహాత్మ్యము, కాచభూపతి విఠ్ఠలరాజు రంగనాథరామాయణము, తిమ్మనృపాలుఁడు పరమయోగివిలాసము, విజయరంగచొక్కనాథుఁడు అహల్యాసంక్రందనము, శేచెర్ల మాధవరాయఁడు చంద్రికాపరిణయము, పాలవేకరి కదరీపతి శుకసప్తతి మొదలైన యాంధ్రగ్రంథములను, భోజరాజు చంపూరామాయణము, రావు సర్వజ్ఞసింగమహీపాలుఁడు రసార్ణవసుధాకరము మొదలైన సంస్కృతగ్రంథములను రచియించియుండలేదా? ఇంక ననేకులు రాజకవులు లేరా? వారందఱుఁ బండితులు కారా? ప్రభుసత్తములు సద్గ్రంథరచనాపటిష్ఠులే కాకున్నచో వీరందఱగతి యేమి? కావున నట్టివాద మెంతయు నసమంజసము. వీరిలో మావంశస్థులైన రావు సర్వజ్ఞసింగ

మహీపాలుఁడు రచించిన రసార్ణవసుధాకరము ప్రసిద్ధలక్షణగ్రంథమని సంస్కృత కవీంద్రు లెఱుంగుదురు.

ఇదియునుంగాక శ్రీకృష్ణదేవరాయలు వివిధవిద్యావిశారదుఁడు. బహుభాషాకోవిదుఁడు; దేశభాషల ననేకములునేర్చి "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని చెప్పినవాఁడు; రాజనీతిపారంగతుఁడు; శౌర్యరాశి; భాషాపోషకుఁడు; కవిబృందమందారము; సహజసహానసద్గుణసంపన్నుఁడు. తాను గవిశ్రేష్ఠుఁ డయ్యును, దనకన్నఁ దక్కువయైనకవులను, బెద్దనముక్కుతిమ్మనాదులను బోషించి గౌరవించిన కరుణాశాలి. ఈయనగ్రంథమున నచ్చటచ్చటఁ దప్పులుగలవని వాడుకయుండెడిది. ఈమధ్యకాలమునఁ బండితరాజగు బ్రహ్మశ్రీ, వేదము వేంకటరాయశాస్త్రులవారాగ్రంథము నామూలాగ్రముగఁ బరిశీలించి యాదోషములను నిజముగఁ దప్పులు కావనియు శబ్దపల్లవాదులలోఁ జేరునని యుసిద్ధాంతీకరించి గ్రంథకర్తయొక్క పాండిత్యప్రకర్షమున కించుకయుఁ గొఱంత లేదని నిర్ధారించినారు. ఆంధ్రభాషకు నాంధ్రదేశమునకు నీ ప్రభువతంసమొనర్చిన మహోపకార మింతింతయని చెప్పనలవికాదు. ఇట్టిస్తోత్రపాత్రుని స్తుతించి వక్త్రములు పవిత్రములుగఁ జేసికొనవలయునుగాదా? అయిన నేయాంధ్రకవియుఁ గావ్యములలోఁ గవిస్తుతిచేయునప్పు డావహనీయుని బేర్కొని యుండలేదు. అది యేలకో? ఒకవేళ నాతనిగ్రంథమున నపప్రయోగము లున్నవని యనుకొనుటచే నయియుండునా? ఇంకేమైనఁ గారణముండునా? ఇదమిత్థమనిచెప్ప వీలులేదు. ఇంతమాత్రమున నాయనకు లోటువాటిల్లెనని తలఁపరాదు. లోపము లేశమైనను లేదు. బ్రహ్మజాతిహీరమును, హీరమనకున్నచో నది హీరము కాకుండునా? విద్వత్కవిశ్రేష్ఠుఁ డెప్పటికిని విద్వత్కవిశ్రేష్ఠుఁడే. ఇంతకును నాకుఁ దోఁచినదాని నేదో వచింప సాహసించితిని. నేఁజెప్పినదానిలోఁ దప్పులున్న నన్ను మన్నింపుఁ డని పండితప్రవరులఁ బ్రార్థించుచున్నాఁడను.

మాగోదావరీమండలము పెక్కువిధముల వన్నెకెక్కినది. మనకుఁ దెలిసినంతవఱకు నాంధ్రములో నాదికవియై వాసిఁగన్న వాగనుశాసన బిరుదాంకితుం డగు నన్నయభట్టారకకవీంద్రుఁ డీమండలములోనుండియేగదా భారతభాగము రచించెను. ఈకవిరాజును బోషించిన రాజరాజనరేంద్రమహారాజు కూడ నీమండలములోనివాఁడే. కవిత రాజపోషణమున వర్ధిల్లుట కిదియే మొదలు. అనవద్యమగు గద్యరచన ప్రారంభ మగుటయు నిచటనేగదా. గద్యతిక్కనయను వన్నెకెక్కి కీర్తిశేషులైన శ్రీ కందుకూరి వీరేశలింగముపంతుల

వారి నివాసస్థాన మిదియేగదా. వీరికిఁబూర్వము గద్యకవులు బహు స్వల్ప సంఖ్యాకు లప్పటప్పట నరుదుగ గద్యప్రబంధములు వ్రాయుచు వచ్చిరి. అవి యంతముఖ్యమైనవి కావు. మృదుమధురవచనరచన కీవీరేశలింగముపంతుల వారే మొదటివా రనవచ్చును. వీరిశైలి మిగుల రమ్యమైనది. ధారాశుద్ధిగలది. ఇట్టియసమానంబగు లసమానశైలి వేఱొకచోఁ గాంచుట కష్టము, ఈయన బహుగ్రంథరచనాధురంధరుఁడు. అన్ని సద్గ్రంథము లంత చక్కఁగా వ్రాసి నను మొదట వ్రాసినదానిని మఱల మార్చునవసర మెప్పుడును లేకుండెడిదఁట. ఆహా! ఎట్టిమేధావి? ఆంధ్రనవలలలోఁ దొలుతటిదైన రాజశేఖరచరిత్ర మీయన లిఖించినదే. శాకుంతలాదినాటకములఁ దెలిఁగించి యుత్కృష్టములగుసంస్కృత నాటకములనాంధ్రీకరించుట కీయనయే దారిఁజూపిరి. స్వకపోలకల్పితములగు హరిశ్చంద్ర మొదలగు నాటకములను గూడ రచించిరి; హాస్యరస మొలుకు ప్రహసనములు వ్రాసి నీతిని బోధించిరి; కమనీయశైలిని బద్యకావ్యములను రచించిరి; ఖగోళ భూగోళ రసాయనాదిశాస్త్రము లనేకము లాంధ్రమున వ్రాసి దేశోపకార మొనర్చిరి; బాలురకు నబలలకు నత్యంతోపయుక్తములగు పుస్తకముల ననేకముల వ్రాసి మనకృతజ్ఞకుఁ బాత్రులైరి. వీరిగ్రంథములు చదివి యానందించి నీతిమంతులై యెందఱో బాగుపడినారు. పద్యప్రబంధము లందుఁ దక్కఁ దక్కిన వివిధగ్రంథరచనయందు వీరే మార్గదర్శు లని చెప్పవ చ్చును. ప్రతిభాశాలు రింకను బెక్కండ్రు కలరు గాని ప్రథమమున నున్నవారని వీరిని వచించితిని. మఱియు వీరు నాచన సోమనాథుని యుత్తరహరివంశము, కేతనదశకుమారచరిత్రము, సిరిప్రెగడ ధర్మనామాత్యుని చిత్రభారతము మొద లగు ప్రసిద్ధములైన యముద్రితగ్రంథములఁ బ్రచురించిరి. ఆంధ్రమున స్వీయ చరిత్రవ్రాయుటకుఁగూడ వీరే ప్రథములు. దీనిశైలి ముద్దులొలుకుచు మిక్కిలి మృదువుగ నుండును. దీనిని మించిన వచనరచన లేదనియే యనవచ్చును. ఇదిగాక, యాంధ్రకవుల చరిత్రము రచించిన యశస్సాంద్రుఁడు. ఈపుణ్యా త్ముఁడు సత్యవచనుఁడు; సంఘసంస్కారదీక్షాదక్షుఁడు; దానశీలుఁడు. బహు భంగుల భాషనుద్ధరించి దేశసేవఁజేసిన యీమహాత్మునకు నమస్కారములు.

నవలలలో నత్యుత్తమములగునవి వ్రాయుటకు మొదటివారైన బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును మామండలమువారే. తొలుదొలుత నవ లారచనాచమత్కృతియందు వీరిని మించినవారు లేరు సరికదా, సమానస్కంధు లైన లేరని నొక్కి వక్కాణింపవచ్చును. వీరిశైలి మిక్కిలి చక్కనిది. వీరిన్నైనా

నైపుణ్య మెంతని స్తుతింపఁగలము? కథ, కన్నులయెదుటఁ బటమునఁ జిత్రించినట్లుం డునే? ప్రతిభయన నట్లు ప్రకాశింపవలయును. వీరు నాటకరచనయందుఁగూడఁ జాల సమర్థులు. గద్యపద్యరచనలయం దసాధారణప్రజ్ఞాశాలి. నీతిబోధనయందు నిపుణులు. సద్గుణసంపన్నులు. వీ రాంధ్రదేశమున కత్యంతోపకార మొనర్చి కృతకృత్యులగుచున్నారు. వీరింకను ననేకనవలలు నాటకములు వ్రాసి భాషను బోషింతురుగాక! భక్తవత్సలుఁడగు భగవంతుఁడు సతతము వీరి కాయురారోగ్యై శ్వర్యము లొసంగి యాంధ్రదేశము ననుగ్రహింపుఁగాత మనికోరుచున్నాను.

సద్విమర్శమునకు మార్గదర్శులై కీర్తిశేషులైన బ్ర॥ మొక్కపాటి సుబ్బా రాయఁడుగారు మామండలములోనివారే. సాక్షియను నామమున సరసము లగు వ్యాసములు వ్రాసి ప్రఖ్యాతి వడయుచున్న బ్ర॥ పానుగంటి లక్ష్మీనర సింహారావుగారు గూడ నీ గోదావరీమండలవాసులే. వేలు వేలువిధముల మన యాంధ్రభాషకు వన్నెఁదెచ్చి యుత్తమమార్గముల నవలంబించిన యీమహా నీయు లందఱు మా గోదావరీమండలవాసులేగదా! వీరుగాక యింక నెందఱో పండితోత్తము లీమండలము నలంకరించుచున్నారు. ఉత్తములగు కవులలో, భాషాపోషకులైన ప్రభువులలో, వచనరచనా ధురంధరులలో, నవలారచయి తలలో, నాటకకర్తలలో, విమర్శనప్రవీణులలో నాద్యులైనవారికి మాగోదావరీ మండలమే వాసస్థాన మగుటచే నది ధన్య మైనది. ఇట్టి మండలమున నుండు భాగ్యము గల్గిన మాపీఠపురము బహుపురాతనపట్టణము. ఆంధ్రకవీంద్రులచేఁ గొనియాడఁబడినది. శ్రీనాథకవినాథుఁడు తనభీమఖండమున:—

సీ. ఏపట్టణము ద్రోలె నేలేఱు ప్రవహించుఁ బృథివికి ముత్యాలపేరువోలె
మున్నూటయఱువది మూర్తి భేదములతో విహరించు నేవీట వేల్పుపిండు
పీఠాంబచెలి యోగపీఠి హుంకృతి దుర్గ నణఁచి కాపుండు నేనగరికెలనఁ
గుంతీమహాదేవి కూర్మిమేనల్లుఁడు మాధవుం డేవీట మరగినాఁడు
పెద్దగవనుల నేపుటభేదనమున, నెలమి నిలుచుండు బ్రీడావిహీనజఘునఁ
డట్టి పీఠాపురముఁ జేర నరుగుదెంచెఁ, బరమశైవుండు శ్రీపరాశరసుతుండు.

అని యిట్లు కొన్నిపద్యములతో వర్ణించినాఁడు. తెనాలి రామకృష్ణకవి చంద్రుఁడు తన పాండురంగమాహాత్మ్యమున “కళింగదేశాభరణంబగు పీఠికా పురంబు” అని చెప్పినాఁడు. ఇట్టిపీఠికాపురమున మాసంస్థాన ముండుటచే మే మెంతయు ధన్యులము. మాయాస్థానమున సత్కవిసత్కారము చిరకాలము నుండి వంశపరంపరగా వచ్చుచున్నది. కొందఱుకవులు మా యాస్థానమున కలంకారభూతులై మ మ్మమందానందకందళితహృదయారవిందులఁ జేయుచు

న్నారు. కొంద ఱప్పుడప్పు డిటకు వచ్చి మాకు దర్శనమిచ్చి బహుమానపుర
స్సరము గా మాచే బహూకరింపఁబడి మమ్మనుగ్రహించి కృతార్థులఁ జేయుచు
న్నారు. మాపూర్వులు భాషాభిమానధనులు. వాసవదత్తాపరిణయమును రచించి
మా కంకితమొసంగిన పక్కలంక వీరభద్రకవి, బహుగ్రంథరచనాధురంధరుఁ
డగు తిమ్మకవి, ఈయన తమ్ముఁడు జగ్గకవి, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి మొదలగు
కవు లనేకు లిందుండెడివారు. మాతండ్రిగారి కాలములో మహాకవులగు దేవుల
పల్లి సుబ్బరాయశాస్త్రులుగారును, వేంకటకృష్ణశాస్త్రులుగారు నను సోదరులు మా
సంస్థానమునకు భూషణములై యుండెడి యదృష్టము మాకబ్బినది. వీరిరువురును
దమప్రభువువలన మిగుల గౌరవముఁ గాంచిరి. నేను రాజ్యమునకు వచ్చినతరు
వాతఁ గొలఁదికాలము జీవించి పరలోకగతులైరి. ఈకవిశిఖామణు లిరువురు నన్న
య, తిక్కన, యెఱ్ఱన, నాచనసోమన, బమ్మెర పోతన, పింగళి సూరన, కృష్ణదేవ
రాయ, గౌరనలలోఁ జేర్పఁదగినవారు. ఆంధ్రభాషాయోషకు భూషణములైన
కావ్యరత్నముల రచించి మించిన కవిపుంగవులు. వీరిలో సుబ్బరాయశాస్త్రుల
వారు మహేంద్రవిజయము, రామరాయవిలాసము, మందేశ్వరశతకము మొద
లగువానిని రచించిరి. వీరితమ్ములు రావువంశముక్తావళి, యతిరాజవిజయమునఁ
గొన్ని యాశ్వాసములు, నయనోల్లాసము మున్నగునవి రచించిరి. వీరు సం
స్కృతాంధ్రసాహితీసంపన్నులు. భావనాశక్తిప్రశస్తులు. వీరి గ్రంథము లెం
తయు హృదయాహ్లాదకరముగా నుండును. స్వభావవర్ణనములు మిక్కిలి సరస
ముగనుండును. రసపోషణము కడు రమ్యముగ నుండును. వీరి కవిత్వము శబ్దా
ర్థాలంకారములతో శోభిల్లుచుండును. మనుష్యస్వభావము మిక్కిలి చక్కఁగా
గు ర్తెఱిఁగినట్లు గోచర మగుచుండును. ఔచిత్య మెంతయు నొప్పియుండును.
ధారాశుద్ధి యిద్దఱికావ్యములయందుఁ దనరారుచున్నది. అన్నగారి శైలి కద
ళీపాకము. తమ్ముని శైలి ద్రాక్షాపాకము. పదలాలిత్య మెంతనివచింతును? పలుకు
పలుకునకుఁ దేనె లొలుకును. అనన్యసామాన్యమగు ప్రవాహమున భాసిల్లు
చుండును. ఈయన యతులితమగు లలితగతిని గవనముఁ జెప్పఁగలిగిన కవి
కులతిలకము. ఈయన్నదమ్ములిద్దఱు నసాధారణ ప్రతిభాశాలులు. వినయ
ధౌరేయులు. సత్యవచస్కులు. భగవద్భక్తిపరాయణులు. ధర్మపథావలంబులు.
రాజవిశ్వాసపరులు. వీరి సౌభ్రాత్ర మెంతయుఁ బ్రశంసార్హమైనది. సమస్తసద్గు
ణములును వారియందు మూర్తీభవించినవనుటకు సందియము లేదు. వీరుకొన్ని
సంవత్సరముల క్రిందట నన్ను విచారసాగరమున ముంచి స్వర్గస్థులైరి. ఈకవి
శ్రేష్ఠులకు నాసాష్టాంగనమస్కారములు.

సద్విమర్శనమునకు మార్గదర్శియైన బ్ర॥ మొక్కపాటి సుబ్బారాయఁడు గారు, దేవులపల్లి సుబ్బరాయకవికృతమగు మహేంద్రవిజయమునకును వేంకట కృష్ణకవిచే రచింపఁబడిన నయనోల్లాసమునకును టీకలను వ్రాసిరి. ఇవి విమర్శనములకు నిదర్శనములై శోభిల్లుచున్నవి. పక్షపాతముననదియే లేక గుణాగుణములను విశదీకరించుచున్నవి. విమర్శనమన నిట్లుండవలయును. వీరు కమనీయమగు కవనము గూడఁ జెప్పఁగలిగిరి. కవితారసజ్ఞులు; కావ్యలక్షణ విచక్షణదక్షులు; ధీనిధులు; నిఖలనిర్మలగుణఖనులు. ఈయన నన్ను దురంత దుఃఖాక్రాంతునిఁ జేసి కొంతకాలముక్రిందట దివికేగిరి. ఈవిమర్శకాగ్రేసరు నకు వినతులు.

దేవులపల్లిసోదరులు జీవించియున్నపుడే విద్వత్కవీంద్రుల మఱియిరువుర నాయాస్థానము నలంకరింపుఁ డని ప్రార్థింప వారు న న్ననుగ్రహించి కృత కృత్యునిఁ జేసిరి. వారికవిత్వ మత్యంతప్రౌఢమైనది. అఖండపాండితీప్రతిభాశా లులు. ఉభయభాషాకోవిదులు. కవితాచమత్కృతి యుత్కృష్టమైనది. విన యధురీణులు; నిండుకుండ తొణఁకునా! సుగుణాలవాలములు. వీరే ఓలేటి వేంకటరామశాస్త్రులవారును,ద్వివేది రామకృష్ణశాస్త్రులవారును. వీరిరువురుఁగలసి విశ్వగుణాదర్శము, యతిరాజవిజయములోని కొంతభాగము, మదాలసయను నీతిబోధకమగు నాటకము మొదలగునవి వ్రాసిరి. వీరిలో రెండవకవి నన్నుఁ జింతాసముద్రమునఁ ద్రోసి యీశ్వరసాన్నిధ్యమును జేరిరి. బ్ర॥ ఓలేటి వేం కటరామకవీశ్వరుఁడు దైవానుగ్రహమున ధనధాన్యసంపదలతో నాయురారో గ్యములు గలిగి చిరకాలము భాషాభూషణములగు కావ్యము లనేకములుచేసి దేశోపకారమొనర్చునుగాక యనిభగవంతునిఁ బ్రార్థించుచున్నాను. ఇక్కవివ తంసములకు నావందనములు.

నేఁడు మనసభ కధ్యక్షులుగనుండు బ్ర॥ పానుగంటి లక్ష్మీనరసింహాకవి సింహము గూడ మా యాస్థానకవియే. విశేషశేముషీవిభవాభిశోభితుఁడు. బహుగ్రంథరచనాపటిష్ఠుఁడునగు నీయన నర్మదాపురుకుత్సీయము, సారంగధర చరిత్రము, ప్రచండచాణక్యము, రాధాకృష్ణనాటకము, పాదుకాపట్టాభిషేకము, కోకిల, వనవాసరాఘవము, విప్రనారాయణచరిత్రము, విజయరాఘవము, బుద్ధబోధసుధ, వృద్ధవివాహము, కల్యాణరాఘవము, కంఠాభరణము, ముద్రిక, పూర్ణిమ, సరస్వతి యనునాటకములను, హాస్యవల్లరి, కథాలహరి, ప్రకీర్ణోపన్యాస ములు, సాక్షి మున్నగుగ్రంథములను వ్రాసిరి. వీరు సాక్షియనుపేరిడి ప్రపం చమున జరుగుసంగతులను విచిత్రగతుల ననేకవ్యాసములు వ్రాసి క్రొత్త

ఫక్కిఁ ద్రొక్కెన్. ఇది చదువరుల కానంద మొసంగుటయెగాక నీతినిఁగూడ బోధించును. ప్రజల కెంతయుఁ బ్రయోజనము సేయును. ఈకవి నాటకరచన యం దతిసమర్థుఁడు. స్వభావవర్ణన వైచిత్రియం దేమి, రసపోషణమునం దేమి, పాత్రౌచిత్యమునం దేమి, యసాధారణప్రజ్ఞాశాలి. వీరినాటకము లుత్తమము లగు నుపమలతో నిండియుండును. మనుష్యస్వభావమును బాగుగ గ్రహించి దానిని విస్పష్టముగఁ జిత్రించి మనస్సున బాగుగ నంటియుండునట్లు చేయఁ గల సమర్థుఁడు. వీరినాటకములయందలి కల్పనాచమత్కృతి యత్యద్భుతము. కొన్ని నాటకములకథలు వీరు స్వయముగఁ గల్పించిరి. కంఠాభరణ మసాధారణవైఖరిని లిఖింపఁబడినది. మొదటినుండి చివరవఱకు దీనియందు హాస్యరసము బాగుగఁ బోషింపఁబడినది. నీతిబోధకముగఁ గూడ నున్నది. ఉత్తమోత్తమము లగు సరస్వతీ కోకిలానాటకములలో శృంగార ముత్కృష్టగతిఁ బోషింపఁబడినది. పాత్రముల స్వభావభేదములనుబట్టి ప్రేమానురాగము లెట్లు భేదములుగనుండునో కడురమ్యముగ వర్ణించిరి. ఉత్తములగు దంపతుల యన్యోన్యానురాగ మతినిపుణముగ వర్ణింపఁబడినది. ఒకగస మననేల? అన్ని రసముల నట్లే పోషింపఁగల ప్రతిభాశాలి. నాటకరచనయందు వీరిని మించిన వారు లే రని నిర్వచింపవచ్చును. ఈశ్వరానుగ్రహమున నీకవి చిరకాలము సుఖముగ నుండి యిట్టి నాటకరాజముల నింక ననేకములను రచించి యాంధ్రలోకమునకు మహోపకార మొనరించునుగాక! ఈమా పీఠికాపురమున నీపరిషత్తునకు స్వాగతమొసంగెడు భాగ్యము మాకు లభించినది.

నేను బండితుఁడనుగాను, నేను జెప్పినవానిలో నభిప్రాయభేదములు గాని తప్పులుగాని యుండవచ్చును. నన్నుక్షమింప దగు లని విద్వాంసులకు విన్నవించుచున్నాను. ఆంధ్రసాహిత్యపరిషత్తునకు నత్యంతానందమున స్వాగత మొసంగుచున్నాను. ఈపరిషత్పక్షమున మిక్కిలి శ్రద్ధఁదీసికొని దానిశ్రేయస్సును గోరి శ్రమకోర్చి శక్తివంచన లేక పనిచేయుచు నాంధ్రలోకముయొక్క కృతజ్ఞతకుఁ బాత్రులైన బ్ర॥ జయంతి రామయ్యపంతులుగారికి నమస్కారపూర్వకముగ స్వాగత మొసంగుచున్నాను. కవులకుఁ, బండితులకుఁ విమర్శకులకు, భాషాపోషకులకు, భాషాభిమానులకును, మనఃపూర్వక స్వాగతము. మాయాహ్వాన మంగీకరించి కష్టమని యెంచక దూరదేశములనుండి కూడ విచ్చేసిన సభాసదులకుఁ గృతజ్ఞతాపూర్వకవందనములు.

భక్తిశ్రద్ధలతో మా శక్తివంచనము లేక యతిథిసత్కారము సేయుచున్నాము. మానవుల మగుటచే వీనిలో లోపము లుండవచ్చును. కరుణతో క్షమింపుఁ డని కరములు మోడ్చుచున్నాము.

శ్రీరస్తు.

# అధ్యక్షోపన్యాసము.

— (పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.) —

ఆంధ్రసాహిత్యపరిషదేకాదశవార్షికోత్సవసభకు నన్నగ్రాసనాధిపతిఁగా నియమించినందుకు మీ కెంతయుఁ గృతజ్ఞుఁడను. క్రిందటిసారి యేలూరులో నిట్టిసభ జరిగినప్పుడు నన్నగ్రాసనాధిపతిగాఁ గోరిరి. అప్పటి యనారోగ్యస్థితి వలన నే నంగీకరింపకపోయినప్పటికి నన్నుఁ దిరుగ నెన్నుకొని గౌరవించినందుకు మఱింత కృతజ్ఞుఁడను.

నేను బండితుఁడను గానని యీయూరివా రెఱుఁగుదురు; పైగ్రామములవా రెఱుఁగుదురు. నన్నెఱిఁగినంతవఱ కాంధ్రదేశమంతయు నెఱుఁగును. సాహిత్యహీనతలో జగమెఱిఁగినవాఁడను గాని సాధారణుఁడను గాను. ఇట్టి నన్నుఁ బరిషత్తువా రేల యెన్నుకొనవలయునో నాకుఁ దెలియదు. తెలిసిన విషయ మేమియో యంతకంటెఁ దెలియదు. "వెనుక జరిగిన పది పరిషత్సభలకుఁ బండితుల నెన్నుకొంటిమికదా, యీసారి యపండితు నెన్నుకొందము. ఇంతలోఁ జెడిపోవునదేమున్న" దని యూహించి మార్పుకొఱకై నన్నెన్నుకొని యుందు రేమో! ఎటులైన నేమి, అవిలంఘ్య మైన మహాజనులయాజ్ఞ దులసీదళమువలె శిరమున ధరించి యిట నిలువఁబడితిని. నాకు సందేహ మెందుకు? నన్నిట నిలువఁబడుటకు నియమించినవారే నాచేఁ దమకార్యమును నిర్వహింపించుకొను భారమును సహించియున్నపుడు పనికిమాలిన సందేహము లొందుటకంటెఁ బామరత్వ ముండునా? కవి కుండఁదగిన యోజనతోఁ ద్రుపాటు సందేహము సలజడి కవిచేతిలోని కలమున కెందుకు? ఈ స్వల్ప సాధనమును మీ యిష్టానుసార ముపయోగపఱుచుకొని మిమ్ము మీరు కృతార్థులుగఁ జేసికొనుఁడు. కలముగూడఁ గానంత మంచిదే యనునట్లు నన్ను రవ్వంత కృతార్థునిఁ జేయుఁడు. చేయుట కవకాశము లేకపోయినఁ బోనిండు. ఇఁకఁ గార్యక్రమము ననుసరించి సభాచర్య జరిగింతము.

సమ్మానసంఘాధ్యక్షుని మనోహరమైన యుపన్యాసమును వింటిమి. దానినిగూర్చి నే నేమైనఁ జెప్పవలసియుండునెడల నా యుపసంహారోపన్యాసమందుఁ జెప్పెదను. ఇఁక నా యుపన్యాసమును జదివెదను.

పీఠికాపురము.—ఈసభ పీఠికాపురమున కేతదాస్థానమహారాజుగారిచే నాహ్వానింపఁబడినది. ఆహ్వానించినవా రెట్టివారు? ఆంధ్రభాషాపోషకులు, నాంధ్రభాషాకోవిదులు, నాంధ్రభోజబిరుదార్హులు, నత్యంతసుగుణసంపన్నులగు నీ మహారాజుగారు. ఆహ్వానింపఁబడిన దేది? అన్నిదేశభాషలలో నమృతాధిక మాధురీధురీణయని యేభాష యాచంద్రార్కఖ్యాతిఁగాంచినదో, యేభాషామ తల్లిని సేవించుటచే రాజరాజనరేంద్రుఁడు మన యందఱియిండ్లలో దేవతా గృహవేదికలపై దివ్యమూర్తులతోపాటు పూజనందుచున్నాఁడో, యేభాషా యోష నభ్యర్చించుటచేఁ గృష్ణదేవరాయల యశస్సింహాసన మష్టదిగ్గజములు వహించుచున్నవో యట్టి యాంధ్రభాషాదేవిని సేవించుట కేర్పాటుకాఁబడిన సాహిత్యపరిషత్తు. ఆహ్వానించిన దెచ్చటికి? రామలింగకవి కాలమునకుఁ బూర్వమునుండియే కాక యిప్పటికిఁగూడఁ గళింగదేశాభరణమగు పీఠికాపురమునకు. మల్లన్న—ప్రౌఢకవి మల్లన్న కాఁడు. పావులూరి మల్లన్న భిన్నాంకపు టక్కుటిక్కు లెక్కడి కొక్కబారెఁడులోనివే. మలయమారుతముతో వచ్చిన రసికజనమనోభిరామపరిమళము లిటకు రెండుబారలలోనివే. లక్షణాపరిణయ శబ్దాలంకారపు టంగుటెంగు లిక్కడికి మూఁడుబారలలోనివే. అయిన నిది కేవలము సారస్వతప్రాముఖ్యమునందిన పట్టనము మాత్రమే కాదు. శివకేశవ సన్నిధానమునఁ బరమపవిత్రమైనది కూడను. పాదగయాక్షేత్రమగుటచే నిది మహాక్షేత్రము. అష్టాదశపీఠములలో నిది యొకటి. మహాకవినిలయ మగుటచే రక్తికి, మహారాజాస్థాన మగుటచే భుక్తికి, మాధవమహాక్షేత్రమగుటచే ముక్తికి నిదానమైన యీపుర మాంధ్రదేశమహిళామతల్లి కంఠమాలానాయకమణియై ప్రకాశించుచున్నది.

ఇదికాక చీనాదేశపువారి రాయబారి హియన్ త్సాంగ్ అనునాతఁడు మన యార్యావర్తదేశమునకు వచ్చి యిచ్చటివిశేషములు వ్రాయుటలో దక్షిణమునఁ బిష్టపుర మనునొక ప్రసిద్ధమయినపట్టన మున్నదని వ్రాసినాఁడనియు, నంతకుఁబూర్వఁ డెవఁడో గ్రీసుదేశస్థుఁడు కాఁభోలుఁ బిష్టపురఖ్యాతిని వెల్లడి చేసి యుండెననియు మ-రా-రా-శ్రీ, దివాన రెబిల్ న్యాయమూర్తి వేపా రామేశముపంతులుగారు నాతోఁ బలికిరి. ప్రాచీనచరిత్రాంశ విమర్శనాసక్తులగు వారిమాటలను బట్టి యీపట్టనము దాదాపుగాఁ గ్రీస్తుశకమునకుఁ బూర్వము నుండియుఁ బ్రసిద్ధి వహించి యున్నదేమోయని యెంచఁదగియున్నది.

మహారాజమందిరము.—అట్టి యీపట్టనమున మహారాజమందిరమున మన సాహిత్యపరిషత్తు సమావేశమైనది. సంగీతసాహితీసుప్రసిద్ధుఁడగు కవివర్యుని యనేక చిత్రవిచిత్రార్థప్రతిపాదనయుక్తమైన వసుచరిత్ర సంగీతపురాణపఠనము జరిగిన దీ సభయందే. సర్వకామదకుఁ బరిణయ మెందుకోయి యని రామభక్తుఁడైన లక్ష్మణుఁడు కృష్ణమూర్తిని బరిహసించిన దీ సభయందే. బులుసువారింటఁ బుట్టిన విద్యారణ్యుఁడు ముప్పదిరెండుపుట్ల రత్నగర్భను రామార్పణముగ గ్రహించిన దీ సభయందే. భరతాభ్యుదయాధిపతి శతఘంటకవిత్వకాలమున శారదాదేవితోఁగూడ గజ్జెలుకట్టుకొని తాండవించిన దీ సభయందే. రావువంశముక్తావళిని రామరాజేంద్రుని కంఠసీమనలంకరించిన యాస్థానసోదరకవు లర్ధసింహాసనమధిష్ఠించిన దీ సభయందే. కవులకుఁ గనకవర్ష మన్నిఋతువులందుఁగూడ గురియుచున్న దీ సభయందే. నవీనగౌతములు నర్వాచీనపాణినులు నూతనబాదరాయణులు విజయదశమినాఁడు మా మహారాజేంద్రునిపై వారి పుత్రపుత్రికాసంతతిపై నాశీఃప్రసవవృష్టిఁ గురియించుచున్న దీ సభయందే. ఆస్థానవైణికాగ్రగణ్య వీణారవామృతాస్వాదనావశములైన చిలుకలుఁగూడ స్తంభోపరివిటంకములనుండి సహజవైఖరిని "రామా" యని యనఁబోయి సంగీతవైఖరిని "రీమా" యని యనుచున్న దీ సభయందే. అట్టి యీసభయందుఁ దెనుఁగురాయఁడు మొదలు తెనుఁగుబాసలోఁ బండితుఁడు తెనుఁగుబాసకుఁ బరిపోషకుఁడునగు నీ మహారాజునకు విద్యాపోషణమునకు విశేషవిశ్రుతికెక్కి దినదినప్రవర్ధమానముగ నెక్కుచున్న—యితోధికవృద్ధిగా నెక్కఁగల యీసభయందు, రమాశారదాకేళీమందిరమగు నీసభయందు మనము నేఁటికి సమావేశమైతిమి. ఎందుకు? ఆంధ్రశారదాదేవీ సమారాధనమునకు. ఆహా! ఎంత మహాకార్యమునకై—యెంత మహారాజుచే నాహ్వానింపఁబడి యెంత మహాక్షేత్రమున నెంత మహోన్నతయశస్వంతమైనసభయం దెందఱు మహాకవిపండితులు సమకూడిరో! ఆంధ్రభాషాపండితులును నాంధ్రభాషాభివృద్ధికై యత్యంతము శ్రమమొనర్చుచున్నవారును నగు గౌరవ్యులగు శ్రీరాజా పానుగంటి రామారాయణంగారు నిరంతర రాజకార్యనిర్వహణదీక్షాబద్ధులై యుండుటచే నిటకు దయచేయుట తటస్థింపదేమో యని సందేహించితిమి కాని యాదృచ్ఛికముగఁ గార్యాంతరములచే గంజాముమండలమునకు వారు వచ్చి తిరుగ మదరాసునకుఁ బోవునప్పుడు తమ మిత్రులగు మా మహారాజుగారిని జూడ నిట దిగి పరిషత్సభ నిట్లలంకరించుట భాషాభిమానుల కందఱకుఁ బర

మూనందముగా నున్నది. మదరాసులో రాజప్రతినిధిగారి ప్రథమమంత్రి వీ రగుటచే రాజప్రతినిధిగారే పరిషత్సభ నిట్లు బహూకరించి రని యెంచవలసి యున్నది. ఆహాహా! ఇది యెంత మహాసుదినము! సెప్టెంబరు రెండవతేది. పోనిండు. అది మన కెందుకు? దుందుభినామసంవత్సర భాద్రపదశుద్ధైకాదశి భాషాచరిత్రమందు బంగారువర్ణములతో ముద్రింపవలసిన భద్రతిథి కాదా? ఆంధ్రశారదాజయంతి జరుపఁదగిన యమూల్యదిన మిదియేకదా! ఆంధ్రభాషకు జయమగుఁగాక! ఆంధ్రభాషాపోషకులకు జయమగుఁగాక! ఆంధ్రసాహిత్యపరిషత్తునకు జయమగుఁగాక!

ప్రస్తుతాంధ్రభాషాస్థితి.—ఆంధ్రభాష ప్రస్తుత మెట్టిస్థితిలో నున్నదో రవంత చెప్పెదను. నేను జెప్పుట యెందుకు? ఆంధ్రభాషాదేవి యెట్లున్నదో మీరే చూడుఁడు. అదెట్లు? సహజభావనాబలసంపన్నులమైన మనము మన స్ఫూర్తిగాఁ జూడఁ దలఁచుకొన్నయెడల శారదాదేవి మనకుఁ బ్రత్యక్షము కాకపోవుటయే! మనశ్శక్తికి బద్ధులుకాని దేవత లెవరు? నాయనలారా! బాహ్యనేత్రములను రవంత ముకుళింపఁ జేయుఁడు. అంతరనేత్రజ్యోతి నెగసనఁ బొడిచి దాని కిరణము లటులిటులు చెదరనీయక సంక్షోభనింపఁ జేసి మనకుఁ గావలసినవిషయముపై సుస్థిరముగ సూటిగఁ గేంద్రీకృత మొనర్పుఁడు. ఆహా నాకలందలి యన్వేషణజ్యోతికంటె ననేకగుణ తేజస్సమృద్ధమగునట్లు వెలుఁగఁ జేయుఁడు. ఇఁక నేమి? అదిగో! అదిగో! ఒడలు జలదరించునట్లు, కనులు కృతార్థములగునట్లు, మనస్సు పుష్పించునట్లు, జన్మము తరించునట్లు—ఆంధ్రశారదాదేవి దర్శన మిచ్చుచున్నదే! అనేకసహస్రచంద్రమండలసన్నిభమైన యాస్యమండలము వీణాదండముసంక రవంత యొఱగియున్నది. అందుచేఁ గిరీటము నుండి వ్రేలాడుచున్న ముత్తెములగుత్తి మేరువునొద్దనున్న వీణబిరడపై వ్రేలాడు చున్నది. బాగుగాఁ బరిశీలింపుఁడు. ఎడమమోఁకాలిపై మడఁచిన కుడిమోఁకాలి వంపుప్రక్కను రవంత వెనుకగ దేవభాచందననిర్మిత మైన వీణకుండ ప్రకాశించుచున్నదే. దివ్యస్వరసుధాసేచనమున వీణాదండము తీఁగచెట్టు చిగిర్చినట్లామె యెడమచేయివ్రేళ్ళు తంత్రులపై నెట్లు కదలుచున్నవో. ఆహా! అదిగోఁ, గుడి వైపున రాజరాజనరేంద్రుఁడు నెడమవైపునఁ గృష్ణదేవరాయలు వింజామరములు చేతఁబుచ్చుకొని యెట్లు వీచోపులిడుచున్నారో! అదిగో! ఆపీఠము మొదటఁ బీతాంబరపు నడికట్టుతో నిలువఁబడి దేవికిఁ బారిజాతపుష్పములతోఁ బూజ లొనర్చుచున్న యా పౌరోహిత్యబ్రాహ్మణుఁ డెవరో యెఱుఁగుదురా?

అదిగో! ఒక్కచింతాకంతవాసి—క్రిందుగ నిలువఁబడిన యాకుండలాల సోమయాజి కప్పూరపుటారతిపళ్లెరము చేతఁ బుచ్చుకొని—వహ్వా! నీరజాసననీరజపత్రాక్షికినివ్వాళు లిచ్చుచున్నాఁడే! మఱియొక బెత్తెఁడుక్రింద—పురోహితునియంత పొట్టియుఁగాక, సోమయాజియంతపొగయుఁ గాక మట్టసపు మాదిరిగనున్న మంత్రిశిఖామణి మహాలక్ష్మీదేవి కోడలిని మందాకినీసలిలపుగిండిదోసిటఁబట్టుకొని సేవించుచున్నాఁడే! ఆర్యులారా! చూచుచున్నారా?

ఉ. క్షోణితలంబు నెన్నుదురు సోఁకగ మ్రొక్కి నుతింతు సైకత
 శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర
 శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైకవాణికిన్
 వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్.

అని పఠించి చాపచుట్టగ సాష్టాంగదండప్రణామ మిడుచున్న యాజాంబూనదవిగ్రహమును గాంచి మీకన్నులానందబాష్పములను విడుచుచున్నవా? ఆహా! అది యేమి? ఆకవిత వినియేనా శారదాదేవి శిరఃకంపన మొనర్చినది! కాక యుభయమహారాజేంద్రుల వింజామర సేవవలననా యామెచెవినున్న చెంగల్వ కదలినది! అట్లు కదలిన చెంగల్వనుండి జాఱిన యమృత బిందువు లెట్లు వీణాతంత్రులపైఁ బడుచున్నవో! నాయనలారా! ఈచర్యయంతయు నామె పీఠమునకు దిగువనున్న రెండుమూఁడు మెట్లమీఁదిది! కాని యిది యంతయు మనకేల? దిగుఁడు; ఏడెనిమిది మెట్లు దిగుఁడు; మృచ్ఛకటికాపరివర్తనమును జూలియస్ సీజరుపరివర్తనమును జేతఁబట్టికొని నిలువఁబడిన యాస్థవిష్ఠుని గాంచితిరా! బిల్వేశ్వరీయ శంకరవిజయధ్వజాది గ్రంథములను జేతఁబుచ్చుకొని "పలుకుదయ్యమా! ఇవి పాయసమమ్మా! బమ్మదయ్యపుటిల్లాలా! ఇదిపానకమమ్మా! త్రాగుమమ్మా" యని తలకంపింప స్పష్టముగ సంబోధించుచున్న యా హ్రస్వరూపుని గాంచితిరా? అదిగో! మహేంద్రవిజయ నయనోల్లాసకర్తలగు సోదరకవులు శ్రవణానందముగ శారదాగాన మొనర్చుచున్నారు వినుచున్నారా! వారిగానమధురిమచే నాకర్షింపఁబడి కాఁబోలు నొక్క శాంతస్వరూపుఁ డైన వృద్ధుఁ డటకువచ్చి యారంభించిన భారతము పూర్తికాలేదు; ఇది యమ్మగారికర్పింపవచ్చునా లేదా" యని పీఁచుకాగితముల పెద్దకట్టను వారికిఁ జూపి యడుగుచున్నాఁడు. ఆలకించుచున్నారా? ఏవో బరువైన గ్రంథములు పది సంపుటములు కాఁబోలుఁ జేతఁబుచ్చుకొని యెఱ్ఱ మధురపాగఁ జుట్టుకొని దగ్గుచు గష్టమున మెట్లెక్కుచున్న యాముసలియాయన యెవరో యెఱుఁగుదురా? ఈయనను

జూచి బిల్వేశ్వరీయకర్త గుఱ్ఱుమనుచున్నాఁడేల? తనప్రసన్నరాఘవ విమర్శనము మాటపరాకు పడినాఁడు కాఁబోలు! ఆహా! శతఘంటకవు లిద్దఱు—ఒకరు ముసలివారు నొకరు పడుచువారు. ఒకరెట్టినివారు నొకరునల్లనివారు. ఒకరుపొట్టివారు నొకరు రనంత పొడుగువారు నొండొరులఁ గౌఁగిలించుకొని మనగ్రంథములు శారదాదేవి కర్పింతమని యొకరితో నొకరు చెప్పుకొనుచుఁ బూర్వవైరములు వదలి చెట్టపట్టముల వైచుకొని మెట్టు లెక్కుచున్నారు వారిని గాంచితిరా? కాని వీరి కొకటి రెండుమెట్లు ముందు బుద్ధచరిత్రమును సరస్వతీ సంచికలను జేతఁబట్టుకొని కంటిజోటితో ముందునకుఁ బోవుచున్న యా భాషాపోషక తేజ మేబ్రాహ్మణప్రభునిదో పరిశీలించితిరా?

మహాజనులారా! ఇదినఱకు మనము కాంచిన వారందఱు గతించినవారు. ఇప్పుడు బ్రదికి బట్టకట్టుచున్నవారిని గ్రంథము కలముఁ బట్టినవారి నికముందు చూడఁదలఁచియున్నాము. ఇకఁగొన్ని మెట్లు దిగుఁడు. అదిగో! శారదాదేవీ చరణారాధనమునకై యింద్రధనుస్సురంగులుగల యెన్నియోపూవులను దట్టలోఁ బెట్టుకొని యొక్క ముసలియాయన యా మెట్టుమీఁదఁ గూరుచుండినాఁడు, కనఁబడుచున్నాఁడా? అవి భక్తచింతామణి పుష్పములు కాఁబోలు! అచ్చట నొకపెద్దదుకాణమున్నది, చూచితిరా! అదేదో వంగభాషనుండి పరివర్తనమునొందిన బహుళములైన నవలలుగల గ్రంథనిలయము కాఁబోలు. ఆ ప్రక్కను ఫర్లాంగు చదరపుస్థలములోఁ దాదాపుగఁ బండ్రెండుగజముల యెత్తువఱకుఁ బేర్పఁబడిన యా పుస్తకముల సమూహమేదో యెఱుఁగుదురా? అవియే పాటలనాటకములు. ఓ! యెగురుచున్నవి. గిరగిరదిరుగుచున్నవి! నేలపైఁబడుచు నెంతగం దరగోళమైనఁ జేయుచున్నవి. ఈ సందడిలోఁ బర్లాకిమిడి వాస్తవ్యుఁడైన బ్రాహ్మణుఁడొక్కఁడు నవ్యసంగీతపురాణధోరణితోఁ దాళపుఁజిప్పలు చేతఁబుచ్చుకొని తాండవించుచున్నాఁడు. అదిగో! ఒక్క భాషాపండితుఁడు "ఇటుచూడుఁడు" అనితర్జనితోఁ జూపించుచున్న పెద్ద యక్షరములేవో చదువఁగలరా? "విజ్ఞానసర్వస్వాది గ్రంథము లిక్కడ" నని వ్రాయఁబడియున్నది. సెబాస్! ఇవి గీతపద్యనాటకము లని యెవ్వఁడో యొకఁడు కీర్తనారసంచిమూటను విప్పుచున్నాఁడు. ఇవి స్వతంత్రముగ రచియించిననవలలని గుమికూడి కొందఱేవో పేళ్లను జదువుచున్నారు. సౌందర్యతిలక మని మఱియేమో యని వినఁబడుచున్నది. ఇదిగో, నూతనాంధ్రవాఙ్మయచరిత్ర మని యొకపుస్తకమును బైకెత్తి యెవరో చూపుచున్నారు. ఆమూలలను రాశిపోసినవన్నియు గ్రామ్యభాషాగ్రంథములు.

అచ్చట వృద్ధుఁ డయ్యును బలిష్ఠుఁ డైనయొక బ్రాహ్మణవర్యుఁడు గ్రామ్యభాషోత్కృష్టత నుపన్యసించుచుఁ దమ పుస్తకములలోఁ బ్రమాదమునఁబడిన విమర్శాదర్శవిమర్శాదర్శ మను గ్రంథమును బైకిఁదీసి గీతనాటకముల దొంతరపైకి ధూయని విసరివైచుచున్నాఁడు. అచ్చటఁ జేరిన గ్రంథకర్త లయిదాఱువందలకుఁ బైగ నున్నట్లు కనుపట్టుచున్నారు. వీరందఱ చేతులలో నొక నాటకమో నవలయో ప్రహసనమో చిన్నకథయో యున్నదికాని రిక్తహస్తుఁడొకఁడును లేఁడు. ఇక్కడఁ జుట్టకాని సిగరెట్లుకాని కాల్చఁగూడదని పెద్దయక్షరములు గోడలపై వ్రాయఁబడియున్నయాకొట్లేవో యెఱుఁగుదురా? అవియే తాళపత్ర గ్రంథనిలయములు. ఆ సమీపముననే కొందఱు చేతులలో నేవియోకాని గలగలలాడించుకొనుచుఁ దిరుగుచున్నారు కనుచున్నారా? రాగికడియములలోఁ దగిల్చిన రాగిరేకు లున్నవే, యవియే పూర్వశాసనములు. వారే భావ్యంధ్రసారస్వత చరిత్రకారులు. వహవ్వా! ఎక్కడఁ జూచినఁ గవియే. ఎక్కడఁ జూచిన నాటకకర్తయే. ఎక్కఁ జూచిన నాఖ్యాయికుఁడే. ఎక్కడఁ జూచిన విమర్శకుఁడే. ఎక్కడఁ జూచినఁ దూర్పువారి పొట్టియేచ, పడమటివారి బారెఁడేసి దీర్ఘములు, మధ్యమండలపువారి మట్టసపు మాటలు. ఒకరీతి యేమి యొక వైఖరి యేమి? అచ్చట నన్నియుఁ గలసియున్నవి. కవులు గవులను దిట్టుచున్నారు. కవులు విమర్శకులను దిట్టుచున్నారు. విమర్శకులు కవులను దిట్టుచున్నారు. విమర్శకులు విమర్శకులను దిట్టుచున్నారు. కవులు విమర్శకులై వారు విమర్శకులుఁ గవులైన వారిని దిట్టుచున్నారు. వీరిపక్షపువారు వారి పక్షపువారిని దిట్టుచున్నారు. వారిపక్షపువారు వీరిపక్షపువారిని దిట్టుచున్నారు. ఏపక్షమున లేనివారు, రెండుపక్షములవారిని దిట్టుచున్నారు. మహాజనులారా! ఈ మహాకోలాహలములోఁ గొందఱు మగువలు కూడఁ గనఁబడుచున్నారు చూచితిరా! అబలాసచ్చరిత్ర రత్నమాలయని సావిత్రీనాటకమని మఱియేమోయని సన్ననైన గొంతులతో సంగీతమువంటి ధ్వనులు వినఁబడుచున్నవి. తెల్లగ సుద్దకొండలవలె నగపడునవి యేవో తిలకించితిరా! ఆంధ్రపత్రికలు, కృష్ణాపత్రికలు, హితకారిణీపత్రికలు, న్యాయదీపికలు, గోదావరీపత్రికలు, జన్మభూమిపత్రికలు. ఇవి కాక యెన్నియో గ్రంథరూపమున వెలువడిన సంచికలు. ఇఁక నావైపున నున్నవారెవరు? వారే నవ్యకవులు. తెనుఁగుతోటలో యుద్ధగీతములు, మోహగీతములు, భావగీతములు, ప్రేమపాటలు రుంయిమని రొదచేయుచున్నవి. వినుచున్నారా? ఈ మహాసంకులములో రాట్నపుగీతములు, ప్రత్తిగీతములు, ఖద్దరు

పాటలు, నూలొడుకుపాటలు, ఏకు, చేయుపాటలు, స్వరాజ్యదర్పణములు స్వరాజ్య తాంబూలములు! ఇవికాక స్త్రీలు పురుషులుఁకూడఁ దెఱపిలేకుండ నుపన్యాసములు! వాక్కునకు వ్రాఁతకు నింత విజృంభణము ముందెన్నఁడైన నుండెనా? ఓ! ఏమి సంచలనము! ఏమి సంక్షోభము! ఎంతశక్తి! ఎంతజీవము! ఎంతధాటి! శారదాదేవి కింత మహోత్కృష్టదినములే లేనట్లు కనఁబడుచున్నదే! కాని మొదటి రెండు మూఁడు మెట్లమీఁదివా రెవరో కేకలిడుచున్నారు వినుఁడు. “ఎందుఁకా గోల! ఎందుకా పనికిమాలినవ్రాఁత! ఎందుకా తుక్కు! ఆ పెంట” యని కేకలిడుచున్నారే. సరస్వతీదేవి యామాటలు విని సన్న సన్నగ నవ్వుచున్న దెందుకో, యెవ్వరైన నెఱుఁగుదురా? ఎఱిఁగియుండు నెడల నాకుఁ జెప్పరా? మీరు, మీరు. ఇంతలో నా మూలనుండి యేదియో ధ్వని వచ్చుచున్నది వినుఁడు. ఎవఁడో మాటలాడుచున్నాఁడు. “పనికిమాలిన వ్రాఁతయా! అబ్బ? మమ్మధిక్షేపించుచున్న మీరు చెప్పిన కవిత పనికిమాలిన వ్రాఁతకాదు కాఁబోలునేమి! మీ పైవారికవిత ముందు మీరు చెప్పినదియుఁ దుక్కే క్రింది వారివ్రాఁత పైవారివ్రాఁతముందుఁ దుక్కు. అది వారి పైవారి వ్రాఁత ముందుఁ బెంట. అన్ని కవిత్వములుఁ గాళిదాసుని కవిత్వము ముందుఁ దుక్కు. కాళిదాసుని కవిత్వమైనను పుట్టతేనె కవిత్వముముందుఁ బెంట. అదియైనను బ్రహ్మానుసంధానమున వేదర్షులనుండి నిష్ప్రయత్నముగ నుద్బుద్ధమైన కవిత్వము ముందు దుక్కు. ఆవేదర్షులైనను యోగమాహాత్మ్యమునఁ దపోమాహాత్మ్యమునఁ బ్రకృతికాంతముంగురులలో నొక్క వెండ్రుకలోని వంకరటింకరలైనను సరిగఁ జెప్పలేకపోయిరే. అట్టిచో నెవని కవిత్వము దుక్కు, ఎవని కవిత్వము ముక్కు, ఎవనికవిత్వము పెంట, ఎవని కవిత్వము పంట. అందఱుఁ బ్రయోజకులే! అందఱప్రయోజకులే! మాకాలమందు మమ్మెట్లు పైవారు తిట్టుచున్నారో మీకాలమందు పైవారు మిమ్మట్లు తిట్టినవారె. లోకచరిత్ర మన్నియుగములందుఁగూడ నాడిన యాటయే యాడుచున్నది కాని యొకచోటఁ గ్రోఁతులభాగవతమాడి యొకచోట గోవిందనామస్మరణ చేయుటలేదు. బుద్ధిలేకపోవుటచేత నెప్పటికప్పటికే పరాకు. పైమెట్టువారు వారి పైమెట్టువారి మొట్లనుదినుచుఁ దమ క్రిందిమెట్టున నున్నవారిని మొట్టుచున్నారు. ప్రపంచమునకు సిగ్గెక్కడిది?” అని ఇంకనేమేమో జంఘాలశాస్త్రి యాకాశమంతనోరు పెట్టుకొని మొండి మోటత్రోపుగా బడితబాజాపద్ధతిని బలుకుచున్నాఁడు. సాక్షిసంఘోపన్యాసము లింకఁ గట్టిపెట్టరాదటయ్యా యని పైమెట్టునుండి వెంకటరత్నముగారు

కాంబోలు పలికినారు. ఈ వెంకటరత్నముగారికి సాక్షియనంగ నింతద్వేష మెందుకో! మహాజనులారా! మఱియొక ప్రక్కనుజూడుఁడు. అఱువది సమీపించుచున్న వృద్ధపండితుల యెదుట నిద్దఱు పడుచుపండితులు కూరుచుండి యప్పుడే యక్షరస్వీకరణ మొనర్చుచున్న యర్భకులవలె "ఇఈ ఉఊ" అనుచున్నారేల? వారే సూర్యరాయనిఘంటుకార్యాలయమందలి పండితులు. గ్రామ్యభాషాగ్రంథోపద్రవమునుండి భాషను రక్షించి యుద్ధరించిన భాషాకోవిదుఁడైన యాంధ్ర భోజమహారాజు మీయెదుటనే కానఁబడుచున్నాఁడు. "భాషోద్ధారకా! పుత్రపౌత్రాది సంపత్తితో నిండుగానూఱేండ్లు వర్ధిలుమయ్యా మహారాజా!"యని మహాజనులందఱొక్కమా ఱాశీర్వదింపరా? మహాజనులారా! తెలుపఁబడుచున్నది. దేవతాదర్శన మికఁ జాలును.

మహాజనులారా! శక్తివంచనలేకుండ శారదాదేవీపూజకై యెందఱు గ్రంథకర్త లెంతగాఁ బాటుపడుచున్నారో చూచితిరా? ఇన్నిపాటులుపడి యేమి ప్రతిఫలమొందుచున్నారో యెఱుఁగుదురా? పస్తులు, పరిభవములు. ఈపుస్తకములన్నియు మంచివికాకపోవుటచేతనే ప్రజలు వాని నిరాకరించుచున్నారా? మంచివో చెడ్డవో చూచినతరువాతఁ గదా తెలియవలసినది. అట్లుచూచినవారెవరు? చూచుటకోపిక యెవరికి? చూచుటకుఁ దీఱిక యెవఱికి? చూచుటకంత భాషాభిమానమెవరికి? చూచుట కక్షరజ్ఞానమైన నెందఱకు? ఆంధ్రదేశ ప్రజలలో విఱివిగా లెక్కచూచుకొనినయెడల నూటికిరువదిమంది కాంధ్రభాషాజ్ఞానమున్నదేమో? చాలు. అంతేచాలును. లేకపోయినప్పుడు చాలదని దేవులాడిన లాభ మేమున్నది? చదువుట కర్హులగు నీ యిరువదుగురిలో వారెవ్వరో చెప్పనా? న్యాయవాదులు, సర్కారుద్యోగులు, వర్తకులు, పాఠశాలోపాధ్యాయులు, గ్రంథాగారసంపాదకులు, మార్గస్థులు, వేశ్యాప్రియులు మొదలగువారున్నారు. న్యాయవాదులు సర్కారుద్యోగులు వర్తకులుఁ బాఠశాలోపాధ్యాయులు నాంధ్రభాషచదువరు. ఆంధ్రభాషలోఁ దఱచుగ మాటలాడరు. ఆంధ్రగ్రంథములుముట్టరు. తత్రాపియాధునికుల గ్రంథములపేరే వినరు.

వీరివలన భాషకుఁగాని భాషాజ్ఞానసంపన్నులగు గ్రంథకర్తలకుఁగాని యేవిధమైన లాభములేదు. ఇఁక గ్రంథాగారసంపాదకులు బీరువాలలోఁ బెట్టి బీగముపెట్టుటకు వారి గ్రంథములు సగమువెలకుఁ గొందురు. ఇఁక నటకులు డూపాయకు మూఁడుపావులాలు తగ్గించుకొని యా గ్రంథములనుగొని వారికి నోటికంకని జ్ఞప్తిలోనుండని పనికిమాలినవనితోఁచిన భాగములను ఖండించి

నాటకములలో నుంచిన పాత్రములలోఁ గొన్నిటిని దీసి వైచి మఱికొన్ని సొంతపాత్రములఁ జేర్చి చావవలసిన వారిని బ్రదికించి బ్రదికియుండవలసినవారిని జంపి గదిలోని భార్యాపరీరంభక్రియమొదలు కాటిలోని కడపటికర్మము వఱకన్నిపనులుగూడ, పార్శీమట్ల పాటలచేత జరిపించి గ్రంథమంతయు భంగమొనర్చి భ్రష్టమొనర్చి పరశురామప్రీతి చేయుదురు. ఇఁక మార్గస్థులు రైలులోఁ బ్రయాణ మొనర్చువారు రెండణాల కొక్క నాటకమో యాఱుడబ్బుల కొక్క నవలయో కొని కునికిపాట్లువచ్చునప్పుడు రవంతచూచుచుఁ జుట్టగాల్చి దానిపైఁ బ్రమాదవశమున థూకరించుచుఁ దప్పునిసరియైనప్పుడుమాత్రము పాదరక్షలతోఁ ద్రొక్కుచు నేసందడిలోనో కాఫీపాత్రయో నీటించెంబో తిరుగఁబడుటచే నది తడిసిపోవఁగ దాని నావలనో మూత్రపుగదిలోనో పాఱవేయుదురు. ఇంక వేశ్యాప్రియులు తమ వేశ్యలయొద్దఁ దాము మిగుల రసజ్ఞుల మనిపించుకొనుట కేదో నవలయో నాటకమో కొని వారియొద్ద వారి ప్రీతికొఱకై నాటకపద్ధతిగాఁ జదివి మంచముక్రింద బాఱవేయఁగా దానిని వేశ్యమాత యడ్డుపొగకో, ప్రధాననాయిక పాలాస్త్రిపట్టులకో వినియోగింతురు. గ్రంథము లెట్లు భ్రష్టమయినను గ్రంథకర్త లొక్కపూఁటయైనఁ దినుటకు వీరివలననే సదుపాయ మగుచున్నది. ముష్టికాఱువాఁడు గ్రంథము కొనవలసినదే కాని పావులాడబ్బులు పెట్టి భాగ్యవంతుఁ డొక్కపుస్తక మైనఁ గొనఁడే. నలువదిరూపాయలు జీతము తెచ్చుకొను జనుఁడు మొదలు నాల్గువేల రూపాయలు జీతము తెచ్చుకొను జస్టిసు వఱకుఁ జదువుకొనుట కొక్క యాంధ్రగ్రంథమైనఁ గొనినవాఁడు కనఁబడఁడే. సిగ్గు. సిగ్గు. జాతికిసిగ్గు. దేశమునకు సిగ్గు. ఆంధ్రగ్రంథముకొనినయెడల నప్రయోజకత. అభాగ్యత-అప్రతిష్ఠ-అజ్ఞత-ఈభాగ్యవంతులలో నట్టి యపోహమంతరించినఁ గాని యట్టిగర్వము కడతేరినఁ గాని యట్టియజ్ఞానము ధ్వస్తమైనఁగాని భాష బాగుపడనేరదు. కడుపుకట్టుకొని కవు లెన్నిగ్రంథములను వ్రాయఁగలరు? ఎంతకాలము వ్రాయఁగలరు. భాషాసేవకై వినియోగపడని వీరి భాగ్యమెందుకు? వీరు గ్రంథములువ్రాయనక్కఱలేదు, చదువనక్కఱలేదు, వీరు మైన్సు పినాల్‌కోడ్ (Maynes Penal Code) కంఠపాఠము తలక్రిందుగాఁ జేయవచ్చును. కళాపూర్ణోదయ గాథనైన విననక్కఱలేదు. జస్టిసు బెన్సను (Benson)గారి తీర్పులన్నియు వీరి జిహ్వాగ్రమున నుండ నేవచ్చును. జనకచక్రవర్తి యెవరో వీరికిఁ దెలియనక్కఱలేదు. వీరు భాగ్యవంతులయొద్ద బదుళ్లుతీసికొని దివాలాలు తీయనేవచ్చును, సుమతీశతకమైనఁ జదువనక్కఱలేదు. ఆంధ్రదేశమునఁబుట్టి ఆంధ్రులై ఆంధ్రజాతిరక్తమును

దేహమునఁ గలిగియున్న వీ రాంధ్ర కవుల గ్రంథముల నాంధ్ర దేశముకొఱకైనను నాంధ్రభాషకొఱకైనను నాంధ్రజాతికొఱకైనను దమ యాంధ్రత్వమును నిలువఁ బెట్టుకొనుటకైనను గొనక తప్పదు. కొన్ని గ్రంథములు చదువనైన నక్కఱ లేదు. చదివినయెడల మఱింత మంచిదే, భాషాజ్ఞానమును సంపాదించుకొని కవులను బోషించినయెడల మఱింతమంచి దే. పోషించుట యేమున్నది? పుస్తకమును గొన్నయెడల నంతేచాలును. భారత భాగవతము లెఱుఁగనివాఁడు బారిష్టరైన నేమి భండారాధిపతియైన నేమి? ప్రభుఁ డైన నేమి? బ్రహ్మాండనాయకుఁ డైన నేమి? అతఁడాంధ్రుఁడుమాత్రము కాఁడు. ప్రజాపోషణము గ్రంథకర్తల కత్యావశ్యకము; మన దేశమునందే లేదుగాని మిగిలినయన్ని దేశములందుఁ గూడఁ గవులకుఁ బ్రజాపోషణమున్నది. ఈనిర్భాగ్యత యీదురవస్థాగ్రగణ్యము మన దేశమందే. ప్రభువు లెందఱుకవులను బోషింపఁగలరు? ఎంతకాలము పోషింపఁగలరు? ప్రజలా భాషాపోషణభారమును గొంతవహించుట విధి. దేశభక్తియని భాషాపోషణమని స్వార్థపరిత్యాగమని స్వరాజ్యమని మఱియేమో యని యార్యావర్త దేశమంతయ నట్టుడికినట్లుడుకుచున్నప్పుడే యార్యావర్త దేశక్షోభమునుగూర్చి యవతలి ప్రపంచమంతయు నాందోళన పడుచున్నప్పుడే యాఱణాల డబ్బులిచ్చి యొక్క యాంధ్రగ్రంథమును ననేక సహస్రసమార్జనసాహితీచక్రవర్తులలో నొక్కఁడైన గొనలేకుండనున్నాఁడే! ఆహా! ఏమి యాంధ్రదేశభాగ్యము! ఇఁకఁజాలును, దానికిఁజాలును మనకుఁజాలును.

నిజమే గ్రంథములెల్లెడల బయలువెడలుచున్నవి. గోరంటలు పుట్టుచున్నవి. గుల్మబులు పుట్టుచున్నవి, గులాబులు పుట్టుచున్నవి. కుక్క గొడుగులు పుట్టుచున్నవి. అన్నియు మంచివే పుట్టవలెనని ప్రకృతిలో శాసనమున్నదా? ఎచ్చటనైన నటులు పుట్టినవా? ఏకాలమందైన నట్లు పుట్టినవా? ఏజాతిలోనైన నట్లు పుట్టినవా? ఉహుఁహు. అన్నియెడల నుహుఁహన్న ప్రకృతి మనయెడల మాత్రము "ఊఁ యని యేల యనవలయును? కలువతీఁగప్రక్కనే తూఁటికాఁడ; ముత్తైనరిప్రక్కనే చికిలింత; మొల్లతీఁగెప్రక్కనే మొండిచేయి; ఘనాఘన గర్జవెంటనే కప్పకూఁత; దేశకాలపాత్రములఁబట్టి ప్రకృతి తన మనోభామును బహిర్గత మొనర్పకతప్పదు.

మామిడిపూఁత యెట్టిదో మసూరిపోఁత యట్టిది. గోరంటపూవు వాసన యెట్టిదో కోరింత దగ్గట్టిది. గుబ్బలాఁడి కంటితళు కెట్టిదో మబ్బులోని పిడుగట్టిది. పద్మములోని మధు వెట్టిదో పాములోని విస మట్టిది, గ్రంథకర్త రణగీత

మెట్టినో యతిమాత్రరోగి రాచపుండట్టిది. అన్నియుఁ బ్రకృతి సంబంధములే. అన్నియు బహిర్గతాంతస్తత్త్వములే. అయిన నేమి? చూలింతరాలి వేవిళ్లకు సూడిద లిచ్చుచున్నాము. కలరావాంతులకు కర్పూరారిష్ట మిచ్చుచున్నాము. మొగలిపూవునుగులకాంత కొప్పులో నుంచుచున్నాము. మూలవ్యాధిని ఛేదించుచున్నాము. అటులే గ్రంథము లన్నిటిలో మంచివానిని బహూమానింపవలయును. చెడ్డవానిని బహిష్కరింపవలయును.

వైద్యశాస్త్రమెందుకుఁ గలిగెనో ధర్మశాస్త్రమెందుకుఁగలిగెనో విమర్శనశాస్త్రముకూడ నందుకె గల్గినది. వైద్యశాస్త్రమునకున్న వ్యాప్తి విమర్శన శాస్త్రమునకు లేదు. నిజమే; అటులేల యుండును? మాటవచ్చినదికావునఁ జెప్పుచున్నాను. మీరెంత ప్రశస్తమైన భావగీతమును బాడినను బాముకాటంత శీఘ్రముగఁ బ్రాణము తీయఁగలరా? గోడయున్నయెడలఁ జిత్రకర్మమునకు లోపమేమని ముందు మనవారు తనువులు భద్రపఱుచుకొనుటకుఁ దంటాలుపడి వైద్యశాస్త్రమును ధర్మశాస్త్రమును సృష్టించినారు కావున విమర్శనశాస్త్రము ప్రధానకృత్యముకాక వేడుక పనియైనది. కాగిదములు చవుక యగుచున్నవి. అచ్చుశాలలువృద్ధియగుచున్నవి. నాటకసంఘములు హెచ్చుగుచున్నవి. గ్రంథమాలలు ఘనములగుచున్నవి. కవులు మితిమీఱిపోవుచున్నారు. గ్రంథముల సంఖ్యాకము లగుచున్నవి. వీనిలో మంచి వేవో నిర్ణయించి చెడ్డవి త్రోచివైచుట ప్రకృతిపద్ధతినిబట్టి యావశ్యకమై యున్నది. ఇవి యన్నియు భూమికి భారమగునని యెవ్వఁడును జెప్పుట లేదు. వీనివలనవచ్చిన బాధయేదో చెప్పెదను. మాయముత్తెమునకున్న తళుకు మంచిముత్తెమునకు లేదు. ముచ్చెబంగారమున కున్న మెరుగు మేలిమికున్నదా? అసత్యమునకున్న చాకచక్యముఁ జనుత్కృతి సత్యమున కెక్కడిది? అది మూనాళ్ల ముచ్చట. ఇది ముప్పది తరములకైన పోనిది. అల్పగ్రంథమునకు హర్షించినవారే యనేకులు మంచిగ్రంథమును దెలిసికొని యనుభవించినదాఁక నెవనికి? మహాజనులారా! నూటికెనుబదుగురు రసగ్రహణమునఁ గేవలము మూఢులు. వారు పామరుల తేయితక్కలకు బలీయందురు కాని ప్రకృతిలోని తలవెండ్రుకల చిక్కువిప్పిన గ్రంథములకు సంతసించెదరా? ఊహూఁ. చెంచునాటకమునకున్న జనానురాగము శాకుంతలమునకేది? పంచదారకుఁబట్టిన యెఱ్ఱచీమలకంటెఁ గుంకుడుకాయలకుఁ బట్టిన యెఱ్ఱపురుగు లెక్కువకదా! ఇఁక గ్రంథకర్తలమాట చెప్పెదను. గ్రంథకర్తలలో నుపజ్ఞానహితుఁడు వేయి కొక్కఁడైన నుండునో లేదో. అనేకు లేదైన నొక

గ్రంథమామోదించి యాకవిని బహుమానించుట సిద్ధించునెడల "ఆహా!
వ్రాయవలసినపద్ధతి యదియే కాఁబోలు, మనముకూడ నట్లే వ్రాయవలెను
గాఁబోలు" నని యనేకకవులు భ్రమపడుదురు. పైకి వారిని దిట్టుచునే యుం
దురు కాని లోపల నీయపోహములకు లోనై యుందురు. వా రంతక్రమముగా
దిగియంతకంటె జాతి యధఃపతితులై నీచగ్రంథసృష్టినిర్నిద్రులై ప్రకాశింతురు.
మఱికొందఱింకొకవిధముగా మాఱుచున్నారు. అయ్యవారులుగారి పాటల
నాటకమునకుఁ బంద్రెండునందలహాపాయ లొక్కరాతిరి వచ్చిననఁగ నిఁకఁ
బ్రకృతి లేదు. పాత్రౌచిత్యము లేదు. ఏమియు లేదు. పది దినములలోఁ బాటల
నాటక మొక్కటి కవి ప్రజలపైఁ బాఱవైవవలసినదే. పాటలనాటకములు
ప్రకృతివిరుద్ధము లని యాతఁ డెఱిఁగియుండియుఁ బైసకొఱకుఁ బ్రఖ్యాతి
కొఱకు బహుళముగా ధన మిచ్చి వ్రాయించుకొను నాటకసంఘములకొఱ
కాతఁడు వ్రాయును. కడుపు కక్కుఱితిచే మనస్సాక్షిబోధన కాతఁడు వ్యతిరేక
ముగఁ బ్రవర్తించును. సామాన్యబుద్ధియుక్తుఁ డైనయాతఁడట్లు ప్రవర్తించుట విశే
షముగాదు. మహాధీశాలి యై శారదాదేవిచే త్వమేవాహ మ్మని యనిపించు
కొనె నని చెప్పఁబడిన కాళిదాసుఁడు సైతము సామాన్యజనాభిరుచి ననుసరించి
రఘువంశములోని కడపటిసర్గలలో నవలాననలాలితేత్యాది శబ్దచమత్కారము
లను గవిత్వములో సింగారించి కవిత్వము భ్రష్టపఱుచుకొనె నని పూర్వవిమర్శ
కులే వెల్లడిచేయలేదా! మన యీదేశమందే యిట్టిసన్నివేశముకాదే అలెగ్జాం
డరు పోపు (Alexander Pope) కవిత్వము వాని ననుసరించిన వారి కవిత్వము
వట్టి గజముబద్దకవిత్వ మని తక్కెడ తవ్వ కవిత్వ మని యెఱిఁగియున్న బైరన్
(Byron) వంటి స్వతంత్రబుద్ధి సహితుఁడు సైతము యశఃకనకము లపేక్షించి
తనకవిత్వముకూడ కంపసు కవిత్వములోనికి దింపినాఁడు కాదా! అంకనాటక
ములకు డబ్బు రానియెడల రంగనాటకములను వ్రాయుదము. అంతే-దేస్
వాలామట్టుల నాటకములకు డబ్బు రానియెడల పార్సీమట్టుల నాటకముల
వ్రాయుదము. దీని కింతయోజన యెందుకు. పార్సీమట్టుల నాటకములకు
డబ్బు రానియెడల బ్యాండుట్యూన్సు (Band tunes) నాటకములఁ జేయుదము.
దానితెగు లంతటితోఁ దక్కునఁ గుదురును. ప్రకృతిపరీక్ష యక్కఱ లేదు.
పాత్రతత్త్వభేద మక్కఱ లేదు. ప్రసంగచమత్కృతి యక్కఱ లేదు. పాత్రౌచిత్య
మక్కఱ లేదు. ఏమియు నక్కఱ లేదు. పాఠాంతరమునకుఁ బాట దొరికినఁ
జాలును. ప్రకృతి ప్రతిబింబములుగ గ్రంథముల వ్రాయవలసిన కవు లీకారణ

ములచే భ్రష్టులై పోకుండ విమర్శగ్రంథములు పుట్టవలసియున్నది. ఒకకవి వేఱొక కవిని విమర్శింపఁదగదు. అది ప్రబలవైరమునకుఁ గారణ మగును. ఆభయంకరవైరకీలాజాలము పుష్కలావర్తమేఘమునఁ గాని శాంతింపదు. నిష్పక్షపాతబుద్ధితో సాహిత్యపరిషత్తువా రీవిమర్శనకృత్యమును మీఁద వైచు కొనక తప్పదు. కవిత్వము చెప్పుటకు శక్తిలేని కాని కవితారసమును గ్రహింపఁ గల లోకోపకారకబుద్ధి గల-నిర్దాక్షిణ్యస్వభావము గలపండితుల నిందుకై పరి షత్తువారు జాగ్రత్త పెట్టవలసియున్నది. వారి విమర్శనములను బరిషన్మహాసభ్యుల యామోదము నొందినపిమ్మట లోకమున విడువవలయును. పరిషన్ముద్ర వాని పైఁ బడుటచే నవి మెచ్చుటకుఁబోయిన సరే నాణెములవలె మాఱును. అవి తుపాకిపిక్కకుఁ జెదరవు. బల్లెపుఁబోటునకు జంకవు. నీటివడి కెదు రెక్కఁగలవు. కాని కవుల యనుమతి లేకుండ వారిగ్రంథములను విమర్శింపఁదగదు. నీగ్రంథ ముల విమర్శింతుము నీ వేమందు వనిపరిషత్తువారు కవి నడుగు నెడల వల దని యాతఁ డనఁగలఁడా? వల దన్న యెడల నందున నేమితప్పులున్నదో యని యిత రు లనుకొందు రేమో యనుసందేహ మాతని కుండదా? విమర్శన బహుజాగ రూకతతోఁ జేయుట యత్యావశ్యకము. ఎట్లు చేయవలయునో నేను జెప్పను. ఎట్లు చేయఁగూడదో మాత్రము రవంత చెప్పెదను. స్వల్పదోష మైన నుపే క్షింపఁ దగదు; దోషములను నిర్హేతుకముగ నిర్ణయింపఁగూడదు. చిన్నయ్య కాలమున నట్లువ్రాసిరి. పెద్దన్నకాలమున నట్లు వ్రాసిరి. నన్నయ్యకాలమున నట్లు వ్రాసిరి కావున మీరుగూడ నట్లే వ్రాయవలయు నని శాసింపఁదగదు. సర్వకవులకే కాక సర్వకళాభిజ్ఞులకుఁగూడ నవిలంఘ్యము లగుబహిరంతఃప్రకృతి శాసనములకంటె భిన్నము లైనశాసనములు గుణదోషనిర్ణయమున కక్కఱకు రాఁగూడదు. దోషములు నిర్ణయింపవలసి నదే కాని యిట్లు దిద్దుపాటు లొం దిన యెడల నాదోషములు గుణము లగు నని యెన్నఁడును బలుకవలదు. గ్రంథరచనయం దొకపద్ధతిని గాని మార్గమును గాని క్రమమును గాని చూపఁ దగదు. మీవిమర్శనమువలన గవితకుఁ దళుకు మాత్రమే హెచ్చించి దార్ఢ్యము తగ్గింపఁగూడదు. ఆకారసౌందర్యము మాత్రమే వృద్ధిపఱిచి యాంతరంగపటి ష్ఠత తగ్గింపఁ గూడదు. నిర్దుష్టత మాత్రమే వృద్ధిపఱిచి రసమును దగ్గింపఁగూ డదు. అలంకారములు వృద్ధిపఱిచి యవయవసౌందర్యము నాచ్ఛాదింపఁ జేయఁగూడదు. మదగజయామినీత్వమును మాత్రమే హెచ్చుచేసి మగ తనమును దగ్గింపఁదగదు. అనుకరణము మాత్రమే యధికపఱిచి యుపజ్ఞకద్దు

రాఁగూడదు. చిత్రవిచిత్రము లగురుచులు మాత్రమే వృద్ధిపఱిచి జీర్ణశక్తిని దగ్గింపఁగూడదు. కల్పనకు స్వచ్ఛందత్వమును దగ్గించి బండి రొజానుబట్టి పోవునట్లు మాత్ర మెన్నఁడును జేయఁదగదు. అట్లే మీ రొనర్చినయెడల నధ్యకాలప్రబంధశకము దిరుగ నుదయింపఁ జేసినవా రగుదురు. ఇఁక మేనమామపోలికలు, కవలపిల్లలపోలికలు. ఇఁక ననుకరణములు ననుకరణమున కనుకరణములు, ఛాయాపటములు, నచ్చుబొమ్మలు మొదలైనవి బయలుదేఱును. విమర్శనములోని కట్టుదిట్టములకు మీ రేమైన నూతనశాసనములు కల్పించునెడల నింతే మునుఁగును. మీ రెన్ని శాసనములు కల్పించినను సామాన్యకవితాశక్తి కలవాని కవి ప్రతిబంధము లగును గాని యుపజ్ఞాసహితుఁ డగునుత్తమకవి మున్నెప్పుడయిన నుదయించునెడల నాతని నేశాసనములు కూడఁ బ్రతిబంధింపఁజాలవు. నిఘంటు వాతని ననుసరించి పోవును. వ్యాకరణ మాతని వెంబడించును. పద్యలక్షణ మాతని కనుసన్నల మెలఁగును. భాష యాతనిగాంచి గడగడ లాడును.

వచన రచన:—వచనప్రబంధములు మనలో మొదటినుండియుఁ దక్కువగనే యున్నవి. వానియందు మనవారి కాదరము తక్కువ. చదువవలసినవారికా, వ్రాయవలసినవారికా? చదువవలసినవారికిఁ జదువునందే యాదరణము లేనప్పుడు వచనప్రబంధములం దనాదరణ మని వాపోవుట యెందుకు? వ్రాయవలసినవారికే వానియందు వైరాగ్యబుద్ధి; వచనమును వ్రాయువాఁడు వట్టి తెలివితక్కువవాఁ డని సాధారణజనాభిప్రాయమై యున్నది. కవితామణికోటీరమును ధరించుట కర్హుఁడు కానివాఁడే యీకట్టెలమోపు మోయఁదగినవాఁ డని జనుల నమ్మకము. సాధారణజనులకే యటులుండ నిఁకఁ బద్యప్రబంధకర్త వచనప్రబంధకర్త నెంతచులుకనగాఁ జూచునో చెప్పవలయునా? తాను దేనెపట్టనియు నాతఁడు తెలికపిండి యనియుఁ, దాను చెఱకుఁగడ్డ యనియు నాతఁడు చొప్పదంటనియుఁ దనది పూలయంగడి యనియు, నాతనిది పుల్లలదుకాణ మనియుఁ దననెత్తిపై మకుట మనియు నాతనినెత్తిపై మట్టితట్ట యనియుఁ బద్యలేఖరి వచనలేఖరిని గూర్చి భావించును. ఎంతబుద్ధిహీనతయో! ఈబుద్ధిహీనత యీనాఁటిది కాదు. చిరకాలమునుండి వచ్చుచున్నది. నిజముగా నాసేతుహిమాచలపర్యంతమున్న యార్యజాతి యంతయుఁ గవిజాతి. భరతదేశమందలి ప్రకృతిసౌభాగ్యముచే మనము జన్మకవులము. రత్నగర్భ యని సార్థకనామము ధరించుటకు సర్వవిధముల మనయార్యావర్తదేశమే సమర్థ మైనది కాదా? బంగారము పండఁ

దగిన పార్థివతత్త్వము ప్రపంచమున మఱియొకటి యేది? ఈనైపునఁ బంచోప
నదులతోఁ గైలాసముపైనుండి వచ్చినఱకు సింధునది, యదిదాఁటి రవంతకుడి
ప్రక్కకు రాఁగానే యభవజటాజూటోద్భవ యై యనేకోపనదులతో నమృతా
ధిక మాధుర్యధురీణాంబుప్రవాహములతో ననేక శతయోజన పర్యంతావనీస్థల
ఫలీకరణ పాటవప్రాబల్యముతో ననేక జన్మార్జితాఘవినాశనమాహాత్మ్యముతో
నార్యావర్తమున హామూలనుండి యీమూలవఱకు జగజ్జనజేగీయమానప్రకా
శముతోఁ బ్రవహించు నార్యావర్తభాగ్యదేవత యైనగంగాదేవి— మఱిరవంత
దాఁటగనే ధవళగిరిపైని— నెవరెస్టుపైని— నా పైనున్నశిఖరములపైని నేమూ
లనో యుద్భవించి వాయువేగముతోఁ బ్రాగ్దిశగాఁ బ్రవహించి అస్సాము
నొద్ద మోచేతివాటముగా మరలి దక్షిణముగఁ బ్రవహించుబ్రహ్మపుత్ర, యిది
కాక వీనిక్రింద నర్మద, మహానది, గోదావరి, కృష్ణ, తుంగభద్ర, కావేరి మొద
లగు మహానదులు తమశీతలత్వముచేతఁ దమసరళత్వముచేఁ దమ మాధుర్య
ముచేఁ దమప్రవాహశక్తిచేఁ దమ పవిత్రతచే నార్యావర్తజనసంఘబుద్ధితత్త్వమున
శీతలత్వము సారళ్యము మాధుర్యము పవిత్రత ధాటి యొసఁగుటకుఁ జాలియున్న
వని చెప్పుట యతిశయోక్తి కాదే. ప్రపంచపర్వతములలోఁ బ్రథమగణనీయ
మగుప్రాలేయాచలము భరతదేశమాతృదేవతకు హీరకిరీట మై ప్రకాశించు
చుండ వింధ్యాద్రి వజ్రాలమొలనూలై యుండ సింహళద్వీపము పాదపీఠ మై
యుండ సమస్తప్రకృతివైచిత్రీసన్నివేశప్రథమనిదాన మైన యీభరతఖండము
నందు సన్నిహితసూర్యకాంతి జనులరక్తమునకుఁ దేజోధికత ధాటి దీప్తి గలిగింప
భావనాప్రపంచమున శంపాలతాకోటులఁ బ్రాఁకింపఁ బవనునకు బంగారుపూఁత
వోయఁగ సర్వవిధములఁ బ్రకాశించు నార్యావర్తదేశమందుఁ గవులకు గాయకుల
కుఁ జిత్రలేఖకులకు భక్తులకు జ్ఞానులకు నేమాత్రమైన లోప మున్నదా! కావున
మనది యాజన్మకవిజాతి; మనగ్రంథము లన్నియు వైద్యగ్రంథములే కావు చరిత్ర
గ్రంథములే కావు నిఘంటువులే కా వన్నియుఁ గూడఁ బద్యముననే పూర్వము
వ్రాయఁబడినవి. ఇప్పుడు మనకట్టిభావనాశక్తి యున్నదా? ఉహూఁ. ఇప్పుడు మన
కట్టికవితాసంపత్తి యున్నదా? ఉహూఁ. మనచిత్తముల కట్టియుత్సాహ మైన
నున్నదా? ఉహూఁ. విదేశీయపరిపాలనమున విదేశీయగ్రంథపఠనమున విదేశీయా
చారావలంబనమున విదేశౌషధగ్రహణమున మనపూర్వవ్యక్తి పూర్తిగ నశించి
నది. గంగానది నురుగులోఁ గైలాసేశ్వరుని జటాజూట మావరించిన జగజ్జనని
మందహాసమును మనము గాంచలేనప్పుడు మనకుఁ గవిత్వ మెక్కడిది? గరుడపక్షి

కృష్ణాయనునప్పుడు విష్ణువాహనమస్తుభ్యం పక్షిరాజాయ తేనమ యని చేతులు జోడించుకొన లేనిమనకుఁ గవిత్వ మెక్కడిది? అట్లు చేసినవానిని బుద్ధిహీనుఁ డని మనము పిలుచుచుండినపుడు మన కింకఁ గవిత్వ మెక్కడిది? ఇది కాక మతమును వృద్ధిచేయకుండ దైవభక్తిని హెచ్చింపకుండ నాధ్యాత్మికజ్ఞానమును బలపఱుపకుండఁ బ్రకృతిశాస్త్ర మసందర్భముగ నసర్వముగ ననుచితముగఁ బవిత్రప్రదేశములందలి పైకప్పులను దొలఁగించినప్పుడు మన కింకఁ బ్రకృతిపై రోఁత యే కాని ప్రీతి యేమున్నది. విసుఁ గే కాని వింత యేమున్నది. అగ్నిజ్వాలలోని యసాధారణలావణ్యమును జూచి యానందింపలేక యిది చూచి కెమికల్ కాంబినేషన్ (Chemical combination) యొక్క ఫల మని నిర్లక్ష్యముగఁ జేయి నూఁపుచున్నాము. కలకంఠము గానకాలక్షేప మొనర్ప నొడలు జల్లు మనవలసి యుండఁగా వోకల్ కార్డ్సు (Vocal cords) యొక్క అరేంజిమెంట్సు (arrangements) ఆతీఱున నున్న వని మనము పెదవి విఱుచుచున్నాము. తుట్టతుదకుఁ గన్నీటి బిందువు చూచినను మనమనస్సు కరఁగకున్నదే! లాక్రిమల్ (Lachrvmal) రసము కొంత సున్నము కొంత యుప్పు కొంత ఆక్వా (aqua) కొంత యని యనేక లక్షలయాణిముత్తెముల విలువ చేయఁగల యశ్రుబిందువుల ననేకధాభ్రష్టపఱిచి భంగపఱిచి దానివంకఁ బృష్ఠము త్రిప్పుచున్నాము. ఇంకను గవిత్వమని పద్యము లని యేల దేవులాడవలయును. మనపూర్వపరిస్థితు లన్నియుఁ బూర్వమున నున్నట్లే యున్నవి. కాని మనముమాత్రము మాఱితిమి. మనహిమవత్పర్వతములో నౌన్నత్యమే కాని మనమనస్సులలో లేనప్పుడు మనగోదావరీనదిలో రసమే కాని మనమనస్సులలో లేనప్పుడు మనబంగాళాఖాతములో గాంభీర్యమే కాని మనమనస్సులలో లేనప్పుడు మనకఱికాయయందు భావనయే కాని మనమనస్సులలో లేనప్పు డింకఁ గవిత్వ మెందుకు? మనసూర్యభగవానుఁడు మన కత్యంతసమీపముననే యున్నాఁడు. కాని మనమనస్సులలో గరఁగని మంచుకొండ యున్నపుడు మనకుఁ గవిత్వ మెక్కడిది? కవిత్వము చెప్పనివాని నింక నధిక్షేపించు టెందుకు? ఎట్టిపిచ్చిలో నేవిధమైన వెగటును లేదో, ఎట్టియున్మాదము ప్రపంచోద్ధరణపటిష్ఠమో, యెట్టిమతిమాలినతనములో జ్ఞానవిజ్ఞానములు దుర్నిరీక్ష్యమైన తేజస్సుచే వెల్గునో యెట్టివెఱ్ఱికి వేయివిధములు కాక కోటివిధము లయ్యును బరమార్థగ్రహణవిధాన మనునొక్కటే విధానము గలదో యెట్టి వెఱ్ఱి వెఱ్ఱు లన్నిటికంటె వెఱ్ఱిదో యట్టివెఱ్ఱిని, యట్టి లోకాతీతమైన వెఱ్ఱిని సట్టివెఱ్ఱిలేని వెఱ్ఱిని గలిగి తాను ధన్యతఁ జెంది మనల ధన్యులఁ

జేయునాతఁడు కవి. ఇప్పు డైన నట్టిపిచ్చి లక్షకుఁ గోటి కెవ్వనికైన నుండినయె
డల వాఁడు కవితాగానము చేయవచ్చును. అంతే గాని కవిత్వమున నేదో
ఘనత యున్న దని యూహించి యందుకై ప్రయత్నించి జను లసంఖ్యగ్రంథ
ముల సృజించి యకాలపువెఱ్ఱులై ప్రకృతి శాపత్తుఁ దెచ్చిపెట్టుట న్యాయమా?
అంతేకాక వచనమును వ్రాయువానిని దీసివ్రేఁతసరకుగఁ గుక్కమూతిపిం
దెగఁ దృణీకరింప న్యాయమా? పద్యమునఁ గవిత్వముండి వచనమున లేకుం
డునా? ఎచ్చట రసముండునో యచ్చటనే కవిత్వ మున్నది. కవిత్వము గుణ
ములో నున్నది కాని గణములో నున్నదా? అభిప్రాయప్రకటనమే కావలసి
నది. అన్నినాగరకదేశములందుఁగూడ వచనప్రబంధములు లక్షోపలక్షలుగా
వృద్ధిపొందు చున్నప్పుడు మనదేశమం దట్లు జనుగపోవుట కడు శోచనీయము
కాదా? వచనగ్రంథరచనాబాహుళ్యమునఁ గాని భాష యభివృద్ధి నొందనే
రదు. మనపరిపాలకు లగు నాంగ్లేయులభాషలో వివిధవివిధవిషయములపై
నెన్నివేల వచనగ్రంథము లున్నవో మీ రెఱుఁగనివిషయమా? మీరు వానిలో
నెన్నిటినో చదివియే యుందురు. చదివి యూరకుండుట తగునా? ఆజ్ఞానము
నంతెను సంపాదించినమీరు మనమాతృభాష నభివృద్ధిపఱుచుటకుఁ దోడుపడ
నక్కఱలేదా? మనకెంతసేపు నాటకమో నవలయో ప్రహసనమో చిన్నకథ
యో మోహగీతమో యంతకంటె మఱేమియు లేదే. విజయనగరరాజ్యమును
గూర్చి సూయల్ వ్రాసినగ్రంథమైన మనవా రాంధ్రీకరింపకుండిరే! చాణక్యుని
యార్థిక శాస్త్ర మెవ్వరైన మనకుఁ దెనుఁగుబాసను నేర్పిరా? ఒక్కగులాబి
పువ్వునుగూర్చి యెన్నియాంగ్లగ్రంథములో యున్నవి. మన కొక్క గ్రంథమైన
నున్నదా? శారీరశాస్త్ర మొక్కటి సంపూర్తిగాఁ బరివర్తనమొనర్పఁదగి యున్నది
కాదా. ఫోటోగ్రాఫీ (Photography) మీఁద మెటలర్జీ (Metellurgy) మీఁద
ఇవల్యూషను (Evolution) మీఁద మఱి దేనిమీఁదనో మఱి యింకఁ దేని
మీఁదనో యున్నగ్రంథములలో నుత్తమ మైనదానిని మచ్చున కొక్కటియైన
మనభాషలోఁ జేర్పఁదగదా? క్రొత్తవిషయములపైఁ గ్రొత్తగ్రంథములు రా
వలయును. అప్పుడు కాని భాష పరిపుష్టి నొందదు. ఇంతపనియుఁ జేసి భాష
నభివృద్ధిపఱుపఁగలవారు మనలోని యాంగ్లేయవిద్యాధికులే కాని మఱి యెవ్వ
రున్నారు. వారు మన కేమని యూరకుండునపుడు భాషకు దుర్గతి యెట్లు వద
లును, ఆంగ్లేయు లెన్ని పరభాషాగ్రంథములను దమభాషలోనికిఁ దెచ్చుకొన
లేదు? మన మ ట్లేల చేయరాదు? అదికాక స్వతంత్రగ్రంథముల కేమంత

ప్రోత్సాహ మున్నది? శృంగారరసమున వ్రాసిన గ్రంథము లసభ్య మసభ్య మని మనరానులోఁ బఠనగ్రంథనిర్ణాయకసంఘమువారిలో నొక్కక్రైస్తవుఁడో మహమ్మదీయుఁడో వైచిన కేక ఛత్రపురిపుఁజవుటిపట్టులకుఁ దాఁకి బళ్లారిబోడికొండలమీఁదఁ బ్రతిధ్వనించునప్పుడింకఁ జేయవలసి దేది? కరుణరసమున గ్రంథము వ్రాసినయెడల గజనీమామూదు సోమనాథలింగభంగ మొనరించినది మొదలు త్రికాలములయందు మనకలవాటున్న రసము కరుణరసమే యగుటచేత నెవ్వరా గ్రంథమును లక్ష్యపెట్టుదురు? హాస్యరసమున గ్రంథము వ్రాసినయెడల నితర జాతుల కెట్లున్నను మన కది మిగులఁ దప్పు. మనకు లైఫ్ (life) చాల సీరియస్ (Serious) అని యేదో పుట్టి మునిఁగిపోయినట్లు జీలుఁగు బెండుకంటె దానిని లఘువుగఁ జూతురే? వీరరసముపై వ్రాయుటకుఁ జేతులు కదలకుండ నరదండము లేయయ్యెను. అందుచేఁ గల్పనకుఁ గవితకు సృష్టికి నవకాశమేది? ఏమున్నదో నేఁ జెప్పనేల. మీ రెఱుఁగనిదియా? అందుచేఁ బ్రదుకుఁదెరువు పుస్తకములు ప్రతిదేశ వీరచరిత్రములు ప్రాణరక్షణగ్రంథములు ప్రకృతిశాస్త్రగ్రంథములు రాజనీతి పుస్తకములు పరిశ్రమగ్రంథములు నింక నిట్టివే భాషలోనికి దింపవలసియున్నది. ఈగ్రంథజాలము యథార్థమైనసారస్వత మగునా యని సందేహము వలదు. "న మిష్టిస్సర్వశాస్త్రాణాం సాహిత్య మితి కథ్యతే" యని యున్నది కాదా? సాహిత్య పరిషత్తువారికే యిఁక సందేహ మేల. కాలానుసరణ మైన సారస్వత మిదియే. ఈ పని యాంగ్లేయభాషావిద్వాంసు లగునాంధ్రులవలననే కాని కాదు. వారిలో మాతృభాషయం దాదర మున్నవారు కొంద ఱున్నారు. వా రెట్లున్నా రనఁగ ననేకవిషయజ్ఞానసామగ్రి యంతయు సిద్ధపఱిచికొని యున్నారు. విషయవిభాగములఁ గూడఁ జేసికొని యున్నారు. తెనుఁగుభాషలో వ్రాయుటకు జంకుచున్నారు. చేతఁగాక కొంత. సిగ్గుచేఁ గొంత. మాకన్నియుఁ దెలియు నని వెల్లడించుచునే యున్నారు. ఎప్పుడో వ్రాసెద మని వాగ్దాన మొనర్చుచునే యున్నారు. తీర నెవ్వఁడైన నొక్క తెలుఁగుగ్రంథము వ్రాసి దీని కుపోద్ఘాతము వ్రాయుఁ డని వారిలో నెవరికైనఁ జూప నుపోద్ఘాతము నాంగ్లేయభాషలో వ్రాయుచున్నారు. వీరిక లాంగ్లేయమున నున్న తెలుఁగుగ్రంథములు మనకుఁ గొన్ని లేవా? ఇదేమికర్మము. ఆంధ్రసారస్వతచరిత్ర మాంగ్లేయభాషతో వ్రాయుచున్నా నని చెప్పినవారిని నే నెఱుఁగుదును. సంధ్యావందన మింగ్లీషుతోఁ జేయుదు మన్నవారితో మన కేమివినియోగము. కాని వారిసాహాయ్యము లేకుండ మన మేమిచేయఁగలము. వారు సాహసించి తెనుఁగున వ్రాసినట్లైన

భాష కుపకృతి జరుగుట నిశ్చయము. వారందఱు మెకాలే (Maccaulay) రస్కిన్ (Ruskin) గిబ్బన్ (Gibbon) కార్ లైల్ (Carlyle) అడిసన్ (Addision) లాక్ (Locke) హెర్బర్టు స్పెన్సర్ (Herbert Spenser) మొదలగు మహావచన ప్రబంధకర్తల శైలీభేదములు పూర్తిగ నెఱుఁగుదురు. వారి కభిరుచిమైన యే శైలినో యనుసరించి వారు గ్రంథములను వ్రాయుదురు. ఓ! ఇంక నేమికొదవ? ఖడమునడకవంటి శైలి యొకటి, నాదర్ ఖానంటి శైలి యొకటి, బాజీవంటి శైలి యొకటి, పందెపుదాడునంటి శైలి యొకటి మనభాషలో నవతరింపఁ జేయఁ గలరు. చిత్రము లైన శైలీభేదములు మనభాషలో మిగుల నరుదుగా నున్న వని వేఱె చెప్పనేల? రైఁ మని పేకచున్వ పై కెగిరిన ట్లున్నశైలీభేద మేది?

కాకి పై కెగిరియెగిరి ఱెక్కలు కదలుకుండ జందెపుఁ బెట్టుగ సావుగ వాలుగ దిగునప్పటి లఘుపతనచమత్కృతి కనఁబఱుచు శైలీపద్ధతి యేది? తానము వాయించునప్పటి తళుకుబెళుకులు, టంగుటింగులు, గలగలలు, జల జలలు గలశైలి యేది? మహాజనులారా! ఇట్లు నే నెన్ని చెప్పవచ్చును? భయం కరమయ్యును మనోహర మై మహాశక్తిసక్త మయ్యు మార్దవయుక్త మై ధారాళ మయ్యు విశాల మై స్వభావసన్నృద్ధ మయ్యు సరసాలంకారభూయిష్ఠ మై సముద్ర ఘోషము గలదయ్యు సంగీతప్రాయమై స్పష్టీకృతసకలవిషయతత్త్వ మయ్యు నస్పష్టస్వకీయతత్త్వ మై చదువరులకుఁ గనుకట్టై చెవికట్టై వాకట్టై మదికట్టై తలపులిమినట్టు శ్వాసమైన నలుపకుండఁ జేసినట్లు ముష్టివాని చిప్పనుండి మూ ర్ధాభిషిక్తుని కిరీటమువఱకు భూమిక్రిందియరలనుండి సముద్రములోని గుహల వఱకు నెవరెస్టు కొండనుండి యింద్రధనుస్సు రంగులవఱకు మందాకినీతరంగ రంగద్ధంసాంగనా క్రేంకారములనుండి మహాదేవ సంధ్యాసమయ నాట్యరం గమువఱకు మనోవేగముతో నెగురశక్తిగల చిత్రవిచిత్రశైలీ భేదము లింక నెన్ని యో. భాషలోఁ బుట్టవలసియున్నవి. అట్లు సృష్టికి సమర్థులగువా రెందఱో యిట నున్నారు. బహుధన మున్నది. పరికరనికరమున్నది. పాత్రసామగ్రి యున్నది. పాచకు లున్నారు. ప్రబలుఁ డైనశని నోటనుండుటచే బాషావచనశైలి బలహీన మై పౌరుషరహితమై యున్నది. నకనకలాడుచు నన్నమోఁ రామచంద్రా యను చున్నట్లున్నది. ఈలోప మెట్లు తీరఁగలదో సాహిత్యపరిషత్తువారు సత్వరముగ సమగ్రముగ యోజించుట కర్తవ్యము.

సాహిత్య పరిషత్తు:—సాహిత్యపరిషత్తువారే యీబాధ్యత బహుళము గా నహింపవలయు నని నావినయపూర్వకవిజ్ఞాపనము. వారు పైవా రెవరిచేత

నో యీగ్రంథముల వ్రాయింప నక్కఱ లేదు. ఆంధ్ర దేశపండితు లాంధ్ర దేశ నచనగ్రంథకర్తలు నాంధ్ర దేశకవులు సాహిత్యపరిషత్తులోని వారే కాక పైవా రెవ్వ రున్నారు? అట్టివా రెవరైన నున్నయెడల వారిని బ్రార్థించి పరిషత్తులోఁ జేర్చుకొందము. పైని జెప్పినగ్రంథములు వ్రాయవలసినవారు మనలోనివారే. ఎటువచ్చినను వారిని బ్రత్యేకముగ సమావేశ మొనర్పవలసియున్నది. పరిషత్తును బ్రతిసంవత్సర మెవ్వరో యొక రేదోయూరి కాహ్వానించుచున్నారు. మన మెవ్వరినో యధ్యక్షు నేర్పఱుచుకొనుచున్నాము. ఏదో కార్యక్రమము ననుసరించి యెట్టులో జరుపుకొనుచున్నాము. పై సంవత్సరమునకు మఱేదో యూరు పోవుచున్నాము. అంతే. జరుగుచున్న దంతే. ఇన్నిసంవత్సరములనుండి భాషాభివృద్ధికై ప్రయత్నించుచుంటిమి కదా? అది యేతీరున నైనది? ఎంతవఱ కైనది? వేనివలన నైనది? అని మనము మనలను గఠినముగాఁ బరీక్షించుకొనఁదగదా? ఇతరులు మనలఁ బరీక్షింపకుండ మనమె య ట్లొనర్చుకొనుట మంచిది కదా! పదునైదు పదునాఱు పూర్వప్రబంధము లచ్చు వేయించితిమి, పారిభాషిక పదముల పట్టికలు గొన్ని రచియించితిమి, ప్రశస్తము లైన యుపన్యాసము లనేకములు పరిషత్పత్రికలో నచ్చు వేయించితిమి. A Defence of Literary Telugu అను గ్రామ్యవాదఖండనగ్రంథము ప్రకటించితిమి. కాని మనము చేసినయీసేవ చాలకపోవుటచేఁ గాఁబోలుఁ బరిషత్కన్యక యుండవలసినట్లు లేదు. పండ్రెండవయేఁడు జరుగుచున్న పడు చెట్లుండవలసినది? ఓ నన్నుఁ జూడు నన్నుఁజూడుమన్న ట్లుండవలసిన దే—అ ట్లున్నదా—అయ్యయ్యో! ౫౦ సంవత్సరములున్న నావలె నే చప్పిదౌడలతో శల్యావశిష్టయై యున్న ట్టున్న దే. బంగారమువంటి ప్రాయ మంకురించినపడుచు పట్టఁబగ్గములు లేకుండ నుండవలసిన దే. అయ్యో! కాలానుసారగ్రంథపోషణమునఁ గాని కావ్యకన్యక యొడలు చేయదు. జేక్కత్తదు. జబ్బపై జబ్బ వేయదు. జగన్మోహకముగఁ గనఁబడదు. ఇదివఱ కెన్నో నాటకములు నవల లున్నవి కదా వానివలన భాషాభివృద్ధి కాలేదా యని యందు రేమో. ఏదో స్వల్పముగ నయి యుండును గాని వానివలన భాషలో నూతనాభిప్రాయములు గలిగినవా? నూతనవిషయము లేమైన బోధింపఁబడినవా? నూతనశబ్దజాల మేమైన భాషలోఁ బ్రవేశించినదా? అవి యన్నియు మెఱుఁగులుఁ జమత్కారములు, విలాసములు, వన్నెలు, వగలు, వొయ్యారములు ధళుకులు, బెళుకులు. అంతే. కాని వానివలన భాష యభివృద్ధినొందిన ట్లెట్లు చెప్పఁగలము. ఒకభూగోళశాస్త్రము మనలోనికిఁ దెచ్చుకొన్నయెడల మన

వారి కిదివఱకుఁ దెలియనివిషయము లెన్ని తెలియును? ఇదివఱకు భాషలో లేనియభిప్రాయము లిపుడు క్రొత్తగా నెన్ని చేరును. ఇదివఱకు భాషలో లేని యెన్నిశబ్దము లిప్పుడు క్రొత్తగాఁ జేరును. లీలావతినాఁటి గణితము తరువాత మన కట్టిదేదైన నున్నదా? ప్రపంచమున నున్నయన్ని శాస్త్రములలో నన్నికళలలో నన్నితంత్రములలో నేమేమి మెఱుఁగు లున్నవో తెలియఁజేయఁగల గ్రంథములు మనకుఁ గావలయును. ఇతరజాతులవా రంద ఱట్లు సంపాదించుకొను చున్నారు. కావున నింతగా దేవులాడవలసివచ్చినది. ఒక్కొక్కజాతి గ్రంథము భాషాదేవి కొక్కొక్కముందడుగుగా నుండవలెను. అట్టిగ్రంథములను సృష్టించుటకు మన మిపు డేమి చేయఁదగి యున్నది? అధ్యక్షోపన్యాసమైన తరువాతఁ గార్యదర్శినివేదన మేదో యున్నది కదా। దానితరువాతఁ బండితులయుపన్యాసము లున్నవి కదా! ఉపన్యాసబాహుళ్యము కొంత తగ్గించి మొదటిదినము నందుఁ గాని రెండవదినమందుఁ గార్యనిర్వాహకసంఘసభకుఁ బూర్వమో పరమో కాని గ్రంథకర్తలందఱుఁ గలియవలయును. కేవలము తెనుఁగు తెలిసినవారేకాక, సంస్కృతాంగ్లేయభాషలయందుఁ బ్రవేశ ముండి యాంధ్రమున వ్రాయఁగలగ్రంథకర్తలు కలియవలెను. ఈసంవత్సరమున కేదో జరిగిపోయినది. పైసంవత్సరమునుండి యట్లు చేయుట మంచి దేమో యోజింపుఁడు. అట్లు కలసి యిప్పు డాంగ్లేయమునుండి సంస్కృతమునుండి యాంధ్రభాషలోనికిఁ దీసికొనిరావలసినగ్రంథము లేవో మొదట నిర్ణయించుకొనవలయును. వానిలో ముఖ్యము లైనగ్రంథము లేవో నిశ్చయించి, మనలోని గ్రంథకర్తలశక్తు లన్నియు మనకుఁ దెలియును గానఁ, "అయ్యా! యీగ్రంథమును మీ రీగ్రంథమును మీరని మనలో మనము పంచుకొనవలయును. ఆగ్రంథములు పైపరిషత్సభకుఁ బూర్తిచేసి తీసికొనివచ్చు నేర్పాటు చేసికోవలయును. మహాజనులారా! ఈయేర్పాటు మాత్ర మధ్యక్షోపన్యాసముకంటెఁ గార్యదర్శి సాంవత్సరికచర్యానివేదనముకంటెఁ గార్యనిర్వాహకసంఘపుఁ దీర్మానములకంటె నత్యంతము ముఖ్యమైనది. ఏపరిషత్సభలో భాషాపండితులు సంవత్సరము కష్టపడి పూర్తిచేసి తీసికొనివచ్చిన గ్రంథములు ప్రదర్శింపఁబడునో యాపరిషత్సభ యే జయప్రదముగా జరిగిన దని చెప్పవలసినది. మిగిలినసభ లన్నియు మిత్రదర్శనములు బంధుసమాగమములు లీలాప్రయాణములు గాలిమార్పులు అట్‌హోములు (at home) టీపార్టీలు—ఇన్నిమాటలు చెప్పితివి గదా! నీవే గ్రంథముల నేల రచియింపలే దని మీరు న న్నడుగఁదగినదే. ఇదిగో! చెప్ప

చున్నాను. నాగుణలోపముకూడఁ జెప్పెదను. ఆంధ్రభాషలో నాయభిప్రాయమును వెల్లడించుటకుఁ దగినశక్తి నాకుఁ గలదు. కాని సంస్కృతభాషలో నాకుఁ బ్రవేశము తక్కువ. సామాన్యపుఁదక్కువ కాదు. లే దని చెప్పఁదగినంత తక్కువ. ఆంగ్లేయభాషాజ్ఞానము మొదటినుండియుఁ గలఁతక్కొట్టయినది. ౩౫-సంవత్సరములక్రిందటఁ జదివినయాంగ్లేయగ్రంథమే కాని తరువాతఁ జదివిన దొక్కటైన లేదు. జీవనోపాధిలో నాంగ్లేయభాషాజ్ఞాన మేమైన నక్కఱకు వచ్చిన దేమో యనఁగ శ్రీరామరక్ష. శ్రీరామరక్ష. మహారాజశ్రీ యే కాని మైడియర్ సర్ (My dear Sir) అని యెవరికి వ్రాయవలసిన యావశ్యకత నా యదృష్టమున లేకపోయినది. అందుచే న న్నాంగ్లేయభాష రానివాఁడుగనే మీరు గణింపవలయును. మీరిట్లు సంవత్సరక్రమముగాఁ జేయవలసినగ్రంథజాలమువలన భాష యభివృద్ధి నొందుటయె కాక గ్రంథకర్తలలో సఖ్యము కూడ నభివృద్ధి నొందఁగలదు. కవికిఁ గవి కున్న కాకోదరమండూకము వైఖరి కవికి విమర్శకున కున్నమూషకమార్జాలవైఖరి విమర్శకునకు విమర్శకున కున్న సామజపంచాననపద్ధతి, సత్వరముగ నంతరించి వారిలో సాహచర్యము సౌమనస్యము సౌభ్రాతృత్వము సంభవింపఁగలవు. గ్రంథకర్తలలో నిట్టిమనస్థితి భాషకు దేశమునకుఁ బరమశుభోదర్కము. సాహిత్యపరిషత్పక్షమున నిప్పుడు రచియింపఁబడుచున్న యాంధ్రభాషాశిరోభూషణ మైనగ్రంథము సూర్యరాయాంధ్ర నిఘంటువు. ఇది పరిషత్పక్షముననే రచియింపఁబడుచున్నను బరిషత్సభ్యులకు ధనవిషయ మైనశ్రమము లేకుండ నిఘంటుసంబంధము లగుసమస్తవ్యయప్రయాసములను మామహారాజుగారే మహోదారమనస్కులై వహించుచున్నారు. భాషాపండితులును నుత్తమవిమర్శకులును నగు మ-రా-రా-శ్రీ, జయంతి రామయ్యపంతులుగారు కేవలభాషాప్రేమపూర్వకశ్రమమునకు లోనై భాషాసేవయే ప్రతిఫలముగా నెంచి నిఘంటుసంపాదకత్వమున నిర్నిద్రదీక్షులై యున్నారు. ఈనిఘంటువు మహోత్తమగ్రంథము కాఁగల దని నమ్మియున్నాము. మఱియు ననేకాంధ్రప్రబంధవ్యాఖ్యానరచయితలును ననేకగ్రంథద్రష్టలును నపారసాహిత్యసంపన్నులును నాస్థానవిద్వాంసులు నగు శ్రీపురాణపండ మల్లయ్య శాస్త్రులుగారిచే బ్రహ్మసూత్రభాష్యమును మహారాజుగారే యాంధ్రీకరింపఁ జేసిరి. భాషాపుష్టికర మైనదియు విషయగౌరవప్రాశస్త్యాదులంబట్టి యాచంద్రార్కముగ నాంధ్రభాషలో నుండఁదగినదియు నైయున్నది. ఇది కాక యనేక పాఠాంతరములతో సర్వమైన వ్యాఖ్యతో నాంధ్రభారతమందుఁ గొన్నిపర్వము

లీపండితసర్వ్యనిచేతనే పరిష్కరింపఁబడి యున్నవి. భాష కీమహోపకారము
కూడ మామహారాజుగారే యాచరించుచున్నారు. ఇది కాక కవిచక్రవర్తి యైన
కృష్ణదేవరాయలచే రచియింపఁబడిన యాముక్తమాల్యదకు మామహారాజుగారు
బ్రహ్మశ్రీ మహామహోపాధ్యా యేత్యాదిబిరుదాంకితు లయిన వేదము వేంకట
రాయశాస్త్రులవారిచే వ్యాఖ్యానము వ్రాయించిరి. దాని నచ్చు వేయించుట
కెన్నిసంవత్సరముల క్రిందటనో యేర్పాటుచేసి యుండిరి. వ్యాఖ్యారచన
పూర్తియైన దఁట. అచ్చింకఁ గాలేదు. కారణము తెలియదు. ఇదిగాక
యాస్థానతర్కవిద్వాంసు లగు శ్రీమాన్ గుదిమళ్ళ వేంకట రంగాచార్యులవారి
చే శ్రీవచనభూషణ మనుసంస్కృతగ్రంథము నాంధ్రీకరింపఁజేసిరి. ఇట్లు
భాషాపోషకులు భాషాపండితులు నగుశ్రీమహారాజుగారికి దీర్ఘాయురారోగ్యాది
సకలైశ్వర్యములు సర్వేశ్వరుఁడు ప్రసాదింపవలయు నని పరిషత్పక్షమున నేను
ప్రార్థించుచున్నాఁడను.

వ్యాకరణము:—ప్రస్తుతవ్యాకరణము లసమగ్రముగ నుండుటచేత భాషా
పరిశుద్ధి రక్షణమునకై విపుల మగునొక వ్యాకరణమును రచియించుట మంచి
దని పూర్వసభలలో నుపన్యసించిన యధ్యక్షులు కొందఱు సెలవిచ్చిరి. వారి
యిష్టము ననుసరించి వ్రాసినను వ్రాయవచ్చును. మీ యపేక్ష ననుసరించి
మానినను మానవచ్చును. ప్రపంచమున నున్న ప్రతిసారస్వతపరిషత్తునకు రెండే
ప్రధానోద్దేశములు. భాషాపోషణము, భాషాపరిశుద్ధరక్షణము. మొదటిది గ్రం
థములవలన నగును. రెండవది వ్యాకరణశాస్త్రమువలన నగును. ఇదివఱకు
మన మనుకొనిన ట్లింకఁ గొన్నివత్సరములు గ్రంథములు వృద్ధినొందిన తరు
వాత వ్యాకరణరచనానుచరణనుగూర్చి యోజింపవచ్చును. ఇప్పుడంత తొందర
లేదు. ఇప్పుడే రచియింపవలయు నని యోజించు వారు వారియిష్టానుసార మా
చరింపవచ్చును. ఎప్పుడు రచియించినను పరిషత్పక్షమున నే యది రచియింపఁ
బడుట మంచిది. పరిషన్ముద్ర దానిపైఁ గూడ నుండవలయును.

మహాజనులారా! ప్రభువుల యాదరణ మున్నను లేకున్నను బ్రదుకఁ
దెరు వున్నను లేకున్నను బ్రపంచయాత్రలోఁ బరిపరివిధములఁ గష్టము లొంది
నను భాషాచరిత్రమునఁ దమపేరు స్థిరముగా నిలిచియుండు ననుప్రజలవిశ్వాస
ముచేత నూఱుసంవత్సరములలోపల నెందఱో గ్రంథములు రచియించి ప్రక
టించియున్నారు. తమహృదయరక్తముతో వ్రాసి వారు మనకొఱ కిక్కడ వదలి
పెట్టిన గ్రంథములను మనము భద్రపఱచి గౌరవించుచున్నామో లేదో యని

వారి నిశ్శరీరాత్మ లాందోళము నొందుచున్నవి. తమ్ముఁ గూర్చి తమ తరువాతివా
రే మనుకొనుచున్నారో యనియుఁ దమ్ముఁ బ్రశంసించుచున్నారో దూషించు
చున్నారో మఱచియే పోయినారో యనియు వారు తహతహలాడుచున్నారు.
విషయము చెప్పవలసిన యెడల మనము కొందఱి నప్పుడే మఱచియే పోవుచున్నా
ము. మండపాక పార్వతీశ్వర శాస్త్రులవారు రచియించిన గ్రంథ నామము లన్నియు
మనకుఁ దెలియునా? ఆయన జననతిథి మృతతిథి యేవో మనకుఁ దెలియునా?
వారెం తెంతకాలము జీవించిరో యెఱుఁగుదుమా? శతాధిక గ్రంథకర్త చరిత్ర
మే మనకు సందేహాస్పద మైనదే. వావిలాల వాసుదేవశాస్త్రులవారు, బెల్లపుకొండ
రామారావుగారు, కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు, ధర్మవరము కృష్ణ
మాచార్యులగారు, డి. కృష్ణశాస్త్రులువారు, దేవులపల్లి సుబ్బరాయ తమ్మన్న
శాస్త్రులవారు, దేవగుప్తపు సన్న్యాసిరాజు గారు, తిరుపతిశాస్త్రులవారు మొద
లగువా రెందఱో గ్రంథముల వ్రాసి కాలగతిం జెందినారు. వారిచరిత్రములు
తెలిసినంతవఱకు సంపాదింపవలసి యున్నది. ఈభారముకూడఁ బరిషత్తువారే
వహించుట కర్హులు. కందుకూరి వీరేశలింగము పంతులుగారి కవిజీవితగ్రంథముల
తరువాత వ్రాయఁదగిన గ్రంథముల కుపయోగపడు సామగ్రి పరిషత్తువారికిఁ
గావలదా? అదిగాక మృతకవులయందఱ ఛాయాపటములఁ గూడఁ బరిషత్కా
ర్యాలయమున నుంచుట మంచిది. వారి నావిధముగ మనము గౌరవింప వల
యును.

ధనార్జనము: — కాని ప్రాఁబలుకులకుఁ బ్రణవ మెట్లు ప్రారంభమో
వివాహాదిశుభ కార్యములకు విఘ్నేశ్వరపూజ యెట్లు ప్రారంభమో నాటక
మునకు నాందీపూజ యెట్లారంభమో పరిషత్కార్య నిర్వహణమునకు "సొమ్ము
లేదు సొమ్ములే" దనుపంచాక్షరి ప్రారంభ మై యున్నది. ఇది యొక్క మన
పరిషత్తునకుఁ గలిగిన బాధయే కాదు, పార్లమెంటు సభయందు మొదలు పంచా
యతీకోర్టులోవఱకుఁ బాడఁబడుచున్న పాటల కన్నిటికిఁ బల్లవి యిదియే. సొమ్ము
లేదు. సరియె కాని, యుత్సాహము లేకున్నఁ జిక్కు కాని సొమ్ము లేకున్న నంత
చిక్కు లేదు. సొమ్ము పైనుండి రావలసినది యుత్సాహము లోనినుండి రావలసి
నది. ఉత్సాహమె మనకుఁ బూర్తిగ నున్నయెడల సొమ్ము వచ్చియే తీఱును. ఉప
కారవేతనమును దీసికొనకపూర్వము మ-రా-శ్రీ జ. రామయ్య పంతులుగారు
పరిషత్తునకు ధనలోప మెక్కువగా నుండుటను జింతించి తా మాంధ్రదేశమున
నున్న ప్రతిగ్రామమునకే గాక ప్రత్యాంధ్రునిగృహమునకుఁ గూడఁ దిరుగుదు

ననియు నింటి కొక్కరూపాయచొప్పున సేకరించి పరిషత్తున కీకొఱఁతఁ దీర్తు నని యు నీగ్రామమునందే సెలవిచ్చియుండిరి. ఆయనయుత్సాహమే పరిషత్తున కున్న ప్రధానాధారములలో నొక్కటి. ఆయన పెద్ద లగుచున్నారు. యువకు లగు భాషాభక్తు లాయనకుఁ దోడుపడినయెడల సొమ్ము లేదన్న పంచాక్షరీమంత్రము సొమ్ము లేకపోలే దనునష్టాక్షరీమంత్రముక్రింద మార్పఁగలరు. మహారాజులు రాజులు జమీందారులు మొద లగుసంపన్ను లిదివఱకే విశేషధన మిచ్చి యు న్నారు. అందులో మామహారాజుగారు పైగ ప్రధానమైన నిఘంటునిర్మాణము నకు వలయుధనము నంతయు నీయసంకల్పించుకొనియే యున్నారు. ప్రజలే తమ బాహుబలమున నింకఁ బరిషత్తునకు ధనము సమకూర్పవలసియున్నది. ఊరనున్న ప్రతిగృహముపై యూనియను పంచాయతీప న్నిచ్చుచున్నామా లేదా? ఒక్కరూపాయ మొదలు పది యిరువది రూపాయలకు పైగ నిచ్చుచు న్నామా? లేదా? పరిషత్తుపన్నుక్రింద నింటింటి కొక్కరూపాయ యింటింటి నుండి వసూలు కావలయును. అది యెంతబీదవారి యింటికైనను భారమని యనిపింపదు. ఇదివఱకు మన మెన్నిపన్ను లిచ్చుచుండలేదు. ఇంక నెన్ని యిచ్చుటకు సంసిద్ధులమై యుండలేదు. అవి యన్నియు మనకు మోక్షప్రద ములా? ఇది కాకపోవునా? నిజ మాలోచింపఁగాఁ బరిషత్తుపన్నుకంటె మ్యుని సిపల్ పన్ను మనకు ముఖ్యమైనది కాదు. ఇంటిముందు పెంట యుండుట మంచిదా? మనసునందుఁ బెంట యుండుట మంచిదా? కావునఁ బంచాయతీ పన్నుకంటెఁ బదిరెట్లు సంతోషముతోఁ బరిషత్తుపన్నును మన మీయవలయును. ఇప్పుడు మనదేశమం దున్న గ్రంథకర్తలతాతలో తాతలతండ్రులో ప్రత్యాం ధ్రునియింటిలోఁ జరిగిన వివాహములలోఁ గవిత్వపుఁ బల్లెరమును గ్రహించిన వారై యుందురు. నేనుగూడఁ గవిత్వపువరహా గ్రహించు నాచారము గలవారి వంశములోనివాఁడను.

కవులారా! మనహక్కులను మనము విడుచుకొంటిమి. అది తప్పు. (Lispendens Resjudicata) జ్ఞానమువలన మనము సంపాదించుచున్న సం చులకంటె కాన్‌తీటా సైన్‌తీటా జ్ఞానమున సంపాదించు చున్న ముల్లెలకంటె (D. C. B. Income tax) జ్ఞానమువలనసంపాదించుచున్న మూటలకంటె (Cash credit) జ్ఞానమున సంపాదించుచున్న గోతములకంటె కవితాదేవతారాధన పూర్వకముగ మనముత్తాతలు కళ్యాణకాలమందు సంపాదించిన పరమపవిత్ర మైన కల్లెకువరహాయున్నదే యది మాత్రము సోదరగ్రంథకర్తలారా! అధిక

మైనది. అమూల్య మైనది. అనుపమాన మైనది. మదరాసు బ్యాంకి (Bank) లోని ధన మంతయు మీదే యైనను మాటవరుసకుం జూడీ తప్పులేదుకద! దాని కంటె మీకవిత్వపువరహా ఘనమైన దని యెంచవలయును. అట్టియత్యుత్తమ ధనము మన మేల వదలుకొనవలయును. ఆంధ్రసోదరులారా! ఇంతటినుండి మీయింట జరుగుకళ్యాణములందు మాకు రావలసిన కవిత్వపుంగట్నము మీ రీయకతప్పదు. మీపూర్వులు మాపూర్వుల కిచ్చిరి గావున మీరు మాకీయవలసి యున్నది. గ్రంథరచయిత లగుమే మాంధ్రసాహిత్యపరిషత్తునం జేరియుంటిమి. కావున మాకు రావలసిన దేవో మీరు పరిషత్తునకే యర్పింపవలయును. మా యిండ్లలో జరుగు పెండ్లిండ్లకుం గూడ మేము గవిత్వపుంగట్నమును బరిషత్తునకే సమర్పించుకొందుము. మహాజనులారా! పరిషత్పోషణము మీచేతులలోనే యున్నది. మీవలన వచ్చుధనము పరిషత్కార్యముల కింకను జాలకుండు నేని మరల దేశీయప్రభువులనే ప్రార్థింతము. పదేపదే వారినడుగుటలో మనకు వెనుకయడుగు లేదు. మరల మరల నెందు కీయవలయు నని వారికి వెనుకచేయి లేదు. ఇట్లు రాం దగినధనములో నెనిమిదవభాగ మైనను బంద్రెం డవభాగ మైన నేనిం జెప్పంబోవుపనికై వినియోగింపవలయు నని నాప్రార్థన. నాయనలారా! మీరు శాసననిర్మాణసభలలో సభ్యులైనను మంత్రిపదవుల కర్హు లైనను గాలాంబరకవచధారులై కర్కశతర్కవాగ్వాహినితో న్యాయసభలందుం జేరి కాకిని గ్రద్దను గ్రద్దను గాకిని జేయంగల యింద్రజాలమహేంద్రజాల విద్యా పారీణులైనను మహోపాధ్యాయు లైనను దర్కవ్యాకరణవేదాంతాది శాస్త్రపంచానను లైనను భాషాభివృద్ధిమాత్రము కలము చేతంబుచ్చుకొని కడుపు చేతంబుచ్చుకొని గ్రంథములవ్రాయు కవులవలనంగాని మీవలనం గాదు, కాదు. గ్రంథరచనా బాహుళ్యమునం గాని భాషాభివృద్ధి కాదు. కాదు. వెనుకటి యధ్యక్షులు చెప్పిన దదియే; ఎన్నిసారులైన నేను జెప్పిన దదియే; రాంబోవువారుకూడం జెప్పం గలిగిన దదియే. అధ్యక్షులలో భేదమే కాని పాటలో భేదము లేదు. మునుపటి పాటయే. మునుపటి రాగమే. మునుపటి తాళమే. మునుపటి పల్లవియే. మునుపటి యెత్తుబడియే. చివరకు మునుపటియాశాభంగమే. అది మాత్రము తప్పకుండు. నిజముగాం గవులు మిగుల దురవస్థలో నున్నారు. గాదులలో గరి సెలకొలందిం గల్గా యున్నవారు, సర్కారువారియొద్దం బత్రము లున్నవారు వేటుకలమీందం గొబ్బెరకురిడీలను నిలువంజేసినవారు నింక నేమోచేసినవారు నింక మఱియేమో చేయుచున్నవారు నట్టిమీకుం గవులు పడుక్షోభ మెట్లు

తెలియఁగలదు. కవిజన్మ మంత యసందర్భజన్మము మఱియొకటి లేదు. స్వ
భావజ్ఞాననిక్షేప మైనకవికి సంసారమును బోదుపుగా జరుపుకొను బుద్ధి లేదు.
భావనాభాండాగ్రప్రభూత్తముఁ డైనకవి కాఫీనీటికై మూఁడు కానులకొఱకు కల్లలాడి
పోవును. తనయభిప్రాయములను వారణాసీపీతాంబరములతో ధారావసిలి
నులతో జలతారు బుటేదారీపనులతో సింగారించిన కవికమీజుమెడక్రింది
చినుగులను గ్రమ్ముకొనుటకుఁ గంఠము చుట్టు బట్టచుట్టుకొనును.

ఇట్టి దుస్థితిలో నున్నను మనస్సులో నతనికి దీనత లేదు. నైచ్యము
లేదు. అశక్తుఁడ యన్నమాట లేదు. శాశ్వతముగా నుండువాఁడు దానొ
క్కఁడే కాని మిగిలినవా రందఱు నశించువా రే యని నమ్మికతోఁ దానుం
డును. అట్టివాఁ డొకని నాశ్రయింపఁగలఁడా? ఆతనికున్న గర్వము నహంభా
వము రణశూరుల కున్నదా? రాజాధిరాజుల కున్నదా? తలతిక్కలో నంతవాఁడు
మఱియొక్కఁ డేఁడి? తనరుచియే తనది తన మతమే తనది తనధోరణియే తనది.
పాదుషాను మెచ్చువాఁడు కాఁడు. భగవంతునే మెచ్చువాఁడు కాఁడు. కాని
యిట్టికొసవెఱ్ఱివారివలననే భాషాభివృద్ధి యయినది, యగుచున్నది, కావలసి
యున్నది. వా రిండ్లలోఁ బడి యష్టకష్టములఁబడుచు భాషాసేవ చేయుచున్నారు.
వా రంతదురవస్థలో నున్నారని చెప్పుట యసత్యము, వీథుల వెంటఁ దల లెత్తు
కొని తిరుగుచునే యున్నా రని మీరు నన్నధిక్షేపింపకుఁడు. వారంటు జవాను
లేవైపుననుండి వచ్చుచున్నారో యని యటునిటు తలలెత్తి చూచుచున్నారు
కాని మఱియొకటి కాదు. నామాట యథార్థ మని విశ్వసింపుఁడు. అట్టివారు
కొన్ని యమూల్య గ్రంథములను వ్రాసి యంతరించినారు. ఇంక నంతరింప
నున్నారు. వారిగ్రంథము లచ్చుపడుట కాధారము లేదు. అవి భాషలోఁ
జేరు నను నాసలేదు. ప్రతిమండలమందుఁ బుస్తకముల యేజంటులు నున్నారు
కదా? వా రాగ్రంథముల నుద్ధరించి కవులకష్టములఁ గడ తేర్పరాదా? ఆఁ! కడ
తేర్చుచునే యున్నారు. కవులను గ్రంథములనుగూడ నూటి కేనుబదియైదు
కమీషనను వాఁ డొకఁడు మూఁడు వేల ప్రతులచ్చు వేయించుకొని మూఁడుపాతి
కల ప్రతులు కవి కిచ్చెద ననువాఁ డొకఁడు. ఇట్టివా రే యున్నవారిలో ననేకులు.
ఇతరదేశములలోఁ బూర్వశతాబ్దములందలి గ్రంథవిక్రేతలు కవుల నైన మిగి
ల్చిరి. ఇప్పుడు పరదేశములలో గ్రంథకర్తలు గ్రంథవిక్రేతలుఁ గూడ బాగుపడు
చున్నారు. మన దేశమందు గ్రంథవిక్రేతలు కలియుగవృకోదరులై కవులను
గ్రంథకర్తలను గూడఁ గబళించుచున్నారు. గ్రంథకర్తలలో బొత్తిగా రిక్తులగువారిని

మీరు కాపాడవలసి యున్నది. ధనశక్తి తక్కువైనకొలఁదిఁ గవితాశక్తి యెక్కువగ నున్నవా రెందఱో యున్నారు. ఆసంగతి మీరు బాగుగఁ దెలిసికొని, యట్టివారి గ్రంథముల నచ్చువేయించి వారికి గ్రంథప్రతుల నిచ్చునెడల వారు బాగుపడుదురు. వానిని గ్రంథనిర్ణాయకసంఘమువారు పఠనగ్రంథములుగ నియమించునెడల వారు రవంత నిలువఁబడి యింకను గ్రంథముల వ్రాయుదురు. పరిషద్ధనములోఁ బంద్రెండవవంతో యెనిమిదవవంతో యొకందులకు వినియోగింపవలసి యున్నదని నే నింతకుముందుఁ జెప్పితినే, యీ యుత్తమకార్యమునకై యది వినియోగపడవలసియున్నది. ప్రపంచమందలి యితరదేశములలోని పరిషత్తులు దాదాపుగా నన్నియు నిట్లు నిరుపేదకవులకు సాయమొనర్చినవి. అది కాక యట్టివారు మరణించినపిమ్మటఁ గూడ వారిపిల్లలకుఁ గొంతయుపకారవేతనము లిచ్చినవి. అంతపని మనము చేయఁజాలము. ప్రధానకృత్యములకే పరిషత్తు ధనము లేకుండ బాధపడుచుండఁగాఁ బారమార్థికకృత్యము లెట్టు చేయఁగలదు? అదిగాక రెండుమూఁడు వందలసంవత్సరములక్రిందటఁ బాశ్చాత్యదేశములందలి కవులదరిద్రత వంటిది ప్రపంచమున లేదు. మనకవులలోఁ గూడ లేనివా రనేకు లున్నారు కాని వారియంత లేనివారు కారు. అయిదు దినము లాఁకలిచే మాఁడిమాఁడి యాకస్మికమున దొరకిన రొట్టె నాత్రముతో మ్రింగఁబోవ నది యంగిటి కడ్డుపడుటచే నంతలో నసువులను బాసిన ఓట్వే (Otway) వంటి కవి మనలో నేఁడి? తనయస్థిపంజరము నమ్ముకొని రొట్టెవానికీయవలసిన ఋణమును దీర్పు మని మరణశాసనము వ్రాసిన వాజిలాస్ వంటి కవి మనలో నేఁడీ? కావున మనకవులకు గ్రాసవాసముల కంతసాహాయ్యమావశ్యకము లేదు. మంచిగ్రంథములు వారు రచించునెడల వాని నప్పుడప్పుడు పరిషత్తువా రచ్చువేయింపవలయును.

బిరుదములు:—ఆర్యులారా! మఱియొక చిన్న విన్నప మున్నది. ఆంధ్రదేశపండితులలోఁ గొందఱకు సర్కారువారు బిరుదముల నొసంగుచున్నారు. సర్వసంగ పరిత్యాగు లైనసన్న్యాసులు సైతము వదలని వదలఁగూడని భాషాభిమానముచే భాషావిద్వాంసులలోఁ గొందఱకు బిఱుదము లిచ్చినారు. శంకరాచార్యపీఠస్థులొకరు బ్ర. శ్రీ. కొక్కొండ వేంకటరత్నముపంతులవారి కొక బిరుద మిచ్చినారు. వానమామల జియ్యరుగారు శ్రీమాన్ కాండూరి భాష్యకారాచార్యులవారికిఁ గవిసార్వభౌముఁ డను బిరుదమును గాఁబోలుఁ గటాక్షించిరి. ఇప్పటిశంకరాచార్యపీఠస్థులు మన బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారి

కనేకబిరుదము లీనడుమనే యిచ్చినట్లు వినుచున్నాము. తుదకుఁ గాళీఘట్టమున నున్నసంఘమువా రెవరో మనయాంధ్రదేశీయపండితులకు బిరుదము లిచ్చి బహుమానించుచున్నారు. కాని మనసాహిత్యపరిషత్తు వా రిచ్చుచున్న దేమున్నది? మనవా రిచ్చుచున్నవి రెండేబిరుదములు; సామాన్యసభ్యుఁడు కార్యనిర్వాహకసభ్యుఁడు. ఇంతే. ఈబిరుదము నైన నేదో కొంత దక్షిణ తీసికొని యిచ్చుచున్నారు కాని పాండిత్యబహూకృతిగా నిచ్చుట లేదు. మీ కాంధ్రదేశమున బిరుదార్హులైనపండితులు కనఁబడనేలేదా యేమి? అటులైన మీకుఁ గనఁబడనివారు పైవారి కెట్లు కనఁబడుచున్నారు? ఒకరి కిచ్చినయెడల మిగిలినవారు మాకేల యీయకపోవలయు నని వివాదపడుదు రేమో యనుసందేహమున మానివైచితిరా! అటులైన సర్కారువారిపైనను శంకరాచార్యులవారిపైనను నిందులకిప్పుడు వ్యాజ్యములు తెచ్చినవా రెవ్వరు? బిరుదముల కర్హులైన పండితు లందఱు మనసాహిత్యపరిషత్తులోనే యున్నారు. కాని బిరుదములను గూర్చి యేపండితుఁడు గూడ నిదివఱకు ముచ్చటించి యుండలేదు. ఎందుకో మీ రెఱుఁగరా? ఏపండితుఁ డైన ముచ్చటించినయెడలఁ దనకు బిరు దిమ్మని యడుగుచున్నాఁ డని పైవా రనుకొనిపోవుదు రనుభయముచేఁ బండితు లెవ్వరుఁ గిక్కురుమనకుండ నున్నారు. నే నాపాండిత్యబాధ లేనివాఁడను గావున నిర్భయముగాఁ బలికితిని. అపండితుని సభాధ్యక్షునిగా నెన్నుకొనుట వలనఁ గలిగినలాభ మిది. ఇంతకంటె నే నిప్పుడు చెప్పఁదగినది లేదు. సాహిత్యపరిషత్తు నిచ్చుటి కాహ్వానించిన భాషాపోషకు లగుశ్రీపీఠికాపుర మహారాజుగారియెడలఁ గృతజ్ఞులమై యుండి వారిక్షేమాయురారోగ్యైశ్వర్యాభివృద్ధులకు భగవంతుని బ్రార్థింపవలయును.

---

శ్రీరస్తు.

# వార్షికసభలోఁ జదువఁబడిన పద్యములు.

సీ. శ్రీకరకవిచక్రవాకవిహంగవిహారవిలాసాప్తి నతిశయించి
మాధురీసము పేతమంజులకవితారసామృతపరిపూర్తి నధిగమించి
సకలకావ్యప్రశంసావర్ధమానశబ్దతరంగసంఘసంగతి నెసంగి
విషయగ్రహణమాత్రవికసితసుజనచేతస్సరోజాతసాంద్రత వహించి
విపులసూర్యప్రభావాప్తి వెలయు నేత, దాంధ్రసాహిత్యపరిషదబ్జాకరంబు
కరముఁ బెంపొందుఁగాతజగన్నియంత, యైనపరమేశ్వరుననుగ్రహంబునొంది.

సీ. మును నన్నయకవీంద్రముఖపంకజంబున నావిర్భవించి యనంతరంబు
శ్రీనాథముఖకవిశ్రేణిచే నభివృద్ధిఁ గాంచి దిగంతవిఖ్యాతినొంది
రాయలసభఁ గవిరా జగుపెద్దన్న వెలయింపఁగఁ బ్రబంధపీఠ మెక్కి
పింగళి సూరన్న విజ్ఞానమహిమచే భావనాబలమునఁ బరిఢవిల్లి
యాంధ్రసాహిత్యపరిషత్తునాశ్రయించి, యున్నయియాంధ్రభారతికుద్భవిల్లె
నేఁడు పీఠపురీమహానృపతిసూర్య, రాయనరపాలసభను గౌరవసమృద్ధి. ౨

గీ. ఇచటఁ గూడినయాంధ్రసాహిత్యసభకు, సభనుబిలిచిన శ్రీమహాప్రభువరేణ్య
సూర్యరాయునకును జయసుఖసమృద్ధు, లిచ్చి కావుత సర్వలోకేశ్వరుండు. 3

గీ. తల్లి యైనట్టి భాషామతల్లికన్న, మిన్నయై వన్నెగాంచిన సన్నుతాంధ్ర
భాషఁబోషించుసభ్యులప్రయతనంబుజయమునొందింపఁబ్రార్థింతుసర్వవిభుని.

పేరి వేరయ్యశాస్త్రి.

— నవరత్నమాల —

కం. శ్రీమహిజావిభుఁడు రఘు, స్వామి కృపాజలధి రామచంద్రుండు పరం
ధాముఁడు ప్రోచుం గాత సు,ధీమయ మగునాంధ్రసాహితీపరిషత్తున్. ౧

సీ. అవనీజనంబుల కన్యోన్యహృద్భావ మవగతంబుగఁ జేయు నట్టిచతుర
తనుఁ గొల్చువారి కిం దును నందు భవ్యపదావాప్తి సమకూర్చు నట్టివరద
సంసారగహనసంచరణఖిన్నాత్ము లౌ జనములం దేర్చు వి శ్రామభూమి
విబుధజిహ్వాసింహపీఠికాసీన యై లోక మేలెడు సర్వలోకరాజ్ఞి

యఖిలలోకకుటుంబిని యైనవాణి, గీతసాహితీరసమయ క్షీరములను
ద్రాలఁకుచుండెడుతనచన్నుదోయిఁగుడిపితనదుబిడ్డలనాంధ్రులఁదనుపుఁగాత.

సీ. సుకుమారత శిరీషసుమమంజరులు నీకుఁ గ్రిందు గా నటన్నపే రొందినావు
వీణారవముకన్న వీనులవిందైన కలికిపల్కులకల్మి నలరినావు
"దేశభాషలయందుఁ దెలుఁగు లెస్స"నిరాజ పరమేశసన్నుతుల్ వడసినావు
ఆచంద్రతారార్క మవని నిల్చెడుమహా కవులైనకొడుకులం గాంచినావు
సకలరాజాధిరాజహస్తములతోడ, బిరుదుతొడవులు సుతుల కిప్పించినావు
ప్రణుతగుణయుక్తి మైనన్య భాష లెల్ల, సాటి యే నీకు నాంధ్ర భాషావధూటి.

సీ. చెదపుర్వులకుఁ జిక్కి చెడకుండఁ బెక్కురసోజ్జ్వలగ్రంథమ్ము లుద్ధరించి
విబుధాగ్రణులు మెచ్చ విజ్ఞానకరము లౌ బహువిధవ్యాససంపదలు నించి
యేఁటేఁట నీయశం బెసఁగ ముఖ్యాంధ్రదేశస్థానములయందు సంచరించి
కృష్ణరాయలు వోలెఁగీర్తి గాంచినసూర్య రాయభూపాలు పెన్ ప్రాపు గాంచి
సంతతము నీకు నభివృద్ధి సంఘటించు, నాంధ్రసాహిత్యపరిషద్వయస్య యాది
వాక రెండుతారముగఁ దోడ్పడఁగ మమ్ము,నోము వే తల్లి యాంధ్రభాషామతల్లి.

తే. బాలవయస్సును దేశదేశాలఁదిరిగి, పదునొకండేండ్లప్రాయానఁ బ్రౌఢ వగుచుఁ
బ్రాపు నీ కిడు శ్రీపీఠికాపురీశు, వలచి వచ్చితె యిట కాంధ్ర పరిషదంబ.

తే. కడుశ్రమకునోర్చినినుమున్నుగాంచి పెంచి,క్షితివరకరగ్రహణయుక్త జేసెనీకు
నయ్య గాఁడె జయంతిరామయబుధేంద్రుఁ,డాంధ్రపరిషల్లలామ గుణైకధామ.

ఉ. శ్రీయుతసూర్యరాయనృపశేఖరుసత్కృప నాంధ్రభాషకున్
శ్రేయ మగుం గొఱంతలు నశించెడు నాంధ్రులభాగ్యలక్ష్మి వీ
వే యని యెంచి నిగ్గను టిఁ కెప్పుడుఁ కెప్పుడటంచుమాకనుల్
కాయలు గాచె వేగ వెడలంగదె యాంధ్రనిఘంటురత్నమా.

ఉ. చేయఁగఁ బూనినంతపని చేయుట దుష్కర మెంతచేసినం
జేయఁగ లేదటంచు నిరసించుట యో సుకరంబు చేసితో
చేయవొ దాని కేమి వగఁ జెందకు నిందకు నింద లన్నియున్
నీయభివృద్ధికే యని గణింపఁ గదే పరిషద్వతంసమా.

తే. ఆంధ్రపరిషత్తు రప్పించి యఖిలబుధుల, విందు లట్లాదరించిన పీఠికాపు
రాధినాథున కగ్రాసనాధిపతికి, సభకు నిత్యంబు శుభము లెసంగుఁ గాత.

త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు.

## — పరిషత్సభాప్రశంస —

చ. అనువుగఁ ద్వజ్జయంతిసమయాగతసత్కవికాండమును గనుం
గొని వచియింత్రు సూర్యవసుకోటుల నైన తుషానుగంటిమం
చనయముఁ గూచివారును మహాయశు లైనపురాణపండితుల్
ఘనపరిషన్మణీ! పలుమొగంబుల నింపుము కీర్తివర్షమున్. ౧

శా. కన్యాత్వంబును రోహిణీత్వమును సద్గౌరీత్వమున్ దాఁటి రా
జన్యుల్ గొల్వఁగఁ గన్నడుల్ ద్రవిడులు న్సంతోషముం జెంద సా
మాన్యస్థానము లెల్ల గ్రమ్మరి సభా! మాతృస్థలంబం దసా
మాన్యప్రౌఢనిఘంటుసంతతిని బ్రేమం గాంచఁగాఁ జేరితే. ౨

ఆ. ఒకట రాజభోగ మొకట మహారాజ, భోగమోలిదశలఁ బూని నీవు
నిన్నుఁ బ్రేమఁజూచు నిఖిలరాజన్యులఁ, గరము జేసితల్లె పరిషదంబ! ౩

సీ. కడపకురాళ్లపైఁ బడినిద్రఁగనఁ బోయె, గుంటూరు జనెగోఁగుఁగూరఁ దినఁగ,
వరిగె మధురకు దివ్యాంబరంబులుగట్టఁ, గాకినాడకుఁ బుచ్చకాయలుదినఁ
బోయె, రాజమహేంద్రపురి కేగె నరఁటికాయలుదిన, బెజవాడ ఫలములుదిన
వెడలె, నేలూరేగె బెల్లంబుఁదినఁ, బీశికాపురిచనె వంగకాయలుదిన
ననుచు నిట్లెందఱోకవులాడిరకట!, యాత్మసౌఖ్యంబువీడి యియాంధ్రపరిష
దంబయేఁటేఁట నిట్లు ప్రయాణమగుట, వారివారియాతిథ్యంబుఁ గోరిగాదె.

తే. తనరారన్ బహుశాస్త్రతంతువులనోతప్రోతము ల్సేసిన
స్త్రనియంతృత్వముఁ జేయనొక్కదశఁ బుష్పవ్రాతమున్నిల్పి, వా
గ్వనితారత్నము దానిఁ గట్టుకొనఁగా వాంఛించెఁగానన్ శిలా
టునికాయంబుల వేఱ యొండుదశఁ గట్టుం జూడఁడీ సత్సభన్. ౪

## గీతమాల.

తొలపట్టుల యక్షరత్వమును డులిచి, వాఁడివాతను బొడిచేసి, పర్ణశాల
వాసముగనుండి, గుణమునుబట్టి విడక, కవివరుని పేరుమాపి, చొక్కంపు శబ్ద
సేవమొనరించి, యహితుల వృత్తినడఁచి, వరశిలాశాసనంబులవలనుగనక,
లేదాఁటులదశమునఁ బోఁడిమిచెడఁ, బఱపి, పదితలలంగల వానిముఖము
బొదుఁగలవ్రాలఁదుడిచివ్రాయుంగఁజదువ, మొదలుఁదుద లేనిచరితనిమ్ముగఘటించి
పేరుకొనఁబడి, కదలింప వీలులేని, రామబాణంబుగణుతింపరానిదహహా!.

తాళపఙ్క్తుల యక్షరత్వమును డులిచి, వాఁడివాతనుబొడిచిచేసి, పర్ణశాల
వాసముగనుండి, గుణమునుబట్టి విడక, కవివరుని పేరుమాపి, చొక్కంపుశబ్ద
భేదమొనరించి, యహితులవృత్తినడఁచి, వరశిలాశాసనంబులవలను గనక,
లేడిదాఁటులదళమునఁ బోఁడిమిచెడఁ, బఱపి పదితలలంగల వానిముఖము
లందుఁగలవ్రాలఁదుడిచి, వ్రాయంగఁజదువ, మొదలుఁదుది లేనిచరితనిమ్ముగఘటించి
సేరుకొనఁబడి కదలింప వీలులేని, రామబాణంబు గణుతింపరాని దహహ!
యట్టిదాని నీ వేర్చితివన్న నీకు, వరయశమ్ముగుఁగాదె యోపరిషదంబ!

సీ. వీరవరాదిపృథ్వీవరాంతికమునఁ బ్రాకృతభాషసంబరముఁ గూర్చి
కిర్లమపూఁడి సత్తితినాథుచెంగట సంస్కృతవాణీప్రసక్తిఁ జూపి
లక్కనరత్నమ్మాతలవరునిముంగలఁ గావ్యకల్పనల విఖ్యాతిఁజెంది
వేంకటగిరి భూమివిభునిసమ్ముఖమున నాటకాలంకారనటన నెఱపి
యాంధ్రపరిత్సభారత్నమా! కనంగ, నీకృపాపాంగవీక్షణ నేఁటికీన్ర
పాలుసన్నిధి, మత్కవితాలఁబాము, పలుకఁగా నేర్చి కోటలోఁ బాగవైచె.

సీ. సూర్యప్రభుండు వసుప్రకాండమొసంగి. సదమలారోగ్య మొసంగుఁగాక!
గోవిందుఁ డెవుడు మిక్కుటపువృద్ధి నొసంగి, శశ్వద్యశంబు నొసంగుఁగాక!
కృపతోడ శ్వేతాచలపతి స్థైర్యమొసంగి, సమ్యగ్బలంబు నొసంగుఁగాక!
శ్రీవేంకటాద్ర్యప్ప భావుకంబు నొసంగి, సరగసుభద్రమ్మొసంగుఁగాక!
వెలయనష్టాదశపురాణపీఠశక్తు, లీపరిషదంబికామణి కెలమిసకల
శక్తుల నొసంగి, విడఁబోక, సాకుదేశ, యేకమతిజోక, రక్షించుఁగాక! వీఁక.

క్రొత్తపల్లి సుందరరామయ్య.

---

ఓమ్.

మ. సరసంబై మృదులంబునై లలితనిస్స్వనంబునై భావసం
భరితంబై, సదలంకృతిప్రచురమై వ్యంగ్యప్రధానంబునై
ధరణీశార్చితమై చెలంగు మనయాంధ్రఖ్యాతభాషాంబికా
కరుణాపాంగము జ్ఞానహేతు వయి వీకం బ్రోవుతన్ మమ్ములన్.

శా. ఏనాఁ డెచ్చట నెట్టిసత్కృతుల మున్నీవందితో చెప్పఁగా
లే నీక్షింపమి నేఁటికీసభను లాలిత్యంబు పెంపొందఁ బే
రూనన్ నిల్చితి వీశి కాపురనృపాలోత్తంసుసంపూజలన్
నానాఁటన్ వెలుఁగొందుమీ యిటుల యాంధ్రఖ్యాతభాషాంబరో.

మ. విపులం బాచుచు వల్లి ప్రాఁకినటు భావింపం గవీంద్రానన
స్ఫురణంబై ఘనసారశీతమయి సొంపుల్ మీఱు నీవైఖరుల్
తిరుగన్ మోసుల నెత్తఁ బీఠపురధాత్రీజాని శ్రీసూర్యరా
ట్పరుఁ డందిచ్చెఁ గరంబు వర్ధిలుమి యంబా యాంధ్రభాషాసతీ.

శా. రాజద్రాజమహేంద్రపట్టణమునం బ్రాదుర్భవంబంది స
ద్రాజాస్థానములందు వృద్ధియయి స్వాస్థ్యం బింతయున్ లేమిచే
బీజాడ్యంబున నున్నయాంధ్రకవితాదివ్యాంగనం బ్రోవఁగన్
రాజా సూర్యనృపాల! లె మ్ము త్వదగారంబుంగనన్ వచ్చెదున్.

ఉ. ఎట్టులు తొంటిరీతి వసియింతు నటంచుఁ దలంచు నిన్ను ర
మ్మిట్టులటంచుఁ బీఠమిడి యెంతయుఁ బూజలు సల్పు పీఠికా
పట్టణనేత యో తెలుఁగుబాసపడంతిరొ! చింతఁ బొమ్మ
చేపట్టి పీవు నీభయముఁ బాసి సుఖంపడు తొంటిరీతిగన్

సీ. స్ఫీతమాచు నానందభరమాచు నీతిసుందరమాచు రాజ్యంబు, తనరుఁగాక
ఘనమాచు విద్యాసదన మాచు సార్థజీవనమాచు సంతతి యలరుగాక,
దళమాచుఁ గల్పకందళమాచు బలమాచు యశము దిగ్దళకమం దలరుఁగాక
అమలమాచును నీతివిమలమాచును జిత్తకమలంబు వికచమై యమరుఁగాక

ఆంధ్రభాషామతల్లి నిండారుప్రేమ,ఁ గనుచు దీర్ఘాయురైశ్వర్యకాముఁడ వయి
యాశ్రితామరభూజ మై యలరుమయ్య, సూర్యరాయమహారాజ సుచిరతేజ.

వెంపరాల సూర్యనారాయణ.

---

శ్రీరస్తు.

సీ. ఏమహారాజు సుశ్రీమిళత్పుటభేదనం బీను విద్యాపురంబుడంబు
నేమహారాజు సుధీమిళత్పరిషదుచ్ఛ్రాయ మష్టదిగ్గజోచ్ఛ్రాయము నెఱపు
నేమహారాజు తేజోమిళద్రాజ్యసంవృతి విక్రమాటోప విరహితంబు
నేమహారాజు ప్రజ్ఞామిళత్కావ్యరసానుపాలనకవీం ద్రైకవేద్య

మామహారాజు, రాజబిడౌజుఁ బీఠికాపురీరాజ్యపీఠవికస్వరాజు
ఘనవిపులకల్పభూజు శ్రీసూర్యరాయు, నాంధ్రభోజుఁడు నానా నె?యతిశయోక్తి!

గీ. ఆపరిషత్సమ్మేళన, మేపార నిరంతరాభి ♦ వృద్ధిగ నాంధ్ర
వ్యాపారాభ్యుదయస,మాపాదక మగుతఁ గుంతిమాధవుకరుణన్.

వెన్నేటి రామచంద్రరావు.

---

# విజ్ఞాపనము.

మహాశయులార!

పరిషత్తునకుఁ బరిషత్పత్రికకుఁ జందాలనీయవలసిన వారిపేర వారు వా యవలసిన మొత్తములను దెలుపుచుఁ బలువురకు మనవులువ్రాసియున్నారము. కొందఱు కొంతకొంత పంపుచున్నారు. కొందఱింక నుపేక్షవహించియే యున్నారు. ఈ పత్రిక తమకుఁ జేరినపిదపనైనఁ జందా ధనమును బంపఁగోరుచున్నారము. ఇంతటినుండి సభ్యత్వముగాని పత్రికగాని యక్కఱలేనివారు స్పష్టముగా నొక్క జాబువ్రాసి తెలుపఁగోరెదము. కొందఱకు ముందుపత్రికను వి. పి. గా బంపఁదలఁచితిమి. దయచేసి పుచ్చుకొనఁగోరుచున్నాము. అంతయుఁగాకున్న గొంతయైనఁ బంపుఁడని యడిగియుంటిమి, మూఁడు నెలలోఁ బంపకున్నవారి పేరులు పట్టికలోనుండి తొలఁగింపఁబడుననికూడఁ సూచించితిమి. ఆక్షేప చేయక భాషాభిమానమును గనఁబఱుచుచుఁ బరిషత్తునకు వారి నామము నలంకారప్రాయముగాఁ జేయుదురని నమ్ముచున్నారము.

కార్యదర్శి.

# వేఁగినాటిశాలంకాయనుల రెండుక్రొత్త శాసనములు.

—ం॰ం—

మనకుఁ దెలిసినంతవఱకు వేంగీమండలమును మిక్కిలి పురాతనకాలమునఁ బాలించినవారు 'శాలంకాయను' లనురాజులు. వీరివి రెండుతామ్రశాసనములు[1] మాత్ర మిదివఱకుఁ బ్రకటింపఁబడినవి. వీరిచరిత్రకునవియే మన కిదివఱకు నాధారములుగ నుండెను. ఇప్పుడు నాకు నీవంశపువారయిన యిద్దఱు రాజులచే నీయఁబడిన రెండుతామ్రశాసనములు లభించిన వని తెల్పుట కెంతయు సంతసించుచున్నాను. ఇవి కొలఁదికాలముక్రిందట గుంటూరునకు నాఱుమైళ్లదూరమం దున్న కంతేరనుగ్రామమందు నింటికిఁ బునాది త్రవ్వించుచుండఁగా శ్రీయుత వాసిరెడ్డి బుచ్చినాయఁడుగారికి దొరకినవి. ఆంధ్రపత్రికాకార్యాలయమం దున్నశ్రీయుత చల్లా జగన్నాథరావుగారివలన నాకు లభించినవి.

## శాసనముల యాకారాదికములు.

మొదటిశాసనమునకు 'అ' శాసన మని గుర్తు పెట్టుకొందము. ఇందు నాల్గురాగిరేకులు కలవు. ఒక్కొక్కటి 5½ అంగుళములు పొడవుగను, 1¼ అంగుళము వెడల్పుగను నుండును. పైరేకుయొక్క యనఁగా మొదటిరేకుయొక్క పైభాగమును, నాల్గవరేకుయొక్క యనఁగాఁ గ్రిందిరేకుయొక్క రెండవవైపును వట్టివిగా విడిచిపెట్టఁబడినవి. వానిమీఁద నక్షరములు లేవు. ఈరెండువైపుల నక్షరములు చెక్కినయెడల వానికి వేఱు ఆచ్ఛాదనము లేనందున నవి యఱిగిపోవు నని యిట్లీరెండువైపులును విడిచిపెట్టఁబడును. నాల్గురేకులలో రెండవది మిక్కిలి సన్ననిది. అందుఁ గొంతభాగము విఱిగిపోయినది. ఈనాల్గురేకులును ఒకగుండ్రనికడియములోఁ దగిలించియున్నవి. ఈకడియపువ్యాసము (diameter) 2½ అంగుళములు. ఈకడియపు చివర లొకగుండ్రని ముద్రలోఁ దూర్చి గట్టిగ బిగింపఁబడినవి. ఈముద్ర కంచుతోఁ జేయఁబడినది. దీనివ్యాసము 1½ అంగు

[1] ఒకటి కొల్లేరు తామ్రశాసనము. Ind. Ant. Vol. v. p. 175; రెండవది ఏలూరు ప్రాకృతశాసనము. Ep. Ind. Vol. ix p. 56.

శము. ఈముద్రమీఁది విగ్రహమును అక్షరములును బూర్తిగా మాసిపోయినవి దానిమీఁది విగ్రహము నందియై యుండిన నుండవచ్చును. రాగిరేకులమీఁది యక్షరములు పెక్కుచోట్ల నఱిగిపోయినవి. కాని యక్షరములను బెద్దవిగాఁ జూపు నద్దముసాయమునను, నిదివఱకుఁ బ్రకటింపఁబడిన శాలంకాయనశాసనముల సాయమునను నఱిగిపోయిన యక్షరములను జాలవఱకుఁ గుర్తింపఁగల్గితిని.

రెండవశాసనమునకు 'ఇ' అన్నగుర్తు పెట్టఁబడినది. ఇది నందివర్మచే నీయఁబడినది. ఇందును నాల్గు రాగిరేకులు గలవు. ఒక్కొక్కదాని పొడుగు 5 అంగుళములు, వెడల్పు 1¼అంగుళము. మొదటిరేకు పైభాగముమాత్ర మక్షరములు చెక్కకుండ విడువఁబడినది. ఈనాల్గురేకులకును దగిలింపఁబడిన రాగికడియము 2¾ అంగుళముల వ్యాసముకలది. దానికిఁ దగిలియున్న ముద్ర 1¾ అంగుళములు వ్యాసము కలది. రేకులు మొదట నాయొద్దకు వచ్చినప్పు డీముద్రయంతయుఁ జిలుముతో నిండియుండెను. ఇం దేదియైన నొకవిగ్రహ ముండు నని నేను దలంపలేదు. కాని దాని ననేకపర్యాయములు ననేకవిధములుగఁ దోమింపఁగా నందుఁ జక్కని నందివిగ్రహము వెలువడెను. అది ముద్రకు నడుమ నున్నది. దానిక్రిందను ముద్ర యంచువెంటను గొన్నియక్షరము లున్నవి. కాని యవి యెక్కువగా నఱిగిపోయినందున గుర్తించుటకు వీలులేకుండ నున్నది. కావున శాలంకాయనుల ముద్రమీఁదియక్షరము లెవ్వియో తెలిసికొనుటకు వీలులేదు.

శాలంకాయనులముద్రమీఁది విగ్రహము నందియని మన మీముద్రలో స్పష్టముగ గుర్తింపఁగలుగుట యొక గొప్పవిశేష మనియె చెప్పవలెను. ఏల యన నిదివఱకుఁ బ్రకటింపఁబడిన రెండుశాసనపుముద్రలమీఁది విగ్రహముల స్వరూపములు స్పష్టముగాఁ దెలియలేదు. కొల్లేరుశాసనపు ముద్ర దొరకలేదు. ఏలూరు ప్రాకృతశాసనపుముద్రమీఁద విగ్రహము చెఱిగిపోయినది. "దాని మీఁద నాల్గుకాళ్లవిగ్రహము కానవచ్చుచున్నది. అది పులియేమో—"అని దానిని గుఱించి వ్రాసినవా రనిరి. ఇప్పుడు ప్రకటింపఁబడుచున్న 'అ'అను మొదటిశాసనపు ముద్రమీఁది విగ్రహముకూడ స్పష్టముగ లేదు. కావున నీముద్రమీఁదివిగ్రహము ముఖ్యమైనది.

## అక్షరాదుల స్వరూపము.

ఈరెండుశాసనములయక్షరములును నొకవిధమైనవియే. రెండిటికిని 20-30 ఏండ్లకంటె నెక్కు డంతర ముండఁజాలదు. ఈశాసనముల ప్రాతి

'తెలుఁగుకన్నడాక్షరము' లనఁబడు లిపియొక్క పురాతనస్వరూపము. ఇంతకంటెఁ బురాతనస్వరూపముఁ జూడవలయునన్న 'మైదవోలు'[1] 'కొండమూడి'[2] శాసనములఁ జూడవలయును. ఈ రెండుశాసనములు కూడ గుంటూరుజిల్లాలో దొరకినవే. ఇంతకంటెఁ బురాతనాక్షరములను, దెలుఁగుదేశపువానిని జూడవలయునన్న అమరావతీస్తూపమందలి శాసనములను[3] భట్టిప్రోలుస్తూపమందలి శాసనములను[4] జూడవలయును. కాని వానిని బ్రాహ్మియక్షరము లందురే గాని తెలుఁగుకర్ణాటకాక్షరము లనరు. ప్రస్తుతపు కంతేరుశాసనముల యక్షరములు కొల్లేరులో దొరకిన శాలంకాయనశాసనమందలి యక్షరములను, చిక్కుళ్లలో దొరకిన విష్ణుకుండినుల శాసనములోని యక్షరములను బోలియుండును. ఏలూరులో దొరకిన శాలంకాయనుల ప్రాకృతశాసనమునందలి యక్షరములకు నీశాసనములందలి యక్షరములకును స్వరూపమునందుఁ గొంచెముగా భేద ముండును. ఈశాసనముల తరువాతది యగు పురాతనాంధ్రకర్ణాటలిపి చూడవలయునన్న విష్ణుకుండినులయుఁ దూర్పుచాళుక్యులయు శాసనములఁ జూడవలయును. బర్నెల్ తరువాత 'లిపిశాస్త్రము'ను శోధించిన బూలర్ (Buhler) గారిమతమున నీపురాతనలిపియొక్క చరమకాలము కుబ్జవిష్ణువర్ధనుని కుమారునివఱకు. తరువాత మధ్యమకాలము ప్రారంభమగును.

ఈశాసనములందలి కొన్నివిశేషములు:—ఇందలి రెండవశాసనమున పొల్లు మకారము (మ్), మకారమును సగముచేసి యొకవిధమైన సున్నగాఁ జూపఁబడినది [9-వ పంక్తి]. అదియే క్రమముగఁ దరువాత మనసున్నగా మాఱినది కాఁబోలును. 'ఇ' శాసనముయొక్క 3-వపంక్తిలో నుపధ్మానీయము గుర్తు కలదు. అది సరిగ మనబండిఱాను బోలియున్నది. ఉపధ్మానీయ మనఁగా పఫలకుఁ బూర్వమువచ్చెడి విసర్గము. పోనుపోను రెంఱుసున్నలనె యన్నివిధములైన విసర్గలను సూచించుట కుపయోగింపఁజొచ్చిరి. అప్పుడు నిరుపయోగముగ నున్న 'ఱ' అనునుపధ్మానీయచిహ్నమును దెనుఁగు-కన్నడపువారు తమ భాషలో నున్నవిశేషహల్లునకు గుర్తుగా స్వీకరించి రని తోఁచెడిని.

'ఇ' శాసనమునందు 10-వ పంక్తిలో 12 అన్నయంకె కలదు. కాని యది పదియన్నగుర్తు తరువాత రెండను నంకెకు గుర్తుంచుటవలన నేర్పడినది. ఈ

[1] Ep. Ind. Vol. vi p. 84.
[2] Ep. Ind. Vol. v p. 315.
[3] Burgess' *Amaravati;* Ep. Ind. Vol. xv p, 258.
[4] Kielhorn's List of Brahmi Inscriptions and Sewell's Antiquites.

శాసనములలోని రేకులకు నంకెలు వేయఁబడినవి. 'అ' శాసనమందు రేకులకు రెండువైపుల నంకెలు చెక్కిరి. కాని యఱిగిపోయినందునఁ గొన్నియంకెలు మాత్రము కానవచ్చును.

రెండుశాసనములలోని భాష సంస్కృతగద్యము. చివర 'బహుభి ర్వసుధా దత్తా' ఇత్యాది మామూలు శ్లోకములు వచ్చును.

## శాసనములందు విషయములు.

మొదటిశాసన మిచ్చినదాత శాలఙ్కాయనుఁ డైనమహారాజశ్రీ విజయస్కన్దవర్మ. ఇతఁడీయుత్తరువును విజయవేఙ్గినుండి పంపెను. ఈతఁడు భగవచ్చిత్రరథస్వామిపాదానుధ్యాతుఁడు; బప్పభట్టారకపాదభక్తుఁడు. ప్రతిగృహీత, లేకుమారిగ్రామవాస్తవ్యుఁడును మాద్గల్యగోత్రుఁడును నగుశివార్యుఁడు. కుద్రహారవిషయమందలి చిన్నపుర మనుపల్లె యీతనికి రాజు రాజ్యముచేయుటకుఁ బ్రారంభించిన సంవత్సరమున వైశాఖపౌర్ణిమనాఁ డీయఁబడెను.

రెండవశాసన మిచ్చినదాత శాలఙ్కాయన మహారాజశ్రీ నన్దివర్మ. ఈతఁడును వేఙ్గీపురమునుండియే యాజ్ఞఁబంపెను. ఈతఁడు చిత్రరథస్వామిపాదానుధ్యాతుఁడు, బప్పభట్టారకపాదభక్తుఁడు, పరమభాగవతుఁడు. ప్రతిగృహీత బ్రాహ్మణుఁడు, మాద్గల్యగోత్రుఁడును బ్రసిద్ధుఁడును నగుస్వామిచన్ద్రుఁడు. కుద్రహారవిషయమందు కురువాడగ్రామమునఁ బండ్రెండునివర్తనములభూమి యీతనికీయఁబడినది. ఈపట్టిక యమావాస్యనాఁ డీయఁబడినది.

## శాలంకాయనుల బిరుదములు.

ఈరాజులచే ధరింపఁబడిన బిరుదములయర్థమును గుఱించి కొంచెము విచారింతము. వీరు 'భగవచ్చిత్రరథస్వామిపాదానుధ్యాతులు (అ. 1-వ పంక్తి) కావున వీరికులదైవము భగవంతుఁడైన చిత్రరథుఁడు. ఈచిత్రరథుఁ డెవఁడు? ఈ పేరుగలగంధర్వుఁడు పురాణాదులలోఁ గలఁడు. కాని గంధర్వుఁడు కులదేవతగాఁ గలవారు సాధారణముగఁ గానరారు. అందుచేఁ జిత్రరథుఁడు మఱియొక దేవుఁడై యుండవలెను. సంస్కృతకోశములలోఁ జిత్రరథశబ్దము సూర్యపర్యాయముగఁ గానవచ్చును. దీనినిబట్టి సూర్యుఁడే శాలంకాయనులకుఁ గులదైవముగా నుండె నని మన మూహింపవచ్చును. రెండవశాసనపు ముద్ర పైభాగమున సూర్యునిప్రతిమ యున్నందున నీయూహ దృఢపడుచున్నది. నందిగల భాగమునందుఁగాక, పైభాగమున నెత్తుగను, గుండ్రముగను నొకబిళ్లవలెఁ

గలదు. అది సూర్యుని ప్రతిబింబ మనుటకు సందేహము లేదు. మొదటిశాసనపు ముద్రపైఁ గూడ నిట్టివిగ్రహము గలదు. కాని యది యంతస్పష్టముగ లేదు. సూర్యోపాసనము సూర్యదేవాలయములు తెలుఁగుదేశమునందుఁ బెక్కులుండెను.[1] గుణగవిజయాదిత్యునికాలమున (క్రి. శ. 840-880) నెల్లూరు మండలములో 'ఆదిత్యభట్టార'నిదేవాలయ ముండెను.[2] గంజాముజిల్లాలో అరసవిల్లియొద్ద సూర్యదేవాలయ ముండెను. (క్రి. శ. 1068) పెదవేంగిలో నొకపురాతనదేవాలయమును జూపి యది చిత్రరథస్వామి దేవాలయ మని చెప్పెదరు.

శాలంకాయనులు "బప్పభట్టారకపాదభక్తు"ల మని వ్రాసికొనియెదరు. ఈబప్పనిపేరు పెక్కురాజవంశముల శాసనములలోఁ గాననచ్చును. గుప్తులు, వాకాటకులు, పల్లవులు, గాంగులు తమశాసనములలో బప్పభట్టారకపాదానుధ్యాతుల మని వ్రాసికొనిరి. కొందఱు "బప్పఁ"డొకరాజని తలంచిరి. కాని యిందఱు వంశములవారు నొకరికొకరు సంబంధము లేనివారు, ఏకపురుషవంశజు లగుట పొసఁగనేరదు. కావున "బప్ప"శబ్దము పేరు గాదనియు, దానికి 'తండ్రి'యర్థ మనియు మనము తలంపవలెను. ఇది ప్రాకృతశబ్దము. ఇందుండియె యిప్పటి "బాప్"తండ్రి అను హిందీశబ్దము పుట్టినది. ప్రతిరాజుఁ దనతండ్రియెడల వినయవిధేయతలు చూపుచు 'బప్పభట్టారకపాదభక్తుఁడ'నని వ్రాసికొనె నని మనమర్థముచేసికొనుటయె సమంజసము.

ఇఁక 'శాలంకాయన'శబ్దమును గుఱించియె విచారింతము. శాలంకాయనుఁ డొకవైదికఋషి. ప్రవరకాండములో[3] శాలంకాయనగోత్రములు రెండు చెప్పఁబడినవి. ఒక్కటి 'ఆంగీరస' గణములోనిది. దీనికి ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ యను భారద్వాజగోత్రప్రవరయె కలదు. రెండవది 'విశ్వామిత్ర'గణమునందలిది. దీనిప్రవర విశ్వామిత్ర, శాలంకాయన, కౌశిక అనునది. ఈగోత్రమున సప్తార్షేయము గలవారు నిప్పుడు గలరు. పాణినీయగణపాఠమునందు శాలంకాయనశబ్దము రెండుతావులఁ గాననచ్చుచున్నది, నదాదియందును (4-1-99) రాజన్యాదియందును (4-2-51) శాలంకాయను లుండు దేశ

[1] Maharaja's College Magazine, Vizayanagaram, Vol. ii p. 46.
[2] Nellore Inscription's Vol. ii p. 897.
[3] భారతవర్షీయప్రాచీన ఐతిహాసికకోశ, అనఁబడు మరాటీగ్రంథమునందు నన్నిప్రవరకాండములోని విషయము లొక్కచోట నీయఁబడినవి; నేనాగ్రంథమునె యుపయోగించితిని.

మును 'శాలంకాయనక' మనుచుండిరి (4-2-53) పాణిన్యాచార్యులచేఁ జెప్పఁబడిన యీశాలంకాయనకదేశమునకును మన వేంగీశాలంకాయనరాజులకు నేదియైన సంబంధ ముండెనో లేదో తెలియదు. 'మేదిని' యనుసంస్కృతకోశమునందు శాలంకాయనశబ్దమునకు నందియను నర్థ మీయఁబడినది. శాలంకాయనుల ముద్రపైఁ గానవచ్చు నందివిగ్రహమును బట్టి యీరాజులు తాము నందివంశజుల మని చెప్పుకొనుచుండి రేమోయని సంశయము కలుగుచున్నది. పల్లవులయుఁ బూర్వగాంగులయు ముద్రలమీఁదఁగూడ నందివిగ్రహములు గలవు.

శాలంకాయనరాజులశాసనములలో ఏలూరు ప్రాకృతశాసనమునందు విజయదేవవర్మ మాత్రము తా నశ్వమేధయాగము చేసితి ననియుఁ బరమమాహేశ్వరుఁడ ననియుఁ జెప్పుకొనెను. తరువాతికాలపు శాలంకాయను లెవరు నశ్వమేధము చేసితి మన్నగర్వోక్తులు చెప్పుకొనలేదు. ఈయశ్వమేధగర్వోక్తి గుప్తులశాసనములలో మొదటఁ గానవచ్చుచున్నది. వారినిఁ జూచి చేదిరాజులు వాకాటకరాజులు కదంబులు శాలంకాయనులు నట్లే వ్రాసికొనిరి. గుప్తులలో సముద్రగుప్తునకుఁ దప్ప పైరాజులలో నెవ్వరికి నశ్వమేధముచేయుటకుఁ దగినసామర్థ్యము గాని రాజ్యవిస్తారము గాని సార్వభౌమత్వము గాని లేదు. శాలంకాయనుఁ డగువిజయనందివర్మ సముద్రగుప్తునికాలమునకు సమీపవర్తి గావున నాతనిశాసనమును జూచి 'యశ్వమేధయాజి' నని వ్రాసికొని యుండును. తరువాతి వారు తమకు మించినయాపదవిని వదలివేసిరి. విజయదేవవర్మశాసనములో 'పరమమాహేశ్వర' యనుబిరుదు గలదు. తరువాతిశాసనములలో నిందుకు మాఱుగ 'పరమభాగవత' యనుబిరుదు గలదు. ఇంతమాత్రమున నీరాజులు మొదట శైవులుగ నుండి తరువాత వైష్ణవులుగ మాఱిరని మన మూహింప నక్కఱలేదు. విష్ణుభాగవతులవలెనే పూర్వకాలము శివభాగవతులు గూడ నుండిరి. మహాభాష్యమునందుఁ బతంజలి శివభాగవతులఁ బేర్కొని యున్నాఁడు.[1]

స్థలనిర్దేశము:—ఈశాసనములలోఁ జెప్పఁబడిన గ్రామములలో వేంగి మొదటిది. ఏలూరు సమీపమునందున్న పెదవేంగి యనుగ్రామ మిదియేయని పండితుల యభిప్రాయము. ఈయభిప్రాయమే నిజమైనదిగఁ దోఁచుచున్నది. అయిన నుత్తరసర్కారులలో 'వేంగీ' పేరుగల గ్రామములు నాలుగు గల వనిన

[1] పాణినీయ 5-2-1. సూత్రముమీఁది మహాభాష్యము చూడనగును.

మాట మాత్రము పరిశోధకులు మఱవఁగూడదు. ఒకటి యేలూరునొద్ద నున్న పెదవేంగి, రెండవది చినవేంగి, మూఁడవది గుంటూరు జిల్లాలో చింతపల్లి యొద్ద నున్నది. ఈశాసనము లీవేంగి కనతిదూరముననే దొరకినవి. నాల్గవది వేంగిపా డనునది గోదావరిజిల్లాలోని పోలవరము జమీందారిలోఁ గలదు.

శాసనములోఁ జెప్పఁబడిన రెండవస్థలము 'కుద్రహార'విషయము. విషయ మనఁగా నాడు. ఈవిషయమునందుఁ గృష్ణాజిల్లాలోని యిప్పటి (అవనిగడ్డ) దివి బందరు, కైకలూరు, గుడివాడ తాలూకా లిమిడియుండె నని తోఁచుచున్నది. మచిలీపట్టణమునొద్ద నున్నగూడూరు అనునదియే కుద్రహార మని పండితుల యభిప్రాయము. ఈవిషయమునకే తర్వాతికాలపు చాళుక్యాదులశాసనము లలో గుద్ద్రార, గుద్రహార, గుద్రవర యనునామములు కానవచ్చుచున్నవి. ఇది గుడివాడ యని కొందఱ యభిప్రాయము. ఇందున గుఱించిన ప్రమాణము లన్నియు డాక్టర్ డు బ్రాయిల్ గారు తమ "ఏన్సియంట్ హిస్టరీ ఆఫ్ డెక్కన్" అనుగ్రంథమునందుఁ జర్చించిరి.[1]

మనశాసనములలో మొదటివానియందు, 'చిన్నపుర' మనుగ్రామ మొకటి చెప్పఁబడియున్నది. (4-వ పంక్తి). దీనికి 'పుర' మనుగొప్పపే రున్నను నప్పు డది పల్లెగానే యుండెను (9-వ పంక్తి). ఇప్పుడు బందరుతాలూకాలో 'చిన్నపురం' అనుపల్లె యొకటి కలదు. అదియే శాసనములోని 'చిన్నపుర' మైనఁ గావచ్చును. అట్లైన నీపేరు పదునాలుగువందలసంవత్సరములు మారక యుండుట మిగుల నాశ్చర్యకర మైనవిషయము. మొదటిశాసనమందలి ప్రతి గృహీతయొక్క నివాసస్థలమైన 'లేకుమారి'యెద్దియో చెప్పఁజాలము. రెండవ శాసనమునందలి (5-వ పంక్తి) 'కురువాద'గ్రామ మెద్దియో? కొల్లేరుశాసన ములో 'కుగువక'గ్రామ మొకటి కలదు. ఈరెండు నొక్కటియేమో.

## శాలంకాయనుల కాలనిర్ణయము.

ఈశాసనముల కాలము మన మొకవిధముగఁ గనుఁగొనవచ్చును. ఇది వఱకు శాలంకాయనులశాసనములు రెండు ప్రకటింపఁబడినవి. వానిలో ఏలూరునొద్ద దొరకిన ప్రాకృతశాసనము పురాతన మని పండితులయభిప్రా యము. అయ్యది మహారాజశ్రీ విజయదేవవర్మచే నియ్యఁబడినది. రెండ వదియు సంస్కృతమునం దున్నదియు నగుకొల్లేరుశాసనము మహారాజచంద్ర వర్మ కుమారుఁడైన విజయనందివర్మచే నియ్యఁబడినది. ఇప్పటి యీరెండుక్రొత్త

[1] పుట. 84, 85.

శాసనములలో మొదటిది విజయస్కంధవర్మది, రెండవది శ్రీనందివర్మది. శాలంకాయనులది యింకొకశాసన మున్నట్టు తెలియుచున్నది. కొల్లేరు తామ్రశాసనమును బ్రకటించుచు డాక్టరు ఫ్లీట్ ఇట్లు వ్రాసెను. "సర్ ఇలియట్ సంగ్రహించియుంచిన శాసనప్రతిమలలో విజయనందివర్మయొక్క తామ్రశాసనమునకుఁ బ్రతి యొకటి కలదు. అందు యువమహారాజు పేరు స్పష్టముగా లేదు. అది 'విజయతుంగవర్మ' లేక 'విజయబుద్ధవర్మ' కావచ్చును. శాసనపు భాషయు ననిశ్చితము. బహుశః అది ప్రాకృతమో పాలీయో నై యుండును."

మన కిట్లు దొరకిన శాలంకాయనుల యైదుశాసనములలోను నేడ్గురు రాజులనామములు కానవచ్చుచున్నవి. వీనిలో కొల్లేరు తామ్రశాసనమందలి విజయ-నందివర్మయు, కంతేరు రెండవ (ఇ) శాసనమందలి నందివర్మయు, నొక్కఁడె యనుకొనినయెడల రాజు లార్గురె యగుచున్నారు. వీరి కందఱకుఁ బూర్వము హస్తివర్మ యనువానిని జేర్పవచ్చును. సముద్రగుప్తుని అలహాబాదు స్తంభశాసనమందు, వేంగిదేశపు హస్తివర్మను నాతఁడు జయించిన ట్లున్నది. అట్లు మరల నేడ్గురు రాజు లయిరి. వీరందఱికాలముల నిశ్చయముగ నిర్ణయించుట యసంభవ మైనను, రమారమిగ నిర్ణయింపవచ్చును. ఏలూరు ప్రాకృతశాసనమును, ఈలియట్ సంగ్రహములోని ప్రకటింపఁబడని ప్రాకృతశాసనమును, నితరశాసనములకంటెఁ బూర్వపువి యని యెంచికొని యీరాజుల పౌర్వాపర్య మేర్పఱిచినయెడల నీక్రిందివిధముగ నీరాజక్రమమును, గాలక్రమమును నేర్పడుచున్నవి.

| రమారమి కాలము. | రాజు పేరు. | ఏశాసనములోనివాఁడు. |
|---|---|---|
| 350 | హస్తివర్మ | అలహాబాదుస్తంభశాసనము. |
| 375 | విజయదేవవర్మ | ఏలూరుప్రాకృతశాసనము. |
| 400 | విజయనందివర్మ | ఈలియట్ సంగ్రహములోని |
| 425 | బుద్ధవర్మ | ప్రకటింపఁబడనిశాసనము. |
| 450 | చండవర్మ | కొల్లేరు శాసనమును, |
| 475 | విజయనందివర్మ | కంతేరు శాసనము(ఇ) |
| 500 | విజయస్కంధవర్మ | కంతేరు శాసనము(అ) |

పైని పూర్వరాజునకుఁ బరరాజునకుఁ గలసంబంధము తెలియనప్పుడు వా రిరువురి నడుమను జుక్కలు పెట్టఁబడినవి. పితాపుత్రసంబంధము తెలిసి నప్పుడు వారియిరువురి నడుమ నిలువుగీ టుంచఁబడినది. ఇఁక వీరికాలము రమారమిగ నిర్ణయించినవిధ మెట్లన:—

వేంగిదేశము నేలుచున్నహస్తివర్మను సముద్రగుప్తుఁ డోడించినట్లు, అలహాబాదు స్తంభశాసనము చెప్పుచున్నది. అందువలన హస్తివర్మ చరమకాలము రమారమి క్రీ. శ. 350 యని తెలియుచున్నది. విష్ణుకుండినవంశజుఁ డయిన విక్రమహేంద్రవర్మయొక్క చిక్కుళ్ల తామ్రశాసనము[1] వలన నాతఁడు వేంగియొద్ద దెందులూరులో రాజ్యము చేయుచున్నట్టులును, కృష్ణానదియొద్దున నున్న రావిలేల యనుగ్రామము దానము చేసినట్టును దెలియుచున్నది. కావున నాతఁ డదివఱకే వేంగీదేశమును శాలంకాయనులయొద్దనుండి జయించియుండవలెను. ఈవిష్ణుకుండిరాజుయొక్క రాజ్యకాలము రమారమి క్రీ. శ. 500 కావున శాలంకాయనులలోఁ జివరవాఁడైన విజయస్కందవర్మ రాజ్యకాలము 500 వఱకుఁ బూర్తియై యుండవలెను. ఇట్లు శాలంకాయనులు వేంగిదేశముపై రాజ్యమేలినది 350 మొదలు 500 వఱకు జరిగిన 150 సంవత్సరముల కాల మని తేలుచున్నది. ఈ 150 సంవత్సరముల కాల మాఱుతరములపైఁ బంచివేయఁగా నొక్కొక్కతరమునకు 25 సంవత్సరములకాల మేర్పడుచున్నది. రాజ్యకాలము తెలియని రాజుల ప్రభుత్వమితిని నిర్ణయించునప్పుడు తరమునకు 25 సంవత్సరములచొప్పున లెక్కవేయుట చరిత్రకారు లందఱును నొప్పుకొనిన పరిమితియే. మన లెక్కయు నందుకు సరిపోయినది.

అంతకుఁ బూర్వపురాజులు:—మనము హస్తివర్మతో నాఁగక యాతనికిఁ బూర్వము వేంగిదేశము నేలినవా రెవ్వరైనఁ గలరా యని విచారించినయెడల కొండమూడి తామ్రశాసనము గానవచ్చుచున్నది. బృహత్పలాయనగోత్రుఁ డగుజయవర్మ యనురాజు కుడూరవిషయములో రాజ్యము చేయుచున్న ట్టీశాసనమువలనం దెలియుచున్నది. అనఁగా నేదేశమునందు శాలంకాయనులు రాజ్యముచేసిరో యాదేశమునందే యంతకుఁ బూర్వము బృహత్పలాయనులు రాజ్య మేలిరి. కొండమూడి తామ్రశాసనపుకాలమును విచారింపఁగా, నందు

[1] Ep. Ind. Vol. iv p. 193. విష్ణుకుండినరాజుల కాలనిర్ణయమునకై డాక్టరు డుబ్రాయిల్ రచిత ఎన్షియంట్ హిస్ట్రీ ఆఫ్ ది డెక్కన్ అనుగ్రంథము 90-వ పుట చూడసగు. విష్ణుకుండినమాధవవర్మశాసనమును బ్రకటించునప్పు డీచర్చ సవిస్తరముగ నేను జేయఁగలను.

నుగూర్చి, దానిఁ బ్రకటించిన డాక్టరుహుల్ ష్ ఇట్లు వ్రాసెను. "ఈశాసన పులిపి చూడఁగా నీరాజు మైదవోలు[1] శాసనమును జెక్కించిన పల్లవరాజైన శివస్కందవర్మకు సమకాలికుఁ డని తోఁచుచున్నది. ఇదియుఁ గాక యీశాసనమునందలి భాషయు శబ్దప్రయోగములును గూడ నాశికలో శాసనములను వేయించిన, యాంధ్రరాజు లయిన గౌతమీపుత్ర శాతకరణి (నెం. 4, 5), వశిష్టి పుత్రపులుమాయి (నెం. 3) అనురాజుల కాలమునకును జయవర్మ కాలమునకును విశేష మంతర ముండనేరదు. ఈశాసనపు ముద్రపై నున్న ప్రాచీనసంస్కృతలిపియు నీయూహనే దృఢపఱుచుచున్నది." ఆంధ్రవంశము 3-వ శతాబ్దప్రారంభముననే యంతరించినది. మైదవోలుశాసనము కాలము 3-వ శతాబ్దపు 3-వ పాద మని పండితుల యభిప్రాయము. కావున బృహత్ఫలాయనరాజులు మూఁడవశతాబ్దమున వేంగిదేశమునందు రాజ్యముచేయుచుండి రని మన మూహింపవచ్చును. 4-వ శతాబ్దప్రారంభమున శాలంకాయనులు బృహత్ఫలాయనుల నోడించి వేంగిదేశము నాక్రమించికొని యుండవచ్చును. ఇట్లు 2-వ శతాబ్దాంతమువఱకు నాంధ్రులు (లేక శాతవాహనులు) ను, 3-వశతాబ్దాంతమువఱకు బృహత్ఫలాయనులును 5-వ శతాబ్దాంతమువఱకు శాలంకాయనులును, 7-వ శతాబ్దప్రారంభమువఱకు విష్ణుకుండినులును 612 మొదలు పూర్వచాళుక్యులును వేంగిదేశము నేలినరాజవంశపరంపర లని మనకు శాసనదృష్టాంతములతో నిశ్చయముగఁ దెలిసినది. పల్లవులు వేంగివిషయమును గాని కుడూహారవిషయమును గాని యేలినట్లు కానరాదు. ఉత్తరసర్కారులలో దొరకినపల్లవశాసనములలో[2] 'కమ్మరాష్ట్ర'మే పేర్కొనఁబడినది. ఒకదానిలో[3] 'ధనకటకము' పేరు కలదు. కమ్మరాష్ట్రమునం దిప్పటి నెల్లూరుజిల్లాలోని కొంత యుత్తరభాగమును గుంటూరుజిల్లాలోని కొంతదక్షిణభాగమును జేరియుండును. పురాతనపల్లవులు కృష్ణానదిని దాఁటినట్టు కానరాదు. పిష్టపురమున సముద్రగుప్తునిచే జయింపఁబడిన రాజు పల్లవుఁ డని కొంద ఱూహించిరి, గాని, యందునకు శాసనాధారమేమియును లేదు.

వేంగిరాజ్యవిస్తారాదికములు: — శాలంకాయనులు పూర్వపల్లవులకు

---

[1] Ep. Ind. Vol. vi p. 81.

[2] చందలూరు తామ్రశాసనములు, Ep. Ind. Vol. vii p. 233; ఒంగోలు తామ్రశాసనములు, Ep. Ind. Vol. xv p. 246.

[3] Ep. Ind. Vol. vi p. 84.

సనుకాలికు లనుటకు సందియము లేదు, కాని, వీరు వేంగి కుద్రహారవిషయ ములను బల్లవులతో సంబంధము లేకయే స్వతంత్రముగఁ బాలించిరి. ఈ వేంగి రాజ్యము పెద్దదిగఁ గానరాదు. దానివైశాల్య మిప్పటి యొక పెద్దజిల్లాను గాఁ రెండుజిల్లాలను గాని మించి యుండదు. అది కృష్ణా గోదావరినదులు సముద్ర ముతో సంగమించు స్థలములకు నడుమ నుండెను. దీని కుత్తరమున లేక యీ శాన్యమున పిష్టపురము రాజధానిగాఁ గలకళింగరాజ్యమును, ఆగ్నేయమున బంగాళాఖాతమును, నైరృతిని కృష్ణానదియు దానికావల, పల్లవులరాజ్యంబును, హద్దులుగ నుండెను. కృష్ణాగోదావరీనదులకు నడుమ వాయవ్యపుదిక్కున నీరాజ్య మెంతవఱకు వ్యాపించియుండెనో నిశ్చయముగఁ జెప్పఁజాలము. కాని యిప్పటి గోదావరీ కృష్ణాజిల్లా లను హద్దునుదాఁటియుండ దని మాత్రము మన మూహింపవచ్చును. ఈ వేంగిరాజ్యమునందు రెండువిషయములు లేక నాడులు కలవు. ఒకటి వేంగివిషయము, రెండనది కుద్రహారవిషయము. ఇప్పటి ఏలూరు, ఎర్నగూడెము, భీమవరము, తాలూకాలను వేంగివిషయ మని చెప్పవచ్చును; (అవనిగడ్డ) దివి, బందరు, కైకలూరు, గుడివాడ, తాలూకాలు, కుద్రహారవిష యములోనివి.

వేంగిరాజ్యమునందుఁ జక్కని సముద్రతీరమును విఖ్యాతిఁ జెందిన రేవు పట్టణములు నుండెను. దక్షిణదేశమునందలి రెండుమహానదు లీరాజ్యమునకు సరిహద్దులుగఁ బాఱుచున్నందున వ్యాపారమునకును బ్రజలరాకపోకలకు ననేక విధములయిన సదుపాయము లుండె ననుటకు సందియము లేదు. 2-వ శతా బ్దమువాఁ డైన టాలెమి యనుభూగోళశాస్త్రజ్ఞుఁడు దక్షిణహిందూదేశమున కొడ్డూరను గొప్ప రేవుపట్టణము కలదనియు నచ్చటినుండి బంగారు తెచ్చుకొను దేశమునకు, అనఁగా, బర్మా, మలాకా, కంబోడియా, ఆనాము, అను ఇండోచైనా ద్వీపకల్పములకు పడవలు వెళ్లుచుండె ననియు, వ్రాసినాఁడు. అది శాసనము నందలి, కుడూహారమే యనియు, నిప్పుడు బందరునొద్ద నున్న గూడూరే యని యీ బండితుల యభిప్రాయము.[1] ఇప్పుడు ఘంటశాల యనఁబడు దానికి టాలమికాలమున 'కెంటకోసిల' యనిపేరు. అయ్యది గొప్ప వర్తకస్థలము. కావున మచిలీబందరు సమీపప్రదేశము, వేలకొలఁది సంవత్సరములనుండియు, గొప్ప రేవుగను వర్తకస్థలముగను నుండి, వేఱువేఱు నామములతో దక్షిణహిందూ దేశమున ఖ్యాతి వహించి యుండెననుటకు సందేహము లేదు. ఘంటశాల కృష్ణా

[1] డాక్టర్ డుబ్రాయిల్ రచితచరిత్ర చూడనగు.

నది సముద్రములోఁ గలసిన స్థలమునకును గూడూరునకును నడుమ నుండును. ఇచ్చట నిటీవల గొప్ప బౌద్ధ స్తూపమొకటి వెలువడినది. కావున నీప్రాంతమున నొకప్పుడు మిక్కిలి పురాతనకాలమున బౌద్ధధర్మము వ్యాపించియుండె నని మనము నిశ్చయింపవచ్చును. బౌద్ధులు ప్రాకృతభాషను బవిత్రభాషగా నెంతురు. ఆసంస్కారము కొంతవఱకుఁ గుండుటచేఁ గాఁబోలు బృహత్పలాయన జయవర్మని కొండముూడి తామ్రశాసనమును, శాలంకాయనవిజయ దేవవర్మని ఏలూరిశాసనమును, ప్రాకృతభాషలోనే వ్రాయఁబడినవి.

శాలంకాయనులు పల్లవులబంధువులు:—పల్లవరాజులు శాలంకాయన రాజులకంటె బలవంతులు. ఎక్కువ రాజ్యము గలవారు. అట్లయ్యును దమ ప్రక్క నున్న శాలంకాయనులను, వారు బాధింపక స్వతంత్రముగా రాజ్యము చేయనిచ్చుట, యాశ్చర్యకర మైనవిషయమే. ఇందుకుఁ గారణము, వా రుభయులును బందుగు లగుటయే యని తోఁచుచున్నది. వీ రుభయులు నేకవంశజాతులుగ నైన నుండవలెను, లేక యిచ్చిపుచ్చుకొనుటవలన బంధువులుగ నైన నుండవలెను. ఇందుకు మూఁడుహేతువులు కానవచ్చుచున్నవి. పల్లవులది భారద్వాజగోత్రము. అందుకు ప్రవర, ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ. ఈ ప్రవరే గలశాలంకాయనగోత్ర మొకటి కలదు. ఈ రెండువంశములవారి ముద్రపై నందివిగ్రహము గలదు. కంతేరుశాసనములలో రెండవదాని ముద్ర మీఁది నందివిగ్రహమును మనము స్పష్టముగ గుర్తించినందున నీరెండువంశములకు సంబంధము కల దని యూహించుటకుఁ గారణ మైనది. ఈ రెండువంశములలోని రాజులపేళ్లుఁ గలియుటయు వీని కేదో సంబంధము కలదనుటకుఁ గారణ మగుచున్నది. శాలంకాయనశాసనములలోఁ గానవచ్చెడి స్కందవర్మ, నందివర్మ, బుద్ధవర్మ యనుపేళ్లు పల్లవులశాసనములలోఁ బెక్కుసారులు కానవచ్చును. డాక్టర్ దుబ్రాయిల్ చే రచింపఁబడిన 'ఏన్షియంటు హిస్ట్రీ ఆఫ్ ది డెక్కన్' అను గ్రంథమునందు 70-వ పుటలో పల్లవులవంశవృక్షము వ్రాయఁబడినది. క్రీ. శ. 300 మొదలు 550 వఱకు రాజ్యముచేసిన రాజులలో నలుగురు స్కందవర్మలు, నిద్దఱు బుద్ధవర్మలు, నొకనందివర్మయుఁ గలరు. ఇట్టి నామసామ్యము కేవలకాకతాలీయన్యాయమునకు గుఱియై యుండనోపదు. ఈ రెండువంశముల వారికిని గలపరస్పరబంధుత్వమును, గౌరవమును నిందుకు హేతువులయి యుండవలెను.*

కొ. వెం. లక్ష్మణరావు.

*ఇం దచ్చొత్తింపఁబడిన స్కందవర్మయొక్క తామ్రశాసనపటములు విజయనగరమహారాజావారి కాలేజి ప్రధానోపాధ్యాయులవలన మాకు లభించినవి. వారియెడ మేము కృతజ్ఞులము. రెండవశాసనమునందలి ముద్రకుఁ బటము మేమే చేయించితిమి.

## ౧. కంతేరు తామ్రశాసనము, శాలంకాయన స్కందవర్మది.

### మూలము.[1]

#### మొదటి రేకు.

1. స్వస్తి విజయవేఙ్గ్యాః భగవచ్చిత్రరథస్వామి
2. పాదానుధ్యాతస్య బప్పభట్టారకపాదభ
3. క్తస్య శాలఙ్కాయనస్య మహారాజశ్రీ విజయ

#### రెండవరేకు మొదటిప్రక్క.

4. స్కన్దవర్మణో [వచనా త్కు*] [మూహా[2]]రచిన్న[3] పురే
5. గ్రామేయకాః వక్తవ్యాః [॥*] అస్త్యస్మాభి రస్మ
6. త్కులగోత్రశ్రేయశోభివృద్ధయే ఏతస్మై

#### రెండవరేకు రెండవప్రక్క.

7. మాద్గల్యసగోత్రాయ లేకుమారీ గ్రామవా
8. స్తవ్యాయ శివార్య్యాయ సర్వ్వపరిహారేణ
9. సాపల్లికా దత్తా[॥*] [త[4]ద్విదిత్వా*] [భ[5]వద్భి] ర[6] పూర్వ్వ [ం]

#### మూఁడవరేకు మొదటిప్రక్క.

10. [స] మర్వ్య దయాసాధుప్రేమణో కర్త్తవ్య మితి [॥*]
11. అపిచ సర్వ్వనియోగనియుక్తాయుక్తక
12. విషయపతిమిశ్రైః సాపల్లికా పరిహర్త్తవ్యా [॥*]

---

[1] నాయొద్దనున్న యసలు రేకుల ననుసరించి యీపాఠ మీయఁబడినది. రేకులమీఁదియక్షరములు పెక్కుతావులఁ జాలవఱకు నఱిగిపోయినందునఁ బటములో బాగుగ రాలేదు; కాని మూలములోఁ గొంచెము శ్రమతోడను భూతమద్దపుసాయముతోడను నక్షరముల గుర్తింపవచ్చును.

[2] మొదట రేకులు నాయొద్దకు వచ్చినప్పు డీరెం డక్షరములును స్పష్టముగాఁ గానవచ్చుచుండెను; రేకులను శుభ్రపఱిపించుటలోఁ దరువాత నఱిగిపోయినవి.

[3] ఈరేకులలో 'న' కారమునకును 'త' కారమునకును భేదము కనుఁగొనుట కష్టము కావున నీశబ్దమును 'చిత్తపురే' యని కాని 'చిన్తపురే' యని గాని 'చిత్నపురే' యని కాని చదువవచ్చును.

[4] రెండవమూఁడవయక్షరములయొక్క గుడియు నాల్గవయక్షరముయొక్క దీర్ఘమును మాత్రము కానవచ్చుచున్నవి.

[5] ఈ మూఁడక్షరముల పైభాగములుమాత్రము కానవచ్చుచున్నవి.

[6] ఈయక్షర మంతస్పష్టముగ లేదు.

మూఁడవ రేకు రెండవప్రక్క.

13 [ప్రవర్ధమాన] శ్రీవిజయరాజ్యసంవత్సరే ప్ర
14. థమే వైశాఖ పౌర్ణమాస్యాం దత్తా పట్టికా[॥*]
15. బహుభిర్వ్వసుధాదత్తా బహుభిశ్చానుపాలితా [।*]

నాల్గవ రేకు.

16. యస్యయస్య [యదాభూమి] స్తస్యతస్య తదా
17. ఫలం। [ష]ష్టివర్ష సహస్రాణి స్వర్గే క్రీడ
18. [తిభూమిదః।] ఆక్షేప్తా చానుమన్తాచ తాన్యే
19. [వ నరకే] వసేత్ [॥*]

ఇ. కంతేరు తామ్రశాసనము శాలంకాయన నందివర్మది.

మూలము.[1]

మొదటి రేకు.

1. స్వస్తివిజయ వే [ఙ్గీపురాద్భ] గవచ్చిత్రరథ
2. స్వామిపాదానుద్ధ్యాతో బప్పభట్టారకపా

రెండవ రేకు మొదటిప్రక్క.

3. దభక్తః పరమభాగవతః శా [ల]ఙ్కాయ
4. నో మహారాజశ్రీ నన్దివర్మ్మ కుద్రాహారే[2]

రెండవ రేకు రెండవప్రక్క.

5. విషయే కురువాడగ్రామే మునుద[3] సహితా
6. గ్రామేయకా నాజ్ఞాపయతి [॥] స్వస్తి అస్మాభిః

---

[1] నాయొద్దనున్న రాగిరేకులననుసరించి యీపాఠము వ్రాయఁబడినది. ఈ రేకులమీఁదియక్షరములు చాల అఱిగిపోయినందునఁ బటము తీయింపలేదు.

[2] ఈశబ్దమును కొల్లేరుశాసనమున బర్నెల్ 'కుడూహార'మని చదివెను. (Indian Paleography p. 135). డాక్టరు ఫ్లీట్‌గారును ఏలూరుశాసనమునం దట్లే చదివిరి. (Ind. Ant. Vol. v p. 176). కాని 'డూ'అనునక్షరమును గుఱించి సంశయ మున్నట్లు దానియెదుట ప్రశ్నచిహ్నమును (?) ఉంచిరి. డాక్టరు హుల్‌షుగారు మాత్రము దీనిని 'కుద్రాహార'మని సరిగఁ జదివిరి. (Ep. Ind. Vol. ix p. 3.)

[3] ఈశబ్దమునకు నర్థ మగుట లేదు. ఇది దేశ్యశబ్దముగఁ గానవచ్చుచున్నది. ఇది కొల్లేరు ఏలూరుశాసనములందును గలదు. దీనిని గొందఱు 'మున్యూడ' అనియుఁ గొందఱు 'ములుడ'అనియుఁ జదివిరి. దీనిస్వరూపమును, అర్థమును సంశయాస్పదములుగనే యున్నవి.

మూఁడవరేకు మొదటిప్రక్క.

7. బ్రాహ్మణాయమార్య[ల్య] సగోత్రాయ
8. ప్రసిద్ధాయ స్వామిచన్ద్రాయ అస్మత్కులగో

మూఁడవరేకు రెండవప్రక్క.

9. [త్రధర్మయశో] భివృద్ధ్యర్థమ్ అస్మిన్గ్రామే ద్వాదశ
10. [భూమి] నివర్తనాని ౧ ౨ ప్రదత్తాని [ । ] తదవేత్య[1]

నాల్గవరేకు మొదటిప్రక్క.

11. [అ] మాస్యామ్పట్టికా దత్తా ॥ బహుభి ర్వసుధా దత్తా
12. బహుభి శ్చానుపాలితా । యస్యయస్య యదాభూమి
13. స్తస్యతస్య తదా ఫలమ్ [॥*]

నాల్గవరేకు రెండవప్రక్క.

14. షష్టివర్ష సహస్రాణి స్వర్గే క్రీడతిభూమిదః
15. ఆక్షేప్తా చాభిమన్తా చ తాన్యేవ నరకే వసే దితి [॥*]

---

[1] దీనితరువాతిభాగము కొంత ప్రమాదవశమున లేఖకుఁడు వదిలియుండు నని తోఁచుచున్నది.

మహాకవి శ్రీనాథ ప్రణీతము.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

అచ్చగుచున్నది. వెల, రూ. ౦-౧౨-౦.

కార్యదర్శులు - ఆంధ్రసాహిత్యపరిషత్తు, చెన్నపురము

అని వ్రాయవలయును.

## అ: కంతేరు తామ్రశాసనము, శాలంకాయన స్కంద వర్మ

మొదటిరేకు.



రెండవరేకు మొదటిప్రక్క.



రెండవరేకు రెండవప్రక్క.



శ్రీరస్తు.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు.

## (TELUGU ACADEMY.)

## దుర్మతినామసంవత్సర కార్యనివేదనము.

ఆంధ్రసాహిత్యపరిషత్తు తనకు రాజధాని నివాసముగా నేర్పఱిచికొని మున్దింటగెలిచి పిదపఁ బ్రతిసంవత్సరము నొక్కొక్క పట్టనమున చొప్పున నిప్పటికిఁ బదిసభలు గావించినది. రాజరాజనరేంద్రుని రాజధాని, కృష్ణదేవ

ఇ. కంతేరు తామ్రశాసనము.

శాలంకాయన నందివర్మది.

ముద్రమాత్రము.



— కార్యదర్శులు. —

కీర్తిశేషులగు పురాణము నాగభూషణముగారి స్థానమున నింక నియమింపలేదు. ఇప్పటి కార్యదర్శు లిద్దఱు.

కార్యనిర్వాహక సభాధ్యక్షు లొక్కరు.

దుర్మతిసంవత్సరమునకుఁ బరిషదధ్యక్షులు దివాన్‌బహద్దరు ఆనరెబిల్ మోచెర్ల రామచంద్రరావుపంతులుగారు బి.ఏ., బి.ఎల్. గారు.

కోశాధ్యక్షు లిరువురు.

శ్రీరస్తు.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు.

## (TELUGU ACADEMY.)

## దుర్మతినామసంవత్సర కార్యనివేదనము.

---

ఆంధ్రసాహిత్యపరిషత్తు తనకు రాజధాని నివాసముగా నేర్పఱిచికొని ముందింటగెలిచి పిదపఁ బ్రతిసంవత్సరము నొక్కొక్కపట్టనమున చొప్పున నిప్పటికిఁ బదిసభలు గావించినది. రాజరాజనరేంద్రుని రాజధాని, కృష్ణదేవరాయల కర్ణాటదేశము, రెడ్లపరిపాలనములు, నాయకుల యేల్బడులు, తిక్కన సోమయాజుల జన్మభూమి, వేంగీవిషయము నానాఁటఁ బరిభ్రమించి యిప్పుడు మెల్లమెల్లఁగఁ గళింగరాష్ట్రమునకు నడచుచున్నది. ఎందును బ్రసిద్ధులగు ప్రభువులు, పండితులు, ప్రఖ్యాతపురుషులు నొసంగిన స్వాగతమును స్వీకరించి యాంధ్రభాషాభివృద్ధి గావించుచున్నయది. ఒక్కదశ గడచినది; అప్పటికి నిప్పటికి స్వదేశమున భాషాభిమాన మెట్లున్నదని యరయఁ దలఁచుచున్నది.

ఈపరిషత్తునకుఁ బ్రతిష్ఠాపకు లిరువురు.

### — ఉద్ధారకులు. —

ఈసంవత్సరమున బొబ్బిలిమహారాజులు శ్రీ శ్రీ శ్రీ రాజాసాహేబ్ శ్రీ శ్రీ రావు శ్వేతాచలపతి వేంకటరంగారావు బహద్దరు, బి.సి.ఐ.ఇ., సి.బి.ఇ. వారు పరిషదుద్ధారకత్వము నంగీకరించిరి. కావున నుద్ధారకులు ముప్వురు.

### — యావజ్జీవసభ్యులు. —

గతసంవత్సరమున నున్న 30 మందిలో నిరువురు కాలధర్మమునొందిరి ఇప్పటి సంఖ్య 28.

### — సాధారణసభ్యులు. —

నిరుటిసంఖ్యలోఁ గ్రొత్తగా ముగ్గురేచేరిరి. నలుగురు మానిరి. ఉన్నవారి సంఖ్య 151.

గౌరవార్థసభ్యులు 37 గురు. కార్యనిర్వాహకసభాసభ్యులు 48 గురు

### — కార్యదర్శులు. —

కీర్తిశేషులగు పురాణము నాగభూషణముగారి స్థానమున నింక నియమింపలేదు. ఇప్పటి కార్యదర్శు లిద్దఱు.

కార్యనిర్వాహక సభాధ్యక్షు లొక్కరు.

దుర్మతిసంవత్సరమునకుఁ బరిషదధ్యక్షులు దివాన్ బహద్దరు ఆనరెబిల్ మోచెర్ల రామచంద్రరావుపంతులుగారు బి.ఏ., బి.ఎల్. గారు.

కోశాధ్యక్షు లిరువురు.

(ముఖ్యులగు ప్రతిష్ఠాపకులు మున్నగువారి పేరులు ముఖపత్రము రెండవ పుటలోఁ జూడనగును.)

## — పత్రికాప్రకటనము. —

ఈసంవత్సరమునందుఁగూడఁ బరిషత్పత్రిక రెండు నెలల కొక్కసారియే ప్రకటింపఁబడినది. మల్లికార్జునపండితారాధ్యులు రచించిన "శివతత్త్వసార" మనుపురాతనశైవగ్రంథము పత్రికలోఁ బ్రకటింపఁబడినది. విపులవిమర్శనము తోఁగూడిన టీకాసహితముగ దీనిని బ్ర॥ కొమఱ్ఱాజు లక్ష్మణరావు ఎం.ఏ. గారు సంస్కరించుటలోఁ జాల శ్రమపడిరి. దీనికిఁ బ్రతులు పాఠకులకు విక్రయము నకులభింపఁగలవు. ఇప్పటికిఁ బరిషత్కార్యస్థానమున విప్రనారాయణచరిత్రము, జైమినిభారతవచనము, చంపూరామాయణము, చంద్రభానుచరిత్రము, శివతత్త్వ సారము ననునైదు పూర్వకవివిరచిత ప్రసిద్ధగ్రంథములు ముద్రితములు గలవు. నీతిసీసపద్యశతకము, సర్వేశ్వరశతకము లనుపురాతనకవికృతశతకములు రెండు గలవు. పత్రికకుఁ జందాదారులు 184 గురు.

ఈసంవత్సరమునఁ బ్రకటింపఁబడిన వ్యాసముల ననుబంధములోఁ గనఁ గొనవలయును.

## — పుస్తకవిక్రయము. —

ముద్రింపఁబడిన పుస్తకము లెంత యపురూపములైనవైనను వానివిక్ర యము సర్వపుస్తకసాధారణముగానే యున్నదిగాని విశేషము కనఁబడలేదు. ప్రతిగ్రంథాలయమువారు నొక్కొక్కప్రతిని దెప్పించికొనిన నొక్కరికి శ్రమలే కుండ లోకోపకారముగ నుండును. పుస్తకములకంటెఁ బత్రిక సంచికలవిక్రయము నయముగానున్నది. ఆంధ్రగ్రంథములైనను నెన్నఁటికైనఁ బునర్ముద్రణమున లభిం చును. సంచిక లట్లులభింపవుగావున నున్నసంచికలనైనను బఠనాలయములలోను భాషాభిమానుల యిండ్లలోను నుంచుట లోకోపకారకారణమగును. నూతన గ్రంథప్రకటనమునకు భాషాభిమాను లగులక్ష్మీపుత్రులు తోడ్పడుదురుగాత.

## — పుస్తకభాండాగారము. —

పుస్తకసంపాదనమున కీయేఁ డెవ్వరిని నియమింపలేదు గాని బచ్చలి వీర వేంకటకవి - యాంధ్రరఘువంశము, ముద్దరాజురామభద్రకవి - కవిజనసంజీవని, పైడిపాటి నరసింహకవి - మన్నారుకృష్ణశతకము, రామచంద్రాహారీశతకము, కవిపేరుతెలియని వైరిహరరంహాశతకమువంటి శత్రుసంహారశతకము, నెల్లూరి వీరరాఘవకవి - వసుంధరాపరిణయము, ముత్యాలయ్యకోటయ్య - కాళిందీపరి ణయము, గుడారు రామదాసకవి - ప్రకృష్టబలరామచరిత్రము, వరదరాజునంది కేశ్వరుని - సేతుమాహాత్మ్యము, సిద్ధలింగకవి - భల్లాణచరిత్రము ననుపుస్తకము లప్రయత్నముగ లభించినవి. వ్రాఁతప్రతులు కాగితములపై నిరుడువ్రాసినవి 17 ను నీసంవత్సరమున వ్రాసినవి 10 యును మొత్తను 27 పుస్తకములు. తాళ పత్రగ్రంథములు 4410.

అచ్చుపుస్తకములు గతసంవత్సరాంతమునకు 998, ఈసంవత్సరమునఁ గొనినవి 43, ఉచితముగావచ్చినవి 56. మొత్తము సంఖ్య 1097.

పరిషత్కార్యస్థానమునందలి పుస్తకములను బలువురు చరిత్రకారులు, విమర్శకులు, గ్రంథప్రకాశకులు నుపయోగించుచున్నారు.

పరిషత్పత్రికకు వినిమయక్రమమున 37 ఆంధ్రపత్రికలు, 3 కన్నడపత్రికలు వారమునకుఁ, బక్షమునకు, నెలకు వచ్చుచున్నవి.

## — ఆర్థికవిషయము. —

ఏపనిచేయుటకును ధనముకావలయును. ప్రార్థించిన వెంటనే వారివారి ప్రతిశ్రుతముల నిచ్చినచో సకాలమున నన్నిపనులును జరగును. పరిషత్తున కీయవలసినవారు విలంబముచేయుచున్నారు. పరిషత్తును దానాకరి కీయవలసినదియు, నీయఁదలఁచినదియు నిచ్చుటలో విలంబముచేయుచున్నది. కాలము సర్వవిధముల వ్యత్యస్తమైనది. ఆందోళనములు, ప్రచలనములు, నూతనసమస్యలు మెండై స్థాయిసంఘములపని వెనుకఁబడుచున్నది. అనుకొనినపని వెంట వెంటనె జరుగుట లేదు.

బెజవాడలో శాస్త్రపారిభాషికపదనిర్మాణమున కొక్కయుపసంఘము, రాజకీయపారిభాషికపదనిర్మాణమున కొక్కయుపసంఘము నియమింపఁబడినవి. తంజావూరు పుస్తకభాండాగారమునందలి తెనుఁగుపుస్తకములపట్టిక యచ్చువేయుటకై రు 116 లిచ్చుటకుఁ దీర్మానము జరిగినది. ఏలూరుసభలో నాంధ్రవిద్యాలయముఁగూర్చి యొకసంఘము నిర్మింపఁదలఁచిరి. మ॥ వంగూరి సుబ్బరావుగారికి వా రాంధ్రవాఙ్మయచరిత్రము రచించినదానికై రు 116 లిచ్చుటకుఁ దీర్మానింపఁబడినది. వీనిలో నేదియును నాచరణములోనికి రాలేదు. ఇంతకుఁ గారణము విదితమే.

ప్రతిసంవత్సరమును బరిషత్సభతోపా టొకప్రదర్శనము సాగింపవలయునని యోజనజరగుచున్నది. అదియును ధనాభావముచేతనే సాగుటలేదు. పూర్వమునుండి మనవారి విద్యావిషయమున యభివృద్ధిని సూచించు పురాతన తాళపత్రప్రతులు, వానిలిపి, గంటములు, కలములు, దొలగంటములు, నొఅి గంటములు, కత్తిగంటములు, వర్ణములు, బల్లలు, బలపములు, "అత్తోటాలు" సిరాలు, అలేఖములు, సూత్రములు, కణికలు, తూలికలు, పీచుకాగితములు, మొదలగుసామగ్రిని సంపాదించి ప్రదర్శించుట ముఖ్యమైనపనియని తలంచుచున్నాము. ఎప్పటికిసాగునో.

## — నిఘంటునిర్మాణము. —

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణముంగూర్చి రెండనయనుబంధము లో, జూడనగును.

ఆయవ్యయములం దెల్పుపట్టిక నీవెంటఁ జూడనగును.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు–చెన్నపురి. శ్రీదుర్మతినామసంవత్సరపు

### ఆయము.

| | | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| 1. సంవత్సరాదిని నిలువ | - - - | | | | 147 | 2 | 10 |
| 2. బ్యాంకు వడ్డి | - - - | | | | 778 | 3 | 0 |
| 3. బ్యాంకినుండి తెచ్చినది | - - - | | | | 2331 | 1 | 3 |
| 4. చందాలు:— | | | | | | | |
| ఉద్ధారకుల చందా | - - - | 10000 | 0 | 0 | | | |
| పోషకుల చందా | - - - | 100 | 0 | 0 | | | |
| యావజ్జీవసభ్యుల చందా | - - | 100 | 0 | 0 | | | |
| సాధారణసభ్యుల చందా | - - | 224 | 0 | 0 | | | |
| పత్రిక చందా | - - - | 185 | 0 | 0 | | | |
| | | | | | 10609 | 0 | 0 |
| 5. విడిసంచికల విక్రయము | - - - | - | | | 85 | 9 | 0 |
| 6. తంజావూరు లైబ్రరీ చందా | - - | - | | | 33 | 0 | 0 |
| 7. పుస్తకవిక్రయము:— | | | | | | | |
| విప్రనారాయణ చరిత్రము | - - | 6 | 15 | 6 | | | |
| జైమినిభారతము | - - - | 80 | 13 | 0 | | | |
| కవిజనాశ్రయము | - - - | 31 | 1 | 0 | | | |
| జ్యోతిశ్శాస్త్రసారము | - - - | 1 | 8 | 0 | | | |
| యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | - | 2 | 0 | 0 | | | |
| నీతిసీసపద్యశతకము | - - - | 0 | 12 | 0 | | | |
| చంపూరామాయణము | - - - | 30 | 9 | 0 | | | |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | - - | 0 | 14 | 0 | | | |
| సర్వేశ్వరశతకము | - - - | 1 | 8 | 0 | | | |
| కావ్యాలంకారచూడామణి | - - | 3 | 15 | 6 | | | |
| అకారాదిపుస్తకసూచిక | - - - | 2 | 0 | 0 | | | |
| ప్రాకృతభాషోత్పత్తి | - - - | 3 | 0 | 0 | 165 | 0 | 0 |
| 8. చేబదుళ్లు | - - - - | - | | | 400 | 0 | 0 |
| 9. చిల్లరజమ | - - - - | - | | | 2 | 0 | 0 |
| 10. వి. పీ. పోస్టేజి | - - - | - | | | 13 | 6 | 6 |
| 11. ఇతరముద్రణము జమ | - - - | - | | | 8 | 0 | 0 |
| | మొత్తము - | | | | 14572 | 6 | 7 |

నెం. 307, లింగచెట్టివీథి, మదరాసు,
24-8-1922.

జి. నరసింహాము,
ఆడిటరు.

## (ది 28 మార్చి 1922 సం॥ వఱకు) ఆయవ్యయముల లెక్క.

### వ్యయము.

| | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| 1. బ్యాంకికి పంపినది - - - | | | | 2029 | 15 | 0 |
| 2. వి. పీ. పోస్టేజి - - - | | | | 13 | 3 | 6 |
| 3. బ్యాంకి చిల్లరవ్యయములు - - - | | | | 1 | 10 | 4 |
| 4. ప్రయాణవ్యయములు:— | | | | | | |
| పండితులవ్యయము - - - | 24 | 5 | 0 | | | |
| ఉద్యోగులవ్యయము - - - | 18 | 1 | 0 | | | |
| | | | | 42 | 6 | 0 |
| 5. పత్రికావిషయము:— | | | | | | |
| చిత్తరువులు చెక్కించుటకు - - | 18 | 0 | 0 | | | |
| కాగితములు - - - | 115 | 10 | 0 | | | |
| అచ్చుకూలి - - - | 331 | 8 | 0 | | | |
| పోస్టేజి - - - - | 45 | 0 | 6 | | | |
| చిల్లరవ్యయము - - - | 3 | 3 | 0 | | | |
| | | | | 513 | 5 | 6 |
| 6. ఇతరముద్రణము బైండింగు - - | | | | 76 | 12 | 0 |
| 7. పుస్తకభాండాగారవిషయము:— | | | | | | |
| కొనినపుస్తకములు - - - | 23 | 14 | 0 | | | |
| ప్రతులువ్రాయించుటకు - - | 2 | 0 | 0 | | | |
| ఇతరవ్యయములు - - - | 25 | 11 | 3 | | | |
| | | | | 51 | 9 | 3 |
| 8. ఉద్యోగుల జీతములు - - - | | | | 1085 | 0 | 0 |
| 9. ఇంటిఅద్దె - - - - | | | | 400 | 0 | 0 |
| 10. చిల్లర పోస్టేజి - - - | | | | 27 | 11 | 0 |
| 11. తంతులు, రిజిష్టరీపోస్టేజి - - - | | | | 7 | 4 | 0 |
| 12. కార్యస్థానము చిల్లరవ్యయము - - | | | | 33 | 11 | 3 |
| 13. కలములు, కాగితములు మొ॥ - - | | | | 6 | 12 | 0 |
| 14. ఆడిటరుఫీజు - - - - | | | | 50 | 0 | 0 |
| 15. పుస్తకప్రకటనము - ముద్రణాదికము - - | | | | 62 | 0 | 0 |
| 16. నిఘంటు చిల్లరవ్యయము - - - | | | | 9 | 6 | 0 |
| 17. సంవత్సరాంతమున కార్యస్థానమున నిలువ - | | | | 161 | 12 | 9 |
| 18. ఫిక్సెడ్ డిపాజిట్ కు బ్యాంకుకు పంపిన వార్ బాండ్ - | | | | 10000 | 0 | 0 |
| మొత్తము - | | | | 14572 | 6 | 7 |

గుమ్మిడూరి వేంకటరంగరావు,

కొమఱ్ఱాజు లక్ష్మణరావు,

కార్యదర్శులు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. శ్రీదుర్మతినామసంవత్సరము

### అప్పు.

| | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| **పరిషత్తు ఫండు:—** | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ - - - | 77295 | 14 | 8 | | | |
| ఈసంవత్సరమున హెచ్చు ఆదాయము - | 7791 | 8 | 5 | | | |
| | | | | 85087 | 7 | 1 |
| తంజావూరు లైబ్రరీ చందా - - - - | | | | 33 | 0 | 0 |
| ప్రెసిడెంటుగారివలన బదులు - - - | | | | 400 | 0 | 0 |
| **నిఘంటుఫండు:—** | | | | | | |
| గత సంవత్సరాంతమున నిలువ - - | | | | 15000 | 0 | 0 |
| మొత్తము - | | | | 100520 | 7 | 1 |

పైని దెలుపఁబడిన జమాఖర్చు నిలువ లెక్కను, ఆంధ్రసాహిత్యపరిషత్తువారి దుర్మతినామ సంవత్సరపు లెక్కలతో తనిఖీచేసి సరియైనట్లు తెల్పుచున్నాను.

నెం. 307, లింగచెట్టి వీథి, మదరాసు.
24-8-1922.

జి. నరసింహాము,
ఆడిటరు.

## (ది 29 మార్చి 1922 సం॥) న జమాఖర్చు నిలువ లెక్క.

### ఆస్తి.

| | | | | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పరిమిత్తుఫండు:— | | | | | | | | | |
| మదరాసు ఇంపీరియల్ బాంక్ ఆఫ్ ఇండియా వారి జాగ్రత్తలో నుంచఁబడినవి— | | | | | | | | | |
| 3½% 1900-01 గవర్నమెంటుపత్రము - | | | | 10000 | 0 | 0 | | | |
| పైతేదీని బజారుదర నూటికి రు. 55½ చొ॥ తరుగు - | | | | 4450 | 0 | 0 | 5550 | 0 | 0 |
| 5½% 1929-47 గవర్నమెంటుపత్రము - | | | | 10000 | 0 | 0 | | | |
| పైతేదీని బజారుదర నూటికి రు. 80 చొ॥ తరుగు - | | | | 2000 | 0 | 0 | 8000 | 0 | 0 |
| నగదువగైరా నిలువ:— | | | | | | | | | |
| మేనేజరు వశమున నిలువ - - - | | | | 161 | 12 | 9 | | | |
| ఇంపీరియల్ బాంక్ ఆఫ్ ఇండియాలో నిలువ - | | | | 9 | 15 | 8 | 171 | 12 | 5 |
| సభ్యులవలన రావలసిన చందాలు (రాఁదగినవి) - | | | | 17446 | 11 | 0 | | | |
| 4 సం॥కు మించియు వసూలుకాని బాకీలు. గతసంవత్సరము లెక్క దాఖలా - - | | | | 1226 | 0 | 0 | 16220 | 11 | 0 |
| కుర్చీలు మొదలగు సామానులు (అసలు)- - | | | | 525 | 8 | 0 | | | |
| గత సంవత్సరాంతమున మినహా | 181 | 14 | 0 | | | | | | |
| ఈసంవత్సరమున మినహా | 12 | 2 | 0 | 194 | 0 | 0 | 331 | 8 | 0 |
| ప్రచురింపఁబడిన పుస్తకముల నిలువ:— - - | | | | 1632 | 14 | 0 | | | |
| పత్రికల నిలువ - - - | | | | 1276 | 12 | 0 | 2909 | 10 | 0 |
| పుస్తకభాండాగారము ముద్రితప్రతులు:— | | | | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ - - | | | | 1667 | 13 | 3 | | | |
| ఈ సంవత్సరమున ఉచితముగ వచ్చినవి- - | | | | 48 | 14 | 9 | | | |
| ఈ సంవత్సరమున కొనినవి- - - | | | | 23 | 14 | 0 | | | |
| | | | | 1740 | 10 | 0 | | | |
| గతసంవత్సరమునకు మినహా | 555 | 0 | 0 | | | | | | |
| ఈ సంవత్సరమునకు మినహా | 50 | 0 | 0 | 605 | 0 | 0 | 1135 | 10 | 0 |
| పుస్తకభాండాగారము వ్రాఁతప్రతులు - - | | | | - | | | 51376 | 10 | 6 |
| ఘంటువ్యయము:— | | | | | | | | | |
| గతసంవత్సరాంతమునకు - - - | | | | 14815 | 3 | 2 | | | |
| ఈ సంవత్సరమున వ్యయము - - | | | | 9 | 6 | 0 | 14824 | 9 | 2 |
| మొత్తము - | | | | | | | 100520 | 7 | 1 |

గుమ్ముడూరి వేంకటరంగరావు,
కొమర్రాజు లక్ష్మణరావు,
కార్యదర్శులు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. శ్రీదుర్మతినామ

### వ్యయము

| | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| **జీతములు:—** | | | | | | |
| ఆఫీసు ఉద్యోగులకు - - - | 1085 | 0 | 0 | | | |
| ప్రయాణవ్యయములు - - - | 42 | 6 | 0 | | | |
| ఆడిటరుఫీజు - - - - | 50 | 0 | 0 | | | |
| కార్యస్థానమునకు అద్దె - - - | 400 | 0 | 0 | | | |
| కాగితములు మొదలగునవి - - - | 6 | 12 | 0 | | | |
| చిల్లరపోస్టేజి - - - - | 27 | 11 | 0 | | | |
| రిజిస్టరుపోస్టేజి - - - | 7 | 4 | 0 | | | |
| చిల్లరవ్యయములు - - - | 33 | 11 | 3 | | | |
| బ్యాంకి చిల్లరవ్యయములు - - - | 1 | 10 | 4 | | | |
| వి. పి. పోస్టేజి - - - | 13 | 3 | 6 | | | |
| ఇతరముద్రణము - బైండింగు - - | 68 | 12 | 0 | | | |
| పుస్తకభాండాగారము చిల్లరవ్యయము - - | 25 | 11 | 3 | 1762 | 1 | 4 |
| పుస్తకప్రకటనము ముద్రణాదికము - - | - | | | 62 | 0 | 0 |
| **పత్రికావిషయము:—** | | | | | | |
| గతసంవత్సరప్రతులు - - - | 1148 | 12 | 0 | | | |
| కాగితములు ముద్రణము మొదలైనవి - - | 513 | 5 | 6 | | | |
| గతసంవత్సరము నిలువకాగితముల వ్యయము - | 79 | 0 | 0 | 1741 | 1 | 6 |
| **మినహాయింపులు:—** | | | | | | |
| కుర్చీలు సామానులు - - - | 12 | 2 | 0 | | | |
| పుస్తకభాండాగారము - - - | 50 | 0 | 0 | | | |
| గతసంవత్సరము ప్రచురింపఁబడిన పుస్తకముల నిలువ - | 1477 | 14 | 0 | | | |
| గవర్నమెంటు పత్రములు - - - | 2000 | 0 | 0 | 3540 | 0 | 0 |
| హెచ్చు ఆదాయము - - - | - | | | 7791 | 8 | 5 |
| మొత్తము - | | | | 14896 | 11 | 3 |

నెం. 307, లింగచెట్టివీథి, మదరాసు.
24-8-1922.

జి. నరసింహము,
ఆడిటరు.

సంవత్సరాయవ్యయముల లెక్క.

ఆయము,

| | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| ఉద్ధారకుల చందాలు - - - | 10000 | 0 | 0 | | | |
| యావజ్జీవ సభ్యుల చందాలు - - - | 100 | 0 | 0 | | | |
| సాధారణసభ్యుల చందాలు - - - | 390 | 0 | 0 | | | |
| పత్రికచందాలు - - - - | 404 | 0 | 0 | 10894 | 0 | 0 |
| విజ్ఞానచంద్రికల విక్రయము - - - | 85 | 9 | 0 | | | |
| పుస్తకముల విక్రయము - - - | 165 | 0 | 0 | | | |
| పత్రికల నిలువ - - - - | 1276 | 12 | 0 | 1527 | 5 | 0 |
| పుస్తకముల నిలువ:— | | | | | | |
| బైండువి - - - - | 1232 | 14 | 0 | | | |
| బైండుకానివి - - - - | 400 | 0 | 0 | 1632 | 14 | 0 |
| బ్యాంకివడ్డి - - - - | - | | | 778 | 3 | 0 |
| వి. పి. పోస్టేజి - - - - | 13 | 6 | 6 | | | |
| చిల్లర జమ - - - - | 2 | 0 | 0 | | | |
| ఉచితముగావచ్చిన పుస్తకములు- - - | 48 | 14 | 9 | 64 | 5 | 3 |
| మొత్తము - | | | | 14896 | 11 | 3 |

గుమ్మడూరి వేంకటరంగరావు,
కొమర్రాజు లక్ష్మణరావు,
కార్యదర్శులు.

# అనుబంధము I.

దుర్మతిసంవత్సరాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసములయుఁ దత్కర్తలయు నామములు.

1. శివతత్త్వసారము—మల్లికార్జునపండితారాధ్యులు.
2. ఆంధ్రకవితాపిత—కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.
3. కాటయవేమఁడు—పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు.
4. పరిషత్పుస్తకభాండాగారము.
5. పరవస్తుచిన్నయసూరిగారిజీవితము.
6. పరిషద్దశమవార్షికసభావృత్తాంతము.
7. గ్రంథస్వీకారము.
8. శివతత్త్వసారము—పీఠికాదులు—కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు. ఎం.ఏ.
9. చంద్రభానుచరిత్రము—పీఠికాదులు—విద్వాన్ కత్తి సాంబమూర్తిశాస్త్రిగారు.
10. స్వాగతోపన్యాసము—నందిరాజు చలపతిరావుగారు.
11. కర్ణాటరాజ్యవృత్తాంతము—(ఉత్తరభాగము.)
12. ఐన్‌స్టయిన్ యొక్క సాపేక్షత్వవాదము—విస్సా అప్పారావుగారు., ఎం.ఏ.
13. కాకతీయులు క్షత్రియులా? క్షత్రియేతరులా—శ్రీవత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు—జయంతి రామయ్యపంతులుగారు.
14. తద్భవదేశ్యస్వరూపము—నల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.
15. నెల్లూరఁబత్రికాప్రచారము—వంగోలువేంకటరంగయ్యగారు, బి.ఏ.బి.ఎల్.
16. భౌమమండలము—ధేరం వేంకటాచలపతిగారు. బి.ఏ.
17. నిఘంటువులు—భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు.
18. అల్లసాని పెద్దనార్య కవిత్వతత్త్వము—కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.
19. రౌద్రిసంవత్సరకార్యనివేదనము.

# అనుబంధము II.

## శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణము.

### దుర్మతిసంవత్సరము.

నిఘంటు నిర్మాణమునఁ బదసంగ్రహమనెడి కార్యము మించుమించుగా ముగిసినది. విమర్శన మారంభమైనది.

### సంస్కృతపదములు.

ప్రస్తుతము సంస్కృతసమపదములలో సుబంతములును వానియర్థములును ఆప్టేకృత సంస్కృతాంగ్లేయనిఘంటువునుండి గ్రహింపఁబడుచున్నట్లును గతసంవత్సరమునకు ౭౩౦ పుటలు మిగిలియున్నట్లును దెలుపఁబడినది. ఆప్టేనిఘంటువునఁ జివరనున్న డెబ్బదిమూఁడు పుటలుతప్ప మిగిలినదంతయుఁ బూర్ణముగా గ్రహింపఁబడినది. కొంచె మవకాశము గలిగినపు డదియును బూర్తిగా గ్రహింపఁబడును. దుర్మతిసంవత్సరమున (౯౩౭౦) తొమ్మిదివేలు మూఁడువందలు డెబ్బదిపదిపదములైనవి. అదివఱకు వ్రాసినపదములు రమారమి (౫౯౭౭౫) ఏఁబదితొమ్మిదివేలు నేడువందలు డెబ్బదియైదు. వ్రాసిన తత్సమపదముల మొత్తము (౬౯౧౫౫) అఱువదితొమ్మిదివేలు నూటయేఁబదియైదు. ఇంకను వ్రాయవలసినవి రమారమి (౫౦౦౦) అయిదువేలుండును. తత్సమపదముల మొత్తము (౭౪౧౫౫) డెబ్బదినాలుగువేలు నూటయేఁబదియైదగును. వీనిలో విమర్శనకాలమున రమారమి డేఁబదివేలపదములు నిఘంటువున గ్రాహ్యములుగానుండునని తోఁచెడిని.

### విమర్శనము.

దుర్మతిసంవత్సర కార్తికశుక్లైకాదశి మొదలు తత్సమపదవిమర్శనము జరగుచున్నది. దుర్మతిసంవత్సరాంతమునకు (౫౭౩౦) అయిదువేలు నేడువందలు ముప్పదిరాఱుపదములు విమర్శింపఁబడి యచ్చునకు సిద్ధముగానున్నవి. ఆప్టేనిఘంటువున ౧౫౫ పుటలయినవి. తత్సమపదగ్రహణపద్ధతివిషయమునఁ బండితులయభిప్రాయములు కనుఁగొని యావశ్యకమైనచోఁ గొన్నిమార్పులు చేసికొనుటకై నూఱుపదములు గల మచ్చుప్రతు లాంధ్రభాషాభిమానులగుపండితులకుఁ బంపుటయైనది. కొందఱియభిప్రాయములు వచ్చినవి: కొందఱివి రావలసియున్నవి.

### దేశ్యపదములు.

ప్రాచీనగ్రంథములనుండి ప్రయోగములు సంపాదించుటలో నీసంవత్సరమున మొదటి నాలుగుమాసములు నైదుగురుపండితులు పనిచేసిరి. తరువాత మూఁడుమాసములు ముగ్గురు పనిచేసిరి. కడపటియైదుమాసములు నొకరే పనిచేసిరి. ఈసంవత్సరమున (౯౧౫౦) తొమ్మిదివేలు నూటయేఁబదిపదములు గ్రహింపఁబడినవి. దేశ్యపదములన్నియుఁ గలుప మొత్తము (౧౭౯౭౩౦) ఒకలక్ష

యు నిరువదితొమ్మిదివేలు నేడువందల ముప్పది. ప్రయోగాధారములుగా నెన్నఁబడిన యాంధ్ర గ్రంథము లన్నియు దొరకినంతవఱకుఁ బూర్తియైనవి. ఏదైనఁ బ్రాచీనగ్రంథము దొరకినచో దాని నుండి పదములను బ్రయోగములను గ్రహింపఁబడును. పైపదములన్నియు వర్ణక్రమమున నేక ముఖము గావించుట యైనది. సిద్ధమైయున్న సజాతీయద్రావిడకర్ణాటకపదములతోను బ్రాకృత పదములతోను సరిచూచుచు మహాకవిప్రయోగానుసారముగ వీనిని విమర్శింపవలసియున్నది. ఈపని వర్తమాన సంవత్సరమునఁ బ్రారంభింపఁబడును.

## ప్రాకృతపదములు.

ఈసంవత్సరములో వ్రాయింపఁబడిన ప్రాకృతపదములు (౪౧౨) నాలుగువందలఁ బండ్రెండు. వెనుకటివానిలోఁ గలుప మొత్తము (౧౪౨౦) పదునాలుగువందల నిరువది. ఈపని విజయనగరములోనున్న శ్రీమాన్ పరవస్తు వేంకటరామానుజస్వామి అయ్యవార్లగారు శ్రద్ధతోఁ బూర్తిగావించిరి. సిద్ధమైయున్న సజాతీయద్రావిడకర్ణాటపదములు (౧౫౦౦౦) పదునేనువేలు. ఇంతవఱ కన్నియుఁజేరి (౨౧౫౩౪౫) రెండులక్షలు పదునేనువేలు మున్నూటనలుబదియైదు పద ములైనవి. వీనిలో నాచ్ఛికపదములుతప్పఁ దక్కినవన్నియు వేఱువేఱుపదములే.

## వ్యయము.

దుర్మతిసంవత్సరమున నిఘంటునిమిత్తమైన వ్యయము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| జీతములు | .. | .. | .. | ౩౨౪౬ | ౬ | ౧౧ |
| చిల్లరవ్యయము | .. | .. | .. | ౩౧ | ౧౫ | ౦ |
| ఇంటియద్దె | .. | .. | .. | ౧౭౦ | ౦ | ౦ |
| | | | | ౩౪౫౯ | ౬ | ౧౧ |

వెరసి మూఁడువేలు నాలుగువందల నేఁబదితొమ్మిదిరూపాయలు, ఆఱణాలు, పదునొకండు పైసలు.

జ. రామయ్య,
సంపాదకుఁడు.

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు, చెన్నపురి.

## (TELUGU ACADEMY.)

---

ఆ 1922-సు సంవత్సరము సెప్టెంబరు ది 3 తేది ఆదివారం 12 గంటలకు శ్రీపిఠాపురము మహారాజావారి కోటలో సమావేశమైన యాంధ్రసాహిత్య పరిషత్కార్యనిర్వాహక సభావిషయము.

— సభ్యులు. —

1. మ-రా-శ్రీ, శ్రీశ్రీ పిఠాపురము మహారాజావారు, (అధ్యక్షులు.)
2. ,, శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు, ఉయ్యూరు.
3. ,, జయంతి రామయ్యపంతులుగారు, బి.ఏ, బి.ఎల్.
4. ,, రాయిసాహెబు గుమ్మడూరి వేంకటరంగరావుగారు ఎం.ఏ.
5. ,, త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు, సిద్ధాంతము.
6. ,, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ.
7. ,, తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు, కొవ్వూరు.
8. ,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, రాజమహేంద్రవరము.
9. ,, గునుపాటి యానాదిరెడ్డిగారు, కొత్తూరు.
10. ,, రా॥ వేంకటరామసోమయాజులుగారు, హైదరాబాదు.
11. ,, బుఱ్ఱా శేషగిరిరావుగారు, ఎం. ఏ., విజయనగరము.
12. ,, మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగము.
13. ,, అడపా వాసుదేవరామానుజులు నాయఁడుగారు, చోడవరము.
14. ,, పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, బందరు.
15. ,, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, రాజమహేంద్రవరము.
16. ,, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, కాకినాడ.
17. ,, శ్రీచెలికాని లచ్చారావుగారు, చిత్రాడ.
18. ,, ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు, విశాఖపట్టనము.
19. ,, పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు, పిఠాపురము.
20. ,, దేవులపల్లి లక్ష్మీపతిశాస్త్రిగారు, తుని.

21. మ-రా-శ్రీ, దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు బి.ఏ., పిఠాపురము
22. ,, శ్రీదామెర సీతారామస్వామిగారు, పిఠాపురము.
మఱియు ననేకులు.

## — తీర్మానములు. —

(1) దుర్మతిసంవత్సర కార్యనివేదనము చదువఁబడి యందఱచే సంగీకరింపఁబడినది.

(2) దుందుభిసంవత్సరమున కాయవ్యయము లీక్రిందిరీతి నిశ్చయింపఁబడినవి:—

| | | |
|---|---|---|
| ఆయము - - - - - - | | 14400 0 0 |
| ఉద్ధారకులవలన - - - | 10000 0 0 | |
| పోషకులవలన - - - | 2000 0 0 | |
| యావజ్జీవసభ్యులు, సాధారణసభ్యులు | 1000 0 0 | |
| పత్రికచందాలు - - - | 200 0 0 | |
| పుస్తకవిక్రయము - - | 200 0 0 | |
| పుస్తకప్రకటనము - - - | 200 0 0 | |
| బ్యాంకివడ్డి - - - | 800 0 0 | |
| | 14400 0 0 | |
| వ్యయము - - - - - - | | 5600 0 0 |
| జీతములు - - - | 1800 0 0 | |
| ప్రయాణవ్యయములు - - | 200 0 0 | |
| ఆడిటరుకు - - - | 50 0 0 | |
| అద్దె - - - - | 500 0 0 | |
| కాగితములు మొదలైనవి - - | 100 0 0 | |
| సామానులు - - - | 100 0 0 | |
| పుస్తకభాండాగారము - - | 600 0 0 | |
| పత్రికకు - - - | 1000 0 0 | |
| ఇతరవ్యయములు - - | 250 0 0 | |
| పుస్తకప్రకటనము - - | 1000 0 0 | |
| | 5600 0 0 | |

అందఱచే నంగీకరింపఁబడినది.

(3) పరిషత్కార్యస్థానము చెన్నపురినుండి యాంధ్రదేశమునకు మార్చుట మంచిదా మంచిదైనయెడల నేపట్టనమునకు మార్పవలయునను విషయమును బరిశీలించి తమ యభిప్రాయమును డిసెంబరు మాసాంతములోఁగా సాధ్యమైనంత శీఘ్రముగఁ దెలుపుటకై యీ క్రిందివారి నుపసంఘముగా నేర్పఱుపఁ దీర్మానింపఁబడినది:—

1. మ-రా-శ్రీ, రా॥సా॥ గుమ్మిడూరి వేంకటరంగరావుగారు, ఎం.ఏ. (కన్వీనరు.)
2. ,, గునుపాటి యానాదిరెడ్డిగారు.
3. ,, జయంతి రామయ్యపంతులుగారు బి.ఏ., బి.ఎల్.
4. ,, పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.
5. ,, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
6. ,, బుఱ్ఱా శేషగిరిరావుగారు ఎం.ఏ.
7. ,, త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారు.
8. ,, తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు.
9. ,, ఉపాధ్యాయుల వేంకటరమణయ్యగారు.
10. ,, ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు.
11. ,, టి. శంకరలింగంపిళ్లెగారు బి.ఏ., బి.ఎల్.

(4) దుందుభినామసంవత్సరమునకుఁ బరిషదధ్యక్షులుగా మ-రా-శ్రీ, పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగా రెన్నుకొనఁబడిరి.

(5) పరిషత్కార్యస్థానమునకు వచ్చిన నూతనగ్రంథములను విమర్శించి యభిప్రాయమును దెల్పుటకై యీక్రింది 16 గురను గ్రంథవిమర్శకసంఘముగా నేర్పఱుచుటయైనది:—

1. మ-రా-శ్రీ, జయంతి రామయ్యపంతులుగారు బి.ఏ., బి.ఎల్.
2. ,, రా॥ సా॥ గుమ్మిడూరి వేంకటరంగరావుగారు ఎం.ఏ.
3. ,, కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు ఎం.ఏ.
4. ,, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.
5. ,, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.
6. ,, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
7. ,, గునుపాటి యానాదిరెడ్డిగారు.

8. మ-రా-శ్రీ, శ్రీవత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు.
9. „ కూచి నరసింహముగారు బి.ఏ.
10. „ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.
11. „ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు.
12. „ వేదము వేంకటరాయశాస్త్రిగారు.
13. „ బుఱ్ఱా శేషగిరిరావుగారు ఎం.ఏ.,
14. „ ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు.
15. „ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.
16. „ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు.

వీరిలో ముగ్గురుముగ్గురకొక్కొక్కగ్రంథము చొప్పునఁ బంపి యభిప్రాయములను దెప్పించి పరిషత్పత్రికలోఁ బ్రకటింపవలయును.

(6) ఈసభలోఁ గ్రొత్తగా నిరువదిమంది సాధారణసభ్యులు చేర్చుకొనఁబడిరి.

గుమ్ముడూరి వేంకటరంగరావు,
కొమఱ్ఱాజు లక్ష్మణరావు,
కార్యదర్శులు.

British Model Press, Choolai, Madras—1922.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౧. | దుందుభినామసంవత్సరము. ఆశ్వయుజ–పుష్యమాసములు. | సంచిక ౪-౫.




## ప్రాచీనకవులు దేశమునకును భాషకును నొనర్చిన యుపకారములు.

అఘటితఘటనాతిసమర్థుఁ డగుపరమేశ్వరుఁడు సమస్తనామరూపాత్మక మగుప్రపంచమును సృజించె ననియు నందు జీవప్రకృతు లను రెండుపదార్థములే ప్రపంచస్వరూప మనియును, వైదికమతస్థు లందఱు నొప్పుకొనియున్నారు. సమస్తజీవులలో మనుష్యజీవులు సర్వవిధముల నున్నతులు. ఈశ్వరునితో జీవులకు దగ్గఱసంబంధ ముండుటయే దీనికిఁ గారణము. తనమహామహిమయుఁ గళ్యాణగుణములు లోనగు కొన్నివిశేషముల నీశ్వరుఁడు మనుష్యునిద్వారము ననే ప్రకటించియున్నాఁడు. కర్మతారతమ్యమునుబట్టియో సృష్టివైచిత్ర్యమునో గాని మనుష్యవ్యక్తులలోఁ దారతమ్యములు గన్పడుచుండును. పరమేశ్వరునిసామర్థ్య మొక్కొక్క కాలమున మనుష్యులలోఁ గొందఱు మహానుభావుల ద్వారా ప్రకటిత మగుచుండెను. అట్టివారినే మనవా రవతారము లని వాడియుందురు. వేయేల—

శ్లో. యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా
తత్త దే వావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్॥

అనుగీతావచనప్రకారము విభూతియు, సిరియు, బలమును గలప్రతివ్యక్తిని భగవదంశముగ వాడుట కలదు.

పరమేశ్వరుఁడు మనుష్యులకుఁ బ్రసాదించిన శక్తులలో బుద్ధియే మిగుల గొప్పది.

ఇది యంతఃకరణచతుష్టయములో నొకటి యని వేదాంతపారిభాషిక నామము. స్మృతి, మతి, బుద్ధి, ప్రజ్ఞ, ప్రతిభ యనునవి దీనికిఁ బరిణామవిశేషములు.

శ్లో. స్మృతి ర్వ్యతీతవిషయా మతి రాగామిగోచరా
బుద్ధి స్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాల్యగోచరా ॥

అనునది దీనికిఁ బ్రమాణము. గతవిషయమును స్మరింపఁగలశక్తికి స్మృతి యనియు రాఁగలదానిని దెలిసికొనుటకు మతి యనియుఁ దాత్కాలికస్ఫూర్తికి బుద్ధి యనియు నూతనోన్మేషములతోఁ బ్రకాశించుదానికిఁ బ్రతిభ యనియుఁ ద్రికాలములయందు స్థిరముగా నుండుశక్తికిఁ బ్రజ్ఞ యనియు నామములు. ఇందుఁ జెప్పఁబడిన ప్రజ్ఞయే యీశ్వరసమీపసంబంధము మనుష్యునకుఁ గల దనుటకు నిదర్శనమే కాక జీవకోటిలో వానికి సర్వాధికారమును గలిగించె నని చెప్పవచ్చును. ఇట్టిప్రజ్ఞచేతనే దురవగాహము లగు వేదవేదాంగములను సాధించి యవాఙ్మానసగోచరుఁ డగుపరమేశ్వరుని మహామహిమను గూడఁ గొంతవఱకు మనుష్యులలోఁ గొందఱు తెలిసికొనియున్నారు. అట్టివారిని ఋషు లని మనము వాడుచు నుంటిమి. జ్ఞానవైరాగ్యమహిమచేఁ బ్రపంచమునందలి విషయభోగములను దృణప్రాయముగా నెన్ని యామహర్షు లరణ్యవాసులై వన్యభోజనులై తపోవృత్తినిఁ గాలముఁ బుచ్చుచుండిరి. కేవలము వీరు నివృత్తిపరులు. కొందఱు పరోపకారశీలురును గరుణాళులును స్వార్థవిముఖులు నగుటచేఁ, దమతపోమహిమచే నీశ్వరుఁడు ప్రసాదించిన వేదాదుల బహిర్గత మొనర్చుచుఁ బ్రజ్ఞాబలమున వేదాంగములను నితరశాస్త్రములను వర్ణధర్మములను నాశ్రమధర్మములను రాజనీతులను రాజ్యాంగవ్యవస్థలను నింక ననేకము లగు ప్రపంచోపయోగము లగు విషయములను లోకులకు ననుగ్రహించిరి. ఇట్టి యపారసామర్థ్యమునుఁ జూపినవారిప్రజ్ఞాబలమున కవధి గానఁబడదు. కావుననే యిటీవలికవివరుం డగురాజశేఖరుఁడు "సతాం ప్రజ్ఞోన్మేషః పునరయ మసీమా విజయతే" యని మహామహుల ప్రజ్ఞాబల మపార మని స్థిరపఱిచియున్నాఁడు. ఋషులలో మఱికొందఱు దురవగాహ మగు వేదార్థమును లోకులకుఁ దెల్పుటకై యనేకపురాణాదిగ్రంథములను బ్రసాదించిరి. పురాణములలోఁ బరస్పరభేదములును బునరుక్తులును గొన్ని యుండుటనుబట్టి నవీనవిమర్శకులు కొందఱు వానిని గూర్చి విరుద్ధాభిప్రాయులై యున్నారు.

అది విచారప్రస్తుతము. ఏదియెట్లున్నను బురాణములు మాత్రము భాష

కును దేశమునకును జాలినంత యుపకార మొనరించె ననుటకు సందియము లేదు. వాఙ్మయమున సుబోధమై సర్వధర్మప్రవర్తక మగుభాగము పురాణములే. లోకులప్రవర్తనకుఁ గాని విమర్శకులకుఁ గాని యవియే యాధారము లై యున్నవి; వానివలన దేశమునకుఁ గొంతమోసము కలిగె నని కొందఱయభిప్రాయము. ఇయ్యది గ్రాహ్యము కానేరదు. పురాణకర్తలు లోకానుగ్రహబుద్ధిచే వ్రాసిరే కాని లోకుల మెప్పు నడయుటకును రాజు లొసఁగుబహుమతులకును నాశించి కాదు. మోస మనునది సమకాలమున విరోధులఁ గూర్చి జరుగును. పురాతను లగుమహర్షులకు రాఁగల జనులయెడ విరోధమునకుఁ గారణము కానరాదు. అట్టి బుద్ధియే యుండినచో నట్టిగొప్పసామర్థ్యమును బరమేశ్వరానుగ్రహమును వారికిఁ గలిగియుండదు. నిన్న మొన్నటి వఱకుఁ బుట్టిన యితిహాస, నాటక, కావ్య, చంపూ ప్రముఖసంస్కృతాంధ్రగ్రంథములు పురాణగాథల ననుసరించియే వ్రాయఁబడినవి. పశ్చిమఖండవిద్యాసంపర్కము గలనూతనవిమర్శకులు వ్రాయు నవల లనుగ్రంథములు దప్ప మిగిలినగ్రంథములన్నియు ను సాధారణముగా నిట్టివే.

ఇట్టిపురాణములలో ముఖ్య మైనవి పదునెనిమిది కలవు. తక్కిన మఱి కొన్నిపురాణములు కూడఁ గలవు. ఈపురాణములు వివిధకవులచే వ్రాయఁబడెను గాని వ్యాసుఁ డనునొక మహర్షి వ్రాయలే దనియు నొక్కఁడు వ్రాసినచోఁ బరస్పరభేదము లుండుట యసంభవ మనియుఁ గొంద ఱాక్షేపించియున్నారు. ఇన్నిపురాణములు వ్రాయుట యొక్కనికి సాధ్య మగునా యని కొందఱు సంశయింతురు. ఈ మొదలగు ప్రశ్నలకు శ్రమపడి మనవారేవో సమాధానములఁ జెప్పుదురు. అపార మగుప్రజ్ఞాబలము కలిగి యన్ని గ్రంథముల లోకానుగ్రహబుద్ధిచే వ్రాసిన మహాత్ములకుఁ బరస్పరవిరోధములను బాటింపకుండుటకు సామర్థ్యము చాల కుండునా. దేశకాలముల పరిణామముల ననుసరించియు యుగధర్మముల ననుసరించియు వా రట్లు వ్రాసియుందు రని పెద్దలు చెప్పుదురు.

ఇంతమహారచన యొక్కనికి సాధ్యమా యనునది విచారణీయము. దానికిఁ గూడ నొక చిన్నసమాధానము గలదు. కవిత యనునది పరమేశ్వరునిచేఁ దనయంశ మగునొక్కొక్క మహామహునికిఁ బ్రసాదింపఁబడిన గొప్పసృష్టిశక్తి. పరిశ్రమచే నెంతవఱకు వ్యాపింపఁజేసిన నది వ్యాపించుచున్నదియే కాని పరిమితి గలది కాదు. ఇటీవలి కవు లొక్కొక్క రనేకగ్రంథముల రచించియుం

డుట మన మెఱుఁగుదుము. ఇప్పటికవులకన్న నెక్కుడు తపోబలమును విద్యా బలమును బ్రజ్ఞాబలమును శరీరబలమును గలపురాతనఋషు లొక్కొక్క రనేక గ్రంథములు వ్రాసి రనినచో నేమి వింత? వారు లోకోపయోగమునకై ప్రసాదించిన వాఙ్మయముఁ జొచ్చి నిండుగఁ జదువుటకు మనుష్యునిజీవితమే చాలదు. తర్కవ్యాకరణవేదాంతాలంకార మీమాంసాజ్యోతి ర్వైద్య సంగీత శిల్పాది విద్యలను జదువువారు, ప్రారంభించినది మొదలు యథావిధిగను యథాక్రమముగను జదువఁ బూనినచోఁ దుదముట్ట నొకశాస్త్ర మైన నొకనికిఁ జదువుటకు జీవితకాలము చాలదు. అందువలన మండూకలంఘన న్యాయమున గ్రంథముల ముట్టి ముట్టి కొంచెము ప్రవేశముమాత్రము కలిగించుకొనుచు మీఁదకుఁ బోవుచుందురు. కాని తలస్పర్శముగా నన్నింటిని జదువు పద్ధతి లేదు.

వనమందు వన్యాశనులై కాలముఁ బుచ్చువారు వ్రాసిన యార్షగ్రంథములవలననే వర్ణాశ్రమధర్మములు, మనుష్యులజీవితమును గడపుట కనువగునుపకరణముల సంపాదించుకొనుటకుఁ జిన్నగృహము మొదలు గొప్పదుర్గమువఱకును నిర్మించుశక్తులును నొకచిన్నగృహము మొదలు మహాసామ్రాజ్యము వఱకును బాలించుటకుఁ గలపరిపాలనధర్మములు, వస్త్రములు నేయుట, కృషి చేయుట, ఘటనిర్మాణము మొదలగు సమస్తశిల్పములు కళలు మున్నగునవి యన్నియు సమర్థకముగాఁ దెలిసికొను శక్తి సంభవించి యొక్కొక్కకళయందు మహాప్రముఖులైనవారు బయలుదేఱి తమకును దోడివారికిని లాభకారులుగ నుండఁదగినంత యవకాశము కలిగినది.

వారు చూపినత్రోవల ననుసరించి యిటీవల వ్రాయఁబడిన గ్రంథములే మితిమీఱిన యుపకారమును భాషకును, లోకమునకును జేసియున్నవి. వాని నన్నింటిని వివరించుటకు స్వల్పబుద్ధి గలమాదృశులకు సాధ్యముకాదు, సరియేకదా, విశేషముగాఁ బ్రతిభ గలవారు సయితము జంకుదురు. తక్కిన వాని నన్నింటి నటుంచి భరతఖండమునఁ జతుర్వర్ణములవారికిని మిగుల గౌరవాస్పదము లగు రామాయణ మహాభారతగ్రంథములఁ గూర్చి యించుక మనవి చేసెదను. ఈరెంటిలో రామకథ ప్రాచీన మనియు భారతకథ యర్వాచీన మనియు, జనసామాన్యము నమ్ముదురు.

మహాభారతమున రామకథ చెప్పఁబడుట, దీని కొక దృష్టాంతము. కథలయొక్క యేర్పాటెట్లున్నను మహాభారత గ్రంథశైలినిబట్టియు నం దుపయో

గింపఁబడిన వైదికార్షప్రయోగములఁ బట్టియు భాషాస్థితినిబట్టియు భారతరచన ప్రాచీన మని చెప్పఁదగును. గ్రంథశైలిని, భాషలోఁ గలకట్టుదిట్టములను వృత్తవైచిత్ర్యములను నలంకార విశేషములనుఁ గల్పనాచమత్కారములను నింక మఱికొన్నివిశేషములను యోజించి విమర్శకులు, రామాయణకావ్యరచన, నవీనమని యభిప్రాయపడిరి. ఇదియును గొంతవఱకును సరి యనియే తోఁచెడిని. వాఙ్మయక్రమమును జూచినను నితిహాసరచనకన్న గావ్యరచన యర్వాచీన మని చెప్ప నొప్పును. కావుననే యితిహాస మని భారతమును, గావ్య మని రామాయణమును వాడుచున్నారు.

శ్రీమహాభారతము పంచమవేద మని వ్యవహరింపఁబడుచున్నది. దేశమునకును భాషకు నది యొనర్చిన యుపకారము వర్ణనాతీతము. ఐనను దిక్ప్రదర్శనముగఁ గొంచెము దెలిపెదను. ఆదిపర్వమునఁ బాండవధార్తరాష్ట్రాదిసంభవము నిమిత్తముగఁ గైకొని, యప్పటికి లోకమునఁ బ్రసిద్ధులై యున్న గొప్పవారి దేవదానవాద్యంశసంభవమును, ముందు రాఁబోవు మహాసంగ్రామమున కుపోద్ఘాతముగ సూచించెను. పలువురు మహారాజులచరిత్రములు యుక్తముగ వర్ణింపఁబడి లోకమునకుఁ బాండవధార్తరాష్ట్రుల బాల్యయౌవనకథాసందర్భమున ననేకధర్మములు, నీతులు నుపదేశింపఁబడెను. సభాపర్వమున దిగ్విజయోపార్జిత విత్తములకు సత్పాత్రవినియోగము రాజసూయమువలన నుపదేశించుచుఁ బిమ్మట ద్యూతాది సందర్భమువలనఁ బరులధనమునకు నౌన్నత్యమునకు నసహ్యపడి తెగులు లేనివేదనఁ బడుదుర్మార్గుల చరిత్రయు వారిచే నికృతినొంది యోర్పుమై ధర్మశీలత నెఱపిన మహానుభావుల యోగ్యతయు, మహాపతివ్రతామహిమయుఁ బ్రతిజ్ఞానిర్వాహమునకై యెన్నికష్టములనైన మహాత్ములోర్తు రనుటయు మున్నగు నెన్నియో విశేషములు, లోకమున కుపదేశింపఁబడెను.

వివిధమహాపురుషులచరిత్రలు, ప్రపంచసృష్టి ప్రళయాదిక్రమమును ననేకాధ్యాత్మికవిషయములు వర్ణాశ్రమధర్మములు తీర్థమహిమలు నన్నిధర్మములలోఁ దప ముత్తమధర్మ మనుటయు, నుత్తమస్త్రీచరితములు, మొదలగు వర్ణనాతీతము లగుసద్విషయము లారణ్యకపర్వమున నుపదేశింపఁబడియెను. అజ్ఞాతవాస వర్ణనవ్యాజముచే సేవాధర్మములు, నప్పుడప్పుడు రాజసేవకులకుఁ గలుగుప్రమాదములు, సేవకులప్రభుభక్తియు, రాజసు లగుప్రభువులు సేవకులయెడఁ గనఁబఱుచు నహంభావమునుఁ గోరఁదగని యుత్తమవనితలను దుర్గర్వముచేఁ గన్నుఁగానక కామించువారికిఁ గలుగునష్టములు నుత్తమ సేవకులవలన సమయవిశేషములందుఁ

ప్రభువులకుఁ గలుగులాభములు మొదలగువిషయములు నాలుగవదానిలోఁ గేవలము లోకోపకారముకొఱకుఁ బ్రకటింపఁబడెను.

ఐదవదానిలో యుధిష్ఠిరుని యుద్యోగవ్యాజమునను, మహానుభావుఁడగుశ్రీకృష్ణుని దౌత్యకరణవ్యాజమునను నుపదేశింపఁబడిననీతులును ధర్మములును, మితిమీఱియున్నవి. రాజనీతులకు మహాపురుషుల సహనశీలతకుఁ బరమేశ్వరునిభక్తవాత్సల్యమునకుఁ బరమేశ్వరుఁడు స్పష్టముగ స్వరూపముఁ జూపించినను దెలిసికొనలేని దురహంకారుల పరమమూర్ఖతకును నింకననేకవిషయములకు నిదిమార్గదర్శకమై యుపదేశకమై యొప్పుచున్నయది. తరువాతి యైదు పర్వములకు యుద్ధపంచక మని పేరు. పేరునకు మాత్ర మిది యుద్ధపంచకము గాని భారతవర్షపు నైసర్గికస్వరూపాదికము, సర్వ మతములవారికి నుపాదేయము లగుగీతలును, బిస్మట విచిత్రవివిధవ్యూహరచనావిశేషములు సందర్భానుగుణము లగునీతులు యుద్ధధర్మములు మున్నగు ననేకము లిం దుపదేశింపఁబడెను. తదుపరి శాంత్యానుశాసనికపర్వములలో రాజధర్మములు స్త్రీధర్మము నాపన్మోక్షధర్మములు లోనగువివిధధర్మములు ననేకపురాణగాథలు వర్ణాశ్రమధర్మములు, దానవిశేషములు లోకస్థితికి మార్గదర్శకము లగుననేకవిషయములుఁ జూపఁబడియెను. అశ్వమేధాశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణములలోఁ బ్రతిదానియందును నేవియో ముఖ్యములు నుపాదేయములును నగువిషయములు, చూపింపఁబడియున్నవి. సకల రత్నములకు నాకర మగుసముద్రమువలె సర్వజనులకు నుపాదేయము లగుసర్వధర్మములకును, లోకప్రవృత్తికిని మార్గదర్శకమై శ్రీమద్రామాయణము కథాకల్పనమునను రసపోషణమునను భాషాసౌందర్యమునను వృత్తవైచిత్రిని నిరుపమానమై వాఙ్మయమున నిటీవలికవిరచనకెల్ల మార్గదర్శకమై యొప్పుచున్నయది. సంస్కార మెంతపాటి యుండిన నంతకు ననుగుణముగనే యీగ్రంథ మర్థమిచ్చును. ఇది కడుంగడు రచనావైదగ్ధిని దెలుపును. ఇందుఁ బూర్వకాండమునఁ గల నగరవర్ణనము, చాతుర్వర్ణ్యవర్ణనము, రాజ, రాష్ట్ర, మంత్రి, సైనిక, గజాశ్వరథభట రాజ్యోపకరణాది వర్ణనములు విమర్శించి చదివినచో గ్రంథకర్తకుఁ గల సర్వంకషపాండితీమహిమయు దేశముయొక్క తాత్కాలికనాగరకతావిశేషములు నపూర్వములు నాశ్చర్యకరములు నయి యున్న వని కన్పట్టును. అవతారమూర్తి యగురామునిచరిత్రము నే యిది చెప్పుచున్నను దన్మూలమున లోకమున కనేకసామాన్యవిశేషధర్మములను వ్యంగ్యమర్యాదచేఁ బోధించుట వల

నను వాఙ్మయమునఁ బేర్కొనఁబడిన మహాకావ్యలక్షణములగు నద్రినగరనదీ సముద్రసూర్యచంద్రోదయ కుమారోదయ విరహ వివాహసంశ్లేషప్రముఖ మహావర్ణనములు కలిగియుండుటవలన నాదికావ్య మని పేరొందెను. దీనినా ధారముగఁ గైకొనియే, యిటీవలిసంస్కృతాంధ్రకవులు వివిధనాటకచంపూ ప్రబంధయక్షగానాదిరూపమునఁ బెక్కుగ్రంథముల రచియించిరి. మహా భారతరామాయణపురుషుల యెడలను గ్రంథములయెడలను గలభక్తియుఁ బ్రే మయు గౌరవమును జిరస్థాయులు. కావున గొప్పకవి మొదలు చిన్నకవివఱకు నిటీవలివా రందఱుఁ దమగ్రంథముల నామార్గముల ననుసరించియు, నాకథల ననుసరించియు వ్రాసి గనుట వింతకాదు. రామాయణమున నొక్కొకకాం డములోని యొక్కొకవిషయముఁ జక్కఁగఁ జదివి విమర్శమును వ్రాయఁబూని నచో ననేకసంపుటములు పట్టును. దశరథుఁడు ప్రజలను బిలిచి తనవార్ధ కముఁ జూపి చెప్పి రాముని నభిషేకింతు నని వారియనుమతికై చేసినప్రసంగ మును దానికి వా రొసంగినయుత్తరమును మొదలగు నచ్చటివిషయమున రాజ నీతిపారగు లగుపురాతనరాజుల పరిపాలనములలోఁ రాజులకును బ్రజలకును గల యాత్మీయసంబంధము చక్కఁగఁ గన్పడును. రాజ్యత్యాగావసరమున రాములవారు కైకతో నాడినమాటలు సీతతోఁ జేసినసంవాదము లక్ష్మణునికిఁ జేసినయుపదేశము నెన్నిసారులు చదివినను దృప్తితీరదు. చిత్రకూటమున రామభరతులసమావేశమునఁ గథాసందర్భమును విమర్శించినచో జ్యేష్ఠభ్రాతృ గౌరవము లోకాపవాదభీతి సహజమగుయోగ్యత మొదలగుభరతుని గుణవిశే షములును రాముని సోదరవాత్సల్యము పితృవాక్యపరిపాలనదీక్షయు మనో ధైర్యమును వర్ణనాతీతములు. సుందరకాండమునఁ బ్రతిసర్గయును, బ్రతిఘట్ట మునుగూడ నపూర్వవిశేషపూరిత మయి చదువరులహృదయముల నద్భుతప్ర మోదరసమగ్నములుగఁ జేయఁజాలును. హనుమంతుని చరిత్రమునఁ బ్రభు భక్తియు నుత్తమదూతధర్మములు ప్రజ్ఞావిశేషము నర్థానర్థచింత మొదలగు విశే షములు చదివితీరవలయును. సీతచరిత్రమునఁ విశేషభాగము, లోకోపదేశక మగువిషయ మంతయుఁ జాలవఱకుఁ గలదు. ఇంతకును రామాయణగ్రంథము వలనను మహాభారతగ్రంథమువలనను దేశమునకును, భాషకును, గలిగిన మేలు ప్రాజ్ఞు లందఱును నెఱిఁగినవిషయమె. ఇఁక రామాయణభారతగ్రంథముల నా ధారములుగఁ జేసికొని కావ్యనాటకచంపూప్రబంధాదుల వ్రాసినమహాత్ముల పాండిత్యవిశేషమును దానివలనఁ గలిగినమహోపకారమును వర్ణనాతీతములు.

వీరందఱుఁ దమగ్రంథములలో సమస్తశాస్త్రసిద్ధాంతముల నచ్చటచ్చట సూచన గాను విపులముగను గనఁబఱిచిరి. కాళిదాసుఁడు రఘువంశ కుమారసంభవ మేఘసందేశము లనుమూఁడు కావ్యములను రచించెను. కావ్యములలో రఘువంశమున రఘుమహారాజు దిగ్విజయమునఁ దనకుఁ గల దేశపరిజ్ఞానమును గనఁబఱుచుచు నయోధ్యకుం దూర్పునఁ గలవంగదేశమును వర్ణించెను. ఉత్కళ కళింగదేశములను, సూచించెను. దక్షిణదిశను పాండ్య కేరళదేశములను క్లుప్త ముగ వర్ణించెను. పశ్చిమమున గూర్జరదేశమును వాయవ్యమున నరేబియా యను నుత్తరమున హిమవత్పర్వతమును, దానికిఁ బైని గలదేశమును జక్కఁగ వర్ణించి చూపెను. తనకుఁ గలయద్వైతసిద్ధాంత విశ్వాసము పలుచోటులఁ గనఁబఱిచెను. జ్యోతిర్వైద్యసంగీతశిల్పరాజనీతి శాస్త్రములఁ బ్రాసంగిక ముగఁ గనఁబఱిచెను. మేఘసందేశమున మేఘునిప్రయాణవ్యాజముచేఁ జిత్ర కూటమునుండి యలకాపురమునకు మార్గముఁ జూపుచుఁ దనకుఁ గలయుజ్జ యినీపరిచయము నభిమానమును జూపుటకును బరదేవతాభక్తిని దెల్పుటకును ఉజ్జయినికి మార్గములో నవసరముఁ గల్పించి యచ్చటఁగల మహాకాళీమహా కాళదేవతలను, వారియుత్సవములను గూడ వర్ణించి చూపెను. ఇందుఁ గల కథాకల్పనము పాత్రోచితరసపోషణము నందు ముఖ్య మగు విప్రలంభశృంగా రమును బ్రశస్తముగఁ జూపంబడెను. మేఘునిప్రయాణవ్యాజమున వర్షకాలవర్ణ నము నాకాలమున దేశస్థితియుఁ జక్కఁగఁ జూపఁబడినవి. జనులకష్టసుఖముల యనుభవకాలములోని స్థితిగతులును, వివాహవర్ణనములు లోకానురూప మగు పెండ్లిమాటలుఁ పెండ్లికై తరలివెళ్లుటఁ రాజులయిండ్లవివాహములు జరుగు నప్పుడు ప్రేమగల ప్రజలయుత్సాహము కష్టకాలమునఁ బ్రజలసానుభూతియు లోకుల మెప్పించుటకు రాజులు పడినపాటులును యశోరక్షణమే ముఖ్యముగను స్వసౌఖ్య మప్రధానముగను, దలంచి ప్రభువులు ప్రవర్తించుటయుఁ, బాతివ్రత్య మును గాపాడుకొనుటకును ననుమృతికొఱకును బూనికతోఁ బ్రయత్నించి యుత్తమస్త్రీలు చూపినస్థైర్యమును, మొదలగులోకధర్మము లెన్నియో ప్రద ర్శింపఁబడినవి. నాటకములను, బురాణములను ననుసరించియే వ్రాసినను నందుఁగల వర్ణనములు మాత్రము తనకాలమునకును దానుండు దేశమునకు ననుకూలముగ నుండునట్లు చక్కని సందర్భములతో వ్రాయఁబడియెను. శాకుంతలమున దుష్యంతమహారాజు రాజర్షి యని స్థిరపఱుచుచు నుత్తమనాయ కత్వమును స్థాపించుట కాతని ప్రవర్తనముఁ జక్కఁగ వర్ణించుచు శకుంతలను

మోహించునపు డజ్ఞాతకులగోత్ర.యగుకన్యను ప్రేమించుటలో మనస్సాక్షిబల
మును గనఁబఱిచెను. పిమ్మట నామె నెఱుంగ ననిచెప్పునపుడు యోగ్యతకుఁ
బోషకముగ దూర్వాసునిశాపముఁ గల్పించెను. చివరవఱకును శకుంతలయొక్క
మార్దవమును, నవ్యాజప్రేమను హృదయపరిశుద్ధిని పోషించెను. ప్రాసంగిక
ముగ నచ్చటచ్చటఁ గొన్నివింతలఁ జేర్చినను మొత్తముమీఁద నాయికానాయ
కుల యుత్తమత్వమును స్థిరప్రేమయును సమగ్రముగఁ గాపాడుచు నడిపించెను.

వైద్యమునను జ్యోతిషమునఁ గూడ నీతఁడు గ్రంథరచనఁ జేసెను.
భారతకథ నుద్దేశించి భారవికవి కిరాతార్జునీయ మనుకావ్యమును రచించెను.
కథాభాగము స్వల్పముగను గావ్యమున కావశ్యకము లగువర్ణనములు విశేష
ముగను నందుఁ జేయఁబడియున్నవి. "భారవే రర్థగౌరవ" మ్మనువాక్యాను
సారమున నొకటి, రెండు, మూఁడుసర్గలలోఁ జక్కగ రాజనీతులు బోధింపఁ
బడినవి. అర్థగాంభీర్యముచేతనే యీభాగములకుఁ బాషాణత్రయ మని పేరు
కలిగెను. తక్కినగ్రంథ మంతయు రసభరితమై సమస్తశాస్త్రసంప్రదాయపూరి
తమై యొప్పును. 'ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే' యనునట్లు, భవ
భూతి కరుణరసమును లోకానుభవసిద్ధముగ నిరూపించెను. మఱియు మహా
వీరచరితమును వ్రాసి, లోకోత్తరనాయకుఁ డగుశ్రీరాముని దనయిచ్ఛదీర
వర్ణించి తన యప్రతిమపాండితిఁ గనఁబఱిచెను. మాలతీమాధవము నపూర్వ
రచనగా నిర్మించి యందు దక్కాలమున వాడుకలో నున్నకాపాలికదిగంబరాది
మతములను నాభిచారికకర్మలను సూచించుచు శృంగారవీరకరుణా రౌద్రబీభ
త్సాదిసమస్తరసములను బాత్రోచితముగఁ జూపి చదువరులకు మహోపకార
మొనర్చెను. కాదంబరి వ్రాసినబాణుని మహిమ వర్ణనాతీతము. ఛందోబద్ధ
గ్రంథమును వ్రాయంబూనినచోఁ దననిరంకుశధోరణికి నిర్బంధము కలుగు
ననియో గద్యకావ్యములయం దభిరుచివలననో స్వేచ్ఛగాఁ గాదంబరిని వచన
రూపమున వ్రాసెను. ఇందుఁ గలకథాచమత్కృతియు, శ్లేషలు, విరోధాభాస
ములు నపూర్వములు. అచ్ఛోదసరో వర్ణనము, శుకనాసుని రాజనీత్యుపన్యాస
మును, కపింజలుని వైరాగ్యోపన్యాసము, చంద్రాపీడ కాదంబరీ మహాశ్వేతల,
పరిశుద్ధచారిత్రము నెంత చదివినఁ దనివితీరదు. సందర్భానుసారముగ సమస్త
రసములఁ జక్కఁగ వర్ణించి వచనరచనకు మార్గదర్శకుఁ డయ్యెను. గీర్వాణ
కవు లిట్లు వ్రాసినకావ్యపురాణేతిహాసనాటకాదిగ్రంథములు మనభరతఖండ
మున వేనవేలు గలవు, వాని నన్నింటినిఁ బేర్కొన నవధి చాలదు.

సంస్కృతకవులగ్రంథముల ననుసరించి నన్నయభట్టు లోనగునాంధ్ర కవులు గ్రంథరచనకుఁ దొడఁగిరి. మనకు సంస్కృతము వ్యావహారికభాష కాక పోయినను దత్సమరూపమున మనభాషలోఁ గలసి వ్యావహారికభాషకు సమాన మాయెను. కావునఁ గవులు శబ్దజాలమును యథేచ్ఛముగ వాడుకొనుచు వాఙ్మయమును ఛందోరూపమున విస్తరింపఁ జేసిరి. భారతము నాంధ్రీకరించిన నన్నయతిక్కనలు పేరునకు మాత్ర మాంధ్రీకరణము గాని కథను మనసున నుంచుకొని వారియిష్టానుసారము స్వతంత్రగ్రంథములవలె రచించిరి. ఇటీవలి గోపినాథరామాయణము తప్ప పురాణేతిహాసాదుల ననుసరించి వ్రాసినగ్రంథ ములన్నియు స్వేచ్ఛగా వ్రాసినవే కాని, భాషాంతరీకరణ నిర్బంధము గలవి కావు. మూలగ్రంథానుసరణమున లోపము లుండినను రసపోషణము కథా కల్పనము మొదలగునవి సమంజసములుగ గన్పట్టుచుఁ గవులనిరర్గళకవితా మాధురి నీగ్రంథములు చూపుచున్నవి. ఇంతియ కాక యతివిస్తరము లగుపురా ణాదుల సరిగఁ దెనిఁగించినచోఁ జదువరులకుఁ గూడ విసుగు కలుగును. గ్రంథ ములను సంకోచపఱిచి చక్కని శైలిలో సులభరీతిని వ్రాయుటచేతనే సామాన్యు లకుఁ గూడ సుప్రవేశము కలిగినది. సమస్తవిషయములను లోకమున కుపక రించుటయే కాక శ్రీమహాభారతము, గ్రంథరచనకు నాంధ్రమునఁ బరమ ప్రమాణమై యొప్పుచున్నది. ప్రబంధరచనకుఁ ద్రోవఁజూపిన పెద్దనవ్రాసిన మనుచరిత్రమును బరిశీలించి చదివినవారలఁది నందుఁ గలవిశేషములు సంపుట ములుగ వ్రాయవచ్చును. ఇటీవలి ప్రాబంధికులు నడిచినత్రోవ లన్నియు నామహామహుఁడు సూచించినవియె. చరిత్రకారులు కవులకాలమును సామర్థ్య ములను రచనాచమత్కృతిని, శైలిభేదములను, నింక నావశ్యకము లగునంశముల నన్నింటిని, విస్తరించి వ్రాసియే యున్నారు. ఇందుఁ గవులురచించిన గ్రంథ జాలము దేశమున కెంత యుపకరించినదియో, యంతియ చూడఁదగినది. కేవల సంస్కృతమునఁ దప్పఁ దెలుఁగున నిరూపించుటకు సాధ్యముకాని తర్కమీ మాంసావ్యాకరణాదిగ్రంథములు తప్ప మిగిలిన వేదాంత, అలంకార, వైద్య, జ్యౌతిష, శిల్ప, సాముద్రికాది వివిధగ్రంథముల నాంధ్రభాషలో రచించి, లోకము నకు మహోపకార మొనరించిన మహానుభావు లెప్పటికి నాంధ్రదేశమున సంస్మ రణీయులును వందనీయులు నై యున్నారు. తమగ్రంథముల రచించుకొనుచు నచ్చటచ్చటఁ దమకుఁగల శాస్త్రాంతరపాండిత్యమును గూడఁ గనఁబఱిచియు న్నారు. పింగళి సూరన తనప్రభావతీప్రద్యుమ్నమున "శృంగగ్రాహికఁ జెప్ప

వేఁడి తెరువుల్ సిద్ధింపమిం జేసి చి। త్రాంగ శ్రీనిధి నవ్వధూమణిని స్థూలారుంధతి న్యాయమా। ర్గాంగీకారముగా వచించితిని జంద్రాద్యోపమల్ సూచనా। భంగుల్గాని యతస్సహస్రగుణ సౌభాగ్యంబు లాయంగముల్ ॥ అను పద్యమునఁ దనకుఁ గలన్యాయమీమాంసాశాస్త్రప్రవేశమును సూచించెను. తుహ్యోస్తాతఙ్, అనువ్యాకరణసూత్రము నర్థమును, ప్రశ్నోత్తరరూపమున సమర్థించుచు శ్రీనాథుఁడు శృంగారనైషధమున నెనిమిదవయాశ్వాసమున నొక పద్యమును వ్రాసెను. ఇట్లుఁ కవులు చూపినలోకవార్తలు, శాస్త్రమర్యాదలు, దేశాచారములు మతప్రవర్తనలుఁ మొదలగునవి నిపుణముగఁ బరిశీలించినచోఁ గవితాప్రపంచమునఁ బ్రపంచస్వరూప మంతయు నిమిడి యున్నట్లుఁ దోఁపక మానదు. కవు లీతీరున భాషకును, దేశమునకును జేసినయుపకార మిది వఱకే।సిద్ధమై యనుభవములో నున్నది. దానిని దోఁచినరీతిని వ్రాసి యొకసారి యానందించుటకు నాయథాశక్తిని దీనిని దిక్ప్రదర్శనముగ వ్రాసి విన్నవించితిని. ఇందు నాయెఱుంగమివలనఁ గనుపట్టు లోపములను సభ్యులు దయతో మన్నింతురు గావుత మని ప్రార్థించుచు విరమించుచున్నాఁడను.

మండలేముల సీతారామశాస్త్రి.

# వేమన.

ఎందఱెన్ని వ్రాసినను వేమనపూర్వోత్తర మిప్పటికిని నిర్ణయింప నలవి
గాకున్నది. రాజమహేంద్రవరము మొదలు చిత్తూరువఱకుఁ గల యనేక
గ్రామము లతనిఁ దమవానిఁగాఁ జెప్పుకొనుచున్నవి. ఆతని జన్మస్థాన మిప్పటి
యనంతపురముజిల్లా కదిరితాలూకా గాండ్లపెంట మజరా కటారుపల్లె యనియు
నాతఁ డాతాలూకా నల్లచెఱువుగ్రామమునఁ బిడుగుపడి బ్రహ్మసాయుజ్యము
నందె ననియు నీతనియింటిపేరు తుంగావా రనియు వీ రొకతెగ కాఁపు లనియుఁ
గదిరిప్రాంతములలోఁ బ్రబలమైన జనశ్రుతి గలదు. ఈయన సిద్ధిఁబొందిన
నల్లచెఱువుగ్రామమున నీయనపేర నొకచిన్న గుడియు నందుఁ బూజాదులును
దిరునాళ్ళును జరుగును. ఆగుడియందలి వేమనవిగ్రహము బచ్చెనదిగా నుం
డును. ఇతఁడు రాజవంశమునఁ బుట్టి యౌవనధనసంపత్తులకు లోపడి తుద కెట్టె
కేలకు మహావిరాగి యాయెనో లేక సంస్కారప్రాభవమున బాల్యమునుండి
యైహికభోగములకు విముఖుఁ డాయెనో నిర్ణయింప నశక్యముగా నున్నది.
ఆయన జీనయాత్ర యెట్టిదైన నిపు డాయనపేర శాశ్వతము లైనిలిచియుండు
పద్యములను జూడ నాయన యొకచోటఁ గూర్చుండి కావ్యముల వ్రాయు కవు
లవలెఁ గాక సంచరించుచు నెక్కడ నేవిశేష మగపడిన దానిగుణదోషములఁ
బరికించి యద్దాని లోకానుభవమునకుఁ ద్రిప్పి యొక గొప్పనీతిని బ్రకటించు
చుండెను.

ఈయనపుట్టుక యేజాతియం దైనను దత్త్వజ్ఞుఁ డౌటచే జాతిభేదములఁ
బాటింపఁడయ్యె.

వేమనపేర వాడఁబడుచుండు పద్యము లన్నియు నాయన చెప్పినవియా
యనువిషయమును బ్రమాణబుద్ధితో నెవరును బరిశీలించి యుండలేదు. ఒకరు
వేమనశతకమని యచ్చువేసిన మఱియొకరు మూఁడువేలపద్యములపుస్తక మని
యింకొక రిదివఱ కేరికిని లభింపని యపూర్వమూలముల నతికష్టముతో సంపా
దింపఁబడిన మఱియు నొకవేయిఁ జేర్చి ప్రకటించితి మని పలువురు చెప్పుకొను
చున్నారు. కొన్నికొన్ని పద్యములఁ జూడ నందలి తుచ్ఛవాక్యములు మహా
యోగియు మహాజ్ఞానియు నగు వేమన వచించియుండునా? యనియు నాలో

చింపవలసి యున్నది. 'విశ్వదాభిరామ వినుర వేమ'. యను సంకితము చెప్పఁ
దగు ప్రతిగీతమును వేమనకే యంటఁగట్టుచున్నారు.

అఱవవారికి 'అవ్వయార్' 'తిరువళ్ళువర్' మొదలగు ప్రాచీనమహాత్ములు
గలరు. సంస్కృతగ్రంథములకు నెందఱోమహర్షులు ప్రతిపాదకు లగుచున్నారు.
తెలుఁగుననో యట్టిపదవి కర్హుఁడగువాఁడు వేమన యొకఁడే కనఁబడుచున్నాఁడు.
కవనశక్తి పాండిత్యప్రతిభ, యలంకారచమత్కృతి గలకవులప్రశంస యిటఁ బ్రస
క్తము గాదు. భాషాప్రౌఢిమతో నిమిత్తము లేక భావస్ఫూర్తియె ముఖ్య
ముగఁ గొన్నయెడల వేమనకు మించినవా రితరభాషాప్రపంచమునఁ గానరారు;
అఱవమున మహాపండితుఁడును కురళ్‌లో నుండి యుదాహరణముగాఁ బ్రమా
ణములను గైకొనును. తెలుఁగున నేవిద్యాప్రశంసయందు వేమన కవ
కాశము కలుగుచున్నది? భాషా ప్రౌఢిమ లేమి యిందుకుఁ గారణము
కాఁబోలు. ఏవ్యాకరణ ప్రయోగమునకుఁ గాని శబ్దస్వరూపనిర్ణయమునకుఁ
గాని ఛందో వైలక్షణ్యమునకుఁ గాని వేమన నెవ్వరు పలుకుటలేదు. ఎక్క-
డనో యొకనీతిసామెత కావలయు నెడలను సంఘసంస్కరణమునకుఁ బ్రమా
ణము కావలయునెడలను వేమన నాశ్రయింతురు గాఁబోలు. అఱవభాషలో
మహాత్ము లనేకులు బ్రాహ్మణేతరు లైనను బ్రాహ్మణకవివాక్యముల కున్నంత
యాదరము బ్రాహ్మణేతరులకును, అఱవవారు చూపుదురు. అచ్ఛప్రయోగ
ములకు వేమన పనికిరాకపోయినను వేదాంతవిచారములందు వీరి కవకాశ మేల
కలుగఁకూడదు? ఇచ్చటఁ దిరుగ బ్రాహ్మణాబ్రాహ్మణప్రసంగమే కారణ మగును
గాఁబోలు. వేదాంతవిచారముచేయు బ్రాహ్మణుఁడు సంస్కృతగ్రంథమున లేని
తత్త్వరహస్యములో వేమనపద్యములం దేవియున్న వని యడుగును గాఁబోలు.
బ్రహ్మంగారిపాటలు సిద్ధయ్యగారి తత్త్వాలు పాడుచుండు బ్రాహ్మణేతరులు
వేమనపద్యముల కేలప్రాచుర్యము కలుగఁజేయరాదు? గవర్నమెంటు ఉద్యో
గస్థులు రెండవభాషకై తెలుఁగు తీసికొనినవారు బ్రౌనుగారి ప్రతిలోని 'ఎలుక
తోలుఁ దెచ్చి యేఁడాది యుతికిన, నలుపు నలుపెగాని తెలుపు గాదు.' అను
మొదలగు రెండక్షరములమాటలు గలపద్యములు గొన్నియు నొకటిరెండు
తరగతులలోఁ జదువు పసిబాలురు 'మేడిపండుఁ జూడ మేలిమై యుండును.
పొట్టవిచ్చిచూడఁ బురువులుండు' నను మొదలగు వాడుకమాటలు గలపద్య
ములఁ గొన్నిటిని జదువుచున్నారే గాని యేపెద్దపరీక్షకుఁ గాని వేమనపద్య
ముల నియమించుట లేదు. పెద్దపరీక్షలకుఁ బెద్దమాటలేనా ముఖ్యము?

తేటమాటలలోనుండు నుదారభావములు పనికిరావా? ‘పంచిఁ దిన్నవాఁడు పరమయోగి’ ‘తలలు బోడులైనఁ దలఁపులు బోడులా?’ యిత్యాదు లనేకము లొక్కొకటియు నొక్కొకవ్యాసమునకు శీర్షికలుగా నుండఁ దగియున్నవి. వేమన పదవికిఁ దగినప్రాచుర్యమును బాఠమును లేకపోవుటకు గొప్పకారణ మొకటి తోఁచుచున్నది. ఎద్దియన సంశోధితమై సంస్కృతమై సంగ్రథితమగు పూర్ణ ప్రతి లేకపోవుటయె. ఈకాలమున నాంధ్రదేశమునఁ బ్రబలియుండు బ్రాహ్మణేతర సంవిధానమువా రైనను బ్రాహ్మణేతరుఁ డగు వేమన్న నాదరించి యాయన సూక్తముల శోధించి ప్రకటించుట కొకసమితి నేర్పాటు చేసిన నాంధ్రలోకము నకును వేమనగారి ప్రతిభకును దగినగౌరవము కలిగించిన ట్లగును. కాని బ్రాహ్మణేతరమహాసందోహము నలంకరించువారు పలుతెగలవా రున్నందున వేమన తమతెగవాఁ డని యెవ రనుకొనుచున్నారో వారే యీ భారము వహింపవలసివచ్చును గాఁబోలు. భారవాహకు లెవ రైన నేమి వేమనగారి సూక్తముల నిల్పుట ప్రధానము గాన జాతిమతములతో నిమిత్తము లేక యీ సదుద్యమమును నెఱవేర్పవలెను. అందఱు నతివాహకులుగ నుపచరింపఁ దగుదురు.

వేమనగారు కొన్నిస్థలములలో నొకదేవతగా భావింపఁబడి పూజింపఁ బడుచున్నారు. కదిరితాలూకా ప్రాంతములనుండి వేమనదాసరు లని కొందఱు తెలుఁగుజిల్లాలలో సంచరింతురు. వీరి కచ్చటచ్చట, వైష్ణవులకు వీర శైవులకువలె, శిష్యు లున్నారు. ఈవేమనదాసు లితరకాఁపుజనమువలె వస్త్రముల ధరించుకొందురు, గాని, వీరివస్త్రములు పసుపులో ముంచి ధరించిన ట్లగు పడును. ముఖమునఁ దిరుమణియుఁ బచ్చతిరుచూర్ణము దానిపై విభూతిరేఖలవలె సడ్డగీఁతలును ధరింతురు. కొందఱు పాదుకలపై నడతురు. ఇట్టిచిహ్నములచే నీవేమనదాసుల గుర్తింపవచ్చును. వీ రపుడపుడు నెల్లూరుప్రాంతములకు వచ్చు చుందురు. తాము వేమనవంశస్థుల మనియుఁ జెప్పుకొందురు.

ఆయాస్థలములలో వరప్రసాదు లనిపేరువడిన దేవతానామములు మనుష్యులు పెట్టుకొనుచున్న ట్లీవేమనగారిపేరును బెట్టుకొనుచున్నారు. అనఁగా తిరువళ్ళూరు వీరరాఘవస్వామి నిలవేల్పుగాఁ గలవారు ‘గోవిందరాఘవ’ ‘వేంకటరాఘవ’ ‘రామరాఘవ’ యని రాఘవనామము జంటించుకొనినట్లు ‘వేమనారాయణ’ ‘వేమసుబ్బ’ ‘వేమ’ యనుపేర్లు మహాయోగి వేమనయందలి భక్తిచేఁ బెట్టుకొనుచున్నారు.

వేమశబ్ద మేమి? వేము=వేఁపచెట్టు. ఇందుకుఁ బ్రమాణము వేమనయే చెప్పి యున్నాఁడు. 'తినఁగఁ దినఁగ వేము తియ్యనుండు'. బుద్ధునికి 'మహాబోధివృక్షమునకు లంకె యున్నది. ఈయనవలన నావృక్షము మహాబోధి యాయెనో లేక యావృక్షమువలన నీయన బోధిసత్త్వుఁ డాయెనో సర్వజ్ఞు లగు తాథాగతులే నిర్ణయింపవలెను. ఇటులే వటతరువునకును శ్రీదక్షిణామూర్తికిని సంబంధము గలదు. 'చిత్రం వటతరోర్మూలే వృద్ధాశ్శిష్యా గురు ర్యువా' గౌరాంగుఁ డనఁబరఁగు చైతన్యస్వామికి 'నిమాయ్' అను ప్రసిద్ధమైన పేరుగలదు. 'నీమ్' అనఁగా వేఁపచెట్టు, నింబవృక్షము: ఆయనజన్మస్థానమునకును వేఁపచెట్టునకు నేదోసంబంధము చైతన్యచరిత్రకారులు వ్రాసియున్నారు. శ్రీవైష్ణవాళ్వార్లలో నగ్రగణ్యు లగు శ్రీనమ్మాళ్వార్లకును జింతచెట్టునకును దేవరహస్యమును వైష్ణవులు చెప్పుదురు. ఇంగ్లీషువారి పూర్వపితామహులు లగుడ్రూయిడ్లు ఓకువృక్షముక్రిందఁ దపస్సు చేయువారఁట. 'Sage beneath the spreading oak. Sat the drind hoary chief' యీవిధముననే వేమనగారు వేఁపచెట్లక్రిందనే కూర్చుండి బోధ చేయుచుండిరి కాఁబోలు. అందువలన లక్షణావృత్తిచే నీయనకు వేమ యనుపే రేర్పడి యుండవచ్చును. కాఁబట్టి యిత్యాదివిషయములు కూడ వేమననంటి చర్చింపఁదగియున్నవి.

పద్యములలోని యంకితముగూర్చి యొకమాట చెప్పి యీవ్యాసమును ముగించుచున్నాఁడ. వేమన యాత్మపరభేదము లేని సర్వసముఁ డగులోకహితుఁ డగుటచేఁ దనకు సిద్ధించిన తాదాత్మ్యమును బురస్కరించుకొని "ఆత్మనా పూరితం విశ్వ" మ్మనియుండుటచే "వినుర వేమ" యని సంభోదించుటయందుఁ దనకుఁ దానే యుపదేశించుకొనినటులు కనఁబడినను సూక్ష్మవిచారమున జీవబ్రహ్మభేదము లేనందున బ్రహ్మాండమున కంతయు భోధించినవాఁ డగుచున్నాఁడు.

"విశ్వదాభిరామ వినుర వేమ, యనునంకితము విశేషముగాఁ గానవచ్చినను—

౧. "విమలగుణరాజ యోగీంద్ర వేమనార్య".
౨. "వేమా",
౩. "రాజయోగి వేమ",
౪. "విశ్వదాభిరామ యిదియు వినర వేమ".

యిత్యాది మకుటములును గానవచ్చుచున్నవి. విశ్వదాభిరామ వినుర వేమ యనువాక్యమునకుఁ బలువురు పలువిధములుగ నర్థము చెప్పుచున్నారు.

ఎంద తెల్లు చెప్పినను విశ్వదాభిరామ యనుసమాసమునకుఁ దృప్తికర మైన యర్థము కుదిరిన ట్లగపడదు. ఇందులో నేమియో గూఢార్థమున్నట్లు భావించుటయుఁ గలదు. "తందానతానె" యనునట్లేదో యొకభావమును మనసునఁ బెట్టుకొని యాయన పలికి యుండవచ్చును. ఒకవిధమునఁ జూడఁగా నిట్టిమాటలకర్థకల్పనయే చేయ నక్కఱలేదని తోఁచుచున్నది. వేదములనాఁటినుండి ప్రసిద్ధముగ నుండు విశ్వామిత్రశబ్దమునకు నిశ్చితమైన యర్థము నెవరైనను జెప్పిరా. విశ్వ+అమిత్రుఁడా లేక యేదో యపవాదశాస్త్రబలిమిచే "విశ్వా" అనుదీర్ఘరూపము కలిగినదా తీర్మానము గాకున్నది.

శ్రౌతస్మార్తప్రయోగములం దుపయోగింపఁబడు "స్వాహా" "స్వధా" "శ్రౌషట్," వౌషట్" శబ్దనిష్పత్తి యెచటను గనఁబడదు.

శ్రీ ఆండాళ్ దేవిగారు స్వామినిగూర్చి చెప్పిన "తిరుప్పావై" యందు 'ఏలో రెంబాయ్' అని మకుటమున కేమి యర్థమున్నది? ఇట్టివి యర్థములేని పాదపూరణములని కొందఱనుచున్నారు. వీని కెద్దియో క్లిష్టమైన యర్థమును గొందఱు సాధించుచున్నారు. "విశ్వదాభిరామ వినుర వేమ" యనునదియు నర్థసాపేక్షితముగాక కేవలపద్యపూరణమే ప్రయోజనముగా నుద్దేశింపఁబడిన శ్రుతిమనోహర మైనవాక్యముగా నుండవచ్చును. అర్థమే సాధింపవలె నన్న విశ్వ=సమస్తమును (ప్రాపంచిక సర్వస్వమును) ద=ఖండించుటచే, అభిరామ= ఒప్పినవాఁడైన. వేమ=వేమన. వినురా=వినుము. అని యర్థ ముండవచ్చును. విశ్వశబ్దమున కాత్మ యనునర్థము కూడ నున్నది.

అంతరంగమందు నపరాధములఁ జేసి,మంచివానివలెనె మనుజుఁ డుండు
నితరు లెఱుఁగకున్న నీశ్వరుండెఱుఁగఁడా? విశ్వదాభిరామ వినురవేమ. ౧

ఇది త్రికరణశుద్ధమగు సత్ప్రవర్తనను బోధించును.

కులము నీరుచేసి గురువును వధియించి, పొసఁగ నేనుఁగంత బొంకు బొంకి
పేరు ధర్మరాజు పెనువేఁపవిత్తయా, విశ్వదాభిరామ వినురవేమ. ౨

ఇందు బాహ్యార్థము ధర్మపుత్రదూషణము. అంతరార్థము, ఇంద్రియాది జయముచేఁ బునర్జన్మరాహిత్యప్రాప్తి. పెనువేఁపవిత్తనుటలో బాహ్యమున వేఁపవిత్తనమువలెఁ జేఁదయి హేయమగుట, ఆంతరము వేఁపవిత్తు, అనఁగా వేఁగించఁబడినవిత్తనము మొలకెత్తఁజాలదు. అనఁగాఁ బునరావృత్తిరహితము. వేమనగారిపద్యములు గొన్ని పైపద్యములవలె నిగూఢతత్త్వములుగఁ గనఁబడినను సంప్రదాయజ్ఞులు వానికెల్ల సమన్వయ మగునర్థముఁ జెప్పఁగలరు.

ఒంటిస్తంభమందు నొనరఁగంకణ మూను, ఆఱుకంకణముల నమరనిల్వ
అవల దాఁటిచూడ నదిపరమాత్ముఁడౌ, విశ్వదాభిరామ వినుర వేమ. 3

కుండలినీవిద్యను బోధించుచున్నది.

పలికి బొంక లేక భల్లాణరాజప్డు,పణఁతిఁ గూర్చి యిచ్చెఁ బరున కతఁడు
బాళిమీఱఁ దుదకు బాలుఁడై యుండెరా, విశ్వదాభిరామ వినుర వేమ. ౪

ఇందలికథావృత్తాంతము వీరశైవు లెఱుఁగుదురు.

గండికోటలోనఁ గత్తిఁబట్టినయంత, రాజుగారి దొడ్డరౌతు గాఁడు. ౫

ఇది–వేమన సమకాలీనుఁడగు నొకప్రగల్భపురుషుని విషయముగఁ దోఁచుచున్నది.

ఒరులకొఱకు భూమి నొరసెడువారును, అవనిపతికి వశ్యులయినవారుఁ
బాలవంటికులముపన్నుఁ బెట్టినవారు, వాక్కెఱుఁగరు కాఁపువారు వేమ. ౬

యని స్వజాత్యుత్కర్షమును దెలిపినాఁడు.

వాగు లడ్డగట్టి వలకాడులనుదున్ని, మున్ను నడచుత్రోవ ముల్లుగొట్టి
మైసుపెట్టినట్టి పాపులు గలరొకో, విశ్వదాభిరామ వినుర వేమ. ౭

వేమనకాలమునఁగూడ నిట్టికంటకు లుండిరి.

కాంతసిందురంబు కడుపిత్తవ్యాధికి. ౮

ఇది వైద్యవిషము. ఇట్టి వెన్నియో గలవు.

వెన్నెల నిలుచుండి వేఁపాకుపడ వేసి, యడ్డసరపురసము నందుఁబోసి
కరఁగ రాగియుమఱి కాంచనంబగునురా, విశ్వదాభిరామ వినుర వేమ. ౯

ఇది రసవాదవిషయము. ఇట్టి విషయము లనేకములు గలవు. బంగారు బహుసులభ మగును.

వంగోలు వేంకటరంగయ్య.

# అలంకారవిషయము.

శ్రీమంతం బై యత్యున్నత మగుసారస్వతవైభవశోభితం బగు నీభరత ఖండంబున నవీనముగా నాంగ్లసారస్వతము, ప్రాభవముమీఱఁ బ్రవేశించి దేశీయసారస్వతప్రక్రియయందుఁ గూడ మార్పులు పుట్టింప నీదేశస్థులహృదయములందుఁ బలువిధము లగువికారములఁ గల్గించుచున్నది. మనసారస్వత భాండారమున లేనిక్రొత్తవిశేషము లేవైన నితరసారస్వతభాండారములయం దున్నచో వానిని సంపాదించుకొన మనము సర్వవిధములఁ బ్రయత్నము చేయవలసినదే! కాని నాగరకత యంతయుఁ బాశ్చాత్త్యులదే యనియు మనదంతయు ననాగరకతయే యనియు మననవమేధావులు భావించి యన్నింట మనపూర్వుల బుద్ధివిభవమును బోనాడి పాశ్చాత్త్యులమార్గములనే స్వీకరింపఁ బ్రయత్నించుట మాత్రము కడుశోచనీయము. మనసంస్కృతసారస్వత మనాదిఖ్యాతికలది. కావ్యకల్పనమందు బహువిధాభివృద్ధుల నందినది. ఇందలి యలంకారశాస్త్రము మన పెద్దలబుద్ధిసూక్ష్మతను జాల వెల్లడి చేయుచున్నది. పాశ్చాత్త్యు లీవిషయములో నంతగాఁ బనిచేసి యుండ లేదు. ఐనను హూణవిద్యనభ్యసించు మననవనాగరకులు మనసారస్వతవైభవము నంతను ద్రోసిరాజని హూణులక్రమము ననుకరింపఁ బాటుపడుచున్నారు. ఆక్రమము నైనను వీరు సరిగఁ దెలిసికొని యుండ లేదు. అందులో నలంకారములమీఁదికి వీరు హెచ్చుగా దాడి వెడలుచున్నారు. ఈవిషయములలో వీరికి హూణులకుఁ గూడ లేనివింతయూహలు చాల కలుగుచున్నవి. కావ్యమున కలంకారము లనవసరము లనియు నవి లేకయు నయ్యది హెచ్చుగా శోభించు ననియు వీరితలంపు. కొందఱు హూణవిద్యానిపుణుల మనుకొనువా రలంకారములు బాధలు గలిగించుచున్న వని సరస్వతిచే నేడ్పించుచున్నారు. మఱికొందఱు మమ్మటాదిపూర్వలాక్షణికులు కూడఁ గావ్యమున కలంకారము లనవసరము లని నుడివినట్లు వాదించుచున్నారు. ఇఁకఁ గొందఱు మంచి శ్లోకము లన్నియు నలంకారములు లేనివిగానే యున్న వని వ్రాయుచున్నారు. ప్రస్తుతమున నలంకారములపై దాడి హెచ్చుగా నున్నది. కాన నీసారస్వతసభలో వానింగూర్చిన చర్చ యవసరమైనది.

ఈవిషయములోఁ బూర్వులయభిప్రాయ మేమి?

మనము ముందుగా విచారింపవలసినది మనపూర్వులయభిప్రాయము. విజ్ఞులగుమనపెద్ద లీవిషయములో నేమిచెప్పిరో ముందుగాఁ జూచుకొందము. మనవారే కాక యితరు లీవిషయమై యేమి తలంచుచున్నారో తెలిసికొనుట యుచితము కావున నదియు విచారించుకొందము.

కావ్యలక్షణమును జెల్పుటలో సాధారణముగా మనవా రెల్లరును "అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య" మ్మనులక్షణము నే తెల్పుచు వచ్చిరి. ఇందుకుఁ గొన్నియుదాహరణముల నిచ్చుచున్నాను.

"నిర్దోషం గుణవత్కావ్య మలంకారై రలంకృతమ్
రసాత్మకం కవిః కుర్వన్ కీర్తిం ప్రీతించ విందతి." (-భోజుఁడు)

"సాధుశబ్దార్థసందర్భం గుణాలంకారభూషితమ్ । స్ఫుటరీతిరసోపేతం కావ్యం కుర్వీత కీర్తయే" (-వాగ్భటుఁడు) "కావ్యశబ్దోయం గుణాలంకార సంస్కృతయో శ్శబ్దార్థయో ర్వర్తతే" (-వామనుఁడు) "అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య మితి కావ్యసామాన్య లక్షణమ్ (-ప్రతాప రుద్రీయము) "కావ్యం హ్యదుష్టౌ సగుణౌ శబ్దార్థౌ సదలంకృతీ" (-కావ్య దర్పణము) "సగుణాలంకృతీ కావ్యం పదార్థౌ దోషవర్జితౌ"(-సాహిత్యరత్నా కరము) "అదోషౌ సగుణౌ సాలంకారౌ చ శబ్దార్థౌ కావ్యమ్"(-హేమ చంద్రుఁడు)

ఆంధ్రలాక్షణికులు:-"తదదోషౌ పరిష్కృతౌచ వాగర్థౌ(ఆంధ్రశబ్దచింతామణి)

గీ. ఇంకఁ గావ్యస్వరూపంబు లేర్పఱింతు, విగతదోషంబులును గుణాన్వితములధిక
లసదలంకారభావోపలక్షితములు, నయినశబ్దార్థములు కావ్యమనఁగఁ జెలఁగు
(-నరసభూపాలీయము)

గీ. కృతికి నెప్పుశబ్దార్థముల్ రెండువలయు, నవి యలంకారయుతములు నఖిలదోష
రహితములు గాఁగఁ జూచి కూర్పంగవలయు. (-అప్పకవీయము)

ఇన్ని యుదాహరణము లేల యిచ్చితి వందు రేని మనదేశమునందలి రసికులమనసులం దలంకారవిషయములో నేరీతితలంపులు గలవో చదువరులకు బోధపడుటకు నిచ్చితిని. వీనింబట్టి చూచిన నించుమించుగా నందఱును సాలంకారత కావ్యలక్షణములో నుండి తీరవలయు నని యొప్పికొని నట్లు తేలుచున్నది.

కావ్యప్రకాశకారమతము.

కావ్యప్రకాశకారమత మీవిషయములో భిన్నముగా నున్నట్లు కొందఱు తలంచుచున్నారు. అతఁ డించుక లక్షణమును మార్చిన మాట సత్యమే! ఐనను దద కాతనితలంపుకూడ పైరీతిదె! అతఁ డిట్లు నుడివియున్నాఁడు:—

"తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునః క్వాపి" దీనిం బట్టి యొకానొకచో నలంకారము లేకపోయినను గావ్యత్వహాని లేదని చదువఁగనే తోఁచును గాని యది సత్యము కాదు. చదువరు లట్లు తలంపకుండఁ జేయుటకే పైవాక్యమునకు గ్రంథకర్తయే యీక్రిందిరీతిని వ్యాఖ్యానము వ్రాసియున్నాఁడు.

"క్వాపీ త్యనే నైత దాహ యత్సర్వత్ర సాలంకారౌ క్వచిత్తుస్ఫుటాలంకార విరహేపి న కావ్యత్వహానిః"

అంతటను నలంకారము లుండవలెను గాని యెచ్చటనైన నొక్కచోట నాయున్నయలంకారము స్ఫుటముగా లేకపోయినను గావ్యత్వహాని లేదు. అని దీనిభావము. దీనింబట్టి మమ్మటభట్టు తలంపునఁ గూడ నలంకార మున్నదే కావ్య మని తేలుచున్నది. ఉన్నయలంకార మస్ఫుటమా-స్ఫుటమా యను భావమే కాని యలంకారమే యక్కఱలే దనుభావము లేదు.

మఱియును నస్ఫుటాలంకారతకు మమ్మటుఁ డీక్రింది శ్లోకము నుదాహరణముగా నిచ్చియున్నాఁడు.

"యః కౌమారహర స్స ఏవ హి వరస్తా ఏవ చైత్రక్షపా
స్తే చోన్మీలితమాలతీసురభయః ప్రౌఢాః కదంబానిలాః
సా చైవాస్మి తథాపి తత్ర సురతవ్యాపారలీలావిధౌ
రేవారోధసి వేతసీ తరుతలే చేత స్సముత్కంఠతే".

ఈశ్లోకమునందు నలంకారములు లేకపోలేదు.

(౧) విశేషోక్తి (౨) విభావనాలంకారము, ఈరెండును నిందుఁ గలవు, గాని, యస్ఫుటముగా నున్నవి, కావుననే గ్రంథకర్త—

"అత్ర స్ఫుటో న కశ్చి దలంకారః" అని వ్రాసినాఁడు. అస్ఫుటముగా నున్న వని యర్థము. వ్యాఖ్యాతయు నిట్లు వ్రాసియున్నాఁడు. "అత్రవరాది సామగ్ర్యాం సత్యామ ప్యుత్కంఠాలక్షణ కార్యానుత్పత్తి రితి విశేషోక్త్యలంకారః నచాస్ఫుటః। కార్యానుత్పత్తికోఽచ రకథనాత్ రేవాతీరే చోక్తకారణాభావో ప్యుత్కర్షోత్పత్తి రితి విభావనాలంకారః సాప్యస్ఫుటః। రేవారోధసి

సామగ్ర్యభావకోటే రవర్ణనాత్—ఇట్లే పల్వురు లక్షణకారులు చెప్పియున్నారు. కావున "అనలంకృతీ పునః క్వాపి" అనుదానింబట్టి యలంకారము లవసరము లే దని యర్థము చేసికొనరాదు. ఈలక్షణమును లక్షణకారులు పల్వురు చెప్పిరి. వారెల్లరును గావ్యమున కలంకారము లుండితీఱవలె నని యు లక్షణములో "సాలంకారౌ" అనువిశేషణ ముండవలయు ననియు నొక్కి వక్కాణించియున్నారు. విద్యాభూషణుఁడు తనసాహిత్యకౌముదిలో నిట్లు వ్రాసియున్నాఁడు.

"త దదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునఃక్వాపి" ఇది కావ్యప్రకాశలోని వాక్యమువలెనే యున్నది గదా! ఇఁక దీనికి గ్రంథకర్త యే యిచ్చిన టీకం గనుఁడు!—

"దోషశూన్యం, సగుణం సాలంకారం, శబ్దార్థయుగళం, తత్కావ్యమ్".

దీనినిబట్టి చూచిన సాలంకారత యుండవలె ననినవారిమతముకంటె "అనలంకృతీపునః క్వాపి" అను వారి మతము భిన్నము కా దని తేలుచున్నది. ఈవిషయమును గావ్యదర్పణకారుఁ డిట్లు స్పష్టము చేసియున్నాఁడు.

"నను ప్రతిబంధకదోషాభావే అభివ్యంజకగుణసత్త్వేచ రసాభివ్యక్తేః పుష్కలత్వాత్ సాలంకారత్వవిశేషణం వ్యర్థం తదుక్తం గోపాలస్వామినా", దోషహీనం గుణాదానం కర్తవ్యం నియమాత్కృతౌ । కామచారఃపునః ప్రోక్తో లంకారేషు మనీషిభి రితి తథా ముఖ్యా మహాకవిగిరామలంకారభృతా మపి ప్రతీయమానా చ్ఛాయైవ భూషాలజ్జేవ యోషితా మితి ధ్వనికారికాయా మపి శబ్దేనాలంకారాణా మనాస్థావ్యతే తజ్జస్మాత్ సాలంకారత్వవిశేషణ మయుక్త మితి చేన్న—శబ్దాలంకారాణా మర్థాలంకారాణాంచ యథాయథం రసాభివ్యంజకశబ్దార్థోపస్కారకత్వే నాలంకారత్వా దుపస్కారకాభావేచ న రసాభివ్యక్తిపౌష్కల్య మితి సాలంకారత్వ మావశ్యకమ్ । ఉక్తవచనద్వయంచ స్ఫుటతరాలంకారానాస్థాపదమ్ । నన్వేవ మపి యః కౌమారహరః &c.

కావ్యదర్పణకారుఁడు కవితకు సాలంకారత యుండ వలె నని చెప్పి మమ్మటుఁడు "అనలంకృతీ పునః క్వాపి" అని వ్రాసియుండెఁ గదా! ఆరీతినే గోపాలస్వామియును ధ్వనికారుఁడును వ్రాసిరి కదా! దోషములు లేకుండుట గుణములు కలిగియుండుట యుండిన రసపౌష్కల్యము కలుఁగును గదా! ఇఁక

సాలంకారత్వవిశేషణ మెందు కని శంకించుకొని రసపౌష్కల్యమునకు నలంకారము లవసరము లనియు మమ్మటాదులు కొన్నిచోట్ల స్ఫుటతరాలంకారము లేకుండినను హాని లేదనిరే కాని యలంకారములే యనవసర మని వ్రాయలే దనియును గావునఁ గావ్యలక్షణములో సాలంకారత్వవిశేషణ ముండితీరవలసిన దే యనియు నుడివి యున్నాఁడు.

## ఆంధ్రలక్షణకారుల మతము.

ఈవిషయములో నాంధ్రలక్షణకారు లేమి చెప్పుచున్నారో చూతము. అహోబిలపతి యిట్లు వ్రాసియున్నాఁడు:—

"నను తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునః క్వాపీతి కావ్యప్రకాశలక్షణే కథమనలంకృతీతి విశేషణముక్త ఇతిచేత్, క్వచిత్ స్ఫుటాలంకారవిరహేపి నదోష ఇతి తదర్థత్వేన తద్విశేషణం నదోషాయేతి యుక్తమేవ సాలంకారత్వకథనం వాగర్థయోః"

అనలంకృతము లనఁగా నస్ఫుటాలంకారసహితము లనియే యర్థము కాని యలంకారములే లేకుండుట యర్థముకా దని మమ్మటభట్టుతలంపు కావున సాలంకారత్వవిశేషణ ముండితీరవలసిన దే యని దీనితాత్పర్యము.

పైదాని నంతను బట్టి చూచిన నలంకారము లవసరము లేదనుతలంపు కావ్యప్రకాశకారునకు లే దని యాతనిమాటలను బట్టి యును నితరులవ్రాఁతలను బట్టియును గూడఁ దేలుచున్నది. కాన మమ్మటభట్టుమతము కూడఁ గావ్యలక్షణములో సాలంకారత్వవిశేషణ ముండితీరవలయు ననుదానిలోనే చేరుచున్నది.

కావ్యప్రకాశకారోదాహృతశ్లోకముంగూర్చి:—ఇఁకఁ గావ్యప్రకాశకారుఁ డుదాహరించిన యః కౌమారహరః అనుశ్లోకమునందు నలంకార మెట్లున్న దనువిచారమును జేయుదము.

మమ్మటభట్టుశ్లోకమునందు నలంకారములు లే వన లేదు. ఉన్నయలంకారములు స్ఫుటముగా లే వనినాఁడు. అది యటు లుండ నీమతము నందఱు నంగీకరింప లేదు. వారివీరిమాట యెందుకు? మననవమేధావులు మెచ్చుకొనుచున్న సాహిత్యదర్పణకారుఁడే యీశ్లోకమునందు నలంకారము స్ఫుటముగానే యున్న దని వ్రాసియున్నాఁడు. ఆతనివాక్యముల నీక్రిందఁ నిచ్చుచున్నాను.

"యత్తు క్వచి దస్ఫుటాలంకారత్వే ఉదాహృతం—యః కౌమారహరః—ఏతచ్చింత్యం అత్రహి విభావనావిశేషోక్తిమూలస్య సందేహసంకరాలంకారస్య స్ఫుటత్వం"

సాహిత్యదర్పణవ్యాఖ్యాత యగురామచంద్రతర్కవాగీశభట్టాచార్యులవారును నీవిషయమై యిట్లు వ్రాసిరి.

"ఉత్కంఠాయాః పత్యాద్యభావరూపకారణం వినా ఉత్కంఠారూపకార్యకథనమి తీయం విభావనా— —కిం వా ఉత్కంఠాభావస్య కారణసత్వే తస్యాః కథన మితి విశేషోక్తి రితి సందేహాత్. సందేహసంకరాలంకారోయం."

మఱియును నిందున్న హారః వర మీలితమాలతీ మున్నగుశబ్దాలంకారములం గూర్చి వ్యాఖ్యాత యిట్లు వ్రాసినాఁడు.

"తేనచ రసోపకారతయా తస్యాలంకారత్వ మవ్యాహతమేవ."

కొంద ఱీశబ్దాలంకారములు రసోపస్కారకములు కావని వ్రాసిరి కాని మఱికొందఱు పైరీతిగా రసోపస్కారకమే యనిరి. ఏమయిన నేమి? పైశ్లోకమునందు శబ్దాలంకారార్థాలంకారములు రెండును గూడఁ గలవు. అలంకారము స్ఫుటముగా లేదని యొక శాస్త్రకారుఁడు వ్రాసియుండఁగా నవనాగరకులే ప్రమాణముగాఁ దీసికొనిన మఱియొక శాస్త్రకారుఁ డిందలి యలంకారములు స్ఫుటముగానే యున్నవని నొక్కి వక్కాణించుచున్నాఁడు. కావునఁ బైశ్లోకమునందు నలంకారములు లేవనుట కెవరికిని శక్యము కాదు.

"రసస్యహి ప్రాధాన్యా న్నాలంకారతా" అన నేమి?

మమ్మటభట్టు "యః కౌమారహరః" అనుశ్లోకము నెత్తుకొని "అత్ర స్ఫుటో న కశ్చి దలంకారః—రసస్యహి ప్రాధాన్యా న్నాలంకారతా" అని వ్రాసియున్నాఁడు. ఈవాక్యములకుఁ దిన్నఁగా నర్థము చేసికొనఁజాలక "ఇందు రస మున్నది అలంకారము లేదు అని దీనిభావ" మని యొకరు వ్రాసిరి. ఇది యసమంజసము. "రసస్యహి ప్రాధాన్యా న్నాలంకారతా" యన రసమున్నది అలంకారము లేదు అని యర్థము కాదు. "యః కౌమారహరః" అనుశ్లోకములో నేయలంకారమును స్ఫుటముగా లేదని వ్రాసి రస మీశ్లోకమునఁ బ్రధానముగా నున్నదికదా! యప్పుడు రసవదలంకార మిందు స్ఫుటముగా నున్నదని యేల తెల్పరాదని మనసున శంకించుకొని యాశంకకు సమాధానముగా "రసస్యహి ప్రాధాన్యా న్నాలంకారతా"అని వ్రాసినాఁడు. ఇందు రస

"శబ్దార్థయో రస్థిరా యే ధర్మా శ్శోభాతిశాయినః ।
రసాదీ నుపకుర్వంతో లంకారా స్తేంగదాదివత్ ॥"

దీని వ్యాఖ్య—"యథా అంగదాదయః శరీరశోభాతిశాయినః శరీరిణ ముపకుర్వంతి తథానుప్రాసోపమాదయః శబ్దార్థశోభాతిశాయినో రసాదే రుపకారకాః."

అలంకారములు శోభాతిశయములు కలిగించు ననునది యొకమతము. వీనిప్రయోజన మింతకంటెను ఘనమైనది కలదు. అది యేది యన విషయమును బాగుగా హృదయమునకు నాటునట్లు చేయుట. ఉపమాదు లిట్టిభావపుష్టిని గలిగించును. కావుననే బెయిర్ దొరవారి ట్లలంకారములంగూర్చి వ్రాసిరి.

"A figure of speech is a deviation from the plain and ordinary mode of speaking, with a view to greater effect."

సాధారణముగా లోకములో మాటలాడు ఋజుమార్గముకంటె భిన్నముగా నుండుమార్గ మలంకార మనిపించుకొనును. ఈ చిక్కుల యన; మనస్సునకు హెచ్చుగా నాటుట కని దీనిభావము. అలంకారమునం దీఘనత యున్నది. బెయిర్ దొరవా రుపమలం గూర్చి వ్రాసి యుపమలు సుస్పష్టము గానివిషయము సుస్పష్టము చేయుటకు వినియోగించు నని వ్రాసిరి. ఇందుకు మెఘస్ దొరవా రంగీకరింపక యిట్లు వ్రాసిరి.

"These similes are intended, not to make the object described clearer, but more interesting."

ఈయుపమలు వర్ణితవిషయమును నెక్కుడుగా స్పష్టముచేయుట కుద్దేశింపఁబడలేదు. మ ఱెందు కన విషయమును మఱింత మనోహరము చేయుట కని దీనిభావము. మనవారును గొంద ఱిట్లే యలంకారము లింపునుగల్గించు నని చెప్పిరి. ప్రతాపరుద్రీయకారుఁడు "అలంక్రియ తేనేనేతి చారుత్వహేతురలంకారః" అని వ్రాసినాఁడు. పరికించి చూడ బెయిర్ దొరవారు చెప్పినదియును మెఘస్ దొరవారు చెప్పినదియును గూడ సత్యములే. కావ్యములే కాక శాస్త్రములు గూడ నలంకారములతో శోభించుచున్నవి. అలంకశాస్త్రకారులు "శబ్దార్థయోరస్థిరా యే ధర్మాశ్శోభాతిశాయినః రసాదీ నుపకుర్వంతో లంకారా స్తేఙ్గదాదివత్ ।" అని వ్రాసిరి. ఇం దీయుపమ యెందుకు? ఇది విషయబోధ చేయుశాస్త్రము కాని కావ్యము కాదు కదా! ఇచట నలంకారమేల

తెల్పఁబడిన దనఁ జదువరులహృదయములకు విషయము మఱింత స్పష్టముగా నాటునట్లు చేయుట కని మనము గ్రహించుకొనవలయును.

ఇంకను దగినతావులఁ దగురీతిగా నున్నయలంకారముల నచ్చోటనుండి తీసివేసిన భావౌన్నత్యము చెడు నని యింగ్లీషుశాస్త్రకారులే వ్రాసిరి. ఈ విషయమై పెఫర్డుదొరవా రిట్లు వ్రాసిరి.

"Figures are employed to give greater energy and beauty to language and the removal of a figure which is properly employed must therefore mean a distinct loss of energy or beauty or both."

మనప్రాచీనులు కొందఱ అలంకారములకు నప్రధానతను దెల్పిరి కాని యది రసప్రాధాన్యతను జూపుటకుఁ గాని యలంకారము లవసరము లే దని నిరసించుటకుఁ గాదు.

## ఇప్పటివారియూహలు.

హూణు లలంకారప్రియులే. వా రలంకారముల మనకంటెను దఱుచుగా వాడుచుందురు గాని హూణవిద్య నభ్యసించెడు మన వారిలోఁ గొందఱకిప్పు డలంకారములు రుచించుట లేదు. ఎందుచేత? అవి రసపుష్టిని గలిగింపకుండుటనా? కాదు — భావమును బాగుగా సువ్యక్తము చేయకపోవుటనా? కాదు — మనోహరముగా నుండకయా? కాదు — మఱెందు కనినఁ దాము చదివిన యింగ్లీషు గ్రంథములలో నలంకారముల ప్రాముఖ్యత నొక్కి చెప్పఁబడకుండుటచేత. ఇదియే కారణము.

రసికాగ్రణులారా! పాశ్చాత్త్యు లితరవిషయములలోఁ జాల ఘనులే కావచ్చును. కానిఁ యలంకారవిషయములో నంతగాఁ బనిచేసినవారు కారు. ఈవిషయములో వారికృషి మిక్కిలి తక్కువ. వారిలో శబ్దాలంకారార్థాలంకారములు కలిసి ముప్పది నలువదికంటె హెచ్చుగా లేవు. మనలో నన్నో కువలయానందముంబట్టి కూడ నొక్కయర్థాలంకారములే నూటయిఱువది నలుకును గాన్పించుచున్నవి. వీనికి శబ్దాలంకారములు చేర్చిన సంఖ్య చాల హెచ్చయిపోవును. పాశ్చాత్త్యులు కూడ నర్థాలంకారములలో నంతర్భేదముల విశేషముగఁ గల్పించుకొనిరి. వాని నన్నిటిని లెక్కలోనికిఁ దీసికొనిన సంఖ్య హెచ్చును గాని యెట్లు చూచినను మన హైందవబుద్ధి యీవిషయములోఁ బని చేసినంత పాశ్చాత్త్యులబుద్ధి పనిచేసి యుండ లేదు. మనవా రతిసూక్ష్మబుద్ధితో ననేకరహస్యములను గనిపెట్టిరి. ఈసందర్భములో మనవాదు వినియోగించిన

సూక్ష్మబుద్ధిని పాశ్చాత్యులు కూడఁ జాల మెచ్చుకొనుచున్నారు. మోనియరు విలియమ్సు దొరవారు తాము వ్రాసిన "హైందవజ్ఞానము" (Indian Wisdom) అను గ్రంథములో నలంకారములవివరించుటలో హిందువులు చూపిన బుద్ధికుశలతను వర్ణించి యీసూక్ష్మజ్ఞాన మైరోపీయులకు లేదనియు నయ్యది మిక్కిలి యద్భుతమైన దనియు నుడివి యుండిరి. ఎన్సైక్లోపిడియా బ్రిటానికాలోఁ గూడఁ గొంత మెప్పు కలదు. మనవమేధావులు పాశ్చాత్యులనుగూడ మించి మనయలంకారశాస్త్రములను ముట్టడించుచున్నారు. ఇది పెద్దవింత. పాశ్చాత్యులలోఁ బ్రధానము లగునలంకారములు పదునాలు మాత్రమే కలవు కావున వారు ప్రతిపద్యమునందును నలంకారమును జూపరు. అలంకారము లేకమే మనోహరము లగుపద్యములు కల వని తలంతురు కాఁబోలు. వా రలంకారములు లేవనుకొనిన పద్యములలో నలంకారము లుండకపోవు. వా రాయలంకారభేదములను గనిపెట్టి యుండలేదు. కాన నలంకారము లేదనుకొందు రని తోఁచెడిని. మనవా రన్ననో సూక్ష్మబుద్ధి మెఱయ శతసంఖ్యాకము లగునలంకారములు గనిపెట్టిరి. కావున మనోహరము లగుపద్యములం దన్నిటియందును వీరు మంచియలంకారములఁ జూపఁగలరు. మనవారి పరిగణనములో లేక హూణుల పరిగణనములో మాత్ర మున్నయలంకారములును గలవు.

ఒకరు మమ్మటాదులు తనివి తీరఁ బొగడి యుదాహరించిన యుత్తమశ్లోకము లన్నియును ననలంకృతములుగానే యున్న వని వ్రాసిరి! ఇది మహాసాహసము! మమ్మటాదు లలంకారము లంతటను నుండితీరవలె నని విధించిరి. (సర్వత్ర సాలంకారా) మమ్మటాదులు తాము కావ్యములలో ననలంకృతత్వమునకుఁ గ్వచిత్తుగా నవకాశమిచ్చితి మని నొక్కి చెప్పుచుండఁగా నిట్టివా రలంకారములు లేనిశ్లోకములనే, తనివితీఱఁ బొగడి రనుట యసంగతము కా కుండునా! వీరు తాము కంఠోక్తిగాఁ జెప్పిన ధర్మమునకు విరుద్ధముగా నడిచి రనుట యుచితమా? అట్లు చేసినవారు ప్రామాణికు లగుదురా? మమ్మటుఁ డస్పష్టాలంకారతకుఁ గూడఁ గొంత తావిచ్చెను, దానిని మనవా రంద ఱంగీకరింపలేదు. కవిబ్రహ్మయని పేరొందిన తిక్కన సోమయాజి భారతములో "విషమకావ్యంబునుం బోలి యస్పష్టాలంకారంబై" యని వ్రాసి యస్ఫుటాలంకారతయందుఁ దనకుఁ గలయరుచిని వెల్లడించె. అస్ఫుటాలంకారతనే, మనవా రిట్లు నిరసించుచుండఁగా నలంకారములు లేనిశ్లోకములనే, మనపూర్వులు మెచ్చి రనుట పెద్దవింత గాదా?

ఇఁక నొకనవమేధాసంపన్నుఁడు కావ్యమున కలంకారము లవసరము లేవని యు శాకుంతలమునందలి శ్లోకచతుష్టయమునం దలంకారములు లే వని యు సాహసించి వ్రాసె. ఇది యన్నిటినిమించిన సాహసము! ఆశ్లోకములలో నొకఁ డెత్తికొనినశ్లోకము నిచ్చి దానియందలి యలంకారమునుగూర్చి చర్చించు చున్నాను.

"పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మా స్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా భవ త్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్"

ఈశ్లోకమునం దలంకారము లే దఁట! ఇందు లేకున్న నిఁక నలంకార మెచట నుండును? తాను బెంచి పెద్దదానిని జేసిన శకుంతలను భర్తయింటికిఁ బంపఁబోవునప్పుడు కణ్వుఁ డుద్యానవనమునం దున్న చెట్ల నుద్దేశించి పలికిన పలుకు లివి! ఓవృక్షములారా! మీకు ముందు నీరుపోయక యెవతె ముందుఁ

---

ఉ. ఏయమ మున్ను తా నుదక మెన్నఁడుఁ గ్రోలదు మిమ్ముఁ గ్రోల్చి కా
కేయమ గూర్మి మీచిగురు నీప్సితభూషణయయ్యు ద్రుంపఁబో
దేయమ మీను తొల్త నన లెత్తఁగ నెంతయు సంతసించుఁ దా
నీయమ యేగు నేఁడు పతియింటికి నంద అనుజ్ఞ యీయరే.

ఉ. ఉల్లము నేఁడు బెంగగొని యుండె శకుంతల వెళ్లునంచుఁ గ
న్నీళ్లు నడంప గద్గదిక నిండె వగన్ జడమయ్యెఁ జూడ్కి పెం
దల్లడ మార మాదృశవనస్థునకే యిటుపుట్టె నెంత చిం
తిల్లుదురో గృహస్థు లవనిం గనిపెంచినకూఁతు నంపుచోన్.

ఉ. మాదుతపోధనత్వమును మానుగ నీదు కులోన్నతత్వమున్
నీదెస నీమె తా నగుచు నిల్పిన కూర్మియు నాత్మనెంచి, తు
ల్యాదరమొప్పఁ జూచుకొను మందఱు భార్యలలోన నీమె నా
మీఁదను దానిభాగ్య మది మేము వచింపఁగఁ గూడ దేమియున్.

చం. గురులభజింపు నింపు చెలికూర్మి సపత్నులవంకఁ గాంతుఁ డెం
తయు మఱఁ జేసినం గినుక సంకిలి వోవకు కొల్చువారిపైఁ
గరుణ దలంపు భాగ్యములు గల్గినఁ ద్రుళ్లకు మెప్పు నిత్తెఱం
గిరవగు టొప్పు గేహినుల కింటికిఁ జేటిటు గానిజవ్వనుల్.

(అ. కవిరాజు, న. నీలాద్రిరాజుగారు.)

దాను నీరుత్రాగెడిది కాదో; తాను జివుళ్లు మున్నగువాని నలంకరించు కొనుట కిచ్చగలిగిన దయ్యును మీయందుఁ గలిగియున్న స్నేహభావముచేత మీకు నొప్పి కలుగునేమో యని మీచివుళ్లను నెవతె కోయదో మీకు మొద టఁ బుష్పోద్గమము గలిగినప్పుడు తనకుఁ బెద్దయుత్సవముగా నెవతె యెంచు కొనునో; యట్టిశకుంతల యత్తవారియింటికి వెళ్లుచున్నది. మీ రందఱు ననుజ్ఞ యీయవలసినది యని దీనిభావము. ఇట్టిరమ్యతమ మగుశ్లోకమునందే యలం కారము లేకుండిన నిఁక నయ్యది నిలుపఁగలిగిన తా వెయ్యది? ఇందు మంచి యలంకారమే కలదు! దానికి సమాసోక్తి యని పేరు. ఈవిషయమై వ్యాఖ్యాత యగుగాఘవభ ట్టిట్లు వ్రాసియున్నాఁడు.

"చేతనవ్యవహారసమారోపాత్ సమాసోక్తిః"

అచేతనములందుఁ జేతనవ్యవహారసమారోపణము చేయఁబడినది కాన నిం దున్నయలంకారము సమాసోక్తి యని దీనిభావము. తమచెలికత్తె తమ్ము విడిచి పోవునప్పు డది తెలిసికొని యనుజ్ఞ నీయఁదగినవారు జ్ఞానము గలమాన వులు. చెట్ల కాశక్తి యుండదు. ఇట మానవధర్మము చెట్లయం దారోపింపఁబడి నది. ఇట్టితావులఁ బాశ్చాత్యపండితులు పెర్సానిఫికేషన్ (Personification) అను నలంకారము కల దందురు. ఈయలంకారమును బాశ్చాత్యులు ఘనాలం కారముగా నెంచుచున్నారు. ఈయలంకారరాజముం గూర్చి షెఫర్డుదొరవా రిట్లు వ్రాసిరి.

*Personification* is that figure by which, under the influence of strong feeling we attribute life and mind to impersonal and inanimate things; as "Death is swallowed up in victory. *O Death*! where is thy sting?"

"There is a wonderful proneness in human nature to animate all objects; almost every emotion, which in the least agitates the mind, bestows upon its object a momentary idea of life. Let a man, by an unwary step, sprain his ankle or hurt his foot upon a stone, and, in the ruffled discomposed moment, he will sometimes feel himself disposed to break the stone in pieces, or to utter passionate expressions against it as if it had done him an injury. If one has been long accustomed to a certain set of objects which have made a strong impression on his imagination, as to a house where he has passed many agreeable years, or to fields, and trees, and mountains, among which he has often walked

with the greatest delight: when he is obliged to part with them, especially if he has no prospect of ever seeing them again, he can scarce avoid having somewhat of the same feeling as when he is leaving old friends. They seem endowed with life. They become objects of his affection and in the moment of his parting, it scarce seems absurd to him to give vent to his feelings in words and to take a formal adieu"—BLAIR.

దీనింబట్టి చూచినఁ బాశ్చాత్యు, లేతావున పెర్సానిఫికేషన్ (Personification) (సమాసోక్తి) అను నలంకార ముండు నని చెప్పిరో యయ్యది యిచట సరిగా సరిపోయి యున్నది. ఇట్టితావున నీయలంకార ముండుట సహజ మనియు నయ్యది రసపుష్టిని జాలఁ జేయు నని యుఁ దేలినది. మఱియును బాశ్చాత్యులు పదునాఱలంకారములు ముఖ్య మగు వానిని గా నెంచి రని యిదివఱకే తెల్పితిని. వానిలో నీపెర్సానిఫికేషన్ ఒకటి యైయున్నది. ఇట్టిముఖ్యాలంకారములు గలతావుల నే మననవమేధావు లలంకారము లేనిదానినిగాఁ దలంచుట పెద్ద వింత గాకుండునా! మననవమేధావుల మార్గము సరిగ పాశ్చాత్యులమార్గము నైనఁ బోలియున్నదా? లేదు.

ఈశ్లోకరాజముం గూర్చి మననవమేధావు లిట్లు వ్రాయుచున్నారు!

"నేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్"

అని కణ్వుఁ డాక్రోశించిన ప్రభారవాక్య మిప్పటికి సైతము మనహృదయముల ననంతభారముగాఁ గదలించుచున్నది. ఆహా! ఈపద్య మెంతహృద్య మైనదో! యెందువలన? అలంకారబలమువలననా? కాదు! శయ్యాలాలిత్యము వలననా? కాదు. ఇంకెందుకు? బాష్పధారలచేఁ గన్నులు గానరాక నిస్తబ్ధగాత్రుఁడై రానిమాటల నెట్టులో పెకలించుకొనుచు స్నిగ్ధావస్థయం దున్న కణ్వుఁడు మనకన్నుల యెదుట సాక్షాత్కరించుచున్నాఁడు. వెండియుఁ గుల పతికి శకుంతలయెడ నెంత దత్తకాంక్షాపారవశ్య మున్నదో తపోధనగౌరవమం దెంతదీక్షాసంయమన మున్నదో—పుత్రీప్రేమావధి నెంత సత్యముగా సాధించెనో మనోహరములు గా ధ్వనించుచున్నది. ఇదియే యుత్తమకవిత!"

ఈవాక్యములు వ్రాసిన మహాపండితుఁ డెంతలౌకికుఁడో; యెంతరసజ్ఞుఁడో వర్ణింపఁ దరము గాదు. ఈవ్రాఁత సద్భావశూన్య మగుమాటలమూట. ఈశ్లోకము కణ్వునిదుఃఖావస్థను బాగుగా వ్యక్తముచేయుటచేత మనహృదయముల హెచ్చుగా నాకర్షించుచున్నది. ఈశ్లోకముంబట్టి "బాష్పధారలచేఁ

గన్నులుగానరాక నిస్తబ్ధగాత్రుఁడై రానిమాటల నెట్టులో పెకలించుకొనుచు స్నిగ్ధావస్థయం దున్నకణ్వుఁడు మనకన్నులయెదుట సాక్షాత్కరించుచున్నాఁడు. కాని యీసాక్షాత్కార మిం దున్నయలంకారరాజమునుం బట్టి కా దందురేని మఱియెట్లు సంభవించినది? ఎట్లు మన నవలౌకికరసజ్ఞుఁడుగా రాస్థితిలో నున్నకణ్వుని గనిపెట్టఁగల్గిరి? ఏప్పుడుఁ గణ్వుఁడు మనకన్నులయెదుట నిలిచెనా? లేదు. మఱెట్లు కణ్వుఁ డేయవస్థయం దున్నట్లు కనిపెట్టితిమి? ఈకణ్వవాక్యములలో నచేతనములందుఁ జేతనవ్యవహారసమారోపణము చేయఁబడియున్నది. కావునను "బ్లెయిర్" చెప్పినట్లుగా లోకులు తమయాప్తుల యెడఁబాటు గల్గినప్పు డట్టి యారోపణము చేయుదురు కావునను నిచటఁ గణ్వుని దుఃఖభార మింతటి దని మన మిం దున్నసమాసోక్తిని* (Personification) బట్టి గ్రహింపఁగల్గితిమి. ఈ శ్లోకమునకు జీవమును దెచ్చినది సమాసోక్తి యనునలంకారరాజము. బుద్ధిమంతులు బాగుగా నాలోచించి తెలిసికొందురుగాక!

ఇఁక గ్రంథవిస్తరభీతిచే శాకుంతలమునందలి శ్లోకచతుష్టయములో మిగిలిన మూఁడుశ్లోకములందలి ముఖ్యాలంకారము లేవో యీక్రిందఁ దెలుపుచున్నాను.

"యాస్యత్యద్య" అర్థాంతరన్యాసము; స్వభావోక్తి; ఉత్ప్రేక్ష.
"అస్మాన్ సాధువిచింత్య" కావ్యలింగము.
"శుశ్రూషస్వ గురూన్" అర్థాంతరన్యాసము.

"ఉపమా కాళిదాసస్య" యని సహృదయులు కాళిదాసుయొక్క ప్రజ్ఞావిశేష ముపమవాడుటలో నున్న దందురు.

ఇఁక మననవలౌకికరసజ్ఞుఁడుగా రలంకారము లే దని చెప్పిన శ్లోకమిఁక నొకటి గలదు. దాని నీక్రింద నిచ్చుచున్నాను.

"పంచత్వం తను రేతు, భూతనివహా స్వాంశామిళన్తు ధ్రువం
ధాత, స్త్వాం, ప్రణిపత్య సాదర మిదం యాచే నిబద్ధాంజలిః
తద్వాపీషు పయ స్తదీయముకురే జ్యోతి స్తదీయాంగణే
వ్యోమస్వాచ్ఛ తదీయవర్త్మని ధరా తత్తాళవృంతే నిలః"

ఇం దలంకారము లే దఁట! ఇదియుఁ బెద్దవింతయే! మన పెద్దలు చెప్పి శతసంఖ్యాకము లగునలంకారముల నట్లుండ నిండు! మన శాస్త్రములం బట్టి

*సమాసోక్తి యంతటను పెర్సానిఫికేషన్ గాకపోవచ్చును. ఇచట నట్టిదియు!

యిం దలంకార ముండుట వింత గాదు. హూణవిద్యానిపుణు లైనమననవ లౌకికరసజ్ఞుఁడుగా రీశ్లోకము నుదాహరించిరి గాన హూణు లెంచిన యలంకార మిం దున్నదో లేదో విచారించుకొందము. ఇందు ధాత యెదుట నున్న వానివలె సంబోధింపఁబడియున్నాఁడు. కాన అపాస్ట్రొఫీ (Apostrophe) అను నలంకారరాజ మిందుఁ గలదు. ఈయలంకారముం గూర్చి మెఫర్డుదొరవారిట్లు వ్రాసిరి.

An *Apostrophe* (Gr. Apo away; Straphem to turn) is a turning off from the subject of discourse to address some person who is either dead or absent, or something, as if that person or thing were actually before the speaker and listening to his."

ఈశ్లోకము బిల్హణచరిత్రములోనిది. బిల్హణునకు నురిశిక్ష విధింపఁబడినప్పు డాతఁడు పలికినపలుకు లివి. ఇందు రసవదలంకారము కలదు.

అలంకారము లప్రయత్నపూర్వకముగా వేయఁబడవలెనా?:— మననవ లౌకికరసజ్ఞుఁడుగా రలంకారము లప్రయత్నపూర్వకము లైనప్పుడే శోభించు నని వ్రాసిరి. అది నిజమే! ఒక్కయలంకారములే కాదు. కవిత్వ మంతయు నట్టిదిగానే యుండవలెను. ఆహేతువు చేతనే పెద్ద లిట్లు చెప్పిరి—

"కవితా వనితా చైవ స్వయమే వాగతా వరా
బలా దాకృష్యమాణా చేత్ సరసా విరసా భవేత్"

ఈభావమునే యప్పకవి యిట్లు చెప్పినాఁడు:—

"క. వనితయుఁ గవితయుఁ దాన, చను దెంచుట గల్గునేని సరసం బగు; ధా
త్రిని బల్మికోలు గావించిన విరసం బగు నట్లుంచుఁ జెప్పిరి విబుధుల్."

కవితాధార యనునది స్వయముగాఁ బుట్టవలె! ఆలోచించి యాలోచించి చెప్పిన మంచికవిత్వము కానేరదు. అలంకారములు రసజ్ఞులహృదయములలో సహజముగను నప్రయత్నపూర్వకముగను బుట్టునవియే కాని బలవంతముగా వచ్చునవి కావు. అలంకారములు వాడుట మానవులకు సహజము. అవి కావ్యములందు మాత్రమే కాక నిత్యమును బాలుఁడు మొదలు ప్రాజ్ఞునివఱకును గూడ సంభాషించు సంభాషణమునందు వాడుకలోనుండి సంభాషణమునకుఁ వన్నె దెచ్చుచుండును. చిన్నిబాలుఁడు కొకనికి మామిడిపండు తినిపించి యెట్లున్న దన 'తియ్యఁగా బెల్లమువలె నున్న'దనును. ఇం దుపమ గలదు. చదువురాని స్త్రీలు మాటలాడుకొనుటలో చలిబాధ హెచ్చుగా నున్న దని యొకతె పలుక

రెండవయాపె "ఇది చలిగాదు పెద్దపులి" యని పలుకును. ఇదిరూపకాలంకారము. శబ్దాలంకారమును గలదు. మధురపదార్థములు భుజించుచు నమృతమునలె నున్న దందురు. ఇం దుపమ గలదు. పుత్త్రుఁడు మరణింప దుఃఖసముద్రములో మునిఁగియున్న చదువురాని తల్లులు గూడ "పనసపండు వంటిబిడ్డను బోఁగొట్టుకొనినాను. లేక లేక కలిగినకొడుకు కిట్లు నాగొంతు కోసినాఁడు. అయ్యో. "ఓపాపపుదైవమా! నీవు మామీఁద నెంతపట్టుపట్టినావు! నీ కేమియపకారము చేసితి మని దుఃఖింతురు. ఇది "అపోస్ట్రఫీ!" పుత్త్రకా! పుత్త్రకా! నీకు నాపై నేల కోపము వచ్చినది. "నాతో నేల మాటలాడవు? అని దుఃఖింతురు. ఇది "అపోస్ట్రఫీ." "నీచంద్రబింబమువంటి సుందరముఖము నాకుఁ జూపవా? యని యేడ్తురు. ఇందుఁ బూర్ణోపమ గలదు. దుఃఖసముద్రమం దుండువారే యలంకారములు ప్రయోగించినప్పు డానందమున నోలలాడువా రలంకారములు ప్రయోగింతు రని వేఱుగాఁ జెప్పవలయునా? ముఖపద్మ మనిన నలంకారము కలదు. కరకమల మనిన నలంకారము కలదు.[1] ఇది సంభాషణములలోనే తఱుచుగా వచ్చుచుండును. ఇట్లేల లోకు లలంకారములు వాడుదు రన మనస్సునకు బాగుగా నాటుటకై ప్రజలు సాధారణముగా వానిని వాడుదురు. ఇట్లు సహజ మైనయలంకారములపై ఘనసప మేధావులు దాడి వెడలుట శోచనీయము.

అలంకారము లేయేరసములపట్ల నొప్పును? ఏయేరసములపట్లనొప్పవు?:- అలంకారము లన్నిరసములపట్లను శోభించును. కాని యాయారసములంబట్టి వాడవలసిన యుపమానాదులు భేదించును. శృంగారవిషయములో రాజచంద్రుఁ డనిన వీరరసము విషయములో రాజసింహ మందుము.[2] క్రోధముపట్ల "ఓరీ! ద్విపాదపశువా! నిన్ను నల్లిని నలఁచినట్లు నలఁపి చంపుదు" మందుము. వీరికి వారికిఁ బెద్దకలహ మైనది. తుదకుఁ గుక్కలవలెఁ గాట్లాడినా రందుము. ఇది బీభత్సరసము. అమ్మయ్యో బూచిలా గున్నాఁ డందురు. ఇది భయానకము. కరుణరసముపట్లనే యివి (అలంకారములు) యొప్పినప్పుడు నిరర

---

[1] ఇవి నష్టరూపకములు (Decayed Metophors) అని పాశ్చాత్యులు.

[2] వీరరసప్రధానమగుచోట— "కలఁడుల్లోక" అనుపద్యములో వసుక్ష్మాపాలచంద్రుం డని యున్నది సరసముగాలే దని యు వసుక్ష్మాపాలకేంద్రుం డనిన బాగుగా నుండుననియుఁ గొందఱు తలంచుచున్నారు. ఇది నష్టోపమగాన నిందు దోషము లేదు. అదిగాక కీర్తిసాంద్రత కుఁ ప్రధానము సేయఁబడినది కాన దోషము లేదు.

రసములపట్ల నివి యొప్పవా! లోకసామాన్యుల వాడుకలనుండి యే యుదాహరణముల నిచ్చుటకుఁ బైవాక్యములు నేను వ్రాసితిని. మనకావ్యము లన్నిరసములపట్ల నలంకారములతో శోభించుచునే యున్నవి.

## అలంకారదోషములు

అలంకారదోషములఁ గూడ నొకింత చూపుదును. ఇవి సులభముగాఁ బట్టుపడునవియె కావుననే యీవిషయములో నలంకారశాస్త్రకారు లంతగాఁ జర్చించియుండలేదు. అలంకారము లక్కఱలే దని సరస్వతిచే నేడ్పించిన యిప్పటినవరసికులు తుద కేవస్తువు నెందుకుఁ దేనితోఁ బోల్తుమో కూడ నెఱుంగరు. ఈకవిశిఖామణి తనయభాగ్యోపాఖ్యాన మనునసత్ప్రబంధములో నిట్టొక పద్యరత్నమును లిఖించిరి.

ఉ. చారునగంబులన్, ధనువు, సంపెఁగపూవును గెంపుఁ గూర్చి సిం
గారపుఁ జన్నులన్, బొమల, ఘ్రాణము, వాతెఱఁ జేసి బ్రహ్మ తా
వారక వానికర్కశత, వంకరఁ, బచ్చన, రక్తకాంతిఁ బెం
పారఁగఁ దీసి చేసె; మెయి, యారును, గన్నులఁ గుంతలంబులన్

ఇది హాస్యరసప్రధాన మగు ప్రబంధములోనిది. ఏవస్తువు నెందుకు నెందుతోఁ బోల్తుమో యాప్రధానలక్షణము తీసివేసి పోల్చిన నాపోల్కి హాస్యాస్పద మగునుగదా! కావుననే యిచటఁ గవి కుచములు గిరులవలె నున్నవి గాని కాఠిన్యము మాత్రము లేదనియుఁ జాపమువలెఁ గనుబొమ లున్నవి గాని వంకరమాత్రము లేదనియు వ్రాయఁజొచ్చినాఁడు. ఇట సమానధర్మము తీసివేయుటచేఁ బోల్కి హాస్యాస్పద మగుచున్నది కాని మన యీకవి సంపెఁగపూవుతో ముక్కును జేసి యాపచ్చనమాత్రము తీసివేసె ననుటలో దోషము వాటిల్లినది. ఏమన:—

మనము ముక్కును సంపెఁగతో రంగునిమిత్తమై (అనఁగాఁ బచ్చన నిమిత్తమై) పోల్పము. సు తెందు కన:—"ఆకృతికి" కావునఁ బచ్చన పోయిన సంపెఁగ లాగున ముక్కున్న దనిన నందు వైరస్య మేమియు లేదు. ఉండఁదగిన రీతిదె యగును. ఆకృతికయియే నువ్వుఁబువ్వుతో ముక్కును బోల్తుము. ముక్కు తెల్లఁగ నున్నదని యర్థము కాదు. నువ్వుఁబువ్వవంటి యాకృతి కలిగి యున్నదని యర్థము. కాని యిచటఁ బ్రధానధర్మ మేదో తెలిసికొనలేక పోయినాఁడు. ఇట్టి వలంకారదోషములు. పేఁడకుప్పలవలెఁ గుచము లున్న వనరాదు. అది

నీచ్ఛోపము. దోషము లెచ్చట గుణము లగునో యచ్చట మరల వీనిని వాడవ చ్చును. చదువరు లిట్టిదోషముల గ్రహింతురుగాక!

ఒకనవమేధావి యలంకారము లనవసర మనియు, బాధాకరములుగా నున్న వనియు, వానిని ధరింపలేక సరస్వతి యేడ్చుచున్నదనియుఁ జమత్కార ముగా నొకచిన్నకావ్యమును విరచించిరి. కాని సరస్వతి యేడ్చిన ధూయేడ్పు నందుఁ గూడ శబ్దాలంకారములే గాన్పించుచున్నవి చూడుఁడు!

చం. అట్టు సుఖియించుచుండఁగ మదాస్యమునందు నిరర్థకంబులై
సటపటలాడుశబ్దముల బల్మిని బెట్టి రసంబు నెట్టి య
స్ఫటికములే కలంకరణకైతవముం గొని మేను కుట్టి యి
ప్పటికి నను లొత్తిఁ బెట్టెదరు ప్రాణముఁదీసి ననుం గలంచుచున్.

ఇం దున్న పెట్టి, నెట్టి, కుట్టి, పెట్టులు శబ్దాలంకారములు గాక మ రేమ గును. ఈయేడ్పులో నలంకారము లేల వాడవలసివచ్చె. విజ్ఞులారా! అలంకా రములు లోకములో సహజములు. వానియంతట నవియే వచ్చి పడుచుండును. వానివలన బహుప్రయోజనములు గల్గవు.

పాశ్చాత్త్యు లలంకారములు వాడుటలో మనకంటె నెక్కుడు వెత్తి గలవారు. వా రుపన్యాసము నిచ్చునప్పుడు గూడ దీర్ఘాలంకారములు వాడు చుందురు. వారి ననుకరించి మనవారును నుపన్యాసములలో నలంకారములు వాడుదురు. డాక్టరు భండార్కరుగారు శుద్ధశుష్కసంఘసంస్కారముం గూర్చి మాటలాడుచు నిట్లు పెద్దయలంకారములను వాడి తరువాత దాని విడఁదీసి భావమును వ్యక్తీకరించిరి కనుఁడు.

Yesterday you had a glowing and attractive picture placed before you. Today it is our business to see whether the canvass on which the picture is to be painted is torn and tattered and cannot hold it or of a weak texture and cannot remain it for long. If it be of either nature, we have to see how it can be repaired and strengthened so that it may answer our purpose. Dropping all metaphor, I may say &c.

మొదట రూపకాలంకారము వాడ నేల? తరువాత దానిని విడఁదీసి చెప్ప నేల! అలంకారము వాడుటలోఁ బెద్దవిశేష ముండుటచేతనే కదా.

ఇట్లలంకారములు కావ్యములందే కాక సామాన్యసంభాషణములందును ధర్మవిషయకోపన్యాసములందును, నవసరములై విషయమునకుఁ బుష్టిని గలి

గించునవి యగుచున్నప్పుడు కావ్యములలం దవి యనవసరము లని వేఱుగఁ జెప్పవలయునా?

### కవితాలంకారములు - కాంతాలంకారములు.

పూర్వపుఁ బెద్దలు సామాన్యముగాఁ గవితాలంకారములఁ గాంతాలంకారములతో ననఁగాఁ గాంతలు దేహమునఁ దాల్చుసువర్ణాద్యలంకారములతోఁ బోల్చుచు వచ్చిరి. ఇప్పటివారీపోల్కి నతిదూరము తీసికొనిపోయి సర్వవిధములఁ గావ్యాలంకారములఁ గాంతాలంకారములతోఁ బోల్చుచున్నారు. ఇది తగ దని యిదివఱకే వ్రాసియున్నాఁడను. కచకుచాదులు కాంతకెట్టి సహజాలంకారములో శబ్దార్థాలంకారములు కవితాకాంత కట్టితన్మాధ్యమము లగుసహజాలంకారము లై యున్నవి. "తను వగుశబ్దార్థంబులు" అని కదా పూర్వులు చెప్పిరి. కాన యోషలు దాల్చుకాంచనాలంకారములతో భాషాయోష దాల్చుశబ్దార్థాలంకారముల సర్వవిధముల సమానధర్మము కలవానినిగాఁ దలంచుట యుచితమే కాదు. అయినను నిప్పటినవరసికులు లోకు లీకాలమున నంతగా నలంకారప్రియులై యుండుట లే దనియుఁ బూర్వపు రాగిడీలు మున్నగువానియందు విముఖతయే హెచ్చుగాఁ గల దనియుఁ బ్రభువులు కూడ పూర్వమువలె నలంకారముల దేహములఁ దాల్పక సామాన్యవేషములఁ దాల్చుచున్నా రనియు నాకారణమున శబ్దార్థాలంకారములు మునుపటివలె హెచ్చుగు ప్రభ కలిగి యుండుట కవకాశము లే దనియు వాదించుచున్నారు? ఇది వింత వాదము. మేము లోకుల కలంకారప్రియత్వము కలదందుమే కాని రాగిడీలయందే ప్రియత్వము కల దని చెప్పఁబోము. ఇక్కాలమున రాగిడీలయందుఁ బ్రీతి తగ్గుచున్నమాట నిజముకాని యంతమాత్రముచే నలంకారప్రియత్వము తగ్గుచున్న దనరాదు. అది యిప్పుడు కూడ హెచ్చుగానే యున్నది. మునుపటికంటెను హెచ్చుగా నున్న దనియే చెప్పవచ్చును. మునుపు బంగరు కంకణము లుండుతావుల నిప్పుడు తోలుతో నలంకరింపఁబడిన చేతిగడియారములు శోభించుచున్నవి. తొల్లి సువర్ణమయములగు చేమంతిపూవు,బంతిపూవు లుండుతావుల నిప్పుడు విదేశనిర్మితము లగుగుడ్డపూవులును గాకితపుఁబూవులును ప్రకాశించుచున్నవి. వేయేల కాంచనస్థానమును గాగిత మాక్రమించినది. పూర్వము హంస లుండుతావుల నిప్పుడు పరదేశపు గాజుబాతులు ప్రవేశించుచున్నవి. పూర్వము పట్టుకుచ్చు లుండుప్రదేశముల నిప్పుడు ఉపు ముక్కలు

విరాజిల్లుచున్నవి. స్వర్ణకర్ణపుష్పములు పోయినవి. అచ్చోట గాజుగుళికలు వెలుఁగుచున్నవి. మున్ను చక్కెరబోఁడులు చెక్కులఁ దడిగల మకరికాపత్త్రములతో నలంకరించుకొనెడివారు. ఇప్పుడు పొడి "పౌడరు" తో నలంకరించుకొనుచున్నారు. ఇట్లే తారతమ్యము గ్రహించునది. హూణవిద్య నభ్యసించిన యన్నలారా! ఉపమల మానినను "సిమిలీల' మానఁగలరా? రూపకము విడిచినను "మెటఫరుల" విడువఁగలరా? అతిశయోక్తుల వదలినను హైపరుబోలుల వదలఁగలరా? అనుప్రాసమును వీడినను అల్లిటరేషను వీడఁగలరా? ఆలోచించుకొనుఁడు! మనోహరము లగువ్రాఁత లన్నియు నలంకారయుతములే యని గ్రహించుకొనుఁడు. మమ్మటాదులు తనివిదీరఁ బొగడిన పద్యము లన్నియు నిరలంకృతము లనుపిచ్చియూహను విడనాడుఁడు! పూర్వపు టమాయికురాంధ్రు తట్టంత రాగిడీలు దాల్చెడివా రని నవనాగరకు లధిక్షేపించుచున్నారు గాని పరిపూర్ణనాగరకత కాలవాలము లగుపాశ్చాత్యవిదుషీమణు లిప్పుడు తట్టలవలె నుండు "టోపీల" ధరించుట లేదా? వీరు ధరించు "టోపీలు" పక్షులయీఁకలతోను గాకితపుఁబూలతోను గుడ్డలపూలతోను నిండి యొకపెద్దపూలతట్టవలె నుండును. గాలి కెగిరిపోవు నేమో యని యొకచేతితో దానిని సదా పట్టుకొనుచుండవలెను. ఎట్టి యిక్కట్టుల నైన నోర్చి యాతట్టలఁ బాశ్చాత్యవిద్వాంసురాండ్రు ధరించితీరుదురు. చూచితిరా? లోకములో నలంకారప్రియత్వ మెట్లు వెలుంగుచున్నదో! పూర్వపురాజులు జాంబూనదాంగదముల ధరించెడివారు. ఇప్పటివారో కార్పాసాంగదముల ధరించుచున్నారు. పూర్వపు రాజులు వక్షంబున ముక్తాహారములను సువర్ణాభరణములను ధరించెడువారు. ఇప్పటివారో రంగురంగుల యావికాలంకారముల ధరించుచున్నారు. ఒక పాశ్చాత్యప్రభుపటమును దిలకింపుఁడు! వానికంచుకమున వక్షభాగ మెట్లుండునో బుజ మెట్లుండునో బోధపడఁగలదు. రంగురంగుల త్రాళ్లతో నిండి యుండును. భుజములందు గుడ్డభుజకీర్తు లుండును, త్రా ళ్లుండును. ఇంత యేల లోకమా? లోకములో నలంకారప్రియత్వ మిసుమంతయుఁ దగ్గలేదు. అది క్రమక్రమముగా హెచ్చుచున్న దనవచ్చును, నాగరకులమాట నటుండనిండు! ఆటవికులు కూడ నలంకారప్రియులై యుందురు. వారు తనుతనువులఁ జివుళ్లతోను బూలతోను పక్షులయీఁకలతోను నలంకరించుకొందురు. కాఁబట్టి పట్టణప్రాంతమందును బర్వతప్రాంతమందును గూడ నిప్పు డలంకారప్రియత్వము సమముగానే నడచుచున్న దని చెప్పవచ్చును. ఎచ్చటనే; నొక్కచో

నొక లక్ష్మీసంపన్నుఁడుగూడ నలంకారప్రియుఁడు కాకుండినఁ గాకుండవచ్చును. అలంకారప్రియత్వము లేని సంపన్నులే కాదు. లోకములో నచ్చటచ్చటఁ గావ్యప్రీతి లేనిసంపన్నులు నుండవచ్చును. అట్టివా రిట్టిపట్ల లక్ష్యము కానేరరు. అయినను వారుకూడఁ గావ్యాలంకారప్రియులై యాంధ్రభాషాయోషకు భూషణములైన కావ్యరత్నములు శబ్దార్థాలంకారములతో శోభించుచుండుటం గని వానియసమానం బగులసమానశైలిఁ దిలకించి యమందానందకందళితహృదయారవిందుల మయితి మని నొక్కి పక్కాణింతు రనుటకు నిదర్శనములు కలవు.

కొందఱు తొడవు లొడలికంటె భిన్నములు కదా యట్లె కావ్యాలంకారములును దద్భిన్నములు కావాయని శంకించుచున్నారు. కాని యది సరికాదు. "తను వగు శబ్దార్థంబు" లని లాక్షణికులు చెప్పిరి. కావున శబ్దార్థాలంకారములు కావ్యకన్యయొక్క తనువునఁ బుట్టిన సహజాలంకారములె కాని పైనుండి తెచ్చితొడిగిన తొడవులు కావు.* రసగంగాధరకారుఁడే "రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యం" అని నుడివి చమత్కారజనకభావనావిషయార్థప్రతిపాదకశబ్దత్వమని పరిష్కరించినాఁడు. అలంకారములు చమత్కారమును గలిగించునని యేకదా పెద్దపెద్ద లాక్షణికులు వ్రాసిరి! కావున నవి కావ్యమునకు ముఖ్యములు. అవి తగినరీతిని దగుతావుల నుండఁదగినదియే! అట్లుండకుండిననాయలంకారములు దోషము లగు నని మనపెద్దలు చెప్పియున్నారు. కావునఁ గావ్యలక్షణములో సాలంకారత్వవిశేషణ మవసరమే యనితెలిసికొని కవులు తగిన తావుల నుచితరీతిగాఁ గావ్యములలో నలంకారముల వాడి కావ్యములకు రమ్యతను గలిగింతురుగాఁక! రసాధిదేవత యగుదైవము మనసారస్వతాభివృద్ధి ననుగ్రహించుఁగాక! ఓం తత్సత్.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.

---

* "అలంకారత్వంచ రసాదిభిన్నవ్యంగ్యభిన్నత్వేసతి శబ్దార్థాన్యతరనిష్ఠాయా విషయితాసంబంధావచ్ఛిన్నా చమత్కృతిజనకతావచ్ఛేదకతా తదవచ్ఛేదకత్వ"మ్మని కదా చంద్రికాకారుఁడు వ్రాసె.

## విజ్ఞాపనము.

మహాశయులారా!

పరిషత్తునకుఁ బరిషత్పత్రికకుఁ జందాలనీయవలసిన వారిపేర వారు వారీయవలసిన మొత్తములను దెలుపుచుఁ బలువురకు మనవులు వ్రాసియున్నారము. కొందఱు కొంతకొంత పంపుచున్నారు. కొందఱింక నుపేక్షవహించియే యున్నారు. ఈ పత్రిక తమకుఁ జేరిన పిదపనైనఁ జందా ధనమును బంపఁగోరుచున్నారము. ఇంతటినుండి సభ్యత్వముగాని పత్రికగాని యక్కఱలేనివారు స్పష్టముగా నొక్క జాబువ్రాసి తెలుపఁగోరుదుము. కొందఱకు ముందుపత్రికను వి. పి. గాఁ బంపఁదలఁచితిమి. దయచేసి పుచ్చుకొనఁగోరుచున్నాము. అంతయుఁగాకున్నఁ గొంతయైనఁ బంపుఁడని యడిగియుంటిమి, మూఁడు నెలలోఁ బంపకున్నవారి పేరులు పట్టికలోనుండి తొలఁగింపఁబడు నని కూడఁ సూచించితిమి. అశ్రద్ధ చేయక భాషాభిమానమును గనఁబఱుచుచుఁ బరిషత్తునకు వారినామముల నలంకారప్రాయముగాఁ జేయుదురని నమ్ముచున్నారము.

కార్యదర్శి.

---

కొందఱు నిఘంటుకర్త లీ యార్యశబ్దము "ఋ గతౌ" అను ధాతువు నుండి, మఱికొందఱు, అర్చ్ ధాతువునుండి, పుట్టిన దని చెప్పిరి. "అర్యః స్వామి వైశ్యయోః", (3-౧-౧౦3) అని పాణిని చెప్పిన "అర్యశబ్దము" యీ యార్యశబ్దము పర్యాయపదము లయియున్నట్లు వేదమంత్రములవలననే కానవచ్చుచున్నది. వాజసనేయసంహిత (౨౦-౧౭) లో "యచ్ఛూద్రే యదర్యే యదేన శ్చకృమవయమ్" అని యున్నది. దాసునికి విరుద్ధ మగు నార్యపత్నీత్యాది సమాసములు కనఁబడుటచే ఋగ్వేదమందుఁగూడ నర్యశబ్ద మార్యుఁడను నర్థమందుఁ బ్రయోగింపఁబడినది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగువర్ణము లేర్పడిన తరువాత నీ యర్యశబ్దము ద్విజసామాన్యమును జెప్పుటయేకాక ప్రత్యేకముగా వైశ్యులకుఁగూడఁ జే రయ్యెను. లాట్యాయన శ్రౌతసూత్రమందొకానొక శ్రౌతకర్మను విధించి "ఇది యర్యుఁ డాచరింపవలసినకర్మ; అర్యుఁడు దొరకనియెడ నార్యుఁడైనఁ జేయవచ్చు నని యున్నది. "అర్యాభావే యఃకశ్చనార్యో వర్ణః" దీని వ్యాఖ్యానము—"యది వైశ్యో నలభ్యతే యః కశ్చనార్యో వర్ణస్స్యాత్ బ్రాహ్మణోవా క్షత్రియోవా".

## 3. ఈ యార్యులనివాసస్థాన మెద్ది?

మన మేజాతివారి చరిత్రము నైన విమర్శించునపు డతీతకాలారంభము మొదలుకొని విమర్శింప నారంభింపవలెను. మనము వెనుకకుఁ బోయి విమర్శించినకొలఁదిఁ బురాణకథలు (Myths) ఐతిహ్యములు (Traditions) ప్రచురముగా నుండుకాలము మనవిమర్శలోనికి వచ్చును. ఇంక నావలకుఁ బోవుటకుఁ బ్రయత్నించితిమేని చిట్టచీఁకటివలె నేమియుఁ దెలియని కాలమునకుఁ బోదుము. కొన్నివిషయములలో గ్రీకుదేశచరిత్రమందువలెఁ జరిత్రకాలము (Historical period) క్రీస్తుశకమునకు ముందు వేయిసంవత్సరముల వెనుకకుఁ బోవును. కొంతకాలము క్రిందటఁ ద్రవ్వి తీయఁబడిన గోరీలు, కీర్తిస్తంభములు, స్మారకచిహ్నములుగా నిర్మింపఁబడిన మందిరములు, సమకాలికలిఖితప్రమాణములు మొదలగువానిచే నీజిప్టుదేశపువాస్తవచరిత్రము క్రీస్తునకు మున్నయిదువేల సంవత్సరముల క్రిందటనే ప్రారంభ మయిన దని రుజువుచేయఁబడినది. ఈ దేశద్వయవిషయ మయి మన మేరీతిగా నాలోచించినను క్రీస్తుకు ముం దయిదాఱువేలసంవత్సరముల నడుమనే చరిత్రకాల మారంభ మయిన దని యూహించుకొనవలయును. దానికి ముందుఁ బురాణకథ లైతిహ్యములు గాని మఱేమియు లేవు. చరిత్రకాలముకంటె ముం దున్నమనుష్యుని (Prehistoric

 

man) వృత్తాంతమును దెలిసికొనుట కిప్పటి కున్నవానిలో నివియే ముఖ్యసాధనము లని ౧౯-వ శతకమునధ్యకాలమువఱకు విమర్శకు లభిప్రాయపడి యట్టి కథల నొకపద్ధతిగా నేర్పఱిచి వానిని వివరింప సాగిరి. ఈకథావివరణములలో నెద్దియుఁ దమప్రయోజనమును సాధించుటకు సమర్థ మయినసాధనములుగాఁ గనఁబడ లేదని నిష్పక్షపాతముగా విమర్శించు పాశ్చాత్యపండితులలోఁ గొందఱు నిశ్చయించిరి. కొంతకాలమునకు మఱికొందఱు శబ్దశాస్త్రసహాయముచే (Comparative Philology) నీపురాణకథల నైతిహ్యముల నూతనప్రక్రియచేఁ బరిశీలించి వానిలోనితత్త్వమును మెల్లగా గ్రహింప సాగిరి. ఇంతలో "కొలంబను" నూతనప్రపంచమును గ్రొత్తగాఁ గనుఁగొన్నట్లు భారతవర్షీయప్రాచీన భాషను బ్రాచీనమతగ్రంథములను గని పెట్టుటవలనను, సంస్కృతభాషకు ఛందోఽవస్థానభాషకుఁ గలపరస్పరసంబంధమును, సంస్కృతభాషకు, నైరోపాఖండనివాసుల భాషలకుఁ గలపరస్పరసంబంధమును దెలిసికొనుటవలనను బ్రాచీనప్రపంచచరిత్రమును గుఱించి విద్వాంసుల కిదివఱ కున్నయభిప్రాయములు మాఱిపోయినవి.

ఐరోపాఖండమందు నివసించుముఖ్య మయినమనుష్యజాతుల ప్రాచీన నవీనభాషలకు భరతఖండనివాసు లగుబ్రాహ్మణులు జరదుష్ట్రమతానుయాయు లగువారు మాటాడుభాషలకుఁ గలపరస్పరసాదృశ్యము కనుఁగొనఁ బడినది. ఈహిందూయూరపియన్భాషల పరస్పరసంబంధసాదృశ్యములవలన నీభాష లన్నియు నొకప్రాచీనభాషయొక్క శాఖ లని కాని వికృతిభాష లని కాని మన మూహింపక తప్పదు. మాతృస్థానాపన్న మయినయొకభాష యుండవలయు నని మన మెప్పు డూహించితిమో యప్పు డట్టి భాషను మాటాడుప్రాచీనార్య జాతివా రుండు రని యనుమేయింపఁదగి యున్నది. పాశ్చాత్యపండితులు (Orientalists) వైదికగ్రంథసమితి నామూలాగ్రముగఁ గృషి చేసినతరువాతఁ బ్రాచీనమనుష్యుని చరిత్రమును గుఱించి వానిజ్ఞానమును గుఱించి కొంత యథార్థవృత్తాంతమును సంపాదించిరి. ప్రేడరుపండితుఁడు తాను వ్రాసిన ప్రాచీనార్యచరిత్ర (Antiqueties of Prehistoric times) మను గ్రంథమం దార్యుల ప్రాచీననాగరకతను వారిపురాతనజ్ఞానమును నానాదేశభాషల శబ్దశాస్త్రమును సాధనముగాఁ జేసికొని విపులముగా వివరించెను. పౌరాణికులు (Mythologists) మనుష్యుఁడు హిమఘనీభావానంతర కాలపువాఁ డని (Post-glacial) యూహించి యీకాలమునఱకు వారిశోధనలను (Researches) సాగి

చిరి. భూమియొక్క శీతోష్ణస్థితి యిపు డెట్లుండెనో యట్టి ప్రాచీనకాలమందుఁ గూడ నట్లె యుండె నని యొప్పుకొనఁబడినది. కావున నిపుడు మన కున్న శీతోష్ణస్థితికంటె నెంతమాత్రము మార్పులేని శీతోష్ణస్థితితోఁ గూడిన దేశమందే కల్పితకథ లన్నియుఁ బుట్టి వృద్ధి నొందిన వనుసూహపై నివి వివరింపఁబడినవి. కొన్నివిషయములయం దీకథల వివరణము లంతతృప్తిగా నుండ లేదు. ఇట్లు వేద మం దున్నకథ లన్నియు నుషోవాదము (Dawn theory) ననుసరించి గాని ఝంఝామారుతవాదము (Storm theory) ననుసరించి గాని వివరింపఁబడినవి. కొన్నివిషయములయం దీవివరణము లంత తృప్తిగా నుండక పోయినను నింద్రుఁడు గాలివాన కధి దేవత యనియు, వృత్రుఁ డనఁగా బ్రతిదినము సూర్యుఁ డస్తమించిన తరువాత లోకము నావరించు చీఁకటి తప్ప మఱి యెద్దియుఁ గా దనియు సమర్థించుటకు ఋగ్వేదమంత్రములే ప్రమాణము. ఈ వేదకథల నీరీతిగా వివరించుక్రమము మొదట నిరుక్తకారు లగుయాస్కుఁడు, ఔర్ణవాభుఁడు, ఔపమన్యుఁడు మొద లగువారిచేతనే యారంభింపఁబడినది. తరువాత వేదమును సాలంకషముగాఁ గృషి చేసిన పాశ్చాత్యపండితులు వీనియందు మఱికొన్ని విశేషములఁ గనిపెట్టి వీనిని బెంచినను నిప్పటికి నివి యాస్థితిలోనే యున్నవి. ఆర్యజాతివారి యాదిమనివాసస్థాన మాసియాఖండమధ్యభాగమం దెచ్చటనో యుండె ననియు నచ్చటఁ జిరకాలము నివసించి యున్న యార్యసామాన్య సంఘమునుండి హిందూవార్యులు విడిపోయినపిమ్మట వేదసంహితలు రచింపఁబడిన వని యూహింపఁబడె ననియు సమశీతోష్ణస్థితి గల భూవలయభాగమందు (Temperate zone) నివసించిన యయ్యార్యశాఖవారి యభిప్రాయములు వేద సంహితలలో వ్రాయఁబడిన వనియుఁ గొంతకాలముక్రిందటివఱకు విద్వాంసుల కొకనమ్మక ముండెను. పందొమ్మిదవశతాబ్దము కడపటిభాగమందుఁ జేయఁబడిన శాస్త్రశోధనల (Scientific Research) వలన నీవాదము లన్నియు సమూల ఘాతముగాఁ గొట్టఁబడినవి. ఐరోపాఖండములో ననేకస్థలములయందు భూమిలోఁ బాతఁబడినవియును, రాళ్లతోను గంచుతోను జేయఁబడినవియునగుపని ముట్లు వందలకొలఁది కానవచ్చుటవలనఁ బురాతనవస్తువిచారణశాస్త్రజ్ఞులు (Archælogists) యుగప్రారంభమునకుఁ బూర్వము లోహము లేవియు లేక పోవుటవలన మనుష్యులు రాళ్లతోఁ జేయఁబడిన కత్తులు మొదలగుసాధనముల నుపయోగించినకాల మొకటి, తరువాతఁ గంచుతోఁ జేసినపనిముట్ల నుపయోగించినకాల మొకటి మఱికొంతకాలము గడచినపిదప నిప్పటి మనవలె నినుము

తోఁ జేయఁబడిన యుపకరణములను వాడుకచేయుచు జీవించినకాలము మఱి యొకటి యని మూఁడుకాలము లున్నట్లు నిశ్చయించిరి. ఈభూభువన మంతయు నొకకాలమందు హిమావృతమై యుండె ననియు నాకాలమందుఁగూడ మనుష్యుఁ డుండె ననియు నాకాలపుశీతోష్ణస్థితి (Climatic Conditions) ప్రకృతపు శీతోష్ణస్థితికంటె నత్యంతవిభిన్నముగా నుండె ననియుఁ గడచినశతాబ్దాంతభాగమున విమర్శకు లగుకొందఱు పాశ్చాత్యపండితులు కనుఁగొనిరి. భూమిలో నడుగునఁ జిరకాలముక్రిందటఁ బాఁతఁబడియున్న మనుష్యశవములను జన్తుశవములను వాని యస్థిపంజరములను ద్రవ్వి పైకిఁ దీయించి పరీక్షించిన జన్తుశాస్త్రజ్ఞులు (Zoologists) యీదేశములయం దిట్టిప్రాచీనమనుష్యజాతు లిట్టిజంతుజాతులు పూర్వకాలమం దుండె నని నిశ్చయించిరి. పౌరాణికు లమర్చిపెట్టిన కాలమను దూరదర్శినీయంత్రము నింతకంటె దూరతరప్రదేశము కనఁబడునట్లు గుఱి చేయవలయును. ఇతిహాసపురాణకథావిమర్శమువలనఁ దేలినసారాంశములను శాస్త్రశోధనలచే నూతనముగాఁ గనుఁగొనఁబడిన సంగతులనుబట్టి సవరింపవలెను. ఇపుడు శబ్దశాస్త్రజ్ఞులు తమయభిప్రాయములను వ్యవస్థాపనచేయుటయం దధికజాగరూకత వహింపవలసి వచ్చెను. వారిలోఁ గొందఱు క్రొత్తగాఁ గనుఁగొన్న శాస్త్రరహస్యముల బలముచేఁ బుట్టినవాదముల సామర్థ్యము నొప్పుకొని సిద్ధిలోనికిఁ దెచ్చిరి. శార్మణ్యదేశపుపండితు లగు పెంక, పోషి మొదలగువారు వ్రాసినగ్రంథములవలన నార్యజాతివారి యాద్యనివాసస్థాన మాసియాఖండమధ్యభాగ మయియుండె ననువాదము సమూలముగా నిర్మూలింపఁబడినది. ఆర్యు లుత్తరదిక్కున నివసించి రని స్థాపింపఁబడినది. నూతనముగాఁ గనుఁగొనఁబడిన వేదగ్రంథములసహాయముచే నితిహాసములయుఁ బురాణములయుఁ దాత్పర్యము చక్కఁగాఁ దెలియఁబడినది. ఆర్యులప్రాచీనతమలేఖ్యప్రమాణములుగా నొప్పుకొనఁబడిన వేదముల యర్థ మిప్పటికిని స్పష్టముగాఁ దెలియఁబడ లేదు. క్రీస్తుకు ముందు కొన్నియబ్దశతకముల కాలమందు బ్రాహ్మణములు రచింపఁబడినవి. ఆకాలమునాఁటికే వేదార్థము కొంత దుర్జ్ఞేయము కాసాగెను. నైరుక్తులు వైయాకరణులుఁ గష్టపడి కొంతమట్టుకు వేదముల యర్థము నచ్చటచ్చట నొకరీతిగా వివరింపక పోయినయెడల నీకాలమునకవి మఱింత దురవగాహము లయియుండవలసి వచ్చును. పాశ్చాత్యపండితులు శబ్దశాస్త్రసహాయముచేతను బురాణకథలచేతను బ్రకాశింపఁజేయఁబడిన వేదార్థమును బరిశీలించి స్వదేశవ్యాఖ్యాతలు చేసినవివరణక్రమములను గొంతవ

ట్టుకు వృద్ధి నొందించిరి. ఉషోవాదము (Dawn theory) ఝంఝామారుత వాదము (Storm theory) వేద మందున్న కొన్ని కథల యాథార్థ్యమును దెలుపుటయందు మిగుల సహాయ మొనరించును. సులభశైలిలో వ్రాయఁబడి యున్నను దుర్జ్ఞేయార్థములు గలకొన్ని వాక్యములు ఋగ్వేదమం దున్నవి. వ్యాఖ్యాతలు వానిపదములకు దండాన్వయము వ్రాసియుఁ జదువరులకు స్పష్టముగాఁ దెలియకుండ నేదో యొకయర్థమును గల్పించియు వ్యాఖ్యానముఁ జేసిరి. కావునఁ గొన్ని ఋగ్వేదమంత్రములయర్థ మిప్పటికి నెవ్వరికిఁ దెలియకుండ నున్నది. కడచినవత్సరశతకాంతమున నూతనముగా లోకమునకుఁ బ్రకాశింపఁ జేయఁబడిన నూతనశాస్త్రీయాంశములు పూర్వకాలపుమనుష్యనిచరిత్రమును వాని కాకాలమం దున్నవిజ్ఞానమును దెలిసికొనుటకుఁ జాలమట్టుకు సహాయ మొనరించినవి గావున నార్యజాతివారి ప్రాచీనవృత్తాంతమును దెలుపు వేదకథలను వేదవాక్యములను వివరించుటయం దట్టిశాస్త్రశోధనలు సాధకతమము లయి యున్నవి. వారె న్పండితుఁ డిప్పటిశాస్త్రశోధనలవలనఁ దేలిన సారాంశములను సహాయముగాఁ దీసికొని వేదకథలను నైతిహ్యములను బాగుగ విమర్శించి తొనకు మనుష్యజాతివారి ప్రథమనివాసస్థాన ముత్తరధ్రువసమీపమం దున్నభూభాగమం దుండు నని నిశ్చయించెను. ఇట్లు ఋగ్వేదమంత్రప్రామాణ్యమువలనను ఛందోవస్థాన (Zend Avesta) గ్రంథసంవాదము వలనను నార్యులప్రథమనివాసస్థాన ముత్తరధ్రువసమీపభూమి యని నిశ్చయింపఁబడుచున్నది. ఆఱుమాసముల పగలు సుమా రయిదుమాసముల రాత్రి నలువది యయిదుదినములయుషస్సు నాప్రదేశమం దున్నట్లును, నీయంధకారమునుండి విముక్తుల మయి మే మెపుడు సూర్యకాంతిని జూడఁగల మని మంత్రప్రణేతలు దేవతలను బ్రార్థించుచున్నట్లును దెలుపు వాక్యములు వందలకొలఁది ఋగ్వేదమునిండఁ గానవచ్చుచున్నవి.

II-27-14. అదితే మిత్ర వరుణో తమృళయదో్వ వయం చకృమా కచ్చిదాగః। ఉర్వశ్యామభయం జ్యోతిరింద్రమానో దీర్ఘాఅభినశం తమిస్రా.

టీక. ఓయదితీ, ఓమిత్రుఁడా, ఓవరుణుఁడా మేము మీవిషయమయి చేసినయపరాధమును క్షమింపుఁడు. ఓయింద్రుఁడా భయనివారక మగు వెలుఁగును మేము చూతుము గాక. ఈదీర్ఘాంధకారము మమ్ము నావరింపక పోవునుగాక.

1-44-6. యానః పీపరదశ్వినా జ్యోతిష్మతీ తమస్తిరః। తామస్మేరాసా యామిషమ్.

టీక. ఓ యశ్వినీదేవతలారా రసాదులచేఁ బ్రకాశించు నేయన్నము మమ్ములను దృప్తిఁబొందించునో చీఁకటిని నశింపఁజేసి యట్టి యన్నమును మీరుభయులు మాకిత్తురుగాక.

ఈఋక్కులో నీయంధకారమునుండి తనను దొలఁగించి కరుణింపుమని మంత్రప్రణేత యశ్వినీదేవతలను బ్రార్థించుచున్నాఁడు.

VII-67-2. అశోచ్యగ్నిః సమిధానో అస్మే ఉపో అదృశ్రంతమస శ్చిదంతాః అచేతి కేతురుషసః పురస్తా చ్ఛ్రియో దివోదుహితు ర్జాయమానః.

టీక. అగ్ని ప్రకాశించుట కారంభించినది. చీఁకటియొక్క యంతము కానవచ్చుచున్నది. తూర్పున నుష స్సగపడుచున్న దని యీఋక్కులోఁ జెప్పఁబడినది.

కాఁబట్టి యిట్టి యతిదీర్ఘ మగునీరాత్రి యాపద్గ్రాస మని భయపడుచు నెట్లైన దీనిని దొలఁగింపుమని వేదకవులు దేవతలను బ్రార్థించుచున్నట్లు చెప్పఁబడినది.

మన యనుభవములో నున్న శీతకాలపురాత్రి వంటిదే యారాత్రియైన చో నాకాలపుటార్యులు సూర్యోదయము కాలేదని యింత భయపడవలసిన యవసర మేమున్నది? అరణ్యములలో నివసించు కిరాతులు సయితమీకాలమందుఁ జీఁకటిని దొలఁగించుకొనుటకుఁ దగినకృత్రిమసాధనములను గల్పించుకొందురు. వారికట్టిసాధనము లెవ్వియు నున్నట్లు కానరాదు. మనుష్యులే కాక దేవతలు కూడ నీదీర్ఘాంధకారములో మునిఁగి యున్నట్లు కొన్నిఋక్కులలోఁ గానవచ్చుచున్నది.

X-124-1. ఇమం నో అగ్న ఉపయజ్ఞమేహి పంచయామం త్రివృతం సప్తతంతుమ్। అసో హవ్యవాళుతనః పురోగా జ్యోగేవదీర్ఘం తమ ఆశయిష్టాః.

ఇందులో నగ్ని దీర్ఘతమస్సులో నున్నట్లు చెప్పఁబడినది. శీతకాలపు రాత్రివంటి రాత్రియే యైనచో నీమంత్రమందుఁ బర్యాయపదము లగు "జ్యోక్", దీర్ఘమ్, అనుపదద్వయమును బ్రయోగించుటలో నౌచిత్యము కానరాదు. ఉత్తరధ్రువము (North Pole) దగ్గఱ దీర్ఘరాత్రి యుండె నని స్థాపించుటకు ఋగ్వేదమం దంతట విడిగా నున్నఋక్కులే గాక ఋగ్వేదము పదియవ మండలములో నూటయిరువదియేడవ సూక్త మంతయు నీదీర్ఘరాత్రిని గుఱించి చెప్పుచున్నది. ఈసూక్తములో నాఱవమంత్రము –

"యావయావృక్యం వృకంయవస్తేనమూర్మ్యే। అథానస్సుతరా భవ.

టీక. ఓరాత్రీ, మమ్ములను హింసించునృకము మాయొద్దకు రాకుండఁ జేయుము. మమ్ములను బాధించు తస్కరుఁడు మాయొద్దకు రాకుండఁ జేయుము. అనవరతము మాకు నీవు సుఖముగా దాఁటఁబడుదానవు (క్షేమంకరివి) కమ్ము."

ఈమంత్రములో నుపాసకుఁ "ఓరాత్రిదేవతా మాకు నీవు సుఖకరమయినదానవు కమ్ము." అని రాత్రిదేవతను బ్రార్థించుచున్నాఁడు.

అథర్వవేదమందు "ప్రసన్నోహం శివాం రాత్రిం భద్రే పారమశీమహి భద్రే పారమశీమహి" నయస్యాః పారం దదృశేనయోయువ ద్విశ్వమస్యాం నివిశతే యదేజతి। అరిష్టా సస్త ఉర్వితమస్వతి రాత్రి పార మశీమహి భద్రే పారమశీమహి."

టీక. దేనియంతము చూడఁబడకుండ నున్నదో దేనియందుఁ బ్రపంచకమంతయు మునిఁగియున్నదో దేనివలన లోకము భీతిల్లుచున్నదో యట్టియో రాత్రీ నిన్ను నేను శరణుసొచ్చితిని, నీయంతమును మేము పొందుదుము గాక.

తైత్తిరీయసంహిత 1-5-5-4

"చిత్రావసో స్వస్తితే పారమశీయ.'

టీ. ఓరాత్రీ నీయంతమును మేము పొందుదుముగాక.

దీని బ్రాహ్మణము:—"చిత్రావసో స్వస్తితే పారమశీయే త్యాహ। రాత్రిర్వై చిత్రావసుః। అవ్యుష్ట్యైవా ఏతస్యై పురాబ్రాహ్మణా అభైషుః."

చిత్రావసు వనఁగా రాత్రి. అది తెల్లవాఱకుండ నుండుటవలనఁ బూర్వమందు బ్రాహ్మణులు భయపడిరి.

భాస్కరాచార్యకృత సిద్ధాంతశిరోమణి, గోళాధ్యాయము, సప్తమాధ్యాయములో 6, 7 శ్లోకములను జూడుఁడు.

"షట్ షష్టిభాగా భ్యధికాః పలాంశాః యత్రాథతత్రా స్త్యహరో విశేషః। లంబాధికా క్రాంతిరుదక్చ యావ త్తావద్దినం సంతతమేవ తత్ర। యావచ్చ యామ్యా సతతం తమిస్రా తతశ్చ మేషా సతతం సమార్ధమ్."

ఈశ్లోకములలోఁ గూడ మేసు వనఁగా నుత్తరధ్రువమునకుఁ జేరు. దాని దగ్గఱ సంవత్సరములో నాలుమాసములు పగలు, నాలుమాసములు రాత్రియు నని చెప్పఁబడినది.

"దేవైరాత్ర్యహనీ వర్షప్రవిభాగ స్తయోః పునః। అహ స్తత్రోదగయనం రాత్రిస్స్యా ద్దక్షిణాయనమ్ (మనుస్మృతి 1 అ. 67 శ్లో.)

టీక. ఓ యశ్వినీదేవతలారా రసాదులచేఁ బ్రకాశించు నేయన్నము మమ్ములను దృప్తిఁబొందించునో చీఁకటిని నశింపఁజేసి యట్టి యన్నమును మీ రుభయులు మాకిత్తురుగాక.

ఈఋక్కులో నీయంధకారమునుండి తనను దొలఁగించి కరుణింపు మని మంత్రప్రణేత యశ్వినీదేవతలను బ్రార్థించుచున్నాఁడు.

VII-67-2. అశోచ్యగ్నిః సమిధానో అస్మే ఉపో అదృశ్రంతమస శ్చిదంతాః అచేతి కేతురుషసః పురస్తా చ్ఛ్రియే దివోదుహితు ర్జాయమానః.

టీక. అగ్ని ప్రకాశించుట కారంభించినది. చీఁకటియొక్క యంతము కానవచ్చుచున్నది. తూర్పున నుష స్సగపడుచున్న దని యీఋక్కులోఁ జెప్పఁబడినది.

కాఁబట్టి యిట్టి యతిదీర్ఘ మగునీరాత్రి యాపద్రూప మని భయపడుచు నెట్లైన దీనిని దొలఁగింపు మని వేదకవులు దేవతలను బ్రార్థించుచున్నట్లు చెప్పఁబడినది.

మన యనుభవములో నున్న శీతకాలపురాత్రి వంటిదే యారాత్రియైన చో నాకాలపుటార్యులు సూర్యోదయము కాలే దని యింత భయపడవలసిన యవసర మేమున్నది? అరణ్యములలో నివసించు కిరాతులు సయితము మీకాల మందుఁ జీఁకటిని దొలఁగించుకొనుటకుఁ దగినకృత్రిమసాధనములను గల్పించు కొందురు. వారి కట్టిసాధనము లెవ్వియు నున్నట్లు కానరాదు. మనుష్యులే కాక దేవతలు కూడ నీదీర్ఘాంధకారములో మునిఁగి యున్నట్లు కొన్నిఋక్కు లలోఁ గానవచ్చుచున్నది.

X-124-1. ఇమం నో అగ్న ఉపయజ్ఞమేహి పంచయామం త్రివృతం సప్తతంతుమ్ । అసో హవ్యవాళుతనః పురోగా జ్యోగేవదీర్ఘం తమ ఆశయిష్టాః.

ఇందులో నగ్ని దీర్ఘతమస్సులో నున్నట్లు చెప్పఁబడినది. శీతకాలపు రాత్రివంటి రాత్రియే యైనచో నీమంత్రమందుఁ బర్యాయపదము లగు "జ్యోక్", దీర్ఘమ్, అనుపదద్వయమును బ్రయోగించుటలో నౌచిత్యము కాన రాదు. ఉత్తరధ్రువము (North Pole) దగ్గఱ దీర్ఘరాత్రి యుండె నని స్థాపించు టకు ఋగ్వేదమం దంతట విడిగా నున్నఋక్కులే గాక ఋగ్వేదము పదియవ మండలములో నూటయిరువదియేడవ సూక్త మంతయు నీదీర్ఘరాత్రిని గుఱించి చెప్పుచున్నది. ఈసూక్తములో నాఱవమంత్రము --

"యావయావృక్యం వృకంయవ స్తేనమూర్మ్యే । అథానస్సుతరా భవ.

టీక. ఓరాత్రీ, మనుష్యులను హింసించునట్టివృకము మాయొద్దకు రాకుండఁ జేయుము. మనుష్యులను బాధించు తస్కరుఁడు మాయొద్దకు రాకుండఁ జేయుము. అనవరతము మాకు నీవు సుఖముగా దాఁటఁబడుదానవు (క్షేమంకరివి) కమ్ము."

ఈమంత్రములో నుపాసకుఁ "ఓరాత్రిదేవతా మాకు నీవు సుఖకరమయినదానవు కమ్ము." అని రాత్రిదేవతను బ్రార్థించుచున్నాఁడు.

అథర్వవేదమందు "ప్రపన్నోహం శివాం రాత్రిం భద్రే పారమశీమహి భద్రే పారమశీమహి" నయస్యాః పారం దదృశేనయోయువద్విశ్వమస్యాం నివిశతే యదేజతి। అరిష్టా సస్త ఉర్వీతమస్వతి రాత్రి పార మశీమహి భద్రే పార మశీమహి."

టీక. దేనియంతము చూడఁబడకుండ నున్నదో దేనియందుఁ బ్రపంచకమంతయు మునిఁగియున్నదో దేనివలన లోకము భీతిల్లుచున్నదో యట్టియో రాత్రీ నిన్ను నేను శరణుసొచ్చితిని, నీయంతమును మేము పొందుదుము గాక.

తైత్తిరీయసంహిత 1-5-5-4

"చిత్రావసో స్వస్తి తే పారమశీయ.'

టీ. ఓరాత్రీ నీయంతమును మేము పొందుదుముగాక.

దీని బ్రాహ్మణము:—"చిత్రావసో స్వస్తితే పారమశీయే త్యాహ। రాత్రిర్వై చిత్రావసుః। అవ్యుష్ట్యై వా ఏతస్యై పురా బ్రాహ్మణా అభైషుః."

చిత్రావసు వనఁగా రాత్రి. అది తెల్లవాఱకుండ నుండుటవలనఁ బూర్వమందు బ్రాహ్మణులు భయపడిరి.

భాస్కరాచార్యకృత సిద్ధాంతశిరోమణి, గోళాధ్యాయము, సప్తమాధ్యాయములో 6, 7 శ్లోకములను జూడుఁడు.

"షట్ షష్టిభాగా భ్యధికాః పలాంశాః యత్రాధతత్రా స్త్యపరో విశేషః। లంబాధికా క్రాంతిరుదక్చ యావ త్తావద్దినం సంతతమేవ తత్ర। యావచ్చ యామ్యా సతతం తమిస్రా తతశ్చ మేషా సతతం సమార్ధమ్."

ఈశ్లోకములలోఁ గూడ మేష వనఁగా నుత్తరధ్రువమునకుఁ జేరు. దాని దగ్గఱి సంవత్సరములో నాలుమాసములు పగలు, నాలుమాసములు రాత్రియు నని చెప్పఁబడినది.

"దైవే రాత్ర్యహనీ వర్షప్రవిభాగ స్తయోః పునః। అహ స్తత్రోదగయనం రాత్రిస్స్యా ద్దక్షిణాయనమ్ (మనుస్మృతి 1 అ. 67 శ్లో.)

టీ. రాత్రియనియుఁ బగలనియు దేవతలచే సంవత్సరము రెండు భాగములుగా విభజింపఁబడినది. ఆ భాగములలో నుత్తరాయణము పగలు, దక్షిణాయనము రాత్రి.

మహాభారతము, వనపర్వ, 164 అధ్యాయములో:—"విభక్తభావో నబభూవ కశ్చి దహోనిశానాం పురుషప్రవీర। బభూవ రాత్రిర్దివసశ్చ తేషాం సంవత్సరే ణైవ సమానరూపః" (ఓయి పురుషశ్రేష్ఠుఁడా! అహోరాత్రములకు విభాగము లేదు. అచట నివసించువారికి రాత్రియుఁ బగలుఁ గలిసి దీర్ఘమయిన యొకసంవత్సర మగును.

ఈరీతిగా నతిదీర్ఘమగుపగలుకూడ నున్న దని చెప్పు మంత్రము లనేకములున్నవి. వానిలోఁ గొన్నింటి నిచట వ్రాయుచున్నాను.

X-138-3. విసూర్యో మధ్యే అముచద్రథం దివో విదద్దాసాయ ప్రతిమానమార్యః। దృహ్ళానిపిప్రో రసురస్య మాయిన ఇంద్రో వ్యాస్యచ్చకృవాన్ృజిశ్వనా.

IV-55-3. ప్రపస్త్యా మదితిం సింధుమర్కైః స్వస్తి మీళే సఖ్యాయ దేవీమ్। ఉభేయథా నో అహనీనిపాత ఉషాసానక్తా కరతామదబ్ధే.

V-54-5. తద్వీర్యం వో మరుతో మహిత్వనం। దీర్ఘం తతాన సూర్యో నయోజనమ్.

దీర్ఘమయిన యుషస్సును గుఱించి కూడ ననేకమంత్రములు కలవు.

I-113-13. శశ్వత్పురోషా వ్యువాస దేవ్యథో అద్యేదం వ్యావో మఘోనీ। అథో వ్యుచ్ఛా దుత్తరాం అనుద్యూనజరా మృతా చరతి స్వధాభిః.

ఇట్లు ఋగ్వేదమంత్రవిమర్శనమువలన నుత్తరధ్రువమందు దీర్ఘనిశలు దీర్ఘాహములు, దీర్ఘోషస్సు నున్నట్లును, వానిని వేదకవులు కన్నులారఁ జూచి తా మనుభవించిన యనుభవము నీరీతిగా వ్రాసినట్లును నిశ్చయింపఁబడినది. వేదమంత్రములను రచించిన ప్రాచీనార్యుల నివాసస్థాన ముత్తరధ్రువప్రాంతమందుఁ గానియెడల నిట్టివ్రాఁతలు సంగతములు కాకపోవును.

పైని వ్రాసిన వేదోక్తాంశము లన్నియు ఇరాన్ (Iran) దేశస్థుల (పారశీకదేశస్థుల) వేద మగుఛందోవస్థాన (Zend Avesta) గ్రంథములోఁ బ్రతిపాదింపఁబడిన యంశములతోఁ బూర్ణముగా సంవదించుచున్నవి. ఎట్లనఁగా; ఋగ్వేదమందువలె నీగ్రంథములోఁ గూడ నార్యుల మొదటినివాసస్థాన ముత్తరధ్రువసమీపమం దుండె ననియు, నాకాలమం దాప్రదేశము మనుష్యులు నివ

సించుట కుపయోగముగా నుండె ననియు నజ్ఞాతకారణములచే నయ్యార్యసంఘ మంతయు నలుగడలకుఁ జెదరి పోయె ననియు, నట్లు చెదరి పోయినవారిలోఁ గొందఱు ఆక్షస్ (Oxus) జాక్సార్టీస్ (Jaxartes) సింధునది మొదలగు నదులసమీపమం దున్న దేశములకు వచ్చి స్థిరనివాసు లయి రనియుఁ దెలుపు వాక్యము లనేకము లున్నవి. ఛందోవస్థానము గూడ వేదమువలె ననాదికాల ప్రవృత్త మని యిచట స్థాపించుట యనావశ్యకము. వేదము, అవెస్థా, అను నీరెండును నాద్యప్రవాహముయొక్క శాఖాద్వయ మని విమర్శకు లగువిద్వాం సు లందఱు నిర్వివాదముగా నొప్పుకొన్న విషయమే. కాని యీరెండింటిలో వేదమువలె నవెస్థ జాగరూకతతో మొదటినుండి రక్షింపఁబడ లేదు. అందువలన దీనికిఁ గొంత గ్రంథలోపము సంభవించినది. ఛందోవస్థానభాషకు సంస్కృత భాషకుఁ గలసాదృశ్య సామ్యము లేక ముం దున్న గ్రంథభాగములోఁ గనఁ బడుచు. దీర్ఘాహములు, దీర్ఘనిశలు కల వని చెప్పువాక్యములు వేద మున మెండుగాఁ గానవచ్చుచున్నవి, గాని, చిరకాలము వారు సుఖముగా నివ సించి యున్నప్రథమనివాసస్థానము నేహేతువుచే విడిచి పెట్టి దేశాంతరములకుఁ బోయిరో యాహేతు వేదము నెచ్చటను జెప్పఁబడ లేదు. అటులె మంచునం దుచే నావరింపఁబడి నివాసమున కశక్యము కాఁగా నార్యు లాయుత్తరధ్రువ ప్రాంతమునుండి శీఘ్రముగా లేచి వచ్చి కొందఱు పడమటివైపు మఱికొందఱు దక్షిణమువైపు పోయి రని ఛందోవస్థానమం దొకవాక్యములోఁ జెప్పఁబడి యు న్నది. ప్రళయకాలమం దీభూమి జలావృత మయి యుండు నని మనపురాణ ములలోఁ గూడ నున్నది. ఆకాలమున కర్వాచీనుఁ డగుపాణిని కూడ "కేకే యమిత్రయుప్రళయానాం యాదేరియః" (7-3-2) అనుసూత్రములో "ప్రాలే యశబ్దము" ప్రళయశబ్దమునుండి పుట్టిన దని చెప్పుటచే నవస్థలోఁ జెప్పినట్లు మన యార్యులు మొదటినుండి మంచువలనఁ గలుగు నపాయము నెఱుఁగని వారు కా రని సూచన చేయఁబడుచున్నది.

ఈఛందోవస్థానగ్రంథము మనఋగ్వేదమువలె నతిప్రాచీన మయిన దయినను, నేకారణముచేతనో కొంత గ్రంథము నష్ట మయినది. మిగిలినది రెండధ్యాయముల గ్రంథము. దానిలో వెండిడాడ్ (Vendidad) అనునది రెండు భాగములు కలది. దీనిని పాశ్చాత్యపండితు లగు Anquetil, Pietel, Spiegel, Haug, Bunsen, Darmesteter మొదలగువారు మిక్కిలి శ్రమతోఁ గృషిచేసి యాంగ్లేయభాషలో ననువాదములు వ్రాసి సారమయిన ప్రాచీన

చారిత్రాంశములను లోకమందు వెల్లడిచేసిరి. ఈమతగ్రంథములో నీశ్వరుని పేరు అహురా మజ్దా (Ahura Mazda) ఈమతకర్తపేరు జోరోష్టర్ (జర దుష్ట్రుఁడు). అపోషా అనువాఁడామతస్థుల వృత్రాసురుఁడు. తిష్ట్రియా (Tishtrya) వారి యింద్రుఁడు. అపోషా (Apaosha) అనువాఁ డుదకములను నిరోధింపఁగా తిష్ట్రియా యను పేరుగల యింద్రుఁడు వానిని జంపి జలమును బ్రవహింపఁజేసె నని యవెస్థలో నున్నది. ఈయంశము మనఋగ్వేదములో ననేకమంత్రముల యందుఁ జెప్పఁబడియున్నది. ఈదిగువ వ్రాయఁబడినమంత్రమును జదువుఁడు.

I-85-9. త్వష్టా యద్వజ్రం సుకృతం హిరణ్యయం సహస్రభృష్టిం స్వపా అవర్తయత్, ధత్త ఇంద్రో నర్యపాంసి కర్తవే అహన్వృత్రం నిరపా మౌబ్జదర్ణవమ్.

టీక. దేవశిల్పి యగుత్వష్ట బంగారముతోఁ జేయఁబడినదియు వేయంచులు గలదియు నగు నేవజ్రాయుధము నింద్రుని కిచ్చెనో దానిచే నింద్రుఁడు వృత్రాసురుని వధించి వాఁడిదివఱకు నిరోధించిన యుదకములను మరలఁ బ్రవహింపఁజేసెను.

ఈమతస్థులును సూర్యకాంతి లేకపోవుటచే దహనముఁ జేయఁజాలక శవముల నిండ్లలో నెలలకొలఁది యుంచుకొని రనియు, వీరి నివాసస్థానమంతయు హిమపాతముచే నశింపఁజేయఁబడె ననియుఁ జెప్పఁబడియున్నది. వీరు నివసించు స్థానమునకు ఐర్యన వేజో (Airyana Voejo) (ఆర్యనివేశము) అని పేరు. ఋగ్వేదమందుఁ జెప్పఁబడిన దేశములు, నదులు, దేవతలు, నీగ్రంథమందుఁగూడఁ జెప్పఁబడినవి. ఇందులోఁ బేర్కొనఁబడిన "రంఘు" అనునది—

X-75-6. తృష్టా మయా ప్రథమం యాతవే సజూః సుసర్త్వా రసయా శ్వేత్యా త్యా। త్వంసింధో కుభయా గోమతీం క్రుముం మేహంత్వా సరథం యాభిరీయసే॥ అనుఋక్కులోఁ జెప్పఁబడిన "రస" అనునదియే యనియు, నిది క్రుము, కుభ, గోమతి యనునదులతోఁ గలిపి చెప్పఁబడుటచే నిదియు సింధునది కుపనది యనియు సమర్థింపఁబడినది. అవెస్థలో "వరేణ" అనునది వరుణదేవతకుఁ బేరు. హప్తహెందు అనఁగా సప్తసింధువు. ఇది పంజాబుదేశమునకుఁ బేరు. ఇమ అనఁగా యముఁడు. వీవన్ఘాట్ అనఁగా వైవస్వతుఁడు. ఇట్లు విమర్శించినకొలఁది ఛందోవస్థానమునకు ఋగ్వేదమునకుఁ బ్రతివిషయమందును బహుళ మగుసాదృశ్యము చూపట్టుచున్నది. ఇట్లు ఋగ్వేదను అవస్థ

గ్రంథము నార్యుల ప్రాచీనవృత్తాంతమును దెలుపుటకు ముఖ్యమయిన లేఖ్యప్రమాణము లయి యున్నవి.

ఆర్యులు చిరకాలము తాము నివసించియున్న ప్రథమనివాసస్థానమును విడిచి విభక్తసంఘులై కొందఱు దక్షిణమువైపు మఱికొందఱు పడమటివైపు చెదరి పోయిరి. దక్షిణముగా బయలుదేఱినవా రాసియాఖండపు మధ్యభాగమందుఁ గొన్నాళ్లుండి తరువాతఁ గ్రమముగా భరతఖండమునకు వచ్చి పాంచాలదేశములో సింధునదీతీరమందుఁ గొంతకాలము కృతనివాసులై యుండి పిమ్మట భరతఖండమం దంతట వ్యాపించిరి. పడమటివైపు పోయినవా రైరోపాఖండపుదేశముల నాక్రమించిరి. మొదట నీయార్యు లందఱు మాటలాడు భాష, మతము, నాచారము లొక్కటియే యనియు వీరిమూలపురుషులు కూడ నొక్కరే యనియు శబ్దశాస్త్రముచేతను (Comparative Philology) నానాదేశపురాణకథలచేతను (Comparative mythology) రుజువు చేయఁబడినది.

## 4. హిందూ ఐరోపా భాషాకుటుంబము.

## Hindu European family of Languages.

ఆదిమనివాసస్థానమును విడిచి నలుదెసలకుఁ జెదరి పోయిన యాయార్యులభాష, వీరాశ్రయించిన దేశములఁ బట్టియు నాదేశముల శీతోష్ణస్థితిని బట్టియు నింక ననేక కారణములఁ బట్టియుఁ బలుతెఱఁగులుగా మాఱి కాలక్రమమున ననేకభాష లయినవి ఆభాష లెవ్వి యనిన; 1. ఆర్యభాష, 2. అర్మీనియన్భాష, 3. గ్రీకుభాష, 4. ఆల్బేనియన్భాష, 5. ఇటాలిక్భాష, 6. కెల్టిక్భాష, 7. జర్మానిక్భాష, 8. బాల్టిక్ శ్లవోనిక్భాష యని యెనిమిదిభాషలు. వీనిలో నార్య భాషాసంఘము హిందూశాఖ యనియు ఇరేనియన్ శాఖ యనియు రెండుభాగములుగా విభజింపఁబడియున్నది.

### 1. ఇరేనియన్ శాఖ.

దీనిలోఁ బ్రాచీన ఇరేనియన్భాష, నవీన ఇరేనియన్భాష యని రెండు భాష లున్నవి. ప్రాచీన ఇరేనియన్భాష ఛందోవస్థానభాష యనియుఁ బ్రాచీనపారశీకభాష యనియు రెండుతరగతులుగా విభజింపఁబడినది. పారశీకులమంత్రగ్రంథ మగుఛందోవస్థానము ఛందోవస్థానభాషలో వ్రాయఁబడినది. దీనిలోఁ బ్రాచీనభాగము క్రీస్తుకుముం దనేకసంవత్సరశతములక్రిందట రచింపఁబడినది. ఈప్రాచీనఛందోవస్థానభాషకు గాథాభాషయని మఱియొక పేరు కలదు. ఇది సంస్కృతమునకు మిక్కిలి దగ్గఱభాష. క్రీస్తుకు ముం దయిదు

వంశల సంవత్సరముల క్రిందట జీవించిన డెరయస్ మొదలగు అచిమినిడియన్ రాజులశాసనము లీప్రాచీన పారశీకభాషలో వ్రాయఁబడియున్నవి.

క్రొత్త ఇరేనియన్ శాఖలో నూతనపారశీకభాష, పామర్, ఆఫ్ఘన్, బెలూచి, కురుడిష్ మొదలగు ననేకావాంతరభాష లున్నవి.

## 2. హిందూశాఖ.

దీనిలో ఋగ్వేదభాష యనియు లౌకికసంస్కృతభాష యనియుఁ బ్రాకృతభాష యనియు మూఁడుతరగతులు గలవు. మిక్కిలి పురాతన మగు వేదభాషలో ఋగ్వేదసంహిత వ్రాయఁబడినది.

పై దేశమునుండి వచ్చిన యార్యు లీభరతఖండమందు వ్యాపించిన తరువాత వీరితోఁ దఱచు సంబంధము గలిగియుండు నీదేశపు టాదిమనివాసు (Aboriginies) లార్యుల భాష నుచ్చరించుట కష్టముగాఁ గాన్పించుటచేఁ బలుక వలసినవిధమునఁ బలుకలేక వర్ణలోప వర్ణవ్యత్యయాదులచే నార్యులభాషకు వికృతిఁ గలిగింప సాగిరి. ఇట్లు నానాఁటికి మాఱుచుండెడి తమభాషాస్థితిని జూచి సంస్కరింపఁ దలంచి కొందఱు ఋషులు, వర్ణోచ్చారణము, వర్ణసంధి మొదలగు వానికి ననేకనియమము లేర్పఱిచి ప్రాతిశాఖ్యలను, మఱి కొందఱు శబ్దవ్యుత్పత్తులను (Derivation) దెలుపు నిఘంటువులను, కొందఱు వ్యాకరణములను వ్రాసి యప్పటికి నిలిచియున్న భాష కంతకును నియమముల నేర్పఱిచి సంస్కరించిరి. ఇది సంస్కరింపఁబడిన భాషయగుటచే సంస్కృతభాష యని పేరొందెను. ప్రాచీనార్యభాష యగు వేదభాషకంటెఁ గొన్నివిషయములలో నిది విభిన్న మయినది గావునఁ బాణిన్యాచార్యుఁడు దీనికి లక్షణముఁ జెప్పినపుడు తనయష్టాధ్యాయిసూత్రములలోఁ బలుచోట్ల దీనిని భాష యనియే వ్యవహరించెను. ఇది చిరకాలము మనుష్యులచే మాటలాడఁబడు భాష యై (Spoken language) యుండెను. ఇట్లు సంస్కరింపఁబడిన భాషనుండియే ప్రాకృతభాష లుత్పన్నము లయినవి. ఈయంశ మంతయు నేను లోఁగడ వ్రాసియున్న "ప్రాకృతభాషోత్పత్తి" యనువ్యాసములో విపులముగాఁ జర్చించితిని.

### ప్రాకృత భాషలు.

వీనికి మధ్యకాలపు హిందూభాష లనిపేరు. ఈగుంపులో మహారాష్ట్రీ జైనమహారాష్ట్రీ, మాగధీ, అర్ధమాగధీ, శౌరసేనీ యనుభాషలు కలవు. ప్రాకృత వ్యాకరణకర్త యగుమార్కండేయుఁడు వీనికి భాషావర్గ మని పేరిడెను.

| ENGLISH | SANSKRIT | ZEND | GREEK | LATIN | GOTHIC | LETUNIAN | IRISH | SLAVONIC |
|---|---|---|---|---|---|---|---|---|
| Horse | asva | aspa | hippos | equ us | aihna | aszwa | erh | |
| Pig | sukara | hu | hus | sus | su | | | |
| Sheep | avis | | owis | | | ewe | oi | awis |
| Cattle | pasu | pasu | | pecu | faihu | | | |
| night | nakta | | nukt | noct | naihta | natetis | | nosti |
| mouse | mushaka | musheke | mus | mus | mus | | | myse |
| mead | madhu | madhu | methu | | | midus | | medu |
| Yoke | yugam | yugam | zugom | jugom | | jungas | | |
| Red | rudhiras | | eruthros | ruber | | rands | ruad | rudru |
| father | pitar | pita | pater | peter | fador | | athir | |
| mother | Mata | mair | mater | mater | | | Mathir | mati |
| brother | bhrater | broter | phrater | frater | brodar | brotis | | |
| bear | bharami | | phero | fers | baira | | | |
| thou | tvam | tum | tu | tu | du | tn | | |
| six | shas | | hex | sax | saihs | | ses | te |
| ten | dasa | das | deka | decem | taihun | | | desente |
| son | Sunu | hunu | | | | | | synu |

తక్కినవి యపభ్రంశ, పైశాచి, చూళికాపైశాచి యనుభాషలు. బౌద్ధులకు పాళీభాషవలె జైనుల కర్ధమాగధీభాష మతభాష.

## క్రొత్త హిందూభాషలు.

గుజరాతీ లేక మార్వారీ, శౌరసేన్యపభ్రంశమునుండి యు, మరాఠీ భాష మహారాష్ట్రీ యపభ్రంశమునుండియు, బిహారీ, పాశ్చాత్యవంగభాషయు మాగధీ యపభ్రంశమునుండి యుఁ బుట్టినవి. ఇవిగాక ఆసామీ, నేపాళీ, కాశ్మీరీ, ఉరియా, బంగాళీ, హిందీ, పంజాబీ, సింధీ, గుజరాతీ మొదలగు భాషలా యాయి దేశములందు వ్యవహరింపఁబడుచున్నవి.

౮. పూర్వోక్తము లగునార్యభాషలకుఁ గలపరస్పరసంబంధము.

ప్రక్కపుటలోఁ జూపఁబడిన పట్టికలో వ్రాసిన యాయాయిభాషాశబ్దముల యర్థసాదృశ్యమును, రూపసాదృశ్యమును విమర్శించి చూడఁగా నీభాషలకుఁగలపరస్పరసంబంధము మనకు స్పష్టమగును. ఈపట్టికలో మనుష్యులకు మచ్చికపడిన జంతువులపేర్లు, వస్తువులపేర్లు, గుణవాచకములు, పనులను దెలుపు మాటలు, వావివరుసలను బోధించుపదములు, సర్వనామశబ్దములు, సంఖ్యావాచకములు చేర్పఁబడినవి.

పట్టికలోఁ జూపించిన నానాభాషాశబ్దముల కెట్టిపరస్పరసాదృశ్యమున్నదో చదువరులు ధాతురుగాక. అల్ప మగువర్ణవ్యత్యయ వర్ణవికారములనొంది యొక భాషలోని శబ్దము మఱియొకభాషలో వాడుక చేయఁబడుచున్నది. ఈపదము లన్నియు నొకభాషనుండి యిం కొకభాషలోని కెరవు తేఁబడినవా లేక యే మాతృభాషనుండి యీయార్యభాష లన్నియు నుత్పన్నము లయినవో యట్టి మాతృభాషలోనివా? యనునీయంశమును నిశ్చయించుట సులభము కాదు. అయిన నీయార్యభాషల స్వభావమును బట్టి చూడఁగా Latin లో నొకశబ్దము గ్రీకుభాషలోనిది యనియు గ్రీకుభాషలోని శబ్దమొకటి జర్మనీభాషలోనిది యనియుఁ జెప్పుటకు మాత్ర మవకాశము కలదు. విదేశీయశబ్దములను విడిచిపెట్టి యీభాషల కన్నిటికిఁ బొదువుగా నున్నశబ్దరూపములు క్రియారూపములు వీని కుత్పాద్యమయిన మాతృభాషలో నివియేయనియు విభాగావస్థయందుఁ దమ కుపయోగ మయినలక్షణముల నన్నింటిని మాతృభాషనుండి స్వీకరించినవనియు మనము చెప్పఁగలము.

పట్టికలోఁ జూపింపఁబడిన యార్యభాష లన్నిటిలోఁ బొదువుగా నున్న శబ్దము లార్యసంఘము విడిచిపోవుకాలమునకుఁ బూర్వమం దుండవలెను. అందు

వలన నార్యు లాప్రాచీన కాలమం దెట్టిజ్ఞానము కలవారై యున్నారో యేమి చూచియున్నారో యేమి వినియున్నారో దానినంతయుఁ దెలుపుట కవి సాక్షులై యున్నవి. ఇందు కుదాహరణముగా నశ్వమనుశబ్దమును దీసికొని విచారింతము. దీనికి ఋగ్వేదభాషలో "ఆశు" అని పేరు. "ఆశు" అనఁగా శీఘ్ర మని యర్థము. దాని శీఘ్రతను బట్టి యీజంతువున కాపేరు కలిగినది. దీనితో సంబంధించిన వధ్రీ ఖలీన శబ్దములకు సరి యియిన (Ephirus) ఎఫిరస్, చలీన అను గ్రీకుశబ్దము లున్నవి. సం-అజ-గ్రీకు-ఐజ్. (aig) ఈ అజధాతువునుండి పుట్టినశబ్దమునకు తోలఁబడుజంతు వని మొదటియర్థము. దీనితో సంబంధించిన శబ్దములు. సం "అజిన-గ్రీకు-అల్జిస్- (algis) శ్లవోనిక్-అజ్నో (aznc) మొదలగునవి. వీని మొదటియర్థము మేఁకతోలు, తరువాత సామాన్యముగా జంతుచర్మము. అట్టులే సం॥ పురీ, గ్రీకు-పోలిస్ (Polis)

| Gr. | Latin, | German. |
|---|---|---|
| ములె | మోలా | ముళి |
| (mule) | (mola) | (muli) |

ఈశబ్దము లన్నియు నార్యులు సంఘమునుండి విడిపోకమునుపు పిండిఁజేయుసాధనము నెఱింగియుండి రని సాధించుటకు సాక్ష్య మిచ్చుచున్నవి. ఈ కాలమందు మన కున్నసాధనముల వంటివి యపుడు వారికి లేక పోవచ్చును. ఇపుడు మనము వాడుకచేయు తిరుగలి వంటి దొకటి వారి కుండఁబోలును. పైనిఁ జెప్పఁబడిన శబ్దము లన్నియు నార్యభాషలోని "మర్" అను ధాతువునుండి పుట్టినవి. కాని వేఱువేఱు ప్రత్యయములు చేర్చుటచే నీశబ్దరూపములు సిద్ధించినవి. సంస్కృతభాషలో నీసాధనమునకు పేషణీ యని పేరు. ఇది రుధాది యగుపిష్‌ధాతువునుండి పుట్టినది.

దున్నుట యనునర్థముగల అర్ ధాతు వార్యులు కృషీవలు లయి జీవించిరని తెలుపుచున్నది. పడవ గడపు తెడ్లచే నీటిని కదలఁగొట్టుట యని కూడ నీధాతువున కర్థము. అరిత్రశబ్ద మీధాతువువలనఁ బుట్టినది. దీనికి గ్రీకుభాషలో అరెట్మస్- Latin లో రేమస్ - లిథూనియన్భాషలో ఇర్కస్, Irish భాషలో రామ్.

"నాఁగలిచే దున్నుట" అనునర్థములో నీ "అర్" ధాతువునుండి మఱి కొన్ని శబ్దములు పుట్టుచున్నవి. గ్రీకు-అరోగోథిక్-అర్జన్- (Latin) అర్తి. ఈ ధాతువునుండి పుట్టిన మఱికొన్ని ప్రాచీనశబ్దములు కలవు. సం॥ ఇరా-ఇడా.

(భూమి) అర్వ్వరాశబ్ద ముర్వ్వరగా మాఱినది, జంద భాషలో "ఉర్వ్వర" అనఁగా భూమిలోఁ బండినపంటకుఁ బేరు. ఒకశబ్దమునకే యొకభాషలో నొకయర్థము మఱియొకభాషలో మఱియొకయర్థము కలుగును. భ్రాతృశబ్దము గ్రీకుభాషలో సోదరుఁ డనునర్థమును విడిచి యొకజాతిలోఁ బుట్టినవాఁ డని చెప్పుచున్నది. కావున నార్యు లందఱు మొదటి స్థానమునుండి చెదరి పోయినతరువాతఁ గూడ గ్రీకులు హిందూ ఆర్యులతోఁ గొంతకాలము కలిసి యుండి రని మన మూహింపవలసి యున్నది. అట్లు కానియెడల సంస్కృతశబ్దములకు గ్రీకుశబ్దములకు నిట్టిరూపసాదృశ్యము గలుగక పోవును.

| సంస్కృతము. | గ్రీకు. | సంస్కృతము. | గ్రీకు. |
|---|---|---|---|
| పురీ - - - | పోలిస్ | జాను - - - | జోను |
| పత్ని - - - | పోట్నియా | అజస్ - - | అజన్ |
| వరుణ - - | ఔరణస్ | అజ్ర - - - | అగ్రస్ |
| వస్తు - - - | అస్తు | పద - - - | పెడో |
| అస్థి - - - | అస్టియో | ఉరా - - - | ఎయిరస్ |
| ఉర్వ్వరా - - | అరోరా | పృఛ్ - - - | ప్లెకో |
| దారు - - | డోరు | కృా (to cut) - | కెయిరో |
| క్షుర - - - | జురస్ | నౌస్ - - - | నౌస్ |
| పరశు - - | పెలికస్ | అర్జునీ - - | అర్జునీస్. |
| మనస్ - - | మెనస్. | | |

పైని వ్రాసినశబ్దముల పట్టికవలన నార్యభాష లన్నిటిలో సంస్కృతమునకు గ్రీకుభాషకు హెచ్చయినసాదృశ్య మున్నట్లు కానవచ్చుచున్నది. తక్కిన శాఖలవా రొకరు మఱియొకరిని విడిచి దేశాంతరమునకుఁ బోయినను హిందూ ఆర్యులు గ్రీకులు కొంతకాల మొకచోటఁ గలిసియుండి రని యిందువలన నను మేయింపఁదగియున్నది.

గ్రీకుభాషకంటె జందుభాషకు సంస్కృతముతో నధికతరసాదృశ్యము కలదు. పశ్చిమోత్తరముగా వలస పోయిన యార్యు లెఱుంగనిదేవతల నామములు మఱికొన్ని శబ్దవిశేషము లీయుభయభాషలలోఁ గానవచ్చుచుండుట చేత నీరెండుజాతులవారు నొకచోటఁ జిరకాలము కలసి మెలసి యున్నట్లు తోఁచుచున్నది. సంస్కృతములోఁ "బ్రకాశించువాఁ" డని యర్థమిచ్చు "దేవ"

శ్రీరస్తు.

# రెండవపుల కేశి నూతనతామ్రశాసనము.

ఇయ్యది గుంటూరుజిల్లాలోఁ గొప్పరమునొద్ద దొరకినది. శతావధానులును ఆశుకవిత్వచక్రవర్తిబిరుదాంకితులును నగు బ్రహ్మశ్రీ మహారాజరాజశ్రీ కొప్పరపు కవిసోదరులవలన నాకు లభించినది.

ఇందు మూఁడురాగిరేకులు గలవు. ఒక్కొక్కటి 7½ అంగుళములు పొడవును, 1¼ అంగుళములు వెడల్పును గలది. ఈమూఁడును నొకరాగికడియములోఁ గ్రుచ్చియున్నవి. ఈగాగికడియమునకు నొకచిన్నముద్ర దీర్ఘవృత్తాకారము కలది తగిలించి యున్నది. దీనిమధ్యకొల్తలు 1 అంగుళమును 1½ అంగుళము నుండును. ఈముద్రపై వరాహము, సూర్యుఁడు, చంద్రుఁడు నను విగ్రహములుమాత్రము కలవు. అక్షరములు లేవు. మొదటిరేకు పైవైపునను మూఁడవరేకు క్రిందివైపునను వ్రాఁత లేదు. చివరరేకు కొంచెము పగిలినది.

భాష:—శాసనమందలిభాష సంస్కృతగద్యము. చివరమాత్రము మామూలుశ్లోకము లున్నవి. వ్రాయసకాఁడు మిక్కిలి యశ్రద్ధతో నక్షరముల వ్రాసినట్లు తోఁచుచున్నది. ఎచ్చటనో కొన్నిచోటులఁ దప్ప అంతటను ననుస్వారములును, విసర్గలును వదలివేయఁబడినవి. ఎన్నియో యక్షరములు వదలివేసెను చూడుఁడు: 'భువన'కు 'భున' (పంక్తి 1), 'బృహస్పతి'కి 'బృస్పతి' (పం. 13), 'భవిష్యతి'కి "భష్యతి" (పం. 14) వ్రాసెను. లేఖకుఁడు చేసిన పెద్దతప్పు 5-వ పంక్తిలో నున్నది. 'ప్రియపుత్ర' అనివ్రాయుటకు బదులు 'ప్రియపౌత్ర' అని వ్రాసెను. రెండవపుల కేశి కీర్తివర్మకుమారుఁ డని మన మితరశాసనములవలన నెఱుఁగుదుము, గనుక నీతప్పు వెంటనె తెలిసికొనఁగలిగితిమి. లేనియెడల నీ శాసనము ద్వితీయపుల కేశి కుమారునిచేతనో, మఱి యెవరిచేతనో యీయఁబడియుండు నని మనము తలఁచియుందుము. ఈలేఖకుఁడు సంస్కృతము రాని దోషమువలన శబ్దముల విభక్తుల నిష్టము వచ్చినట్లు మార్చివేసెను. ఉదాహరణములు:—'రాజ్ఞేన' అనుటకు 'రాజ్యస్య' (పం. 9-10), 'సూత్రాయ' అనుటకు 'సూత్రస్య' (పం. 11), 'విప్రాయ' అనుటకు 'విప్రస్య' (పం. 11) అని వ్రాసెను.

అక్షరాదుల స్వరూపము:–ఇందలి యక్షరము లాఱవ యేడవ శతాబ్దమందలి. తెలుఁగుకన్నడాక్షరములు. ఇందలి యక్షరములు చక్కఁగాఁ జెక్కఁబడినవి. చెడిపోకుండ బాగుగానున్నవి. ఇవి, ద్వితీయపులకేశియొక్క నెరూరు[1] హైద్రాబాదు[2] తామ్రశాసనములందలి యక్షరములను ఆంధ్రసాహిత్యపరిషత్తువారి సంగ్రహములోని విష్ణుకుండిన మాధవవర్మ తామ్రశాసనమును[3] బోలియుండును. ఈశాసనమునందు బండిఱాకు వేఱుగుర్తు కలదు. అందువలన నానాఁటికే తెలుఁగువాఙ్మయ ముండె ననియు, సంస్కృతమునందు లేని యీ ధ్వని వ్రాయవలసివచ్చినప్పుడు సంస్కృతమునందలి లిపులు చాలక తెనుఁగు కన్నడమువారు బండిఱాను గల్పించుకొనవలసివచ్చెననియు మన మూహింపవచ్చును. ఇట్టి + + గీట్లతో ౭ అనునంకె తెలుపఁబడినది. ఇవి యంకెలు కావు, కేవలము హంసపాదము లనియు మనము తలఁపవచ్చును. కాని యివి హంసపాదములె యైనయెడల గీటునకుఁ గ్రింద నుండుటకు మాఱుగాఁ బైనఁ జూపఁబడినవి.

శాసనమందలి విషయములు:–సకలభువనములచే స్తుతింపఁబడు మానవ్యసగోత్రము గలవారును హారీతిపుత్రులును, సప్తలోకసప్తమాతృకలచేఁ జక్కఁగఁ బెంచఁబడినవారును, కార్తికేయుని పరిపాలనమువలనఁ గల్యాణపరంపరలఁ బొందినవారును, భగవన్నారాయణుని ప్రసాదమున సంపాదింపఁబడిన వరాహలాంఛనముయొక్క దర్శనక్షణమునందె యందఱురాజులను వశము చేసికొనినవారును, ఎన్నియో యశ్వమేధయాగములు చేసి యవబృథస్నానములచే శరీరములఁ బవిత్రము చేసికొనినవారును నగు చలుక్క్యలకులము నలంకరించువాఁడును, బ్రఖ్యాతకీర్తికలవాఁడును నయిన శ్రీకీర్తివర్మ పృథ్వీవల్లభమహారాజుయొక్క ప్రియపుత్రుఁడు సత్యాశ్రయశ్రీపులకేశి పృథివీవల్లభమహారాజు. ఈతఁ డెదిరించిన శత్రువర్గమును విధ్వంసము చేయుటయందు విశారదుఁడు; ప్రణతులగుమహాపతుల కిరీటములకుఁ దగిలియుండి మకరరూపముగా నున్న ముకుళితహస్తములీతని పద్మములవంటి రెండుపాదములకును రాపిడి చేయుచుండును. ఈతఁడు తండ్రివలెనే దేవద్విజగురువృద్ధులను వారివారి యోగ్యతకుఁ దగినట్లు గౌరవించుటయందు శూరుఁడు. ఈవల్లభునియెదుట పృథివిదువరాజు గ్రామము దానము చేసెను. ఈదువరాజు, కలికులములహంత, అనేకసంగ్రామసాహసదక్షుఁడు,

---

[1] Ind. Ant. Vol. VIII. p. 43. and plate. [2] Ind. Ant. Vol. VI p. 73 and plate. [3] Ep. R. Southern Circle, C. p. No. 7 of 1913-14.

చుట్టుపట్టుల నున్నమండలములను మ్రింగివేయుటలో గట్టివాఁడు, శత్రువులను గెల్చి తనకుమారునివంశమునఁ బరంపరగ జరుగునట్లుగ రాజ్యమును బ్రతిష్ఠాపించినవాఁడు. ప్రతిగ్రహీత, మూగమూరువాస్తవ్యుఁడును, ఆపస్తంబసూత్రుండును, శాండిల్యాయనగోత్రుఁడును, బ్రాహ్మణుఁడును నగు వేదశర్మ. ఈయఁబడినది, కర్మరాష్ట్రమందలి ఇర్బులిగ్రామమున ఎనిమిదివందల (?నివర్తనములు) పరిమితి గల క్షేత్రము. దీనికి హద్దులు. తూర్పున బలాకబల్వలము, పడమటఁ గర్మకార తటాకము, దక్షిణమునఁ గొండవేఱుపూర్వపథము, ఉత్తరమున విర్పఱుపథము

ఈ దానమును, ఆజ్ఞప్తియు, ప్రవర్ధమానవిజయరాజ్యసంవత్సరంబులు ౨౧. కార్తికమాసము, మహానవమి బృహస్పతివారమునాఁడు ప్రశస్తముహూర్తమున జరిగినది.

స్థలనిర్దేశము:—ఈ శాసనమునందుఁ బేర్కొనఁబడిన స్థలములలోఁ గర్మరాష్ట్ర మొకటి. ఇదియే కమ్మనాఁడు. ఈ రాష్ట్రము పేరు మిక్కిలి పురాతనకాలమునుండియు శాసనములలోఁ గానవచ్చును. జగ్గయ్యపేటస్తూపమున దొరకిన ఇక్ష్వాకుకులజుఁడైన పురుషదత్తుని శాసనమునందు[1] దీనికి కమ్మాకరఠ మని పేరు కలదు. ఆశాసనము ౨-వ శతాబ్దప్రాంతము నాఁటిది. అప్పుడు కృష్ణానది కుత్తరమున నున్నసమీపప్రదేశమునకుఁ గూడ కర్మరాష్ట్ర మన్నపే రుండెనేమో, ఆఱవశతాబ్దమునాఁటి పల్లవశాసనములలోఁ[2] గర్మరాష్ట్రము పేర్కొనఁబడినది. పదవశతాబ్దమునందున్న పొన్న యనుకన్నడకవి తనశాంతిపురాణమున, కమ్మనాండు వెంగివిషయములోనిది యని చెప్పియున్నాఁడు.[3] వేఁగిరాజుల ప్రభ హెచ్చి, వారిరాజ్యము విస్తార మయినకొలఁది నితరనాఁడులును వేఁగినాఁటి యంతర్భాగములుగ నెన్నఁబడుట సహజమేగదా. నరసారావుపేట తాలూకాలోని కొణిదెన గ్రామమున ఓపిలిసిద్ధచోడరాజుశాసన మొకటి కలదు[4]. అది ౧౩-వ శతాబ్దమునాఁటిది. అందు నాగ్రామము కమ్మనాఁటికి రాజధానిగా నున్నట్టు చెప్పఁబడినది. "కమ్మనాంటిలోన నిజరాజధానియైన కొట్టియదొన" [పంక్తి 148-9.] అని యందుఁ గలదు. బాపట్లతాలూకాలోని పెక్కుశాసనములలో[5] నయ్యది

[1] Kielhorn's List of Brahmi Inscriptions No. 1202. [2] The Ongodu Grant of Vijayaskanda Varma II & the Ongodu Grant of Simhavarma II Ep. Ind. Vol. XV p. 246. [3] శ్రీ నరసింహాచార్యులవారి కర్ణాటకవిచరిత్రము, ప్రథమభాగము. [4] Ep. R. (S. C.) stone inscription 192 of 1899. ఆంధ్ర పరిషత్పత్రిక సంపుటము 8, పుట 361. [5] Ep. Ind. Vol. X p. 136. Ep. Re. 166, 174 of 1892 &c.

కమ్మనాఁడని చెప్పఁబడినది. అట్లె నంగోలుతాలుకా[1] సత్తెనపల్లి[2] తాలూకాల లోని శాసనములలోను గలదు. అట్లె యీనాఁడు పశ్చిమమున మార్కాపు రము తాలూకావఱకు వ్యాపించిన ట్లున్నది. గుండ్లకమ్మ యేటియొడ్డున మా ర్కాపురముతాలూకాలో నున్నచేటలిపాడు కమ్మనాఁటిలోనిది యని యొకశా సనము[3] కలదు. ఇది శా. శ. ౧౧౮౨ లో నిది అనఁగా గణపతిమహారాజు కాలము నాఁటిది. ఇది త్రిపురాంతకమునం దున్నది.

ఇప్పుడు కర్నూలుజిల్లా నందికొట్టూరు తాలుకాలో నున్న శ్రీశైలము కూడ శా. శ. ౧౪-వశతాబ్దప్రాంతమునఁ గమ్మనాఁటిలోనిదిగనె యుండిన ట్లచ్చట రెండుశాసనములు కలవు.[4] కావున నిది యంతయుఁ నాలోచించి చూడఁగా సత్తెనపల్లిలోఁ గొంతభాగము నరసారావుపేఁట వినుకొండ తాలూకా గల ప్రదేశము కమ్మనాఁటియొక్క మూలప్రదేశ మనియు, నది యొకప్పు డుత్తరమునఁ గృష్ణానది దాఁటి కొలఁదికోసులవఱకు వ్యాపించె ననియు, నొకప్పుడు పశ్చిమ మున గుండ్లకమ్మ యేఱు దాఁటి శ్రీశైలమువఱకుఁ దూర్పున గుంటూరు తా లూకాలోనికి దక్షిణమున బాపట్ల ఒంగోలు తాలూకాలలోనికిని వ్యాపించె ననియుఁ దెలియుచున్నది. ఉత్తరమున పలనాఁడు, ఆఱువేలనాఁడు, తూర్పున వెలనాఁడును, దక్షిణమున వెలనాఁడు పాకనాఁడు అద్దంకిసీమయుఁ గమ్మరాష్ట్రము నకు హద్దులుగా నుండెను. ఆయానాఁడుల నేలురాజుల పరాక్రమములఁబట్టి యాయానాఁడుల సరిహద్దు లొకప్పుడు హెచ్చుటయు నొకప్పుడు తగ్గుటయుఁ గూడఁ గలదు. కావున నొకప్పు డొకభాగమునకు నొకపేరును, మఱియొకప్పు డింకొకపేరు నుండుటయు సంభవించును. కమ్మనాఁడు ౧౬౦౦౦ వేల దేశము. ఇచ్చటి యాదిమ కాఁపులకుఁ గమ్మ వారనియును నిచ్చటి బ్రాహ్మణులకు గురణ కమ్మ లనియుఁ బేళ్లు వచ్చెనని తోఁచుచున్నది.

ఇట్లు నరసారావుపేఁటతాలూకా కమ్మనాఁటిలోనిది గావునను, ఈశాసన మాతాలూకాలోనే దొరకినందునను, ఇందుఁ జెప్పఁబడిన ఇర్పులిగ్రామ మా తాలూకాలోనే యుండె నని మన మూహింపవచ్చును. కాని యిప్పు డా పేరు గలగ్రామ మాతాలూకాలోఁ గనఁబడదు. శాసనమున నీయఁబడిన ఈ హద్దుల ననుసరించి యీగ్రామప్రదేశమును నిర్ణయింప యత్నింతము. గ్రామమునకు దక్షిణమున కొండవేఱుపూర్ పథ ముండె నని చెప్పఁబడినది.

[1] Ep, Ind. Vol. VIII p. 238. N. I. Ongole 17. &c. [2] Ep. Re. 252 of 1897; Mackenzie M.S.S. Vol. XX 15-3-63 &c. [3] Ep. Re. 196 of 1905. [4] Ep. Ind. XV p. 18. Ep. Re. 27, 36 of 1915,

(పం. 12) కొండవేఙుపుర మిప్పటి కొండవీడు పురమై యుండును. పదునాల్గవ శతాబ్దమున 'కొండవీడు' అనఁబడుపట్టణమును, ఏడవశతాబ్దమందు కొండ వేఙు అనుచుండి రేమొ. 'పూర్' అనుటవలన నది యప్పుడు పట్టణముగ నుండె ననుటకు సందేహము లేదు. ఉత్తరమున విర్పఙుపథ ముండెను (పం. 12) విర్పఙు అనునది విప్పర్ల యైయుండును. కావున ఇర్బలియనుగ్రామము కొండ వీటి కుత్తరముగను, విప్పర్లకు దక్షిణముగ నుండెనేమొ. తూర్పుహద్దు 'బలాక బల్వల' అని యున్నది. (పం. 11-12) దీనిని 'బలాకపల్వల' అని దిద్దవచ్చును. 'బలాకపల్వల' మనఁగా కొంగలకుంట, పడమటిహద్దు 'కర్మకారతటాక'ము. అనగాఁ గమ్మరివాండ్రచెఙువు ౧౦-వ పంక్తిలో 'దువరాజమాణత్తి మూగమూ ర్వాస్తవ్యాయ' అని యున్నది. దీనిని 'దువరాజ[వ*]మా[ణ*]నోత్తిమూగ మూర్వాస్తవ్యాయ' అని దిద్దవలెను. ఇట్లు దిద్దినయెడల, 'దువరాజవర్మయొక్క అత్తిమూగమూరులోఁ గాఁపురముండువానికి' అని యర్థ మగును. అత్తిమూ గమూ రొక గ్రామ మగును. నెల్లూరులోని కందుకూరుతాలూకాలో, ముంగ మూ రొకటి కలదు. దానికి అత్తివర్మయను రాజుపేరిట 'అత్తిమూగమూ' రన్న పేరు వచ్చియుండును. గుంటూరుజిల్లాలో దొరకిన గోరంట తామ్ర శాసనమువలన[1] అత్తివర్మ కృష్ణయొడ్డున గుంటూరుజిల్లాలో రాజ్యము చేసి నట్లు తెలియుచున్నది. అతనిరాజ్యము కందుకూరి వఱకు వ్యాపించియుండును.

శాసనకాలనిర్ణయము:—పులకేశిరాజు వేంగిదేశముమీఁదికి దండెత్తివచ్చి నపు డీశాసనము పుట్టిన దనుట స్పష్టము. కాని యాతఁడు మనదేశముమీఁ దికి దండెత్తివచ్చినకాల మెద్ది యనినవిషయమునఁ బండితులు భిన్నాభిప్రాయు లై యున్నారు. క్రీ. శ. 612 కిఁ బూర్వ మీసమాచారము జరిగియుండు నని డాక్టరు ఫ్లీటుగారి యభిప్రాయము. క్రీ. శ. 609-లోఁ బులకేసి వెంగీమండల మును గెలిచె నని విన్సెంటు స్మిత్తుగా రనిరి. ఈతామ్రశాసనమువలన మన మింతకంటె నెక్కుడు సూక్ష్మముగ నీకాలమును నిర్ణయింపఁగల మేమో చూ తము. ఈదానము పులకేశియెదుటఁ జేయఁబడినది. దీనికి దూతకుఁడు అనఁగా దీనిని అమలులోఁ బెట్టినవాఁడు పృథివిదువరాజు, ఈతఁ డెవఁడో తెలినయెడల నీశాసనపుఁగాలము తేలఁగలదు. ఈపులకేశిచేతనే యీయఁబడిన గోవా తామ్రశాసనము[2]నందు నొకసత్యాశ్రయధ్రువరాజేంద్రవర్మ కలఁడు. అతఁడు

[1] Ind. Ant. Vol. IX p. 102. [2] J. Bo. Br. R. A. S. Vol. X p. 365 and plates.

పృథివీవల్లభమహారాజునకు ననఁగా పులకేశికి లోఁపడినవాఁడును, నాలుగు విషయములకును మండలములకును నధికారి. ఈతనిపేరులోని 'ధ్రువరాజు' అనుభాగము అసలు పే రనియు, 'సత్యాశ్రయ' అని మొదట నున్నదియు, 'ఇంద్రవర్మ' అని చివర నున్నదియు బిరుదు లనియుఁ దోఁచుచున్నది. అట్లే మనశాసనమందుఁ గల 'పృథివిదువరాజు'లోని 'పృథివి' అనునది బిరు దనియు 'దువరాజు' అనునది అసలుపే రనియుఁ దోఁచుచున్నది. 'సత్యాశ్రయ' 'పృథివి వల్లభ' ఇత్యాదిపదములు పులకేశియొక్క బిరుదములోనివి. ఆతనిని గౌరవించుటకో, యాతఁడొసంగుటచేతనో లేక యావంశమునకు సంబంధించినవాఁడగుటవలననో, దువరాజు, ఈబిరుదములను గొన్నిటినిఁ దనపేరునకు ముందో వెనుకనో తగిలించుకొనుచున్నట్లు కానిపించుచున్నది. కావున గోవాతామ్ర శాసనమందలి ధ్రువరాజును మనశాసనమందలి దువరాజును నొక్కపురుషుఁడే యనియు, పులకేశి యెచ్చటికిఁ బోయిన నతఁ డచ్చటికి వెంటఁబోవుచుండె ననియుఁ దోఁచుచున్నది. రెండుశాసనములలోను నీతఁడు తాను మండలములకు నధిపతి నని గర్వముతోఁ జెప్పుకొనుటయు నీతఁ డొక్కఁ డనియే తెల్పుచున్నది.

ఇట్లు వీరిద్దఱును నేకపురుషుఁడె యైనయెడల గోవాశాసనమునందు శాలివాహనశక మీయఁబడినది గనుక, యీశాసనకాలమును సులభముగఁ గనుఁగొనవచ్చును. గోవాశాసనము "శా. శ. ౫౩౨-వ యేట మాఘపౌర్ణిమ దినమున నీయఁబడినది." ఈశకసంఖ్య గతమో, వర్తమానమో తెలియదు. గతమైనయెడల దీనికి సరియైన యింగ్లీషు తేది 611-వ సంవత్సరమున జనేవరి నెల ౧౫-వ తేది యగును. గతము కానియెడల నాదినమున 610-వ సంవత్సరమందలి 15-వ జనేవరి యగును. ఇది యిట్లుండఁగా, గోవాశాసనమునందు నది 'ప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరం వింశతి' యేఁట నీయఁబడిన ట్టున్నది. ఈప్రవర్ధమాన విజయరాజ్యము లెవ్వరివి? డాక్టర్ భాండార్కర్ గారిమతమున, ఈసంవత్సరములు చాలుక్యరాజును, రెండవపులకేశికిఁ బినతండ్రియు నగు మంగళేశుని రాజ్యప్రారంభకాలమును సూచించును. డాక్టరుఫ్లీటుగారు రిపి ధ్రువరాజరాజ్య ప్రారంభమునె సూచించు ననిరి. డాక్టర్ ఫ్లీటుగారిమతమె నిజమయినదిగాఁ గానవచ్చుచున్నది. కాని యీయిరువదిసంఖ్య యెవరిరాజ్యారంభమును సూచించుచున్నను జింతలేదు. మనకు నాప్రశ్నతో నంతగా నవసరము లేదు. ఏలయన మనశాసనమునందును అట్లె 'ప్రవర్ధమానవిజయరాజ్యసంవత్సరే ఏకవింశతి' అని

యున్నది. ఎవరిరాజ్యప్రారంభమును సూచించిన నేమి? 21-వ సంవత్సరము 20-వ సంవత్సరము తరువాతిది యనుట నిజము. 20-వ సంవత్సరమునందు శా. శ. 532 అయినయెడల, 21-సంవత్సరమున శా. శ. 533 తప్పక యగును. ఇది గతాబ్దమనుకొని గాని వర్తమానాబ్దమనుకొనిగాని లెక్కవేసినయెడల 612-వ సంవత్సరము లేక 611-వ సంవత్సరము అగును. ఈశకము గతమా వర్తమానమా యని తెలిసికొనుటకు వారమొకసాధనముగా నున్నది. ఇది యీయఁబడిన కార్తికమహానవమినాఁడు గురువార మని చెప్పఁబడినది (పం. 13.) కాని నవమి కార్తికశుద్ధమందలిదో బహుళమందలిదో యని చెప్పఁబడలేదు. కావున శుద్ధమునకు బహుళమునకు లెక్కవేసి చూడఁగా, క్రీ. శ. 611-వ సంవత్సరమునకు రెంటికిని సరిపోయినది. 612-వ సంవత్సరమున రెంటికిని సరిపోలేదు. కావున గోవా శాసనమందుఁ జెప్పఁబడినవి గతాబ్దములుకావనుటయు వర్తమానాబ్దము లనుటయు నిశ్చయము. ఇట్లు మనశాసనముయొక్క కాలము క్రీ. శ. 611-వ సంవత్సరమునందు అక్టోబరునెలలో 21-వ తేది యని తేలుచున్నది. కావున పులకేశి తెలుఁగుదేశమునకు వచ్చినసంవత్సరమును తెలుఁగుదేశమునఁ జాళుక్యుల రాజ్య మారంభమైన దినమును నిశ్చయముగఁ దెలిసికొనఁగలిగితిమి. ఇట్లీ శాసనము మనకు ముఖ్యమైనది యనియే చెప్పవలెను.

దువరాజును గుఱించి మఱికొన్ని సంగతులు:—ఈ శాసనమునకు నాజ్ఞప్తి యనఁదగు దువరాజు, రెండవపులకేశికి సేనాధిపతిగను, సామంతుఁడుగ నుండెను. 610-లో నాతఁడు పులకేశివెంటనుండి యాతనియాజ్ఞ ననుసరించి, గోవాయొద్ద నొకబ్రాహ్మణునకు నొకదానము చేసెను. 611-లో కమ్మరాష్ట్రము నందుఁ బులకేశియెదుట మఱియొక బ్రాహ్మణునకు దానము చేసెను. ఈతఁడు కలికులములఁ జంపినవాఁ డనియు, అనేకసంగ్రామసాహసదక్షుఁ డనియు, చుట్టునున్న మండలములను ప్రింగుటలో గట్టివాఁ డనియు, తనచేతులతో శత్రుమండలమును జయించి తనకుమారునికి వంశపరంపరగ జరుగురాజ్యమును సంపాదించినవాఁ డనియు, ఈశాసనమువలనఁ దెలియుచున్నది. (పం. 8. 10.) కలికులము లనఁగా నెవ్వి? 'కలి' యనఁగా 'కలభ్ర' అనఁబడువారు కారుగదా? క్రీ. శ. 575 మొదలు 600 వఱకు రాజ్యము చేసిన పల్లవసింహవిష్ణువు తాను కలభ్రులను జయించితి నని చెప్పెను.[1] చాళుక్యరాజులును, రెండవపులకేశి తరువాత వెంటనే రాజ్యమునకు వచ్చినవారును అగుప్రథమవిక్రమాదిత్యుఁడు

[1] Vide Dubreuil's Ancient History of the Deccan p. 49.

వినయాదిత్యుఁడు, ద్వితీయవిక్రమాదిత్యుఁడు అఘరాజులును తాము కలభ్రులను జయించితిమని తమశాసనములలో వ్రాసికొనియున్నారు.[1] తరువాత కాలము వా రగు రాష్ట్రకూటులు తాము 'కలివల్లభు'ల మని చెప్పుకొనిరి. 'కలి' యను తెగవారికి నధిపతులనిగాని "కలి"యను పేరుగల వల్లభు లని గాని ఈ పదమునకు నర్థము చేసికొన వచ్చును.

ధ్రువరాజు, గోవాశాసనమునందు తనది 'ఆదిబప్పూరివంశము' అని చెప్పుకొనును. ఇదియు 'భాత్పూరా' వంశమును నొక్కటియే యని పండితుల యభిప్రాయము. ప్రథమపులకేశిభార్యయు, మంగలేశునిభార్యయు నీవంశము లోనివారే. ధ్రువరాజు మంగలేశునికుమారుఁడని కొందఱనుకొనిరి. కాని యందుకుఁ దగినయాధారము లేవియు లేవు. ఈతఁడు క్రొత్తగ రాజ్యము సంపాదించుకొని ఘనతకెక్కినవాఁడుగఁ గానవచ్చుచున్నాఁడు. అందువలననే కుమారునివంశమున శాశ్వతముగా నుండురాజ్యము సంపాదించినవాఁడనని గర్వోక్తి చెప్పుకొనియెను. చాళుక్యుల తరువాత వచ్చినరాష్ట్రకూటులలో 'ధ్రువరాజు' పేరుగలవారిద్దఱు ముగ్గురు కలరు. వారందఱికిని 'కలివల్లభ' బిరుదము కలదు.[2] కావున మనశాసనమందలి ధ్రువరాజు రాష్ట్రకూటుల మూలపురుషుఁడేమో యని సంశయము కలుగుచున్నది. అప్పుడు పుట్టినయీవంశము ౧౫౦ సంవత్సరములలోఁ బ్రబలి చాళుక్యులను మ్రింగివేసియుండును.

కార్తికములో మహానవమి:—ఈశాసనమునందు నొకవిశేషము కలదు. 13-వ పంక్తిలో 'మహానవమి' కార్తికమాసములో వచ్చినటులు చెప్పఁబడియున్నది. ఇప్పుడు దసరాపండుగలలో, దసరాకుఁ బూర్వదినమున వచ్చు నవమిని 'మహానవమి' యందురు. అది ఆశ్వయుజ శుద్ధమందు వచ్చును. పూర్ణిమాంతమాసముల లెక్క చూచినను నాశ్వయుజమాస మగునేగాని కార్తికము కానేరదు. కావున నా కాలమునందుఁ గార్తికమాసమందు నొకమహానవమి వచ్చుచుండె నని మనము తలంపవలెను.

కో. వెం. లక్ష్మణరావు.

---

[1] Vide Fleet's *Dynasties of the Canarese District.* [2] Ind. Ant. Vol. XI p. 125; Ind. Vol. V p. 192, Vol. VI pp. 102, 242.

## మూలము[1]

### మొదటి రేకు.

1. స్వస్తి శ్రీమతాం సకలభు[వ*]నసంస్తూయమానమానవ్యసగోత్రాణా[ం*]హారీతిపుత్రాణా[ం*]సప్తలోకమాతృభి [స్*] సప్తమా

2. తృభి[న్*]సమ్య గభివర్ద్ధితానాం కార్త్తికేయపరిపాలనాధి గత కల్యాణపరమ్పరాణా[ం*]భగవన్నారాయణప్రసా

3. దనా[2]మాసాదతవరాహలాఞ్ఛనేక్షణక్షణవశీకృతా శేషమహీభృతా మనేకాశ్వమేధావభృతస్నా

4. నపవిత్రీకృతవపుషా[ం*]చలుక్యానాం కుల మభ్యలంకరిష్ణో[ః*] ప్రథితకీర్త్తిః శ్రీకీర్త్తి వర్మ్మాపృథివీవల్లభమహా[రా]

### రెండవ రేకు, మొదటిప్రక్క.

5. జస్య ప్రియపౌత్ర[3] ప్రణతానేకమహీపతిమకుటతటవిలగ్నమకరికా ఘృష్టపాదారవిన్ద ద్వయ

6. స్య[4] ప్రతిగతారాతిచక్రవిధ్వ[ం*]సనవిధివిశారద[5]దస్య దేవద్విజగురు వృద్ధాపచాయనే పితేవ శూర[ః*]స

7. త్యాశ్రయ [6]ప్రతిహతాజ్ఞ[ః*]శ్రీపులకేశిప్రి[7]థివివల్లభమహారాజ[ః*] యథారుహా[8] సన్మానయతి[।*]విదితి[9]

8. మస్తు వల్లభసమక్షావస్తి[10] తే విధివ త్సంప్రదత్తామన్తా[11] కలికుల[12] నామ నేకసంగ్రామసాహసదక్షేణ

### రెండవ రేకు, రెండవప్రక్క.

9. నికృష్టమణ్డలాగ్రాసనాథేన స్వబాహునా విపక్షమణ్డల[ం*]నిర్జిత్య స్వ సుతాన్వయే ప్రతిష్ఠాపి

---

[1] నాయొద్దనున్న రేకుల ననుసరించి.

[2] సమాసాదిత - అనియుండవలె.

[3] పౌత్రః - అని.

[4] ద్వయః - అని.

[5] విశారదః - అని.

[6] మోడ్ ప్రతి = అని.

[7] పృథివీ = అని

[8] యథార్హం = అని.

[9] విదితమస్తు = అని.

[10] వస్థితే = అని.

[11] మన్తః = అని; లేక దత్తాంహన్తా = అని.

[12] కులానా = అని.

10. తరాజ్యస్య[13] ప్రి[14] థివిదువరాజమా[15] ణత్తిమూగమూర్ధా_స్తవ్యాయ ఛాణ్డిల్యాయనగోత్రస్య[16] ఆపస్తమ్బ

11. సూత్రస్య[17] విప్రస్య[18] వేదశర్మణ[19] కర్మరాష్ట్రే ఇబురులిగ్రామే అష్ట శతం + ÷ క్షేత్రమ్ [20]దతమ్[। *]బలాకబల్వ

12. లాపూర్వత[21] కర్మకారతటాకా[22] పశ్చిమత[23] కొణ్డవేఙుపూర్వ థా[24]దక్షిణత[25] విపరఅుపథా[26] ఉత్తరేత[27]

మూఁడవరేకు.

13. ప్రవర్ధమానవిజయరాజ్యసవసరె[28] ఏకవింశతి[29] కార్తికమాసే మహా[నవమ్యా][30] బృ[హ*] స్పతివారే ప్ర

14. శస్తేముహూర్తె స్వ[ద్*]దత్తిరాజ్ఞ_ప్తి[31][॥*] [32]భూమిదానాత్పర న్దానన్నభూతనభ[వి*]ష్యతి[।*]తస్యేవహరణాత్పా

15. పన్నభూతనభవిష్యతి[॥*]బహుభిర్వసుధాదత్తా బహుభి శ్చానుపా లితా[।*]యస్యయస్యయదాభూమితస్య

16. తస్య తదాఫలం[॥*][స్వద]తాపరదతావా యత్నాద్రక్ష యుధిష్టిర [।*]మహీమహీభుజాశ్రేష్ఠ దాతూశ్రే[33].

---

[13] రాజ్యేన = అని.

[14] పృథివి = అని.

[15] రాజవర్మణా = అని.

[16] గోత్రాయ = అని.

[17] సూత్రాయ = అని.

[18] విప్రాయ = అని.

[19] వేదశర్మణె = అని.

[20] దత్తమ్ = అని.

[21] పూర్వతః = అని.

[22] తటాకః = అని.

[23] మతః = అని.

[24] పూర్వథః = అని.

[25] తః = అని.

[26] పథః = అని.

[27] ఉత్తరతః = అని.

[28] సంవత్సరే=అని. 'సవసరె' లోని రెండవ సకారముమీఁది రాగిరేకుగొంచెము విఱిగినది. దానిపై తకారముండెనేమో.

[29] వింశత్యాం = అని.

[30] ఈయక్షరముల వద్దిరేకు కొంచెమువిఱిగినది. నకారవకారముల క్రిందిభాగములు కనఁబడుచున్నవి. 'మా' కనఁబడుటలేదు. కాని దానిక్యావడిబాగుగఁగాన వచ్చుచున్నది.

[31] రాజ్ఞ_ప్తిః = అని.

[32] ఈశ్లోకములు మామూలువే గనుక వీనిలోని తప్పులు దిద్దలేదు. మామూలు శ్లోకముల తోఁ బోల్చి చూచినయెడలఁ దప్పులు గోచరింపఁగలవు.

[33] ఈచరణమసంపూర్తిగా విడువఁబడినది. 'దా నాచ్ఛ్రేయోనుపాలనం' అని పూరింపఁబడవలెను.

శ్రీరస్తు.

# శ్రీరాజరాజనరేంద్రపట్టాభిషేకసంచిక.

ఈసంచిక యెప్పుడు వచ్చునా యని యెదురు చూచిచూచి యిఁక రా దని యాంధ్రులు నిరాశ చేసికొనియుండిరి. కాని చివరకు మనోహరరూపము తోఁ దెరలోనుండి వెలువడిన యీసంచికను జూడఁగనే యాలస్యమునకై ప్ర కాశకు లగు "ఆంధ్ర దేశీయేతిహాసపరిశోధకమండలి" వారిపై నాంధ్రులకుఁ గలపట్టరానికోపము చప్పున చల్లారు నని మేము నొక్కి చెప్పఁగలము.

ఈసంచికయొక్క సర్వాంగసుందరస్వరూపము బెజవాడ ఆంధ్రగ్రంథా లయముద్రాక్షరశాలవారి కౌశలము వెల్లడిచేయుచున్నది. లోని విషయముల మాధుర్యమునకుఁ దగినట్లు పైరూపసౌందర్య ముండుట బంగారమునకు సౌరభ మబ్బినట్లే.

ఇందుఁ దెనుఁగుదేశమందుఁ బేరొందిన పండితులచే వ్రాయఁబడిన వ్యా సములు, అధ్యక్షుకోపన్యాసముతో 25 ను, పద్యవిషయములు 10 యుఁ గలవు. ఆంధ్రులు గాని డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారిచే వ్రాయఁబడిన యొకవ్యాస ముఁ గలదు. అది వా రింగ్లీషున వ్రాసి పంపఁగ నాంధ్రీకరింపఁబడినట్లు తోఁ చెడిని.

పద్యముల కేమి గాని, 25 గద్యవ్యాసములలో నెన్నియో చదివి యానం దింపఁదగినవి కలవు. కొన్ని చాళుక్యులకాలపునాఁటి రాజకీయచరిత్రములను, గొన్ని భాషావిశేషములను, గొన్ని సాంఘికపరిస్థితులను వర్ణించుచున్నవి. ఇం దుఁ గొన్ని నూతనశోధనలతోను, గొన్ని బుద్ధివైభవముఁ జూపునూతనఫక్కి కావిమర్శములతోను నిండియున్నవి. అన్నిటికంటెను మొదట నుండవలసిన యధ్యక్షోపన్యాసము చివర నచ్చుపడినను, నన్నయభట్టు కవిత్వమును గుఱించి యాదరబుద్ధితోడను, మార్మికతతోడను, దృష్టాంతహేతుపూర్వముగాను జేయఁ బడిన విమర్శనములలో నిది యగ్రస్థాన మాక్రమించును. శ్రీ రెడ్డిగారికి బ్రాహ్మ ణులయెడఁ గలసహజప్రేమ యచ్చటచ్చటఁ గొంచెము పొంగి వచ్చినను కవిత్వ విమర్శనమప్పుడు మాత్రము వారు బ్రాహ్మణాబ్రాహ్మణభేదమును మఱచి సహృ

దయత్వముఁ బొందుట కడుఁ బ్రశంసనీయము. వారియభిప్రాయము లన్నియు నందఱకును సమ్మతములు గాకపోయినను వారు చూపిననూతనవిమర్శనపద్ధతి మన్ననకుఁ బాత్ర మనుటకు సందేహము లేదు.

నన్నయనాఁడును, నంతకుఁ గొంచెము పూర్వకాలమందును, దరువాత కాలమందును నాంధ్రభాష యెట్లుండెడిదో తెల్పుచుఁ శ్రీయుతులు చిలుకూరి నారాయణరావుగారును, రా॥సా॥గిడుగు రామమూర్తిగారును, మల్లంపల్లిసోమశేఖరశర్మగారును, మూఁడు వ్యాసములు వ్రాసిరి. ఈమూఁడును మూఁడుముత్యముల వలె నున్నవి. ఆయావ్యాసకర్తలయొక్క భాషాపరిశ్రమయు, పరిశోధనావిశేషమును, లక్ష్యలక్షణసమన్వయసామర్థ్యమును నీవ్యాసములవలన వెల్లడి యగుచున్నవి. ఈసంచిక పుట్టినందున నాంధ్రభాషావికాసచరిత్రాభ్యాసము చేయువారికిఁ గలిగినముఖ్యలాభ మీమూఁడువ్యాసము లని మాయభిప్రాయము. ఇందువలన వీరిసిద్ధాంతము లన్నిటిని మే మంగీకరించితి మని యర్థముకాదు. భాషాశాస్త్రము నభ్యసింపవలసిన శాస్త్రీయపద్ధతు లీవ్యాసములవలన వెల్లడి కాఁగల వని మానిశ్చయము.

చరిత్రవిషయిక మైనవ్యాసము లీసంపుటమునఁ బెక్కులు కలవు. మొదట భావరాజు వేంకటకృష్ణారావుగారు 'పూర్వచాళుక్యచరిత్రము' అనినవ్యాసమునందు, మొదటినుండియుఁ జళుక్యులచరిత్రములు వర్ణించిరి. గా. న్యాయమూర్తి. వేపారామేశముగారు శాసనాధారములఁబట్టి రాజరాజుచరిత్రము సంగ్రహముగ వ్రాసిరి. శ్రీయుత జయంతి రామయ్యపంతులుగారు 'చాళుక్యరాజులప్రశంస' చేసి వీరచోడునిచతుర్వేదిమంగలశాసనమును బట్టి యప్పటి యాచారవ్యవహారములను నిర్ణయించిరి. చోళులకును జాళుక్యులకును గలసంబంధము ప్రమాణయుక్తముగ డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారివ్యాసమునందుఁ జక్కఁగ వర్ణింపఁబడినది. చాళుక్యులరాజ్యాంగపద్ధతులను గుఱించి గాదె నరసింగరావుగారును, ఆంధ్రదేశమునకుఁ జుట్టు నున్నయితరరాజ్యములస్థితిని గుఱించి చిలుకూరి నారాయణరావుగారును, తూర్పుచాళుక్యుల రాజ్యవిస్తారమును గుఱించి దేశిభట్ల లక్ష్మీనరసింహముగారును వ్రాసినవ్యాసములు పఠనీయములు.

రాజరాజునకు రేవలదేవి యనుభార్యయు, సోమలదేవి యనుకూఁతురును గలరనియు, ఆనాఁటికే తెలుఁగుపద్యములు రాతిమీఁదఁ జెక్కించుచుండిరనియు, నారాయణభట్టునకుఁ గుప్పమ్మ యనుకూఁతు రుండె ననియు, రాజరాజ

కాలమునఁ దెనుఁగుదేశమందుఁ సౌరమాన వ్యవహార ముండె ననియు ననిన నూతనవిషయములు లక్ష్మణరావుగారు ప్రకటించిన శాసనములవలనఁ దెలియు చున్నవి విమలాదిత్యుని కాలమునాఁటి తెలుఁగుశాసన మొకటి పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచేఁ బ్రకటింపఁబడినది.

భారతమునందు రాజరాజును వర్ణించుచు నుపయోగింపఁబడిన విషయము లకు సార్థకతఁ జూపుచు బుఱ్ఱా శేషగిరిరావుగారు 'రాజరాజుప్రశస్తి వివరణము' అనినవ్యాసము వ్రాసిరి. అందు వా రూహించిన కొన్నియూహలు కవికి స్వప్న మునం దైనను గానఁబడలేదేమో యని సందేహింపవలసియున్నది.

నన్నయ్యకుఁ బూర్వపుఛందస్సునుగుఱించి వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వ్యాస మొకటికలదు. నన్నయకుఁ బూర్వము తెలుఁగున నక్షరగణవృత్తములు సీసతరువోజలవంటివి—మాత్ర ముండె నని వారితాత్పర్యము.

శ్రీయుత చిలుకూరివీరభద్రరావుగారు 'చాళుక్యులకులప్రశంస' యని 30 పుటల పెద్దవ్యాస మొకటి వ్రాసియున్నారు. వీరు 'రాజనరేంద్రుఁడును, నన్నయ్యయు నొక్కకులమువారే యనియు, బోయవారును, కమ్మవారును బ్రా హ్మణులలోఁ జేరి రనియు, వైదికులు నియోగులు మొదలయినవారు పూర్వము క్షత్రియులుగా నుండి రనియుఁ గ్రొత్తక్రొత్త వింతసిద్ధాంతములఁ బ్రతిపాదిం చిరి. తగినప్రమాణములను మాత్రము చూపరైరి. ఎట్లయిన నేమి గాని యిది యొకవింతవ్యాసము. ఆంధ్రులలోఁ గొప్పయాందోళనముఁ బుట్టింపకమానదు. ఆంధ్రమహాభారతావతారికను గుఱించి బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారును, నన్నయభట్టు భారతరచనను గుఱించి బ్రహ్మశ్రీ పారనంది రామ శాస్త్రిగారును, బూర్వపద్ధతి ననుసరించి విమర్శనములు వ్రాసిరి.

ఇఁకఁ బద్యములఁ జూతము. గద్యవ్యాసములవలెఁ బద్యవ్యాసములు మమ్ము నాకర్షించినవికావు. పద్యము లన్నియు సలక్షణము లనిచెప్పుటకు సం దేహములేదు. వానిలో నెచ్చటనైనఁ గవితాలతాంగి కానవచ్చు నేమో యని యెంతయు శ్రమపడి వెదకితిమి. కాని రెండుమూఁడు తావులందుఁ జూ చాయగఁ దప్ప యాయమ మాకెచ్చటను గానరాలేదు. గణయతిప్రాసము లున్నఁ గవిత యగునన్నమాట మనకవు లింకను మఱచినట్లు కానరాదు. కావున నీపద్యజాలమునకుఁ బద్యవ్యాసము లని పేరు పెట్టితిమి. పద్యత్వము వేఱు కవిత్వము వేఱు. మన కిప్పుడు రసయుక్తకవిత్వము కావలయును, పిచ్చి పద్యము లక్కఱలేదు.

ఇందుఁ గొన్నిచిత్రపటములును, గలవు వానిలో రాజమహేంద్రము, ద్రాక్షారామ భీమేశ్వరాలయము, చాళుక్యభీమవరములోని భీమేశ్వరాలయము, సర్పనరపుగోపురము, ద్రాక్షారామమందలి మఱియొక దేవాలయము, సింహాచల దేవాలయము, అనుపటములు చారిత్రకప్రదేశములకు సంబంధించినవి. చాలుక్యుల కొన్ని శాసనములపటములును నాణెములపటములును గలవు. ఇంక నొకవిశేషము కలదు. రాజరాజనరేంద్రుని కాలమునాఁటి యాంధ్రభాషాలిపి స్వరూప మని యొకపట మీయఁబడినది. నన్నయభట్టు భారతము వ్రాయునప్పుడు మొదటియాఱుపద్యము లెట్టియక్షరములతో వ్రాసియుండునో యిందుఁ జూపఁబడినది. అనఁగా నందంపూడి, కోరిమిల్లి శాసనముల ననుసరించి యక్షరముల నూహించి యాపటము శ్రీయుతు లగుభావరాజు వేంకటకృష్ణారావు, చిలుకూరి నారాయణరావుగారిచే లిఖింపఁబడినవి. ఇయ్యది క్రొత్తదియుఁ జిత్ర మైనదియు నగునూహ యనుటకు సందేహము లేదు. ప్రదర్శనమందలి వస్తువులపట మొక్కటి యిచ్చిరి గాని యందలి వస్తువుల వర్ణించుచు నొక వ్యాసము కూడఁ బ్రకటించియున్న బాగుగానుండును.

కొనుటకు శక్తిగల యాంధ్రు లందఱు నీసంచిక యొక్కొక్కప్రతిని గొని ప్రకాశకులకుఁ బ్రోత్సాహము కలుగఁజేయుదురుగాక. ఈసంచిక వెల, రూ 5-0-0. రాజమహేంద్రముననుండు శ్రీయుత భావరాజు వేంకటకృష్ణారావు, బి. యే. బి. యల్., గారికి వ్రాసిన దొరకఁగలదు.

---

# గ్రంథస్వీకారము.

దుందుభిసంవత్సరమునఁ బరిషత్తునకు వచ్చినగ్రంథములు.

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1. | దేవవ్రతచరిత్రము. (పద్యము) శ్రీమాన్ మేడేపల్లి వేంకట రమణాచార్యులుగారు, విజయనగరము - - | 1 | 8 | 0 |
| 2. | వీరవిలాసము. నాటకము ఎల్లమరాజు వేంకటనారాయణ భట్టుగారు - - - - - - | 0 | 12 | 0 |
| 3. | ప్రహ్లాదచరిత్రము. వచనము. అన్నదేవర నాగభూషణరావు గారు, - - - - - - | 0 | 5 | 0 |
| | (2-3 శీరిపి ఆంజనేయులుగారు, ధర్మవరమునుండి పంపిరి.) | | | |
| 4. | భక్తానందము (పద్యము.) యం. వందనంగారు - - | 0 | 4 | 0 |
| 5. | గురుశిష్యసంవాదము. శ్రీకృష్ణదాసుఁడు. - - - | | | |
| 6. | రంగాధిపశతకము. అవటపల్లె హనుమంతరావుగారు - | 0 | 1 | 0 |
| 7. | భృంగానదేశము. ఉత్పలనరసింహశర్మగారు - - | 0 | 3 | 0 |
| 8. | శ్రీవైఖానససంవత్సరాదిసంచిక. ఈగా: వారిపాలెము - | 1 | 0 | 0 |
| 9. | Vegitarain Diet. M. Ramdas pal and J. m. Feria - | | | |
| 10. | పంచానన మహాసంచిక. - - - - - | 3 | 0 | 0 |
| 11. | గోవిందమంజరికావలిః. శ్రీవిక్రమదేవవర్మ బహద్దరుగారు, విశాఖపట్టనము - - - - - | 0 | 2 | 0 |
| 12. | శారద. నవల = శీరిపి ఆంజనేయులుగారు (ధర్మవరము.) - | 1 | 8 | 0 |
| 13. | అభిషేకరూపకము. బుఱ్ఱా శేషగిరిరావుగారు, ఎం. ఏ. విజయనగరము- - - - - - | 0 | 4 | 0 |
| 14. | బాలభారతము. (వచన) ధేరం వేంకటాచలపతిగారు. బి. ఏ. రాజమహేంద్రవరము - - - - | 0 | 12 | 0 |
| 15. | శ్రీమద్భాగవతసారము. ఎలమర్తి శ్రీనివాసరావుగారు, రామ చంద్రపురము - - - - - | 0 | 4 | 0 |

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| 16. సుమబాల. జయంతి గంగన్నగారు, బి. ఏ., రాజమహేంద్రవరము - - - - - - | 0 | 12 | 0 |
| 17. భార్గవపురాణము. కాండూరి వేంకటదాసు. (శ్రీరామవిలాసగ్రంథమాల చిత్రాడ) - - - - | 0 | 12 | 0 |
| 18. కూచినరసింహము పంతులుగారి జీవితచరిత్ర (జనమంచిసీతారామస్వామిగారు. పిఠాపురము) - - - | 0 | 3 | 0 |
| 19. చిత్రకందపద్యరత్నాకరము. నాదెళ్ల పురుషోత్తమకవిగారు, బందరు - - - - - - | 0 | 6 | 0 |
| 20. మురళి. (పద్య) సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, సికందరాబాదు - - - - - | 0 | 8 | 0 |
| 21. శివామృతము. - } కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు, - | 0 | 2 | 6 |
| శ్రీవీరశైవదీక్షాబోధ } మదనపల్లి - - - | 0 | 9 | 0 |
| 22. వివేకానందస్వాముల ప్రాక్పశ్చిమము - కూచి నరసింహముగారు, బి. ఏ., పిఠాపురము - - - - | 1 | 0 | 0 |
| 23. భక్తమణిభూషణము. ఆదిపూడి సోమనాథరావుగారు, మైలాపూరు - . - - - - - | 2 | 0 | 0 |

---

రాబోవు పరిషద్వార్షికసభ గోదావరిజిల్లాలోని తునిలో శ్రీ శ్రీ తుని రాణీగారి యాదరమున, మెయినెలలో జరగును. వివరములు ముందు దెల్పబడును.

ప. అ.

శ్రీరామచంద్ర.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.


సంపుటము ౧౧. | దుందుభి నామసంవత్సరము. మాఘఫాల్గునమాసములు. | సంచిక ౬.


## పాఠశాలలలోని తెలుఁగు.

(పిఠాపురము పరిషత్సభలోఁ జదువఁబడినది.)

సభాధ్యక్షా! మహారాజా! విద్వత్సభ్యులారా!

గీ. చదువలేదే నాకింతయు ♦ సంస్కృతంబు;
నాంధ్రపరిచితి యల్పంబు; ♦ సామయుఁడను;
వ్యాసమందలి విషయభా ♦ షాదిలోప
ములను క్షమియింపుఁ; డిదిగో చే ♦ మోడ్పు మీకు!

సస్యసమృద్ధియు సస్యప్రాశస్త్యమును జల్లిన గింజలఁబట్టియుఁ బెట్టిన నీటిం బట్టియు నుండునట్లే, దేశభాషాభ్యుదయము పాఠశాలలలోఁ బ్రస్తుతము నాటుచున్న విద్యాబీజములఁబట్టియు బాలురు బాలికలుఁ బడయుచున్న శిక్షను బట్టియు నుండును. వర్తమానవిద్యార్థిబృందమే కాదా పెరిఁగి పెద్ద లై దేశమును ముందటికిఁ దెచ్చుప్రజాసంఘము కానున్నది! స్థితిగతు లెట్లుండెడివో యెట్లున్నవో యించుక పరిశీలించి చూతము.

సమస్తజ్ఞానమణిపేటిక యై సర్వలోకసమాదరణీయ మై యుండుభాష సంస్కృతభాష. మనయాంధ్రదేశములో, నేఁబది యఱువది యేండ్లక్రిందటివఱకును బ్రాహ్మణులు సర్వసామాన్యముగా వేదమునే యభ్యసించి కాలము గడపుకొనెడువారు. తఱచుగా వివాహోపనయనాది స్మార్తకర్మములకుఁ గావలయు మంత్రతంత్రవిధానములును గొన్నియాశీర్వచనపుఁబనసలును మాత్రమే

నేర్చి కుటుంబపోషణము గావించుకొనెడువారు. పఠించుమంత్రముల యర్థమును తెలిసినవా రెక్కడనో కాని యుండెడువారు గారు. శాస్త్రపరిచయము గల వారిసంఖ్య యత్యల్పముగా నుండెడిది. పంచకావ్యములు చదివినవారే పండితులుగాఁ బరిగణింపఁబడుచుండెడువారు.

ఆంధ్రగ్రంథపఠనము చేసినవారు మఱియుఁ దక్కువగా నుండెడివారు. అదిగాక, పెక్కురు పండితులు తెలుఁగు చదువుట గౌరవమునకు లోప మని తలఁచెడువా రని చెప్పుట యతిశయోక్తి గాదు. ఛాందసులు శ్రాద్ధభోజనాద్యవసరములం దపవిత్ర మగు నాంధ్రభాష నోట రాఁ గూడ దని "పప్పు, కూర, పచ్చడి, చేరు, పెరుఁగు, మజ్జిగ, యుప్పు" మున్నగువానికి మాఱు "సూపశాక లేహ్య చోష్య దధి తక్రలవ" ణాదిశబ్దము లుపయోగించెడువారు. వర్ణములు తాఱుమాఱుచేసి తక్రమునకు బదులు తర్కము నెడువారు కూడఁ గొంద ఱుండెడువారు. తేలు గుట్టి బాధపడుచున్న ప్రసిద్ధపండితుని నొకఁ డేమి శాస్త్రిగారూ! అట్లు బాధపడుచున్నా రనఁగాఁ "గించిద్వృశ్చికసంస్పర్శ" మైన దని యుత్తర మిచ్చుట నే నెఱుఁదును. అది సంస్కృతభాషాభ్యాసబలసూచకమో యాంధ్రభాషావైముఖ్యసూచనమో నేఁ జెప్పఁజాలను. నన్నయాహోబలపండితాదు లాంధ్రవ్యాకరణసూత్రములు సంస్కృతమున రచించినఁగాని వానికిఁ బండితసమ్మానమును వ్యాప్తియు నుండ దని యట్లు గావించినా రేమో యని తోఁచుచున్నది. చిన్నయసూరిగారు కూడఁ దమ బాలవ్యాకరణమును గీర్వాణపారిభాషికపదభూయిష్ఠముగానే చేసినారు.

ఇట్లుండఁగా నాంధ్రభాష చేసికొన్న పుణ్యముచే బ్రిటిష్ప్రభువులు మన దేశములో ననేకపాఠశాలలును గళాశాలలును నెలకొల్పి, యం దాంధ్రభాష బోధింప మొదలు పెట్టినారు. సంస్కృతపాఠశాలలు కూడఁ గొన్ని స్థాపించినారు. సంస్కృతసాహిత్యమును వ్యాకరణాదిశాస్త్రములును మఱలఁ దలలెత్తినవి. ఆంధ్రోపాధ్యాయులుగా నియుక్తులైనవారు చిన్నప్పుడు చిన్నచూపు చూచి చిన్నవుచ్చిన యాంధ్రలక్ష్యలక్షణగ్రంథములను జీవికకై చేపట్టవలసి వచ్చినది. అట్టిస్థితిలో ఆంధ్రభాష దినదినప్రవర్ధమానమై తేజరిల్లుచుండవలెను గదా!

కాని యొకచిక్కు వచ్చెను. రాజభాషా దేశభాష లొకటి కాకపోవుట చేతను, దేశభాషాపాండిత్యముకంటె రాజభాషావైదుష్యమువలన నెక్కువ ధనలాభమును గౌరవమును గలుగుచుండుటచేతను, విద్యార్థులకు నాంగ్లభాషా

భ్యసనముపైని నాంగ్లోపాధ్యాయులపైని నున్నశ్రద్ధాభక్తు లాంధ్రభాషాధిగమ ముపైని నాంధ్రపండితులపైని లేకపోయెను. పరీక్ష పోవు ననుభయముచేతనే కాని భాషాభిమానాభిరుచులతోఁ దెలుఁగుఁ బఠించువిద్యార్థులు మిక్కిలి కొలఁదిగనే యుండెడివారు. పలునదిసుంది యుండుతరగతిలోనుండి నలువురైదుగురు భాషాభిజ్ఞులును భావిభాషోద్ధారకులును బయలుదేఱిరో లేదో చెప్పఁజాలను. అట్టియల్పసంఖ్యాకులలోనివారే మన యీయగ్రాసనాధిపతులు.

స్నేహితుఁ డెదురుపడినచో "Good morning! When did you come?" పూర్వకముగా నాంగ్లభాషలో సంభాషణము, సభలో 'I propose Mr. so & so to the chair' మొదలుకొని I propose a vote of thanks to the chair' వఱకు నాంగ్లభాషలోనే యుపన్యాసాదికములు. లేఖలు వ్రాసికొనుటయు నాంగ్లభాషలోనే. ఇట్లు పాఠశాల లన్నియు నాంగ్లమయము లయి మాతృభాషను ద్రోసిరా జనుస్థితికి వచ్చుచుండెను. పండితులు చెప్పుపాఠములు విద్యార్థులు శ్రద్ధగా వినుట లేకపోయెను. పరీక్షలలో నాంధ్రమునఁ దప్పిపోవువారు మిక్కిలి తక్కువగా నుండెడివారు కాని, యది తెలుఁగు బాగుగాఁ దెలియుట వలనఁ గాదు. తర్జుమా ప్రశ్నల కుత్తరములు వ్రాసి తెలుఁగులోపమును గూడఁదీసికొని పెక్కురు పరీక్షలలో నుత్తీర్ణు లయ్యెడువారు. ఝరీవేగముతో సభలయం దాంగ్లభాషలోఁ బ్రసంగింపఁగలిగిన ప్రౌఢవిద్యార్థి, నాలుగు తెలుఁగుమాటలు మాటాడుటకు జేంకుచుండెను. ఇంగ్లీషులో దీర్ఘవ్యాసములు వ్రాయువారు తెలుఁగులో నాలుగుముక్కలు వ్రాయుటకు వెనుదీయుచుండిరి. సభలలోఁ దెలుఁగు మాటాడిన, గౌరవహాని యగు నని యనేకులు తలఁచెడివారు. సాహసించి మాటాడువా రైనను భావోత్పత్తి యింగ్లీషుభాషలో నగుటచే నది స్వభాషలోనికిఁ బరివర్తనము చేసికొని నిమిషమున కొకమాట మాటాడెడివారు. పదిమాటలు గలవాక్యములో నాలుగై దాంగ్లపదములు దూఱెడివి. సామాన్యప్రసంగములలో నైనను నాంగ్లభాషాసంకీర్ణత యధికమగుచుండెను:— ఈవేళ బజార్లో rice ఎలా యిచ్చారోయి— time అయింది School కి త్వరగా వెళదాం రా— School fees కట్టావా లేదా యివాళ 25-వ తారీఖు— late payment కి fine వేస్తారు - జాగ్రర్త—కనకరా జంత cunning fellow యీ world లో యెవడూ లేడురా—ఇట్టి ప్రసంగములు దాదాపుగాఁ బ్రతివిద్యార్థియుఁ జేయుచుండెను. ఈయలవా టింకను బోలేదు. కొంతకాలమునకుఁ బోవచ్చు ననుకొనుచున్నాను.

ఈదుస్స్థితి చూచి యధికారబలమును ఆశ్రయబలమును గలయాంగ్ల భాషావిశారదులు కొందఱుమిత్రులు—ఆంధ్రులును ఆంధ్రేతరులును—భాషాభివృద్ధి గావింత మనుసదుద్దేశముతోనే పాఠశాలలలోఁ గొన్నిమార్పులు తెచ్చిపెట్టినారు. గ్రాంథికభాష కఠిన మని నియమశూన్యమై బహుముఖ మైన వ్యావహారికభాష బడులలోఁ జెప్పుఁ డన్నారు. గ్రంథములు లేవు. వ్యాకరణము లేదు. A తెలుఁగు C తెలుఁగు అని తెలుఁగును రెండుతెలుఁగులు చేసినారు. A లో వ్యాసరచన ప్రధానము చేసినారు. అది మంచిదే, కాని గ్రంథపఠనము లేక వ్యాకరణము లేక వ్యాసరచన పిల్ల లెట్లు చేయఁగల రను నూహ వారికిఁ గలుగలేదు. పాఠశాలలలోను హైస్కూలలలోను దత్పూర్వ మవశ్య పఠనీయముగా నున్నయాంధ్రభాషను ఐచ్ఛికము చేసినారు. ఈవిషయమై యనేకపూర్వపక్షసిద్ధాంతములు జరిగినవి. అవన్నియుఁ దమకు విశదమై యే యున్నవి. ఆగొడవ యంతయు మఱలఁ ద్రవ్వి చెప్పి మిమ్ము విసిగింపఁ దలఁచుకొనలేదు. కాని యామైదాతేండ్లును బడులలోని యాంధ్రభాష చుక్కాను లేని పడవయై, దిక్కు లేని బిడ్డయై, పాడయి పోయిన దని స్వానుభవమున నేను జెప్పఁగలను. విద్యార్థులపూర్వపుణ్యముచే, నీపరిషత్తువారియొక్కయుఁ బండితవర్యులయొక్కయుఁ బ్రభుశేఖరులయొక్కయు దయచే, నాయాపద యిప్పుడు బడులనుండి యపసరిల్లి పోయినది. ఆంధ్రభాషను యథాపూర్వస్థితికిఁ దెచ్చుట కృత్యాద్యవస్థ మైనది. 'మాది మా కిచ్చుట మడిమాన్యంబు లిచ్చుట' యను లోకోక్తి సత్య మైనది.

తరువాత విద్యాశాఖాధికారు లనాలోచితముగాఁ జేసినమార్పులు సవరించుకొనుటకుఁ బ్రయత్నించినారు. విద్యార్థులు గాలి ప్రోగుచేసి కాగితము నలుపుచేయఁ జాల రని పఠనీయగ్రంథములు పెట్టినారు. వ్యాసరచనకు వ్యాకరణజ్ఞాన మావశ్యక మని వ్యాకరణము చెప్పించుచున్నారు. అన్నియు బాగుగనే యున్నవి గాని యాంగ్లభాషవలె నాంధ్రభాష నవశ్యపఠనీయముగా నింకను నేల చేయలేదో బోధపడకున్నది. ఆంధ్రభాష నైచ్ఛికము చేయుట యనర్థకరము. మేము తెలుఁగు చదువవల దంటిమా? పిల్లలు తక్కినవి మాని పరీక్షలకుఁ దెలుఁగున్న భాగమే మేల తీసికొనరా? దనుట, కువాదము. కారణములు పైని మనవి చేసికొంటిని. తెలుఁగు మాని తక్కినభాగములు తీసికొన్నందువలన ధనగౌరవాదిలాభము లెక్కు వగుటచేఁ బిల్లలదృష్టి, స్వభాషపైకి సాధారణముగాఁ బోదు. తెలివి తేటలు గలవారు గణితశాస్త్రాదిభాగములు

తీసికొని యెందులకుఁ బనికిరాని విద్యార్థులు తెలుఁగు తీసికొనుట పెక్కుచోట్ల తటస్థించుచున్నది. ఇప్పటివిద్యావిధానపద్ధతు లెట్లున్నవో నేఁ గనుఁగొనలేదు. నే నుపాధ్యాయుఁడుగా నుండుకాలములోఁ దెలుఁగునకు గౌరవము లేదు. పరీక్షలో నుత్తీర్ణు లగుటకు బాలుర కింగ్లీషులో వచ్చినన్నిమార్కులు తెలుఁగులో రానక్కఱలేదు. జయాపజయనిర్ణయార్థము C Group మార్కులు సవరించుటలో నధికారులు తెలుఁగున మార్కు లెక్కువ వచ్చినవాని కితరభాగములలో నెక్కువమార్కులు వచ్చినవారి కొసఁగులాభమును బ్రసాదించెడువారు గారు. అనఁగా శ్రమపడి తెలుఁగుచదువనకున్న విద్యార్థుల కంతనష్టమును లేదు, పాటు పడి పఠించినవారి కంతలాభమును లే దన్నమాట గాదా! సంస్కృతాంగ్లాది భాషలలో నున్నవిషయములను జక్కని తెలుఁగులో వ్రాసి జనసామాన్యమునకు బోధించినఁ గాని దేశాభివృద్ధి కాఁజాలదు. అందు కందఱుబాలురు నాంధ్రభాషాభ్యసన మవశ్యముగాఁ జేయవలెను. ఆంగ్లభాషకంటెఁ గూడ స్వభాష కెక్కువ ప్రాముఖ్య మీయవలె నని నాయభిప్రాయము. ఇది గాక A తెలుఁగు C తెలుఁగు నని తెలుఁగు రెండుతెలుఁగులు గా నేల యుండవలెనో నాకు దురవగాహముగ నున్నది. పూర్వము బి. ఏ. లోఁ గూడ నింగ్లీషుతో పాటు తెలుఁగు గాని సంస్కృతము గాని విద్యార్థులు తప్పక పఠించెడువారు. నాదృష్టి కదియే మంచిపద్ధతిగాఁ గాన్పించుచున్నది. ఈచేసినమార్పులు పెక్కు సంవత్సరములనుండి ప్రచారములో నున్నవి గదా, వానివలన నేమైన లాభము గన్పట్టుచున్నదా? మేము తేఁ దలఁచిన modern, classical తెలుఁగు విభజనమునకు విఘ్నము వచ్చినది. యేవో తెలుఁగులు రెం డుండినఁ గాని మావ ట్టెట్లు నెగ్గిన ట్టగును? అని సెలవిచ్చువారితో నావంటివాఁడేమి మనవి చేసి కొనఁగలఁడు? A యనుఁడు C యనుఁడు; ఏదో యొక్కతెలుఁగు చాలును. ఇంగ్లీషువలెఁ దెనుఁ గందఱ కవశ్యపఠనీయముగా నుండవలెను. అట్లు చేసిన చో దానిలాభ మధికారులకుఁ గొలఁదికాలములోనే తెలియును. హైందవు లందఱు బి. ఏ. క్లాసులోఁ గూడ వెనుకటివలెనే యింగ్లీషుతో స్వభాషయో సంస్కృతభాషయో తప్పక యభ్యసించుచుండవలెను. బి. ఏ. వఱకుఁ జదువుటకుఁ జాలినన్ని గ్రంథములును విషయములును నున్నవి.

అర్థానర్థపరిహారము గావించి పున్నెము గట్టుకొనిన పండితులును బ్రభువులును బరిషత్తువారును దక్కిన నగమనర్థముకూడ నపసరించి మాపూర్ణకృతజ్ఞతకుఁ బాత్రు లగుదురు గాక! యని వేఁడుకొనుచున్నాను. వ్యాధి యొక

చోటనుండఁగా నైన్య మొకచోటఁ జేయక ప్రజలు నిజముగ నేలోపములవలన మన యాంధ్రభాష తగినంత యభివృద్ధికి రాకున్నదో యాలోపములఁ గనిపెట్టి తెలుఁగులో నారితేఱినవిద్యార్థులకుఁ బారితోషికాది రూపమునఁ బ్రోత్సాహము కలిగించి యాంగ్లాంధ్రోపాధ్యాయులకు సమగౌరవ మొసఁగి భాషోద్ధరణ మహాకార్యమునందుఁ దోడ్పడుదురుగాక!

ఇది యిట్లుండ, నీనడుమఁ బ్రబలరాజకీయసంక్షోభ మొకటి బయలు వెడలి ప్రజాసంఘమున దంతటను బ్రాఁకినది. అది మంచిదా చెడ్డదా యనునదిటఁ జర్చనీయాంశము గాదు, నావంటి ప్రాఁతచదువులపంతులు పరిపాలనావిధానవిచక్షణైకసాధ్యము లగునట్టిమహావిషయములఁ జర్చించుటకు సమర్థుఁడును గాఁడు. అది మంచిది గానిండు, చెడ్డది కానిండు, దానివలన దాదాపుగా యాసజ్జనులకు దేశభాషాభిమానోద్రేకము కలిగిన దనుటమాత్రము నిర్వివాదాంశము. ఏటఁ జరుగవలసినపని పూఁటలో జరిగిన ట్లైనది. ఆంధ్రభాష కొలఁది కాలములో నత్యద్భుతముగా నభివృద్ధి నొందినది. వార్తాపత్రికల యరోపయభాష కలఁక దేఱిన తేట తెలుఁగగుచున్నది. వివిధభావములును వివిధరాజ్యతంత్రవిషయములును విస్పష్టమైన తెలుఁగువాక్యములతోఁ వెలువడుచున్నవి. కొన్నిసభలకునే వెళ్లుట తటస్థించినది. పెక్కురాంధ్రసోదరు,లాంగ్లభాషాభిజ్ఞులైనను,వివిధకఠినాంశముల విశదీకరించుచుఁ బరిశుద్ధమును బరమసుందరమును నగుగ్రాంథికాంధ్రభాషలో నవిచ్ఛిన్నామృతధారాపాతముగ నందఱహృదయములుకరఁగి పాఱున ట్లుపన్యసించుట కనులారఁ గాంచినాను, చెవులార వినినాను. విని విస్మయము నొంది, నాను—ఆహా! తల్లీ! ఆంధ్రభాషామతల్లీ! మొన్నమొన్న నే కదా మేము నిన్నుఁ గొఱుకరాని కొయ్య వనియు, జీర్ణమైనచింపిపాఁత వనియుఁ గేవల మూఢపండితులచే నారాధింపఁబడుచున్న మృతకళేబరము వనియు నెన్నెన్నో యనరాని మాట లాడినాము. జననీ! నీ కెంతశక్తి గలదమ్మా! మూకప్రాయులై యున్న నెంతమందిబిడ్డలను నెంతలో శ్రోత్రపర్వము లగునుపన్యాసము లీయఁగల బిడ్డలను జేసితివమ్మా! ఐహికాముష్మికఫలప్రదాయిని యగునమరభాషకుఁ బ్రియతనూజవు దల్లికి వన్నెఁదెచ్చు బిడ్డవును నగు నీవు మాకు జనయిత్రివై యుండ మా కేమికొదవ తల్లీ! శ్రద్ధాభక్తులు లేక కామధేనువు వంటి కన్నతల్లిని గడ్డిబొమ్మ యని యింతకాలము విడనాడి నీపాలచేపు రుచిమెఱుఁగక డబ్బాపాలతోఁ బెరిఁగి చెడినాము—అని లోలోపల ననుకొని యంతశ్శుద్ధితో నాంధ్రభాషాజనని కనేకనమస్కృతు లాచరించి యానందబాష్పములు రాల్చినాను.

ఇంతటితో నీయంశముఁ గట్టిపెట్టి ప్రస్తుతపాఠశాలలలోఁ దెలుఁగభివృద్ధినొందుట కను వగు మార్గములు నాకుఁ దోఁచినరీతిని మనవి చేసికొనెదను.

పిల్లల కనుకూల మగుపుస్తకము లింకను బయలుదేఱవలెను. అవి, శుద్ధమును సులభమును సుందరమును నగుభాషలో వ్రాయవలెను. వ్యాకరణ ముల్లంఘింపక శైలిని వ్యావహారికభాష కెంతదగ్గఱగాఁ దీసికొనివచ్చిన నంతమంచిది, గ్రంథములో సందర్భానుసారముగఁ జక్కని భాషీయములఁ బొందుపఱుపవలెను. సౌలభ్యార్థమును నశ్లీలపరిహారార్థమును విసంధు లుపయోగపఱుచుట తప్పుగాదు. అట్లు సుప్రసిద్ధాభినవవచనగ్రంథకర్త లనేకులు చేసినారు. ప్రాఁతపడినపదములును బ్రత్యయములును సాధ్య మైనంతవఱకు వర్జింపవలెను. సమర్థులగువా రీపనిని బూనుకొని జాగరూకతతో వ్రాయుచున్నయెడలఁ గాలక్రమమున గ్రాంథికభాషకుఁ గర్కశత్వము పోవును. వ్యావహారికభాషకు వ్యాకరణనైరుద్ధ్యము పోవును. అంతట మనపరిపాలకులగు నాంగ్లేయులకువలె మనకును దైవకృపచే నీయుభయభాషలును దాదాపుగా నొక్కటి యగును. ఇందుకు భాషాసేవకులలో నోరిమియుఁ గూరిమియు నుండవలెను. నన్నయనాఁటి తెలుఁగే యిప్పుడును వాడవలె ననువారలలోవాఁడను గాను నేను. తెలుఁగుభాష యెన్నఁటికిని మార్పుఁ జెందదు, చెందఁగూడ దనుపక్షము నాది గాదు. ఆంధ్రభాష, కాలానుగుణముగాఁ బెక్కుమార్పులు చెందుచున్న ట్లనేకప్రత్యక్షనిదర్శనము లున్నవి. పెక్కురు సుప్రసిద్ధగ్రంథకర్త లుపయోగించు నపూర్వప్రయోగములు తదనంతరపు గ్రంథకర్తలభాషలోఁ దప్పక చేరఁగలవు. లక్షణగ్రంథములును దదనుగుణముగా మాఱుచుండును. ఇది సర్వభాషాసామాన్యమగుధర్మము. అంతే కాని తొందరపడి వరినాఱు నాటుటతోడనే వడ్లేవి యని యడిగిన నేమిప్రయోజనము? తొమ్మిదినెలలు నిండినతరువాత నిండుబిడ్డ తల్లిగర్భమునుండి యీవలికి వచ్చునప్పుడు మూఁడుమాసము లైనవిగదా ($\frac{1}{3}$) మూఁడవవంతు బిడ్డ రాదేమి? యని త్రైరాశికతంత్రసూత్రములు ప్రయోగించి ప్రశ్నించుట పరిహాసాస్పదముగా నుండును. ఏభాషలోను నిట్టివిషయమున నట్టిసద్యఃఫలను గాన్పింపదు, అది యస్వాభావికము.

గ్రంథములలోని విషయములు వివిధములై విద్యార్థులకు రుచిపుట్టించునట్లుండవలెను. సృష్టిలో స్ఫుటముగాఁ గానిపించు పదార్థములఁ గూర్చి తెలిసికొనుటకు బాలికలును బాలురును సహజముగాఁ గుతూహలపడుదురు. అజ్ఞానతృష్ణ దీర్చుటకుఁ బాఠములు వ్రాయుటకై యెన్నుకొను విషయములు భిన్న

ములుగా నుండక తప్పదు. భూగోళఖగోళమృగజంతుశాస్త్రాదులలోని ప్రధా నాంశముల నేఱి యనువైన తేటతెలుఁగులో వానిఁ గూర్చి వ్రాయవలెను. పఠితల వయస్సామర్థ్యములు మనస్సునం దుంచుకొని వీ లైనపట్లఁ గార్యకారణ సంబంధములు విశదీకరింపవలెను. శారీరారోగ్యశాస్త్రవిషయములు గూడ సరళరీతిగా బోధింపవలెను. నీతి నుపదేశించుపాఠములు తప్పకుండ నుండవలెను. నీతిబాహ్యము లగువిషయముల కెందును జోటీయఁగూడదు. దైవభక్తి దేశభక్తి రాజభక్తు లుపదేశించుపట్లు గొన్ని యుండవలెను. పారిభాషికపదము లతిజా గ్రత్తతో వాడవలెను. పరిషత్పత్త్రికలోఁ బ్రకటించిన పట్టికను సహాయము చేసి కొని యందఱు గ్రంథకర్త లేకరీతిగా నట్టిపదములు గ్రంథములం దుపయోగించు కొనుట మంచి దని తోఁచుచున్నది. తగిన కల్పితపదములు లేనప్పుడు మూ లాంగ్లపదము లామట్టుననే కైకొని యుపయోగించుకొనవచ్చును. అట్లు చేయుట కాంధ్రవ్యాకరణ మెంతమాత్రమును నడ్డు రాదు. పద్యరచనయం దారితేఱినవారే బాలురకుఁ బఠనీయము లగుపద్యములు వ్రాయవలెను. సృష్టిలోఁ జిత్రచిత్రము లైనట్టియు నుదారభావజనకము లైనట్టియుఁ బదార్థ ములే వానికి విషయములుగా నుండవలెను. సూర్యోదయాస్తమయములు, చంద్రబింబము, ఇంద్రధనుస్సు, హిమవత్పర్వతములు, సముద్రము, మహానదులు, సుందర మగుపక్షులు, శ్రీరామచంద్రహరిశ్చంద్రాదిమహాపురుషులు—ఇట్టివిష యములపై పద్యములు వ్రాయవలెను. శృంగారవీరకరుణాదిరసముల కను గుణమై విషయము లున్నఁ గాని సాధారణముగాఁ బద్యములు రసవంతము లుగా నుండనేరవు. పద్యము ఛందోబద్ధమై యున్నంతమాత్రముననే పద్య ప్రయోజనము నెఱవేఱదు. కమనీయ మైనపదగతి, కల్పనాచమత్కృతి, భావో దారత—యిట్టిలక్షణములు పద్యకావ్యమునకుఁ బట్టినఁ గాని యది గణబద్ధ మైన గద్యకావ్యముగనే పరిణమించును. కాళిదాసుఁడు మబ్బుఁ దీసికొని మనోహర మగుశ్లోకము లనేకములు వ్రాయలేదా, మాయిష్ట మగువిషయము మేము దీసికొని వ్రాసెదము—అనువారి కొకనమస్కారము. కాళిదాసునివంటి కవివర్యులును సుప్రజ్ఞాశాలులును నేవిషయమును పుచ్చుకొని వర్ణించినను నింపు గానే యుండును, గాని నావంటివాఁడు గేదెమీఁదను పలుపుమీఁదను బద్యము లల్లి పెట్టిన నది చదువుబాలురకు గేదెకవిత్వముగాను పలుపుకవిత్వముగానే కానిపించునేమో యని భయపడుచున్నాను. ఉచిత మైనవిషయములపైని చిత్తరంజకముగా వ్రాసిన చిన్నచిన్నపద్యకావ్యములు మనప్రభువులభాషలో

యనేకము లున్నవి, మన భాషలో లేవు. సమస్త లగుభాషాసేవకు లాఁగాఁ ఆత య చిరకాలములోఁ దీర్ఘరుగాక యని ప్రార్థించుచున్నాను.

చారిత్రవిషయకపుస్తకములఁగూర్చి యొకచిన్నమనవి చేసికొనవలె నని యున్నది, తాము సావధానచిత్తతతో నాకర్ణింపఁ గోరుచున్నాను. విద్యార్థుల దేశమును వారిజాతిని వారిపూర్వులను నిందించుచు వ్రాసిన పుస్తకములు వారిచే జదివించుట మంచిది కా దని నాయభిప్రాయము. దానివలన పోఁగా మిగిలిన యించుకంత యాత్మగౌరవమును దేశాభిమానమును నశించిపోవును. చిన్ననయసున మనసునందు నాటిన బోధనములు చిరస్థాయిత్వ మంది యితర బోధనము లంటనీయవు. చరిత్రలలోని యుత్కర్షాపకర్షవాక్యములు సత్యదూర ములు కూడ నైన నిఁక వాని దుష్ఫలము చెప్ప నక్కఱయే లేదు. చరిత్రము లో సత్యకథనమే యుండవలెను. అసత్యకల్పన లున్నచరిత్రగ్రంథములు సర్వా నర్థకరము లగును. పురాణగాథలు కేవలసత్యములు గావు, అర్థవాదాదులు పెక్కు లందున్న వని పఠితలకుఁ దెలియుటచే నందలియసత్యములు చెడుగు చేయఁజాలవు. చరిత్రలందలి యసత్యములు సత్యవేషధారులు. ప్రత్యక్షవిషము కంటె భక్ష్యపదార్థరూపముగా నున్నవిష మెక్కున ప్రాణోపద్రవకరము. కా వున మనము చరిత్రపుస్తకములు చక్కఁగాఁ బరిశీలించి మఱి పిల్లలచేతులలోఁ బెట్టవలెను. మనపూర్వులు దుష్టులు, మనతాతలు వంచకులు, మనజాతి నికృష్టజాతి యని మనసు లక్కవలె నెట్లు నొక్కిన నట్లు నొక్కువడు లేత వయసులోఁ దమపిల్లలకు బోధించువా రెన్నఁటికి నుచ్చదశకు రాఁజాలరు.

నాచిన్నతనమునఁ జదివిన హిందూదేశచరిత్రములో 'The Black-hole of Calcutta' కలకత్తా చీఁకటికొట్టు—ను గూర్చి వ్రాసినఘోరవర్ణనలు చదివి, అయ్యో! మహమ్మదీయు లెంతరాక్షసకృత్యము చేసినారు' అని చింతిల్లినాను. కలకత్తా చీఁకటికొట్టు ప్రస్తుతచరిత్రకారులదృష్టిని గలలోని కల్లవార్త యైనది. మహమ్మద్‌టాగ్లక్కు మతిలేనిప్రభు వని చదివి నవ్వుకొన్నాను. ఆయన యిప్పుడు పిచ్చివాఁడు కాకపోవుటయే కాక యత్యంతపరిపాలనాసమర్థుఁ డైనప్రభు వని తేలినది. ఇఁక మెకాలేదొరగారు వారెన్ హేస్టింగ్సుగారిని గూర్చి వ్రాయుచు వంగజాతి నభివర్ణించినవాక్యములు చిత్తగింపుఁడు. What the horns are to the buffalo, what the paw is to the tiger, what the sting is to the bee, what beauty according to the old Greek song, is to woman, deceit is to the Bengalee. Large promises, smooth excuses, elaborate tissues of circumstantial falsehood, chicanery, perjury, forgery, are the weapons, offensive

and defensive, of the people of the Lower Ganges." వానితాత్పర్యము తెలుఁగులో విన్నవించుకొనుచున్నాను. "దున్నపోతునకు కొమ్ములెట్లో, పెద్దపులికి పంజాయెట్లో, తేనెటీఁగకు మునికొండి యెట్లో, ప్రాచీనగ్రీకుగీతము చెప్పినట్లాఁడుదాని కంద మెట్లో, వంగదేశీయునకు మోస మట్లు. పెదపెద్దప్రతిజ్ఞలు, చల్లని సాకులు (పరిహారవచనములు) చక్కఁగా సవిస్తరముగా శ్రమపడి యల్లునసత్యపుటల్లికలు, తక్కిడివాదములు (కుతర్కములు), అప్రమాణములు, దొంగసంతకములు (తప్పుసృష్టులు) ఇవి గంగానది క్రిందిభాగమున నివసించు జనులు (అనఁగా వంగదేశస్థులు) స్వసంరక్షణార్థమును, పరోపద్రవకరణార్థమును ఉపయోగించుకొనుచు ఆయుధసాధనములు." ఇట్లు తెగడిన జాతి యేది? డాక్టరు బోసుగారు, డాక్టరు రేగారు, సీతానాథతత్త్వభూషణుఁడుగారు, రవీంద్రనాథటాగూరుగారు, శ్రీరామకృష్ణపరమహంసస్వామివారు, విద్యాసాగరులవారు, మహర్షిదేవేంద్రనాథటాగూరువారు, కేశవచంద్రసేనులవారు, వివేకానందస్వామివారు, రాజారామమోహనరాయలవారు, శ్రీచైతన్యస్వామివారు—ఇట్టిమహానుభావులు పుట్టుటచేఁ బవిత్రీకృత మైనజాతి. వ్రాసినవా రెవరు? నావంటి యప్రసిద్ధపురుషులుగారు. నిరర్గళధారతోఁ బెక్కాంగ్ల గద్యపద్యగ్రంథములు వ్రాసిన మేధావంతులు, మిల్టనుగారిగ్రంథములు దగ్ధములై పోయినను నొకయక్షరమైనను బోకుండ నవి తిరుగఁ జెప్పఁగలనన్న యసాధారణధారణాశక్తియుక్తులు, హిందూరాజ్యనౌకాకర్ణధారులు, శాసననిర్మాణకళాకుశలులు, ప్రస్తుతవిద్యావిధానసౌధమునకుఁ బునాదివేసినబుద్ధిమంతులు, హిందూదేశశిక్షాస్మృతికర్తలు. అట్టివారివచనము లెంతప్రమాణములుగా నుండవలెను? ఆయనదృష్టి కాజాతియంతయు నట్లే కనఁబడినదేమో యందురా? చారిత్రగ్రంథకర్తలు తమకుఁ దోఁచినట్లెల్ల వ్రాయవచ్చునా? ఈసందర్భమునఁ జిన్నతనమునఁ జదివిన యొకకథ జ్ఞప్తికి వచ్చుచున్నది:—

స్నేహితు లగునొకమనుష్యుఁడును నొకసింహమును గలిసిపోవుచుండఁగా బాటప్రక్క నొకవిగ్రహము వారికిఁ గానిపించె నఁట. అం దొకశూరుఁ డొకసింహమును కాలిక్రిందఁ బెట్టి త్రొక్కి బాఁకుతోఁ బొడుచుచున్నట్లు చక్కఁగాఁ జెక్కఁబడియుండెను. అదిచూచి మిత్రమా! అట్లుచూడుము! అని మనుష్యుఁడు మందహాసముచేసి సింహముతోఁ బల్కెను. అట్లెవరు చెక్కినా? రని సింహ మడిగెను. ఎవ రైన నేమి? మామనుష్యుఁడే లే! యని యతఁడు పలికెను. మనుష్యుఁ డైనప్పుడు విగ్రహము మ ఱొకరీతిగా నె ట్లుండును? శిల్పి

మాసింహమైనచో మీమనుష్యుఁడే మాసింహముకాలిక్రింద నుండును. అని చెప్పినప్పుడే సింహము ప్రత్యుత్తర మిచ్చెనఁట—మెకాలేగారికి బంగాళపు జాతిలోఁ బరికింపఁగా నొక్కఁడైనను యోగ్యుఁడు కనఁబడలేదు కాఁబోలు? పై పంక్తులు చదువునప్పుడు పాపము! వంగదేశబాలుర కెంతకర్ణశూలములుగను హృదయశల్యములుగను గాన్పించునో కదా! మంచియింగ్లీషుమాటలతో మన పూర్వులను మనజాతిని తిట్టినా రని సంతోషించుట నునుష్యప్రకృతి గాదు.

ఈమెకాలేదొరగారే హిందూదేశపు మామిడిపండు వర్ణించుచు నది ప్రుల్లిన మనసీమరేఁగుపండువలె నుండు నని చెప్పినా రఁట. అట్టివారి కిట్టి విపరీతవిషయజ్ఞానము గలుగుటకుఁ గారణము వారిజిహ్వాదోషమో మామిడి పండు యొక్క పురాకృత ప్రారబ్ధకర్మమో చెప్పఁజాలను.

ఇఁక నొక్కయుదాహరణము మనవిచేసికొని యీవిషయము చాలించెదను. శివాజీమహారాజును గూర్చి నవీనచరిత్రపరిశోధకులు వ్రాసినగ్రంథములు మీరు చదివియే యుందురు. అతఁడు మాతృదేవత యగుజిజీబాయిని జగజ్జనని యగుభవానీదేవిని సమదృష్టితోఁ జూచి కొల్చినపుత్రరత్నము. మహాభక్తుఁడు. జ్ఞానగురు వగుసమర్థరామదాసస్వామివారికిఁ దనరాజ్య మంతయు గురుదక్షిణగా సమర్పించిన నిర్లిప్తచిత్తుఁడు, మహావదాన్యచక్రవర్తి. “నాకు రాజ్య మెందుకు? నీవు క్షత్రియుఁడవు, దుష్టశిక్షణశిష్టరక్షణాదిక్షాత్రధర్మములు నెఱపుకొనుచు రాజ్యపరిపాలనము చేయుట నీకు విహితకృత్యము. అట్లు చేయుము” అని గురువుగారు సెలవీయఁగా మాఱుమాటాడఁజాలక, తనరాజ్యము తనగురుమహాశిది గాని తనది గా దని తెల్పుటకై జెండాకు జేగురుచేలఁ గట్టి కాషాయపతాకతోనే కడమకాలమంతయు గురుసేవకుఁడుగా రాజ్యతంత్రము నడపిన గురుభక్తకులశేఖరుఁడు. మహమ్మదీయులుగానివారియొద్ద మహమ్మదీయచక్రవర్తి “జిజియా” పన్నుగొనుటచూచి క్రోధావిష్టుఁడై మహమ్మదీయుల నోడించి వారియొద్దనుండి ‘చౌత్తు’ మున్నగు పన్నులు వసూలుచేసి పగఁదీర్చుకొన్న పరాక్రమశాలి. స్వమతపోషకశిఖామణి. ఆతనిజితేంద్రియత్వమునకును బరనారీభ్రాతృభావమునకును బ్రబలదృష్టాంతముగా నుండు నొక చిన్నచరిత్రాంశ మిటఁ జెప్పకుండుటకు మనసొప్పకున్నది—శత్రుదుర్గములఁ బట్టుకొనుచుండఁగా ముల్లానా కోడలును బరమలావణ్యసౌందర్యవతి యునగు నొకతురుష్కయువతి శివాజీసేనాధిపతిచేతిలోఁ జిక్కెను. భోగార్థము సేనాధిపతి యామెను దెచ్చి యెదుటఁ బెట్టి శివాజీకర్పింపఁ బోఁగాఁ జెమ్మగిల్లిన కన్ను

లతో శివాజీ యిట్లుపల్కెను:—"అమ్మా! మాతల్లికి నీసౌందర్య ముండిన నే నెంత చక్కనివాఁడనై యుందును! ఈమె నాకు మాతృసమానురాలు; యశస్కాములు పరస్త్రీని గోరరు, పరదారాభిలాషచేతనేకదా రావణాదులు నశించిరి!" అని చెప్పి శివాజీ యనేకాభరణములు కానుకలిచ్చి కూఁతు నల్లుని యింటికిఁ బంపునట్లామెను సగౌరవముగా నామెభర్తగారి యింటికిఁ బంపె నఁట.

ఇట్టిరాజరత్నము, ఇట్టినిష్కామకర్ముఁడు, ఈయపరజనకచక్రవర్తి, ఈనిరుపమానభుజపరాక్రమశాలి, చరిత్రకర్తల కలమునకు దోఁపిడికాఁడను కొంక యెలుకయు నైనాఁడు. విద్యార్థుల ప్రారబ్ధ మే మని చెప్పుదును?

శివాజీజిత్తులమారి కాఁ డనియుఁ గపటోపాయములచే రిపుల నోడింప లే డనియుఁ జెప్పను, కాని యాలెండింటితోపాటు సముద్రమువలె నున్న యతని సద్గుణజాల మేల పేర్కొనఁబడఁగూడదు? పరిపూర్ణుఁ డైనమనుష్యుఁ డెచటనైన నుండునా? భగవంతునికిఁ దక్కఁ బరిపూర్ణత సృష్టిలో నేరికైనఁ గలదా? ధర్మయుద్ధములు ద్వాపరాంతమున ధర్మరాజుగారితోనే తలఁగిపోయినవి. రాజనీతియు సామాన్యప్రజానీతియును వేఱైనవి. రవీంద్రనాథటాగూరుగారు మున్నగుమహాత్ము లుపదేశించునుపదేశములు భగవత్కృపచే సఫలీకృతములైనఁ దక్క నవ్వి యట్లే యుండఁగలవు. సంపూర్ణశాంతివైరాగ్యప్రధాన మైన మతము గదా జీజేసుగారు బోధించినమతము! కుడిచెంపమీఁద నెవరేని నిన్నుఁ గొట్టినచో నెడమచెంపఁ ద్రిప్పు మని బోధించు పరమసాత్వికమతము గదా క్రైస్తవమతము! నాగరకాగ్రగణ్యులైన జర్మనీవా రామతమువారే కదా! మొన్నజరిగిన ఘోరసంగ్రామములో నెన్నిక్రూరకృత్యములు గావించినారు! నిరపరాధులైన స్త్రీలు, గర్భవతులు, శిశువులు, వృద్ధులు నున్నపొగయోడలెన్నిసముద్రములో ముంచి స్త్రీశిశుహత్యాదిమహాపాతకములు గట్టుకొన్నారు! అట్టివారు వీరాగ్రేసరులును, మహాత్ముఁడును మాతృదేశభక్తుఁడును నైన శివాజీమహారాజు పర్వతమూషికమునా!

ప్రస్తుతాంశమునకు వత్తము. స్వదేశవీరుల నిరసించుచు వ్రాయుచారిత్రగ్రంథము లెప్పుడును విద్యార్థులచేతఁ బెట్టఁగూడదు. పాఠశాలాపఠనీయగ్రంథనిర్ణేతలు బహుజాగరూకతతో గ్రంథములు విమర్శించి మఱి బడులలోఁ జదువ నగుపుస్తకముల జాబితా ప్రకటింపింపవలెను. క్రిందితరగతులకొఱకు వ్రాసిన పుస్తకములు చక్కఁగా ముద్రింపఁబడి బాలహృదయాకర్షకము లగుపటములతో

నొప్పి యుండవలెను. శైలి సులభముఁగా మనోహరముగా బాలకుల వయో బుద్ధుల కనుగుణముగా నుండవలెను. లోకజ్ఞానమో, సత్పురుషచరిత్రమో, సృష్టివైచిత్ర్యమో, వ్యవహారసంప్రదాయమో, నీతియో, అహింసాపరోప కారస్వార్థత్యాగాద్యుదారధర్మములో, పాఠములకు విషయములుఁగా నుండ వలెను. తీయని యనుపానములతోఁ జేదుమందులు త్రాగించునట్లు చక్షురా నందకరము లగుచిత్రలేఖనములతోను జిత్తరంజక మగురసవన్మృదుపదరచన తోను బాహ్యదృష్టి కప్రియములుగా నుండు జ్ఞానారోగ్యనీతిధర్మాదివిషయ ములు బాలురమనసుల కెక్కింపవలెను.

ముద్రణసౌకర్యమును ధనసౌలభ్యమును గలుగుటచేఁ గాఁబోలు నుత్తమ మధ్యమాధమగ్రంథములు ప్రస్తుతకాలములో నుత్తరోత్తరాభివృద్ధిగా బయలు దేఱి పఠనీయగ్రంథనిర్ణాయకులపని కష్టతరము గావించుచున్నవి. పుస్తకము లెన్నువారు ద్వేషదాక్షిణ్యభావము లవ్వలఁ బెట్టి గ్రంథప్రాశస్త్యమే గణనీ యము చేసికొని బాలురకుఁ జదువవలయు పుస్తకము లేఱి పెట్టవలయును. చదువుగ్రంథముల శైలిని భావములను గల్పనలను ననుకరించి పిల్లలు వ్రాయు దురు. కనుకఁ గల్పనలలోను భావములలోను బదములకూర్పులోను రసౌచి తులు పరిశీలించి గ్రంథములు నియమించినఁ గాని యననుసరణీయము లగు పుస్తకములు బాలురు పఠింపవలసివచ్చును. దానివలన ననేకానర్థములు గలు గును. భాషాభివృద్ధికిఁ బ్రతిరోధము తటస్థించును. ఉపజ్ఞావంతుల సద్గ్రంథములు పఠనీయములుగాఁ జేయుట గ్రంథనిర్ణాయకుల ప్రధానకర్తవ్యము. సత్కవు లకుఁ గావించినసమాదరణ ప్రోత్సాహములవలన సరసమైన సద్గ్రంథములు విశేషముగా బయలుదేఱును. ఇతరగ్రంథపోషణమున నసద్గ్రంథములు కుప్పతిప్పలుగా వెడలి యర్భకుల కనర్థకారు లగును. కనుకఁ బఠనీయగ్రంథ ములు నిర్ణయించువారు కేవలదేశభాషాపురోభివృద్ధితత్పరులై మోమోటమును బూర్తిగాఁ ద్రోసిపుచ్చి న్యాయైకదృష్టితో రసవంతములును నుపజ్ఞాలక్షణలక్షిత ములును నౌచితీయుక్తములును నీతిదాయకములును నగుమంచిపుస్తకములు పాఠశాలలలోఁ బ్రవేశపెట్టవలయు నని మనవిచేసికొనుచున్నాను.

పరిషత్తువారు నిఘంటునిర్మాణమహాకార్యమును బైని వేసికొని ప్రజల కృతజ్ఞతకుఁ బాత్రులైనారు. భగవత్కృపచే నచిరకాలములో నది పైకి వచ్చి తత్సంపాదకులకును దానికి నలయుద్రవ్యము పుష్కలముగా దయచేసిన భాషాభి మానులును వదాన్యులును నగు శ్రీమహారాజుగారికిని నాచంద్రతారక మగు

యశోలాభ మొసంగుఁగాక! యని ప్రార్థించుచు, దానితోపాటు, బయలు వెడలు గ్రంథములను బరిశీలించి వానిగుణాగుణములను బ్రకటించి ప్రజల కెఱిఁగించుభారము కూడఁ బరిషత్తువారు వహించుట మహోపకారకృత్య మని మనవిచేసికొనుచున్నాను. హంసలు, నీరక్షీరవిభాగము చేయునట్లు నిష్పక్షపాతబుద్ధితోఁ బ్రామాణికులైనవిద్వత్పరిషత్తువారు సదసత్సరసనీరసగ్రంథ విభాగము గావించుట భాషాభావ్యభ్యుదయహేతుక మగు నని నాయభిప్రాయము. (French Academy) ఫ్రాన్సుదేశపరిషత్తట్టిమహోపకారము చేసి భాషను బ్రజాభిరుచులను బరిశుద్ధములు చేసి దేశమును మందటికిఁ దీసికొని వచ్చినట్లు వినుచున్నాము. మనపరిషత్తువారు కూడ నట్టియుదారోద్యమము పూని కృతకృత్యు లగుదురుగాక!

పాఠశాలల కవ్వలనుండువారు భాషాభివృద్ధికై కావింపవలసిన విధులను గూర్చి నాకుఁ దోఁచినయభిప్రాయములు తమయెదుటఁ బెట్టినాను. ఇఁకఁ బాఠశాలలలోఁ బనిచేయువా రేమిచేయవలయునో దానిఁగూర్చి యించుక మనవి చేసికొనెదను.

తెలుఁగును A తెలుఁగని C తెలుఁగని రెండుతెలుఁగులుగా ఖండించినా రని యిత:పూర్వము చెప్పితిని గదా. ఆసంస్కరణమున కదనముగాఁ బఠనీయగ్రంథములను సవిమర్శపఠనీయము లనియు (books for detailed study) సామాన్యపఠనీయము లనియు (books for non-detailed study) రెండువిధములుగా విభజించినారు. ప్రథమజాతిపుస్తకము లధ్యయనగభీరత (intensiveness of study) కొనమును రెండవజాతిగ్రంథములు పఠనవిస్తీర్ణత (extensiveness of study) కొనమును బెట్టఁబడిన వఁట. అధ్యయన మహార్ణవములో నొకచోటలోఁ తెక్కువగా నుండవలె నఁట, రెండవచోట విరివి హెచ్చుగా నుండవలె నఁట. ప్రస్తుతపు Intermediate, B.A., తరగతుల యనుభవము నా కంతగా లేదు, వానిలో నీభేదమువలన నుపయోగ ముండిన నుండవచ్చును. 4-వ ఫారమువఱకు మాత్ర మది యనావశ్యకము. చదువున దేదో యది యంతయును సవిమర్శముగానే చదువవలెను. పెట్టినగ్రంథముల ప్రాశస్త్యమును బట్టియు గురుబోధనపాటవమును బట్టియు విద్యార్థులకు విద్యాతృష్ణ హెచ్చి వారిచేఁ బాఠశాలాగ్రంథసమితిలో నుండునితరగద్యపద్యగ్రంథములు చదివించుచున్నచో నది వాంఛనీయమే, శుభసూచకమే. 4, 5, 6 ఫారములలో సామాన్యపఠనీయగ్రంథములు సరియైనవి పెట్టినచో లాభకర మన్నమాట

వాస్తవమే. కాని యట్టివి భాషయందును గ్రంథస్థవిషయమునందును గడుసుల
భములుగా నుండవలెను, గురుసాహాయ్య మక్కఱ లేకుండ విద్యార్థులు తమం
తటఁ దాము చదువుకొనఁగలుగునంత తేలికగా నుండవలెను. అప్పుడే యట్టి
వాని ప్రయోజనము నెఱవేఱును. నేను ప్రధానోపాధ్యాయుఁడనుగా నుండు
నప్పుడు పెట్టిన కొన్ని సామాన్యపఠనీయాంగ్లగ్రంథములు సవిమర్శపఠనీయాంగ్ల
గ్రంథములకంటె నెన్నోనుడుఁగులు కఠినముగా నుండెడివి. ఇప్పు డెట్లున్నవో
నే నెఱుఁగను. అట్టిగ్రంథములు పెట్టుటవలన లేఁతవయసులో నుండుపిల్లలకుఁ
బఠనభాగమును మనఃక్లేశమును హెచ్చయి వారిబుద్ధిని పాడుచేసి జ్ఞానార్జన
కౌతుకాగ్నిని జల్లార్చును. చదువు చేఁదుగాఁ గనఁబడును. విద్యార్థి నట్టిస్థితికిఁ
దీసికొనివచ్చువిద్యాపద్ధతి విసర్జనీయము.

తిన్నఁగాఁ బుస్తకము చేతఁ బట్టలేని 2, 3, 4, 5-వ తరగతుల శిశువుల
చేతులలోఁ గూడ రెండురకముల తెలుఁగుపుస్తకములు గానిపించుచున్నవి.
ఒకటి వాచకపుస్తక మఁట, రెండవది యుపవాచకపుస్తక మఁట. చక్కఁగా వివిధ
విషయములఁ గూర్చి వ్రాసిన యొకపుస్తకము నియుక్తులైన యుపాధ్యాయు
లుచితరీతిని జెప్పినఁ జాలును. ఒకమూల గణితము, ఒకమూల చరిత్రగ్రంథము,
ఒకమూల భూగోళశాస్త్రము, ఒకమూల శారీరారోగ్యశాస్త్రములు, ఒక
మూలఁ (Civics) బట్టనపాలనాపద్ధతులు, ఒకమూల జంతువృక్షశాస్త్రవిషయ
ములు, ఒకమూలఁ దెలుఁగున కేమాత్రమును సంబంధింపని యాంగ్లేయభాష.
చెక్కులు చిదిమిన క్షీరములు గాఱు శిశు వీయొత్తుడు తగిలిన నుక్కిరిబిక్కిరి
కాఁడా? విద్యాకుతూహల మభివృద్ధి సేయువిద్య విద్యగాని విద్యావిజుగుప్సా
పాదక మగువిద్య విద్యగాదు. ఇట్టిస్థితిలో విద్యార్థుల యుత్సాహమును శరీ
రారోగ్యబలవర్చస్సులును మేధాసంపత్తియుఁ బోవుచున్న వన్న నాశ్చర్య మే
మున్నది?

ఆంగ్లభాషేతరబోధ్య విషయము లాంధ్రభాషాద్వారమున బోధింప
వచ్చు నని యధికారు లనుజ్ఞ యిచ్చినా రఁట. గణితచారిత్రప్రకృతిశాస్త్రాదులు
దేశభాషతోఁ జెప్పవచ్చు నని యొప్పుకొన్నా రఁట. కాని య దింకను బైతర
గతులలోఁ బ్రచారములోనికి రాలేదు. అట్లు రాకపోవుటకుఁ గారణము మన
యలసతయే కాని యధికారుల. యశ్రద్ధగాఁ గానిపించదు. ప్రచారములోనికిఁ
దెచ్చుటకు బహుకష్టములు పడవలె ననుమాట యథార్థము. బాలురకు బడి
పంతుళ్లకుఁ గూడఁ దెలుఁగు ధారాళముగా మాటలాడునలవాటు తప్పిపోయి

సది. ఆంగ్లపారిభాషికపదముల కాంధ్రసంస్కృతపర్యాయపదములు దొరకుట కష్టము. సులభముగా నుపయోగింపనగు పదములైనను సమయమునకు స్ఫురింపవు అదియాంగ్లభాషాభ్యాసబలమును సూచించును గాని యాంధ్రభాషాసమర్థతను సూచింపదు. 'Draw a Straight Line' అనుమాటలు ముందుగా నాలుకచివరకు వచ్చి యుండును 'ఒకసరళరేఖ గీయుము' అనునవి యాలోచనమీఁదఁ గాని రావు; 'A. B & C are the angular points of the triangle A B C' అనునది 'క, చ, ట లు కచట యను త్రిభుజముయొక్క కోణబిందువులు' అనుదానికంటె సులువుగాఁ గానిపించుచున్నది. అది యభ్యాసమహిమ గాని యంశకంటె వేఱుగాదు. ఇప్పుడు చెవికిఁ గటువుగాను వింతగాను వినఁబడు 'త్రిభుజము' అనుమాట వాడుకలోనికి వచ్చినకొలఁది నింపుగాను బరిచితపదముగాను వినఁబడును. చేఁదుకాఫీ యిప్పుడు జిహ్వకు రుచించి కడనల కొలఁది ఖర్చగుచుండుట మనము ప్రత్యక్షముగాఁ జూచుచుండుట లేదా? ఇట్లే 'liver, spleen' మున్నగుమాటలకు 'కాలిజేము' 'ప్లీహము'మున్నగుపదము లుపయోగించుకొనుచుండినఁ, ంతకాలమున కవ్వియేసర్వసామాన్యములైన వ్యావహారికపదములలోఁ జేరును. ఆదికష్టము లన్నిసంస్కరణములకు నవశ్యానుభావ్యములు. ప్రకృతి శాస్త్రాదులు తెలుఁగుతోఁ బ్రారంభించినయెడల నుపాధ్యాయుల కాయాయాంగ్లేయపరిభాషాపదములకు సరియైన సంస్కృతపదములలో తెలుఁగుమాటలలో వెదకుట తప్పదు. బుద్ధిపరిశ్రమవలన యుక్తపర్యాయపదములు పొడకట్టకమానవు. డబ్బుకైయో భాషాసేవార్థమో బుద్ధిమంతులాయాశాస్త్రములలో సముచితగ్రంథములు వ్రాయ మొదలిడుదురు. ఒకరిని మించి యొకరు బాగుగాఁ బుస్తకములు వ్రాయవలె నని గ్రంథకర్తలు ప్రయత్నింతురు. అట్లు చేసినచోఁ గొలఁదికాలములో నాంగ్లేయభాషయందువలెనే తెలుఁగులోఁ గూడ దివ్యమైన ప్రకృతిశాస్త్రాదిగ్రంథములు బయలు దేఱఁగలవు. పుస్తకము లున్నఁ గాని బడులలో నివన్నియుఁ దెలుఁగుతో నెట్లు చెప్పుదు మని యుపాధ్యాయులును, ఉపాధ్యాయులు తెలుఁ గుపయోగింప మొదలు పెట్టినఁగాని మేము గ్రంథములు వ్రాసినప్రయోజన మే మని గ్రంథకర్తలును నొకరినొకరు చూచుకొనుచుఁ దటస్థులై యున్నయెడల మనయాంధ్రభాష యెప్పటికిని యథాపూర్వకముగానే యుండును. కావునఁ బాఠశాలాధ్యక్షు లీవిషయమున సాహసించి స్వభాషాభివృద్ధిఁ గావింతురుగాక! యని ప్రార్థించుచున్నాను.

ఇఁక నుపాధ్యాయవృత్తి స్వీకరించి బడులలోఁ బ్రవేశించిన పండితోత్తముల కొకమనవి చేసికొనెదను. పూర్వము కేవలాంధ్రగీర్వాణభాషాభిజ్ఞులై యాంగ్లభాషాపరిచయము లేనివారే బడులలోఁ బండితులుగా నుండెడివారు. ఇప్పుడు కొంద ఱట్టివారును గొంద ఱాంగ్లభాష తెలిసినవారును బాఠశాలలలో నాంధ్రాధ్యాపకులుగా నున్నారు. ఆంగ్లపండితులకు సాధారణముగా నాంధ్రభాషాపాండిత్యము తక్కువగా నుండును, సంస్కృతాంధ్రపాండిత్యమున్నవారికిఁ బ్రకృతిశాస్త్రాదివిషయజ్ఞానము తక్కువగా నుండును. వారిలోపము వారును వీరిలోపము వీరును బూర్తి చేసికొనినచో నాంధ్రోపాధ్యాయులుండవలసినరీతి నుందురు. మునుపటివలెఁ గాక ప్రస్తుతపఠనీయగ్రంథములు నానాప్రకృతిశాస్త్రవిషయసంకలితములై యున్నవి. కావునఁ బండితులుగాఁ బనిచేయువారు రేపటిపాఠము లీవేళ నింటియొద్ద సవిమర్శముగాఁ జదువుకొనవలెను. అట్లు చేయుట తమకును విద్యార్థులకును గూడఁ జాల లాభకరము. పొరపాటు లుండవు. కాలము వృథాగాఁ బోదు, గ్రంథస్థవిషయములు సువిస్పష్టముగాఁ బ్రశ్నోత్తరరూపమున బాలురకు బోధింపవచ్చును, చెప్పినపాఠము శిష్యులకు మనోహరముగా నుండును. పట్టాభద్రపండితులకుఁ జెప్పు తెలుఁగుపాఠము లింటియొద్ద శ్రమపడి చదువుకొని రావలెనా? యనునహంభావ ముండఁగూడదు. ముందు చదువుకొని పాఠములు చెప్పుటవలన విద్యార్థులకుఁ దమయెడల నుండవలయు భయభక్తులు హెచ్చును గాని గౌరవహాని యెంతమాత్రమును దటస్థింపదు. దీనికిఁ దార్కాణగా నొకచిన్నసంగతి మనవిచేసికొనెదను. కుంభకోణపుఁ గళాశాల కధ్యక్షులుగా నుండి యిప్పుడు కీర్తిశేషులైన గోపాలరావుగారిని గూర్చి మీరు వినియె యుందురు. ఆయన మహాబుద్ధిశాలి, యాంగ్లవిద్వాంసులకుఁ గూడ విస్మయావహ మగునఖండపాండిత్య మింగ్లీషుభాషలో సంపాదించినవారు, దొరలుకూడ నాయనతోఁ బ్రసంగించునప్పు డుచ్చారణలోపములు భాషాదోషము లెక్కడ వచ్చునో యని జంకెడువా రఁట. ఆయనయొద్దఁ జదువుకొనిన శిష్యులలో నొక రాయన క్రిందనే యొకచిన్నతరగతి కుపాధ్యాయులుగా నుండి మిక్కిలి శ్రద్ధతోఁ బని చేయుచుండెడివా రఁట. గురువుగారి మెప్పు వడయు కుతూహలముతో నొకనాఁ డాయన గోపాలరావుగారి యొద్దకు వెళ్లి తనపిల్లలను బరీక్షింపుఁ డని వినయపూర్వముగాఁ బ్రార్థించెనఁట. మంచిది రేపళ్లే చేసెదను లే యని వారు సెలవిచ్చి రఁట. అంతట శిష్యుఁ డీపాటిదానికిఁ దమరు శ్రమపడి రేపు రావలయునా యిప్పుడు దయచేసి

యొక పావుగంటలోఁ బరీక్షింపవచ్చు నని మనవి చేసికొనెనఁట. దానికిఁ జిఱు నవ్వు నవ్వుకొని "బి. ఏ. కిఁ జెప్పఁబోవుపాఠము లిప్పుడు చూచుకొనుచున్నాను. నాపరీక్ష నీకును నీవిద్యార్థులకును గూడఁ గొంచెము లాభముఁ గలిగింపవలయు నని కదా నీయభిలాష? నీ వేపుస్తకములో నేయేపాఠములు చెప్పినావో సావ ధానచిత్తుఁడనై నే ముందు చదువుకొనవలెను. బోధకు లేయేపట్ల సామాన్య ముగాఁ బొరపాటు పడుదురో బాలుర కెక్కడెక్కడ సందేహము లుదయించునో యవి యన్నియు నేను నీమట్టమునకు నీశిష్యులమట్టమునకు దిగి బాగుగాఁ జూచుకొనవలెను. ఇంతపని నేఁ జేసికొనవలసియుండఁగా నిప్పుడే రమ్మనెద వేమి నాయనా!" యని గోపాలరావుగారు చెప్పినా రఁట. ఈకథ నాకుఁ జెప్పిన మిత్త్రుఁడు తరువాత నేమి జరిగినదో చెప్పలేదు. ఆయనవాక్యరత్నములు విని పిదప శిష్యుఁ డుపాధ్యాయవిధులను వెనుకటికంటె బాగుగా నెఱవేర్చుకొని యుండు నని మాత్త్రము భావించెదను.

యోగ్యతాసమర్థతలను బట్టి పండితులను వేతనాదులచే సమ్మానించుట నియోక్తల కట్టివిధియో యొకసారి నిర్ణీత మగుజీతమున కొప్పుకొని పనిలోఁ బ్రవేశించిన పిదప దైవముఖము చూచి త్రికరణశుద్ధిగా శక్తివంచన లేకుండఁ దమ విహితకృత్యములు నెఱవేర్చుకొనుట పండితుల కట్టివిధియే. నియోజకులకు ఋణపడియుండు నియుక్తు లిహపరసుఖదూరు లగుదురు. చెప్పవలసిన పాఠ ములు ముం దింటియొద్దఁ జదువుకొనిరాని యుపాధ్యాయుఁడు బాలురకును పాఠశాలాధికారులకును ద్రోహము చేయుచు నన్యాయార్జితవిత్త మనుభవించు చున్నాఁ డన్నమాటయే.

పండితులలోఁ బెక్కురు, బోధనపద్ధతులలో శిక్షితులైనవారుగా నుండక పోవచ్చును. అయిన నేమి, యంతఃకరణశుద్ధితో భగవంతుఁడు తనకిచ్చిన యావచ్ఛక్తియు శిష్యక్షేమమునకై వినియోగపఱుచు నుపాధ్యాయున కనుభవ మూలమున నన్నియుచితపద్ధతులును నలవడఁగలవు.

ఒక్కసంగతి జ్ఞప్తిలో నుంచుకొనవలెను. గురువునొద్దకు రాకమునుపే శిష్యులకు మనశ్శక్తు లన్నియు దేవుఁ డిచ్చియున్నాఁడు. ఆశక్తుల నావరించు కొని యున్నమనోమాలిన్యమును సందేహనివారణరూపముగాఁ దొలఁగించి స్వచ్ఛమైన బుద్ధి నుద్బుద్ధము చేయుటయే గురుకృత్యము. ఆయనరోధావ సారణమహాకార్యమునందే గురువు తెలివితేట లన్నియు నగపఱుపవలెను. పండితున కెంతపాండిత్య మున్నదో యనునది యంత గణనీయాంశము గాదు.

తత్ప్రజ్ఞాజ్యోతివలన శిష్యులలో నెంతదీప్తితో నెన్నిజ్ఞానజ్యోతులు వెలుఁగుచున్నవో దానిఁబట్టి యాయన కృతకృత్యతాఫలముయొక్క ప్రమాణము గనుఁగొనవలెను.

ఉపన్యాసరూపక మగునుపదేశము కళాశాలలలోని పెద్దపిల్లవాండ్ర కుపయుక్తము గావచ్చును గాని క్రింది పాఠశాలలలోని పిల్లల కెంతమాత్రము పనికిరాదు.

ఉపన్యాసములు వక్తృత్వధారాప్రకటనమాత్రప్రయోజనములు, కొన్ని రోజులవఱకు విద్యార్థులను నద్భుతరసానందభరితులఁ జేయును గాని వారి కించుకంతయు లాభకారులు గావు, వెళ్లఁగా వెళ్లఁగా శిష్యులబుద్ధి వికసించుటకు మాఱు ముకుళీభవించును, ఆవులింతలతో నిద్రాదేవత యావేశించి వారిని సుఖసుప్తిలోఁ బడవేయును. పరంపరాగత మగు ప్రాచీనాకాంతాపద్ధతి మిగుల మంచిపద్ధతి. ప్రశ్నోత్తరములు బాలుర యంతశ్శక్తులకుఁ జలనము కలిగించి బుద్ధిని రేఁపి గురు వుపదేశింపఁదలఁచుకొను విషయములను వారికే స్ఫురింపఁజేయును. బాలు రల్లరి చేయుటకుఁ గాని యశ్రద్ధాపరధ్యాన నిద్రాపారవశ్యములలోఁ బడుటకుఁ గాని యవకాశ ముండదు. నియమితకాలములో నొకనిమిష మైనను వృథా పోదు. ఇట్లు సమార్జింపఁబడిన విద్యయే నిజమైన విద్య, అది బుద్ధికి స్వతంత్రతాబల మిచ్చి యుపజ్ఞాభివృద్ధి గావించు జ్ఞానపోషకమైన యాహారము. బాలుర కాలోచనశ్రమ మొకింతయు లేకుండ గురు వుపన్యాసగర్జనములతోఁ గురిసి లోపలఁబోసిన యుపదేశాసార మోటికుండలోఁ బోసిన నీటివలె నెంతోకాల ముండదు. అదంతయు జ్ఞప్తిలోనుంచుకొనఁ దలఁచుకొను మంచిపిల్లవాండ్ర కైనను గొలఁదికాలములో ధారణాశక్తి తగ్గిపోవును. ఒకటి స్వాభావికాహారము వలనఁ గలిగి స్థిరముగా నుండు రక్తమాంసమస్తిష్కబలము, రెండవది బలాత్కృతభోజనముచే వచ్చిన తాత్కాలికాస్థిరపుష్టి. విద్యార్థ్యవస్థలోఁ బరీక్షలలోఁ బాగుగాఁ దేఱి ప్రసిద్ధికెక్కి కొందఱు చివరకు జ్ఞాపకశక్తి నశించి నేఁడు చెప్పినమాట రేపు మఱచిపోవు దుస్థితికి వచ్చుట కిదియే కారణము.

విద్యలోను, వినమ్రతలోను, నీతిలోను, సత్యన్యాయ సౌశీల్యాదులలోను, నుపాధ్యాయుఁడు బాలుర కాదర్శముగా నుండవలెను. విద్యార్థులు విని నేర్చుకొనువిషయములకంటెఁ గని నేర్చుకొనునవి యెక్కువగా నుండును. ఎట్టిధీమంతులకైనను బ్రమాదములు వచ్చుచుండును. అర్థవిషయాదివివరణములం దొ

కప్పుడు పొరపాటు రావచ్చును. పిల్లలు వేసినప్రశ్నలవలనఁ గాని పిమ్మటఁ దా నాలోచించుకొనుటవలనఁ గాని తప్పు గోచరించిన యుపాధ్యాయుఁడు శిష్యులకు వెంటనే తాఁ జెప్పినది పొరపా టని చెప్పి తప్పు సవరించుకొనుట యుదారగుణము. ప్రశ్న వేసిన పిల్లవానిపైఁ గోపపడుట గాని తనతప్పుఁ గప్పిపుచ్చుకొనుట గాని యుత్తమగురులక్షణము గాదు. దానివలన గురువునకు లాభమును లేదు. మనుజుఁడు సర్వజ్ఞుఁ డని యెవరు ననుకొనరు. తప్పులు సవరించుకొనుటవలనఁ దనసత్యశీలత తనశిష్యులకు బయలుపడును. తనయెడల వారి కుండుప్రామాణ్యబుద్ధి హెచ్చగును, గురువుగారి నోట నెన్నఁడు నసత్యము రా దనుదృఢనిశ్చయముతో విద్యార్థు లాయన చెప్పెడుమాటలను వేయిచెవులతో వినుచుందురు. ఆయన యెదుట నున్నను లేకున్నను విద్యార్థులు గురున కనిష్టము లగు చేష్టలు చేయక యతని యదుపాజ్ఞలలో నుందురు. ఏతత్సందర్భవశమున నొక మహాపురుషుని చరిత్రాంశము జ్ఞప్తికి వచ్చుచున్నది. అది మనవి చేసికొనెదను. రగ్బీపాఠశాలాధ్యక్షు లగుడాక్టరార్నాల్డు మహోపాధ్యాయునిఁగూర్చి మీరు వినియే యుందురు. ఒకనాఁ డొకపిల్లవాఁడు తప్పుచేసి నాఁ డని తెలిసి తొందరగా విమర్శించి ఆర్నాల్డుగా రతనిని బెత్తముతో రెండో మూఁడో దెబ్బలు గొట్టి పంపివేసిరి. పంపివేసిన వెంటనే 'నీవు తిన్నఁగా విమర్శింపలే దని తనయంతరాత్మ చెప్పిన ట్లయ్యెను. అంతట నామహానుభావుఁడు మఱికొన్ని సాక్ష్యములు పుచ్చుకొని యెంతో శ్రమపడి విచారణ జరిపినమీఁదటఁ దాను గొట్టినపిల్లవాఁడు నిర్దోషుఁ డని నిర్ధారణ చేసికొనెను. ఆర్నాల్డుగారి కారాత్రి నిద్రపట్టలేదు. మఱునాఁడు పాఠశాల కుపాధ్యాయులును బాలురును రాఁగానే వారి నందఱ నొకచోటికి ర మ్మని పిలిపించి యందఱయెదుటను దాను వెనుకటిరోజునఁ జేసినశిక్ష యన్యాయపుశిక్ష యనియు, శిక్షితుఁ డైనబాలుఁడు నిరపరాధుఁ డనియుఁ దాను దోషి యనియుఁ బ్రకటించెను. అంతటితో నూరకుండెనా! శిక్షించినపిల్లవానిని బిలిచి "నాయనా! ని న్నన్యాయముగా నిన్నను గొట్టినాను. అది నాతప్పు, నిన్నుఁ గొట్టినదెబ్బలు మఱల రావు. తప్పుచేసినవాఁడు చిన్నవాఁ డైనను బెద్దవాఁ డైనను శిక్షార్హుఁడే, కావునఁ గాదనక నిన్నుఁ గొట్టినయీబెత్తముతో నిన్నుఁ గొట్టినన్ని దెబ్బలును నీవు నన్నుఁ గొట్టుము" అని బెత్తము చేతి కిచ్చి తనచేయి సాఁచెను. కొట్టుటకు బాలునకుఁ జేతులు వచ్చునా? పిల్లవాఁడును నక్కడ నున్నసర్వజనులును, హృదయములు కరఁగి కన్నులనుండి కాల్వలై ప్రవహింపఁగా నార్నాల్డుగారి ధర్మశీలతను సత్యసంధతను

వేనోళ్లఁ బొగడుకొనుచు నెనరిస్థానములకు వారు మఱలి పోయిరి. కావునఁ త ప్పొప్పుకొని సవరించుకొనుట ధైర్యౌదార్యసూచకము గాని కాతరతాసూచకము గాదు. పులిని బొడుచువానికంటె బుఱ్ఱలోనుండు మాత్సర్యమును బొడిచి చేసినత ప్పొప్పుకొనువాఁడు శూరాగ్రేసరుఁడు, పిఱికివాఁడు కాఁడు.

పాఠశాలలలో వ్యాసరచన కిప్పు డగ్రస్థాన మిచ్చినారు. చేసిన సంస్కరణములలో నెల్ల నది మంచిసంస్కరణము. భావి గ్రంథకర్తల కది బహూపకారకను, కావునఁ బండితు లావిషయమున బహుశ్రద్ధ వహింపవలసియున్నది. విషయదోషములను భాషాదోషములకంటె నెక్కువ జాగ్రత్తతో దిద్దవలెను. అందుకై వారు విషయములకు మిక్కిలి కృతపరిచయులై యుండవలెను. ఆంగ్లమునందు వలె నాంధ్రభాషావ్యాసములందుఁ గూడ ముఖ్యవిషయాంతర్గతములై వాని కంగములుగా నుండువివిధోపాంశములఁ గూర్చి వ్రాసిన వాక్యసముదాయములను వేఱువేఱు పరిచ్ఛేదములు (paragraphs) గా వ్రాయింపవలెను. ఆయావిరామస్థానముల కాంగ్లములో విధింపఁబడిన గుఱుతులు (Punctuation marks) యుక్తస్థలములందుఁ దెలుఁగులోఁ గూడ నుపయోగించుకొనుట మంచిది. అవి యిప్పుడు వాడుకలోఁ గూడ నున్నవి. ఒకపురుషుని గూర్చి వ్రాయునపుడు కాలపౌర్వాపర్యము ననుసరించియు, గృహాదులను వర్ణించునపుడు దేశపౌర్వాపర్యము ననుసరించియు వ్యాసము లుండవలెను. అనఁగా నొకనిజన్మమును గూర్చి చెప్పి, పిమ్మట మరణమును గూర్చి చెప్పి తరువాత నతనివివాహాదులను జెప్పఁగూడదు; అట్లే గృహపురోభాగము తరువాత పెరడు వర్ణించి తరువాత నడుమనుండు గదులఁ గూర్చి చెప్పఁగూడదు. కేవల భావప్రధానమైన విషయములఁ గూర్చివ్రాయుట కష్టము, అట్టివ్యాసములు పైతరగతుల బాలురచేత వ్రాయింపవచ్చును. సత్యశౌచాదులను గూర్చివ్రాయువ్యాసము యుక్తియుక్తముగాఁ గార్యకారణసంబంధములు గనఁబఱచుచు పూర్వపక్షసిద్ధాంతములతో నుండవలెను. సంక్షేపవాక్యములను జక్కఁగా విపులీకరించి వ్రాయుటయు, విపులగ్రంథసారాంశములను జిన్నవాక్యములతో సంక్షేపముగాను విస్పష్టముగాను వ్రాయుటయు బాలుర కప్పుడప్పు డలవాటు చేయుచుండవలెను. నాలుగు గంట లఱచి చేసిన యుపన్యాసోపదేశముకంటె నలువది వ్యాసపంక్తులు దిద్దవలసినట్లు దిద్ది సహేతుకముగాఁ దప్పులు కనఁబఱచుట విద్యార్థి కెక్కువయుపకారకర మని నాయభిప్రాయము.

వ్యాకరణసూత్రముల నల్లింపఁ జేయుట నిరుపయోగ మని యే నాయభిప్రాయము. క్రిందితరగతులలో వ్యాకరణాంశములు తప్పక వాచకపుస్తకముల ద్వారముననే బోధింపవలెను. అట్లు చేసినచో బాలురకు విసుగుపుట్టదు. సూత్రానుసారముగా వ్రాయుట ప్రధానముగాని సూత్రము ముఖస్థముగా నుండుట ప్రధానము గాదు. కవిత్వమునం దారితేఱి మత్తేభవృత్తము వ్రాయువాఁడు దానిఛందస్సు మఱచిపోవచ్చును, ఎవ్వరైన నడిగినచో గణవిభజనము గావించుకొని దాని ఛందోనియమముల నప్పుడు చెప్పును. ఈరూప మీకారణమున వ్యాకరణదుష్టరూప మని తేటమాటలతో బాలురకుఁ జెప్పినఁ జాలును. సమానలక్షణములు గలకొన్నిపదములు చదువుపుస్తకమునుండియే తీసి బాలుని యెదుటఁ బెట్టి వానిచేఁ దత్కాలోచిత మగువ్యాకరణసూత్రము గావింపవచ్చును. వ్యాకరణవిషయము లట్లు బోధించుట బాలుర కింపుగా నుండును, అట్లు సంపాదించుకొనిన వ్యాకరణజ్ఞానము వ్యాసరచనకు మిక్కిలి సహకారిగా నుండును.

పరిషత్తువారు సమగ్రమైన యాంధ్రవ్యాకరణము తగినపండితులచే వ్రాయించినచోఁ బిన్నలకును బెద్దలకును గూడ మిక్కిలి యుపకారకముగా నుండును. వారి కట్టియుద్దేశ మిదివఱకే యున్నట్టును శ్రీసూర్యరాయనిఘంటునిర్మాణమునకై పదసంగ్రహము చేయుట కేర్పఱుపఁబడిన కొందఱు పండితులచేత వ్రాయఁబోవు వ్యాకరణమున కుపయోగించు ప్రయోగ సామగ్రి ప్రామాణికగ్రంథములనుండి యిదివఱకే యెత్తి వ్రాయించి నట్టును వినియున్నాను. దేశోపకారక మగునీసంపూర్ణవ్యాకరణరచనాభారమును వారు శీఘ్రముగా వహింతురుగాక యని ప్రార్థించుచున్నాను.

ఈసందర్భమున వారి కొకమనవి చేసికొనవలసియున్నది. వ్రాయఁబోవు వ్యాకరణ మాంగ్లభాషలోని (Nesfield's Grammar) మున్నగు వానివలె సుగ్రాహముగానుండవలెను. ఆకృతిగణాదులపట్టికలు సాధ్యమైనంతసంపూర్ణముగాను సప్రమాణములుగాను నుండవలెను. ఒకయక్షరము తగ్గిన నొకపుత్రలాభము గలిగినట్లు వ్యాకరణ కర్త లెంచిన నీవ్యాకరణమును వెనుకటి వ్యాకరణములవలె నయోమయముగా నుండును. నావంటివాని కుపయోగపడదు. 'దీర్ఘపూర్వ కలకారోపధ కావంతసంస్కృతసమనుహచ్ఛబ్దములమీఁది లులలకు రురలగు' ననుసూత్రము గురుసాహాయ్యము లేని బాలురకు బోధపడదు. వ్యతిరేకంబున నను ముజ్జు పరంబగునపుడు కుఱియగు, ''ఎదాదు లనుప్రయుక్తంబు లగునపుడు ముజ్జు

నకు వృజిరుజియగు" నను చిన్నయసూరి సూత్రములు చిన్నవారికే కాదు పెక్కురు పెద్దవారికిఁ గూడఁ బాషాణప్రాయములుగానే యుండును. అట్టిసూత్రము లందుండ వని యనుకొనుచున్నాను, నాకోరిక గొంతెమ్మకోరిక యేమో తెలియదు.

సంస్కృతపదములు దొరలకుండఁ దెలుఁగున నాలుగుమాటలుమాటాడలేము, నాలుగుపంక్తులు వ్రాయలేము. తెలుఁగునకు సంస్కృతము జీవనాధారము. సంస్కృత మొకమహానది, దానినుండి వచ్చిన పంటకాలువ తెలుఁగు. కావున వ్యాకరణములో సంధిసమాస తద్ధితకృద్వృత్తుల సంస్కృతనియమము లాంధ్రో పయోగార్హము లగునన్నియును వ్రాయింపవలెను. ఛందోలంకారవిషయములుగూడ యథోచితముగా నందుఁ జేర్పింపవలెను.

పాఠశాలాధ్యక్షులలో తన్నియుక్తు లగుపరీక్షకులో యప్పుడప్పుడు తెలుఁగుతరగతులకు వెళ్లి పండితులు చెప్పుపాఠములు విని బోధనమార్గాదులందుఁ గానిపించు లోపములను వారికి సోదరభావముతో బాలురపరోక్షమునఁ దెలుపవలయును. లోపము లగపడుచుట యే కాక పండితులయెదుట వారును బరీక్షాధికారులుఁ గూడ నప్పుడప్పుడు మచ్చుపాఠములిచ్చి మంచిపద్ధతు లగపడుచుచుండవలయును. ఇట్లు చేయుచున్నచో, నాంధ్రభాష యచిరకాలములో బహుశాఖాపత్రపుష్పభరిత మగుపాదపమువలెఁ బెరిఁగి విద్యావివేక నాగరకతాఫలదాయిని యై దేశము నభివృద్ధి పఱుపఁగల దని నాయభిప్రాయము.

వ్యాస మీవఱకే యతిదీర్ఘమై మిమ్ము విసిగించిన దేమో యని భీతిల్లుచున్నాను. నే నింకఁ జెప్పఁదలఁచుకొన్న దేమియు లేదు. శిరోభ్రమణ వ్యాధితోనుండి యిది వ్రాసినాను. న్యూనాతిరిక్తాదిదోషము లనేకము లిందుండవచ్చును. వాని నన్నిటిని సైరించి గుణలేశము లెచట నైన నుండినచో నవి మాత్రమే గ్రహింపుఁ డని మఱల మిమ్ముఁ బ్రార్థించుచు నావ్యాసమును ముగించుచున్నాను.

కూచి నరసింహము.

# నాలుగు పద్యములు.

మ. హృదయప్రాణవిహారమై విహితవర్ణోద్యద్విభక్తిక్రియా
సదనంబై సదలంకృతిప్రభవమై సద్విక్రమావాసమై
విదితార్థాస్పదమై ప్రసన్నపదమై వృద్ధశ్రవోవైభవా
స్పదమై రాజునుబోలెఁ గ్రాలవలదా పద్యంబు హృద్యస్థితిన్

(ఎవ్వరిదో)

మ. పదబంధంబున నగ్గలించి బుధశబ్దద్రాజమై (భ్రాజియై) సద్గుణా
స్పదమై దుష్కవిహృత్సరోజవనమున్ (హృద్యరాజననమున్) భంజించుచున్ [భూరిస
మ్మదలీలన్ విలసిల్లు కబ్బము జగన్మాన్యప్రచారంబులన్
మదనాగంబునుబోలెఁ గ్రాలవలదా మాఱెందు లేకుండఁగన్.

కుమారసంభవము (నన్నెచోడుఁడు.)

శా. - - - - - - సంభూతకస్థానమై
ఖ్యాతంబై బుధహృద్యమంగళకవీంద్రాచార్యసంసేవ్యమై
యాతారార్కసుధాంశువై కమలజాతాకల్పమై యెప్పుడున్
జ్యోతిశ్చక్రముపోలెఁ గ్రాలవలదా సాం - - - -

శివరాత్రిమాహాత్మ్యము (శ్రీనాథుఁడు.)

శా. సౌరభ్యంబును బంధచాతురి తగన్ శయ్యాచమత్కారశృం
గారంబున్ వివిధార్థముల్ సరససాంగత్యంబు నానాకళా
పారీణత్వము మంజువాగ్విభవమున్ బాంచాలరీతిం దగ
న్వారస్త్రీయునుబోలె నొప్పవలదా వర్ణింపఁ గావ్యం బిలన్.

రుక్మాంగదచరిత్రము (మల్లన.)

వీనింబట్టి బుద్ధిమంతుల కేమితోఁచునో సంక్షేపమున విపులార్థయుతముగఁ జర్చింపఁగోరెదము.

ప. ఆ.

# ప్రథమచాళుక్యభీముని అత్తిలి తామ్రశాసనము.

(శా. శ. ౮౧౪.)

ఈతామ్రశాసన మెచ్చట దొరకెనో తెలియదు. ఇది ౧౯౧౬లో ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయముఁ జేరెను. అచ్చటనుండి యది దొరతనము వారి శాసనాధికారికిఁ బంపఁబడెను. వారు దానిని దమరిపోర్టులోఁ జేర్చుకొని ౧౯౧౭-౧౮సంవత్సరపు ౧౪౭-నంబరు తామ్రశాసన మని దానికి గుర్తుపెట్టిరి. ఇప్పుడు దానిని నేను పరిషత్కార్యాలయమునం దున్నరాగిరేకులంబట్టి ప్రకటించు చున్నాను.

ఆకారాదికములు:—ఈశాసనము మూఁడురాగిరేకులపై వ్రాయఁబడి యున్నది. ఒక్కొక్క రేకు 7¾ అంగుళములు పొడుగుగను 3¾ అంగుళములు వెడల్పుగను నుండును. మధ్య రేకు మిగిలిన రెండు రేకులకంటెఁ గొంచెము దళసరియైనది. మూఁడవరేకు మిక్కిలి సన్నముగా నుండును. అందువలన నందు నచ్చటచ్చటఁ జిన్నచిన్న చిల్లులు పడినవి. ఈ రేకులచుట్టును ఎత్తుగ అంచు నేర్పఱుపఁ బడినది. ఈమూఁడు రేకులును ఒకగుండ్రనికడియములో గ్రుచ్చఁ బడినవి. ఈకడియపువ్యాసము 3¼ అంగుళములు. ఈకడియమునకు దీర్ఘవర్తులాకారము గలముద్ర యొకటి యంటుకొని యున్నది. దానిమీఁద సూర్యుఁడు, చంద్రుఁడు, అంకుశము, వరాహము, అనుప్రతిమలు పోఁత పోయఁబడి యున్నవి. ఇం కొకప్రతిమయుఁ గలదు గాని యది స్పష్టముగఁ దెలియుట లేదు. అది స్వస్తికము అయినఁ గావచ్చును. ముద్రపై 'శ్రీత్రిభువనాంకుశ' అనునక్షరములు కూడఁ గలవు.

భాషాదికములు:—శాసనపుభాష సంస్కృతము. గద్యములు పద్యములు కూడఁ గలవు. వ్యాకరణదోషములు విశేషము లేవు. ౨౨-౨౩పంక్తులలో నగము పద్యమే ఇయ్యఁబడినది. మిగిలిననగము పద్యము పొరపాటున శాసనము చెక్కిన చామికుఱ్ఱాచార్యునివలన విడువఁబడినది. ఇట్లు విడువఁబడిన శ్లోకార్థమును నేను నరసాపురతామ్రశాసనము[1]నందుఁ బట్టుకొంటిని. ఈశాస

[1] R¹ Ep. . 1918 - p. 131.

నపు రేకులు చెన్నపట్టణమునందలి చిత్రవస్తుప్రదర్శనాలయము (మ్యూజియం) నందుఁ గలవు. ఇందలి యక్షరములు తొమ్మిదవశతాబ్దమునాఁటి కన్నడ తెలుఁగులిపి. ఇందలిది గుండ్రటికత్తు. గుణగవిజయాదిత్యుని సాతలూరు[1] తామ్రశాసనమునందును, బెజవాడతామ్రశాసనము[2]నందును, ప్రథమచాలుక్య భీముని మచిలీపట్టణపు తామ్రశాసనము[3]నందును మొదటి అమ్మరాజు ఏడూరు[4] శాసనమునందును, ఈకత్తే కలదు. ఈ లేఖకుఁడు రేఫమునకుఁ బరమునం దుండుహల్లును తప్పక ద్విత్వముగా వ్రాయును. పాణినీయసూత్రమునం దీని యమము వైకల్పికము.

<u>శాసనమునందలివిషయములు:</u>— చాళుక్యుల యెప్పటిబిరుదముల నన్నిటినిఁ బేర్కొని (పం౧-౬) కవి కుబ్జవిష్ణువర్ధనునిమొదలు గుణగవిజయాదిత్యుని వఱకు రాజ్యమేలిన తూర్పుచాళుక్యరాజుల పేళ్లును, వారిరాజ్యకాలమితియుఁ దెల్పును. (పం౬-౧) రెండవవిజయాదిత్యుఁడు భీమసల్కియనువానిని అతనికి సాయముగ వచ్చిన దక్షిణగాంగసేనానులను, పరాభవించి ౧౦౮ శివాలయములను గట్టించెను. (పం-౧౦-౧౨) అతనిమనుమఁ డైనమూఁడవవిజయాదిత్యుఁడు కిరణపురము, అచలపురము, ఉరునెల్లూరుపురము అనుమూఁడుపురములఁ గాల్చి త్రిపురమర్త్యమహేశ్వరుఁ డన్నబిరుదముఁ గాంచెను. (పం-౧౩-౧౪) అతఁడు కళింగగాంగుల యొద్దనుండి రజతాదికము, కోసలరాజుల యొద్దనుండి గజాదికము, పాండ్యపల్లవులయొద్దనుండి సువర్ణాదికము గ్రహించెను. (పం౧౪-౧౬.) ఆతండు గాంగులు గంగకూట మెక్కునట్లు చేసెను. మంగితల ద్రుంచెను. సాహసుఁ డైన (రాష్ట్రకూట) కృష్ణుని యుద్ధమునం దోడించెను. (పం-౧౬-౧౭ ) అతనితమ్ముఁ డైన విక్రమాదిత్యునికుమారుఁడు చాళుక్యభీముఁడు. ఆతఁడు శా.శ.౮౧౪సం॥నందు చైత్ర బహుళ ౨ సోమవారమునాఁడు అనూరాధానక్షత్రమున మిథునలగ్నమునందు పట్టాభిషిక్తుఁ డయ్యెను. (పం. ౧౯-౨౨.) ఈభీమునిఖడ్గ మనునట్టిసముద్రమునందు మునింగి (రాష్ట్రకూట) కృష్ణవల్లభుని చతురంగసేన, నీళ్లలోమునిఁగిన చదరంగమందలి సేనవలెఁ గరఁగిపోయెను. (పం౨౨-౨౩.) అప్సరసవంటి ఘుండిక యనునొకస్త్రీ కలదు. దానికి మల్లపుఁ డను తుంబురునిఁబోలిన కుమారుఁ డుం

---

[1] ఇది ప్రకటింపఁబడలేదు, నాయొద్ద నున్నది.
[2] Ep. Ind. Vol. V p. 127.
[3] దీనినే నరసాపురతామ్రశాసనము అని కూడ నందురు. C. p. no. I of 1913-14 దీనికి శాఖాధికారులు పెట్టిన గురుతు. ఇది యిప్పుడు చెన్నపురమందలి చిత్రవస్తుప్రదర్శనాలయమునం దున్నది. అచ్చటి వారు దీనికిఁ బెట్టినగుఱుతు Ch. E. 8.
[4] S. S. I. Vol. I p. 39.

జెను. వానికి చల్లన యనుకూఁతురు గలదు. అది సమస్తగాంధర్వవిద్యావిశారద (పం. ౨౬-౨౮.) దానికి అత్తిలిగ్రామమునందు వెయ్యిపోఁకచెట్లు గలభూమియు, ౪ంపుట్లు నడ్లవిత్తనము పట్టు పొలమును, నివేశనస్థలమును రా జిచ్చెను. (పం. ౨౮-౩౦.) ఈశాసనమున కాజ్ఞప్తి కడేయరాజు. శాసనమును రచించినవాఁడు భట్టవామనుఁడు. చెక్కినవాఁడు చామికుశ్రాచార్యుఁడు. (పం-౩౩-౩౪.)

శాసనపుయోగ్యత:—ఈశాసనమునకుఁ జరిత్రవిషయికమైన పెక్కుశాసనములకంటె నెక్కుడుయోగ్యత గలదు. నేఁటివఱకు దొరకిన తూర్పుచాళుక్యశాసనములలో రాజుయొక్క పట్టాభిషేకకాలమును, స్పష్టముగాఁ దెల్పిన మిక్కిలిపురాతనశాసన మిదియే యని చెప్పవచ్చుచు. ఇది వఱకు దొరకిన శాసనములలో నీప్రకారము స్పష్టముగాఁ బట్టాభిషేకకాలముఁ దెలిపినది రెండవ అమ్మరాజుశాసనము.[1] ఇది యంతకంటె పూర్వపుది గనుక ముఖ్యమైనది. ఇందు చాళుక్యభీముఁడు తనపట్టాభిషేకసంవత్సరమును దెల్పుటయే గాక తనకు పూర్వము రాజ్యముచేసిన ౧౩గురు రాజులలో నొక్కొక్కఁ డెన్నెన్ని సంవత్సరములు రాజ్యమేలెనో తెల్పినందున శాలివాహనశకము ౮౧౨ అనఁగా క్రీ.శ. ౮౯౦ ఆధారము చేసికొని వెనుకకు లెక్క వేసినయెడల కుబ్జవిష్ణువర్ధనునినుండియు రాజులయొక్క సరియైనరాజ్యకాలముల నేర్పఱుపవచ్చును. అట్టిపట్టిక యొకటి యీక్రింద నిచ్చుచున్నాను. డాక్టరు ఫ్లీట్ ఇట్టి పట్టికనే యొక్కదానిని ఇండియన్ ఆంటిక్వేరి యొక్క ౨౦వ సంపుటములో నిచ్చియున్నాఁడు. కాని యీశాసనమును బట్టి మనము సిద్ధముచేయు పట్టిక ఫ్లీటుపట్టికకంటె నెక్కుడు సూక్ష్మముగ నుండు ననుటకు సందియము లేదు. డాక్టరు ఫ్లీటుచే నియ్యఁబడిన రాజ్యకాలములకును యీశాసనమువలనఁ దేలు రాజ్యకాలములకును గలభేదము తెలియుటకై యీరెండుకాలములును బట్టికలోఁ జూపఁబడినవి.

| | ఈశాసనములోని కాలములు. | డాక్టరు ఫ్లీటిచ్చిన కాలములు. |
|---|---|---|
| 1. కుబ్జ విష్ణువర్ధనుఁడు - - - | 616–634 | 615–633 |
| 2. జయసింహ I - - - | 634–667 | 633–663 |
| 3. ఇంద్రరాజు - - - | - - | 663 |
| 4. విష్ణువర్ధన II - - - | 667–676 | 663–672 |
| 5. మంగియువరాజు - - - | 676–701 | 672–695 |
| 6. జయసింహ II - - - | 701–714 | 696–709 |
| 7. కొక్కిలి - - - | 714 | 709 |

[1] Ind. Ant. Vol. VII p. 15.

| | | | | ఈశాసనములోని కాలములు. | డాక్టరు ఫ్లీటిచ్చిన కాలములు. |
|---|---|---|---|---|---|
| 8. విష్ణువర్ధన III | - | - | - | 714–751 | 709–746 |
| 9. విజయాదిత్య I | - | - | - | 751–770 | 746–764 |
| 10. విష్ణువర్ధన IV | - | - | - | 770–806 | 764–799 |
| 11. విజయాదిత్య II | - | - | - | 806–846 | 799–843 |
| 12. కలి విష్ణువర్ధన V | - | - | - | 846–848 | 843–844 |
| 13. గుణగవిజయాదిత్య III | - | - | - | 848–892 | 844–88 |
| 14. చాళుక్యభీమ | - | - | - | 892 | |

ఫ్లీటుచే నియ్యఁబడిన తేదులకును మన తేదులకును స్వల్పవ్యత్యాస మున్నను కుబ్జవిష్ణువర్ధనుఁడు ౬౧౫ లో స్వతంత్రముగా రాజ్యముచేయుటకుఁ బ్రారంభించె నని వేఱుప్రమాణముల సాహాయ్యమున ౩౫ సంవత్సరముల క్రిందనే కనుఁగొనుట ఫ్లీటున కెంతయు భూషణాస్పద మని మన మొప్పుకొని తీరవలెను. మన లెక్కప్రకారము ౬౧౬ కుబ్జవిష్ణువర్ధనుని రాజ్యప్రారంభకాలము. కావున ఫ్లీటుకాలమునకును దీనికి నొకసంవత్సరకాలము భేద మున్నది. ఫ్లీటు ఉత్తరకాలపు చాళుక్యుల శాసనములలోని రాజ్యసంవత్సరసంఖ్యలను బ్రమాణముగాఁ దీసికొనినందున ఫ్లీటు లెక్కకును మన లెక్కకును భేదము కలిగినది స్పష్టము. రాజుల రాజ్యపరిమితిని గుఱించి పరకాలమందలి శాసనములకంటెఁ బూర్వశాసనములే యెక్కువప్రమాణము లని వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. శా. శ. ౯౭౫ లోని నందంపూఁడి[1] శాసనమునందుఁ గలసంవత్సరములకును శా. శ. ౭౧౪ లోని దగు నీశాసనమునందలి సంవత్సరములకును భేద మున్నయెడల ౧౬౧ సంవత్సరములు పూర్వపుది యగు నీశాసనమునందలి సంవత్సరములే ప్రమాణముగ గ్రహింపవలసి యుండును. నందంపూఁడిశాసనమునందు రెండవవిజయాదిత్యుఁడగు నరేంద్రమృగరాజు ౪౧ సంవత్సరములు రాజ్యముచేసినట్లున్నది. కాని యీశాసనమునందును నింతకుఁబూర్వపు వైన గుణగవిజయాదిత్యుని శాసనములందు నీతఁడు ౪౦ సంవత్సరములే రాజ్యముచేసిన ట్లున్నది. అందువలన నారాజు రాజ్యకాలమును గుఱించియీశాసనవచనమే ప్రమాణముగ నెంచవలయును. ప్రథమవిజయాదిత్యుఁడు ౧౮ సంవత్సరములు రాజ్యముచేసినట్లు నందంపూఁడి శాసనమునం దున్నది. కాని యీశాసనమునం దాతఁడు ౧౯ సం॥లు రాజ్య మేలె నని వ్రాయఁబడినది. కాని యీభేద మంతగాఁ బాటింపఁ

[1] Ep. Ind. Vol. IV p. 300.

దగినది కాదు. ఏలయన నారాజు ౧౮సంవత్సరముల మీఁదఁ గొన్ని నెలలు రాజ్యము చేసియున్న యెడల నొకరు ౧౮ అనియు మఱియొకరు ౧౯ అనియు వ్రాయుట సంభవించును. ఇంద్రభట్టారకుఁడు ౭ దినములు మాత్రము రాజ్యము చేసినందున నాతనిపేరీశాసనమునందు లేదు.

పట్టాభిషేక కాలము:—చాళుక్యభీముఁడు పట్టాభిషిక్తుఁడైనదిన మీశాసనమునందు నీక్రిందిశ్లోకమునఁ జెప్పఁబడియున్నది (పం-౧౯-౨౦.)

శ్లో. శాకే ష్వబ్దేషు యాతే ష్వథ మునువసుసంప్రాప్తసంఖ్యేషు మేషే।
మిత్రే, చైత్రేచ మైత్రే శశిని శశిదినే, కృష్ణపక్షద్వితీయే॥
యుగ్మర్షే నోర్ధ్వగమేధా త్సకలజనముదే పట్ట మాచంద్రతారం।
శ్రీమార్గ చాళుక్యభీమ శ్చతురుదధిలస న్మేఖలేలాతలస్య॥

అర్థము:—శా.శ. ౮౧౮ సంవత్సరములు గడచినతరువాత సూర్యుఁడు మేషమం దుండఁగా చైత్రమున చంద్రుఁడు మైత్రా(అనూరాధా)నక్షత్రమందుండ, కృష్ణపక్షద్వితీయా(విదియ)సోమవారమునాఁడు మిథునలగ్నమందు చాళుక్యభీముఁడు నాలుగుసముద్రము లొడ్డాణముగాఁ గలభూమికిఁ బట్టము గట్టుకొనియెను.

ఇందుఁ జెప్పఁబడిన చైత్ర మను నెల చాంద్రమాసమా సౌరమాసమా యని తేల్పవలసి యున్నది. చాంద్రమాస మని గ్రహించితిమేని వారము తప్పును, నక్షత్రము తప్పును, సూర్యస్థితి తప్పును. ఆదినము ఆదివారము, స్వాతీనక్షత్రము, సూర్యుఁడు మీనమం దుండును. ఇట్లు మూఁడును తప్పుటచే నది చాంద్రచైత్రము కా దనుట స్పష్టము. ఇఁక నది సౌరచైత్ర మని యెంచిన యెడల నన్నియు సరిగ సరిపోవు చున్నవి. చాంద్రమానప్రకార మాదినము వైశాఖమాస మగును. ఇంగ్లీషులెక్కప్రకారము క్రీ. శ. ౮౯౭ సం॥ ఏప్రల్ నెల ౧౭ తేది యగును.[1]

పైని జెప్పినదానిఁబట్టి చూడఁగా నాకాలమందుఁ దెనుఁగుదేశమున నిప్పుడు నఱవదేశమందును బంగాళదేశమందును వలె సౌరమానమే వ్యవహారమునం దున్నట్లు గానవచ్చుచున్నది. హిందూదేశపు పూర్వసముద్రపు టొడ్డు ప్రాంతమునందు దక్షిణమున నఱవదేశమునందును, ఉత్తరమున నోఢ్ర బంగాళాదేశములందును, సౌరమానవ్యవహార మున్నందున వీనికి నడుమ నున్నయాంధ్ర

[1] ఈలెక్క లన్నియు శ్రీయుత స్వామికణ్ణుపిళ్లగారి జంత్రి ననుసరించి వేయఁబడినవి.

దేశమునందుఁ గూడ నప్పు డట్టివ్యవహార ముండు టొకవింత కాదు. ఇందును గుఱించి శ్రీరాజరాజనరేంద్రపట్టాభిషేకసంచికయందు నేను సవిస్తరముగఁ జర్చించిన లేఖఁ జూడనగును.

భీమసల్కి:—నరేంద్రమృగరాజనఁబడు ద్వితీయవిజయాదిత్యుఁడు భీమసల్కి యనువానిని వానిపక్ష మవలంబించిన దక్షిణగంగబలమును నిర్జించె నని చెప్పఁబడియున్నది. (పం. ౧౧.) ఈభీమసల్కి యెవఁ డని విచారింపఁగా గుణగవిజయాదిత్యుని రెండుశాసనముల[1]వలన నీతఁడు నరేంద్రమృగరాజునకుఁ దమ్ముఁడనియు భీమసల్కిని ఆనరేంద్రమృగరాజు ౧౨ ఏండ్లుయుద్ధముచేసి వల్లభేంద్రదండనాయకులతో సహా నిర్జించి వేంగిదేశమును సంపాదించె ననియుఁ దెలియుచున్నది. ఇందువలన భీమసల్కి రాష్ట్రకూటరాజుల నాశ్రయించి వారిసాయమునఁ గొంతకాలము వేంగిదేశము నాక్రమించి నట్లును ౧౨సంవత్సరములు వారితో హోరాహోరిగఁ బోరినరేంద్రమృగరాజారాజ్యమును మరల సంపాదించుకొనినెు ననియు మన మూహింపవలసియున్నది. నరేంద్రమృగరాజు గాంగులతోడను రాష్ట్రకూటులతోడను ౧౨సంవత్సరములు పోరాడి నట్లును ౧౦౮ నరేంద్రేశ్వరాలయములు గట్టించినట్లును పెక్కుశాసనములలోఁ గానవచ్చును. మొదటి అమ్మరాజు శాసన[2] మొకదానిలో నిట్లున్నది.

శ్లో. గంగరట్టబలైస్సార్థమ్ ద్వాదశాబ్దా నహర్నిశమ్।
భుజార్జితబలం ఖడ్గసహాయో నయవిక్రమైః॥
అష్టోత్తరం యుద్ధశతం యుధ్వా శంభో ర్మహాలయాన్।
తత్సంఖ్యయాఽకరోద్వీరో విజయాదిత్యభూపతిః॥

పైసంగతులనుబట్టి చూడఁగ నరేంద్రమృగ[3]రాజు రాజ్యమునకు వచ్చిన తరువాత ౧౨సం॥ లవఱకును రాజ్యము సరిగ స్వాధీనపడక చిక్కులు పడె నని

---

[1] సాతలూరు శాసనము. [2] గుంటూరు శాసనము. (C. P. no. 5 of 1911-12) "ద్వాదశవర్షయుద్ధం వల్లభేంద్రదండనాయకైస్సహ భీమసలుకినామానం స్వానుజం నిర్జిత్య గృహీత వేంగిమండలః" అని సాతలూరుశాసనములోని వాక్యము. గుణగవిజయాదిత్యుని గుంటూరు తామ్రశాసనమునందును ఇట్టి వాక్యము లే గలవు. అందునుగుఱించి శాసనశాఖవా రిట్లు వ్రాసియున్నారు. "Of Narendra - Mrigaraja - Vijayaditya the inscription informs us that he was the founder of 108 temples called Narendresvara after his own name, that he fought for 12 years with the generals of Vallabhendra (*ie*, the Rashtrakuta King) and that having defeated his own younger brother called Bhima Saluki, took possession of Vengi-Mandala from him." (Madras Ep. R. 1912 p. 84.) [3] S. I. I. Vol. I p. 35.

తోఁచుచున్నది. ఫ్లీటు లెక్కప్రకారము చూచినయెడల నరేంద్రమృగరాజు క్రీ. శ. ౭౯౯ లో రాజ్యమునకు వచ్చెను. ఈశాసనము ననుసరించి పైని వేసిన లెక్కప్రకారము చూడఁగ నీతఁడు క్రీ. శ ౮౦౬ లో రాజ్యమునకు వచ్చియుండవలెను. ఎటుచూచినను నీతనితో ముఖ్యముగఁ బోరాడినవాఁడును నీతని తమ్ముఁడైన భీమసల్కి లేక చాళుక్యభీముఁ డనువానికి సైన్యసాహాయ్యము చేసినవాఁడును నగు రాష్ట్రకూటరాజు మూఁడవగోవిందుఁ డయియుండవలెను. ఈతఁడు ౭౯౪సం॥ నుండి ౮౧౪వఱకు రాజ్య మేలెను. ఈతఁడు క్రీ. శ. ౮౦౭సం॥న చెక్కించిన యొకతామ్రశాసనమునందు తాను వేంగిరాజునకు కబురంపినతోడనే యాతఁడు తనరాజధాని యైనమాన్యఖేటమునకు వెళ్లి కూలివానివలె పనిచేసి పట్టణమునకు బహిఃప్రాకారము నిర్మించి వెళ్లె నని చెప్పియున్నాఁడు. ఈ వేంగిరాజు నరేంద్రమృగరాజైనద్వితీయవిజయాదిత్యుఁడే యనిడాక్టర్ ఫ్లీటు, డాక్టర్ భాండార్కర్ వ్రాసియున్నారు. కాని పైవర్ణనము కేవల మతిశయోక్తి కాకయందుఁ గొంత సత్యము కలదేని యట్లువెట్టికి వెళ్లిన వేంగిరాజు రట్టగాంగులతో హోరాహోరిగఁ బోరెడు నరేంద్రమృగరాజైయుండఁడు. రట్టగాంగులయనుగ్రహమువలన సంశయాస్పదమును, క్షణభంగురమును, పూర్ణానుభవము లేనిదియు నగు వేంగిరాజ్యము సంపాదించుకొనిన మనభీమసల్కి యైయుండును.

ఈకాలమునందు దక్షిణగాంగులు స్వతంత్రులుగ లేరు. రాష్ట్రకూటులకు లోఁబడినవారుగ నుండిరి. రాష్ట్రకూటులపక్షమున గాంగసైన్యమును సేనాధిపతులును భీమసల్కికి సాయము చేయుటకై వచ్చియుందురు. ఈకాలమునందు శివమారుఁ డనుగాంగరాజు కొంత కాలము రాష్ట్రకూటులచెఱసాలలోను వారిదయను సంపాదించి కొంతకాలము సింహాసనముమీఁదను నున్నట్లు గానవచ్చుచున్నది. ఈతఁడు రాజ్యభ్రష్టుఁ డైనకాలమున ౮౦౨లో ధారావర్షుఁ డనువాఁడును ౮౧౩ లో చాకిరాజనువాఁడును రాష్ట్రకూటరాజులప్రతినిధులుగా గంగవాడీ దేశమును పాలించినట్లు కానవచ్చుచున్నది[1]. వీ రంపినసైన్యములే మనశాసనమునందు గాంగవల్లభు లని పేర్కొనఁబడిరె నని తోఁచు చున్నది.

సల్కి దేశ్యపదము:—సల్కిశబ్దము యుద్ధమల్లుని బెజవాడశాసనమునందున్నది. దాని కర్థము చేయు నపుడు సల్కియన చాళుక్యుఁడు కాఁ డని కొందఱు వాదించిరి. కాని యీశాసనమును పైనిఁ జేర్కొనినగుణగవిజయాదిత్యుని రెండుశాసనములును వెలువడినందున నిప్పుడు సల్కియన చాళుక్యుఁడు కాఁ

[1] Rice's Mysore Gazetteer Vol. I p. 314.

డనివాదించువా రుండ రని తోఁచుచున్నది. ఈశబ్దమును దీని మాఱురూపము లనఁదగు చలికి, చళుక్కి, సళుకి మొదలైన శబ్దములును మిక్కిలి పురాతనకాలమునుండియు చాళుక్యార్థమునందు వాడఁబడుచున్నవి. అందుఁ గొన్ని కాలక్రమముగ నీక్రిందఁ జూపఁబడుచున్నవి.

1. ౭౦౯ - చలికి - కొక్కిలిమహారాజు తామ్రశాసనము.[1]
2. ౭౩౯ - చలుక్కి - గుజరాతులోని చళుక్యరాజైన అవనిజనాశ్రయుశాసనము.[2]
3. ౮౫౦ - సళుక్కి - గుణగవిజయాదిత్యుని గుంటూరిశాసనము.[3]
4. ౮౫౦ - సళుకి - గుణగవిజయాదిత్యుని సాతలూరుశాసనము.[4]
5. ౮౯౨ - సల్కి - ప్రథమచాళుక్యభీముని ప్రస్తుతశాసనము.
6. ౯౦౦ప్రాంతము - చళ్కి - విక్రమచోళమహారాజునాఁటి శాసనము.[5]
7. ౯౦౦ప్రాంతము - సళ్కి - విక్రమచోళమహారాజునాఁటి శాసనము[6].
8. ౯౩౦ - సళ్కి - యుద్ధమల్లుని శాసనము.[7]
9. ౧౧శతాబ్దము - శళుక్కి విష్ణువర్ధనమహారాజు శాసనము.[8]
10. ౧౩శతాబ్దము - చళుక్కినారాయణ మనుమసిద్ధిశాసనము[9]

ఇట్లీశబ్దము మిక్కిలి పురాతనకాలమునుండియు వాడుకలోనుండుటయే గాక చాళుక్యు లేయేదేశముల నేలిరో యాయాభాషలలో నన్నిటిలో నున్నది. గుజరాతీభాష, తెలుఁగుభాష, అఱవభాష, కన్నడభాష, ఇట్టన్నిటిలో నీరూపమన్నికాలములయందు నుండుట చూడ నిది యే ప్రథమదేశ్యరూప మనియుఁ జలుక్యశబ్దము దానికిఁ గల్పింపఁబడిన సాంస్కృతికరూప మనియుఁ దోఁపక మానదు. ఇందును గుఱించి యధికము తెలిసికొనఁ గోరువారు నేను ఆంధ్రపత్త్రిక, దుర్మతిసం॥ మాఘ బ॥ ౬నాఁటి సారస్వతానుబంధమున వ్రాసిన 'సళ్కి చాళుక్యశబ్దములు సమానార్థకములు' అనువ్యాసమును చాళుక్యులు దాక్షిణాత్యులే యన్న రాఁబోవువ్యాసమును జూడనగును.

చాళుక్యభీముని యితరశాసనములు: — ప్రస్తుతపు శాసనము గాక ప్రథమచాళుక్యభీముని శాసనము లింకను నయిదు కలవు. అం దొకటి బెజ

[1] C. P. 11 of 1908 - 9. [2] Proceeding of the Seventh International Congress of Orientalists, Aryan section p. 232 and plate. [3] C. P. no. 5 of 1911 - 12. [4] ఇది ప్రకటింపఁబడలేదు. నాయొద్ద నున్నది. వలయువారికిఁ జూపఁబడును. [5] Ep. R. 400 of 1904. [6] Ep. R. 401 of 1904. [7] ఆం. సా. ప. పత్త్రిక, సంపుటము 6, పుట 49. [8] Ep. R. 44 of 1896. [9] Nellore Inscriptions Venkatagiri No. 19.

వాడశాసనము,[1] ప్రకటింపఁబడినది. ఇయ్యది యారాజుపట్టాభిషేకమహోత్సవ కాలమం దియ్యఁబడినది. రెండవది కాసింకోట తామ్రశాసనము.[2] ఈతఁడు తండ్రికిఁ బెద్దకొమారుఁ డనియు యుద్ధములలో దాయాదుల సైన్యముల నోడించె ననియు నిందుఁ గలదు. ఈదాయాదు లతనితమ్ములును నాతనిపినతండ్రి యగుయుద్ధమల్లుని కుమారుఁ డయిన తాళరాజును నయియుందురు. కృష్ణరాజు సైన్యమును గూడఁ నోడించిన ట్లందున్నది. ఈశాసనమువలన దానముచేయఁబడిన గ్రామము కలింగదేశమందలి ఎలమంచిలిలోనిది. మూఁడవది యైన నరసాపురతామ్రశాసనము[3]వలన చాళుక్యభీముఁడు కృష్ణవల్లభుని సైన్యములను నతనికి సాయము వచ్చినవారిని నోడించినట్లును కర్ణాట లాట దేశపురాజు లీతనిముందు సూర్యునియెదుటఁ జీఁకటి పరుగెత్తునట్లు పాఱిపోయినట్లును ఈతనికుమారుఁ డొకఁడు ౧౬ సం॥ వయస్సు గలవాఁడు శత్రువులతో నిరవద్యపురమునొద్దను, పెరువంగురగ్రామమునొద్దను ఘోరముగఁ బోరి రాష్ట్రకూట సేనాధిపతి యైన దండెనగుండయ యనువానిఁ జంపి తాను రణనిహతుం డయినట్లును జెప్పఁబడియున్నది. బెజవాడలో నొకస్తంభముమీఁద నీతనికాలపు శాసన మొకటి[4] గలదు. అది యాతనికి సామంతుఁ డైనయొకరాజుచే నీతఁడు రాజ్యమునకు వచ్చిన పదునేడవయేఁటఁ జెక్కింపఁబడెను. అప్పుడు బెజవాడలోఁ బార్థీశ్వరుని దేవాలయము గట్టింపఁబడినది. ఈరాజుయొక్క మఱియొక తామ్రశాసనమునకు నకలు మెకంజిసంగ్రహము[5]నందు నాకు దొరకినది. ఇది పద్యమయము. ఇందు రాజులరాజ్యసంవత్సరపరిమితి కాలములుఁ గూడ పద్యములందే యియ్యఁబడినవి. మొట్టమొదట కుబ్జవిష్ణువర్ధనుఁడు వేంగీదేశము నాక్రమించుకొనియె నని యం దున్నది. భీమునితల్లి పేరు వెంగాంబిక యనియు నిందువలన మనకుఁ దెలియుచున్నది. రా జొకవీరునకు వాఁడు తనకుఁ జేసిన ఖడ్గసహాయము నిమిత్తమై యగ్రహారము నిచ్చెను. ఈవ్యాసమునకుఁ జివర పరిశిష్టమునందు నీశాసనమునకు నకలు నిచ్చియున్నాను.

తరువాతి నా గీతనిగుఱించి చెప్పినసంగతులు:—మొదటి యమ్మరాజు మచిలీపట్టణతామ్రశాసనమునం[6] దిట్లున్నది. ‹‹చళుక్యభీమరాజు నకుఁ బెం

[1] Ep. Ind. Vol. v. p. 127. [2] C. P. no. 14 of 1908-9. [3] C. P. no. 1 of 1913-14 [4] Ep. R no. 833 of 1917. [5] ఈసంపుటమునకు చెన్నపట్టణమందలి మాన్యుస్క్రిప్టు లైబ్రరివారు "Telugu Inscriptions Vol. I" అని పేరు పెట్టి దానికి 15-6-26 అను గుర్తు పెట్టిరి. ఈసంపుటమునందు 155-వ పుటమొదలు 191 పుటవఱకు నీశాసనపునకలు గలదు. [6] Ep. Ind. Vol. V p. 132.

పుకుతల్లి యొకతె గలదు. ఆమె పేరు నాగిపోతి. ఆమెకు గాముకాంబ యని యొకకూఁతు రుండెను. భీముని యీ పెంపుడక్కకు కుమారస్వామితో సమానుఁడయిన మహాకాలుఁ డనుకుమారుఁడు పుట్టెను. ఆతఁడు భీమునిసైన్యమునకు నధిపతి యయ్యెను. శత్రుఖడ్గముల రాపిడివలన నగ్నిప్రజ్వలించెడి చోట్ల నెల్ల నీతఁడు తనరాజునకంటెఁ బూర్వమే ప్రత్యక్షమై యెన్నిపర్యాయములో శత్రువుల ఊపు మాపెను." (శ్లో. ౫-౮). గుణగవిజయాదిత్యునితరువాత రట్టులు అనఁగా రాష్ట్రకూటరాజులు తెనుఁగుదేశము నాక్రమింపఁ బ్రయత్నించి రనియు వారిని నోడించి భీముఁడు రా జయ్యె ననియు మొదటి యమ్మరాజు యొక్క ఏమూరుశాసనము[1]వలనఁ దెలియుచున్నది. భీముఁడు మిక్కిలి ప్రఖ్యాతిఁ జెందిన రాజునలెఁ గానవచ్చుచున్నాఁడు. ఆతనితరువాతిరాజు లాతనిగుఱించి మిక్కిలి గౌరవపూర్వకముగఁ జెప్పెదరు. ఇతనిమనుమఁ డైన మొదటి అమ్మరాజు జీతని గుఱించి వ్రాసినది చూడుఁడు.[2]

<u>కృష్ణవల్లభుఁడు</u>:—భీమునిచే నోడింపంబడిన కృష్ణవల్లభుఁడు రాష్ట్రకూట రా జయిన రెండవకృష్ణుఁడు. భీముని తరువాతి చాళుక్యరాజులశాసనములవలన భీముఁడు ౩౦సం॥ రాజ్యము చేసె నని మన మెఱుఁగుదుము. అనఁగ నీతఁడు ౮౯౨ మొదలు ౯౨౨ వఱకు రాజ్యముఁ జేసి యుండవలెను. రాష్ట్రకూటద్వితీయకృష్ణుఁడు క్రీ. శ. ౮౮౮ మొదలు ౯౧౩వఱకు[3] రాజ్యము చేసెను. అనఁగ, కృష్ణుఁడు భీమునికంటె నెనిమిదేండ్లు పూర్వమె రాజ్యమునకు వచ్చి తొమ్మిదేండ్లు పూర్వము మరణమునొందెను. భీమునివి మనకు దొరకినశాసనము లాఱు. వానిలోఁ బ్రతిదానియందును నతఁడు కృష్ణుని నోడించినట్లు నాతఁడు చెప్పుకొని యున్నాఁడు. కృష్ణుఁడు మాత్రము తనశాసనమునం దెచ్చటను వేంగిరాజు నోడించినట్లు చెప్పుకొని యుండలేదు. కావున చాళుక్యభీమునివలన రాష్ట్రకూటులు గొప్ప పరాభవము నొందిరని చెప్పుట కెంతమాత్రము సంశయము లేదు.

<u>చాళుక్యభీమనగరము</u>:—చాళుక్యభీముఁడు ౩౬౦ యుద్ధములలో విజయుండై తనపేరిట చాళుక్యభీమేశ్వరదేవునిఁ బ్రతిష్ఠించి దేవాలయముల నిర్మించె నని పిఠాపురమునందలి మల్లపదేవుని శిలాశాసనమువలనఁ[4] దెలియుచున్నది. ఆగ్రామమునకును భీమవర మనుపేరు వచ్చెను. అయ్యది చామర్లకోట సమీపమున నున్నది.

[1] S. S. I. Vol. I p. 39. [2] Ibid. [3] Mysore Gazetteer Vol. I. p. 324.
[4] Ep. Ind. Vol. IV. p. 226. 42.

ఈగ్రామమునకుఁ బూర్వము చాళుక్యభీమనగరి లేక చాళుక్యభీమ పట్టణ మని పే రుండె నని యిచ్చటి శాసనముల[1]వలనఁ దెలియుచున్నది. ఈ రాజే దాక్షారామమున భీమేశ్వరుని దేవాలయము నిర్మించెను.

ప్రతిగ్రహీత్రి:—ఈశాసనమునం దొకవేశ్యాంగనకు దాన మియ్యఁబడినది. అప్సరసతోఁ బోల్పఁదగు తుండక యనుభోగముదాని కుమారుఁడు మల్లప. వీఁడు తుంబురునితో సమానుఁడఁట. అనఁగఁ బాట బాగుగఁ బాడుచుండె నని భావము. వానికూఁతురు చల్లన. "ఆమె సమస్తగాంధర్వవిద్యా వేదిని". భోగము దానివంశవృక్షము స్త్రీనామముతో ప్రారంభ మగుటసహజమే కాని నడుమ పురుషునిపేరు చెప్పఁబడుట యొకవింత. చల్లనతల్లిపేరు చెప్పక తండ్రిపేరు చెప్పుటకుఁ గారణ మేమై యుండును?

ఇదియై యుండు.—భోగముజాతిలో వ్యభిచారవృత్తి కూఁతులకే సంక్రమించును గాని కోడండ్రకు సంక్రమింపదు. భోగముదానికూఁతురు భోగము దైనను గోడలుమాత్రము కులస్త్రీవృత్తినే యవలంబించును. కోడలిని కూఁతురుగదిలోనికిఁ గూడ రానీయరు. ఇట్లు పతివ్రతగ నుండుకోడలి కాగృహమునందు కూఁతున కున్నగౌరవ ముండ దని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. కోడలి నొకదాసిగఁ జూతురు. ఆకోడలిపే రెవరికిని దెలియదు. కావున మన శాసనమునందు రాజుగారు కూడ నామెపేరు చెప్పక యుపేక్షించుటయు సహజమే. ఇందువలన చల్లనయొక్క తల్లి వివాహిత యైనకులస్త్రీ యని మన మూహింపవచ్చును.

స్థలము:—చల్లన కీయఁబడినభూమి అత్తిలివిషయమందలి అత్తిలిగ్రామము లోనిది. అత్తిలిగ్రామ మిప్పుడు కృష్ణాజిల్లాయందలి తణుకుతాలూకాలో నున్నది. కలుచంబఱ్ఱు శాసనము[2]నందును అత్తిలివిషయము పేరు వచ్చినది. అత్తిలిగ్రామ మిప్పుడు చిన్నదిగా నున్నను పూర్వ మొకప్పుడు పెద్దదిగా నుండి యొక విషయమునకు ముఖ్యపట్టణముగా నున్నట్లు తోఁచుచున్నది.

ఆజ్ఞప్తి:—ఈశాసనమున కాజ్ఞప్తి కడేయరాజు (పం. ౩౪.) భీముని యన్నిశాసనములలోను ఈకడేయరాజుపేరే ఆజ్ఞప్తి గావచ్చును. అట్లే గుణగవిజయాదిత్యుని యన్నిశాసనములలోను పండురంగుని పేరు ఆజ్ఞప్తిగ వచ్చును. ప్రకటింపఁబడిన భీముని బెజవాడశాసనము[3]వలన కడేయరాజు పండురంగునకు

[1] Vide inscriptions nos. 463, 473, 480, 486, 487, 488, of 1893. [2] Ep. Ind. Vol. VII. p. 185. [3] Ep. Ind. Vol. V p. 128.

మనుమఁడని తెలియుచున్నది. రెండవ అమ్మరాజుయొక్క మఱియొక శాసనమువలన[1] పాండురంగుని సంతతివాఁ డయిన మఱియొకపురుషుఁ డాతనిమంత్రిగా నున్నట్టు తెలియుచున్నది. కావున పాండురంగునివంశమువారు తరతరములుగ చాళుక్యులకొలువులో నుండి రని మన మూహింపవచ్చును.

కవివామనుఁడు:—ఈశాసనము రచించినవాఁడు భట్టవామనుఁడు (పం. ౩౮.) నరసాపురశాసన[2] మీతనిని కవివృషభుఁ డన్నది. ఈతఁ డెవ్వఁడో మనము నిశ్చయముగఁ జెప్పలేము గాని కావ్యాలంకారసూత్రములకుఁ గర్తయైన వామనుఁడు గూడ నీకాలపువాఁడుగఁ గానవచ్చుచున్నాఁడు. ఆతఁడు తొమ్మిదవశతాబ్దపు పూర్వుఁడుగఁ గాని పదవశతాబ్దమునకుఁ దరువాతివాఁడుగఁ గాని యుండఁ జాలఁ డని కొందఱు పండితుల యభిప్రాయము[3]. మనశాసనము తొమ్మిదవశతాబ్దపు చివరది; లేదా పదవశతాబ్దపు ప్రారంభమందలిది.

ఈవామనుఁడే యావామనుఁ డనుట కొకయాక్షేపము రావచ్చును. కావ్యాలంకారసూత్రములకుం గర్తయైన వామనుఁడు కాశ్మీరదేశజుఁ డని కొందఱు దొరలు వ్రాసియున్నారు. కాని యది భ్రమ. ఈభ్రమకుఁ గారణము కాశికాకారుఁ డైనవామనుఁడును కావ్యాలంకారకారుఁ డైనవామనుఁడు నొక్కఁడే యని తలంచుట. కాని వారు భిన్నపురుషు లని యిప్పుడు స్పష్టముగఁ దేలినది. కావునఁ గావ్యాలంకారకారుఁడు దక్షిణదేశజుఁ డగుటకు నేమియు నభ్యంతర ముండదు.*

కొ. వెం. లక్ష్మణరావు.

---

[1] Ep. Ind. Vol. IX p. 47-56. [2] Ep. Ind. Vol. V.p. 128. [3] "ఇత్థంచ వామనోయం క్రిస్తీయ దశమశతకోత్తరార్ధా న్నార్వాచీనః నవమదశకా న్న ప్రాచీన ఇతి ప్రమాణమార్గగత మితి ప్రాహుః" శ్రీవాణీశాస్త్రగ్రంథమాల ౫-వ పుష్పము, పీఠిక, పుట ౧౭.

*ఈవ్యాసముతోఁబాటు ఈయఁబడిన శాసనపటముదిమ్మెలు నాకు పాట్నాపట్టణమందలి బిహార్ అండు ఒరిసా రిసర్చ్ సొసైటివారివలన లభించినవి. వారిసంచికకొఱకు నేను వ్రాసిన యింగ్లీషువ్యాసమింకను ప్రకటింపఁబడకపోయినను వారు తమ కర్చుతోఁ జేయించిన దిమ్మెలునాకుఁ బంపి యుపయోగించుకొనుటకు సెలవొసంగినందుకు నేను వారియెడ నెంతయుఁ గృతజ్ఞుఁడను.

## మూలము.[1]

—০০೫೫০০—

### మొదటి రేకు.

1. స్వస్తి శ్రీమాతాం సకలభువన సంస్తూయమాన మానవ్యసగోత్రా ణం[2] హారితిపు

2. త్రాణాం కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యానాం[3] మాతృగణపరిపాలితా నాం స్వామిమహా

3. సేనపాదానుధ్యాతానాం భగవన్నారాయణప్రసాదసమాసాదిత వర వరాహలా

4. ఞ్ఛనేక్షణక్షణవశీకృతారాతిమణ్డలానా మశ్వమేధావభృతస్నానప విత్రీ

5. కృతవపుషాం చాలుక్యానాం కులమల [ం*] కరిష్ణో స్సత్యాశ్రయ వల్లభే

6. న్ద్రస్య భ్రాతా కుజ్జవిష్ణువర్ధనో ష్టాదశవర్షా [ణ*] ణి తత్సుతో జయ సింహత్ర్రయస్త్రీ [ం*]

7. శతం। తదనుజేన్ద్రరాజనన్దనో విష్ణువర్ధనో నవ।తదాత్మజో మంగియువ రాజః పఞ్చ

8. వింశతి తత్తనుజో జయసింహ స్త్రయోదశ తదనుజః కొక్కిలి ష్షణ్మా సాన్ తద

9. గ్రజో విష్ణురాజోనుజ ముచ్చాట్య సప్తత్రింశతం తత్తనుజో విజయాది త్యభట్టార

### రెండవ రేకు: మొదటి ప్రక్క.

10. క ఏకోన్నవింశతిం।తత్తనుజో విష్ణురాజః శత్ర్రిం[4]శతం।తత్సూను ర్విజయాదిత్యో భీ

11. మసల్కినామానాం[5] తత్పక్షదక్షిణగంగబలంచ నిర్జిత్యాష్టశత నరేన్ద్రేశ్వరా

---

[1] ఆంధ్రసాహిత్యపరిషత్సంగ్రహమునం దున్న అసలు రాగిరేకులను బట్టి. [2] త్రాణాం-అని చదువవలెను. [3] జ్యానాం-అని. [4] షట్త్రింశతం-అని. [5] నామానం-అని.

12. ణాం కర్తా చత్వారింశతం। తత్తనయః కలివిష్ణువర్ధనో ధ్యర్ధ
వర్షం తత్పుత్రః కిర

13. ణపురమచలపురమురు నెల్లూరుపురా [న్] విదాహ్యా వైత్రిపుర
మర్త్యర్ మహేశ్వ

14. రనామ్న[1] ఖ్యాతయశోరాశి రాబభౌ యసుతతం। అథచ [।*] కా
లింగ గంగయూ

15. ప్యాదికోశలేశద్వపాదిచ । పాండ్యపల్లవహేమాది హారాత్యాక్షి
మాహర

16. త్[2]।గంగా నారోపయ త్తుంగకూట మ్మంగళిరోచ్ఛినత్।కృష్ణం రణే
జయద్వక్తుం కస్స

17. మర్థో [ఽ] నుసాహసా[3]న్।స విజయాదిత్య శ్చతుచత్వారింశతం। వేం
గీ దేశమను

18. వర్ష మవర్ధయత్।తదనుజన్మనో యువరాజస్య విక్రామాక్రాన్త
సకలధ

రెండవ రేకు: రెండవ ప్రక్క.

19. రాచక్రస్య విక్రమాదిత్యభూపతేః ప్రియతనయః। శాకేష్వబ్దేషు
యా తేష్వథ మ

20. నువసుసంప్రా[4]ప్తేసంఖ్యేషు మేషే।మిత్రే చైత్రేచ మైత్రేశశిని శశి
దినే కృష్ణ

21. పక్షద్వితీయే।యుగ్మర్క్షస్యోద్గమే ధాత్సకల।జనముదే పట్ట మాచన్ద్ర
తారః[5] [।].

22. శ్రీమాన్‌చాళుక్యభీమ శ్చతురుదధిలసన్మేఖలేలాతలస్య [।*] అథ
చ।య

23. స్య ఖడ్గజలవార్ధి [ఽ][6] నిమగ్నం।కృష్ణవల్లభబలం ససపత్నం సర్వ
లోకా

---

[1] నామ్నా-అని. [2] శాసనశాఖవారిచే సంగ్రహింపఁబడిన 1913-14-వ యేటి 1-వ తామ్రశాసనమందు నీశ్లోకభాగమె యిట్లున్నది. 'హేమాదికలాత్యాగార్థ మాహరత్.' [3] సుసాహసం-అని. [4] సంప్రాప్త-అని. [5] తారం-అని. [6] ఇచ్చట లేఖకుఁడు సగము శ్లోకము పొరపాటున వదిలివేసినాఁడు. వదలినసగము నరసాపురము తామ్రశాసనమునందు (C. P. No. 1 of 1913 - 14) నిట్లున్నది. "మృణ్మయన్తు చతురంగబలంవా క్షిప్రమేవ విలయా గతమాజౌ." [రెండవరేకు పంక్తులు 7-8] ఈశాసనపురేకు లిప్పుడు చెన్నపట్టణము చిత్రవస్తుప్రదర్శనశాలలో నున్నవి. అచ్చట వానికి Ch. E. 8 అని గుర్తు.

24. శ్రయశ్రీవిష్ణువర్ధనమహారాజాధిరాజపరమేశ్వరః పరమబ్రహ్మణ్యః చాలు

25. క్యభీమనా మాత్తిలివిషయనివాసినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటుం బినః

26. ఇత్థ మాజ్ఞాపయతి విదితమస్తువో స్మాభిః యాసా అప్సరోష[1]మా ఘుండ

27. కాఖ్యా తస్యాః యః పుత్రః [తుం]* బురుసమానో మల్లపాఖ్యః తత్సుతా యా చల్ల

మూఁడవ రేకు.

28. వాఖ్యా తస్యై సమస్తగాన్ధర్వవిద్యావేదిన్యై అత్తిలినామగ్రామే ఐశాన్యాం

29. న్దిశి సహస్రక్రముకతరుస్థానం।తస్మిన్నేవ గ్రామే వాయవ్యాన్దిశి పం

30. చాశత్ఖణ్డికా వ్రి[2]హిబీజవాపక్షేత్రం గృహస్థానఞ్చ దత్తమ్ [*]అస్యో

31. పరి న కేన చి ద్బాధా కరణీయా కరో [తి*] య స్స పఞ్చమహా పాతకసంయు

32. క్తో భవతి [।*] వ్యాసేనాప్యుక్తమ్ [।*] [3]ష్టష్టివర్షసహస్రాణి స్వర్గే మోదతి

33. భూమిదః [।] ఆక్షే ప్త[4] చానుమన్తాచ తాన్యేవనరకే వసేత్ [॥] ఆజ్ఞప్తి ర

34. స్య ధర్మ్మస్య కడేయర[5]జః॥ భట్టవామనేన రచి తేయం శాసనప ద్ధతిః [।*].

35. చామికుణ్డాచార్యేణ లిఖితా [॥*].

---

[1] రోపమా-అని. [2] వ్రీహి-అని. [3] షష్టి-అని. [4] ఆక్షేప్తా-అని. [5] రాజః-అని.

# అనుబంధము ౧.

చాళుక్యభీముని పండిపాక తామ్రశాసనము.[1]

['స్వస్తి' మొదలు చాలుక్యానాం కుల మలంకరిష్ణోః వఱకు చాళుక్యుల మామూలు బిరుదములు. తరువాత]

సత్యాశ్రవల్లభేంద్రనామా బభూవ.
తద్భ్రాతా చ కనీయః కుబ్జశ్రీవిష్ణువర్ధనో మనుజేంద్రః
సమధిష్ఠితాంధ్రవిషయాత్సరాదుచ్చాట్య యే దుర్జయానతులబలః ॥ ౧ ॥
సంప్రాప్యచ తత్ప్రథమం సతు వెంగీదేశమాత్మసాత్కృత్య।
జితమనుచరిత స్తస్మిన్వర్షాణ్యష్టాదశం కగోద్రాజ్యం ॥ ౨ ॥
తత్పుత్రో జయసింహ స్త్రయస్త్రింశతం భువ మరక్షత్।
తద్భ్రాతు రింద్రనృప తేస్సూనుః శ్రీవిష్ణువర్ధనోరాజ్యం ॥ 3 ॥
వర్షాణి నవాకార్షీ త్తత్సూను ర్మంగి యుర్జిత్తె విజయః।
సచ పంచాధికవింశతి వర్షాణ్యకరో దనాకులం రాజ్యం ॥ ౪ ॥
తస్య సుతో జయసింహ స్త్రయోదశాబ్దా భురక్షదవనీతలః।
ద్వైమాతు రానుజోస్యచ రాజ్యపదం కురుతే కొక్కిలి ర్మాసాన్ ॥ ౫ ॥
షట్ తస్య తముచ్చాట్య జ్యేష్ఠశ్రీవిష్ణువర్ధనో నృపతిః।
అకృతకృతి జితశత్రు స్సప్తత్రింశత్సమా రాజ్యం ॥ ౬ ॥
తస్యచ విజయాదిత్యో భట్టారకశబ్దకీర్తిత స్తనయః।
అష్టాదశవర్షాణి క్షమాతలం పాలయత్ విజయః ॥ ౭ ॥
తనయోస్య విష్ణువర్ధననృపతి ష్షట్ త్రింశత్సమారాజ్యం।
కృతవానథ తత్సూను ర్విజయాదిత్యో నరేంద్రమృగరాజః ॥ ౮ ॥
యః కర్త్వాష్టోత్తరశతశివాలయానాం స్వయుద్ధజయసంఖ్యానాం
[ ]చత్వారింశద్వర్షాణి క్ష్మాపాలయత్ సమస్తాం ॥ ౯ ॥

---

[1] చెన్నపురిలోని గవర్నమెంటు లైబ్రరీలో నున్న 15-6-26 సంఖ్యగల సంపుటములోని 185-191 పుటలలోనిది. ఇందుఁ శ్లోకములోఁగాని వచనభాగములలోఁగాని యేమియు దిద్దలేదు. పద్యభాగము మూలమందుఁ బద్యభాగముగ వ్రాయఁబడనందున దానిని పద్యములుగ వ్రాసితిని. మూలమునందు మఱి స్పష్టముగ నున్నతప్పులను కొన్నిఁటిని మాత్రము వృత్తము ననుసరించి దిద్దితిని. అయినను నీశాసనము నాలుగవదియో యైదవదియో యగునకలు. కావున నిట్టివి నూతన సిద్ధాంతస్థాపనలకుఁ బ్రమాణములు కానేర వని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

కలివిష్ణువర్ధనోస్యచ తేన యోసుధకస్తరాయాంతు ద్వే పి |
తస్యచ విజయాదిత్యస్సూను: పరచక్రరాజనృపతి గణాగ: ॥ ౧౦ ॥
స చతుశ్చత్వారింశత్ వర్షాణి త్రిపాలయ స్తనుచరితే: |
తద్భ్రాతు స్యవరాజవిక్రమస్య వేంగాంబికాయాం సుత: |
యోసి యోజానుజనిత్యాదివనసహ శ్చాతుకృభీమాధిప: ॥ ౧౧ ॥
సోయం రట్టబలం విజిత్య రిపునిస్సాలం సముస్మాలయన్ |
బధ్వా పట్టముపాధనస్యసన్పుత్రో భూమౌ పరిశాశ్వత ॥ ౧౨ ॥
యస్మిన్ రాజని రక్షతి క్షితితలం స్తేనా వినాశంగతా:
జారా మారణభీవసన్నచరితా జాతా నిరీతి ర్మహీ
దేశశ్చిత్రవిధా సురాసరనిగా వృష్టి ర్జనేచ్ఛానుగా
రోగా నాశగతా: ద్విజాశ్చ సుకృతా యోగాయ థోక్తక్రియా: ॥ ౧౩ ॥
మనురివ సకలజనానాం జనక ఇవా శేషభృత్యవర్గాణాం
కామ ఇవ కామినీనా మార్తజనానాంచ కల్పతరు: ॥ ౧౪ ॥

సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజాధిరాజపరమేశ్వర పరమభట్టారక పరమబ్రహ్మణ్యో మాతాపితృపాదానుధ్యాత: అన్వీక్షిక్యాది నీతినిపుణ: | గుహఇవ ప్రతిహతశక్తి: వైనతేయఇవ వినతానందజనక: | యుధిష్ఠిరఇవ భీమసేనావృతప్రచండారుతిమండల: - - - - - పాతువిషయనివాసినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినస్సర్వా నిత్థ మాజ్ఞాపయతి విదితమస్తు వ: | కౌండిన్యగోత్రాయ వాజసనేయ బ్రహ్మచారిణే సబ్బిశర్మణ: పౌత్రాయ విదిశర్మణ: పుత్రాయ రంగాధికక-రాభిధానాయ అసఖడ్గసహాయనిమిత్తే సాదకపూర్వం సర్వకరపరిహారాయాగ్రహారీకృత్య పండిపాకగ్రామ సాష్టాదశగ్రామాధిక: | కొప్పునిగ్రామాధిక పొత్తూరిపూర్వతశ్చ వల్లనిగ్రామాధికచ పొదరుపాక శ్చాపస్తాభి: సంప్రదత్తా ఇతివితినామవధయ: | పూర్వత: పొత్తూరిపర్యతశ్చ పూర్వంత: | ఆగ్నేయత: పత్తుపునామపండ్రం | మాద్యానుగరుగుశ్చదక్షిణత: కనమవతన కాశాత్ | కుమ్మెంగ మాగత: | పురాణపంథా నైరుత్యాచ వృతపంథా: | పశ్చిమత: పుమ్మెంగి కొమ్మినిగ్రామాధిక యోపర్ణధ్యే నిగ్గరనదీ | వాయవ్యత: కరుకుద్దిసీమైవ | తనూపుత్తరత: పంపానది | ఈశాన్యత: చిలుకుర్యారి సీమైవసీమా | అస్య ధర్మోపరి సకేన చిద్బాధాకర్తవ్యా | య: కరోతి స పంచమహాపాతకసంయుక్తో నరకం గమిష్యతి | తథాథ గవతా వ్యాసేనోక్తం: భ[illegible] [illegible] [illegible] శ్లోకములు]

# సోమునిహరివంశము.

(పిఠాపురమునసభలోఁ జదువఁబడినది.)

అగ్రాసనాధిపా!, అభినవకృష్ణరాయా!, ఆంధ్రమహాజనులారా!

శ్లో. "కిం కవే స్తస్య కావ్యేన కిం కాణ్డేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి య చ్ఛిరః."

["పరుని (శత్రుని) హృదయమున లగ్నమై, శిరమును ఘూర్ణిల్లఁజేయ దేని యాఁనిలుకాని బాణముతో నేమిపని? పరుని (ఇతరుని) యుల్లమున లగ్నమై శిరఃకంపము చేయింపదేని యాకవికావ్యముతో నేమిపని?" అని భావము.]

శ్లో. "త ఏవ పదవిన్యాసా స్తా ఏ వార్థవిభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్."

["పదములు మనము కనినవియే? అర్థములు మన మెఱిఁగినవే. అయినను గూర్పునేర్పున నెప్పటి కప్పుడు క్రొత్త దగుచుఁ గావ్య మింపులు గులుకుచున్న" దని భావము.]

ఇత్యాద్యభియుక్తోక్తుల కాలవాలంబో యనఁదగు నాంధ్రహరివంశపు రాణము రచియించి యాంధ్రుల కొసఁగి, రాకాసోమునివలె దివంబున వెలుంగు నాచనసోమునిం గూర్చియు, నాతనిగ్రంథమును గూర్చియు నేఁ డొకించుక విన్నవించెదను.

ఎల్లభాషలయందును గవితాకన్యను వెలయించినకవులలో నుత్తమమధ్యమసామాన్యాదిభేదములు గలవు. ఆయాభేదములు గలయాయాకవులయందు మఱల నుత్తము లేర్పడుచుందురు. ఇట్లేర్పడుచు రాఁగా నొక్కొకభాషయందును నొక్కఁడో, యిద్దఱో, ముగ్గురో, నలుఁవురో యుత్కృష్టకవులుగాఁ బరిగణింపఁబడుదురు. సంస్కృతభాషయందుఁ బురాణములను రచియించినవారిలో వాల్మీకి వ్యాసు లుత్కృష్టులు? కావ్యముల నొనర్చినవారిలోఁ గాళిదాసభవభూతు లగ్రగణ్యులు. ఇట్లే తెలుఁగుబాసయందును బొత్తములను వ్రాసినవారియందుఁ దిక్కనసోమనలు మిన్నలై యున్నారు. ఇట్లని తక్కినకవులను దక్కువ జేయుచున్నా నని భావింపవలదు. మేలుచేతు లనఁదగినవా రింకను నున్నారు. తెలుఁగుకవులలోఁ దిక్కనసోమన లిరువురును గన్నాకు లని పండితులయభిప్రాయము.

క. "ఘను నన్నయభట్టును దిక్కన నేత్రాప్రగడఁ బొగడి యలికంబున న
క్షిని డాఁచినట్టి సర్వజ్ఞుని నాచనసోమనాథు స్తుతి యొనరింతున్."

అని మూఁడవకన్ను డాఁచి వచ్చినసర్వజ్ఞునిఁగాఁ బండితవరుఁ లగుచిన్న
యసూరిగారు సోముని స్తుతియించియున్నారు. ఇట్టే యాతనిని మహాకవి
యనియు, సర్వజ్ఞుఁ డనియు సనాతనాథునాతను లగుకవులు, పండితులు, విమ
ర్శకులు మిక్కిలియుఁ బొగడియున్నారు.

ఇక్కవిచక్రవర్తి యార్వేలకులకలశాంబునిధిసంపూర్ణసోముఁడు. విద్యా
నగరసంస్థానాస్థానకవిచంద్రముఁడు. ఈతఁడు కవిబ్రహ్మ యగుతిక్కనసోమ
యాజి కడపటివశయందుఁ బ్రసిద్ధిఁ గాంచినవాఁడు. ప్రబంధపరమేశ్వరునకుఁ
గొంచెము పూర్వమున నున్నవాఁడు. ఈతనికాలమును నిర్ధరించుటయందు
నాకుం గలయాధారములను మఱియొకప్పుడు ప్రకటించెదను. కాని.

శ్లో. "అలంకృతే శకస్యాబ్దే, రసాభ్రనయనేన్దుభిః
తారణాబ్దే చైత్రమాసే, నవమ్యాం శుక్లపక్షకే"

ఇత్యాదిశ్లోకములతో రాగిరేకుపైఁ జెక్కఁబడిన యక్షరములు, తాము
నిర్ణయించికొనిన కాలమును విరోధించుచున్న వని "శరాజనయనేన్దుభిః, సాధా
రణే" అని శైసుదొరగారు దిద్దఁ జూచియుండుటయు, దానినే మనవారు ప్రమా
ణముగాఁ గైకొనఁజూచుటయు సమంజసముగా నుండలే దని మాత్రము ప్రస్తు
తము విన్నవించుచున్నాను. చరిత్రశోధకు లింకను బరిశీలింతురుగాక యని వేఁ
డుచున్నాను.

వేదవ్యాసమహర్షిప్రణీత మసి పేర్కొనఁబడు హరివంశములోనిపూర్వభా
గమును పూర్వహరివంశ మను పేరితోను, ఉత్తరభాగమును ఉత్తరహరివంశ మను
పేరితోను సోమనాథుఁడు తెలిఁగించెను.

తిక్కనసోమయాజి యాంధ్రీకరింపఁగా నున్నభారతశేషమగుహరివంశ
మును, సర్వవిధముల నాతని కెన యగుఁడగు సోమనాథుఁడు, అతనివలెనే మూల
మునకు మెఱుఁగు వెట్టుచు మనోహరముగను, సలక్షణముగను దెలిఁగించి,
యాతనివలెనే హరిహరనాథునకే కృతి యిచ్చి యాంధ్రమహాభారతము సమ
గ్రము గావించెను. ఈగ్రంథము తిక్కనసోమయాజిగ్రంథములకు శేషమైన
ట్లును, సోమయాజితరువాతఁ దాను రచించినట్లును గ్రంథాదిపద్యములఁ జెప్పి
యున్నాఁడు.

"ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీత శ్రీమహాభారతకథాసంతానంబున శ్రీమత్స
కలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణ
కీర్తి నవీనగుణసనాథ నాచనసోమనాథప్రణీతంబైన - - - హరివంశం
బునందు - - - - ఆశ్వాసము"

తిక్కనసోమయాజివలెనే ఒక్కొకయాశ్వాసము మొదటను హరిహరనా
థుని సంబోధించి, "దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె" అని
వ్రాయుచు, ఆశ్వాసాంతములందును నాతనివలెనే ఒకవృత్తము, ఒకకందము,
ఒకమాలిని వీనితో హరిహరనాథుని స్తుతించుచుఁ దనగ్రంథము కవిబ్రహ్మగ్రంథ
ముతరువాతిదే యైనట్లు వెల్లడించినాఁడు.

తాళపత్త్రములయందుఁ దెలుఁగులిపిని వ్రాయఁబడియున్న సంస్కృతహ
రివంశపుఁబ్రతులలోఁ గొన్నిటికిని, ఆలిపియందే ముద్రింపఁబడిన సంస్కృతహరి
వంశమునకును, వంగదేశలిపిని (Bengal characters) దేవనాగరాక్షరములను
ముద్రింపఁబడిన సంస్కృతహరివంశములకును ననేకస్థలంబుల ననేకభేదంబులు
గలవు.

మఱియు సోమనాథునికి లభించిన మూలమునకును, ఎఱ్ఱాప్రెగ్గడకు దొ
రికిన మూలమునకు విశేషభేద మున్నట్లు గన్పట్టుచున్నది. ఎట్లన,

ఆంధ్రపరిశోధకమహామండలివారు సంపాదించిన సంస్కృతహరివంశపు
బ్రతియందు,

(a) ప్రథమాధ్యాయము మొదలుకొని రుక్మిమారణకథనము గల 124 వ య
ధ్యాయమువఱకు నున్నగ్రంథము పూర్వభాగముగాను,

(b) బలదేవమాహాత్మ్యాభివర్ణనము గల 125-వ యధ్యాయము మొదలుకొని
యుత్తరభాగముగాను,

గానవచ్చుచున్నవి. సోమునిగ్రంథమునకు మూల మిట్టిదే యని స్పష్ట
మగుచున్నది. ఈపూర్వోత్తరభాగ వివరణము పై ప్రతియందే కాక బొబ్బిలి
నగరమునఁ గలవ్రాఁతప్రతులయందును, చెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకభాండాగా
రములోని కొన్నివ్రాఁతప్రతులయందును గలదు. ఈప్రతు లన్నిటియందును
ముద్రితప్రతులలో లేని "ఊర్వశీనరకాసురసంభాషణము మొదలగునవి" గలవు.
[మఱియు బలదేవమాహాత్మ్యాభివర్ణనముతో ననఁగా నుత్తరభాగముకథలో

ప్రారంభింపఁబడిన సోముని యుత్తరహరివంశము సయితము పై భాగద్వయవిషయ
మును నిర్ధారణము చేయుచున్నది ]

ఎఱ్ఱాప్రెగ్గడహరివంశములోని యుత్తరభాగము మొదటి మూఁడాశ్వాస
ములయందును గానవచ్చు జరాసంధకథ, కాలయవనసంహారము, రుక్మిణీకల్యా
ణము, ప్రద్యుమ్నజననాదులు, రుక్మివధ మొదలగు కథలన్నియు నేను జూచిన
పై సంస్కృతహరివంశపుఁబ్రతులలోఁ బూర్వభాగమునందే యున్నవి. దీనింబట్టి
యిక్కథ లెల్లసోమునిపూర్వహరివంశమున నుండియుండు నని మనము గ్రహిం
పవచ్చును. మఱియు గ్రంథాదినుండు కంసవధాంతమువఱకును గలది పూర్వ
భాగము గాను, మిగిలినది యుత్తరభాగము గాను ఎఱ్ఱాప్రెగ్గడ గ్రంథమునకు
మూల మైన ట్లాతనిహరివంశమువలన నెఱుంగంబడుచున్నది.

కావున సర్వజ్ఞశంభుదాసులమూలగ్రంథములు వే ఱగుట స్పష్టము.

ఇప్పుడు గానవచ్చుచున్న యుత్తరహరివంశముమాత్రమే సోమునిగ్రంథ
మని కొందఱాధునికులు వ్రాసియున్నారు.

ఆతని సంపూర్ణగ్రంథమే లభింపలే దనియుఁ బ్రకటిత మైనది భాగము
మాత్రమే యనియు చరిత్రశోధకులు వ్రాసియున్నారు.

ఇప్పుడు ప్రచారమున నున్నదియే సోముని గ్రంథ మని తలంచువారిలో
నెవ్వరును, ఆతని గ్రంథమునకుఁ 'ఉత్తరహరివంశ' మనునామ మేల కలిగెనో విమ
ర్శించి యున్నట్లు గానఁబడదు. శ్రీమాన్ సీతారామాచార్యులవారు మాత్రము
తమశబ్దరత్నాకరమున

"ఎఱ్ఱాప్రెగడ హరివంశము వ్రాసినతరువాత నాచనసోమన హరివంశ
మును వ్రాసెను. దానం జేసి యాతనిగ్రంథ ముత్తరహరివంశ మని యెఱుంగం
బడుచున్నది." అని వ్రాసియున్నారు. దీనిని మనంబున నిడికొనియే కాఁబోలు
శ్రీవీరేశలింగముపంతులవారు,

"ఎఱ్ఱాప్రెగడహరివంశము ప్రౌఢముగా నుండలే దన్నయభిప్రాయముతో
నీతఁ డీయుత్తరహరివంశమును వ్రాసెను."

అని తమకవిచరిత్రమున వ్రాసియున్నారు. ఈవ్రాఁతలను బట్టి ఎఱ్ఱా
ప్రెగ్గడది పూర్వహరివంశ మనియు, సోమునిది యుత్తరహరివంశ మనియుఁ బై
యిద్దఱయభిప్రాయ మైనట్లు తేలుచున్నది. కాని కాలనిర్ణయమును బట్టి యిది
యనుపపన్న మగుచున్నది. ఇంతియకాక పైవిరణములను బట్టియు సోమనా
థుఁడు సంస్కృతహరివంశము పూర్వభాగమును బూర్వహరివంశ మనుపేరి

తోను, ఉత్తరభాగమును ఉత్తరహరివంశ మనుపేరితోను దెలిఁగించె నని యూహింప నగుచున్నది. మఱియు నెఱ్ఱన హరివంశము నుత్తరభాగములోని నాలవ యాశ్వాసపుఁ గథను బెంచియుఁ దగ్గించియు నాఱాశ్వాసములు గ్రంథముగా సోముఁడు వ్రాసె" ననువ్రాఁత గూడ మొదలే నిరాధార మైపోయినది.

ఇఁక నాథుఁడు పూర్వహరివంశమును వ్రాసెనా యనుదాని నిప్పుడు విచారింతము.

సోమనాథుఁడు పూర్వహరివంశమును రచియించిన ట్లాతనియుత్తరహరివంశమునందే ప్రబల మైన యాధారము గలదు.

కం. "హరివంశప్రథమకథాం, తరమునఁ గలవింత లెల్లఁ దప్పక మదిలోఁ

దిరమయ్యెఁ గదా మీఁదట, నరవర! యేకథలొకో వినం బ్రియమనఁ దుర్క."

కం. "జనమేజయుఁ డిట్లను న,మ్మునితో బలదేవులావు మునువిని మఱియుం

దనియదు మది ముదమొనఁగ, విన్నఁగోరెడుఁ జెప్పవే వివేకనిధానా!"

ఇచ్చట బలదేవులావు జనమేజయుఁడు ఇంతకుమున్ను వినినట్లును, ఇంకను విన్నఁగోరినట్లును దెలియుచున్నది. ఇంతకు మున్ను విన్నబలదేవులా వెచ్చట నున్న దని విచారింపఁగా,

పైని నేను వ్రాసినసంస్కృతహరివంశపుఁబ్రతులయందుఁ బూర్వభాగము కడపటియధ్యాయము చివరశ్లోకములయందే బలదేవులావు రుక్మివధసందర్భమునఁ జెప్పఁబడియున్నట్లు స్పష్ట మైనది. (దీనింబట్టి సోముఁడు బలదేవపరాక్రమము పూర్వహరివంశమునఁ జెప్పియున్నాఁ డని నిశ్చయ మగుచున్నది.) పిమ్మట సంస్కృతహరివంశోత్తరభాగము ప్రారంభ మైనట్లు పైని నేను వ్రాసిన ప్రతులయం దున్నది. అదియే సోముని యుత్తరహరివంశము నారంభము.

ప్రథమభాగమును దెలిఁగింపకయే "ప్రథమభాగమునందలి కథలెల్ల వింటివి గదా, మీఁదట నేకథలు విన్నఁగోరెదవు?" అని కవి వ్రాసియుండఁ డని యూహింప నగుచున్నది. హరివంశము పురాణము గాని ప్రబంధము గాదు. ప్రబంధమువలె నొకకథయే తీసికొనఁబడి పురవర్ణనాదులతో నింపఁబడినది గాదీయుత్తరహరివంశము. పురాణకథలే యనేకము లిందు, గలవు. పురాణమును దెలిఁగించు నేకవియును బూర్వభాగమును రచియింపకయే యుత్తరభాగమున "పూర్వభాగకథ లెల్ల వింటివి గదా? ఇఁక నేమి వినవలతు?" అని వ్రాసియుండఁడు. కావున సోముఁడు హరివంశపూర్వభాగమును సయితము దెలిఁగించె ననుట విస్పష్టము.

పూర్వలక్షణగ్రంథములయందు నుదాహరింపఁబడిన సోమునిపద్యము లలో, నొక్కొకపద్యము మొదట "సోమునిహరివంశము, సోమునిహరివంశము" అనియే కాని యుత్తరహరివంశ మనునామ మెచ్చటను గానరాదు.

సోముఁడు పూర్వహరివంశమును రచియించిన ట్లొందు రెండునిదర్శనములు గానవచ్చుచున్నవి. శ్రీమదోగిరాల జగన్నాథకవిరాజుగారు తమ సుమనోభిరంజనకావ్యము వ్యాఖ్యానమున నాచనసోమనాథుని యీక్రిందిప్రయోగము నుదాహరించినారు.

"శతతాళదఘ్నహ్రదమున నుఱికె" సుమ. ద్వి. 48 ప. వ్యాఖ్యా.

ఈపాదము గలపద్యము ఉత్తరహరివంశమున లేదు. ఇది శ్రీకృష్ణుఁడు, యమునానదియందలి కాళియనాగరాజు హ్రదమున నుఱికినఘట్టములోని దని తోఁచుచున్నది. నలువదిమూఁడేండ్లక్రిందటఁ గవియే ముద్రింపించుకొన్న గ్రంథములోని దీయుదాహరణము. ప్రక్షిప్త మనుటకుఁ గాని, లేఖకప్రమాద మనుటకుఁ గాని వలనుపడునది గాదు. కాళియుని మడుఁవున శ్రీకృష్ణుఁ డుఱికినది పూర్వహరివంశములోని కథయై యున్నది.

నలువదియేండ్లక్రిందటివఱకును గలయిమ్మహాగ్రంథ మిప్పు డేమయ్యెనో యని భాషాభిమానుల కెవ్వరికి విచారము గలుగకుండును? మొన్నటి జగన్నాథకవి యఁట! సోమునిహరివంశపు నిండుప్రతి యఁట! నేఁడు గానరా దంట! కాలమా!—శ్రీజగన్నాథకవిగారికుటుంబము గోదావరిమండలములోని (ఫ్రెంచివారియానాము కడనున్న) నీలపల్లెగ్రామమునకు వెడలిపోయినట్లు వినియుంటిని. మహనీయు లెవ్వరైన దానియునికిని గనుఁగొందురుగాక యని వేఁడుచున్నాను.

మఱియు, ప్రబంధమణిభూషణములోని సోమునిపద్యమనఁబడు,

సీ. పురుడు వుచ్చిననాఁడ పూతనామోతన స్తన్యజీవితములు చవులు సూచె,
వెన్నమ్రింగెడినాఁడ వెడఁదపొక్కిటిలోని జగము వల్లవరాజసతికిఁ జూపెఁ,
దడవియాడెడునాఁడ దనుజరూపము లైనమద్దులయుద్దులు మలఁగఁజేసె,
నడవనేర్చిననాఁడఁ బకమిత్త్రేఁ గంతయుఁ జాపఁబూనినతనపనులు దెలిపెఁ,
గాచెశరణాగతులఁ బశుగణముఁ గాచెఁ, గేలగిరియెత్తెయెత్తెఁ బాంచాలిమాన
మనఁగఁ బొగడొందు దేవరనాశ్రయింతు, జిష్ణసఖుఁ గౌస్తుభాలంకరిష్ణుఁ గృష్ణు.

అనుదానిలోఁ గొన్ని లేఖకప్రమాదము లున్నను, శైలినిబట్టి యీపద్యము సోమునిదే యని తోఁచెడిని. ఇది యమునాతరంగిణీజలములలో శ్రీకృష్ణునిఁ

గాంచిన యక్రూరుని స్తవములోని దనియుఁ బూర్వహరివంశములోని దనియు నూహింపనగుచున్నది. అక్రూరస్తవము పూర్వహరివంశములోనిదే.

ఇంకను లక్షణగ్రంథజాలమున నెచ్చట నైన సోముని పూర్వహరివంశము లోని పద్యము లుదాహరింపఁబడి యున్న వేమో విచారింపవలసియున్నది. (ఆనందరంగరాట్ఛందమునందును గొన్ని సోముని పద్యములు గానవచ్చుచున్నవి.)

సోముని యుత్తరహరివంశమునకు, అవతారిక లభింపలే దని కొందఱు తమవిచారమును దెలిపియున్నారు. పూర్వహరివంశమున నుండు నవతారిక యుత్తరహరివంశమున నెట్లుండఁగలదు? నన్నయ మొదటిమూఁడుపర్వములను దెలిఁగించి, భారతమును విడిచి దివంబున కరుగఁగా, కవిబ్రహ్మ నాలవపర్వము మొదట నవతారికాదులను వ్రాసినట్లే, సోమయాజి స్వర్గారోహణ మొనర్చిన తరువాతఁ దత్కావితాపీఠము నధిరోహించిన సర్వజ్ఞుఁడును భారతశేష మగుహరివంశమును దాను దెలిఁగించుటను గూర్చియుఁ దనవంశాదికమునుఁ దనపూర్వహరివంశమునఁ జెప్పియుండును. మఱియుఁ దిక్కనసోమయాజి గ్రంథమునకుఁ దనగ్రంథము శేష మైనట్లు తోఁపించుటకే యాశ్వాసాద్యంతపద్యముల నాతని వలెనే కూర్చి తనగద్యమునం దయ్యభిప్రాయమును "తిక్కనసోమయాజిప్రణీత శ్రీమహాభారతకథానంతరంబున" తాను రచియించినట్లు స్పష్టముగ వెల్లడించినాఁడు.

కావున సోమనాథమహాకవి తిక్కనసోమయాజియనంతరము భారతశేష మగుహరివంశమును దెలిఁగించి యాంధ్రమహాభారతము సమగ్రముఁ గావించె ననియు, నం దాతనిపూర్వహరివంశ మాంధ్రదేశదౌర్భాగ్యమున నేమూలనో డాఁగియుండు ననియుఁ దలంప నై యున్నది. భాషాభిమాను లెవ్వరైనఁ దగు ప్రయత్నము లొనర్చి యమ్మహాగ్రంథమును బయటికిఁ దెత్తు రని మఱియొకపరి వేఁడుచున్నాను.

ఇప్పట్టున "తనహరివంశముతోనే యాంధ్రమహాభారతము సమగ్ర మైనట్లు సోమనాథుఁడు తలంచియుండెనేని యారణ్యపర్వభాగమును దెలిఁగింపక యేలవిడిచెను?" అని కొందఱు ప్రశ్నింతురు. దీనికి నుత్తరముగా "తిక్కనసోమయాజి యేకారణమున నారణ్యపర్వశేషమును ముట్టలేదో సోమనాథుఁడును నాకారణముననే తాఁకియుండఁడు; సర్వజ్ఞునకుఁ గవిబ్రహ్మ ననుసరింపవలయు నను నిచ్చయే కాని నన్నయ ననుసరించుతలంపు లేదు." ఇవి మొదలగు

సామాన్యము లైనయుక్తులు కొందఱు చెప్పుదురు. కాని, సూక్ష్మదృష్టిం బరికించువారికి నీక్రిందిసమాధాన మేర్పడు నని తలంచెదను.

నన్నయభట్టారకుఁడు మొదటిమూఁడుపర్వములను సంపూర్ణముగనే తెలిఁగించెను. తిక్కన సోమన మారనలనాఁటికి నవి (సమగ్రముగనే) యుండెను. కావుననే తిక్కన 'మహితాత్ముఁడు నన్నయభట్టు మూఁడుకృతులు రచించె' నని చెప్పెను. మారనయు 'భారతసంహితకు మును త్రిపర్వములు' నన్నయ రచించె నని చెప్పెను. ఎఱ్ఱాప్రెగ్గడకుఁ బూర్వమున నున్నయయ్యిరువురు నట్లు స్పష్టముగఁ జెప్పియుండ వారిది 'సామాన్యపువ్రాఁత' యనుట న్యాయేతరము.

అరణ్యపర్వమును నన్నయయే సంపూర్ణముగఁ దెలిఁగించె ననియు, నెఱ్ఱాప్రెగ్గడ చేసినది శిథిలభాగపూరణమే కాని ప్రత్యేకరచనము గాదనియు నిరూపించుటకు ననేక కారణములు గానవచ్చుచున్నవి. కాని యవ్వానిం బ్రదర్శించుటకు నిది యదను గామి విరమించుచుఁ బ్రస్తుతవిషయమునకు వచ్చెదను.

ఇప్పుడు గానవచ్చు నుత్తరహరివంశము, దానియాఱవయాశ్వాసముతోనే పరిసమాప్తి నొందియుండు నని కొందఱు వ్రాసియున్నారు. కాని యయ్యాశ్వాసముతో గ్రంథము ముగిసినట్లు గనరాదు. ఏమన, ఆఱవయాశ్వాసము కడపటి గద్యమునందు 'సర్వంబును షష్ఠాశ్వాసము' అని వ్రాయఁబడి యుండలేదు. తక్కినయాశ్వాసములవలెనే యదియు 'ఉత్తరహరివంశమునందు షష్ఠాశ్వాసము' అని వ్రాయఁబడి, ముం దేదో కథ యున్నట్లు చాటుచున్నది. గ్రంథము సమగ్రమై యుండెనేని యట్లెన్నఁడు నుండదు. తిక్కన యేకాశ్వాసముగల పర్వంబులకడపట నయితము "- - - - - - - - - - పర్వంబునందు సర్వంబు నేకాశ్వాసము." అని వ్రాసియున్నాఁడు. ఇట్టిచో గ్రంథమునుముగించెనేని సోమనాథుఁ డట్లు వ్రాయక యుండునా? హరివంశమున నింకను వ్రాయవలసినకథ లనేకములు గలవు. ఫలశ్రుతియు నిందు లేదు. గ్రంథమును సమాప్తి నొందించె నేని సోమయాజివలెనే సోముఁడును ఫలశ్రుతి వ్రాయక విడువఁడు. మూలమునను, ఎఱ్ఱన హరివంశముననను ఫలశ్రుతి యున్నది. కావున నీయాఱవయాశ్వాసముతోనే సోమునియుత్తరహరివంశము ముగిసె నని తలంచుట సరికాదు.

"ఆతనిసంపూర్ణగ్రంథమే లభింపలే దనియు, ప్రకటిత మైనది భాగము మాత్రమే యనియుఁ బరిశోధకులు వ్రాసినవాక్యములు నాయూహమును బలపఱుచుచున్నవి.

[1] షష్ఠాశ్వాసాంత్యభాగము కొంత ప్రక్షిప్త మైనట్లు కన్పట్టెడిని.

ఈరీతిని సోమనాథుని యత్యుత్తమగ్రంథ మగు నాంధ్రహారివంశము నానాముఖములఁ జెదరి యున్నది. ఉన్నగ్రంథ మైన లభియింపఁ జేసిన దానికై పరమేశ్వరునకు సహస్రాభివాదనంబు లర్పించుచున్నాను. (ఉన్నయాశ్వాసము లసంఖ్య మైనను క్రమమైనది గా దని తోఁచెడిని)

సోముని గ్రంథమునందు నర్థవైభవము, భావసౌందర్యము, రసావిష్కరణము, అలంకారవైచిత్రి, పదప్రయోగనైపుణి, రచనాచమత్కృతి, భాషాపారిశుద్ధ్యము, పాత్రగుణపోషణము మొదలగు సత్కావ్యలక్షణము లన్నియుఁ గానవచ్చుచుండుటయే కాక, యంతకుము న్నేగ్రంథమునను లేని నూతనమార్గము లనేకము లందు గోచరించుచున్నవి. వాని నెల్ల వేఱొక సంపూర్ణ విమర్శగ్రంథమున విపరింపనున్నాఁడను.

ఆంధ్రకవులలో నుత్తమోత్తముఁ డనికొనియాడఁబడిన యిక్కవిచక్రవర్తిపైఁ గొంతకాలముక్రిందట నొకానొకరు, కొన్నిదోషముల నారోపించుచు, "ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక" యం దొకవ్యాసమును బ్రకటించిరి. ఆవ్యాసము వెడలిన పిమ్మట వారు చూపినదోషములు సత్యములే యనుకొని కొందఱు విద్యాధికులే భ్రమఁజెంది రన నిఁక విద్యార్థులమాట యేల? వారు సోమునిపై నారోపించిన "దోషములు, దుర్గుణములు" అనునవి భ్రమప్రమాదపరికల్పితము లని నే నిందు నిరూపించితిని.

ఇప్పట్టున విమర్శమున నెట్లుండవలయునో విచారింపవలసి యున్నది. కాని నిన్నటిదినమున శ్రీ, శ్రీ, శ్రీ, మహారాజావారును, శ్రీమదగ్రాసనాధిపతిగారును దానిం గూర్చి చర్చించియే యున్నారు గావున నిప్పుడు విచారించుచోఁ బునరుక్తి యగునని 'ఔచిత్యోపన్యాస' కర్త లగుబ్రహ్మశ్రీ 'ఓలేటి వేంకటరామశాస్త్రి గారికి జంకుచు విరమించుచున్నాను.

పైని నేను సూచించిన వ్యాసమున సోమునిపై ననేకదోషములు మోపబడినవి. అందు ముఖ్యము లగువానికి నిందు నాసమాధానము లియ్యఁబడియున్నవి. ఆవ్యాసమును వ్రాసినవారు బ్ర. రా. అనంతకృష్ణశర్మగారు. వారు తమ యొక్కొకయాక్షేపమునందు సోమునితో నెఱ్ఱాప్రెగ్గడను బోల్చుచు, శంభుదాసునియొద్ద నీసర్వజ్ఞుని నల్పజ్ఞునిఁగాఁ బరిగణించుచు వచ్చిరి. దానం జేసి యిందు నచ్చటచ్చట నెఱ్ఱనపద్యములను గూర్చియు, నెఱ్ఱననుగూర్చియుఁ జర్చింపవలసి వచ్చినది. ఇప్పుడు పైవ్యాసములోని సోమునిం గూర్చిన యొక్కొకయాక్షేపమును ముందుగ వ్రాసి దానికి నాయుత్తరమును వ్రాయుచున్నాను.

i. అష్టే. దీర్ఘసమాసములు తెలుఁగుకవితకు వికారములే యని నామత ము. కోమలములై మనోహరములైన యలఁతి తెలుఁగుపల్కు లుండ, హను మంతుని తోఁక వలె - - - - - దీర్ఘసమాసమును బ్రయోగించినఁ దెలుఁగున కేమి గౌరవము? - - - - - - ఈసోమునిపద్యముం దిలకింపుఁడు.

స్రగ్ధర. గాఁడీవారావఘుంఘుంపాఘుటితభయదివౌకఃపురాంతఃపురంధ్రీ
గండాభోగశ్రమాంభఃకణకలుషితగంగాతరంగాభిషంగా
ఖండాస్త్రత్కాండపాళీకబళితసకలాకాశసీమానిశాంతో
ద్దండాతిక్రాంతగర్వాంతకయమభటసంతానముం గాననైకీన్.

ఆహా! ఏమి యీసమాసపుఁబొందిక! ఇందు నిరర్థకవిషయము లెన్ని! నిరర్థకపదము లెన్ని! వీరము, శృంగారము, భయానకము, శోకము, నన్నిరస ములను జేర్చి పిసికి పిండినంట చేసిన ట్లున్నదే యీపద్యము! ఈదీర్ఘసమాసము నింత యనుచితముగ నీచోట నేమిఫలము నాశించిప్రయోగించినాఁడో యాసో మునికే—కాదు దేవునకే యెఱుక! సాధారణముగ సోమునిసమాసము లనే కములిట్టివ - - - - - ''

ఈరీతిగ సోముని నిందించి యచ్చటనే యెఱ్ఱనను వీ రిట్లు పొగడినారు.

"నన్నయతిక్కనలకుం బోలె నెఱ్ఱనకును బ్రాయికముగఁ బిచ్చిపిచ్చి యలంకారములయందును, బ్రాసములయందును, దీర్ఘసమాసములయందును నాశ లేదు. ఆతనిపద్యము లన్నియు స్వభావోక్తి మధురములై యలఁతియలఁతి తునియలుగఁ గూర్పఁబడి సుకుమారము లయి చదువరుల చెవుల కమృతంపుఁ దుంపురులఁ జిలుకుచుండును."

ఈక్రిందియెఱ్ఱనపద్యములు సోమునిపై పద్యమునంటివే యని యెఱుం గవచ్చును.

"మహాస్రగ్ధర. కని రుగ్రగ్రాహనక్రగ్రహణఘుమఘుమాకారకల్లోలడోలా
స్వనసప్రద్యోతకేళీసరభసఫణభృచ్చారుజూటాగ్రభాస్వ
ద్ఘనరత్నోద్దంచితోద్యత్కటకుటిలమయూఖచ్ఛటాటోపమిథ్యా
జనితౌర్వారంభశుంభత్సలిలనివహనిస్తంద్రు రత్నాకరేంద్రున్."
నృసిం. తృ. 3 ప.

ఇట్టి యలఁతియలఁతి తునియ లగుసుకుమారపద్యము లెఱ్ఱనగ్రంథము లలో నింకను గలవు. చూడుఁడు. ఒండు రెండు:—

"స్ర. క్ష్వేళక్ష్మాప్రేక్షతాక్ష్ణోఃక్షతరుచివిసరక్ష్మాస్వసస్వావ శ్వద్దీప్తి - - -" హరి. ఉ. భా. 8 ఆశ్వా.

"మ. స్ర. కని రాపా తాళ మూఁలక్షతశిఖరిశిఖాకల్పి-ఖోత్సంగ - - -" హరి. ఉ. భా. 1 ఆశ్వా.

ఆంధ్రగ్రంథములయందు నతిదీర్ఘసమాసములు గలపద్యములను వ్రాయుట నేను సహింపను. కాని కావ్యలక్షణములను బట్టి యుండఁదగిన చోట్లనవి యున్నను సహ్యము లే యనియు వాని నంతగా దూషించుట న్యాయ్యముగా దనియు విన్నవించుచున్నాను.

మిశ్రకావ్యములయందుఁ గవులు తత్తద్రసోద్బోధకములై, యుచితములై యొప్పు పలుపోకలఁ బోవుచుందురు. చూడుఁడు! కవిబ్రహ్మ యగుతిక్కన సోమయాజి దుర్యోధను నెట్లు వర్ణించియున్నాఁడో! ఒక్కటియే యలఁతిఘనియ!

"స్రగ్ధర. మౌళిస్రక్సంగరంగన్మధుకరపటలీమాంసనాకృష్టివిద్యా
శాలిస్ఫారాబ్జరేఖాంజలిపుటఘటనాచారుఫాలస్థలత్వా
పాలశ్రేణీవిశాలాంబకకుముదవనీబాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాఢకాంతిస్మితవదనరుచిస్ఫీతు నాగేంద్రకేతుఁ."

విరాట. తృ. 78 ప.

పైపద్యములలోఁ దిక్కన యెట్టిరసఫలము నాసించినారో సోముఁడును నాఫలమునే యాశించినాఁడు. వారికవి యెట్లుచితము లయ్యెనో సోమునకు నట్లే యయ్యెను!

పైని వ్రాసినసోముని "గాండీవారావ - - -" పద్యమునుగూర్చి దాని యర్థము, భావము, సందర్భము మొదలగువానియందు వీరు వేఱభిప్రాయము నొంది రాగచిహ్నాంకితములగు ననేకవాక్యములతో నాతనిని మిక్కిలియు నిందించినారు. వారి యర్థభావము లివి!

శ. వ్రా. "అర్జునుఁడు మృత్యువునాతం బడనున్న విప్రకుమారుని రక్షింపఁ బంతములు పల్కి యచ్చటికిఁ బోయి, తనకుఁ దెలియకమే యాశిశువు మృతినొందఁగా, శ్రీకృష్ణునియొద్దఁ దాను బల్కినబీరములు నిష్ప్రయోజనము లగుట దలపోసి, యనమాన మయ్యెనే యని సంకటపడు సంవిధానము సన్నగారితోఁ జెప్పుపద్య మిది! ప్రకరణమునకును శైలికిని నెంతసొగసైన పొత్తు గలసినదో చూచితిరా! గాండీవారావముయొక్క దెబ్బకు దేవతలయంతఃపురస్త్రీల

క్కెల్ల భయము కలిగినది. దానివలన వారి చెక్కిళ్లపైఁ జెమట వొడమినదఁట! ఆచెమట సామాన్యము గాదు సుఁడీ! గంగాతరంగముల నెల్లఁ గలుషితములుగాఁ జేయఁజాలినది! ఆగంగాతరంగములతోఁ జేరి యఖండములైన నర్జునుని బాణ సమూహములు? అర్థమేమో! ఆబాణసమూహముచే సమస్తమగు నాకాశప్ర దేశ మనునొకగృహము కబళితంబైనదఁట! ఆగృహమును గూడ నుద్దండముగ నతిక్రమించినారు కుమారుని జంపిన యమభటులు! వారి నర్జునుఁడు కానఁ డయ్యె నఁట! ఎత్తిన దేమి దించిన దేమి!" అని వ్రాసిరి. "ప్రకరణమునకును శైలికిని నెంతసొగసైన పొత్తు గలసినదో చూచితిరా!" (అని యాక్షేపము.)

పొత్తు గలసినదో లేదో చూతము.

అర్జునుఁ డక్కాలమున మేటివిలుకాఁడు. అంతకుము న్నపజయ మన నెట్టిదో యెఱుఁగఁడు. తనగాండివము వృథపోని దనుధైర్యము గలవాఁడు. అప్పు డాతఁడు చేయఁబోయినది శ్రీకృష్ణుఁ డొనర్పఁదగిన మహాకార్యము. ఇట్టి కార్యము ము న్నెన్నఁడును జేసి యెఱుంగఁడు. దానిని జేయ లేకపోవుదునా యని తలంచుసమయ మది! ఇ వన్నియు నిట్లుండ, నీవిషయమును ధానుష్కకు లాగ్రగణ్యుఁడై, కాలవశమున శరతల్పగతుఁడైయున్న భీష్ముని యాజ్ఞచే ధర్మ రాజునకు నీచరిత్రమును జెప్పుచున్నాఁడు. అచ్చటసోదరులును, యుద్ధవీరు లగు రాజశ్రేష్ఠులును గలరు. ఇందఱ యెదుట యమభటులతోఁ దాను బ్రతిఘటిం చిన విషయమును, అప్పుడు తాను జూపిన పరాక్రమమును జెప్పుచో క్షత్రియ కులశిరోమణి యైనయర్జునుని మనోభావనగతు లెట్లుండునో యూహింప సోమ నాథమహాకవి తద్రచనాసమయమునఁ దాను బార్థుఁడై నాఁడు. తోడనే యాతనిహృదయమున వీరకరుణాద్భుతభయానకాది రసమ్ము లొక్కుమ్మడి నుద యించి కావ్యనిబంధనల కనుగుణ మగునిట్టిపద్యమును రచియింపఁ జేసినవి.

పైపద్యమునకుఁ బ్రతిపదార్థమును మాని భావమును సందర్భమును వివ రించెదను.

"పండియుఁ బొల్లవోయె నని బ్రాహ్మణి లోపల నేడ్వఁ" గానే సవ్యసాచి తానున్న గ్రామమునుండి యాకాశము సీమ (హద్దు) గా నొకబాణగృహమును నిర్మించెను. యమకింకరు లాబాణగేహమును దాఁటి పోకుండునట్లు చేయవల యు నని సంభ్రమాశ్చర్యమనస్కుఁ డగునాతని యప్పటితలంపు. పిల్లవానిని యమభటులు గొనిపోవు నానిముసమున నే యంతటి బాణగృహమును నిర్మించు టకు నాతని గాండీవ మెంతటిపని చేయవలసియుండును? [అతివేగమునఁ బని

నేయు (బట్టలు) కుట్టుయంత్రము చప్పుడును బట్టి గాండీవధ్వనిని జెలిసికొనుఁడు] ఆసమయమున బయలువెడలిన గాండీవనిర్ఘోషము భూమ్యంతరాళముల నిండి స్వర్గమునకే కాక యందలి యంతఃపురములకును బోయినది. అమరపురంధ్రు లంతకుమున్ను స్వర్గమున జరిగిన యనేకయుద్ధములయందలి రాక్షసవీరుల ధను రాశావముల వినికి కలవడియున్నవా రయ్యు స్వనితసహస్రతుల్య మగు నాగాండీ వనిస్వనమును విని భయముఁ జెందిరి. ఆభయముచే నస్వేదగాత్ర లగువారి గండభాగములయందును జెమ్మట వొడమెను. దీనినిబట్టి యర్జునుఁడు, యమ కింకరులయెడలఁ దాను జూపినపరాక్రమము నచ్చటివారి కెట్లు తెలిసెనో మనము గ్రహింపనచ్చును.

బాణపంజరమునుండి యమభటులు పోలేరా యనుశంకకు నుత్తరము చెప్పుచున్నాఁడు.

ఆకాశగంగ స్వచ్ఛమైనది. అది శ్వేతగణములోనిది. దానిని నిర్మల యశస్సుతోఁ గవులు పోల్చెదరు. అట్టివైశద్యముతోఁ గూడినవియద్గంగాతరం గిణీతరంగము లెట్టిధావళ్యముతో నొప్పుచుండునో యూహింపుఁడు. అట్టిధవళ తరంగములను ఫల్గునుని వాఁడిబాణములు తమస్వచ్ఛతచే ధిక్కరించుచున్నవి. ఏల? వియన్నదీభంగములు, నిర్జరకాంతల చెక్కులయందలి (మకరికాపత్త్రముల కస్తురితో మిళితములైన) స్వేదాంభఃకణముల కలయికలచే మలినీకృతము లైనవి. వానిమాలిన్య మగపడకుండ నర్జునునిబాణములు వానిని గప్పుచున్నవి. (తమనైశిత్యశుభ్రత్వముచే వానిని మీఱుచున్న వని భావము.) అట్టి సునిశిత శరములనుండి యమకింకరులు దాఁటి పోలే గని యాశయము. యమభటు లొకవేళ మొఱకుఁదనముఁ జూసి దాఁటి పోవుదు రనుకొన్నను, వాఁడిగల యాయమ్ములనడుమనుండి, యప్పుడే పుట్టువుఁ గాంచిన యా నెత్తురుఁగందును గొనిపో వెఱతు రని యాసమయమున నయ్యభిమన్యు జనకుఁడు భావించెను. ఎట్లు భావించిన నేమి? అర్జునుఁడు మనుష్యమాత్రుఁడు. ఈశ్వరమాయను మానవుఁడు జయింపఁగలఁడా? తనయఖండకాండపాళిచేఁ గబళితమైన యాకా శముసీమ గాఁగల నిశాంతమునుండి యుద్దండమై యతిక్రమించిన గర్భాంతక యమభటసంతానమును దుద కాతఁడు గాన లేకపోయెను.

ఎత్తినదియు దించినదియు గాండీవమే. ఇందు నిరర్థకపదము లెవ్వి? చూడుఁడు? ఆఁడుదిఁ యగు ద్రౌపదీదేవి, కీచకునిఁ దా నదలించుటను భీమునితో రహస్యస్థలంబున,

శా. "దుర్వారోద్యమబాహువిక్రమకళాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ ..........."
ఇత్యాదిగ నుద్రేకముమెయిఁ జెప్పినట్లు కవిబ్రహ్మ వ్రాసియుండఁగా, ద్రౌపదికే కాక మగలకును మగఁడయినయర్జునుఁడు, తాను యమభటులను బ్రతిబంధించుటను భీష్మాదియోధవీరులతో నవ్వీరరంగంబున 'గాండీవారా' వేత్యాదిగ శూరత్వముమెయిఁ బలికినట్లు సర్వజ్ఞుఁడు వ్రాసియుండుట ప్రకరణోచితము కాదా?

ii. ఆక్షే. మఱియు నీయనుకమ్ముం గనుండు!

"అనుచు ననుచారియై విప్రుఁ డరుగుదేరఁ, దేర గాండివ మిడి యస్త్రదీయనుహిను। మహిమడుంగ మడుంగను మనను మాయ, మాయ గన్నులఁ గ్రమ్మఁ గ్రమ్ముకొతి నేను."

ఇదియును బైయర్జునుఁ డన్నగారితోఁ దనగోడు చెప్పుకొనుపద్యమే! నిజముగఁ గవితాలతకుఁ బ్రాసములు ప్రాసములే!" అని శర్మగారు వ్రాసిరి.

ప్రత్యు. ఈపద్య మెట్టిసందర్భమునఁ జెప్పఁబడినదో యించుక యూహించుట న్యాయ్యము. యమభటసంతానమును గానలేని యర్జునుని పైయవస్థను గంటిరి గావునఁ దరువాతిపద్యములఁ గనుఁడు.

గీ. "పోయె బాలుండు యదువృష్ణిభోజకులముఁ,
జిన్నవోయెను జూడ వచ్చినజనంబు
డించిపోయె మదీయగాండివములజ్జ
వోయెఁ గొనిపోయె భూసురపుత్త్రు జముఁడు."

వ. "ఇవ్విధంబున గాండివమ్ము లావు వమ్మయినం గ్రమ్ము నుమ్మలికంబున విన్ననైన నన్నుం జూచి యవ్విప్రుఁడు,"

క. "ఓపార్థ! నిన్ను నమ్మితిఁ, బాపని రక్షింప కిట్లపార్థుఁడ వైతే
నాపాలిపారిజాతము, గోపాలకచక్రవర్తిఁ గొనిరా నైతిర్."

చ. "పిలిచితి నన్న! నిన్ను? నతిభీతుఁడ విప్రుఁడ నమ్మినాఁడ నీ
పలుకనృతంబుగాఁ దగునె?....పోటుమగండై యిటుచేసితి గాక యింతలో
నిలుతు మురారి నన్నచట నీళ్లను ముంచినఁ బాల ముంచినర్."

క. "నీ వేమిసేయు దీగాం,డీవము నీకిచ్చి యమ్ము డెప్పరమైనన్
లావు గలదంచుఁ బలికిన,పావకుచేఁ గాదె కోలుపడితిఁ గుమారుర్ ?"

ఇత్యాది వాక్యశూలములతో నాబాఁపఁడు, ద్వారకకు మరలి పోవునాతనిం బొడుచుచు వెంబడించినాఁడు.

(పైపద్యములయందలి కరుణరససంవిధాన మెట్టిమృదుమధురపదములతో నెట్టిశబ్దాలంకారములతో నిండియుండి, పాఠకులహృదయముల నేరీతిని గరఁగించుచున్నదో విచారింపుఁడు.)

అర్జునుఁ డుత్తమకులసంజాతుఁడు. పౌరుషశాలి. ఎన్నఁడు నుడివోవని పరాక్రమము నేఁడు పమ్మయ్యెఁ గదా యనువిచార మాతని చుట్టుముట్టెను. అవ్విచారమునకు వెంటఁబడ్డ బ్రాహ్మణుని యేడ్పువలనిచింత తోడయ్యెను. ఆతని శాసమయమున నేమియుఁ దోఁపదయ్యెను. ఊరక కూర్చుండలేక తెచ్చుకొనిన శిశుహత్యాబ్రహ్మహత్యామహాపాతకములు నడుమ జ్ఞప్తికి వచ్చుచుండెను. అప్పటియన నాతనిమనోభావగతు లెట్లుండును? కోపము, విచారము, పాపభీతి, సంభ్రమము, లజ్జ మొదలగు వికారము లాతనిహృదయరంగమున దండిడి వెట్టుచుండెను. ఆతఁడు ద్వారకకుఁ బోవుచుండెను. అచ్చటఁ దనబావగారికిఁ దనమోము నెట్లు చూపఁగల నని యూపోటుసుగఁడు మిక్కిలియుఁ జింతించినవాఁ డయ్యెను. అలవిగానిపని యయ్యెనే యని పశ్చాత్తాపము నందెను. "ఏమీ! యమభటసంతాన మెంతలో నన్ను వంచించి పోయినది?" అని తిచ్చనడిమెను. వెనుక బ్రాహ్మణుఁడు రోదనము చేయుచుండెను. యదువృష్ణిభోజవిభులు కాళ్లీడ్చుకొనుచుఁ జిన్నవోయినమోములను దనమోముతో వియ్యమందించుచు వచ్చుచుండిరి. 'చీ! ఇట్టిబ్రదు కేల? యని య ప్పార్థుఁడెంచి, మరణము నిచ్చగించి యేనీట నైనను గాండివముతోఁ బడఁదలంచి వెనుకకు మరలెను. మరలఁగానే యేడుపుమోముతోడి బాఁపనయ్య యెదురయ్యెను. 'అయ్యో! బావగారితోఁ జెప్పి విప్రకుమారు నిప్పింపవలదా?' యని మరల నగరాభిముఖుఁ డయ్యెను. 'ఇసీ! సిగ్గుమాలి చేఁతగానివాఁడ నైతి నని యాతనితో నెట్లు ముచ్చటింపఁగల?' నని వెనుకకుఁ దగ్గెను. 'శ్రీకృష్ణుఁడు విప్రకుమారుని బ్రదికించునెడ నవ్విప్రునియందానందముం గాంచ మనశ్శల్యము నూడఁ బెఱికికొనవలదా?' యని మరలఁ బత్తనమునకుఁ బ్రయాణ మయ్యెను. "ఒకవేళఁ గృష్ణుండు 'మించిపోయినపని సాధ్య మగునా?' యనుచోఁ జావునకన్న నెక్కుడు సంకటము ఘటిల్లునే?" యని వెనుకకు నడుగు పెట్టెను. "ఆహా! జగన్నాటకసూత్రధారి యగునప్పరమేశ్వరునియెదుట మనుష్యుఁడగు నే నెంత? మదీయపరాక్రమాదు లమ్మహామహుని యమేయశక్తిముంగల నెంతటివి? సర్వశక్తుఁ డగునాతఁడు బ్రాహ్మణబాలునిఁ దప్పక బ్రదికింపఁగలఁడు. అక్కల్యాణకార్యమును గన్నులారఁ గని యానందించెదఁ గాక!" అని మనసు పదిలముచేసికొని తిరిగి ద్వారకకు నడచెను.

# శక్తివర్మ ప్రభు బ్రహ్మశాసనము

## మూలము.

### మొదటి పత్రము.

---

స్వస్తి శ్రీమతాం సకలభువనసంస్తూయమానమానవ్య
సగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశికివ
2 రప్రసాదలబ్ధరాజ్యానాం మాతృగణపరిపాలితా
నాం స్వామిమహాసేనపాదానుధ్యాతానాం (భగవన్నా)
3 రాయణప్రసాదసమాసాదిత వరవరాహలాంఛనే
క్షణక్షణవశీకృతారాతిమణ్డలానా మశ్వమే
4 ధావభృతస్నాన (1) పవిత్రీకృతవపుషాం చాలుక్యా
నాం కులమలంకరిష్ణోః సత్యాశ్రయవల్ల
5 భేన్ద్రస్య భ్రాతా కుబ్జవిష్ణువర్ధనో ష్టాదశవర్షా
ణి వేంగీదేశ మపాలయత్॥ తదాత్మ
6 జో జయసింహ స్త్రయస్త్రింశతం। తదను జేన్ద్ర
రాజనన్దనో విష్ణువర్ధనో నవ తత్సూను
7 ర్మంగి(2)యువరాజః పంచవింశతిం। తత్పుత్రో
జయసింహ స్త్రయోదశ। తదవరాజః (3)కొక్కిలిః షణ్మాసాన్
8 తస్య జ్యేష్ఠో భ్రాతా విష్ణువర్ధన స్త ముచ్చాట్య స
ప్త త్రింశతం। తత్పుత్రో విజయాదిత్యభట్టారకో
9 ష్టాదశ। తత్సుతో విష్ణువర్ధనః షట్త్రింశతం॥
తత్సూను ర్భానుభాసో రణవిగణనయా నీల

రెండవపత్రము; మొదటిపుటః

10 కణ్ఠాలయానాం సగ్రామారామకానాం సలలిత
రమణీసంపదా సత్పదానాం। క్రిత్వా (4) ప్రోత్తుంగ

(1) భృథస్నాన (2) మంగి (3) తదవరజః (4) కృత్వా.

11 మష్టోత్తరశత మభున గ్వీరప్తయుక్త(1)శ్చత్వా
రింశత్సమా ఙ్మోజననుతవిజయాదిత్యనామా నరేన్ద్రః॥
12 తత్సూను స్సతత మనూన దావృష్టేః । (2)
ద్విజగణికా ర్త్తి(3)సస్యం(4) । సన్తోష (5)సకల మవాపయ
13 న్నపా గ్గా మద్ధ్యర్థం(6)కిల కలవిణ్ణువ నోద్ధం (7)
తత్ప్రియతనయః । అజ్ఞా త్సంగ్రామరజ్గే విల
14 సదసినా మజ్గిరాజో త్తమాజ్గం తుజ్గాద్రే
శృంగ ముర్వ్యా మశని రివ ముదా పాతయ త్కన...
15 నిశ్శంకం శంకిలేన ప్రథితజపదా ద్దుర్గ్గమా న్నిగ్గమ
య్య ద్రా గ్దావం య త్ప్రివేశ్య ప్రభు...
16 న్నాప్రత్యపా ద్భద్దెగాంకం (8)॥స శ్రీమా న్విజయా
దిత్యభూపతి ర్భ్రాతృభి స్సహ(9) । చత్వారింశత్సమా సార్ధం(10)
17 చతృభి రభున గ్భువం ॥ తద్భ్రాతృ(11)ర్విక్రమాది
త్యభూపతే స్సచ్చ(12)మూప తేః విలత్సత్కణ్ఠి(13)కాదా
18 మత్తణస్య తనయో నయీ ॥ దీనానాథాతురా
ణాం ద్విజ వరసమితే ర్యాచకానాం యతీ

రెండవపత్రము ; రెండవపుట.

19 నాం నానాదేశాగతానాం పటుపటునటసద్గాయ
కానాం కవీనాం। బన్ధూనా మన్ధకానా మభిల
20 షితఫలశ్శానవా ద్రక్షణా ద్యో మాతేవ స్త్రింశ(14)దబ్దా
న్భువ మభున గసౌ చారుచాలుక్యభీమః ॥ తత్పు
21 త్ర స్స్వభుజాసి(15)ఖణ్డితరిపుక్ష్మాభృద్బలా ద్వాసవీ(16)జిత్వా
సాంవిరజే ప్రతిష్ఠితజయ స్తంభ(17) పటిష్ఠో ర

(1) వీరోప్తయుక్తా. ఈపాదమందుగణభంగదోషమున్నది. (2) దానవృష్టిః. (3) ద్విజగణికార్త (4) ఈపాదమందు గణభంగదోషమున్నది (5) సన్తోషం (6) మధ్యర్థం (7) కలివిష్ణువర్ధనోద్బవ్. (8) ఈభాగవమస్పష్టము. (9) పతిర్భ్రాతృభిస్సహ. (10) సార్థం (11) తద్భ్రాతృ (12) స్సచ్చ (13) విలసత్కణ్ఠికా. (14) మాతేవత్రింశద (15) స్వభుజాసి ఖణ్డిత (16) ద్వాసవో. (17) స్తంభపటిష్ఠో.

22 ణే। స్వర్ణారూఢతులో౽త్ర బాధ మతులో ధాత్రీతలే
క్షత్రియై ర్మిత్రాభా (1) పరిరక్షితిస్మ విజయా

23 దిత్య స్సమార్ధం ధరాన్ (2)॥ తస్యాత్మజ (3)ప్రణత
వైరిశిరో విలగ్నరత్నద్విరేఫపరి

24 చుంబితపదాపద్మః (4)। మేరుం హాసం స్తులితహాటకరా శిభాసా వర్షాణి
స్సప్త (5) సమహా

25 ద్భువ మమ్మరాజః॥ తత్సుతం విజయాదిత్యం బాల ముచ్చాట్య లీలయా।
తాడాధిపతి రాక్రమ్య మా

26 స మేక మహా ద్భువం॥ తం జిత్వా యుధి చాలుక్య
భీమభూమభూమిప తేస్సుతే (6) విక్రమాదిత్యభూ

27 పోహా న్మాసా నేకాదశ క్షితిం॥ తత స్తాడపరాజస్య
సూను సూనృతవా (7) క్నృభుః। యుద్ధమల్లధరా

మూడవపత్రము. మొదటిపుట.

28 ధీశ స్సప్తవర్షాణ్య హా ద్భువం॥ తం యుద్ధమల్లం యు
ధి యుద్ధమల్లో నిర్ఘాట్య విక్రా న్తనృపాదిపీరా

29 హత్వా సమా ద్వాదశ రాజభీమో భూమిా మహా త్కో
ల్లభిగణ్డసూనుః॥ పత్యు స్తస్య సుతః పరాక్ర

30 మధనః క్షోణీభృతా మగ్రణీ రేకే నైవ గజేన వైరిణాం (8) హం
తా నవానాం రణే। కీర్త్యా నిర్మలయా ది

31 శో ధవలయ న్ధర్మ్యాం దధానో మతిం వర్షాణాం
భువ మమ్మభూపతి రహా త్పంచో త్తరం వింశ

32 తిం॥ సంగ్రామభూ మా సురవాసభూమి మారోప్య
వీరో త్తర మమ్మరాజః దాయాద ము

33 గ్రాసినిపాతి తేభ సంతానసోపానపరంపరాభిః॥
భూభృద్విద్యాపారదృశ్వ (9) గుణాబ్ధిః శ

34 శ్వద్విద్వత్స త్కృతార్థః కృతార్థః। ఖ్యాతో ధాత్రీం రా
జభీమస్యపుత్రః పాతిస్మ శ్రీ న్వత్సరా దానభూపః॥ త

(1) భా: (2) ధరామ్ (3) జః ప్రణత (4) పాదపద్మః (5) సప్త. (6) భీమభూమిపతే
స్సుతః (7) సూనుస్సూనృత (8) వైరికరిణాం (9) దృశ్వా.

35 తో దానార్ణవాధీశోః (1) దను వేంగీమహీతలః (2)।
స ప్తవింశతివర్షాణి వేంగీదేశమరాజకః(3) ॥ శ్రీమానా

36 ర్యాయమహాదేవ్యా (4) దానార్ణవమహేశయోః సూ
నురత్రాంతరే ధీరః శక్తి(5)న మ్నేతి విశ్రుతః॥ యస్మి

మూడవపత్త్రము. రెండవపుట.

37 న్విశ్వంభరాభారం సాసహాజాతవమి (6) దిగ్గజేన్ద్రాః
ఫణీన్ద్రాశ్చ విశ్రాన్తా ఇవ తద్భహాత్ ॥ గాంభీర్యం

38 జలజన్మతాం జలనిధేః స్థైర్యం క్షితే క్షున్నతాం (7) సా

ర్యం (8) కేసరిణో మృగాధివసతం (9) మాయాం హ

39 రేః పౌరుషం । లావణ్యం శశినః కలంకసహితాం
త్యక్తుం య థై తే గుణా । య త్రైకత్ర ముదా వసంతి నిత

40 రాం చాలుక్యనారాయణే॥ యస్యైకణ్ఠీరవ స్యేవ శైశవం
సమసోభత (10) । సా ర్యే ణా (11)

41 భీలశుణ్డాలనిబ్భిదా (12) ద్రమిళాహవే॥ ప్రేషితం
చోడభీమేన యచ్ఛిరీకృతసాహ

42 సః । పంచత్వ మన త్తీక్ష (13) మేకవీరం స్వబాహునా॥ బద్దేమ
శ్చ మహారాజో మదాన్యో బ...

43 లిణే । ఉభా వభిభితాం యస్మా ద్వ్యభద్వీపనా వివ (14)॥
ఉచ్చై చ్చ బ్బలస్కన్ధ మతిప్రరూఢం భూభృచ్ఛిరః కో

44 (టి) విసారితాంఘ్రి మామూల మున్మూలయతిస్మ
యో న్తస్సారం విశాలం జటాచోడవృక్షం॥ రున్ధ

45 న్తం దిగిభోపమై న్నిజగజై రాశాః కీర్తనం మహీ మ
శ్వానాం నివహైశ్చ వి...ప్రేంఖ

నాల్గవపత్త్రము. మొదటిపుట.

46 ద్రజశ్ఛద్మనా । యుద్ధే (ధ) మర్ణరథం విధాయ సన
య నతైన్యసమర్ధనా ప్రాప (15) జ్జయసంభవం స్తుతి

---

(1) ధీశాదను (2) మహీతలమ్. (3) సమతిష్ఠదరాజకమ్. (4) శ్రీమదార్యా మహాదేవీ (5) శక్తి. (6) ఇందుతప్పున్నది (7) క్షితేఃక్షున్నతాం (8) శౌర్యం (9) వసతిం (10) సమశోభత (11) శౌర్యేణా (12) నిర్భిదా (13) మనయత్తీక్ష్ణ (14) ఈపద్యముస్పష్టముగాలేదు (15) నాశాన్ని



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము ౧౪. { క్రోధననామసంవత్సరము జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి. ౧౯౨౫.

# విషయసూచిక.

విషయములు. — పుటలు.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

సంపుటము ౧౪. | క్రోధన నామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. | సంచిక ౨.


## పెదచెఱుకూరిశాసనము—నన్నిచోడకవికాలము.

### ఉపక్రమణిక.

“ఆంధ్రకుమారసంభవమహాకావ్యకర్త యగునన్నిచోడమహారాజు నన్నియభట్టునకుఁ బూర్వుఁడా? తరువాతివాఁడా?” అనువిషయము మొన్న మొన్నటి వఱకు వివాదమునఁ బడి యుండినది. మొన్నటియాంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక (౧౩ సంపు. 3, ౪ సంఖ్యలుగలసంచిక) యందు ప్రకటింపఁబడిన పెదచెఱుకూరిశాసనమువలన నది చల్లఁగాఁ దేలిపోయినది.

ఏతద్విషయమును గూర్చినవివాద మావిర్భవించుటకు మొట్టమొదట బీజమును నాటినవారు బ్ర॥ శ్రీ॥ మానవల్లి రామకృష్ణకవి (ఎం. ఏ.,) గారు. అది తుట్టతుదకుఁ బరిష్కారమును జెందుసాధనమును జూపినవారు బ్ర॥ శ్రీ॥ జయంతి రామయ్యపంతులు (బి. ఏ, బి. ఎల్.,) గారు.

రామకృష్ణకవిగారు, కుమారసంభవపీఠికయం దెవ్వియో కొన్నికారణములను జెప్పి, “నన్నిచోడకవి నన్నియభట్టునకు నూఱేండ్లు ముందుగ నున్నవాఁ”డని వ్రాసిరి. రామయ్యపంతులుగారు, మొన్నటిపరిషత్పత్త్రికయందు పెదచెఱుకూరిశాసనమును బ్రకటించి, “నన్నిచోడకవి నన్నియభట్టునకు నూఱేండ్లిటీవల నున్నవాఁ డగు”నని సిద్ధాంతీకరించి, కవిగారు నిర్ణయించిన కాలమును దలక్రిందు చేసిరి.

పెదచెఱుకూరిశాసనమును రామకృష్ణకవిగారు చిరకాలముక్రిందటనే యెఱిఁగి యున్నట్లు కుమారసంభవద్వితీయభాగపీఠిక (2 పుట) వలనఁ దెలియుచున్నది. కాని, యేకారణము చేతనో, వారాశాసనమునఁ జెప్పఁబడిన (చోడబల్లి

కుమారుఁ(డగు) నన్నిచోడరాజును మనకవిచంద్రునిఁగా గ్రహింపకయు, ఆశాసనమును బ్రకటింపకయుఁ, దత్కాలమునుగూర్చి చర్చింపకయు విడిచిపెట్టినారు. బహుశః—అందు చెప్పఁబడిన నన్నిచోడఁడు మనకవినన్నిచోడఁడై యుండఁడనియు, ఆతఁడే యాతఁడై యున్నచో, పరమమాహేశ్వరభక్తిచేతను, పరిశుద్ధచారిత్రముచేతను పితృమాతృ (చోడహైహయ) వంశములను బవిత్రము చేయుటయే కాక, వసుమతీరాజ్యముతోపాటు కవితాసామ్రాజ్యమునయితము పరిపాలించి, రాజలోకమునందును, కవిరాజలోకమునందును సముధికయశస్సును సంపాదించియున్న మనమహారాజకవిరాజును, ఆశాసనము సందొకించుటయైన వర్ణింపక, (నట్టి) నన్నిచోడఁడను సామాన్యనామము నే-తద్వంశస్థులే-యుపయోగించి యుందురా యనియు, ఐదాఱుతరములలోనే యాతఁడంత మఱపునకు వచ్చియుండునా యనియు, రాజరాజనరేంద్రునకుఁ దరువాత రెండువందలయేండ్లకుఁ బుట్టినకర్మనాథదేవాలయశాసనమునందు తద్వంశస్థుఁడగువిజయాదిత్యునిచే రాజరాజును, భాగతరచనయుఁ బ్రశంసింపఁబడియుండఁగా, మనకవిరాజశిఖామణి నన్నిచోడదేవుఁడు మాత్రము చెఱకూరిశాసనమును వ్రాయించినచోడరాజులచే నేమాత్రమైన స్తుతియింపఁబడి యుండఁడా యనియు, మఱియుఁ దాతపేరును, తండ్రిపేరును, తినపేరును సమానముగాఁగలవారు, ఒక్కవంశమునందే పలువు రుండుట మనదేశమున వింత గాదనియుఁ, గావున నాశాసనమునఁ జెప్పఁబడిననన్నిచోడఁడు వేఱొకఁడై యుండు ననియు వారు భావించి యుండిరేమోయని తోఁచుచున్నది.

రామయ్యపంతులుగారును, ప్రస్తావమున నున్న చెఱకూరిశాసనమును 1910 సంవత్సరమునాఁటికే యెఱిఁగియున్నట్లు పైపరిషత్పత్రికవలనఁ దెలియుచున్నది. కాని, యేహేతువుననో, యీపదునైదేండ్లకాలములోను, ఆశాసనమును గాని, తచ్ఛాసనవిషయములతోఁ గూడిన కవికాలనిర్ణయమును గాని వీరును బ్రకటించినారు గారు! అట్లు ప్రకటించి యుందురయేని, నన్నిచోడకవికాలమునుగూర్చి యిన్నినాళ్లును వాదములు జరిగి యుండుటయు, అందు సుప్రసిద్ధవిమర్శకులు, ఎవ్వరెవో యితరశాసనములను బట్టుకొని తప్పుత్రోవఁబడి పోవుటయు, వారాధారపఱుచుకొన్న యాశాసనములు చోడకవిని సంబంధించునవి గా*వని వీ రెఱిఁగియుండియు నేల యూరక చూచుచుండిరని పాఠకులు దలంచుటయు సంభవించి యుండక పోవును. బహుశః—1911వ

* చూడుఁడు పై పరిషత్పత్రిక ౧౪౩ పుట, ౨౦ పంక్తి.

సంవత్సరము మొదలుకొని యెవరో యొకరు ఏదోవిధముగ నన్నిచోడకవి నన్నియభట్టారకునకుఁ దరువాతివాఁడైనట్లు వ్రాయుచునే యున్నారు గదా యని భావించి, యీశాసనమును బ్రకటింపవలసినంతటియక్కఱను వీరు గైకొని యుండలే దని తోఁచెడిని.

ఆశాసన మీరీతిఁ బ్రచ్ఛన్నగతి నుండఁగా, కడచినసంవత్సరము నేను నన్నిచోడకవిరాజుకాలమునుగూర్చి యదివఱకుఁ జర్చించినవిమర్శకులు సూపిన శాసనాద్యాధారములు సరిగాఁ బట్టవే దని నిరూపించుచు, నాతనికవిత్వప్రాచీనత నాధారముగఁ జేసికొని, ఆతఁడు నన్నియభట్టునకంటెఁ బూర్వుఁడై యుండు ననియు, నాతనికిఁ దరువాతివాఁడై యుండఁ డనియు నాకుఁ గానవచ్చినహేతువులను గొన్నిటిని జూపుచు నొకవిమర్శమును వ్రాసి, దానిని సప్తమాంధ్రసారస్వతమహాసభయందు చదివితిని. అది శారద (రక్తాక్షిఆషాఢ—1924 జూలై సంచిక) యందు ప్రకటింపఁబడినది.

ఆనావిమర్శమువలన నన్నియభట్టారకునకుఁ బూర్వము తెలుఁగుకవులనేకు లుండినట్లును, చోడకవిరాజు వారిలో నొక్కఁ డైనట్లును నేర్పడియెను. మఱియు నింతకుమున్ను నన్నియభట్టారకునకు మనవారు గౌరవపూర్వముగా నొసగియున్న 'ప్రథమాంధ్రగ్రంథనిర్మాతృబిరుదపట్టిక' గలకిరీటరాజ మాతని శీర్షమునుండి తొలఁగి పోయి, (ప్రస్తుతము) నన్నిచోడమహారాజుమూర్ధము నలంకరింపవలసిన దయ్యెను. దానంజేసి శ్రీజయంతి రామయ్యగారు, పైపరిషత్పత్రికయందు, "ఇందును గుఱించి నాయభిప్రాయమును బ్రకటింపవల్లయు నని కొందఱు భాషాభిమానులు కోరుటచేతను, నే నీవిషయమై కొంతపరిశోధన చేసి యుండుటంబట్టియు, నింతవఱకు జరిగినవాదప్రతివాదములఁ బరిశీలించి నానిశ్చితాభిప్రాయమును దెలుపఁబూనినాఁడను." అని వ్రాయుచు, దానికి సాధనముగా, ప్రస్తావమున నున్న పెదచెఱకూరిశాసనమును బ్రకటనమునకుఁ దెచ్చి, దానినిబట్టి "నన్నిచోడకవి నన్నియభట్టునకునుమారు నూఱేండ్లిటీవల నున్నవాఁ" డని నిర్ణయించుకొనిరి.

మొట్టమొదట రామకృష్ణకవిగారు నిర్ణయించినకవికాలమునుగూర్చి చర్చించియున్నపూర్వవిమర్శకుల కెవ్వరికిని జెఱకూరిశాసనము లభించియుండక పోవుటచేతను, నేఁటికిఁ గాని రామయ్యపంతులుగారు దీనిని ప్రకటించి యుండక పోవుటచేతను నావెనుకటివిమర్శమున నీశాసనమును జర్చించి కవికాల

మును సిద్ధాంతీకరించుననకాశము నాకు సిద్ధించి యుండలేదు. *ఇప్పు డీశాసనము, పూర్వవిమర్శకులు చూపినశాసనములకంటె ('ఒరయూరిపురవరాధీశ్వర' అనుటకు 'కందుకూరిపురవరేశ్వర' అని యున్నను †తంత్రిపే రైనను గలియుటచే) నించుకంత మేలైనదిగాఁ గానవచ్చుచున్నది గావున, నింతకంటె మంచియాధారము లభించునఱకు, నిదియే గతిగా నెంచి రామయ్యపంతులుగారు చేసికొన్నసిద్ధాంతమును విమర్శించుచున్నాను. ఈవిమర్శమునకు మున్న దెలుపవలసినవిషయ మొకటి గలదు:—

రామయ్యపంతులుగారు, 1910-వ సం॥ చెన్నపురియందు జరిగిన యొకానొకసభలో "నన్నియభట్టునకుఁ బూర్వము తెలుఁగుకవు లుండిరా?" అను విషయము చర్చకు రాఁగా, ఆసభ కగ్రాసనాధిపత్యమును వహించినతాము, నన్నిచోడకవి నన్నియభట్టునకుఁ దరువాతివాఁడు గాని పూర్వుఁడుగాఁ డని చెప్పియుంటి మనియు, ఈచెఱకూరిశాసనము నాధారము చేసికొనియే 'నన్నిచోడకవి నన్నియభట్టునకు సుమారు నూఱేం డ్లిటీవలివాఁ డైనట్లు స్పష్టపడుచున్నదని (యానాఁడే) యభిప్రాయపడి యుంటి మనియు, మఱియు నీపత్త్రికావాదములు పుట్టక పూర్వమే తమకీయభిప్రాయము పొడమినది గావున రామకృష్ణకవిగారిమతమును ఖండించినవారిలోఁ బ్రథములము దామే యనియుఁ బైపరిషత్పత్త్రికయందు వ్రాసికొని యున్నారు. (చూ. ౧౪౦, ౧౪౨ పు)

ఈపై సంగతులనుబట్టి, రామయ్యపంతులుగారిమనమునఁ జిరకాలము నుండియు మొన్నటివఱకును నన్నిచోడకవి నన్నియభట్టున కిటీవలివాఁ డను నభిప్రాయము గాటముగ నాటికొని యున్న దనుట విస్పష్టము. అయిన నేమి? "పట్టుదలను మాని యిటీవల జరిగినవాదప్రతివాదములను సాధ్యమైనంతవఱకు మధ్యస్థభావముతో విమర్శించి సత్యమును నిర్ణయించుటకే యత్నించెదను." అనివ్రాసియే వారు కవికాలనిర్ణయమునకుఁ గడంగినారు. వీరి యాప్రయత్న మెంతవఱకు సఫలమైనదో విచారింతము.

---

* రామయ్యపంతులుగారు చెఱకూరిశాసనమును నేను జూచితి నని వారివ్యాసమున వ్రాసినారు ఆనావిమర్శము ప్రకటింపఁబడిన 7, ౮ మాసముల తరువాత నేను దానిని వారియొద్ద నుండఁగాఁ జూచితిని.

† శాసనకాలమునాఁటికి రెండపమల్లిదేవుఁడు కందుకూరు రాజధానిగాఁ బాకనాఁటి రాజ్యము నేలుచునుండ నోపు.

## విమర్శము.

'నన్నిచోడకవికాలము' అనుశీర్షికతో రామయ్యపంతులుగారు ప్రకటించినవ్యాసమునందు కవికాలమును సంబంధించునవియు నేను విమర్శింపఁదగినవియు నైనవిషయములు రెండే:—

I. పెదచెఱుకూరిశాసనమునుబట్టి రామయ్యపంతులుగారు నిర్ణయించిన నన్నిచోడరాజుకాలము సరిగ నున్నదా?

II. కవితాప్రాచీనతనుబట్టి చోడరాజకవి నన్నియభట్టునకంటెఁ బూర్వుఁడై యుండుననుదానికి రామయ్యపంతులుగారు చెప్పినసమాధానము సమంజసముగ నున్నదా?

కవికాలనిర్ణయప్రయత్నారంభమున రామయ్యపంతులుగారు, "ఆంధ్రచోడశాసనములలోఁ బెక్కురు నన్నిచోడులు కనఁబడుచున్నారు. కుమారసంభవకర్త వీరిలో నెవ్వఁడై యుండునో నిర్ణయింపవలసి యున్నది." అని వ్రాసినారు. "ఒకవేళ వీరిలో నెవ్వఁడును కుమారసంభవకర్త గాకపోయియున్నచో నీనిర్ణయ మెట్లు సరిపడును?" అని యెవరైనఁ బ్రశ్నింతురేని దానికిఁ బ్రత్యుత్తరము వచ్చుట కష్టము. అయినను నిరాక్షేప మగుశాసనము దొరకొనువరకు, రామయ్యపంతులుగారు ప్రకటించిన చెఱుకూరిశాసనమునం దున్ననన్నిచోడరాజునే మనకవిగాఁ బ్రస్తుత మంగీకరించి, పైరెండుసారాంశములను క్రమముగా విచారించుచున్నాను.

I { పెదచెఱుకూరిశాసనమునుబట్టి రామయ్యపంతులుగారు నిర్ణయించిన నన్నిచోడరాజుకాలము సరిగా నున్నదా? }

ఏతద్విషయవిమర్శనమునకు నిదాన మైనపెదచెఱుకూరిశాసనములోని చోడరాజనామములుగల (రామయ్యపంతులుగారిచ్చిన) శ్లోకభాగమును, తద్వంశవృక్షమును ముందుగ నుదాహరించెదను:—

"చోడబల్లినృపః: తస్మా న్నన్నిచోడః;త దాత్మజః సూరభూపః; తస్య సుతః రాజరాజమహీపతిః; *తస్యానుజః ఘటంకారః;—తత్తనయః మల్లిదేవః; తస్య సుతః నన్నిచోడః; తస్య (సుతః) మల్లిదేవః (శాసనదాత.)

పైశ్లోకములనుబట్టి రామయ్యపంతులుగా రిచ్చినవంశవృక్ష మిది:—

---

* 'తస్యానుజః' అనుదానిలోని 'తస్య' శబ్దమునకు 'సూరరాజు' అని వెనుక నన్వయించినారు. దూరమున నున్నసూరరాజున కన్వయించుటకు మాఱు సమీపమున నున్నరాజరాజున కేల యన్వయింపఁగూడదో! ప్రత్యుత్తరము రెంటికిని సమానమైన యాక్షేపము గలదే.

చోడబల్లి
|
నన్నిచోడఁడు.
|
సూరరాజు — ఘటంకారుఁడు.

(సూరరాజు)
|
(రాజరాజు)

(ఘటంకారుఁడు)
|
మల్లిదేవుఁడు. (I)
|
నన్నిచోడఁడు. (II)
|
మల్లిదేవుఁడు. (II)

ఈవృక్షమునుబట్టి రామయ్య పంతులుగారు మొదటినన్నిచోడనికిని రెండవమల్లిదేవునకును నాలుగుతరముల భేదము నేర్పఱిచిరి.

పైశ్లోకములయందు, చోడబల్లి మొదలుకొని కడపటిపురుషునివఱకును జేర్కొనఁబడిన చోడరాజులందఱును—ఒక్కొక్కఁ డొక్కొకనికిఁ బుత్త్రుఁడుగాఁ జెప్పఁబడి యుండ నడుమ నన్వయసుభగము గాని 'తస్యానుజో ఘంటకారః' అనుపాదములోని 'అనుజ'శబ్ద మేల వచ్చెనో యని సందేహించి, కుమారసంభవ ద్వితీయభాగపీఠిక 2 పుటయందు పెదచెఱకూరిశాసనమునుబట్టి యుదాహరింపఁబడిన పైచోడరాజులవంశక్రమమునుబరీక్షింపఁగా నందిట్లువ్రాయఁబడియున్నది.

"పెదచెఱకూరిలోని మల్లిదేవునిశాసనములోఁ జోడబల్లికుమారుఁడు నన్నిచోడుఁడు, అతనిపుత్త్రుఁడు సూరరాజు, వానిపుత్త్రుఁడు రాజరాజు, వాని <u>సునుసుఁడు</u> మల్లిదేవుఁడు, వానిపుత్త్రుఁడు నన్నిచోడుఁడు నని యున్నది" (కుమారసంభవపీఠిక, 1914 సం)

దీనినిబట్టి పెదచెఱకూరిశాసనములోని చోడరాజవంశవృక్ష మిట్లేర్పడుచున్నది:-

చోడబల్లి.
|
(I) నన్నిచోడఁడు.
|
సూరరాజు.
|
రాజరాజు
|
ఘటంకారుఁడు.
|
(I) మల్లిదేవుఁడు.
|
(II) నన్నిచోడఁడు.
|
(II) మల్లిదేవుఁడు.

నిపుణముగాఁ బరిశీలించుచో రామయ్యపంతులుగారు ప్రకటించిన పై శ్లోకములయందుఁగల 'తస్యానుజో ఘటంకారః' అనుదానిలోని 'అనుజ' శబ్దము లేఖకప్రమాదసంయుక్తముగను, శాసనస్థపురుషక్రమవిరుద్ధముగను గనుపట్టక మానదు. ఏల యన, ఒక్క ఘటంకారుఁడు *దక్క శాసనములోని రాజులెల్లరును, ఒక్కొకఁ డొక్కొకనికిఁ బుత్త్రుఁడుగాఁ జెప్పఁబడి యున్నారు. మఱియు శాసనమునుబట్టి చూడఁగాఁ, దచ్ఛాసనకర్త, యాచోడరాజవంశములోని ప్రధానపురుషులనుమాత్రమే పేర్కొనియుండినట్లు స్పష్టపడు చున్నది. రామయ్యపంతులుగారు ప్రకటించినవంశవృక్షమునుబట్టి చూడఁగా, సూరరాజునకును, నాతనిపుత్త్రుఁడు రాజరాజునకును నంతప్రాముఖ్య మున్నట్లు గానరాదు. ఎట్లనఁగా, ఆశాసనమున వారిద్దఱును జెప్పఁబడకున్నను నందున్నపురుషక్రమమునకు భంగము వాటిల్లదు. దానంజేసి సూరరాజును, వానికొడుకు రాజరాజును అగస్త్యభ్రాతయు, తత్పుత్త్రుఁడును నగుచున్నారు. మఱియు, నన్నిచోడనికి సూరరాజును, ఘటంకారుఁడు నను వారిరువురు పుత్త్రు లనియు, నందు సూరరాజునకు రాజరాజును, ఘటంకారునకు మల్లిదేవుఁడును కొడుకు లనియుఁ జెప్పుట సంప్రదాయము గాని, నన్నిచోడనికి సూరరాజు కొడు కనియు, సూరరాజునకు నఘటంకారుఁడు తమ్ముఁ డనియుఁ జెప్పుట సంప్రదాయవిరుద్ధము గాదా? ఒకతండ్రి కిద్దఱుకొడుకులని చెప్పుదుము గాని, ఒకతండ్రి కొకకొడు కనియు, ఆకొడుకున కొకతమ్ముఁడు గలఁడనియుఁ జెప్పము. కావున రామయ్యపంతులుగారు ప్రకటించిన 'తస్యానుజో ఘటంకారః' అనుపాఠము సరియైనదై యుండదు. 'తస్యాత్మజో ఘటంకారః' అని, యది లిఖింపఁబడినదై యుండును. ఈనావాదమును 1914 సం॥ లోనే ప్రకటింపఁబడిన కుమారసంభవములోని పై వంశక్రమమునయితము పోషించు చున్నది. మఱియు నీపాద మిట్లుండు నేడఁ బై వైరుధ్యము లన్నియుఁ దొలఁగిపోవును. కాఁబట్టి 'తస్యాత్మజో ఘటంకారః' అనియే మనమాపాదమును గ్రహించుట యుక్తము.

ఈవిమర్శమువలనఁ బైవంశవృక్షమునకును, జయంతి రామయ్యపంతులుగారిచే నీయఁబడిన వెనుకటివంశవృక్షమునకును రెండుతరముల భేద మేర్పడుచున్నది. ఎట్లన, రామయ్యపంతులుగారిచే శాఖగాఁ ద్రోయఁబడిన సూరరాజ రాజరాజు

* ఘటంకారుఁడో, అఘటంకారుఁడో నిశ్చయింప వలనుపడమిఁ గాఁబోలు, కుమారసంభవపీఠికయం దాపేరే యెత్తఁబడలేదు. 'రాజరాజుమనుమఁడు' అనిమాత్రము వ్రాయఁబడినది. రామయ్యపంతులుగా రిచ్చిననామమునే నేనును ఉపయోగించినాఁడను.

లిద్దఱును మూలపురుషులై రెండుతరముల నభివృద్ధి నొందించినారు. దానంజేసి ప్రథమునన్నిచోడరాజునకును, ద్వితీయుమల్లిదేవునకును రామయ్యపంతులుగారిచే నేర్పఱుపఁబడిన నాలుగుతరముల భేదము నిప్పు డాఱుతరముల భేద మైనది.

ఈతరములభేద మిటుండఁగా, మొదటినారాంశము పరిష్కరింపఁబడుటకు రామయ్యపంతులుగారివ్యాసమున నింకొక భేదము సయితము విస్మరింపఁబడినదని యున్నది. అది యేదియన, ఒక్కొక్కతరమునకు వారిచే నేర్పఱుపఁబడిన సంవత్సరసంఖ్య. రామయ్యపంతులుగారు, "చరిత్రకారులు తరమున కిరువదియైదు సంవత్సరముల లెక్కను గణింతురు." అని వ్రాసి, యాలెక్కనుబట్టి 'నన్నిచోడకవి నన్నయభట్టున కిటీవలివాఁ' డని నిర్ణయించుకొనిరి.

సుప్రసిద్ధకవిచరిత్రకారు లగు వీరేశలింగముపంతులుగారు, పూర్వకవుల చరిత్రభాగమునఁ దరమునకు నలువదియేండ్లచొప్పునఁ బలుచోట్ల గణియించియున్నారు. ఒండు రెండుచోట్ల నింకను నెక్కుడుకాలమునే వారు లెక్కించిరి. తరమున కిరువదియైదు మాట యటుండ, ముప్పదియేండ్లవంతున నైన వారు లెక్కించిన యుదాహరణ మొక్కటి యైనను ఆభాగమునందు గానరాదు. ఇవ్విషయమును విశదపఱుచుకొఱకు వారికవిచరిత్రము ప్రథమభాగమునుండి పదియుదాహరణములను మాత్ర, మిచ్చటఁ జూపుచున్నాను. (నడపటిపుట)

| వాక్యభాగము. | వత్సరసంఖ్య. | పుట | ఏకవి చరిత్రములోనిది. |
|---|---|---|---|
| 1. ఒక్కొక్కపురుషాంతరమునకు - - - | 45 | 115 | తిక్కన |
| 2. ,, తరమునకు - - - | 40 | 118 | ,, |
| 3. ,, పురుషునికిఁ గలయంతరము | 40 | 169 | ఎఱ్ఱన |
| 4. ఒక్కొక్కఁడు తండ్రికి నలువదేసి సంవత్సరముల యీడునఁ బుట్టుచు - - | 40 | 170 | ,, |
| 5 (తాతకును మనుమనికిని (84) యెనుఁబది నాలుగేండ్ల యెడము) - - - - | 42 | 215 | బద్దెన |
| 6. ఒక్కొక్కరు నలువదేసి సం. రాజ్యము చేసిన - - - - - - - | 40 | 288 | వి. పెద్దన |
| 7. తరమొకటికి నలువదేసి సం. వయోవ్యత్యాసము - - - - - | 40 | 376 | మ. సింగన |
| 8. తరమునకు నలువదేసి సం. చొప్పున - | 40 | 379 | |
| 9 ముత్తాతకును ముని మనుమనికిని 150 ఏండ్లు (3 తరములకు – 150) - - - - | 50 | 393 | అనంతుఁడు |
| 10. ఒక్కొక్కతరమునకు నలువదేసి సం. | 40 | 560 | పోతన |

* * * * * * * * *

ఈరీతిని కీ॥ శే. వీరేశలింగముపంతులుగారు తర మొక్కటికి నలువదేసి సంవత్సరములచొప్పున గణించియున్నారు.

శ్రీరామయ్యపంతులుగారుసయితము, ఇంతకు మున్ను, ఒక్కొక్కతరము నకు నలువదేసి, రమారమి అఱువదేసి—సంవత్సరముల లెక్కను గణించియే యున్నారు. వారట్లు గణించిన యొండురెండు దృష్టాంతములను జూపు చున్నాను:—

చెదలువాడమల్లనకవికాలమును నిర్ణయించునప్పుడు రామయ్యపంతులు గారు విప్రనారాయణచరిత్రపీఠికయం దిట్లు వ్రాసి యున్నారు:—

(5 పుట, 10 పంక్తి చూడుడు.)

I. "మల్లనకవితాతకును మల్లనకవికుమారునకును (అనఁగా మూఁడు తరములకు) 120 సంవత్సరములయంతర ముండును. ఒక్కొక్కతరమునకు 30 సం॥ పైగాను, 40 సం॥ లోపుగాను నయినది. ఇది యసంభావ్యము గాదు." (120÷3=40.) దీనినిబట్టి తరమునకు 40 సం॥ లైనది గదా!

II. చెదలువాడ మల్లనకవి, క్రీ. శ. 1585 సంవత్సరమున నున్నట్లు తద్గ్రంథపీఠికయందు రామయ్యపంతులుగారు వ్రాసియున్నారు. (చూ. 5 పుట) ఎఱ్ఱాప్రెగడకును మల్లనకవికిని నాలుగు తరముల భేద మున్నట్లు వారే చూపినారు. (చూ॰ 3 పుట) ఎఱ్ఱాప్రెగడ క్రీ. శ. 1350 సం॥ వఱకు జీవించి యుండెను. (చూ. కవిచ. ప్ర. భా. 173 పు) కావున నెఱ్ఱనమల్లనలకుఁ గలభేదము నాలుగుతరములలో 235 సంవత్సరములు గడచినవి. అనఁగా నొక్కొక్కతరమునకు రమారమి 60 యేండ్లలెక్క యైనది.

పైలెక్క లట్లుండ నింకొకవింతను జూపెదను. రామయ్యపంతులుగారు, ఒక్కొక్కతరమునకు ముప్పదేసిసంవత్సరములవంతున గణించుటసయితము కాల నిర్ణయభంగ మొనగ్చునుభావము నవిప్రనారాయణచరిత్రముపీఠిక (3 పుట) లోనే యీక్రిందివిధమునఁ గనఁబఱిచి యున్నారు:—

ఆంధ్రభాగవతషష్ఠస్కంధములోని "శ్రీవత్సగోత్రుండు శివభక్తియుక్తుఁడు," అనుపద్యములోని "ఏర్చూరిశాసనుం డెఱ్ఱనప్రెగ్గడ" అనుదానినిబట్టి వీరేశలింగముపంతులుగారును, గురుజాడశ్రీరామమూర్తిపంతులుగారును షష్ఠస్కంధకర్త యగుసింగనమంత్రి యెఱ్ఱాప్రెగడవంశములోనివాఁడని భావించి, ఎఱ్ఱాప్రెగ్గడ యింటిపేరు 'ఏర్చూరివా'రని వ్రాయఁగా, వారివ్రాఁతల నధిక్షేపించుసందర్భమున రామయ్యపంతులుగా రిట్లువ్రాసిరి.

“సింగయమంత్రి (షష్ఠస్కంధకర్త) తెల్పినవంశావళిలో నెఱ్ఱాప్రెగడ వంశమునందు వీరన, ఆదెయ్య, కనుపమంత్రి, సింగయమంత్రి, యనువారు క్రమముగ జనితపురుషులుగాఁ గనఁబడుచుండ, మనకవి (మల్లన) తెల్పినవంశావళిలోని ఎఱ్ఱాప్రెగడ, మల్లన, యెఱ్ఱన, లింగన మల్లన యనువారిక్రమము పై క్రమమునకుఁ గేవలము విరుద్ధముగాఁ గనఁబడుచున్నది ఒకవేళ, ఎఱ్ఱాప్రెగడ వంశమునందు షష్ఠస్కంధకర్తకుఁ దరువాత నీమల్లనకవి తెల్పినవంశావళిలోని మల్లనయెఱ్ఱనాదులు పుట్టియుండిరేమో యని యెవ్వరయినను హాస్యాస్పదమైనయుక్తి చెప్పవచ్చును గాని, యది యెఱ్ఱాప్రెగడయొక్క సువిదితకాలమునకే హాని తెచ్చును.” (చూడుఁడు, విప్రనారాయణచరిత్రముపీఠిక 3 పుట)

పాఠకగ్రహణసౌలభ్యముకొఱకై పైసింగనమల్లనకవుల వంశములక్రమముల నిచ్చటఁ జూపుచున్నాను:—

(1) షష్ఠస్కంధములోనిది.

ఎఱ్ఱాప్రెగడ.
|
వీరనమంత్రి.
|
నాదయ (ఆదెయ్య!) మంత్రి.
|
కనుపమంత్రి.
|
సింగయమంత్రి (కవి.)

(2) విప్రనారాయణచరిత్రములోనిది.

ఎఱ్ఱాప్రెగడ.
|
మల్లనమంత్రి.
|
ఎఱ్ఱనమంత్రి.
|
లింగనమంత్రి.
|
మల్లనమంత్రి (కవి.)

మొదటివంశములోని కడపటినలుగురు పురుషులతోను రెండవవంశములోని కడపటినలుగురను జేర్చుచో నెఱ్ఱాప్రెగడసువిదితకాలమునకు హాని వచ్చునని రామయ్యపంతులుగారియభిప్రాయము. ఎట్లన, రెండువంశములును నేకమగుచో నెఱ్ఱాప్రెగడకును మల్లనకవికిని నెనిమిదితరముల భేద ముండును. వారియువురకును గలయెడము రమారమి 240 సంవత్సరములు. ఒక్కొక్కతరమునకు ముప్పదేసిసంవత్సరము లగును. ఐనను అట్లు (తరమునకు ముప్పదియేండ్ల లెక్కను) గణించుటగూడ హాస్యాస్పదమును, సువిదితకాలభంగకరమును నగునని రామయ్యపంతులుగారియభిప్రాయ మైనట్లు విస్పష్ట మగుచున్నది గదా!

ఈరీతిని తరమునకు 40 ఏండ్లవంతున నొకచోట వ్రాసినరామయ్యపంతులుగారు, 60 ఏండ్లవంతున వేఱొకచోట నిర్ణయించినరామయ్యపంతులుగారు, ముప్పదిసంవత్సరముల లెక్కను గణించుటసైతము సువిదితకాలమునకే హాని

నన్చు నని యింకొకచోటఁ బరిష్కరించిన రామయ్యపంతులుగారు—పెద చెఱకూరిశాసనమునుబట్టి నన్నిచోడరాజు కాలమును నిర్ణయించుపట్టున—తరమునకు 25 సంవత్సరముల-చొప్పున నిప్పుడు లెక్కించుటకుఁ గారణ మేమో!

మఱియు, పెదచెఱకూరిశాసనమునఁ బేర్కొనఁబడిన గణపతిదేవచక్రవర్తితాతదండ్రులు మొదలగువారు సుమారు ఏఁబదేసి, అఱువదేసి, డెబ్బదేసి సంవత్సరములునయితము వరుసగా రాజ్యపరిపాలన మొనర్చినట్లు చరిత్రములు ఘోషించు చున్నవి. కాకతిబేతరాజు మొదలుకొని గణపతిదేవునితో నైన నాలుగుతరములలోను రమారమి 200 సంవత్సరములు నడచినవి!

పై హేతువుల నన్నిటినిబట్టి విచారింపఁగా, ఆకాలమున తరమునకు 40 ఏండ్లలెక్కను గణించుట (రామయ్యపంతులుగారు చెప్పినట్లు) 'అసంభావ్యము గాదు.' (చూ. విప్రనా. పీఠిక, 3 పుట.)

కవికాలనిర్ణయము.

ఇంతవఱకును గావించినవిమర్శమునుబట్టి పెదచెఱకూరిశాసనములోని నన్నిచోడరాజు కాలమును నిర్ణయింపవలసియున్నది.

రామయ్యపంతులుగారు నన్నిచోడకవికాలమును నిశ్చయించుపట్టున నిట్లువ్రాసినారు:—

"పెదచెఱకూరిశాసనము ౧౧౪౦-వ శకాబ్దప్రాంతము దని యూహించుట యాక్షేపార్హముగా నుండదు. రెండవమల్లిదేవునకును మొదటినన్నిచోడునకును, నడుమ నాలుగుతరములు గలవు. చరిత్రకారులు తరమున కిరువదియైదు సంవత్సరముల లెక్కను గణింతురు. రెండవమల్లిదేవుఁడు శ. 1140-వ సంవత్సరప్రాంతమువాఁ డయినచోఁ బ్రథమనన్నిచోడుఁడు శ. 1040-వ సంవత్సరప్రాంతమువాఁ డగును. అనఁగా నన్నయభట్టారకున కించుమించుగా సమకాలికుఁ డగును. ఇతరశాసనముల నాధారము చేసికొని వ్రాసినవారి సిద్ధాంతముకూడ నించుమించుగా నిదియే. ఘట్టకుటీప్రభాతన్యాయముగా నెట్లు చూచినను నన్నిచోడుఁడు నన్నయభట్టునకును తిక్కనసోమయాజులకును నడిమివాఁ డని తేలుచున్నది. ఇదియే సిద్ధాంతము."

శ్రీజయంతి రామయ్యగారు చెప్పినతరముల లెక్కయు, తరమునకు వారేర్పఱిచిన యేండ్లలెక్కయు సరిపడి యుండలే దని పైచర్చవలనఁ దేలినది గావున, దానినిబట్టి నన్నిచోడరాజు కాలమును గనుఁగొందము.

రామయ్యపంతులుగారు చెప్పినట్లు పెదచెఱుకూరిశాసనమును వ్రాయించిన రెండవమల్లిదేవుఁడు శా. శ. 1140 సం. ప్రాంతమువాఁ డైనచోఁ, నాతనికి నాఱుతరములముం దున్న ప్రథమనన్నిచోడఁడు శా. శ. (6 × 40=240; 1140–240=9(0)సం. ప్రాంతమువాఁ డగును. మఱియు నీనన్నిచోడని కాల మిది యేయని నిశ్చయించుటకు వేఱొకశాసనముసైతము దోడుపడుచున్నది. అది యేదియన,

"కృష్ణాతీరమున బీచుపల్లిగ్రామశాసనములోఁ జోడబల్లిదేవుఁడు విజయయాత్రలోఁ గృష్ణాతటమున నుత్తరాయణపుణ్యకాలమున విశ్వనాథదేవునకు క్రీ. శ. 902 లో భూదాన మిచ్చిన ట్లున్నది." (చూ. కుమారసం. ద్వితీయ పీఠిక 3, 2, 9 పుటలు.) కావున, 'అరిదినృపాలషాళి దళితాంఘ్రియుగుం డయి' విజయయాత్ర సలిపినయీచోడబల్లిదేవుఁడే మన నన్నిచోడదేవునకుఁ దండ్రియై, యేతత్కాలనిర్ణయము సత్యమే యనియు తనపుత్త్రుఁడు నన్నిచోడ కవిరాజు నన్నియభట్టారకునకంటె నూఱేండ్లు ముందున్నవాఁ డనియు ధ్రువపఱుచుచున్నాఁడు![*]

కుమారసంభవప్రకటనకర్త లగురామకృష్ణకవిగారిసిద్ధాంతమును నిదియే. ఘట్టకుటికాప్రభాతన్యాయమున నెట్లు చూచినను నన్నిచోడమహారాజకవిరాజు నన్నియభట్టారకునకు నూఱేండ్లు ముందున్నవాఁ డగుచున్నాఁడు. ఇదియే సిద్ధాంతము.

ఈనిర్ణయముచే రామయ్యపంతులుగారు పెదచెఱుకూరిశాసనమునుబట్టి చేసిననన్నిచోడరాజుకాలనిర్ణయము సరిగా లేదని నిర్ధారిత మైనది.

కవితాప్రాచీనత.

| | |
|---|---|
| (II) రెండవసారాంశము | కవితాప్రాచీనతనుబట్టి చోడకవి నన్నియకంటె ముందువాఁడై యుండు ననుదానికి రామయ్యపంతులుగారు చెప్పినసమాధానము సరిగా నున్నదా? |

"ఒకకవికాలమును నిశ్చయించుటకు నిరాక్షేపము లైనశాసనాదిదృష్టాంతము లెవ్వియు లభింపనినాఁడు, ఆతనికవిత్వమునుబట్టి యాతనికాలమును నిర్ణయింపవలసియుండు ననుట చారిత్రవేత్తలకు నూత్నవిషయము గాదు." అని నా వెనుకటి (శారదలోని) విమర్శమున వ్రాసి, కుమారసంభవములోనిప్రాచీన

[*] పై నిర్ణయముప్రకారము నన్నిచోడరాజు శా. శ. 900 సం. ప్రాంతమున రాజ్యము చేయుచుండినచో నాతఁడు డించుమించుగ శా. శ. 850 సం. ప్రాంతమునఁ బుట్టియుండును. అది (యించుమించు) క్రీ. శ. 928 సం. ప్రాంతమగును. క్రీ. శ. 902 సం. బీచుపల్లిశాసనము వ్రాయించినచోడబల్లిదేవున కీనన్నిచోడదేవుఁడు పుత్త్రుఁ డగుట యసంభవము గానేరదు.

ప్రయోగాదులను గొన్నిటిని జూపి, వానినిబట్టి నన్నిచోడకవి నన్నియభట్టున కంటె మిక్కిలియుఁ బూర్వుఁడై యుండు నని వ్రాసితిని. శ్రీ రామయ్య పంతులు గారును, "గ్రంథభాషనుబట్టి గ్రంథకాలమును నిర్ణయించుట సత్సంప్రదాయమే" అని నేను వ్రాసినదాని నంగీకరించియు, నేను జూపిన హేతువులకుమాత్రము సవిమర్శము లగుసదుత్తరముల నీయక,

"కాని, యాభాష గ్రంథకర్తప్రయుక్త మనఁదగినదిగా నుండవలయును. అట్టినమ్మకము లేనిచో నాభాష ప్రమాణము కానేరదు. రామకృష్ణకవిగా రచ్చువేయించిన కుమారసంభవము భాష కొన్నికొన్ని తావుల యందుఁ గవిప్రయుక్త మైనది కాదేమో యని యనుమానింప నవకాశము కలదు". అని యేమో వ్రాసి రామకృష్ణకవిగారి గ్రంథసంపాదనము మొదలగువిషయముల మీఁది యాక్షేపముల నెపమున నవ్విషయమును జల్లఁగా జాఱవిడిచినారు.

పైవాక్యముల నించుకంత పరిశీలింపుఁడు.

ఏయేతావులయం దున్న కుమారసంభవముభాష గ్రంథకర్తృప్రయుక్త మైనదని తమకు నమ్మకము గలుగుచున్నదో యాభాషనే ప్రమాణముగాఁ దీసికొనరాదా? తంజావూరి ప్రతిలోనిభాష యట్టినమ్మకమును గలిగించున దగునా? కాదా? అదియును నమ్మకముఁ గలిగింపనిచో నిఁక మనకు వేఱుప్రతి యేదీ? కావున దానిలోనిభాష కవిప్రయుక్త మనియు, నధికవిశ్వాస్య మనియు, ప్రమాణయుక్త మనియుఁ జెప్పక తప్పదు. అందున్న ప్రయోగాదులు తప్పక నన్నిచోడకవి నన్నియభట్టునకంటె బూర్వుఁ డనియే ఘోషింపఁగలవు

నేను నా వెనుకటివిమర్శమునఁ జూపిన హేతువులకును, రామకృష్ణకవిగారి వని మీరు చూపినదిద్దుబాటులకును నెట్టిసంబంధమును లేదు. రామకృష్ణకవిగారు సవరించినారని వారు చూపినపద్యములలోని సవరణలయం దాధునికలేఖిని ప్రత్యక్ష మగుచున్నది గాని పురాతనపు గంటము స్ఫురించుచుండుట లేదు. అచ్చుప్రతికిని వ్రాఁతపొత్తమునకును గల భేదములను జూపుటకై రామయ్య పంతులుగా రిచ్చినపద్యములలోని భిన్నపాఠములను మరల నొకసారి పరికింపుఁడు. పైవిషయము స్పష్టము కాఁగలదు. మఱియు నింకొకయుదాహరణముఁ గనుంగొనుఁడు:—

"సీ. పా. "అలమట సెడి యొండె నిలువదు చిత్తంబు, (మూర్ఛిల్లి) పెడఁబాసి పోవదొండె."
(కుమారసం. ప్ర. భా. 75 పుట. 580.)

ఇందుత్తరదళమున మొదటిపదము (మూర్ఛిల్లి) తంజావూరివ్రాఁతప్రతియం దు లేదు. దీనిని రామకృష్ణకవిగారు పూరించినారో, వారియొద్ద నున్నట్లు

చెప్పఁబడు వేఱుప్రతులం దది యున్నదో కాని, యధునాతనకవిత్వము నెదుటఁ బెట్టుచున్నది. ఎట్లనిన, ఉత్తరదళమున యతి (మూ × పో) ప్రాచీనకవిసమ్మతము గాదు. ఇట్టిమార్పు లాధునికము లని గ్రహించుట యుక్తము గాని, కవిని ప్రాచీనునిఁ జేయుటకై యొనర్పఁబడినవని తలంచుట న్యాయమా?

ముద్రితగ్రంథములోని యేవో భేదముల నాధారపఱుచుకొని నేను భ్రాంతిఁ జెంది కవికాలనిర్ణయము నొనర్చితి నని రామయ్యపంతులుగారు సూచించి యున్నారు గాని నేను జూపిన సనాతనప్రయోగాది హేతువు లట్టివి గావు. నేను జూపినకారణములు వేఱు. కవిగారి దిద్దుఁబాట్లనునవి వేఱు. నా హేతువులు తంజావూరిప్రతికి భిన్నము లగునవి గావు. నా వెనుకటి (శారదలోని) విమర్శమును జదువువారి కివ్విషయము విశదము గాఁగలదు.*

నన్నిచోడకవికవిత్వము, నన్నియభట్టకవికవిత్వమునకంటెఁ బ్రాచీనమై నదిగాఁ గన్పట్టు ననుసందేహము రామయ్యపంతులుగారి మనస్సునకు సయితము గలుగకపోలేదు. కావుననే వారు, "నన్నయాదులగ్రంథములకును నీ దోషము (దిద్దుఁబాట్లదోషము) పట్టియే యున్నది." అని వ్రాసి కొంత సమాధానము చేసికొన్నారు. దీనినిబట్టి యిప్పుడు కనఁబడుచున్న నన్నియభట్టుభారతమునఁ గొంతపురాతనత్వ మేవిధమున నైన నేమి తగ్గి యున్న దని రామయ్యపంతులుగారు భావించినట్లు మన మూహింపవచ్చును గదా!

చోడకవికుమారసంభవమునందుఁబోలె నన్నియకవిభారతమునందును నచ్చటచ్చటఁ గొన్ని దిద్దుఁబాటు లుండిన నుండవచ్చును. కాని, యక్కుమారసంభవకావ్య <u>మంతయును</u>—ఆభారతగ్రంథ <u>మంతయును</u>—దిద్దుఁబాటులు గలిగి యున్నదే యని మనము చెప్పఁగలమా? ఎడనెడ నల్పము లగునవరణలు కొన్ని యున్నంతమాత్రమునఁ గవికాలమును వెల్లడింపఁగల (ఆతనిగ్రంథములోని) భాష <u>కేవలమును</u> మాఱిపోవు నని మనము నిర్ణయింపవచ్చునా?

కావుననే, ఇప్పు డున్న నన్నిచోడకవికుమారసంభవమును, ఇప్పు డున్న నన్నియకవిభారతమును బరిశోధించియే, నా వెనుకటివ్యాసమునందు, భారతకవిత్వముకంటె కుమారసంభవకవిత్వమే ప్రాచీనతరమై యున్న దని సహేతుకముగా నిరూపించియున్నాను. దీని కనుగుణముగా రామయ్యపంతులుగారును

---

* నా వెనుకటి విమర్శము, పాఠకమహాశయులకు విశదమగుపొంటెఁ, బరిషత్పత్రికయందు ప్రకటింపఁబడు నేర్పాటులు గావింపఁబడినవి. కాని, యేకారణముచేతనో యది దానియందు ప్రకటింపఁబడలేదు.

"కావునఁ బాఠములు చక్కఁగఁ బరీక్షించి కవిప్రయుక్తపాఠము లనఁదగినవానిని మాత్రమే ప్రమాణములుగా గ్రహింపవలసి యున్నది." అని వ్రాసియే యున్నారు. కాని, యావెంటనే 'అట్టిపాఠము లున్నను నన్నిచోడుఁడు నన్నయభట్టారకునికంటెఁ బూర్వుఁ డని చెప్పఁజాలవు" అని వ్రాయుటకుమాత్రము వారి కవకాశ మెట్లు కలిగినదో దుస్సూహముగా నున్నది. చోడరాజకవి నన్నియభట్టకవికంటె సనాతనుఁ డని తెలుపునాధారము లెన్ని యున్న నేమి? ఆతఁ డాతనికంటెఁ బూర్వుఁడు గానేరఁడఁట! ఇఁక "గ్రంథభావనుబట్టి గ్రంథకర్తకాలమును నిర్ణయించుట సత్సంప్రదాయమే" అనుదాని కర్థమేమో!

ఈసందర్భముల నన్నిటిని బట్టి యాలోచింపఁగా, ఉదాహరణపూర్వకము లగుప్రబలహేతువు లెన్నియున్నను సరే, నన్నియభట్టుకంటె నన్నిచోడరాజు ప్రాచీనుఁ డని యంగీకరించుట మాత్రము రామయ్యపంతులుగారి కిష్టము లేనట్లు స్పష్ట మగుచున్నది గాని వారు వ్రాసినవ్యాసమునందు, ఆతఁడు నన్నియభట్టునకుఁ దరువాతివాఁ డని చెప్పుటకుఁదగిన ప్రబల ప్రమాణములు మాత్రము గానవచ్చుట లేదు.

కావున, "కవితాప్రాచీనతనుబట్టి చోడకవిరాజు నన్నియభట్టారకునికంటెఁ బ్రాచీనుఁడైయుండు ననుదానికి రామయ్యపంతులుగారు చెప్పినసమాధానము సమంజసముగ లేదనుట విస్పష్టము.

## ఉపసంహారము.

వివాదాస్పదములై యిప్పటివఱకు లభించియుండు శాసనాద్యాధారములకంటె,—ఆంధ్రకుమారసంభవకావ్యమును మొదటినుండియుఁ జివరవఱకును సమబుద్ధితోఁ బరీక్షించువారికి,—విస్పష్టములై యెప్పటికిని గానంబడుచుండు—పురాతనపదప్రయోగవైచిత్ర్యంబులు, పూర్వరచనాలంకారవిశేషంబులు, ప్రాచీనార్థాన్వయవైలక్షణ్యంబులు, సనాతనచ్ఛందోవ్యాకరణవిశేషంబులు మొదలగునవి యెన్నియో నన్నిచోడకవి నన్నియభట్టకవికంటెఁ బ్రాచీనుఁ డని తోఁపింపక మానవు.

రామయ్యపంతులుగారు సవిమర్శముగఁ బ్రకటించిన పెద్ద చెఱికూరిశాసనమునుబట్టి చూచినను, వారు విమర్శింపక విడిచిన (నాచే సహేతుకముగఁ జూపఁబడిన) ప్రాచీనప్రయోగాదులఁబట్టి చూచినను నన్నిచోడమహారాజకవి నన్నియభట్టారకకవికంటెఁ బూర్వుఁ డనియే సిద్ధాంత మగుచున్నది.

నడకుదుటి వీరరాజు.

# పెద్దచెఱుకూరిశాసనము—నన్నిచోడకవికాలము.

అంతేకంటె మంచియాధారము లభించువఱకు నైన పెద్దచెఱుకూరుశాసనము నన్నిచోడకవి కాలము నిర్ణయించుటకు పనికివచ్చు నని వీరరాజుపంతులుగా రొప్పుకొనుట సంతోషకరము. దీనిచే నేతద్విషయకచర్చ చేయువారికి వృథాయాసము కొంతవఱకుఁ దగ్గినది. కాని, యింతటితో వీరరాజుగారికిని నాకును, గవికాలమును గూర్చిన యభిప్రాయభేదము పోలేదు. నేను జేసిన శాసనసమన్వయములో రెండుదోషములు కల్పించి యాదోషములఁ దీసివైచిన చో నాశాసనము తమమతము నే దృఢపఱుచుచున్న దని వీరరాజుగారు వాదించుచున్నారు. ఈవిషయము లేవి యనఁగా:—

1. శాసనమును బట్టి నేను సాధించిన వంశవృక్షము సరిగా లే దని యొకటి.

2. కాలము లెక్కించునపుడు తరమునకు 25 సంవత్సరములు గ్రహించుట తప్పని యొకటి.

ముందు వంశవృక్షముసంగతి యెత్తుకొందము. కవినన్నిచోడునకును శాసనకర్త యగుమల్లిదేవునకును నడుమను నాలుగుతరము లున్న వని నే నభిప్రాయపడినాను. ఐదుతరము లని బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులుగా రీ పత్రికయొక్క వర్తమానసంపుటము మొదటిసంచికలోఁ బ్రకటించిన వ్యాసమున సాధించినారు. శాసనము తిరిగి పరిశీలింపఁగా శాస్త్రులుగారియభిప్రాయమే సరి యని నాకుఁ దోఁచుచున్నది.

"తస్మా న్నన్నిచోడ స్తదాత్మజః" యనుచోట నేను "తదాత్మజః" అను పదమును "నన్నిచోడ" పదమునకు విశేషణము చేసి వెనుక కన్వయించినాను. అంతేకంటె "నూరభూప" యనునుత్తరపదముతో నన్వయించుటే సమంజస మని తోఁచుచున్నది. ఇట్లన్వయించినచో శాస్త్రులుగారు వ్రాసినట్లు నన్నిచోడునకు మల్లిదేవునకు నడుమ నైదుతరము లేర్పడుచున్నవి. దీనిలోఁ దృష్టి నొందక వీరరాజుగా రింకొకతరము పెంచఁ దలంచి "తస్యానుజో ఘటంకార' యనుశాసనపాఠమును "తస్యాత్మజో ఘటంకార" యని మార్చినారు. ఇట్లు మార్చుటకుఁ గారణము "అనుజ" పాఠము శాసనోక్తవంశక్రమమునకు విరుద్ధ మని యఁట. ఈవిషయమును చర్చించుచు వీరరాజుగారు "పైశ్లోకముల

# పెద్దచెఱుకూరిశాసనము.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక-సంపుటము ౧౮. సంచిక-౨. పుట-౯౮.





నాయొక్కనిదియే కాదు. ప్రభాకరశాస్త్రులుగారిపాఠము నిదియే. రాజకీయ శాసనవిమర్శకులపాఠము గూడ నిదియే. మూలమును చూచిన యందఱిపాఠము నిదియే కాక మఱియొకటిగా నుండదు. వీరరాజుగారు మాత్ర మిది మూలపాఠము కా దనఁ గలరా? కావుననే కాఁబోలు "అనుజ" శబ్దము లేఖనప్రమాదజనిత మై యుండు నని వీరరాజుగా రొకచోట వ్రాసినారు. కవిప్రమాద మని కూడ నేల వ్రాయ లేదో? ఉన్నదాని నన్వయింపవలసిన వారము గాని మనము మూలపాఠము తప్పని దిద్దుటకు మన కధికారము లేదు. అట్లు చేసినచో మూలచ్ఛేదమే యగును గదా. అప్పుడు విచారణీయాంశమే యుండదు.

మూలపాఠ మెట్లున్నదో యందఱకుఁ దెలియుటకై శాసనములోని వంశావతారవర్ణనభాగమునకుఁ బ్రతిబింబ మీవ్యాసమున కనుబంధముగాఁ బ్రకటించుచున్నాను. కాఁబట్టి "అనుజ" కు బదులుగా "ఆత్మజ" యని యుండవలయు నని వీరరాజుగారు చేయువాదము చెల్లఁదగినది గాదు. నన్నిచోడునకును మల్లిదేవునకు నడుమ నైదే తరములు. నేను దొలుత వ్రాసినదానికంటె నొక్కతరము పెఱిగినది. అయినను ప్రభాకరశాస్త్రులుగారు చూపిన హేతువు చేత నన్నిచోడునికాలనిర్ణయము నేను జేసిన దే నిలిచినది. పెద్దచెఱకూరిశాసనము శ. స. 1140 ప్రాంతమందుఁ బుట్టియుండవచ్చు నని నేను దొలుత వ్రాసినాను. మల్లిదేవునిశాసనము వేఱొకటి ప్రకటించి దానివలన నారాజు శ. స. 1221 వఱకు సజీవుఁ డై యుండిన ట్లాశాసనము చెప్పుచున్నది గావునను, కాకతీయగణపతిదేవుఁడు. శ. స. 1182 వఱకు రాజ్యము చేసియుండెను గావునను, పెద్దచెఱకూరిశాసనము నేను జెప్పినదానికంటె రమారమి 30 సంవత్సరము లిటీవలఁ బుట్టియుండవచ్చు ననియు, నిది యొకతరముకాలముకంటెఁ దక్కువ కాదు గనుక నేను చేసినకాలనిర్ణయము నిలిచిన దనియు ప్రభాకరశాస్త్రులుగారు వ్రాసినది సహేతుక మని వేఱె చెప్ప నక్కఱలేదు.

వీరరాజుగారి రెండవవాదము—కాలనిర్ణయము చేయునప్పుడు తరమునకు 40 ది సంవత్సరములు గ్రహింపవలయును గాని 25 సంవత్సరములు గ్రహింపఁగూడ దని. తరమునకు 40 సంవత్సరము లనుటకు వీరికి ముఖ్యప్రమాణము కీర్తిశేషు లగుకందుకూరి వీరేశలింగముపంతులుగారి కవిజీవితములు. ఆగ్రంథమును నేను బరిశీలింపలేదు. పరిశీలించుట కంతయావశ్యకతయును లేదు. వీరేశలింగముపంతులుగారు "సుప్రసిద్ధకవిచరిత్రకారు" లగుదురు గాని చారిత్రక

విషయవిమర్శన మాయన కభిమానవిషయము గాదు. ఆయన యిప్పుడు సజీవుఁడై యుండినచోఁ దాను జేసిన కాలనిర్ణయ మన్నిచోటుల నిర్దుష్ట మని యాయన ప్రతిపాదించు నని నాకుఁ దోఁపదు. కవిజీవితములలో మొదటిభాగము రెండవసారి ముద్రింపించి ప్రకటించి నప్పుడే యందుఁ గూడ దోషము లున్న వనియు వానిని సవరింపవలసి యుండు ననియు వీరేశలింగముపంతులుగారు తమముఖ్యమిత్రు లొకరితో నన్నట్లు నేను విని యున్నాను. అది యెట్లున్నను చారిత్రికవిషయవిమర్శనమే ప్రధానముగాఁ బని చేయు చున్న విద్వాంసుల యభిప్రాయముకంటె వీరేశలింగముగారి యభిప్రాయ మీపట్టున బలవత్తర ప్రమాణ మనుటకు వీలుపడదు గదా! అట్టివిద్వాంసుల ముగ్గుర యభిప్రాయముల నేను తెలిసికొన్నాను. ఆయభిప్రాయముల నీక్రింద నుదాహరించు చున్నాను*

---

*RAO BAHADUR H. KRISHNASASTRI GARU, B. A.,
*Government Epigraphist for India.*
OOTACAMUND.
5-8-1925.

* * * * * * * *

"As to the main purpose of your letter the average period of a generation for purposes of historical calculation we also take 25 as you propose doing, but in one case, I remember Dr. Fleet taking it as 30—"

(ముప్పదియేండ్లయినను వీరరాజు పంతులుగారికి లాభింపదుగదా.)

C. R. KRISHNAMACHARIAR AVL, B. A.
*Asst: to the Asst: Archaeological Superintendent, Epigraphy.*
*Southern Circle, Madras.*
6-8-1925.

"The departmental practice has been to give an average of 25 years for each king in constructing dynastic geneologies."

V. RANGACHRIAR AVL, M. A., L. T.
*Lecturer in History, Arts College, Rajahmundry.*

I generally take average generation, for purposes of historical research to be 25 years. I believe that the late Dr. Vincent Smith did the same."

అవియు నాయభిప్రాయము నొక్కటియే యయినవి. ఆసంప్రదాయము నెఱిఁగియే నేను దరమునకు 25 సంవత్సరములు గ్రహించినాను. వీరిమాట కూడ నటుంచి యింకొక్కదారి త్రొక్కుదము. పూర్వచాళుక్యరాజులశాసనములు పెక్కింటిలో నాయారాజుల రాజ్యకాలము సవిస్తరముగాఁ దెలుపఁబడినది. రాజరాజు నందంపూడిశాసనము (ఆ. సా. ప. పత్రిక, ప్రథమసంపుటము) లో వంశకర్త యైనకుబ్జవిష్ణువర్ధనుఁడు మొదలుకొని రాజనరేంద్రుని వఱకును గల రాజులకాల మియ్యఁబడినది.

ఈకాలము లన్నియుఁ గలిసి 414 సంవత్సరములు 6 మాసములు 7 దినములయినది. ఇందు 27 సంవత్సరములు దేశ మరాజకముగా నుండిన కాలము. ఇది యొకరాజు రాజ్యకాలముగా గ్రహించిన యెడల రాజులు 25 రగుదురు. ఇం దవ్యవహితపూర్వరాజులకుఁ గొడుకులు గాక సోదరాదిసంబంధము గలవారు 7-గు రున్నారు. వీరిని విడిచి మిగిలిన 18 గురకు నీకాలము పంచిపెట్టినచో నొక్కొక్కరాజునకు 23 సంవత్సరములు 10 దినములు వచ్చును. ఇది నాయంకెను మించలేదు గదా! రాజనరేంద్రునికాలము 44 సం॥ కూడఁ జేర్చుకొన్నచో రాజున కొక్కనికి 24 సంవత్సరములు, నొకమాసము, 18 దినములు వచ్చును. ఇదిగూడ 25 సంవత్సరములకుఁ దక్కువయే గదా! ఇట్టి ప్రబలాధారముల నిరాకరించి వీరేశలింగముగారి వ్రాఁతయే పరమప్రమాణముగాఁ గొనుట యుచితమేమో విద్వల్లోకము నిర్ణయించునుగాక—

విప్రనారాయణచరిత్రపీఠికలో నేను తరమునకు 40 సంవత్సరములకాలము గ్రహించియు నంతకంటె నెక్కువకాలము కూడ నుండవచ్చు నని సూచించియు నిప్పుడు తరమునకు 25 సంవత్సరములు మాత్రమె యుండవలయు నని వ్రాయుట పూర్వపువ్రాఁతకు విరుద్ధ మనియుఁ గావున నిప్పటి నావాదము సరియయినది కా దనియు వీరరాజుపంతులుగారింకొక యుక్తిని జెప్పుచున్నారు. మాటవరుస కట్టివిరోధ మున్న దనుకొన్నను, అది ప్రస్తుతవాదము నెట్టు లబద్ధపఱుచునో తెలియదు. పూర్వపువాదమునకు నిప్పటివాదమునకును గలభేద మిప్పటివాదమే తప్పని యెట్లు స్థాపింపఁ జాలును? పూర్వపువాదమే తప్పు కాఁగూడదా? వాదముయొక్క బలాబలములు దానికిఁ గలయాధారములను బట్టియే కదా నిర్ణయింపవలయును!

ఇంతకును నీపరస్పరవిరోధమన్నది వీరరాజుగారు కల్పించుకొన్నది గాని నిజము గాదు. విప్రనారాయణచరిత్రపీఠికకు బ్ర॥ శ్రీ మల్లాది సూర్యనారాయణ

శాస్త్రులుగారును నేనును గర్తలము, కవికాలము నిర్ణయించుననసరమున నాతని తాత క్రీ. స. 1500 ప్రాంతమందును కొడుకు క్రీ. స. 1623 ప్రాంతమందును ఉన్నట్లు కొన్నిశాసనములవలన నూహింపఁ దగియున్నదని చెప్పి, వారిరువురకు నంతయంతిర ముండవచ్చునా లేదా యని శంకించుకొని "మల్లనతాతకును, మల్లనకుమారునకును 120 సంవత్సరయంతర ముండును. తరమునకు 30 సంవత్సరములకు పైగాను 40 సంవత్సరములకు లోపుగాను నయినది. ఇది యసంభావ్యము గాదు. అని వ్రాసితిమి. ఇది యుదాహరించి వీరరాజుగారు "దీనిని బట్టి తరమునకు 40 సం॥ లైనది గదా!" అని వ్రాసినారు. అయినది. నిజమే. కాని యది నాప్రస్తుతవాదమును బాధింపఁ జాలదు ఇద్దఱుపురుషుల కాలమును వారికిఁ గలసంబంధమును దెలియఁగా నంతయంతరము వారిరువురనడుమ నుండవచ్చునా కూడదా యని ప్రశ్నించుకొని యుండుట యసంభవము కాదని నిశ్చయించినాము. తరమునకు 40 సంవత్సరములే కాదు. 60, 70, 80 సంవత్సరములకాలము కూడ నసంభవము కాదు. అసంభవ మని నే నెన్నఁడు నన లేదు. కాని ప్రస్తుతవిషయ మట్టిది కాదు. నన్నిచోడునకును రెండవమల్లిదేవునకును గలసంబంధము మనకుఁ దెలియును. మల్లిదేవునికాలము గూడఁ దెలియును. ఈ రెండాధారములను బట్టి నన్నిచోడుని కాలము లెక్కింపవలసియున్నది. ఇట్టిసందర్భమున సత్సంప్రదాయానుసారముగా సగటునఁ దరమున కెన్నియేండ్లేర్పడునో యన్నియేండ్లే గ్రహింపవలెను. కాని వానికంటె నధికము గాని యల్పముగాని గ్రహింపరాదు. కొంతమంది నూఱేండ్లు బ్రదుకవచ్చును. కొందఱు శిశువులుగానే చచ్చుటయుఁ గలదు. రెండును అసంభవములు కావు గాని యొకపురుషుని కాలమును బట్టి యతనికిఁ గొన్నితరముల దూరమువాఁడైనవేఱొకని కాలము నిర్ణయించునపుడు సగటు (average) పురుషాంతరప్రమాణమునే తీసికొనుట యుచితము. ఉచితమే కాదు, విధి. నన్నిచోడుని వంశమువారందఱు సహస్రమాసజీవు లయియుండిన నుండవచ్చును గాని యట్లుండి రనుటకాధారములు లేనప్పుడు సగటు కాలమునే గ్రహింపవలెను. పూర్వచాళుక్యరాజులలో నొకఁడు 48 యేండ్లు రాజ్యముచేసెను. కావున తరమునకు 48 సంవత్సరముల కాల మసంభవము కాదు. కాదుగదా యని ఇంకొకరాజు కాలము గణించునపుడు తరమునకు 48 సంవత్సరముల లెక్కను లెక్కింపవచ్చునా? ఆ చాళుక్యవంశమందే యొకఁ డాఱునెలలే రాజ్యముచేసెను. మఱియొకఁ డొకనెలమాత్రమే చేసెను. ఇంకొకఁ డేడుదినములు మాత్రమే చేసెను. కాఁబట్టి

యందలి కాలమునుబట్టి గణింపఁగాఁ దేలిన సగటుకాల మేదియో దానినే గ్రహింపవలెను గాని యసంభవము కాదనుకారణమున నధికకాలమును గ్రహింపరాదు. ఈవిషయ మింతకంటెఁ బ్రపంచించుట యనవసరము.

విప్రనారాయణచరిత్రపీఠిక నాధారము చేసికొనియే వీరరాజుగారింకొక యాక్షేప మిట్లు చేయుచున్నారు.

"చెదలవాడమల్లనకవి క్రీ. శ. 1585 సంవత్సరమున నున్నట్లు తద్గ్రంథపీఠికయందు రామయ్యపంతులు గారు వ్రాసియున్నారు. (చూ. 5. పుట.) ఎఱ్ఱాప్రెగడకును మల్లనకవికిని నాలుగుతరములు భేదమున్నట్లు వారే చూపినారు. (చూ. 3. పుట.) ఎఱ్ఱాప్రగడ క్రీ. శ. 1350 సం॥ వరకు జీవించియుండెను. (చూ. కవిచ. ప్ర. భా. 173. పుట.) కావున నెఱ్ఱనమల్లనలకుఁ గలభేదము నాలుగుతరములలో 235 సంవత్సరముల గడచినవి. అనఁగా నొక్కొక్కతరమునకు రమారమి 60 యేండ్లలెక్క యైనది" అని. ఈయపసిద్ధాంతము మల్లనకును ఎఱ్ఱాప్రెగడకు నడుమ నాలుగుతరము లున్నవనుకొనుట చేతఁ గలిగినది. సుప్రసిద్ధుఁడగు నెఱ్ఱాప్రెగడ మనకవికి "వృద్ధప్రపితామహుఁ" డని మేము వ్రాసిన దానిని బట్టి వీరరాజుగారి కీయభిప్రాయము గలిగినట్లు కనఁబడుచున్నది. వృద్ధప్రపితామహుఁ డనఁగామా తాత్పర్యము ప్రపితామహునికంటెఁ బూర్వుఁడని కాని ప్రపితామహుని తండ్రియని కాదు. ఎఱ్ఱన తనప్రపితామహుని తండ్రియని కవియే చెప్పుకొనియుండ లేదు. మేమెట్లు చెప్పఁగలము? "నాదువంశకర్త ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గడను నుతింపబ్రహ్మకును దరంబె" యనికవి చెప్పెను. దీనిపై మేము "అని భారతారణ్యపర్వశేషాదులను దెలిఁగించిన యెఱ్ఱాప్రెగడను వర్ణించి యాతనికి తాను సాక్షాత్పౌత్రుఁడు గాక యాతనివంశములోని వాఁడను నర్థమును సూచించు 'చిన్నిమనుమఁడ' నను విశేషణమును దన కుపయోగించుకొని తనవంశములో మిక్కిలిపూర్వుఁడను నభిప్రాయమును సూచించు "వంశకర్త" యనువిశేషణము నెఱ్ఱాప్రెగడ కుపయోగించె" నని వ్రాసినాము. ఇట్లువ్రాసి, వెంటనె మల్లన కెఱ్ఱాప్రెగడ ప్రపితామహుని తండ్రి యని యెట్లు చెప్పఁగలము?

విప్రనారాయణచరిత్రమునందుఁ జేర్కొనఁబడిన యెఱ్ఱాప్రెగడయు భాగవతషష్ఠస్కంధములో నేర్చూరి సింగన తనవంశస్థునిగా వర్ణించిన యెఱ్ఱనప్రెగ్గడయు వేఱువేఱు పురుషులుగాని యొక్కరుగా రని నిశ్చయించి యాసందర్భమున "ఒకవేళ, ఎఱ్ఱాప్రెగడవంశమునందు భాగవతషష్ఠస్కంధకర్తకుఁ దరు

వాత నీమల్లకవి తెల్పినవంశావళిలోని మల్లన యెఱ్ఱనాదులు పుట్టియుండి రేమో యని యెవ్వరయినను హాస్యాస్పదమయిన యుక్తిచెప్పవచ్చును, గాని యిది యెఱ్ఱాప్రెగడయొక్క సువిదితకాలమునకే హానితెచ్చును." అనివ్రాసి యుంటిమి. దీనినొక సూత్రముగాఁ గొని దానిపై నెంతో వ్యాఖ్యానము వ్రాసి వీరరాజుగారు "ఐనను అట్లు (తరమునకు ముప్పదియేండ్లలెక్కను) గణించుటగూడ హాస్యాస్పదమును, సువిదితకాలభంగకరమును నగునని రామయ్యపంతులుగారి యభిప్రాయమైనట్లు విస్పష్టమగుచున్నది గదా!" యని వ్రాసినారు. వీరరాజుగారువ్రాసినది వారివ్యాఖ్యానముగాని నాయభిప్రాయముగాదు. ఆవ్యాఖ్యానమును విస్తరించి విమర్శించుట యప్రస్తుతప్రశంస యగునని మానినాఁడను.

నన్నిచోడుఁడు నన్నయభట్టుకంటెఁ బూర్వుఁ డని పెద్దచెఱుకూరిశాసనము తెలుపదనియు, చోడుఁడు నన్నయభట్టుకంటెఁ దరువాతివాఁ డనుటయే యుచితమనియు నీచర్చయొక్క పర్యవసానము.

కుమారసంభవములోని కొన్నిప్రయోగముల నెత్తిచూపి వానినిబట్టి, నన్నిచోడుఁడు నన్నయభట్టునకంటెఁ బ్రాచీనుఁడనివీరరాజుపంతులుగా రొక సిద్ధాంతము చేసిరి. ముద్రింపఁబడిన కుమారసంభవప్రతిలోని పాఠములన్నియుఁ గవిప్రయుక్తము లయినట్లు కనఁబడదనియు, నదియెట్లున్నను వీరరాజుగారు తీసి కొన్న ప్రయోగములు కవి ప్రాచీనుఁ డనుటకే చాలునుగాని నన్నయకంటెఁ బ్రాచీనుఁ డనిచెప్పఁజాలవనియుఁ జెప్పి యాప్రయోగములఁ బ్రత్యేకముగా విమర్శించుట మానినాఁడను. అట్లు మానివేయుట సమంజసము గాలేదని వీరరాజుగా రొకయాక్షేపము చేసినారు. ఆకొఱంత యిప్పుడు ప్రభాకరశాస్త్రులుగారు తీర్చినారు. శాస్త్రులుగారి యభిప్రాయము నాయభిప్రాయమునొక్కటే. కావున నావిషయమయి నేను జెప్పవలసినవి యంతగా లేవు. ఒకటిరెండుమాటలు మాత్రము వ్రాసి ముగించెదను. నన్నిచోడుఁడు ముప్పదియారలంకారములు మాత్రమే గ్రహించినాఁ డనియు, పదియవశతాబ్ది వాఁడైన దండివఱకు నీయలంకారసంఖ్య నిలిచియుండి క్రమక్రమముగాఁ బెఱిగినదనియుఁ గావున నన్నిచోడకవి పదియవశతాబ్దిలోపువాఁడు గావలయు ననియు వీరరాజుగారు వ్రాసినారు. విన్నకోట పెద్దన్నకూడ ముప్పదియాఱలంకారములనె గ్రహించెను.

శా. కావ్యశ్రీల నలంకరించుట నలంకారంబులై చాలఁ శ్రో
తవ్యార్థంబుల నొప్పి పూర్వకృతసందర్భంబులం బెక్కులు

ద్భావ్యప్రోక్తుల నాలుముప్పదియునై భాసిల్లువానిం గవి
స్తవ్యాద్యుక్తపదస్వరూపములుగా సాగింతుశాస్త్రక్రియన్
(కావ్యాలంకారచూడామణి, పంచమోల్లాసము రెండవపద్యము.)

కావునఁ బెద్దనయుఁ బదియవశతాబ్దికి ముందువాఁడు కావలయునుగదా? అది యసంభవము. కావున "నన్నిచోడుఁడొక ప్రాచీనాలంకారికుని మతమును బట్టి యట్లుచెప్పినాఁ" డని ప్రభాకరశాస్త్రులుగారు వ్రాసినదే సరిగానున్నది.

అథర్వణాచార్యుఁడు నన్నిచోడుని నుద్దేశించి "మడియఁడె యగునని తొల్లి టెంకణాదిత్యుఁ డనిన్" అనిచెప్పె ననియు, తొల్లియను పదమును "కొన్ని వందలయేండ్లకు ముందున్నకాలమును దెలుపు పదముగా మనవారు ప్రయోగింతు" రనియుఁ, గావున నన్నిచోడుఁ డథర్వణునికంటెఁ గొన్నివందలసంవత్సరములు ముందువాఁడు గానుండవలయు ననియు, వీరరాజుగారు వ్రాసినారు. "తొల్లి" శబ్దము కేవలభూతకాలవాచకముగాని కాలప్రమాణమును జెప్పునది గాదని చెప్పి ప్రభాకరశాస్త్రులుగా రొకపద్యముప్రమాణముగా నుదాహరించినారు. శాస్త్రులుగారి వాదమును దృఢపఱుచు మఱికొన్నిపద్యములఁ గూడ నుదాహరించుచున్నాను.

1. "రురుం డట్లు చేయుదు నని తనయాయుష్యంబునం దర్ధం బక్కన్యకిచ్చిన నక్కోమలిదొల్లిటికంటె నకధికశృంగారసమన్వితయైవిషనిర్ముక్తయయ్యె"
భార. ఆది. ౧-౧౫౦.

2. "నారాయణుండు వారి క,వారితజవసత్త్వములు ధ్రువంబుగ నిచ్చెన్। వాసును దొల్లిటికంటె న,పారప్రారంభులై రపరిమితశక్తిన్॥"
భార. ఆది. ౨-౧౪.

3. "నీవు నాకవమానంబు దలంచితివి నీయొద్దనుండ నొల్లఁ దొల్లి నీకు నాచేసిన సమయంబునిట్టిద."
భార. ఆది. ౨-౧౬౦.

ఇది జరత్కారుఁడు భార్యతోనన్నమాట.

4. "సమరమునగెల్చి యొరురా,జ్యము గొనియును సుజనుఁ డిట్టులాడఁడు సిరిజూ,దమునఁగొని రజ్జులేటికి, సమయంబరుదెంచెఁ దొంటిచందము గలదే"
భార. విరా. ౪-౧౫౩.

5. "పాండవవీరులం గలన బాహుబలంబున నోర్చియే సము। ద్దండత నీవుదొల్లి ద్రుపదక్షితిపాత్మజఁ గొల్చులోనికిం। దెండని పుచ్చితి."
భార. విరా. ౪-౧౫౪.

"దేవదూతంగని శుక్రుండు వక్రంబై యుండఱ కెడసాచ్చి" యని కుమారసంభవములోనున్నది యనియు, నీయర్థమున నీశబ్దము నన్నయకుఁ బూర్వము పుట్టిన శాసనములలో మాత్రమే కనపడుచున్న దనియుఁ గావునఁ నన్నిచోడుఁడు నన్నయభట్టుకంటెఁ బూర్వుఁ డనియు వీరరాజుగారివాద మిం కొకటి. 1426-వ శకసంవత్సరమున వీరనరసింహమహారాయల మహాప్రధాని "సాళువతిమ్మయ్యంగారు" గుత్తిసీమలోను, పెన్నబడిసీమలోను పెండ్లిసుంకములు విడిచిపెట్టినట్లు అనంతపురమండలములో తాడపత్రిగ్రామమునందు రామేశ్వరస్వామి యాలయములో నున్నయొకశిలాశాసనము చివర—"యీధర్మానకు యెవ్వరు వక్రమై యెవ్వరుతప్పిస్తే వారు వారణాశిలోపల మాతృపితృవధ" యని యున్నది.

(South Indian Inscriptions Vol. No. 803.)

నన్నిచోడునివక్రము నీశాసనపువక్రము నొక్కటియే యని నాయభిప్రాయము.

జయంతి రామయ్య.

---

# నన్నిచోడకవిరాజశిఖామణి కాలనిర్ణయ విమర్శనము.*

(నడకుదుటి వీరరాజు పంతులుగారు)

---

ప్రాజ్యవసుంధరా రాజ్యమునకె కాక, ప్రపూజ్యకవితా సామ్రాజ్యమునకును పట్టభద్రుఁడై, యనల్పప్రాభవముతో, నసామాన్యవైదుష్యముతో, ప్రవిమలదివ్యకీర్తులను ప్రశస్తకావ్యమూర్తులను నిహమున వెలయించి, పరమున శాశ్వతానందము ననుభవించుచున్న మహారాజకవిరాజశిఖామణి నన్నిచోడదేవుఁడు, ఆంధ్రమహాజనులకుఁ జిరస్మరణీయుఁ డగుచున్నాఁడు. అత్యుత్తమము లగునాతని కావ్యములలో నొక్కటియగు కుమారసంభవమహాకావ్యము (పురుగుల పాలుగాకుండ) నత్యంతశ్రమము మెయి సంపాదించి, యెల్లరకు సుకరమగు నట్లొనర్చిన భాషాభిమాన్యగ్రగణ్యులు బ్ర॥ శ్రీ॥ మానవల్లి రామకృష్ణకవి ఎం. ఏ. గారును నాంధ్రలోకమున కభినందనీయు లగుచున్నారు.

ఆంధ్రప్రపంచమున నేఁటివఱకు మనచే నెఱుఁగఁబడుచున్న రాజకవులలో నన్నిచోడమహారాజు ప్రథముఁడు. ఒక్క రాజకవి బృందమునకే కాక యిప్పటికి మనకు దెలియుచున్న యాంధ్రకవిబృందమునకెల్ల మొదటి వాఁడను నది వివాదాస్పదమైన విషయము.

కవికులగోత్రాదులు!—నన్నిచోడకవి సూర్యవంశపురాజు, కరికాలచోడని సంతతివాఁడు. కాశ్యపగోత్రుఁడు. "మేటిపాకనాఁ డిరువదియొక్క వేయిటికధీశుఁ"డగు 'చోడబల్లి' కిని, ఆతని యగ్రమహిషియు, హైహయరాజపుత్రియు నగు 'శ్రీపతి' కిని దనూజుఁడు. ఈతఁడు తన దేశములోని ప్రజలు మిక్కిలియు సుఖించునట్లు కడుఁ జల్లఁగఁ బరిపాలన మొనర్చి 'శ్రీరామాదుల కెనవచ్చు సుశ్లోకధనుఁ' డయ్యెను.

కవిగ్రంథములు:—అతివిస్తీర్ణమైన 'పాకనాఁటి' దొరతనము నెఱపుచు నిమ్మహారాజు కవిరాజై, కుమారసంభవము, కలావిలాసము మొదలగు నాంధ్రకావ్యముల నొనర్చెను. సంస్కృత గ్రంథము లేవేని రచించెనేమో తెలియరాదు

---

*కొవ్వూరులో మే 28, 29, 30 తేదీలయందు జరిగిన సప్తమాంధ్ర సారస్వత మహాసభయందు నీవ్యాసము జదువఁబడినది. (శారదాపత్రికనుండి యుద్ధృతము. రక్తాక్షిఆషాఢము, 1924 జూలై.)

కాలము:—చోడకవికుమారసంభవమును బ్రకటించిన శ్రీ మా. రామకృష్ణకవిగారు, తద్గ్రంథప్రథమ ద్వితీయ భాగపీఠికలయందు నన్నిచోడుఁడు నన్నియభట్టారకునకు నూఱేండ్లు ముందున్నవాఁడని కొన్ని హేతువులను జూపుచు వ్రాసిరి. వీరికాలనిర్ణయము సరియైనది గాదని పలువురు విద్యార్థికులు పలువిధముల విమర్శించిరి:-కొందఱు శాసనాధారములను జూపిరి; కొందఱు ఇతరాధారములను జూపిరి. అందు కొందఱు నన్నియకు సమకాలికుఁ డనిరి; కొందఱు తిక్కనకు సమీపస్థుఁ డనిరి; కొందఱు నన్నయతిక్కనలకు నడిమివాఁడనిరి; కొందఱు పాల్కురికి సోమనాథుని కిటీవలివాఁడనిరి—ఇట్లే యనేకుల నేకవిధముల వ్రాసిరి.

ఎవరెట్లు వ్రాసినను వారిసిద్ధాంతములయం దొక్కటియు నిర్బాధకమైన యొక్క యాధారముతో నైనఁ గూడినదిగా నుండ లేదు. ఇట్లనుటకునాకుఁ గానవచ్చిన హేతువులలోఁ గొన్నిటి నిచ్చట సంగ్రహముగ వ్రాయుచున్నాను. (మ॥ శ్రీ॥ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు, తమయాంధ్రుల చరిత్రము ద్వితీయభాగమున నన్నిచోడనికాలమును గూర్చి చర్చించిరిగాని, కడపటఁ దమ గ్రంథము నవతారికయందు "ఇవ్విషయమున నా కేసిద్ధాంతమును స్థిరపడి యుండ లేదు. ఇంకను బరిశీలింపవలసియున్నదని నాయభిప్రాయము" అని వ్రాసిరి. కావున వీరినిర్ణయము దేలలేదనుట స్పష్టము.)

I. ఆంధ్రపత్రిక (1911 సం.) వత్సరాది సంచికయందు మ॥ శ్రీ॥ బుఱ్ఱా శేషగిరిరావుపంతులు (ఎం. ఏ.) గారు చోడకవికాలమును గూర్చి విమర్శించుచు నాతఁడు నన్నియకుఁ దరువాతివాఁడనియు, క్రీ॥ శ॥ పండ్రెండవశతాబ్దినడుమ నున్నాఁడనియు సిద్ధాంతీకరించిరి. అందు వారు చూపిన ముఖ్య హేతువులివి.

(అ) " (కుమారసంభవ) గ్రంథారంభమున మంగళశ్లోకమాంధ్రమున వ్రాయఁబడినది. తదనంతరము దేవతాస్తుతి, సుకవిస్తుతి, కుకవినింద, షష్ఠ్యంతములు, సప్తసంతానములలోఁ గావ్యోత్కృష్టతయుఁ జెప్పఁబడినవి. ఇదంతయు నన్నయ - కిటీవలివారికవితారీతి యని భారతము చదివినవారికి సులభముగాఁ దెలియును." అని వ్రాసిరి.

కాలనిర్ణయమున కిది యుక్తమగు కారణమయ్యేని, మంగళశ్లోక మేని లేని భాస్కరరామాయణ మీయన్నిటి కంటెను బ్రాచీనతమ మైనకావ్య మని చెప్పవలసియుండును. మంగళశ్లోకమును గీర్వాణభాషను వ్రాసినవారు మధ్యకవులలోను అధునికులలోను (శ్రీబిల్వేశ్వరీయ గ్రంథకర్త కొక్కొండ వేంకటరత్నము

పంతులుగారు) గలరు. దేవతాస్తుతియు, కవిస్తుతియు, నన్నియయుఁ గావించి ప్రబంధలక్షణము నెఱపినవాఁడు, (అవతారికఁ జూడుఁడు.) సుకవిస్తుతి సేయని వారు కుకవినింద సేయనివారు షష్ఠ్యంతములు వ్రాయనివారు కావ్యోత్పత్తి చెప్పనివారు తరువాతి కవులలోనుగలరు. (వివరణ మనావశ్యకము.) కావున మంగళశ్లోకాదులు పౌర్వాపర్యమును దెలుపఁజాలవు.

(క) పిమ్మట శేషగిరిరావుపంతులుగారు, "ఇది ప్రబంధము గావున నన్న యాదులమర్యాదలు దీనికిఁ బట్టవని కొందఱూహింపనచ్చును." అని తామే ప్రశ్నించుకొని, దాని కుత్తరముగా, "కవి ప్రబంధము వ్రాయసంకల్ప మెచ్చటను సూచింపలే"దనియు, "కావ్యము-కథ అనియే యాతఁడు వ్రాసినాఁ" డనియు వ్రాసినారు. ప్రథమాశ్వాసము, 48 పద్యమున,

ఉ. పా. "భంగిగ విస్తరించెదఁ <u>బ్రబంధము</u> సద్రసబంధురంబుగన్,,

అని కవియే వ్రాసికొన్నాఁడు. మఱియుఁ బ్రబంధలక్షణమగు 'అష్టాదశ వర్ణనాదికము'ను సూచించియే యున్నాఁడు. కావున నిది ప్రబంధమే.

(గ) మఱియు శ్రీ శేషగిరిరావు గారు, కవి కాలమును నిర్ధరించుటకై చోడరాజుల వంశవృక్షమును, కొన్ని శాసనములనునిచ్చిరి. అవి యివి;—

"(A) కరికాల
|
మహిమాన
|
౧ కరికాల(II) — ౨ దాసవర్మ

కరికాల(II)
|
మల్లిదేవ
(పాకనాఁడిరువదియొక్క వేయిటికధీశుఁడు)

దాసవర్మ
|
త్రిభువనమల్లిదేవ
|
నన్నిచోడ, కన్నరచోడ, శ్రీచోడ

"(B) చోడశాసనములు (నెల్లూరు)

డి. 48 — బల్లిచోడ క్రీ.శ.1145
డి. 68 — బల్లయచోడ 1147
జీ 19-142 — త్రిభువనమల్లదేవచోడ. 1153,1148
డి. 49 — బల్లిచోడ 1166

పై (B) శాసనములలోని రాజులందరు నేకపురుషుఁడే యనిరి. ఏమన మననన్నిచోడకవి, తనతండ్రి 'చోడబల్లి' అని చెప్పియుండెను. కావునఁ గుమార

---

* నన్నియభట్టు పంచమవేదమును దెలుఁగుబాసకుఁ దెచ్చుచున్నాఁడు గావున, భక్తిచేతనో, భయముచేతనో నాందీశ్లోకమును దేవరాజ భాషయందు (రాజున కన్వయించునట్లు) వ్రాసి కాని ముఖమునఁ జేర్చియున్నాఁడు.

సంభవములోని చోడబల్లియే పైబల్లిచోడఁడనియు ఆబల్లిచోడఁడే మల్లిచోడఁడనియు ఆమల్లిచోడఁడే మల్లిదేవుఁడనియు, ఆమల్లిదేవుఁడే త్రిభువనమల్లదేవచోడఁడనియు సంబంధముఁ గలపిరి! ఏమన, ఇందు త్రిభువనమల్లదేవచోడనికే కాని(పై)బల్లిచోడనికి నన్నిచోడఁ డనుకొడుకు లేఁడు! (చూ. వంశ వృ. శాఖ) ఇన్నిమార్పులు చేసినను వీరికి సంతృప్తి కలుగలేదు. కావుననే—"ఈత్రిభువనమల్లదేవుఁడు నన్నిచోడుని తండ్రియే కాని పాకనాఁటియందిరువదియొక్కవేయిటి కధీశుఁడుగాడు. పాకనాఁటికధీశుఁడు (చూ. వంశ వృ. ౧ శాఖ) మల్లిదేవున్నాఁడు గాని వానికి నన్నిచోడఁడను పుత్త్రుఁడు లేఁడు. ఈ చిక్కు శాసనమును పరిశోధకులే విప్ప సమర్థులు" అని వ్రాసిరి.*

పైరీతిని వ్రాసియు "పై సందేహములన్నిటికి వల్లెయని సమాధానము చెప్పుకొన్నను నన్నిచోడునికాలము 1150-వ సం॥ ప్రాంతమందే యగును." అని మరల వ్రాసిరి!

ఈవిధముగ శేషగిరిరావుపంతులుగారు నిర్ణయించుకొన్న కవికాలము వారికే తృప్తికరముగా నుండ లేదనుట స్పష్టము.

II. శ్రీ. శే. వీరేశలింగముపంతులుగారు, తమ కవిచరిత్రము (కడపటి కూర్పు)న నన్నిచోడనికాలమునుగూర్చి విశేషముగఁ జర్చించిరి. కాని వారి చర్చయంతయుఁ బై శేషగిరిరావుగారు చూపిన శాసనములమీఁదనే యాధారపడియుండుటచే, నదియు నాధారరహితమేయైనది. అయినను పై శేషగిరిరావుగారి వ్రాఁతలకుఁ బోషకములుగాఁ గొన్ని యుక్తులను పంతులుగారు కవులచరిత్రమున వ్రాసియున్నారు. కావున వానినిమాత్ర మిచ్చటఁ జూపుచున్నాను.

అక్షరసామ్య మేమియునులేని బల్లిచోడ త్రిభువనమల్లదేవచోడ మహారాజులిద్దఱు నేకపురుషుఁడనుట కేవలము విరుద్ధముగా నుండుటచే పంతులువారావైరుద్ధ్యము నిట్లు సమర్థింపఁజూచిరి.

క్రీ॥ శ॥ 1145, 1166-వ సం॥ లలో బల్లిచోడుఁడు రాజ్యముచేయుచుండఁగా నడుమను (చూ. పై శాసనములు) 1158-వ సం॥ నందు త్రిభువన మల్లదేవుఁడు మఱియొకఁడు రాజ్యముచేయుట సాధారణముగా సంభవింపదు గావునను ఒక్క యక్షరమైనను హెచ్చుతగ్గులేక మూఁడుశాసనములలోను బిరు

---

* వీరు కోరినట్లే యీచిక్కును శాసనపరిశోధకులే (1915-16 సం రిపోర్టునుబంపి) చల్లఁగా విప్పివేసిరి. దానివలన పైబల్లిచోడఁడును త్రిభువనమల్లచోడఁడును ఏకపురుషుఁడు గారని తేలినది. దీనివివరము ముందుచర్చయందు గానఁగును.

దావళి యొక్కటిగానే యున్నదిగావునను ఈ శాసనములలోఁ బేర్కొనఁబడిన బల్లిచోడుఁడును త్రిభువనమల్లదేవచోడుఁడును (శేషగిరిరావుగారనినట్లు) ఏక పురుషుఁడనుట సముచితముగానే కనఁబడుచున్నది." అని వ్రాసిరి. (చూ. ఈ మడు- కవిచ. 191, 192-వ పుటలు.)

పై సిద్ధాంతము నిట్లు పూర్వపక్షము చేయవచ్చును:—

(a) బల్లిచోడని పదభ్రష్టునిఁ జేసి త్రిభువనమల్లదేవచోడుఁడు రాజ్యము చేయుచుండఁగా, వానిని సింహాసనమునుండి తొలఁగించి మరల నా బల్లిచోడఁడే పరిపాలించియుండవచ్చును. (b) బల్లిచోడని యనంతరము త్రి॥ మ॥ చోడుఁడును వానియనంతరము రెండవ బల్లిచోడుఁడును పాలించి యుండవచ్చును. (c) అనేక కారణములచే నాలుగేండ్లలోనే నలువురురాజులు రాజ్యమునకు రావచ్చును. (d) వారిరువురును భిన్నరాష్ట్రాధిపతులై (దేవదర్శనమునకువచ్చి) వేఱువేఱు శాసనములను వ్రాయించియుండవచ్చును. ఇదే యాథియని ముందు తెలియఁగలదు.) (e) అనేకచోడరాజుల శాసనములలోని బిరుదు లొక్కతీరు ననే యున్నవి. అంతమాత్రమున వారందఱు నేకపురుషులు గానేరరు. కావున పైయుక్తి సెల్లదు.

మఱియు బల్లిచోడని నొక్కసారిగా త్రిభువనమల్లదేవచోడనిఁ జేసి వేయుట యుక్తముగ నుండ లేదనుసందేహము పంతులవారిని వదలనే లేదు! (చూ. కవిచ. 193-వ పుట) అయినను వారు త్రిభువనమల్లదేవ, త్రి. మల్లబల్లిదేవ, త్రి. మల్లబల్లిదేవ, త్రి. మల్లబల్లి చోడ, ఇత్యాదినామములతోఁ గ్రమక్రమముగ నచ్చుటచ్చుట మార్చుచుఁ దుదకు వానిని త్రిభువనమల్లచోడబల్లిని జేసివేసిరి! ఏల! మనచోడకవి తనతండ్రి 'చోడబల్లి' అని చెప్పినాఁడు గావున!

పైరీతి నెన్నివిధముల మార్చుచువచ్చినను 'త్రిభువనమల్ల' శబ్దముమాత్రము పోదువునను వదలకుండుటచే, దానిని దొలఁగించుటకై శ్రీపంతులవారు,

"ఈచోడబల్లికి 'త్రిభువనమల్లచోడబల్లి' (?) యనుపేరు వచ్చుటకు, ఆతఁడు త్రిభువనమల్ల చాళుక్యచక్రవర్తి పాలన కాలములో నుండుట కారణమని మనము సులభముగా, దెలిసికొనవచ్చును."

అని వ్రాసిరికాని త్రిభువనమల్లదేవచోడనికాలములో నున్నచాళుక్య చక్రవర్తి 'జగదేకమల్లుఁడు' గాని 'త్రిభువనమల్లుఁడు' గానే కాఁడు! కావున నీ సమర్థనము మొదలే సరిపడలేదు.

ప్రస్తుత వీరేశలింగముగారు "1915–16-వ సం॥ దక్షిణమండల శాసన కార్యనివేదనపత్రిక (Epigraphical Report of the Southern circle for the Year 1915-16.) యీవిషయమునఁ గొంతతోడుపడుచున్నది" అని వ్రాసిరి. గ్రహణసౌలభ్యమునకై ఆశాసనములందున్నవారిలోఁ బ్రస్తుతవిషయమునకుఁ గావలసినవారిని, వారి కాలములను నిచ్చటఁ జూపుచున్నాను:—

శాసనసంఖ్య. 327
|
1. త్రిభువనమల్ల దేవచోడ
|
భార్య మాబల
కన్నరచోడ (జ్యేష్ఠుఁడు) నన్నిచోడ (కనిష్ఠుఁడు)
☞ (క్రీ. శ. 1115)

శాసనసంఖ్య. 363
|
2. త్రిభువన మల్ల దేవచోడ (క్రీ.శ.1137-53)
|
భార్య మాచల
నన్నిచోడ (జ్యేష్ఠుఁడు) కన్నరదేవచోడ (కనిష్ఠుఁడు)
☞ (క్రీ. శ. 1153 సం)

పై రెండుశాసనములలోనున్న త్రిభువనమల్లదేవ చోడరాజులిద్దఱు నేక నామముగల భిన్నపురుషులని యెల్లవిధముల స్పష్టముగఁ గానవచ్చుచుండ, పంతులవారు వారిద్దఱు నొక్కఁడే యనిరి! కాని మరల నీక్రింది సందేహమును వెలిపుచ్చిరి:—

"త్రిభువన మల్లచోడుని పుత్త్రులలో నన్నెచోడుని జ్యేష్ఠునిఁగా కొన్ని శాసనములు చెప్పుచున్నను, మఱికొన్ని శాసనములు కన్నరచోడుని జ్యేష్ఠునిఁగను, నన్నెచోడుని గనిష్ఠునిఁగను జెప్పుచున్నవి."

ఇట్లు వ్రాసియు నీసందిగ్ధ విషయము నట్టె వదలిపెట్టి పై త్రిభువనమల్ల దేవు లిద్దఱు నేకపురుషుఁడే యనుచు వానినే చోడబల్లిని జేసివేసిరి! ఇంతకంటె విరుద్ధమగువిషయము వేఱొకఁ డుండఁబోదు. ఏమన, ఒకతండ్రి బిడ్డలలో జ్యేష్ఠుఁ డొకప్పుడు కనిష్ఠుఁడుగను కనిష్ఠుఁ డొకప్పుడు (అన్నను చిన్నను చేసి వేసి) జ్యేష్ఠుఁడుగను ఏవిధమునను గాఁజాలరు. (మనలో తాతలపేళ్లు మనుమలకుఁ బెట్టుచువచ్చుచుండు నాచారము గలదు గావున నొక్కవంశము లోనే యేకనామములు గలపురుషులు పలువురు పలుమాఱు వచ్చుచుండుట కటస్థించుచుండును.) చూ. పైశాసనములు.

మఱియుఁ బైశాసనములను బట్టియే వీరేశలింగము పంతులుగారు, "అప్పుడు (క్రీ. శ. 1115 సం.) త్రిభువనమల్లచోడుని జ్యేష్ఠపుత్త్రుఁడు రాజ్యము చేయుచుండెను" అని కవిచరిత్రము 194 పుటయందు స్పష్టముగ వ్రాసి

యుండియు, క్రీ. శ. 1153 సం. వఱకు రాజ్యము చేయుచున్న (చూ. వెను కటి జీ. 19 శాసనమును, పై 363 శాసనమును.) త్రిభువనమల్లచోడఁడును, 1115 సం. మున నే రాజ్యమునకువచ్చిన కన్నరచోడని తండ్రి త్రిభువలమల్ల దేవచోడఁడును ఒక్కఁడే యనుట, పూర్వోత్తరవిరోధమును గొనితెచ్చుచు, మఱింతవింతను గొల్పుచున్నది! *

ఇంత స్పష్టముగఁ గానవచ్చుచున్న పైవిషయముల నింతపొరఁబాటుగా (పంతులవారు) గ్రహించుటకుఁ గారణ మేమనఁగా పైశాసనములలో కన్నర చోడని (1115 సం) శాసనమునందు కాలాముఖమల్లికార్జునుఁడు పేర్కొనఁ బడియున్నాఁడు. మనకవి నన్నెచోడఁడు తనకుమారసంభవమును జంగమ మల్లికార్జునునకుఁ గృతియిచ్చి యుండెను గావున నీమల్లికార్జునుడే యామల్లి కార్జునుఁడని వారుతలంచిరి. మల్లికార్జున నామముగల యోగులు పలువురున్నా రని పంతులవారింతకుమున్ను వ్రాసియే యున్నారు. (చూ. కవిచ. 186 పు.) అయినను ఈయిద్దఱు మల్లికార్జునులు నొక్కఁడే యనిరి. దానికొఱకే పై మార్పు లన్నియుఁ జేయఁబడినవి. ఇంతయుఁ జేసినను, పైనన్నిచోడని శాసన మున నీమల్లికార్జునుని పేరు లేనే లేదు! మఱియుఁ జోడబల్లిగా మార్పఁబడిన త్రి. మ. చోడనికిఁ గాని, వానిపుత్త్రునికిఁ గాని పాకనాఁటిదొరతనము లేనేలేదు!

పైమార్పులే కాక, మన నన్నిచోడకవి, పైశాసనములలోని నన్నిచోడఁడే యనుట కింకొక మార్పును సయితము చేయవలసి వచ్చినది. అదియేదన, పైని జూపఁబడిన శాసనములలో మొదటి దానియందు, కన్నరచోడాదుల తల్లి 'మాచల' యని (మాబల) యనియు, రెండవదానియందు నన్నిచోడాదుల తల్లి 'మాచల' యని యుఁ జెక్కఁబడియున్నది. ఇట్లుండుట పంతులవారికి మరల సందేహమును గలిగింపఁగా, వారు, "ప్రథమశాసనమునఁ జెప్పఁబడినట్లు నన్నెచోడుని తల్లి 'మా మాబలదేవి' యగుట సత్యమా? రెండవదానియందుఁ జెప్పఁబడినట్లు

*పై 363 సంఖ్యగల శాసనములోని త్రిభువన మల్లదేవ చోడఁడును, వెనుకటి జీ. 19 సంఖ్యగల (1153 సం.) శాససములోని త్రి. మ. చోడఁడును ఏక పురుషుఁడే యనియు, ఆతఁడు 1153 సం. వఱకే గాని వెనుకటి డి 49 సంఖ్యగల శాసనము వ్రాయించిన వల్లిచోడని కాలము (1166) వఱకు లేనేలేఁడనియు స్పష్టమగుచున్నది. దానంజేసి యాబల్లి చోడఁడును, ఆ (యా) త్రిభువన మల్లదేవచోడఁడును ఒక్కఁడే యని వ్రాసిన బి. శేషగిరిరావు గారి నిర్ణయమును దానిని సమర్థింపఁ జూచిన వీరేశలింగము పంతులవారి నిర్ణయమును పై 1915 - 16 సం. రిపోర్టు వలనఁ జల్లఁగా విడిపోయినవి.

చలదేవి' యగుట సత్యమా?'' అని తామే ప్రశ్నించుకొని 'రెండును సత్యములే' అని యుత్తరముచు జెప్పికొనిరి! ఏల? మన నన్నిచోడకవి, తనతల్లి 'శ్రీసతి' యని చెప్పికొన్నాఁడు! దానికి శ్రీపంతులుగారు,

''మా+అబల–మా=శ్రీ (లక్ష్మి), అబల=సతి (స్త్రీ). మాబల=శ్రీసతి
మా+అచల–మా=శ్రీ, అచల=(పర్వతపుత్రి) సతి, మాచల=శ్రీసతి.''

అని పురాణార్థమును జెప్పిరి! మఱియుఁ గవి తాను జేయుచున్న వృత్తమునందు దన తల్లిపేరు చేర్చుటకై గణసౌలభ్యార్థ మిట్లు మార్చియుండు నని యొక యుక్తినిగూడఁ జెప్పిరి. ఇదెట్టి యుక్తియో వేఱుగ విమర్శింప నక్కఱలేదు. ఎట్టివాఁడును దన తలిదండ్రులనామ మిముడునట్టి వృత్తమును రచింపఁ దలపెట్టునే కాని తాను వ్రాయు వృత్తమునఁ దలిదండ్రుల నామములఁ దూర్చుటకు వారిపేళ్ళను మార్పనేరఁడు. సుబ్రహ్మణ్యము కొడుకు వెంకయ్య గణసౌలభ్యముకై తన తండ్రిని నాగరాజని వ్రాసికొనఁడు; అట్లే తన తల్లి ప్రభావతియైయుండ, నామెను రుచిమతి యని కాని, దీప్తిమతి యని కాని మార్ప సాహసింపఁడు. ఇంతకును నన్నిచోడఁడు చెప్పిన యావృత్తము 'మాచల (మాబల) దేవి అను నామమునకుఁ జోటీయనిది గాదు!

ఆరీతి నర్థము సెప్పియు, నట్లు చెప్పుట యుక్తముగా లేదని తోఁచుటచేఁ గాఁబోలు వీరేశలింగము పంతులుగారు, 'ఇది తృప్తికరమైన సమాధానము కాకపోయినను, ఇంతకంటె మంచి యాధారము దొరకనప్పుడు దీనినే సరిపెట్టుకొనవలెను' అని వ్రాసిరి. ఏల సరిపెట్టుకొనవలెను? 12 శతాబ్ది నడుమ నున్న యొక శాసనములోని నన్నిచోడఁడను పేరుగలవాఁడె మనకవి యని యనుకొనవలెనా? వానితండ్రి త్రిభువనమల్ల దేవచోడని ముందుగా బల్లిచోడఁ డనుకొని, తరువాతఁ జోడబల్లి యనుకొన వలెనా? కాలాముఖ మల్లికార్జునుని కొఱకు నన్నదమ్ముల జ్యేష్ఠత్వ కనిష్ఠత్వములను తలక్రిందులు చేయ వలెనా? తల్లి 'మాబల' యైనను సరియే, 'మాచల' యైనను సరియే 'శ్రీసతి' యని యర్థము చెప్పుకొనవలెనా? పిమ్మట వీని నన్నిటిని సరిపెట్టుకొనవలెనా? చోడరాజుల శాసనములలో శ్రీదేవి శ్రియాదేవి మొదలగు నామములతో వారి భార్యలు మొదలగు వారు పలువురు గానవచ్చుచుండఁగా, కవి తనతల్లి 'శ్రీసతి' యని స్పష్టముగ వ్రాసి యుండఁగా వైరిత్రిని సరిపెట్టుకొమ్మనుట సమంజసముగాదు.

**III.** శ్రీ-శే. తం. తేవప్పెరుమాళ్లయ్యగారు, ఆం. సా. పరిషత్పత్రిక 1 సంపు 1 సంచికయందు నన్నిచోడని గూర్చి గావించిన కాలనిర్ణయచర్చ

యంతయు పై వ్రాతలమీఁద నాధారపడినదే కావున దానిని వేఱుగఁ జర్చింప నక్కఱలేదు. వీరుచూపిన ప్రయోగసామ్యముల కుత్తరము మఱియొక చోటఁ జూపఁబడును.

**IV.** ఆంధ్రపత్రిక దుందుభి 1922-వ సంవత్సరాది సంచికయందు శ్రీ బండారు తమ్మయ్యగారు, పాల్కురికి సోమనాథునిఁ గూర్చి వ్రాసిన తమ వ్యాసమున, నన్నిచోడఁడు పాల్కురికి సోమనాథు ననేకస్థలంబుల ననుకరించినాఁడనియు, ద్విపదలలో నున్నవర్ణనములను, భావములను ననుకరించి పద్యములలోఁ గూర్చుకొనుట స్వాభావికమును, సాధారణమునగునే కాని పద్యములలో నున్నవానిని ద్విపదలలోఁ గూర్చుకొనుట యస్వాభావికమును నసాధారణమునుగాక మానదనియు, ఏకథయైనను ముందు ద్విపద కావ్యములలో వెలసి యుండఁగా దానినే తరువాతి కవులు పద్యములఁ గూర్చుచువచ్చిరనియుఁ గావున నన్నిచోడఁడు పాల్కురికి సోమనాథునకుఁ దరువాతివాఁడై యుండుననియు వ్రాసి యుద్దఱ గ్రంథములనుండియు నీక్రిందిపోలిక పద్యముల నిచ్చిరి:—

*"ద్విపద. బసవలింగము కృతిపతియునై కృతియు, రసికతఁ బండితారాధ్యచరిత్ర। యనఁ బాల్కురికి సోమనార్యుఁడు సుకవి, యనఁ గథాశ్రోత సూరామాత్యుఁడట్టె। కృతిపతి కృతికవి కృతికథాశ్రోత, క్షితిఁ జెప్ప నొప్పచే శివభక్తసభల." (పా. సోమన.)

*"చ. రఘుకుల శేఖరుండు కవి రాజశిఖామణి కావ్యకర్త, స
త్కవి, భువి నన్నిచోడఁడఁట కావ్యము దివ్యకథం గుమారసం
భవ మట సత్కథాధిపతి భవ్యుఁడు జంగమ మల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁడట్టివినంగొనియాడఁ జెల్లదే!" (నన్నిచోడఁడు.)

సుప్రసిద్ధుఁడగు గౌరనమంత్రి నవనాథోపాఖ్యానమను పద్యకావ్యము నుండియే ఆ పేరి ద్విపదకావ్యమును వ్రాసినాఁడు. కావున పద్యము ద్విపద నుండియె పుట్టవలయుననను నియమము సెల్లదు. గురురాజకవియును సతేఁడు పండితారాధ్యచరిత్రమును పాల్కురికి సోమనాథుని ద్విపద కావ్యమునుండియే సంస్కృత భాషలోనికిఁ బరివర్తించినాఁడు. సంస్కృతమునుండి యాంధ్రములోనికిఁ దెచ్చుట స్వాభావికము గాని యాంధ్రమునుండి సంస్కృతమునకుఁ దెచ్చుట యస్వాభావిక మనఁజెల్లదు. మఱియు గురురాజు సోమునికిఁ బూర్వుఁడనియు ననరాదు. (చూ. శివతత్త్వ సారపీఠిక)

---

*ఈ ద్విపదకుఁగాని, యీ పద్యమునకుఁగాని ప్రధానాధారము శ్రీహర్షుని రత్నావళ్యాది దృశ్యకావ్యములలోని ,, శ్రీహర్షో నిపుణః కవిః —,, ఇత్యాది శ్లోకమై యుండును.

అతి విస్తరమేల? పాల్కురికి సోముఁడు పద్యములను ద్విపదలుగాఁ బరివర్తించుటయందు గడుంగడు నేర్పరియని పండితారాధ్యుని శివతత్త్వసారము ప్రబలమైన సాక్ష్యము నిచ్చుచున్నది చూడుఁడు:—

కం. నిర్వచనీయము లేక యు, నిర్వచనీయంబు గలదె? నిర్వచనీయా
నిర్వచనీయోత్పత్తిన, సర్వాద్వైతంబు సెడదె సర్వానందా!

(శివతత్త్వసారము.)

"ద్విపద. నెక్కొన నిర్వచనీయంబు లేక, నిక్క మనిర్వచనీయంబు గలదె
నిర్వచనీయ మనిర్వచనీయ, మర్సి నా నద్వైత మొగి రెంటికగునె?"

(ఆరాధ్య)

"కం. కలదనపోపక లేదని, పలుకంగ నేరకయు మూకబధిరులక్రియ ని
మ్ముల నద్వైతులు దమలో, పల నగతురు భువనభిన్నభావమున శివా."

(శివతత్త్వసారము.)

"ద్విపద. కల దనంగా నోపకయును లేదనియు, బలుక నేరక మూక బధిరులక్రియను । బరగు భువన భిన్నభావంబుఁజూచి, యరయంగ నద్వైత మనగఁ - - - - - _"

ఇట్లే శివతత్త్వసారములోని నూఱులకొలఁది పద్యములు ద్విపదలుగా మార్పఁబడిన విషయము, ఆ రెండు గ్రంథములును బరీక్షించువారికి విశదమగును. పాల్కురికి సోమన పండితారాధ్యునికిఁ దరువాతివాఁడని యారాధ్యచరిత్రమే చెప్పుచున్నది కావునఁ బద్యమునుండి ద్విపద పుట్టుట యస్వాభావికమును నసాధారణమున్నై యుండ లేదు.

పండితారాధ్యునిపద్యములను ద్విపదలుగా మార్చినట్లే శివభక్తుఁడును కవిరాజశిఖామణియు నగు నన్నిచోడనియందుండు భక్తిగౌరవములచే నాతని పద్యముల ననేకముల సోమనాథుఁడు సంగ్రహించి ద్విపదలుగాఁ గూర్చుకొన్నాఁడు. మచ్చునకొకటి,

"సీ. నేలయు నింగియుఁ దాలములు వాయింప నెండమావులఁ బట్ట, బండతలయు
మ్రోఁకాలు ముడివెట్ట, రోఁకటఁ జిగురులుగోయఁ జట్టాత్రిపైఁ గ్రుంక, నిడుపు
లేక చిత్రము వ్రాయ, నాకాశమున దాస, రములిడ, నుంచుగుంచములఁ గొలున
నేనుఁ గువ్వురు డోమ, తా నారఁ గొన, గాలిగంటిడ, నినుమునఁ గట్టు దాల్ప.
గీ. నీరినడుము ద్రెంప, నేలఁ దెన్నుండిచే వెల్పఁ, గలియఁ ద్రచ్చి వెన్న గొనఁగఁ
గడవ నేర్పుగలిగి కందువ మానెడ్డె కతిగొంటులైన యత్తగంతు."

“ద్విపద” నెట్టన నేలకు నింగికి నూత్న-పట్టమో, కాళ్లకు బట్టతలలకు। ముడి నెట్టఁ, దననీశఁ గడపంగఁ బొఱి-నడి నెంత మావుల కడగళ్లుగట్ట। ఆ నార యోఁటునఁ, జట్రాతిపైఁ గ్రుంక-నేనుఁగు పురుషోను నిసుము ద్రాక్షేపనఁ। బాయక రెండుగాఁ బొత్తెమునీస-ప్రేయఁ బుజ్జిన్న గోరోయనియుష్ట। లలిగొన దెసలు తాళములు వాయింపఁ-జెంగుగు రోఁకటఁ జిగురులుగోయఁ। గలి వెన్నపుచ్చ, గొండిలు దొంతిఁ బేర్చ-నిలమంచు గుంచాసఁగోలున - - - ” (పాల్కు సోమన.)

కావునఁ బద్యద్విపదల పరివర్తనాదులను బట్టి కవికాలనిర్ణయముచేయ వలను పడదు. మఱియు నన్నిచోడని పదముల పట్టికయుఁ బాల్కురికి సోము నాథుని పదముల పట్టికయుఁ బరీక్షించువారికి సోమనాథునికిఁ జోడఁడు గడుం గడుఁ బూర్వుఁడనియు దోచును.

V. శ్రీయుతకట్టమంచి రామలింగారెడ్డిగారు (ఎం. ఏ.) రాజరాజ నరేంద్రపట్టాభిషేకసంచికయందు, “నన్నెచోడకవిశిఖామణి నన్నయకు తరు వాతివాఁడు. కాలమును బట్టి చూచిన సమీపస్థుఁడు. వాని కాలనిర్ణయమున కితరాధారములు గలవు.” అని వ్రాసిరే కాని యయ్యాధారములను జూపిన వారుగారు, *మఱియు నా సంచికయందే,

“క. మును మార్గకవిత లోకం, బున వెలయఁగ దేశకవితఁ బుట్టించి తెనుం
గునునిలిపిరంధ్రవిషయం, బునఁ జనఁ “జాళుక్యరాజు” మొదలుగఁ బలువుర్.

“అను కుమారసంభవములోని పద్యమున నున్న చాళుక్యరాజు రాజ రాజుగాని యింకొకఁడనుట యసాధ్యమైన కార్యము” అని శ్రీ రెడ్డిగారు వ్రా సిరి గాని యేల యసాధ్యమో తెలిపినవారుగారు.

పైపద్యములోని ‘పుట్టించి’ అనుదానికి ‘నూతనసృష్టికిఁ దెచ్చి’ అని వారే యర్థము చెప్పిరి. అంతకుముందుగా నున్న వాక్యములయందు,

“నన్నయభట్టునకుఁ బూర్వము ఆంధ్రమునఁ బద్యరచన యుండెను. ఛం దస్సు ఉండెను. నన్నయ్యకుఁ బూర్వము కవిత్వమే లేదనియు, ఆతఁడు మొట్ట మొదట లక్షణముల నిర్మించి, లక్ష్యములఁ దీర్చి వాఙ్మయమును సృష్టించె ననియు నమ్మువా రెవ్వరును ఈనాఁటికిఁ గానరారు - - - ”

అని వారే వ్రాసియున్నారు. ఇప్పుడు ‘నూతనసృష్టి’యన్నారు. ఇచ్చట సందర్భ మెట్లో యనుకొనన క్కఱలేకుండ, రాజరాజునాఁడు “ఆంధ్రకవిత్వము

*అయ్యాధారములను వీరు చూపియున్నచో విమర్శకుల పని యెంతో తేలికపడి యుండును. ఇప్పుడైన వానిం బ్రకటించి యాతని కాలమును నిర్ణయింతురుగాక యని కోరుచున్నాను.

(అనఁగా గోష్ఠగ్రంథముల రచన) సృష్టికి నచ్చె" నని వేఱొకచోఁ దనుభావ మును వెల్లడించినారు. 'దేశికవితఁబుట్టించి, అనుదానిలో నాయఁర్థము గాన రాదు

మఱియు 'నన్నిచోడఁడు నన్నయ్యకు సమీపస్థుఁ' డని వారే వ్రాసిరి గదా! 'చాళుక్యరాజు, రాజనరేంద్రుండే యగునాఁడు, ఆసమీపస్థులనడిమి దైన యీయల్పకాలములోనే "దేశికవిత పుట్టించి తెనుంగును నిలిపిన చాళుక్య రాజు మొదలుగఁ బలువు" రెందరు? వారెవ్వరు? రాజరాజునకుఁ బూర్వము ప్రసిద్ధులైన చాళుక్యరాజు లెందఱు లేరు? అక్కవితను వారేల పుట్టించియుండ రాదు? తరువాతి వారేల నిలిపియుండరాదు? శ్రీరెడ్డిగారు నచించిన యర్థమేమి యుఁ బొసఁగ లేదు. కావున వారు నిర్ణయించిన కవికాలమును సరిపడియుండ లేదు.

శ్రీ వీరేశలింగముగారును తమకవులచరిత్రమున "నన్నయ్యకుఁ బూ ర్వము తెలుఁగు గ్రంథములును 'తెలుఁగుకవులును లేక పోలేదు - - - అట్లు గాక యీనఱ కేమియుఁ బుస్తకములు లేనిపక్షమున నన్నికట్టుదిట్టములతో నంతిసిద్ధుష్టముగా, నూతనముగా గ్రంథరచన చేయుట నన్నయ్యభట్టునకుఁ గాని మరియెవ్వరికిఁ గాని సాధ్యముగాదు." ఇత్యాది వాక్యముల నచ్చటచ్చట వ్రాసియుండియు, నీనన్నిచోడకవిచరిత్రమున మాత్రము, పై 'మునుమార్గ కవిత' అను పద్యమున నున్న చాళుక్యరాజు నిర్బాధకముగా రాజనరేంద్రుఁడు గావచ్చును," అని వ్రాసిరి! పైచాళుక్యరాజు రాజనరేంద్రుఁడే యై, ఆతని కాలముననే దేశికవిత సృష్టింపఁబడి యుండెనేని, నన్నియకు మున్ను తెలుఁగు కవితయు, తెలుఁగు గ్రంథములు నెట్లుండ గలవు? ఈపూర్వోత్తర విరోధ మని వార్యముగా నున్నది!

ఇప్పట్టున మఱియొక చిత్రమును విశదపఱుప వలసి యున్నది. అదియే మన, పై "మునుమార్గ కవిత - - -" అను పద్యములోని నాలవ పాదము యొకటి పాఠమిది:—"సత్యాశ్రయుని దొట్టిచాళుక్యనృపుల్"

ఈ పాదమును జూచి నప్పుడే శ్రీ బుఱ్ఱా శేషగిరిరావు పంతులు (ఎం. ఏ.) గారు, "ఇందు చెప్పఁబడిన 'సత్యాశ్రయుఁడు' భారతమును రచింప నన్నయను ప్రోత్సాహపఱిచిన రాజరాజని యూహింపఁ దగు" అని వ్రాసిరి!

(ఏనామ మున్ననుసరే రాజ రాజే గానలయును గాఁబోలు!)

సత్యాశ్రయుఁడు రాజరాజగుటకు శేషగిరిరావు పంతులుగారు చూపిన యాధార మేమనఁగా, భారతమున 'సత్యాశ్రయకులతిలక' అని రాజరాజు

విషయమున వాడఁబడి యున్నదఁట! రఘుకులతిలకుఁడు రాముఁడగును గాని రఘువే రాముఁడు గానేరఁడు అట్లే సత్యాశ్రయకులతిలకుఁడు సత్యాశ్రయుఁడును గానేరఁడు!

**VI.** మఱి కొందఱు విమర్శకులు నన్నిచోడఁడు నన్నయభట్టారకునకు ననుకాలికుఁడని కొన్ని కారణములను జెప్పుచున్నారు. వానిలోఁ గొన్నిటి నిచ్చటఁ దెల్పెదను.

"(a) నెల్లూరి శాసనములలో డి. 48,49 సంఖ్యలు గల బల్లిచోడ మహారాజు వ్రాయించిన శాసనముల మొదట నున్న

"శ్లో. శ్రీమత్పొత్తపినన్నిచోడ తనయః శ్రీవేఙ్క భూపాలకః
తత్పుత్రోఽగిపదాచలాపహాపనిః కామక్షితీనాయకః
సూనః సూర్యకులాన్వయామ్బుధిశశీ శ్రీబల్లిభూపాలకః
గౌరీనాథపదాబ్జనన్దితగుణః సౌజన్యరత్నాకరః."

"అను శ్లోకమునఁ గీర్తింపఁబడిన పొత్తపి నన్నిచోడఁడే మనకవిరాజశిఖామణియై యుండును. శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుపంతులు గారును, వీరేశలింగము పంతులుగారును ఈ శాసనములను ఈశ్లోకములను, జూచియు, నీతని మనకవిగాఁ దలంపక ఎచ్చటనో పాకనాఁటి యధికారిగాని త్రిభువనమల్లదేవచోడని కొడుకు నన్నిచోడఁడను పేరుగలవాఁడే మనకవి యని సాధింపఁ జూచుట యసమంజసము. పొత్తపి చోడరాజుల బిరుదము లిట్లున్నవి:—

"స్వస్తి చరణసరోరుహవిహితవిలోచనత్రిలోచనప్రముఖాఖిలప్రిథి(పృథి?) వీశ్వరకారిత కావేరీతీర కరికాలకులరత్నప్రదీపాహితకుమారా (ర?) గజాంకుశ యొఱయూరిపురవరాధీశ్వరశూర్యవంశోద్భవ కాస్య(శ్య?)పగోత్ర తెంకణాదిత్య - - - - - - -"

"చ. - - - - - అ, చ్చెరువగు చున్న పొత్తపియచ (చె?) న్న గువీఁగ వాలిపాకనాంటిరువదియొక్క వేయిఁ జన నేలుచు - - -" (ఓపిలిసిద్ధి కొణిదెనశాస.)

ఈపైబిరుదములు మన చోడకవి తనకుమారసంభవమున వ్రాసికొన్న "ఒఱయూరి కధిపతిఁ, మిత్రాన్వయ శేఖరుఁడన్, కాశ్యపగోత్రుఁడఁ, తెంకణాదిత్యుండఁ, అనుబిరుదములకు సరిపోవు చున్నవి. కరికాలునిసంతతివాఁడ ననియు మనకవి చెప్పికొని యున్నాఁడు. పొత్తపి నన్నిచోడఁడు బల్లిభూపాలునకు ముత్తాత గావున నన్నయకు సమకాలికుఁ డగును. ఆంధ్రులచరిత్రము

ద్వితీయ భాగము 41 పుటలోని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి వ్రాతకూడ మావాదమును బోషించు చున్నది."

అని చెప్పి వారు దీని కుపోద్బలకముగ నొక కథ గలదని యీ క్రింది వృత్తాంతము జెప్పుచున్నారు:—

"నన్నియభట్టు మొదటి నివాసము వేఁగి దేశములోని 'తణుకు గ్రామము, అని యొక ప్రసిద్ధిగలదు. నన్నియకాలమున దీనికి 'తారకాపురము' (తారక పురము) అనునామ ముండెడి దని పెద్దలు చెప్పుదురు. తారకాసురుఁ డిచ్చ టనే రాజ్యము చేసె ననియు, ఇప్పుడు తణుకునకుఁ జేరువనున్న 'వేల్పూరే' దేవతలు విడిసిన స్థలమనియు, 'దేవదానవపుంత' యనఁబడునది దేవతలు, దాన వులు నడచిన మార్గమనియుఁ జిరకాలమునుండి యొక వాడుక పరంపరగా వచ్చుచున్నట్లు పెద్దలు వచింతురు. మఱియు నన్నియభట్టు స్వస్థల మగు (తణుకు) తారకపురమున యజ్ఞము చేసె ననియు, అచ్చట (యజ్ఞశాలకడ) నొక జమ్మిచెట్టు పూర్వముండెడి దనియు వృద్ధులు చెప్పుచుండెడివారని యొక జనశ్రుతి గలదు.*

"తరువాత నన్నియతన విద్యామహిమముచే రాజరాజ నరేంద్రుని దయకుఁ బాత్రుఁడై తణుకునకుఁ గొంత సమీపముననున్న రాజధానికిఁ (రాజ మహేంద్రవరమునకుఁ) బోయెనని చెప్పుదురు."

"నన్నియ భట్టారకుఁడు శబ్దానుశాసనుఁ డయ్యెనని మన మెఱుఁగు దుము. ఇక్కాలమున సుహృద్దీయాంగ్లేయాద్యన్యభాషాపదములు మన తెలుఁగుమాటలలోఁ గలసిపోయి వ్యవహరింపఁబడు చుండినట్లే, పూర్వకాల మున నఱవము, కన్నడము మొదలగు నితరభాషల పదములు లెక్కలేని వాంధ్రమున చేరిపోయి యప్పటివారిచే యథేచ్ఛముగ వాడుకొనఁబడు చుండె డివి. కవులును వానిని తమగ్రంథములయందు నిరంకుశముగఁ బ్రయోగించు చుండెడివారు.

"అప్పుడు రాజరాజుచే నెల్లవిధముల గౌరవింపఁ బడుచున్న నన్నియ మహాశయుఁడు, తనకు ముందున్న యాంధ్రగ్రంథములలోని పదప్రయోగ ములను గనుఁగొని, యనేకములగు నితరభాషాపదము లందుండుటఁ గాంచి, తనప్రభువుతోడను, తనతోడిపండితులతోడను నాలోచించి బహుభాషాకవి

*నన్నియనివాసము తణుకనియు, నచ్చటనాతఁడు యజ్ఞము చేసెననియు, పట్టుపట్ట సరస్వతీ సోమయాజి తనప్రభుచరిత్రమున వ్రాసియుండుటచే నీవృత్తాంతము సత్యమనుటకు సందేహములేదు.

శేఖరుఁ డగు నారాయణభట్టుసాహాయ్యమున శబ్దసంస్కార మొనర్చి యన్య భాషాపదములను ద్రోచివైచి గ్రంథరచనమున కారంభించెను. కావుననే దేశమునందంతటను సామాన్యమైయున్న సంస్కృతభాష యాతనిగ్రంథమున నాలుగింట మూఁడుపాళ్ళు గలది యయ్యెను. ఆ సంస్కారము నన్నిచోడాది కవీంద్రుల కిష్టము లేకపోయినది.

ఇప్పుడు గ్రామ్యగ్రాంథిక భాషావాదులకు పరస్పరము వివాదములు జరుగుచున్నట్లే యక్కాలమున నన్నియ యనుశాసనములనుగూర్చి రాజనరేంద్రాస్థానపండితులకు, చోడరాజ, పాశ్చాత్య చాళుక్యరాజ, సంస్థానపండితులతో వాదోపవాదములు జరిగియుండును. ఎట్టకేలకు నప్పుడు చక్రవర్తియైయున్న రాజనరేంద్రునియాస్థానపండితులకే విజయము చేకూరి యుండును.*

"నన్నియ చేసిన యాసంస్కారమున కిష్టపడకుండుటచేతనే నన్నిచోడఁ డచ్చటచ్చట, కాళిదాసాదులు దిఙ్నాగాదులంబోలె, నన్నియభట్టును (తారకపురనివాసిని) 'తాగకవి' యనుపేరితో నప్రకృతశ్లేష వచ్చునట్లు నిందించి యుండు నని తోఁచెడిని:—

గీ. "అన్యతారకవికృతుల నాదరించి, వెలయ సత్కవిబుధ గురుబలము నడసి
యొనర దైవజ్ఞునట్ల శుభోదయమున, దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరము గాఁగ."

కుమా. ప్ర. 31

క. "తారకవిరచితకృతియుం, దారకవిరచితసుకృతియుఁ దా నడఁగు సదా
చారకవిబుధాళికి సువి, చారకవిబుధాధినాథు షణ్ముఖుఁ గనినన్."

కుమా. ద్వి. భా. 518

కొందఱు విమర్శకులు చెప్పెడి పైకథలోని యాథార్థ్యమును భాషాపరిశోధకులు గనుఁగొందు రనుతలంపున దీని నుదాహరించితిని.

నన్నియ నన్నిచోడ కవీంద్రు లిద్దఱును సమకాలికు లనువారికి నయ్యది కొన్నియాధారము లాయిద్దఱి గ్రంథములయందును బ్రయోగసామ్యమును

* ఈ వాదోపవాదముల విజయమువలన (జైనబౌద్ధాది గ్రంథములు తద్భిన్నమతికర్తలచే గాల్పఁబడి నుంబోలె నప్పటి తెలుఁగుగ్రంథము లనేకములు నన్నియభట్టారకాదులచే దగ్ధము గావింపఁబడి యుండుననియు, నన్నియ, పూర్వగ్రంథములను గాల్పించె నను వాదుకకిదియే కారణమై యుండు ననియు, లేకున్నఁ, దరువాతికవుల కెవ్వరికిని లేని యీప్రతిష్ఠ నన్నయ కొక్కనికే వచ్చుటకుఁ గారణ మింకొకఁడు గానరాదనియు, కాలక్రమమున నాకథలు, అథర్వణాచార్యాది కవులగ్రంథములపై నారోపింపఁబడియుండు ననియు, ముఖ్యుఁడగుటచే నాతనిపేరే పైకి వచ్చె ననియు నీవిమర్శకు లనియెదరు.

జెంది కానంబడుచున్నవి. అట్టిప్రయోగములలోఁ గొన్ని సంగ్రహముగ నిచ్చటఁ జూపఁబడుచున్నవి:—

(అ) కర్తృపదద్విరుక్తి:—

నన్నియ—"వ....ఉరగులు దొఱఁగి నేలంబడి మూర్ఛవోయినం జూచి కద్రువ కడు నలిగి గరుడనిం బదరి యతిభక్తి నింద్రునారాధించి....యయ్యురగుల విగతపరితాపులం జేసి కద్రువ...." ఆది ప. ద్వి.

(వాక్యము పరిసమాప్తిఁ జెందకమున్నే 'కద్రువ' రెండుమాఱులు చెప్పఁబడినది.) నన్నిచోడఁడు—వ....అఖిల సురజ్యేష్ఠుఁడైన సురజ్యేష్ఠుండు కరకమలముకుళవిన్యస్తమస్తకుండైన సమస్తవేదస్తుతులం బ్రస్తుతించి చతుర్ముఖుండు పంచముఖున కభిముఖుండై.' కుమా. ప్ర భా. 224.

(ఇందు సురజ్యేష్ఠుఁడు, చతుర్ముఖుఁడు అను కర్తృపదములు ద్విరుక్తిం జెందినవి.) నన్నియ—వ - - - అమ్మునియు హోమధేనువుం గానక వనంబెల్లఁ గలయ రోసి యోగదృష్టింజూచి దానివసువులు గొనిపోక యెఱింగి,

గీ. మనుజయోనిఁ బుట్టుఁ డని వారికప్పుడు, గోప మడర మునియు శాపమిచ్చె."

ఆదిప. చ. 160.

(ఇందు 'మునియు' అనుపదము పునరుక్తమయ్యెను.)

నన్నిచో—"వ - - - తన్ను బలసినం గని యనలుఁ డనురాగంబున

క. కరలతలఁ బెనఁగి మైవడి, గురుకుచములుమీఁదఁ వ్రాలి కోర్కులు ముట్టన్
వరజఘనంబులఁ బొందుచు, సురతసుఖం బందె నాశుశుక్షణి ప్రీతిన్"

కుమా. ద్వి. భా. 399

(ఇందు ఏకవాక్యముననే 'అనలుఁడు, ఆశుశుక్షణి' అనుకర్తృపదములు ద్విరుక్తిం జెందివి.)

(క) అరుణ శబ్దము రుధిరవాచకము:—

నన్నియ-మ. పతదుర్వీధరధాతునిర్ఝరజలాభంబై మహాదేహని
ర్గతసాంద్రారుణపూర మొక్కమొగి నొల్కన్ - - -" (ఆదిప. ద్వి. 25 ప.)

నన్నిచోడఁడు—

చ. అరుణజలంబులాడి, తురగాజినవస్త్రము లర్థిఁ గట్టి, భీ
కరకరిదానకర్దమము గస్తురిగాఁగ నలంది - - - - - " కుమా. ద్వి. భా. 768.

(ఇందు 'అరుణ' శబ్దము రుధిరవాచకముగాఁ బ్రయోగింపఁబడియె.)

(గ.) ఏకదేశాన్వయము:—

నన్నియ—"వ - - - ఈయశ్వకర్ణరంధ్రధ్మానంబు సేయుమనిన"

ఆదిప. ప్ర. 110

"అమిత్త్రసుదభేది యొక్కరుఁడ యమ్మృగాన్వేషణభ్రమాకులితచిత్తుఁడై ..."
ఆదిప. ద్వి.

నన్నిచో— "వ. అని యనేకవిధరత్నశీకరాకరంబైన రత్నాకరాశేష విశేషంబులు ..."
కుమా. ప్ర. 121.

"సీ. రమణీయశృంగారరజతపర్వతము నా శోభిల్లు సిద్ధవిస్ఫూర్తిమూర్తి
అపర్వతాగ్రహేమైకశృంగంబు నా ......" కుమా. ప్ర. 2.

(ఇందు సిద్ధసమాసగతపదంబులతో వ్యస్తపదముల కన్వయము.)

(చ) అమహద్వాచకము మహద్వాచకముగఁ బ్రయుక్తమగుట:—

నన్నియ-
మ. వివిధోత్తుంగ ........ కాంచిరంత నెదురందత్తీరదేశంబునం
దవదాతాంబుజఫేనపుంజనిభు నయ్యశ్వోత్తముం దవ్వులన్" ఆదిప. ద్వి. 31.

నన్నిచో—
"క. ఆనాకపతిగజంబు మ, డాననుఁ గని వెఱచి పఱచె నది చోద్యమె పం
చాననున కోడు కరులు మ,డా ననవిపరీతగతి భయంపడకున్నే." కుమా. ద్వి.

(ఇందు. దిర్యగ్జంతువులు మహద్వాచకము లయ్యె.)

ఇట్టిప్రయోగసామ్యము లీ యుభయుల గ్రంథములయందును లెక్క లేనివి చూపట్టుచున్నవి. దానంజేసి యీయిద్దఱకును పూర్వమున నున్న తెలుఁగు కవిత యీతీరుననే యుండెడి దనియు, నప్పటియాంధ్రలక్షణగ్రంథములు వేఱ నియు, పిమ్మట నవి సంస్కరింపఁబడియుండుననియు నూహింప నగుచున్నది. కాని యీయిరువురిలో నెవ్వఁడుపూర్వుఁడో యీప్రయోగములు చెప్పఁజాలవు. పైవిమర్శకులు చెప్పినవృత్తాంతము నిజమేని, నన్నియభట్టు వృద్ధుఁడును, నన్ని చోడఁడు యువయునై యుండియుందు రని చెప్పవలయును. పైకథ భావివరిశో ధనము వలన సత్య మని నిర్ధారణ మగుదాఁక నిక్కాల నిర్ణయము నిలుప వలసి యుండును.

ఇఁక నన్నిచోడకవికాలమునుగూర్చి నాకుఁ దోఁచినవిషయముల నిచ్చట సంగ్రహముగఁ బ్రదర్శించుచున్నాను.

ఒకకవికాలమును నిశ్చయించుటకు నిరాక్షేపము లైనశాసనాదిదృష్టాం తము లెవ్వియు లభింపనినాఁడు, ఆతని కవిత్వమునుబట్టి యాతనికాలమును నిర్ణయింపవలసియుండు ననుట చారిత్రవేత్తలకు నూత్నవిషయముగాదు. ఇప్పు డద్దానింబట్టి యాతఁడెప్పటివాఁడై యుండునో కనుఁగొందము.

(1) గ్రంథసంపాదకులగు రామకృష్ణకవిగారును, చిలుకూరి వీరభద్రరావు పంతులుగారును వ్రాసిన "కుమారసంభవకావ్యమును సూక్ష్మదృష్టిని బరిశీలింతిమేని యందుల కవిత్వ మత్యంతప్రాచీనమని తోఁచును." అనువిషయమును కొంత యాలోచనమునకుఁ దేఁదగినదే.

(2) కుమారసంభవగ్రంథారంభమున— మూర్తిత్రయ, భాస్కర, గజానన, షణ్ముఖ, మార, గౌరీ, సరస్వతీ స్తోత్రములు వేఱ్వేఱు పద్యములఁ గావింపఁబడినవి. ఆంధ్రభారతము మొదట శ్లోకరూపమున నున్న త్రిమూర్తిస్తుతి రాజనరేంద్రునకన్వయించు నట్లొనర్చిన నన్నియభట్టు, చిరకాలమునుండి పరంపరగా వచ్చుచున్న యీపూర్వస్తోత్రపద్ధతిని విడిచిపెట్టలేక దానిని సంగ్రహించి యవతారికనడుమ,

"హరిహరరాజగజాననార్క-షడాస్యమారసరస్వతీ*
గిరిసుతాదికదేవతాతతికిన్నమస్కృతిఁ జేసి - - -"

అని సగముపద్యములో నందఱదేవతలను జేర్చి వారికందఱకు నొకటే నమస్కారముఁ గావించినట్లును, పిమ్మట నది క్రమక్రమముగా మారిపోయినట్లును గాననయ్యెడి.

(3) చోడకవి తనకావ్యము 'షట్త్రింశదలంకారాలంకృతం' బని వ్రాసికొనినదానింగూర్చి సంపాదకులు వ్రాసినది సమంజసముగానే యున్నది. పదియవశతాబ్దివాఁడైన దండివఱకు నీయలంకారసంఖ్య నిలిచి యుండి, తరువాత, క్రమక్రమముగాఁ బెరుఁగుచు, పంద్రెండవ శతాబ్దివాఁడైన మమ్మటునినాఁటికి ఱువదిదాఁక వృద్ధియైనట్లు గానఁబడుచున్నది. కావున నిదియు నాతఁడు పురాతనకవి యనుటకుఁ గొంత తోడు పడుచున్నది.

(4) అట్లువోలె, పగిదివోలె, కరణివోలె, మాడ్కివోలె, భంగివోలె, ఇత్యాది (పురాతన) ప్రయోగము లిక్కవి గ్రంథమున లెక్కకు మిక్కిలి

---

* ఇంతదనుక నేఁ జూచినభారతపుఁ బ్రతులలో నిచ్చోట 'మాతృ' అనుపాఠము గానవచ్చుచున్నది. ఈ మాతృశబ్దమునకు 'బ్రాహ్మ్యాదిసప్తమాతృక' లని యొకరును, 'లక్ష్మి' యని యొకరును ప్రసిద్ధపండితు లర్థము వ్రాసిరి. ఇట్టిద్వ్యర్థము గల మాతృశబ్దముతో సరస్వతి గిరిసుతలను జేర్చి, హరిహరరాజ, అనుభర్తృపాఠక్రమమునకు భంగము గలుగునట్లు కవి ప్రయోగించినాఁడనుటకంటె, పైనన్నిచోడని స్తోత్రవిధానమునుబట్టి, 'మార' అనియే యాతఁడు వ్రాసియుండుననియు, నదియే యుక్తపాఠమనియుఁ దలఁచుట మేలని తోఁచెడి. కాలము క్రమించిన కొలఁది లేఖకు లీపద్ధతి నెఱుఁగక 'మార' అనుదానిని 'మాతృ' అని సవరించియుందురు. మాతృశబ్దమునకు లక్ష్మ్యర్థము నిఘంటువులయందే కాని ప్రయోగములయం దంతగా దాఁపికెక్కలేదు.

యున్నవి. నన్నియ గ్రంథమున 'అట్ల పోలె' అనున దొక్కటియు తిక్కన దానియందు 'ఇట్లువోలె' అనునదియుఁ గానఁబడు చున్నవి. నన్నియనాఁటి నుండియే వీనికిఁ బ్రచారము విరళమైనట్లు తోఁచెడి. (పాల్కురికి సోమన మాత్రము శివభక్తుఁడగు నీతనియెడఁ గల భక్తిగౌరవాదులచే 'కరణియుఁబోలె' 'భంగియుఁబోలె' నిత్యాదిగ నచ్చు టచ్చుటఁ బ్రయోగించెను)

(5) ఇక్కవిగ్రంథమున సంస్కృతాంధ్రకర్ణాటాదివివిధభాషావిమిశ్రము లైన సమాసములు గానవచ్చు చున్నవి. ఇవి యాతనిప్రాచీనతను జాటుచున్నవి.

గీ. "అరదాళ్వ భటతతి...." కుమారా. ద్వి. భా. 646.

చ. "అలకలఁ జిన్నిపూ వలికినంతన మోము సెమర్చు....న
మ్మెలఁతకు మాధవీకుసుమమేఖల గట్టుటయుక్ నడంకు నూ
రులు నిజ మింత గోమలి మరుప్రసవాస్త్రప్రహతిం జలింపదే?" కుమా. ప్ర.

పై పద్యములయందు 'అరదము, మరు' అను తెలుఁగుపదములు సంస్కృతపదములతో సమసింపఁబడినవి.

చ. "....తుని యలు వాఱ నేసి పటుదోర్బలగర్వవిగుర్వణంబులన్." కుమా. ద్వి. భా. 825.

(ఇందు 'విగుర్వణము' అనునది కర్ణాటభాషా సంబంధియగు పదము.)

పై "అరదము, మరు, విగుర్వణము" అను పదములు గీర్వాణభాషా పదములని సాధింపఁ జూచుటకంటెఁ గవి యప్పటిసంప్రదాయము ననుసరించి యట్టి ప్రయోగములను విశృంఖలముగఁ జేసెననియు, నన్నియ యట్టివానినే సంస్కరించె ననియుఁ దలంచుట సమంజసము.

కొందఱు విమర్శకు లీప్రయోగములఁ గాంచి యీతఁడు కర్ణాటభాషా పక్షపాతియనియు, నలాక్షణికుఁడనియు ననియెదరు. ఆంధ్రకవుల కెవ్వరికిని లేని యాపక్షపాతిత్వ మీతని కొక్కనికే యేల రావలసెనో యెఱుఁగరాదు. మఱియు నాపక్షపాతిత్వము యత్యాదుల నేల పాటింపఁ జేసెనో చెప్పరాదు. మన మిప్పుడెఱిఁగియున్న లక్షణగ్రంథములన్నియు నాతని తరువాతివే యగుట నాతని శాసింపనేరవు. ఆతనికాలమున నవి యెట్లుండెనో తెలియరావు. ఇఁక నాతఁడలాక్షణికుఁడగు టెట్లు?

ఉ. (6) "వీంగునపారఘత్వగుణవిస్ఫురణం బరమేశ్వరోరు వా
మాంగమునందు మున్నుదయ మైనియమస్థితిఁగొల్చి." కుమా. ప్ర. 4.

క. "వీండేమి సేయుఁ బంచిన,వాండుండఁగ నిక్కమునకు వధ్యుఁడు నా
ఖండలుఁడు గాక, యేలిన, వాండు - - - - - - - - - - ద్వి. భా. 520.

ఈపూర్ణాపూర్ణబిందుప్రాసమును నన్నియాదు లెవ్వరును గూర్చి యుండ లేదు. నాచనసోముఁ డిట్టి ప్రాసమును గూర్చెనని సంపాదకులు వ్రాసియున్నారు గాని యది సెల్లదు. దీనింగూర్చి పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడు "సోముని హరివంశము" అను శీర్షికగల విమర్శగ్రంథమున విస్తరించి చర్చించి యున్నాను. కావున నిచ్చట మరలఁ జర్చింపక విడిచితిని. రామకృష్ణకవిగారు భీమకవి ప్రయోగమును గూడ నిచ్చిరి. భీమనకాల మిప్పటికిఁ దేలలేదు. అతఁ డెప్పటివాఁడైనను శివభక్తుఁడే కావున పాల్కురికి సోమనాథుని వలెనే యాతఁడును శైవుఁడైన చోడకవి వ్రాఁతయందుఁ గల ప్రమాణబుద్ధిచే, నీప్రాసము నంగీకరించి యట్లు వ్రాసియుండును.

(7) అథర్వణాచార్యుఁడు నన్నియభట్టునకు సమకాలికుఁడని కొందఱును, తిక్కనకుఁ గొంచెము పూర్వుఁడని కొందఱును వ్రాసియున్నారు. ఈతఁడు తన ఛందమున,

"మగణమ్ముఁ గదియ రగణము, వగవక కృతి మొదట నిడెడువానికి మరణం
బగునిక్కమంద్రు మడియఁడె, యగు ననియిడి తొల్లి వెంకణాదిత్యుఁడనిన్."

అని వ్రాసినాఁడని మా. రామకృష్ణకవిగారు, కుమారసంభవగ్రంథపీఠికయం దుదాహరించినారు. వీరేశలింగముపంతులవారు సయితము కవిచరిత్రమునఁ బై పద్యము నథర్వణుఁడు వ్రాసెనని వ్రాసియున్నారు.

పైపద్యమునందు 'తొల్లి' అనుపదము గానఁబడుచున్నది. ఇది కొన్నినందలయేండ్లకు ముందున్న కాలమును దెలుపుపదముగా మనవారు ప్రయోగింతురు:—

క. నరనుతుఁడు 'తొల్లి, నలుఁ డను, ధరణీశుఁడు"—నన్నియ (ఇది యుగములఁ నాటి కాలమును దెల్పుపదము)

గీ. "తొల్లి" నాలాయని యనంగ దొరయు నింద్రసేన—పాంచాలీపరిణయము. (ఇదియు నించుమించుగ నట్టిదే.)

ఇవ్విధమునఁ బ్రాచీనచారిత్రములఁ దెలుపు సందర్భమున నుపయోగింపఁబడు నీ 'తొల్లి' అను పదమును బ్రయోగించిన యథర్వణుఁడు, తిక్కనకు సమకాలికుఁ డనుకొన్నను, వెంకణాదిత్య (నన్నిచోడ) కవి, యథర్వణునకు నాలుగైదు వందలయేండ్లకు బూర్వమున నైన నుండకుండ నాతఁ డా పదమును

బ్రయోగింపఁ డనియు, కావుననే చోడకవి నన్నియకు మిక్కిలియుఁ బూర్వుఁ డై యుండు ననియుఁ దలంపనగును.

8. "చ. నిరుఋతి వారిమాయల కసిం బ్రతిమాయలొనర్చి - - -" కుమా. ద్వి.

ఇందు 'నిర్‌ఋతి' అపదనుము నాలుఁగు లఘువర్ణములుగాఁ గవి ప్రయోగించినాఁడు. ఇది వేదోచ్చారణము ననుసరించి, కాళిదాసుఁడు 'త్రియమ్బకం' అని ప్రయోగించినట్లే మనకవీంద్రుఁడును ప్రయోగించియుండె నని తోఁచుచున్నది. ఇదియాతని పురాతనత్వమును ఘోషించుచున్నది.

కాళిదాసుని తరువాత వ్యాకరణశాస్త్రజ్ఞులచే 'త్రియమ్బకం' అనుపదము విమర్శింపఁబడి, క్రమముగా వేదపండితులచేత 'త్ర్యమ్బకం' అని యుచ్చరింపఁబడుచున్నట్లును, పూర్వము దానియుచ్చారణము 'త్రియమ్బకం' అనియే యుండినట్లును, కావుననే లాక్షణికకవిచక్రవర్తియగు కాళిదాసమహాకవి దాని నట్లు ప్రయోగించినట్లును దలంపఁబడుచున్నది. లేకున్న, "తత్సవితుర్వరేణ్ణియమ్ (ణ్యమ్) యద్రాత్రియా(త్ర్యా)పాపమకారు (ర్) షమ్, యద్రాత్రియా(త్ర్యా)త్కురుతే పాపమ్ ఇన్ద్రాగ్నియో (గ్న్యో) రితీన్ద్ర-అగ్నియో, సూరియ (ర్య) ఇతి త్రీణి" ఇత్యాది స్థలములయందు లేనిసంహిత, ఒక్క 'త్ర్యమ్బకం' అనుస్థలమున మాత్రము వచ్చుటకు హేతువు గానరా దనియుఁ దోఁచుచున్నది. దీనివివరణము నింత నిలిపితిని.

నిరు (ర్) ఋ త్యేతి, నిః-ఋత్యా, మిత్రస్య చరు (ర్) షణీధృతః, వరు (ర్) షాభ్య ఇత్యర్థః, తం యజ్ఞం బరు (ర్) హిషిప్రౌక్షన్ను (న్)-ఇత్యాదిగ వేదపండితు లుచ్చరించెదరు.

ఈ సంప్రదాయము ననుసరించి 'నిరుఋతి' అని కవి ప్రయోగించి యుండును. (ఇది త్రిష్టుప్ఛందమున మూఁడక్షరములు గలది గానే పరిగణింపఁబడియున్నది.) వ్రాఁతప్రతియందు 'నిరుతి' అనియున్నది. ఇట్లున్నను "నిర్‌ఋతి" అను నుచ్చారణమునే కవిగ్రహించియుండు నని తోఁచెడి. 'నిర్ఋతియు' అని యుండఁగూడదా? యని కొంద అందురు. కాని నన్నియ, నన్నిచోడుల 'యు' వర్ణప్రయోగములు సామాన్యములు గావు.

9. నన్నిచోడఁ డెద్దియే నొకవిషయమును వర్ణించి వర్ణించి, "అని యనేకప్రకారంబుల వర్ణింపందగిన వర్ణనల కెక్కి" అని యనేకప్రకారంబుల - - - - - నమరి" ఇత్యాదిగ వ్రాయుచుండును. ఇవ్వచనముల ఫక్కిఁ జూడ, పురాతనయక్షగానాదుల యందుంబోలె వీనియందును బ్రాచీనత గోచరించుచున్నది.

10. ఉపమానోపమేయవిపర్యయభిన్నలింగభిన్నవచనాదు లీతని గ్రంథమునఁ గొలఁదికి మీఱి చూపట్టుచున్నవి. నన్నియాదులగ్రంథములయందు వానికిఁ బ్రాచుర్యము తక్కువ. శోకాతురయైన రతివర్ణనము—

"గీ. తలఁకికనుఁగవఁగన్నీరుధారలొలుక,మేనఁ బేర్చిందులురులంగ మెలుతపొలిచెఁ
గీలుబ్రిదిలిన జలధార లోలిఁ గలయఁ, గ్రమ్మి చెదరెడు ధారాగృహమ్ముపోలె"

"గీ. మెఱసిక్రొవ్వేణి వెంటిపై నెఱసిపొలయ, నడలుదరికొనివావిరినఱచుచుండెఁ
గాన నెల్లఁ జెలంగఁ గ్రక్కదలమదము, దగిలికేకించుపురినమ్మిపగిదిపోలె"

కుమా. ప్ర. భా. 564, 565.

ఇత్యాదులనాగయునది. (వెంటిపై=వెన్నుమీఁద, పురినమ్మి=మగనెమిలి.)

11. "సీ. కాలంబుగూడజగంబులేర్చుటయెంతయలవనిహారులోచనాగ్ని 'నుఱడు,
వనరాశిఁ దగు మెత్తఁదన మెర్గి యేచుడేబల మని బాడబానలముఁ 'దెగడు,
మారుపట్ట నోపని మ్రాఁకు లేర్చుట యెంత వాలగు నని వనవహ్ని 'నవ్వు,
గలితనం బెఱుఁగని కులగిరు లేర్చుడే వాఁడిమి యని పవివలనిఁ 'బలుకు,
నెలమిఁ గోమల నుగు శోవ లేర్చు డెంత,త నదుతీవ్రత్వ మనితీవ్రధాముఁ 'నెత్తు,
దనకుఁబ్రతి లేక దిక్కులు దాఁకి వెలుఁగుఁ, దారకాసురఘోరప్రతాపవహ్ని."

కుమా. ద్వి. భా. 526.

ఇందు మొదటిపాదములోని 'ఉఱడు' అనునది తక్కినపాదములలోని 'తెగడు' 'నవ్వు' మొదలగువానివలెఁ గేవలధాతురూపము. పద్యమునఁ గర్త ప్రతాపవహ్ని. నన్నియభట్టు "ఉఱఁచు (డు?) సురేంద్రు నైన బలియుండు హిడింబుఁడు వానిఘూకికి వెఱనని వారలుం గలరె..." అని ప్రయోగించినాఁడు. కాని యతఁడే నన్నిచోడని యితరములగు 'ఉఱరు, ఉఱక' ఇత్యాది రూపములంబట్టి దీనినిసయితము 'ఉఱు' ధాతువ్యతిరేకార్థకముగా గ్రహించెనో, లేక ప్రత్యేకధాతువుగానే ప్రయోగించెనో నిర్ణయింపరాని సందిగ్ధస్థలమున దీనిని బెట్టినాఁడు. ఎట్లయిన నేమి? తరువాతికవులు దీనిని 'ఉఱడు, అని' కేవలధాతువుగాఁ బ్రయోగింపమి నీధాతువు మన నన్నిచోడకవినుండి నన్నియకడకు సందిగ్ధరూపముతో వచ్చి పిమ్మట ముచ్చుముడిగె నని తోఁచుచున్నది.

పై 'ఉఱడు' శబ్దమువలెనే నన్నిచోడనివలననుండి నన్నియచే వేఱువిధమున గ్రహింపఁబడినట్లు దోపించు విచిత్రప్రయోగము నింకొకదానినిమాత్ర మిచ్చట నిచ్చెదను:—

నన్నిచోడకవీంద్రుని కుమారసంభవమహాకావ్యమున,

కాంచుడరుదయ్యెన్=కాంచుట+అరుదయ్యెన్; ఇచ్చుడాజి=ఇచ్చుట+ఆజి; ఒదవుడిదేమి=ఒదవుట+ఇదేమి; ఏర్చుడెంత ఏర్చుట+ఎంత; ఏచుడేబలము=ఏచుట+ఏబలము; చేయుడొకప్పేర్మి=చేయుట+ఒకప్పేర్మి ఇత్యాదిభావార్థకరూపములు డకారముతో నున్న వనేకములు గానవచ్చుచున్నవి. ఈరూపము లిట్టుంటఁ గాంచి వీరేశలింగము పంతులుగారు కవిచరిత్రము 203, 204 పుటలలో "క్రొత్తకవిని ప్రాఁతకవినిగాఁ జేయుటకు గ్రంథసంపాదకు లారూపముల నట్లుంచి"రని భావించి పెద్దవిమర్శమును గావించినారు. దాని నిచ్చట విమర్శించుటకుఁ జోటుసాలదు. మఱియు శ్రీపంతులవారు,

"ఒదవుడి దేమి' యనుటకు మాఱుగా 'ఒదవు టిదేమి' అనియు, 'కాంచు డరుదయ్యెన్' అనుటకు మాఱుగా 'కాంచుటరుదయ్యెన్' అని వేసినచో యతిభంగము వచ్చునా? ప్రాసభంగము వచ్చునా? గణభంగము వచ్చునా?" అని ఆక్షేపించిరి. వారు వ్రాసినట్లు వట్టిచోట్ల టకారమును వేసినను భంగమేదియు రాదు గాని,

చ. వడిఁ ద్రిదశాలి నోర్చు డొక వావిరిబీరముగాఁగ రజ్జు 'సె
ప్పు, డదియు నీవు సేసినతపోవిభవంబునయబ్జగర్భుచేఁ
బడసినవిద్య గాక - - కుమా. ద్వి. భా. 516.

అను నిట్టిచోట్లమాత్రము 'చెప్పుడదియు' అనుదానిని 'చెప్పుటదియు' అని (మనయిప్పటి విధినిబట్టి) సవరింతుమేని ప్రాసభంగము తప్పక వాట్లఁగలదు ఈభంగ మిక్కవిపద్యమునకే కాక నన్నియభట్టారకుని యీక్రిందిపద్యమునకును గలుగుచున్నది:—

క. "పడరత్నిధనుర్ధరుఁ డె, య్యెడ నజితుఁడు గాన వాని హీనుంగాఁ 'జే
యుడు (డ?) నాకుఁ జతుర్వర్గము
వడయుట యని పృషతసుతుఁడు ప్రార్థించెమునిన్. ఆది. సప్త. 16. ప.

(ఇచ్చట "చేయుడు=చేయుట" (ఆనంతర్యముగాదు) వాని హీనుం జేయుట నాకుఁ జతుర్వర్గము వడయుట యని యన్వయము.)

నన్నిచోడనిగ్రంథమున భావార్థకటకారము తనకుఁ బరమైనయచ్చుతో సంధింపఁబడినప్పుడే యిట్టి డత్వము నొందుచున్నట్లు గాన్పించుచున్నది. (గ్రంథమంతయుఁ జూడుఁడు.)

నన్నియప్రయోగము దీనికి విరుద్ధముగాఁ గానవచ్చుచున్నది. నన్నియ, నన్నిచోడనివిధిని గుఱుతింపనే లేదో, ఆతఁడు గుఱుతించి వ్రాసినపాఠ మీదేని

యుండ లేఖకమహాశయులు మార్చి వేసిరో చెప్పఁజాలము గాని యిప్పు డున్న పాఠమమాత్రము చోడనిప్రయోగములకు భిన్నముగా నున్నది. చోడకవి ప్రయోగములను తిక్కన (కవిబ్రహ్మ) గుఱుతించినాఁడు గాని లేఖకులు, సంస్కర్తలు వాని నట్లుండ నిత్తురా? మనసంస్కర్తల చేతులఁ బడకుండ నిట్టిపురాతనరూపముతోనున్న తిక్కన్నప్రయోగ మొకటి పురాతన తాళపత్ర గ్రంథ మొకదానియందుఁ జూపట్టుచున్నది.

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మటె యుద్యోగాదులుం గూడఁగాఁ
బదునేనింటిఁ దెలుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టంగ "రచించు డొప్ప" బుధసంతోషంబు నిండారుటన్." విరాట.

(ఓరియంటల్ లైబ్రరీ, తెలుఁగుమాన్యుస్క్రిప్ట్సు క్యాటలాగ్ 1. 915. వాల్యూం 1. 189 పు.)

నన్నియ మొదలుకొని నేఁటివఱకుఁ గలకవులగ్రంథములలోఁగాని వాడుకలోఁగాని లేనిపురాతనశబ్దములు, ప్రాచీనశాసనాదులయందుంబోలె, నీతని కావ్యమునఁ జూపట్టుచున్నవి. అవి కాలప్రవాహమునఁబడి కొట్టుకొనిపోయి యంతర్హితము లైనవి. ఆంధ్రము జీవభాష గావున దానియందుఁ గొన్నినూతనశబ్దములు చేరుచున్నట్లే ప్రాచీనశబ్దములు కొన్నియదృశ్యము లగుచుండును. ఇట్టిమార్పు లోకస్వభావమై యున్నది.

వీరేశలింగముగారు, నన్నిచోడకవి, "గ్రాంథికభాషలోను, వ్యావహారిక భాషలోను లేనియప్రతీతపదములను వాడె" నని కవిచరిత్రమున 193 పు. వ్రాసియున్నారు. బుఱ్ఱా శేషగిరిరావు (ఎం. ఏ.) గారును "కవి ప్రాఁతమాటలను పనిపట్టి యుపయోగించె" నని వ్రాసినారు. కాని, యాపదముల నాతఁ డెచ్చటనుండి కొనితెచ్చెనో వారు వ్రాసినారు గారు. నన్నియకు మున్ను తెలుఁగు గ్రంథములులేవు; నన్నియాదుల గ్రంథములయందవి గానరావు. ఇఁకఁ గవికి నవి యెట్లువచ్చెను? కవికాలమున నవి వాడుకయందుండె నందురా? వాడుకయం దున్నవి ప్రాఁతమాట లెట్లగును? ఏకవియుఁ బనిపట్టి ప్రాఁతమాటల నేర్చి కూర్ప నొల్లఁడు; సృష్టింపఁజాలఁడు. అవి పూర్వగ్రంథజాలమునందో, వాడుకయందో యుండియుండి, స్వభావసిద్ధముగఁ గవిశారాధారయందు దొంతిపడనలసిన వే కాని పనిపట్టి వ్రాయవలయు నన్న సాధ్య ముగునవి గావు. ఇవ్విషయము కవీంద్రుల కనుభవసిద్ధ మే.

క్రొందలువిద్యాధికు లివి మాండలికపదములై యుండు ననిరి. మాండలికకవు లెందఱో కలరు. వారిగ్రంథములయం దాయా మాండలికపదము లున్నవా?

క. "మార్గకుమార్గము దేశియ, మార్గము నగవంగఁ దమకు మది వదలక దుర్మార్గపదవర్తు లగునా, మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్."

ఆ. "అన్యదైవవిశితి నర్పించుకొలువు దాఁ, డిడి ఫలంబు గొనుట వడయనెగడి నద్య మిష్టఫలదు జంగమమల్లికార్జునునికొలువు మొసరుమునుఁగఁగొనుట."

ఉ. "అక్కలి మాయఁ గన్నుఁగవ లాననము ల్వెలసిల్ల బెంజెమర్
గ్రక్కొని వర్వ మానములు గీడ్పడఁ జెయ్వుల కుచ్చలించి క
ర్కక్కఁ దనూలతల్ ధృతికి నేడ్తెఱ లల్క శిఖిప్రసంగతిం
జొక్కి మహీసురాంగనలు సోలి రపూర్వరతిప్రమత్తలై"

(ఇందలి దేశీయపదముల కూర్పును గనుఁడు)

నన్నియభట్టారకునిసంస్కారమునకుఁ దరువాతఁ బైకవిత్వమువంటి కవిత్వమును జెప్పిన యాంధ్రకవి యొక్కఁడును గానరాఁడు. కావున నితఁడు నన్నియకుఁ దరువాతివాఁడై యుండఁడు. ఇతనిగ్రంథములోని పదము లనేకములు కాలక్రమమున భాషలో నశించిపోయినవి. అట్లు పోయినవి పోఁగాఁ గొన్ని యితరకవులగ్రంథములయందుఁ గాన్పించుచునే యున్నవి. మచ్చునకుఁ గొన్ని:—

"విగుర్వించు, తలుసంటి---నన్నియ; అగుర్వు, తొప్ప---తిక్కన; ఇట్లె-మేలిల్లు-పండితారాధ్యుని శివతత్త్వసారము; సమూహి-పాల్కురికి సోమన; గోనవుచ్చు-కేతన; కీడ్బరను-శ్రీనాథుఁడు; కానడించు-రామకృష్ణుఁడు; ఎర్గు* అప్పకవి.

ఇవ్విధమున నన్నిచోడాదిప్రాచీనకవుల గ్రంథములనుండి నన్నియాదికవు లాయాపూర్వశబ్దములను తమకు వలసిన వానిని గొని ప్రయోగించుకొనుచు వచ్చిరి.

నన్నియాదికవులగ్రంథములలోఁ గానవచ్చు పురాతనశబ్దములు మాత్రము గ్రాంథికపదములును, కానరానిని మాత్రము 'అప్రతీతపదములును,'

---

* అప్పకవీయము, ప్రథ. 'గ్రామ్యపదలక్షణము" అనుచోట, "కావ్యములనెఱుఁగవలయు సంస్కారములను" అనిప్రతు లన్నిటఁ గానఁబడియెడి. చోడనివలెనే అప్పకవియు 'ఎర్గు, అని ప్రయోగింపఁగా, లేఖకు లది దుష్టరూపమనుకొని ఎఱుఁగు, అని యొకమాత్ర నెక్కుడుగ వేసి గణభంగమును దెచ్చిపెట్టినారు. నాటినుండియు నాపాఠము గతానుగతికముగ గణభంగముతోనే వచ్చుచున్నది.

ప్రాతమాటలు' నగునా? శబ్దరత్నాకర నిఘంటుకర్త కీనన్నిచోడనికుమారసం భవము లభించియే యున్నచో నాతనిగ్రంథములోని పూర్వపదములు గ్రాంథిక పదములే యైయుండును గాఁబోలు! పురాతనభాషాకల్లోలిని కాలమహాసముద్ర గామిని యగుచు, నచ్చటచ్చటఁ దటస్థించు గ్రంథసరోవరాదులయందు వలని ననుసరించి ప్రాచీనశబ్దస్వాదూదకములఁ గూర్చుచునే పోయినది.

12. రాజనరేంద్రపట్టాభిషేకసంచికయందు మ. శ్రీ. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు కొన్ని పురాతనశబ్దములనుగూర్చి యొకవ్యాసమును వ్రాసియున్నారు. (చూ. 62-67) అట్టివి కొన్ని యిక్కవిగ్రంథమునఁ గాన్పించుచున్నవి. దిక్ప్ర దర్శనము సేసెద:—

వక్రము—ఈధర్మంబునకు వక్రంబు వచ్చువారు (చూ. పట్టాభిషేక సం. 62 పు.)

వక్రంబువచ్చిన-[బర్గెస్‌గారి (ప్రాచీనతమ) "తమిళ్‌! సంస్కృతశాసనము" 71 పుట.]

ఈపదము నన్నియకుఁ బూర్వము వ్యవహారములో నున్నశబ్ద మనియు, తత్పూర్వశాసనములందు మాత్రమే కానవచ్చుచున్న దనియు శాసనపరిశోధ కుల యభిప్రాయ మై యున్నది. ఇప్పదము మనప్రాచీనకవిరాజుగ్రంథమునఁ గానవచ్చుచున్నది. చూడుఁడు!

"వ - - - దేవదూతం గని శుక్రుండు 'వక్రంబై' యందఱ కెడసొచ్చి"

కు. మా. ద్వి. భా. 519.

"క. కరి మదగర్వంబునఁ గే, సరిపైనుఱుకురవడింప సమకట్టుటయుస్
బొరిఁబొరి నంకుశఘట్టన, నరుదుగఁ గుదియించు నమ్మహామాత్రుక్రియస్."

"వ. శుక్రుండు 'వక్రంబై' - - -"   కుమా. ద్వి భా. 544.

ఇప్పద మీయర్థమున నన్నియాదులగ్రంథమునఁ గానరాక, మనరాజకవి, నన్నియభట్టారకునకు మిక్కిలియుఁ బూర్వుఁడైయుండె నని వేనోళ్లఁ జాటి చెప్పుచున్నది.

ఈరీతిని నన్నిచోడని కుమారసంభవమహాకావ్యము "శ్రీవాణీంద్రే" త్యాది పరిసమాప్త్యంతముఁ బరిశోధించువారికి నా మహారాజకవిరాజశిఖామణి, నేఁటి దనుక మనచే నెఱుఁగఁబడుచున్న యాంధ్రకవీంద్రుల కెల్ల, సనాతనుఁ డని తప్పక తోఁపఁగలదు. కాలమహాపూరుషుఁడు క్రమక్రమముగా మనరాజకవి

రాజునుదంతమును దెలుపు శాసనాదులను వేనినైనను బయటఁ బెట్టునేమో చూడవలసియున్నది.

అంతియేకాని, రాజరాజనరేంద్రునో, నన్నియభట్టకవీంద్రునో యాంధ్రకవితాకల్పవల్లికి మూలకందముగా నేర్పఱుచుకొని, యెవ్వఁడో నన్నిచోడనిపేరు గల యేదో శాసనము నాధారపఱుచుకొని, దానివలన సంభవించు నసందర్భముల నెల్లఁ బరిహరించుపొంటె నప్పటిరాజుల నామములను, వాని వానితండ్రులనామధేయములను, తల్లులపేళ్లను మార్చిమార్చి, ఇద్దఱిద్దఱ నొక్కొకరిని జేసి, తల్లులుపేళ్లకు పురాణార్థము సెప్పి సరిపుచ్చి, అన్నదమ్ముల జ్యేష్ఠత్వకనిష్ఠత్వములు తలక్రిందులు గావించి, "చాళుక్యరాజు" అనువానినే శాక సత్యాశ్రయుని సయితము రాజనరేంద్రునిఁ జేయనెంచి, మనమహారాజ కవిరాజశిఖామణిని, ప్రాచీనుని పండ్రెండవ శతాబ్దిమధ్యమునకో—కడపటికో త్రోసివేయఁజూచుట న్యాయేతరము కాదా?

నన్నియకుఁ బూర్వ మాంధ్రమునఁ గవిత్వమే లేదనుకాలము పోయి, "ఆతనికి మున్ను కవిత్వము గలదు; ఛందస్సు ఉండెను; చిన్నచిన్నకృతు లుండెడివి" అనుకాలము వచ్చినదిగదా! "ఉద్గ్రంథములు సయితమున్న" వనుకాలము వచ్చుచున్నది. ఇఁక జరిగినకొలది నది యెట్టిసత్యవిషయముల బయలుపఱుప నున్నదో!

ఈయుపన్యాసము నన్నిచోడమహారాజకవి కాలనిర్ణయవిమర్శముకొఱకు మాత్రమే యుద్దేశింపఁబడి యుండుటచే, తత్కవిచంద్రకవితాసౌందర్యమును బ్రదర్శించుట కిందు వలనుపడలేదు. జానుతెనుంగుపదములతోడను, మనోహరార్థనివహంబులతోడను, గంభీరభావపుంజములతోడను ప్రకృతినిజిత్రించి పాఠకులయెదుటఁ గాన్పింపఁజేయునేర్పున నిక్కవిరాజునకు సమానుఁ డాంధ్రలోకమున వేఱొక్కఁడు లేఁడు. ఇతనికవిత్వమునందుండు వైభవమును, భక్తిశృంగార, జ్ఞానవైరాగ్యముల సమ్మేళనము నొనర్చి చదువరుల యంతరంగములఁ బరితృప్తి నొందించు నీతని ప్రౌఢతనమును దెలుప మఱియొక యదనుగైకొనియెదను.

ఇక్కవి కవిత్వమును బలువురు పండితులు మిక్కిలియుఁ బొగడియున్నారు. అందు నొండురెండుపొగడికలను మాత్రమిచ్చుట నిచ్చుచున్నాను:—

1. ఇక్కుమారసంభవకావ్యమును బఠించితిమేని తప్పక యిది నన్నియభట్టారకునకుఁ బూర్వమే రచింపఁబడినకావ్యమని బోధపడగలదు - - - ఈకవి

రాజశిఖామణి కావ్యములోనివర్ణనము లత్యద్భుతములై నూతనములైయున్నవి-" చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు. ఆంధ్రులచరిత్రము. మధ్యయు. 43,44పు.

2. "ఈతఁడు నాచనసోమనాథాది మహాకవులతోఁ దులఁదూఁగఁదగినవాఁడు గాని సాధారణుఁడు గాఁడు - - -"కం. వీరేశలింగముపంతులుగారు, ఆంధ్రులచరిత్రము. ప్ర. భా. 210. పు

3. "నన్నిచోడనిభావముల యందత్యంత మనోజ్ఞత్వమును వానినిగూర్చు నాచ్ఛికముల యత్యంతసౌభాగ్యమును నింతింతయనఁగూడదు. అర్థముసొంపే మన తిక్కనసొమ్ముగదా! నన్నిచోడునియందో! తిక్కనయర్థము సొంపులకుసొంపులున్నవి. తిక్కనపదపరికరములకెల్ల నుఱింత సంపన్నములుగానున్నవి. నన్నెచోడని పదపరికరమునకుఁగల సౌష్ఠవపుష్టిని, కవితకుఁ గలపాకప్రౌఢిని జూడఁగాఁ దిక్కనవి యంత మెఱుఁగుగాదోఁపవు. మఱి నన్నిచోడఁడు తిక్కనకుఁబూర్వుఁడే యైనయెడలఁ దిక్కనయాంధ్రకవితాసామ్రాజ్యసింహాసనమునం దర్ధాసనము కంటె నెక్కువ నన్నెచోడునకే యియ్యవలెను - - -" కీ. శే. తం. వేదప్పెరుమాళ్ళయ్యగారు. (విమర్శకశిరోమణి) ఆం. సా. పరిషత్పత్రిక. సంపు 7. సం 1.

ఇవ్విధమునఁ బలువురచేఁ బొగడఁబడుచున్న యిమ్మహారాజకవిరాజశిఖామణి యెప్పటివాఁడైననేమి? ఎప్పుడు నున్నవాఁడే! ఎప్పటికి నుండువాఁడే!

---

# నారసింహపురాణము.

## ఉత్తరభాగము

### ఉపోద్ఘాతము.

ప్రాచీనాంధ్రకవిప్రవరుల ప్రశస్తకవిత కొంత, యిప్పటికిని దనసౌభాగ్య సంపత్తి నెఱుంగని జానపదుల యట్టుకలపైఁ బడి మట్టిబ్రుంగిన త్రాటియాకులలో శిథిలశిథిలం బగుస్వరూపముతోఁ గొనయూపిరి గలిగి మూల్గుచున్నది. అట్టి యామె దురవస్థ నిప్పుడిప్పుడు కొందఱు భాషాభిమానులత్యుదారభావములతోఁ దొలంగింపఁ బ్రయత్నించుచున్నారు. వారిలో ముఖ్యముగా మన యాంధ్రసాహిత్యపరిషత్తువా రావిషయమై మిగులఁ బ్రశంసనీయముగఁ బని చేసియున్నారు. వారియమూల్యప్రయత్నమువలననే యీహరిభట్టు నారసింహ పురాణకృతికన్యక—ఇంతకాలమువఱకు జీవితసంశయస్థితిలో నున్నయీకృతి కన్యక—ఇప్పటికి మనయాంధ్రదేశరంగమునఁ, జిరకాలాజ్ఞాతవాసముచేఁ గృశించి విశ్లథములైన శరీరభాగములతో నెట్టెట్లో తలయెత్తి ప్రజలలోఁబడి నడయాడఁ గలిగినది. మఱియు మనయాంధ్రదేశమున నింకను నిట్లెన్నికృతు లడఁగిమడఁగి జీర్ణించుచున్నవో తెలియదు. కొన్నిసంవత్సరముల క్రిందట, మ. రా. రా. మానవల్లి రామకృష్ణకవిగారు గద్వాలసంస్థానమునఁ దాము సంపాదించిన హరిభట్టు మత్స్యపురాణము (వ్రాఁతప్రతి) కడపట "This author also wrote another work called" ఉత్తరనరసింహపురాణము as పూర్వనరసింహపురాణము was already handled by greater poets ఎఱ్ఱయ్య and వేములవాడ భీమకవి. But this work is not available and only one stanza quoted by జగన్నాథకవి in his రత్నాకరము survives to lament over the loss of it.

సీ. మందారకుసుమంబుఁ జందురుండును గూడి మౌళిభాగంబునఁ గీలుకొనఁగ
ఫణికుండలంబును మణికుండలంబును గండభాగంబునఁ గప్పుకొనఁగ
వరచక్రశూలాబ్జగరదహస్తములందుఁ గంకణభుజగకంకణము లమరఁ
గనకకౌశేయంబు గజరాజచర్మంబు మునుకొని కటిభాగమున నటింపఁ

గీ. దిమిరమును జంద్రికయు జోక నమరినట్లు, పుండరీకోత్పలద్యుతుల్ పొదలినట్లు
నీలవజ్రంబు లొకచోట నిలిచినట్లు, హరిహరాకృతి త్రిభువనాహ్లాదమయ్యెఁ.

Quoted in రత్నాకరము. Canto I.

అని వ్రాసికొని యీకృతి నామావశేష యయ్యె నని భావించినస్థితిలో నిది యిప్పు డిట్లు లభించుట యాంధ్రభాషాభిలాషుల కమూల్యమాణిక్యము లభించినట్లే కాదా? జగన్నాథకవిచే నుదాహృతమైన పైసీసపద్యమే ప్రస్తుతము ప్రకటింపఁబడిన యీనారసింహపురాణమునందు విశేషపాఠభేదములతో నిట్లు కనఁబడుచున్నది:—

సీ. మందారదామంబు నిందుఖండంబును మౌళిభాగంబునఁ గీలితముగఁ
మణికుండలమ్మును ఫణికుండలమ్మును గండమండలముల మెండుకొనఁగఁ
జక్రాంకశూలాంకశయముల మాణిక్యకంకణభుజగకంకణము లమరఁ
గనకకౌశేయంబు గజరాజచర్మంబు మునుకొని కటిభాగముల ఘటిల్ల
రమయు నుమయును నుభయపార్శ్వములనమరఁ
బులుఁగుఱేఁడును నందియుఁ గొలిచి మెలఁగ
వైష్ణవశ్రేష్ఠులును శైవవరులుఁ బొగడ
హరిహరస్ఫూర్తి యేకదేహమునఁ బొలిచె.

ఈరెండుపద్యములకును సీసపాదములలోఁ గొన్నిపాఠాంతరములు గానించుచుండుట వింతగాదు; కాని కడపటి నెత్తుగీతము లొకదానితో నొకదానికిఁ బోలికయే లేక యున్నవి. ఇది చిత్రము! జగన్నాథకవిచే రత్నాకరమున నుదాహరింపఁబడిన దని రామకృష్ణకవిగారు వ్రాసిన సీసగీతి నించుమించుగాఁ బోలుచున్న మఱియొకసీసగీత మీగ్రంథమున నీహరిహరాకృతిసందర్భముననే యి ట్లున్నది.

సీ. — — — — — — — — —
నీలమును వజ్రఫలకంబుఁబోలి యుత్పలంబుఁ గుముదంబుననఁదగిలచ్చితోడి
యురము నగరాజపుత్రిక కునికయైన,యెడ మునంకయుఁ గలిగి శ్రీ నిం పుకొనిరి.

మఱియు నిందలి ద్వితీయాశ్వాసమున మఱియొక సందర్భమునఁ జెప్పఁబడిన ౧౮-వ సంఖ్యగల కందపద్యములోని కొంతభాగము, మీఁద నుదాహరింపఁబడిన గీతపద్యభాగమును బోలుచున్నది.

క. చీఁకటియుఁ జంద్రికారస, మేకస్థానంబునంద యిరవొందుగతిన్
నాకాణోరిపుకులమున్, నాకాలయకులము నొక్కనంటున మెలఁగున్

మఱియు నీహరిహరరూపైక్యమును వర్ణించు సీసపద్య మింకొకటి గూడ నిందుఁగలదు. పైపద్యములయం దిట్టివిశేషపాఠభేదము లెట్లు గలిగినవో నిర్ణయించుటగాని కవికంఠోక్తపాఠము లివియని నిశ్చయించుటగాని మనకు శక్యముగాదు. తఱచుగా నిట్టిభేదములు లేఖకులయు, సంస్కర్తలయు, ముద్రాపకు

లయు బుద్ధిసూక్ష్మతచే సంభవింపవచ్చు నని నాయభిప్రాయము. ఇది ప్రసక్తానుప్రసక్తముగా వ్రాయఁబడిన విషయము. ప్రస్తుతవిషయ మేమనఁగా?

ఈనారసింహపురాణమును రచియించినకవి హరిభట్టు. ఏకారణముననో కాని, కృతికర్త యగుహరిభట్టుచేఁ గాక యతనికుమారుఁడైన రాఘవమనీషిచే నీగ్రంథము ప్రోలుగంటి రంగప్రధానికిఁ గృతి యీయఁబడినట్లు కృత్యాదినిబద్ధమైన యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. విను రాఘవమనీషి! హనుమత్కృపావరలబ్ధకవిత్వవిలాసమహిమఁ
దనరి యేకాదశద్వాదశస్కంధముల్ తెలిఁగించె మీతండ్రి ధీయుతుండు
హరిభట్టు నిఖిలవిద్యాచతురాస్యుండు రాజమాన్యుఁడు కవిరాజనుతుఁడు
నారసింహపురాణపౌరస్త్యభాగంబుఁ జెదలుపాఱెట్టిన మొదలుసేయఁ
బ్రతిభ దళుకొత్త నుత్తరభాగ మిప్పు, డాంధ్రభాషను వచనకావ్యం బొనర్చె
నాప్రబంధంబు నాపేర నంకితముగ, నీవు గావింపవలయుఁ గవీంద్రగణ్య!

ఈపద్యమునుబట్టి తండ్రి హరిభట్టు రచియించిన గ్రంథమునే కొడుకు రాఘవమనీషివలనఁ బ్రోలుగంటి రంగన్న కృతిపొందినట్లు స్పష్ట మగుచున్నది; కాని తెలుఁగుకృతులలోఁ దఱచుగా గ్రంథకర్తయే తనగ్రంథమునఁ గృతియిచ్చు నాచారముండుటచేతను, గృతికర్తృభిన్ను లిట్లుకృతు లిచ్చుట మిక్కిలి యరుదుగా నుండుటచేతను, బైనీసపద్య మన్వయసారళ్యము లేమిఁ జేసి స్థూలదృష్టికి నన్యార్థద్యోతకముగ నుండుటచేతను, మఱియు నందలి "వచనకావ్య" శబ్దమిప్పుడు ప్రత్యేకగద్యకావ్యపర్యాయమై వ్యవహరింపఁబడుచుండుటచేతను, దొలుదొలుత నీగ్రంథము రాఘవమనీషికృతమైన ట్లించుక భ్రాంతి పొడమవచ్చును. అది కేవలము రజ్జుసర్పభ్రాంతియే కాని మఱియొకటి కాదు. తండ్రి హరిభట్టు గ్రంథమును సంపూర్ణముగా విరచించి యెవ్వరికిని గృతి యీయకమున్నె వార్ధక్యరోగాదులచే నశక్తుఁడై యుండుటచేతనో, తనంతటఁ దాను నరులకుఁ గృతియిచ్చి ప్రతిఫలము నొందుట కిచ్చగింపనివాఁ డగుటచేతనో, యొకవేళఁ గాలధర్మము నొందుటచేతనో యతనికుమారుఁడు రాఘవమనీషి కృత్యాదిపద్యములును గృతిభర్తృవంశావతారవర్ణనాదికమును రచించి రంగప్రధానికిఁ గృతి యిచ్చి యతనిచే "సకర్పూరవీటికాశాటికాలంకారపేటికా"ది పారితోషికములు వడసి యుండవచ్చును. ఇట్లే తెనాలిరామకృష్ణకవిచే రచింపఁబడిన ఘటికాచలమాహాత్మ్య మాతనిపౌత్రుఁడు తీసికొనివచ్చి ఖంషోజీ విచిత్రరాయఁ డనురాజునకు సమర్పింపఁగా నాతఁడు వేంకటగిరీంద్రుఁ డనుకవిచే గృత్యారంభమున

శ్రీరస్తు.

# నారసింహపురాణము.

## ఉత్తరభాగము.

### ప్రథమాశ్వాసము.

కృత్యాదిస్తోత్రాదికము

శా. శ్రీమహిళాంతరంగసరసీజనభోమణి యాదవాన్వయ
గ్రామణి సర్వదైవతశిఖామణి యాశ్రితభక్తలోకవాం
ఛామణి శాంబరీమృగదృశామణి వేంకటశైలరాజర
త్నామణి ప్రోలుగంటి నరసప్రభురంగనఁ బ్రోచుఁగావుతన్. ౧

చ. మసని జయించి యుస్మరల మచ్చిక వచ్చి ప్రసన్నమూర్తి యై
గిరిజకు మేను జాహ్నవికిఁ గెంజడలుం దగ నిచ్చి నిచ్చలు
న్సురతసుఖప్రసంగతులఁ జొక్కెడుశంభుఁ డొసంగుఁగాత భా
స్కరసమతేజుఁ డైననరసప్రభురంగన కీప్సితార్థముల్. ౨

సీ. చిలుకతోఁ దేనియ ల్చిలుకంగఁ బలుకుచు ముద్దాడు నేవేల్పుముద్దరాలు
తనతనూరుచిధారఁ దనరుచందురుడాలు వారించు నేవేల్పువారువంబు
మధురసం బానించి మధులిహంబుల కింపుపుట్టించు నేవేల్పుపుట్టినిల్లు
కల నన్నమాత్రానఁ గలకల నగుచు నానందించు నేవేల్పునందనుండు
కల్పితాఖిలలోకైకవేల్పు వేల్పుఁ, బెద్ద నలువ కృపానముపేతదృష్టిఁ
గలితయశుఁ బ్రోలుగంటిరంగప్రధాన, శేఖరున కాయురభివృద్ధి సేయుఁగాత. ౩

చ. నరసురవంద్యుఁ డౌకమలనాభునురఃస్థలి నున్న మాడ్కిఁ గి
న్నరసముదాయభర్తసదనంబున నిల్చిననైఖరిం బ్రసూ
నరసమిళచ్ఛరాసను ననన్యజుఁ గన్నపయోధికన్య యీ
నరసయరంగమంత్రిభవనంబున వేడ్క వసించుఁగావుతన్. ౪

ఉ. అంబ నిజాంఘ్రిపద్మవినతాఖిలదేవకదంబ చారువ
క్త్రాంబుజవైరిబింబ లలితాలకనిర్జితనీలనీలరో
లంబ సమగ్రమంగళవిలాసకళానికురుంబ ప్రోచు నె
య్యంబునఁ బ్రోలుగంటినరసాధిపురంగయమంత్రిపుంగవున్. ౫

 

చ. కలకలఁ గేలిచిల్క పలుకం బలుకం దళుకొత్తు నెమ్మితోఁ
బులకల మేను దేలగిలఁ బొంగుచు బంగరుపీఁటఁ దానపుం
గులుకులు రాల్చి నవ్వఁ జనుగుబ్బల తాఁకునఁ జొక్కఁజేయు నా
పలుకులకల్కి నిచ్చలును బాయక నామది నిల్చుఁగావుతన్. ౬

మ. హరుఁ డంకంబున ముద్దుసేసి తను బాలార్పంగఁ దన్హస్తకాం
తరవిన్యస్తమృగాంకరేఖ బిసనూత్రం బంచు లో శంక నొం
ది రతిం దుండము సాఁచి పట్టి తివియన్ దీకొన్నదానోల్లస
త్కరిరాజాస్యుఁడు మత్ప్రబంధమునకుం గావించు నిర్విఘ్నముల్ ౭

సీ. వల్మీకసంభవవ్యాసభట్టారక కాళిదాసుల వేడుకల భజించి
భవభూతిశివభద్రబాణమయూరుల ఘనతరవాక్యవైఖరులఁ బొగడి
మలహణక్షేమేంద్రమాఘభారవిభాసదండిచోరులకు వందన మొనర్చి
హర్షసౌమిల్లమురారినుబంధులఁ బటుభక్తిఁ దలఁపులోఁ బాదుకొలిపి
యసమయశులు నన్నపాచార్యతిక్కన, యాయజూకు లెఱ్ఱయప్రధాన
వర్యుఁ డాడిగాఁగ వహికి నెక్కినమహా, కవుల నాశ్రయించి గరిమ గాంచి.

క. ఇప్పటిదుష్కవు లొకకృతి, చెప్పంగా లేరు గాని చెప్పినకృతులం
దప్పులు పట్టను బ్రహ్మలు, మెప్పింపఁగ వశమె వారి మృదునకు నైనన్. ౯

వ. అని యిష్టదేవతాభివందనంబును మహాకవీంద్రాభినందనంబును గుకవినిం
దనంబునుం గావించి సకలసుకవిజనశ్రావ్యంబుగా నొక్క కావ్యంబు నేను రచి
యింప నుపక్రమించుసమయంబున. ౧౦

సీ. తనమండలాగ్ర ముద్దండారిమండలభూధరంబులకు దంభోళి గాఁగఁ
దనకృపారసము బాంధవసేవకాశ్రితోద్యానసీమకు వసంతంబు గాఁగఁ
దనచక్కఁదనము కాంతామనశ్చంద్రకాంతములకుఁ జంద్రికోదయముగాఁగఁ
దననీతివర్తన ధారణీజనచాతకంబుల కభ్రాగమంబు గాఁగ
వెలసె నేరాజు సముదగ్రబలసమగ్ర, కమఠకర్మఠ భుజపీఠ గమితధరణి
యతఁడు నందెలనరసింగయాంతరంగ, తామరసహేళి చినవోబదానశాలి.

శా. ఆరాజన్యశిఖావతంసచతురాశాంతావనీచక్రభృ
ద్ధౌరంధర్యుఁడు శత్రునిర్మథనవిద్యాశాలి లీలావతీ
మారాకారుఁడు ప్రోలుగంటి నరసామాత్యాత్మజుం డార్యర
క్షారంభుం డగురంగమంత్రి యొకనాఁ డాత్మీయగేహంబునన్. ౧౧

సీ. హితులుసామంతులుసుతులుదాయాదులునృపులుబాంధవులు మనీషివరులు
పౌరాణికులు రాయబారులు సుకవులు వందిమాగధులు దైవజ్ఞమణులు
దొరలు పురోహితు ల్దుర్గాధినాథులు మంత్రులు గణికులు మాన్యజనులు
భటులువారస్త్రీలునటులు నాటకు లాదియగునియోగము లెల్లఁ దగినయెడల
వరుసతోఁగొల్వ వైభవస్ఫురణ మెఱసి,యెలమిఁగైసేసి రెండవయింద్రుమాడ్కిఁ
గొలువుసకలంబుఁ జెంగల్వకొలనిఁ బోలఁ,గొలువుగూర్చుండి హరికథాగోష్ఠిఁ

క. ననుఁ బిలువఁబనిచి యర్ఘ్యాసనమున నుపవిష్టుఁ జేసి సన్మానములం [దవిలి
దనియించి చిఱునగవు మొగ,మున నీరికెలొదవ వినయమున నిట్లనియెన్.

సీ. వినురాఘవమనీషి హనుమత్కృపావరలబ్ధకవిత్వవిలాసమహిమఁ
దనరి యేకాదశద్వాదశస్కంధము ల్దెనిఁగించె మీతండ్రి ధీయుతుండు
హరిభట్టు నిఖిలవిద్యాచతురాస్యుండు రాజమాన్యుఁడు కవిరాజనుతుఁడు
నారసింహపురాణపౌరస్త్యభాగంబుఁ జెదలువా డెట్టిన మొదలుసేయఁ
బ్రతిభ దళుకొత్త నుత్తరభాగ మిప్పు, డంధ్రభాషను వచనకావ్యం బొనర్చె
నాప్రబంధంబు నాపేర నంకితముగ, నీవు గావింపవలయుఁ గవీంద్రగణ్య.

క. కృతము మనినసత్పురుషులు, కృతులవలనఁ గాదె భువినిఁ గీర్తి గని మహా
కృతకృత్యు లైరి గావునఁ, గృతి దక్కఁగ నొండు కీర్తి హేతువు గలదే. ౧౬

వ. అని సకర్పూర వీటికాశాటికాలంకారపేటిక లిచ్చినఁ బరిగ్రహించి. ౧౭

క. మిసిమిగలపసిఁడి[1]పుయిదకు, వసుదేవజముద్ర దొరకువడువున నస్మ
ద్రసవత్కవితాయువతికి, రసికుం డగుప్రోలుగంటి రంగన గలిగెన్. ౧౮

వ. అని పరమహర్షోత్కర్షంబున నంగీకరించి యేతత్ప్రారంభంబునకు శోభనాచా
రంబుగాఁ దదీయవంశావతారం బభివర్ణించెద. ౧౯

సీ. గాధినందనతపోగాధపయోధి పార్ష్ణిద్వయద్వయస మేనియతమతికి
నింద్రసన్నిభహరిశ్చంద్రాదిభూపతుల్ శిష్యు లై మెలఁగి రేశీలఖనికి
యోగీశవాఙ్మనసాగమ్యతత్త్వంబు కరతలామలక మేపరమమునికి
సకలవిద్యావిశేషజ్ఞానసారంబు హృదయస్థ మేవిజితేంద్రియునకు
నతఁడు ఫణివరకుంభజన్మాబ్జమిత్ర, నివసనోచితదండకుండీజపాత్రు [యు
వలయుఁడమరాదినుతతపోబలముకలిమి, జయముపూని[2]యరుంధతీజాని వెల

[1] పసిఁడి పూడకు అని యుండవలయునేమో, పూదెయనఁగా బంగారుపూస. [2] పూ. అరుంధతీజాని - మూలము.

క. ఆమునిమణికులజలనిధి, సోమునికైవడి జనించె సురుచిరవిభవో
ద్దాముఁడు సమధికసమర, స్థేముఁడు నౌ ప్రోలుగంటి తిప్పన ధాత్రిన్. ౨౧

శా. ఆమంత్రీంద్రుఁడు ప్రౌఢరాయనృపదండాధీశసంపత్కళా
సామగ్రి న్విలసిల్లి మల్లి సుమ భాస్వత్కీర్తివిస్ఫూర్తి ను
ద్దామాసాధ్యమహామహత్త్వమున సంధాయుక్తి దోశ్శక్తి వా
చామాధుర్యమునం బురావిభులతోఁ జర్చించు వర్చస్వియై. ౨౨

క. అరుదంద లోకమాతని, బిరుదందియఁ గీలుకొన్నభీకరశత్రూ
త్కరములకు ననుదినంబును, సొరిది న్నమకూరు భోగసుకృతఫలంబుల్. ౨౩

సీ. కదలనిభక్తితోఁ గట్టించెఁ బంపావిరూపాక్షుదేవునిగోపురంబు
విఠ్ఠలపతికిఁ గావించి యర్పణచేసె మహనీయతరభోగమంటపంబు
మాల్యవంతమురఘుత్తమావధూభర్తకు ఘనకిరీటం బుపాయన మొసంగె
దరిసెనంబిచ్చె[1] మతంగవీరన్నకుఁ[2] గట్టాణిముత్యాలకంఠమాల
బ్రాహ్మణుల నిల్పె నగ్రహారములయందు, దిక్కు లన్నింటఁ గీర్తులు పిక్కటిల్ల
వెలసె దుర్మంత్రిసంఘాతవిభవజాత, తిమిరకుముదారి యగుచు నాతిప్పశౌరి.

చ. అతనికి భామినీతిలక మై నుతికెక్కినభైరవాంబకు
న్సుతు లుదయించి రిద్దఱు యశోరమణీయచతుర్దిగంతరు
ల్వితరణచాతురీజితరవిప్రభవామరధామధేనువు
ల్కుతలకనత్పురందరులు కొండనమంత్రియు నాగశౌరియున్ ౨౪
౨౫

వ. తదగ్రజుండు.

ఉ. నిండినవేడ్కఁ దేగవహి నిల్పినబంగరుకొండ నాఁగ భూ
మండలి నెల్లవారు బహుమార్గముల న్వినుతింప నశ్వవే
తండవినూత్నరత్నసముదంచితకాంచనముఖ్యవస్తువుల్ ౨౬
కొం డని తిప్పయప్రభునికొండన యర్థుల కిచ్చు నిచ్చలున్.

కీ. వాఁడు నిర్మలనిజవంశవర్ధనుండు, వాఁడు బాంధవసముదాయవత్సలుండు
వాఁడు దేవేంద్రసన్నిభవైభవుండు, వానిఁ బోలఁ బ్రధాను లివ్వసుధఁ గలరె.

సీ. ఘోరాహవక్షోణిఁ గుందిధైర్యముదూలి కురురాజుమడుఁగులోఁ జొరకయున్న
జీవనస్థితి చౌకగా వానరములచే నడిసముద్రుఁడు గట్టువడకయున్నఁ
బోరిలో నడుఁకుచుఁ బూని ధర్మతనూజుఁ డాచార్యుతోఁ గల్లలాడకున్నఁ
బురహరనేత్రవిస్ఫురదనలాహుతిఁ గంతుఁ డనంగుండు గాకయున్న

[1] ధర్మసంబిచ్చె - మూ. [2] వీరణ్ణకును - మూ.

జగతిపై మానగాంభీర్యసత్యరూప, గరిమలను గొంత యెనవత్తు గరసి చూడ
శ్రీశపాదాబ్జసేవాసమృద్ధుఁ డైన, మంత్రితిప్పయకొండనామాత్యునకును. ౨౯

క. ఆకొండమంత్రిమణికి శు,భాకృతిఁ జెన్నొందుమల్లమాంబకు రామ
శ్రీకృష్ణులగతిఁ బుట్టిరి, ధీకలితులు నరసవిభుఁడుఁ దిమ్మఘనుండున్. ౩౦

ఉ. కొండయదండనాయకునికూరిమితమ్ముఁడు నాగరాజు మా
ర్తాండుఁ డఖండతేజమున నంబుజవైరి సమగ్రకాంతి నా
ఖండలమూర్తి భోగమునఁ గర్ణుఁడు దానమునన్ లతాంతకో
దండుఁడు రూపసంపదల ధైర్యమున న్సురశైల మారయన్. ౩౧

క. ఆనాగమంత్రివరునకుఁ, బ్రాణపదం బైనదేవమాంబకు దానే
దానీంతనకానీనుం, డోనాఁ దగి చెన్నశౌరి యుదయము నొందెన్. ౩౨

సీ. ఆమంత్రిపుంగవుం డష్టభాషాకవివర్యుఁడై పొగడొందె వసుధయందు
ద్విపదగా నారసింహపురాణ మొనరించి భక్తి నహోబలభర్త కిచ్చె
బాలభారత మంధ్రభాషను వచనకావ్యంబు చేసెను గవీశ్వరులు మెచ్చ
సౌభరిచరితంబు జక్కులకథ చెప్పె లాలితనవరసాలంకృతముగ
మఱియుఁ బెక్కుకృతులప్పటుమతి రచించె, ఖ్యాతి నరసింగరాయలచేతఁ గొనియె
నగ్రహారంబులును వివిధార్థములును, వెలసెఁ గొండమఁ బెండ్లియై విభవమెసఁగ.

క. ఆచెన్నయమంత్రికిఁ బు,ణ్యాచారకుఁ గొండమాంబ కంచితనీతి
న్వాచస్పతితుల్యుఁడు వి,ద్యాచతురాననుఁడు నరసనాఖ్యుఁడు పుట్టెన్. ౩౪

గీ. తిప్పయామాత్యకొండమంత్రికిని బుణ్య,సాధ్వియగుమల్లమాంబకు సకలభాగ్య
సహితులై యుద్భవించినమహితకీర్తి,హారు లగు నారసింహతిమ్మాఖ్యులందు.

సీ. శ్రీమదహోబలస్వామిపాదాబ్జము ల్బరగించినాఁ డాత్మమధులిహమును
దానాంబుధారల ధారణీసురదైన్యకర్దమపుంజంబుఁ గడిగినాఁడు
సత్కీర్తిమల్లికాసౌరభ్యములను వైరించాండపేటి[1] వాసించినాఁడు
చండప్రతాపమార్తాండమండలిచేత ధూర్తారితుహినంబుఁ దోలినాఁడు
ప్రణుతి యొనరింపఁ దగదె నృపాలసభలఁ, బరమభాగవతోత్తము భవ్యచరితుఁ
జారుతరపుణ్యగణ్యు నీసకలదండ,నాథకులసింహుఁ గొండయనారసింహు.

మ. పరకాంతామణిఁ దల్లిగా మనమున న్భావించు నేవేళ నె
వ్వరితోఁ బొంకఁ డొకప్పు డన్యధనము ల్వాంఛింపఁ డశ్రాంతమున్

1 వైరించాండపెట్టి - మూలము.

హరినామస్మరణంబె కాని యితరవ్యాసంగముల్ సేయఁ డా
నరసామాత్యునిసాటి యౌదురె ప్రధానశ్రేణిలో నెవ్వరుల్. ౩౭

క. నారదుఁ బ్రహ్లాదు న్శుకుఁ, బారాశర్యు న్వసిష్ఠు బలి గాంగేయుం
గోరి వినుతించువేళల, ధారణిలో నరసమంత్రిఁ దగు వినుతింపన్. ౩౮

సీ. ఆనరసామాత్యుఁ డద్రినందనతోడ నలయరుంధతితోడ నదితితోడ
భూమిజతోడ లోపాముద్రతోడ నాజాహ్నవితోడఁ గౌసల్యతోడ
ధారణీకాంతతో భారతీసతితోడఁ బౌలోమితోడఁ సుభద్రతోడ
రుక్మిణీరమణితో రోహిణీదేవితో దమయంతితోడ గాంధారితోడ
సాటిసేయంగఁ దగినట్టి జలరుహాక్షిఁ, బరమకళ్యాణిఁ దిరుమలాంబను వరించి
రమ్యమగుప్రోలుగంటిపురంబునందుఁ, దనరె సౌభాగ్యముల బంధుజనులు

క. శ్రీదనర ననుదినంబును, మేదురభోగములచేత మించిన వేడ్కన్ [పొగడ.
మేదినిలోపల వెలసిన, యాదంపతులకును బంధు లానందింపన్. ౪౦

సీ. నెత్తమ్మితావిఁ జెందినపద్మినీజాతికొమ్మల కతనుండు తిమ్మఘనుఁడు
బంధువర్గంబులభవనాంగణంబుల వెలయు వేలుపుఁదిప్ప వెంగళప్ప
వెలలేనివస్తువు ల్విద్వత్కవీంద్రుల కొసఁగుదానవిహారి యోబశౌరిఁ
నందేలచినయోబనాథహృద్వీణకు రంగుమీఱినతంత్రి రంగమంత్రి
చండమార్తాండసదృశుండు కొండవిభుఁడు, దిశలసత్కీర్తిచంద్రికల్ తేజరిల్ల
జననమొందిరి కల్పవృక్షంబులేను, బురుషరూపము ధరియించి పుట్టెననఁగ.[1]

గీ. అందు నగ్రజుఁడైన తిమ్మాహ్వయుండు, ప్రేమతో లక్ష్మమాంబను బెండ్లియాడి
కుశలవులఁబోలువారలవిశదయశుల, సింగననుమాదననుగాంచెఁ జెన్నుమీఱ

క. ఘనుఁ డైన వెంగళప్ప యు, నానరంగాఁ దిమ్మమాంబ నుద్వాహం బై
దిననాథప్రతిమప్రభు, జననుతచారిత్రు నూరసచివుని గనియెన్. ౪౩

చ. ఉరుతరపుణ్యగణ్యుఁ డగునోబయమంత్రియు గోపమాంబ నం
బురుహదళాయతాక్షిఁ బరిపూర్ణనిశాకరసన్నిభాననం
బరిణయ మై చెలంగి కులపావనుల న్మహనీయవైభవ
స్థిరులను గాంచె నిర్వురను జెన్నచమూవరుఁ దిమ్మనాహ్వయున్. ౪౪

చ. ఘనతరుఁ డైనదానగుణగణ్యుఁడు రంగనదండనాథుఁ డా
వననిధిరాజకన్య కెనవచ్చిననోమలి యజ్ఞవేదిమ

[1] పుట్టిరనఁగా - మూలము.

ధ్యను హనుమాంగనామణి ముదంబలరంగ వివాహమై సుహృ
జ్జనములుసన్నుతింప ఘనసంపద సొంపువహించె నెంతయున్. ౪౫

క. అంగజనిభుండు కొండన, యుం గడువైభవమువీఱ నుత్పలగంధిన్
రంగాంబను నిరుపమితశుభాంగి న్వరియించి మించె నంచితలీలన్. ౪౬

గీ. ఆనరసమంత్రిశేఖరునవరజుండు, గంధిలాశుగలావణ్యగణ్యమూర్తి
తిమ్మధీమణి వెలసె ధాత్రీతలమునఁ, బన్నగారాతివాహనభక్తిపరత. ౪౭

మ. భువిలో నన్నము వెట్టు ద్వాదశుల నాభూదేవరత్నంబు రెం
డవరుక్మాంగదభూకళత్రుఁ డౌ యనా నర్థుల్ ప్రియంబందఁ గ
ర్ణవితీర్ణి [1]ప్రతిభావిభాసి యయి యెన్నం[2]జాలి మందాకినీ
లవలీకల్పలతాసితాంశుహిమశైలత్కీర్తిసంపన్నతన్. ౪౮

గీ. ఆతనికిఁ బుణ్యవతియైన యక్కమాంబ,వలనఁదనయులుగలిగిరివనధిసములు
తిమ్మధీరుండునప్పమంత్రియునునరస,సచివుఁడునుదిర్మలయ్యయుఁజారుయశులు

క. ఏవంవిధవంశంబున, నావిఖ్యాతప్రధానహర్యక్షులలో
శ్రీ వెలయఁ గీర్తిశుభగం, భావుకుఁడై రంగమంత్రి మహి నుతికెక్కెన్. ౫౦

సీ. సర్వంసహామహాజలరుహాకరమున విహరించు నేమంత్రివిజయలక్ష్మి
దిగ్వధూదరహాసదీప్తులతోఁ జెల్మి గావించు నేమంత్రిఘనయశంబు
పెరిమె నంభోధికిఁ బెక్కంద్రుసతుల నుత్పాదించు నేమంత్రిదానవారి
పున్నమజాబిల్లిచెన్ను నన్నువచేసి నవ్వు నేమంత్రిసౌందర్యరేఖ
యతఁడుహావళిచినయాభశావనీశ,బహుళసామ్రాజ్యధౌరేయమహిమనిపుణ
విపులబాహార్గళాటోపవిజితభుజగ,సార్వభౌముండు రంగయసచివఘనుఁడు.

సీ. వైభవస్ఫురణచే వజ్రాయుధుండయ్యు నన్యభామినిఁ గోరఁ డాత్మయందు
సౌందర్యరేఖతోఁ జక్రాహితుండయ్యుఁ దొడిఁబడ నిజగురుద్రోహి గాఁడు
వరదానవైఖరి వైరోచనుండయ్యుఁ గించిత్తు నర్థికిఁ గ్రిందుపడఁడు
వల్గువిక్రమశక్తి ఫల్గునుండయ్యును వెఱచి పోర శిఖండి వెనుక నిలువఁ
డవుర కర్ణాటలాటచోటాంధ్రముఖ్య, మానవాధిపఘనసభామధ్యభాగ
మాగధానీకజేగీయమానకీర్తి, రమ్యగుణహారి నరసయరంగశౌరి. ౫౨

శా. కట్టించెం గలశాంబురాశితనయాకాంతామితాగారము
లొప్పించెన్ ధరలోన సత్రములు భూబృందారకశ్రేణికి

[1] వితీర్ణ్యా - మూ. [2] యుంన్నన్ - మూ.

నట్టిచెంగపటారిమంత్రివరుల సత్కీర్తి లోకంబుల
నెట్టించె న్నరసయ్యరంగసచివశ్రేష్ఠుండు నిష్ఠారతిన్. ౫౩

చ. ధనములు గూడఁబెట్టి వసుధాస్థలిఁ గొందఱు కూళమంత్రులా
ధనములు రాజబాధల వృథా పొరివోనఁగనిత్తు రజ్ఞులై
జనసుతచర్యుఁడైననరసప్రభురంగనమంత్రి దా యశో
ధనములు గూడఁబెట్టి ప్రమదంబున మించె ధరాతలంబునన్. ౫౪

ఉ. రంగనివాసనిర్మలధరంగని పంకజనాభపుత్త్రుదా
రంగని యభ్రవాహిని తెరంగని సాంద్రలసత్సుధాసుధా
రంగని సత్ప్రభాసురుచిరంబగు శ్వేతవరాహమూర్తికో
ఱంగని ప్రోలుగంటిపురిరంగనికీర్తి హసించు నిమ్మహిన్. ౫౫

గీ. ఎలమి నందెలచినయాభశేంద్రదత్త, సలలితాందోళికాచ్ఛత్త్రచామరాది
చిహ్నములుదాల్చి యెంతయుఁ జెన్నుమీఱె, మంత్రిరంగన వెలయుభూమండ [లమున.

సీ. అమరమర్త్యభుజంగమారాధ్యసౌగాస్త్రసోమేశ్వరస్థానశోభితంబు
చెన్నకేశవదేవశేఖరప్రోత్తుంగభవనగోపురసౌధభాసురంబు
పాతకజీమూతపటలఝంఝానిల తుంగభద్రాతీరసంగతంబు
విహృతిలాలసపౌరమహిళాంఘ్రిలాక్షాంక విలసితప్రాకారవేష్టితంబు
జవనసైంధవగంధేభసంకులంబు, చతురవారవిలాసినీసమధికంబు
బహులనిస్తులవస్తుసంపత్తివిజిత, గోపురంబొప్పుఁ బ్రోలుగంటీపురంబు. ౫౬

క. ఆపురి కేశవమూర్తికి, దీపితమణిభూష లొసఁగి దృఢతరరాజ్య
శ్రీపాలనఖేలనధౌరాపాలుఁడు నరసవిభునిరంగన వెలయున్. ౫౭

సీ. గురుతరవాధూలగోత్త్రాన్వయాంభోధిపూర్ణిమాచంద్రుఁడై పొలుపుమీఱె
జైనచార్వాకాదిసకలదుర్మతఘోరగహనధూమాంకుఁడై కణఁకమించె
శిష్యకదంబకచిరతరసంపత్తివితరణఖ్యాతిమై వృద్ధిఁబొందె
శ్రీవేంకటాచలశిఖరమందిరదేవతాపరమూర్తియై యవతరించె
జగతిఁ గందాళభావనాచార్యవర్య, తనయుఁ డయ్యె గురుస్వామిఘనత కెక్క
నట్టి శ్రీరంగగురునాథుఁ డాత్మగురుఁడు, గాఁగ సన్నుతివడసె రంగప్రభుండు.

షష్ఠ్యంతములు.

క. ఏతాదృగ్గుణనిధికిని, ఖ్యాతాశ్రితసకలసుకవికలశాంబుధికిన్ ౬౦
వీతాభిమానశాత్రవ, జాతాభయదాననిపుణశయ సేవధికిన్.

క. ఆర్వేలకులోజ్జ్వలునకు, గర్వితరిపుగహనదహనకనదనలునకున్
సర్వంసహామహాధిక, ధూర్వహబలునకును విగతదుశ్శీలునకున్. ౬౧

క. ఖండితఘనదుష్కృతికిని, బండితజేగీయమానపరహితకృతికిన్
గండస్థలమండితమణి, కుండలవితతికి నిరస్తకుహనామతికిన్. ౬౨

క. పాత్రచరితాశ్వలాయన, సూత్రున కధికతరసుకృతశుభగుణచంచ
ద్గాత్రునకును బుధనుతచా, రిత్రున కశ్రాంతకృతహరిస్తోత్రునకున్. ౬౩

క. శ్రీనరపాదాంభోరుహ, సేవాదత్తావధానచిత్తాబ్జునకున్
భావభవసదృశరూపధు, రావంచితనిష్కళంకరాకాబ్జునకున్. ౬౪

క. హీనుమండలరిపుమండల, సమచండిమభీమధామసంస్త్యాయునకున్
రమణీయసురమణీనిక, రమణిధ్యేయునకు దానరాధేయునకున్. ౬౫

క. నరసప్రధానురంగన, కరినృపదుర్మంత్రిగర్వహతిచంగునకుం
గరుణాగుణసంగునకును, బరమతరపరోపకారఫలితాంగునకున్. ౬౬

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నే రచియింపంబూనిన యుత్తరనరసింహపురాణంబునకుఁ బ్రారంభం బెట్టి దనిన. ౬౭

## ←→ కథాప్రారంభము. ←→

ఉ. పుణ్య మగణ్యయాగఫలభోగనిరస్తసమస్తదేవకా
ర్పణ్యము ముక్తియానతశరణ్య ముదగ్రసమగ్రబోధదా
క్షిణ్య మశేషకాననవిశేషవరేణ్యము నైన నైమిశా
రణ్యము చూడ నిం పగుఁ దరణ్యభిభావిసరణ్యగాగ్ర మై. ౬౮

సీ. ఏయరణ్యమునందు నింద్రాదిదేవతాతతి సకుటుంబమై తిరలకుండు
నేయరణ్యమునందు నిసుమంత జాతివైరము లేక సత్త్వజాతములు మెలఁగు
నేయరణ్యమునందు నిందుశేఖరధాతృకమలాక్షముఖులు సౌఖ్యంబు గాంతు
రేయరణ్యమునందు నాయురారోగ్యాభివృద్ధిప్రదాయి వివేక మడరు
నేయరణ్యంబునందు భక్తేప్సితార్థ, సిద్ధికరి యైనయోగలక్ష్మియుఁ జెలంగు
నట్టి శ్రీనైమిశారణ్య మఖిలమాని, విహరణస్థానియై యభివృద్ధిఁ దనరు. ౬౯

వ. ఆనైమిశారణ్యంబునం బ్రబోధనిస్తంద్రులగుమహామునీంద్రులునఖిలకళ్యాణాకర్షణుం డగుగోమహర్షణువలన హిరణ్యకశిపుజన్మంబును నతనితపోమహత్త్వంబును జంభునికూఁతు రైనయంభోరుహాక్షిఁ గయాధు వనుదానిస్వయంవరంబును మొక్కలంబున నక్కన్యకారత్నంబు హిరణ్యాక్షపూర్వజుం డఖర్వ

దోర్గర్వంబునం దెచ్చుటయును జంభహిరణ్యకశిపులయుద్ధసంరంభంబును నారంభోరువువలనఁ బ్రహ్లాదు నుదయంబును నతండు దైత్యకుమారులకు విష్ణుభక్తిప్రకారం బుపదేశించుటయును గనకకశిపుండు తనతనయుం గనలి పలుకుటయును శ్రీనృసింహావతారంబును హిరణ్యకశిపువిశసనంబును మొదలుగాఁ గలుగుకథావధానంబులు విని యక్కథకునకు శౌనకాదిమునీంద్రు లి ట్లనిరి. ౭౦

ఉ. శ్రీనరసింహమూర్తి సురసిద్ధగణంబులు సన్నుతింప స
ద్దానవనాథువక్షము శితత్రిదశేశ్వరవజ్రనిష్ఠురా
త్యానతవిస్ఫురన్నఖచయాగ్రముల న్విదళించి యంతఁ ద
త్సూనునిఁ గాచి మెచ్చుటికిఁ జువ్వన నేగనొకో యకల్మషా. ౭౧

గీ. విష్ణుకథలు తొల్లి వినినవేనియు నిత్య, నూతనోత్సుకంబు నూలుకొలిపి
పరిణమింపఁ జేయు హరిణాంకకిరణంబు, లభినవములు గావె యనుదినంబు. ౭౨

క. భవదీయముఖవినిర్గత, వివిధకథామృతము గ్రోలి వివశములై మా
చెవు లిపుడుఁ దనివిఁ బొందవు, భవగుణరహితప్రచార పరమోదారా. ౭౩

వ. అని పలుకున మ్మహాతపోధనుల మునుమునుకులంబోని సూక్తిజాలంబు లాలించి సహర్షోత్కర్షంబుగ రోమహర్షణుం డమ్మహాత్ముల కి ట్లనియె. ౭౪

క. నారాయణపదయుగళాం, భోరుహసద్భక్తు లఖిలపూజ్యచరిత్రుల్
మీ రెఱుఁగని విష్ణుకథా, ప్రారంభము లున్నవే మహామతులారా. ౭౫

గీ. అయిన నేమి యుష్మదంఘ్రిపదార్చనా, ఫలితబుద్ధి సిద్ధిఁ బరఁగి యేను
నృహరిదివ్యదేహనిర్యాణ[1]వృత్తంబు, వినినయంత మీకు విన్నవింతు. ౭౬

## ⟵ నారదుఁ డింద్రునికడకు వచ్చుట. ⟶

వ. అది యెట్టి దనిన నొక్కనాఁడు మహేంద్రుండు దేవగంధర్వసిద్ధసాధ్యరక్షోయక్షదిక్పాలకకిన్నరకింపురుషగణంబులును రంభాదిసురకామినులుం గొలువ నిండుకొలువున కేతెంచి యందు రత్ననిర్మితం బైనసింహాసనంబున సమాసీనుండై యున్నసమయంబున సమరభోజనప్రయోజనవిశారదుం డగు నారదుం డేతెంచిన నమ్మహాత్ముని నెదుర్కొని యర్ఘ్యపాద్యాదు లర్పించి సముచితాసనంబున నుపవిష్టుం జేసి కృతాంజలియై యిట్లనియె. ౭౭

క. భవదీయపాదరేణువు, దవిలిన మద్భవన మెల్ల ధన్యత నొందెన్
వివిధశుభాస్పద మయ్యెను, దివమును ద్వద్దర్శనమున దివ్యమునీంద్రా. ౭౮

[1] వృత్తమే - మూ.

గీ. అడుగవలయు నొక్కటడిగెద నది మాకు, నిర్ణయింపవలయు నేర్పుతోడ
నీజగంబులందు నెఱుఁగని దొకటైన, గలదె మీకు నఖిలకలుషదూర ౭౯

క. హరి నరహరియై నఖముల, సురవైరి వధించి యతనినుతుఁ గాచి యనం
తరమున నిజతను వేక్రియఁ, బరిముక్తము చేసెనొక్కొ పరమార్థజ్ఞా. ౮౦

వ. అని పలికిన దేవేంద్రునకు మునీంద్రుం డిట్లనియె. ౮౧

ఉ. ఆ నరసింహుఁ డట్లు శరభాకృతిఁ దాల్చుపురాసురారితోఁ
బూనినరోషవహ్ని నిజభూత్కృతిమారుతవేగవర్ధితం
బై నలినోద్భవాండము నహర్నిశముం దహియింప దేవతా
దానవబృందము ల్బెగడఁ దా నొనరించె రణం బరీణుఁడై. ౮౨

క. శరభనృహరు లీక్రియ దు, ర్ధరయుద్ధముచేసి చేసి తమతమ తేజ
స్స్ఫురణాపరిణాహము లా, దరమున నజునలనఁ దెలిసి తత్ప్రియమునకై. ౮౩

క. నరసింహశరభరూపము, లురవడి నుపసంహరించి యొద్దికతోడన్
హరిహరు లొకతనువున నిలి, చిరి సురలు నుతింప భువనచిత్రచరిత్రా. ౮౪

క. ఆక్షేత్రము హరిహర మన, దక్షిణదిక్ప్రథిత మయ్యెఁ దన్నికటమహీ
మక్షికయు నిలిగి యక్షయ, మోక్షశ్రీ నక్షియుగళముకురము సేయున్.

వ. అని యిట్లు నారదుండు నృసింహావతారోపసంహారవృత్తాంతం బెఱింగించిన
విని పురందరుం డిట్లనియె. ౮౬

క. హరిహరులు లోకరక్షా, పరులు నృహరిశరభరూపబంధురులై భీ
కరఖరకరకరశితముఖ, శరముల ననిసేయు టేమిచందమొ యనఘా. ౮౭

క. సురభావితపదయుగ యగు, శరభాకృతి పూర్ణచంద్రశరభాకృతి శం
కరునకుఁ బూనఁగ నేపని, హరు వయ్యెనొకో రణాశనా తెలుపఁ గదే. ౮౮

వ. ఇవ్విధంబున శచీవల్లభుండు పలికినఁ దపోధనవల్లభుండు విని శరభావతార
వృత్తాంతంబు స్వకీయాపరాధంబున నైనది యగుటం జేసి యతండు తత్క
థావిశేషంబు సంకోచంబునం జెప్పి బ్రహ్మలోకంబున కరిగె నని రోమహర్ష
ణుండు శౌనకాదులకు విన్నవించిన నమ్మునీంద్రు లి ట్లనిరి. ౮౯

క. ఏమియపరాధ మొదవెం, దామరవిరిమనుమనందుఁ దత్కథ సర్వం
బామీఁదటివృత్తాంతము, ధీమహితా నీవు మాకుఁ దెలుపఁగవలయున్. ౯౦

వ. అనిన విని రోమహర్షణుం డమ్మునీంద్రుల కిట్లనియె. ౯౧

సీ. హరిదానవాధీశు నణఁపనుద్యుక్తుఁడై పురుషహర్యక్షవిస్ఫురణ దాల్చి
త్రిభువనానందపరిష్కుఁడై యాహిరణ్యకశిపు నరికట్టి యురఁగఁబట్టి

యాదిభాగవతుఁ బ్రహ్లాదునిఁ దద్రాజ్యవిభునిఁగా నొనరించి శుభములొదవఁ బ్రజలరక్షించి భూభారమంతయు మాన్చి నిశ్చింతహృదయుఁడై నెగడియుండ నంతహతశేషులైన దైత్యాధిపతులు, సంతతంబును భయసమాక్రాంతులగుచు మందరద్రోణికామధ్యంబునకును, జేరి యచ్చో మిథస్సమాసీనులగుచు.

క. చింతాపరవశులై మది, నెంతయుఁ బరితాప మంది హితకార్యంబుల్
చింతించుచుఁ దమలోన, త్యంతంబును బ్రదుకుఁదెరువు తహతహ నూఱన్.

ఉ. దానవనాయకుం డణఁగెఁ దత్సుతుఁ డిప్పుడు విష్ణుభక్తుఁడై
దీనునిమాడ్కిఁ బ్రత్యహము దేవగణంబుల కాప్తుఁడై తదీ
యానుమతంబులైనపను లర్థి నొనర్చుచు నున్నవాఁడు దు
ర్మానముతోడఁ దండ్రిపగ మానసవీథిఁ దలంపఁ డింతయున్. ౯౪

సీ. అవినీతుఁడైన ప్రహ్లాదుని మనకెల్లఁ బతిగాఁ దలంచినఁ బ్రాణహాని
వంద్యుఁడై దేవుఁడై వరదుఁడై దైతేయపతులకెల్లను దిక్కు పార్వతీశుఁ
డామహాత్ముని నాత్మఁ బ్రేమతోఁ దలఁచినఁ గలుగు నిష్టము[1]లైన ఫలములెల్ల
నీయఁడే తొల్లి దైత్యేంద్రుల కతిమోదమున వరంబులు లోకములు నుతింప
ననుచుఁ దలపోసి యాతుధానాగ్రచరులు, పద్మమిత్రునిపై దృష్టిపాదుకొలిపి
జలము వాయువు నాహారములుగ నడపి, తపము సేయంగఁబూనిరిదర్పముడిగి.

← దానవులు శివునింగూర్చి తపము చేయుట. →

చ. దనుజులు దేహవాంఛ విడఁదన్ని శివాధిపుఁగూర్చి సంతసం
బునఁ దప మాచరించు నెడఁ బుట్టినతద్దహనోగ్రకీలల
న్మనుకొని సర్వలోకములు ముచ్చముణింగె బెహారి సంచుల
న్దినముతుది న్మణించినగతిం బ్రవిముక్తబహిఃప్రచారతన్. ౯౫

క. దనుజకృతం బగుతపమున, మనసిజసంహారునినిండుమనము గరంగెం
గనదనలద్రావితనూ, తననవనీతప్రపూరితకలశలీలన్ ౯౬

సీ. వలమానదహనకీలల నీను నెమ్మోము ములికితోడావంక కలికితోడ
వెలఁదివెన్నెలరేల వికసించు విరవాజి[2]పువ్వుతో నిద్దంపునవ్వుతోడ
వలపువసంతంబుఁ దలకొల్పు సుస్నిగ్ధభూతితో శృంగవద్వ్రతితోడ
వికటంపులీలలు ప్రకటించి నవ్వించు నందితో[3] వినుగూపుమందితోడ
భుజగహారంబుతోడఁ గర్పూరతుహిన, రాశిసంకాశకాంతిపూరంబుతోడ
నమరరిపులకుఁ బ్రత్యక్షమయ్యెనిఖిల, సంయమివశంకరుం డగుశంకరుండు.

[1] నిష్కామము - మూ. [2] ఖిరివాజి - మూ. [3] వందితో - మూ.

మ. కని రాదైత్యులు నందివాహనుని శ్రీకంఠుం ద్రిశూలాయుధు
స్వనజాతారికళాధరుఁ హిమసుధావర్ణుం ద్రినేత్రుఁ జతుర్భుజం
గనికాయాంచితభూషణుం బ్రమథసంక్రాంతుఁ జటాపర్యట
ద్ఘనపుష్పాకలితుఁ హిమాద్రితనయాకాంతుఁ స్మహాశాంతునిన్. ౯౯

వ. అంత నద్దనుజవీరులు కరుణారసప్రవాహ మకరందనిష్యందతుందిలంబును నకుంఠితకంఠకాళిమకలభసలకలభమసృణంబును బ్రసవశరశరీరగంధసారసంజనితక్షోదమేదురపరాగంబును సరాగజటాపటలఝూటఘటితకుటిలకుముదినీవిటకోరకంబును నుదారబాహామండలవిటపమండితంబును దుహినగిరిదుహితృలతాలింగితంబును నగు నాయనంగమథనునాకారంబు నిజతపఃఫలప్రదాయకం బగు లేఖనాయకశాఖిశేఖరంబుగాఁ దలంచి యలంత కలంతయుం దొలంగి తదీయశీతలచ్ఛాయాచక్రంబు నాశ్రయించుచు నవని కెఱఁగిలేచి కరకమలపుటంబులు నిటలంబుల ఘటియించి యి ట్లని స్తుతియించిరి. ౧౦౦

## రాక్షసులు శివుని స్తుతియించుట.

సీ. శ్రీనీలకంఠ యాశ్రితభక్తవత్సల పురవిభేదన సర్వభూతనాథ
శంకర గౌరీశ శర్వ లోకేశ్వర గంగాంబుపరిషిక్త కాలరూప
కందర్పభసితసంక్రాంతభవ్యశరీర చంద్రశేఖర నాగచర్మవసన
నందివాహన జగద్వందిత శూలవిభ్రాజితకర లోకపాలవినుత
భవ మహాదేవ పన్నగాభరణ రుద్ర, ప్రమథనాయక దక్షాధ్వరప్రశమన
యంధకాసురహరణ సత్యస్వరూప, మమ్ము రక్షింపవలయు భీమప్రభావ. ౧౦౧

క. పురుషుఁడు రుద్రుం డనుచును, మొరయుచునలసకలవేదములుచాటెడిచోఁ
బరమేశ పురుషదైవాం, తరమున్న[1] దియే జగత్త్రితయమునఁ దలఁపన్. ౧౦౨

క. జ్వలనవియన్మరుదచలా, జలదీక్షితచంద్రపంకజప్రియు లన మీ
విలసన్మూర్తులఁ ద్రిజగం,బులు నిత్యము వృద్ధిఁబొందు భూతనివాసా. ౧౦౩

క. నారదసనకసనందన, మారుతభుగ్రమణవిబుధమంత్రిషడాస్యాం
భోరుహసంభవముఖ్యులు, మీరూపముఁ దెలియఁ గలరె మీనాంకహరా.

మ. కరిదైత్యేంద్రుని సంహరించి త్రిజగత్కళ్యాణముం గోరి శం
కర నీ వాక్రియఁ దాండవంబుసలుపంగా నీదుమై రాలున
మ్మరులుం గమ్మనిబూది దేవమునిసామ్రాట్సిద్ధగంధర్వభా
స్కరచంద్రాదులు దాల్తు రాదలల రాకాకాముకాభప్రభా. ౧౦౪

[1] మున్నదే. మూ.

చ. ధరణి రథంబు చక్రములు తారకనాయకలోకలోచను
ల్పరపగు వేదజాలములు పన్నిన తేజులు నల్వ యంత ని
ర్జరగిరి విల్లు సింగిణి భుజంగమభర్త శితాస్త్ర మిందిరే
శ్వరుఁడును నై చెలంగఁ బురసంహరణం బొనరించి తీశ్వరా. ౧౦౬

చ. గరుసులుమీఱ మందరముఁ గవ్వముచేసి సురాసురావళుల్
తరువఁగఁ దర్వఁగా నిఖిలదాహకరోత్కట కీలజాల మై
గరళము పర్వఁ గేలఁ గొని కంఠముసేర్చితి విట్టి మొక్కలం
బొరులకు సంభవించునె సురోత్తమ పాదనతాత్మవిత్తమా. ౧౦౭

ఉ. దక్షుఁడు దక్షుఁడై క్రతువిధానమొనర్పఁగ దర్పఘోరరూ
క్షేక్షణవిస్ఫులింగముల నెల్లజగంబుల వేఁచుచు న్వీరూ
పాక్ష తదీయమస్తకము హస్తకనన్మణికందుకంబుగా
నాక్షణమాత్రఁ జేయనె మహాపురభైరవ కాంతికైరవా. ౧౦౮

క. రక్షారుద్రాక్షోపరి, లక్షితశుభలక్షణులకు లంచము లిడు న
మ్మోక్షరమ యిక్షుకార్ముక, శిక్షాకాక్షేయనిటలశిఖిజటిలశిఖా. ౧౦౯

క. కలువీడు చేతికూడు, న్నలకలజం దెంపుఁద్రాడు మదనునిసూడుఁ
వలచేఁ గంకటికోడుం, గలవాఁడా నీదుకరుణగలవాఁడు శివా. ౧౧౦

చ. పరధనచోరకుండు గురుభామలతో రతిసల్పువాఁడు భూ
సురవరహంత మద్యపుఁడు సూనృతవాక్యవిహీనుఁ డాదిగాఁ
బరఁగునశేషకల్మషులు పన్నగభూషణ మీపదాంబుజో
పరిపరిలగ్నభక్తిపరిపాకమున న్సుఖు లౌదు రెయ్యెడన్. ౧౧౧

క. శివశివ యని మిమ్ముఁ దలఁచిన, భవ భవరాహిత్యమొంది పంచజనుఁడు ప్రా
భవభవనాయితతనువై, కవకవ నగు జన్మపాశకాంధావృతులన్. ౧౧౨

ఉ. సైకతదారులోహమణిచందనపంకములందు దివ్యలిం
గాకృతిగా నొనర్చి మిము నందుపయి న్విడియించుచున్ వృథా
పాకముగాని నేమముల భక్తిభరంబునఁ బూజసేయు పు
ణ్యాకృతు లుందు రెందుఁ బ్రమథాధిపులై రజతాద్రికందరన్. ౧౧౩

క. శివలింగదాన మూర్వి, దివిజులకు నొసంగునట్టి ధృతిమంతులు పు
త్రనధూధనవాహనభాం, ధవపరివృతు లగుచు సంపదలు గాంతురిలన్.

సీ. భసితత్రిపుండ్రము ల్ఫాలపట్టికలపై ధరియింపనేర్చినతత్త్వవిదులు
కంఠభూషలుగాఁగఁ గైకొని రుద్రాక్షదామము ల్దాల్చి నధర్మరతులు

ప్రేమతోఁ బంచాక్షరీమంత్రరాజంబు జపియించు సంతతాచారపరులు
బాహ్యంబు మఱచి యా[1]భ్యంతరమ్మునమిమ్ముధ్యానంబు సేయుపుణ్యస్వరూపు
లన్య మెఱుఁగక శైవమార్గానురక్తిఁ, బొదలుచుండెదు విశ్రుతాద్భుతచరిత్రు
లలఘుపుణ్యులుభవబంధములుత్యజించి,ప్రమథులైమిమ్ము సేవింతురమరవంద్య

నిర్గోష్ఠ్యసీసము.

సతతసత్యాకార చంద్రశేఖర శైలతనయాధినాయక దైత్యహరణ
గరళసంక్రాంతకంధర దయాసాగర హరిరాజకటక యనంగదళన
గంగాధర యహార్యఖండనాద్యాశాదళేశార్చిత శ్రీశ హితగణేశ
ఘనగజాజినచేలకలితకటిస్థల రజతాద్రినిలయ సారజ్ఞరసిక
ఖరఖరానలశశినేత్ర కాంచనాగ, శార్ఙ్గరంజితకరకంజ చక్రహస్త
నిశితసాయక నిఖిలార్థ నిత్యచరిత, సకలజగదయనయద రసాశతాంగ. ౧౧౬

చ. జయజయపార్వతీరమణ చంద్రహుతాశనసూర్యలోచనా
జయజయ దేవతానివహసంతతసన్నుత భక్తవత్సలా
జయజయ పద్మజాదిమునిసంఘనిషేవితభావభావితా
జయజయ వామదేవ గజచర్మధరా బహుధర్మసాదరా. ౧౧౭

వ. అని యిట్లు దానవవీరులు సాక్షాత్కరించిన దాక్షాయణీవల్లభుని ననేకవిధం
బుల సన్నుతించి మఱియు నిట్లనిరి. ౧౧౮

సీ. విను విరూపాక్ష నీకనికరంబునఁ జాలఁ బొదలి హిరణ్యాక్షపూర్వజుండు
భూస్వర్గపాతాళములు మూఁడు నరికట్టి గరిగంటిగాని సౌఖ్యములఁ దనరి
విభవసంపూర్ణుఁడై వెలసి యుండెడిచోట దంష్ట్రాకరాళవక్త్రంబుతోడ
నరసింహరూపంబుధరియించికఱివేలుపుక్కఁ[2]గంబము చించి యుఱికి వెడలి
తొడలపైఁ బెట్టి దైత్యేంద్రు నడఁగఁబట్టి, శితనఖరశిరములఁ గుక్షి చీరివైచి
సకలరాక్షసబలమెల్ల సంహరించి, తత్కుమారునిఁ గాచె నంధకవిదారి. ౧౧౯

క. ఆనరకేసరినాసా, నూనానిలనిహతిఁ గెరలునురుదంష్ట్రాదం
ష్ట్రాననదహనజ్వాలకు, దానవసంతానములు పతంగము లయ్యెన్. ౧౨౦

వ. మఱియును. ౧౨౧

సీ. హాలహాలారవనర్తనారంభరంగమై మేటిజిహ్వాకకోల మెఱుఁగులీనఁ
జిటచిటారభటితోఁ జెలఁగుదంష్ట్రాటంకసంవర్తవహ్నిపోసనముగొనఁగ

[1] యభ్యంతరంబు - మూ. [2] కరవేల్పు పుక్క - మూ.

భుగభుగధ్వనులతో నెగసిమిన్నందుచుభూత్కారవాయువుల్పటములెగయఁ
గిటకిటచ్ఛబ్దసంకీర్ణంబులై దంతకూటకాటికలు కోలాటమాడఁ
బద్మజాతాదిసురలెల్లభయమునొంద,నున్నవాఁడదెనరసింహుఁడుగ్రుఁడగుచు
నతనికతమునసముద్భవంబైనసాధ్వసంబుఁదొలఁగించిమముఁబ్రోవుచంద్రజూట.

వ. అని యిట్లు సురలు నరసింహావిర్భావవృత్తాంతం బెఱింగించిన నాకర్ణించి పరమేశ్వరుం డి ట్లనియె. ౧౨౩

సీ. దనుజనాయకుఁగార తథ్యంబు చెప్పెద వీను లు దనియంగ వినఁగవలయుఁ
గార్యసాధ్యము లైనకర్తవ్యకర్మముల్ ఖడ్గసాధ్యంబులు గావు ఖడ్గ
సాధ్యంబు లైనట్టి సకలకర్మంబులు గార్యసాధ్యంబులు గావు తెలియ
నీరెండు నెఱిఁగి యెయ్యేది యెందు కర్హంబు తద్వినియోగంబు దగినకార్య
మందుఁ దలకొల్పు సిద్ధించు నర్థలాభ, మట్లుగావునఁ ద్వత్తఱం బాత్మ నణఁచి
తపముచాలించుఁడెంతయేనుపమఁ జేసి, పాదుకొల్పెదమీకార్యభాగమిపుడు.

వ. అని యాకాకోదరకుండలుం డామహోదఃదీర్ఘదర్శిదంతఘాటకప్రముఖు లైన పూర్వబర్హిర్ముఖుల నాదరించి. ౧౨౪

క. సురగరుడోరగనరకి, న్నరనానానుతులు చెలఁగ నాగాభరణుం
డరిగెఁ దన వెండికొండకు, గిరిజాకరజలజపత్రకీలికరుఁ డై. ౧౨౫

వ. ఆసమయంబున. ౧౨౬

సీ. భర్గుమైభోగంపుఁ బచ్చడంబులకుఁ గెంజడరంగుచంద్రికచాయ వేయఁ
బండువెన్నెలముగ్గుపైనిండఁ బేరిన పద్మారిగతి మేనిభ సితమమర
నాకాశగంగామహాకుల్య వలిమలఁబోలెఁ జన్నిదముల పొంకమమరఁ
గరుణాంబుపూర్ణహృత్కమలంబుగతిఁ గేలి తీర్థకుండిక భానుదీప్తిఁ దెగడ
నక్షమణిభూషణాంకితుం డాదివైష్ణ, వాన్వయవతంస మఖిలవిద్యావిశార
దుండునారదుఁడే తెంచె ఖండపరశు, వెండికొండకుఁ గన్నులపండువగుచు.

క. హరుని గనుంగొని తత్పద, సరసిజయుగమునకు మ్రొక్కి చతురయుపక్రో
మ్ఘరువున నురమునఁ బాయక, మరులుకొనఁగఁ జేయు తనదుమహతిన్వీణ.

వ. ప్రసారితంబులైన తంత్రీముఖములందు సారియలొనరంగూర్చి యందు స్థాయి సంచార్యారోహావరోహ భేదరూపంబుల వాద్యనువాది వివాదిసంవాదులు మొదలైన ద్వావింశతిశ్రుతిమండల సమేతంబులై నంద్యావరజీమూతసుభద్ర నామకం బైనగ్రామత్రయంబునుగలిగి యేకోనవింశతి మూర్ఛనానామ భేదంబులం బ్రవర్తించు షడ్జరిషభగాంధారమధ్యమపంచమధైవతనిషాదస్వరం

బులు షాడవౌడవసంపూర్ణంబులం బ్రకీర్ణంబులుగా నావర్తనప్రకారంబులం బరిభ్రమించు భైరవి భూపాళ శ్రీరాగమాళవినాట రామక్రియా శంకరాభరణ బళహంసాది స్త్రీపురుషరాగంబులు శుద్ధసాళగసంకీర్ణంబుల శ్రవణమనోహరం బగున ట్లంగుళీస్పర్శనచమత్కారవిశేషంబునఁ బాదుకొల్పుచు రాగాలప్తిసమేతంబుగాఁ ద్రిపురవిజయాపదానంబు రూపకాలప్తిమార్గంబున వినిపించినఁ దద్గానంబు నాకర్ణించి గోకర్ణవలయుం డాదరించిన నంతఁ దద్భావం బెఱింగి పరమేష్ఠికుమారుం డి ట్లనియె. ౧౩౦

చ. ధరణిఁ బదద్వయం బనలతారకనాయకలోకబాంధవుల్
గరహరనీకు నేత్రములు గాడ్పులు నాభి జలంబు....మం
బరము శిరంబునైనిగమపంజరకీరము నీశరీర మీ
శ్వర జగదేకపూర్ణవిలసన్మహిమంబున నుల్లసిల్లెడుఁ౯. ౧౩౧

క. అవనతముఖమగుతామర, పువుటిత్తిగ మీఁదుగాఁగఁ బొంగించి శిర
స్థవనజనహస్రపత్రము, లవిక్రిందుగ నమృతమాను యతి యసమమతీ. ౧౩౨

క. భుక్తియు ముక్తియు నొసఁగఁగ, శక్తుండవు నీవెయనుచు సంసారసుఖా
సక్తిఁగడకొత్తి భక్తులు, భక్తి న్నినుఁగొలుతు రమృతభక్తాధీనా. ౧౩౩

శా. బ్రహ్మాండోదరపూరితుండవగు నీపాదాంబుజద్వంద్వముఁ౯
బ్రహ్మాదుల్గన లేరమైనను భవద్భక్తిప్రభావోన్నమ
ద్బ్రహ్మజ్ఞుల్ హృదయంబులం దలఁచుచుం బ్రఖ్యాతులై చాలఁద
ద్బ్రహ్మానందసుఖంబు నొందుదురు రుద్రా భద్రనిర్వాహకా. ౧౩౪

వ. అని నానాప్రకారంబుల నిర్వికారాకారుండై నీరజాసనకుమారుండు కుమారజనకుం బ్రణుతించిన నాపన్నగకంకణుండు ప్రసన్నుండై యతని కి ట్లనియె.

చ. మునివర నీవెఱుంగనివి మూఁడుజగంబుల లేవు దజ్జగ
జ్జనితములైన వృత్తము లజస్రము ధాతకుఁ గానిపించునా
యనకడనుండి నీవిటకు నైచను దెంచుట కెద్దిహేతు వీ
వనిగనఁగోరి త్రిమ్మరుదు వంతియ కా కితరంబు గల్గునే. ౧౩౬

గీ. భామినీసుతార్థపశుగతం బగుకోర్కి, లేదు నీకునొక్కలేశ మైన
ముక్తి వేఁడె దన్న ముక్తుండ విటమున్న, యేమి గోరి వచ్చి తో మునీంద్ర.

క. అని నీలకంధరుఁడు పల్కినపల్కుల నాలకించి కేలిమొగుపుతో
మునివరుఁడు వినయవినమిత, తనుఁడై యి ట్లనియె నతనుదళనుని[1] తోడఁ౯

1 శౌనక౯.

సీ. బలితంపుఱెక్కమొక్కల మొక్కలపుగాడ్పు ప్రాఁతగుబ్బలులనుఱ్ఱూఁతలూఁప
ముఱియించు నిరువంకముఖరంధ్రములనుండిపొగ లేనిమంటలుబుగులుకొనఁగ
గజగాత్రములసావిఁ గబళింపఁ దునుకలై బలునీటిమోపరిబలఁగ మగల
మెట్టియూఁదిన[1] నేలపట్టువిచ్చిన గాడి నెరియల బలియింటి నెలవు దోఁపఁ
దారకలు రాల గ్రహములు ధరణిఁ వ్రాల, జలధి ఘోషింప దిక్కులు జలదరింప
హరుఁడుశరభావతారంబు నవధరించి, వేగ మానవహరిపురోవీథి నిలిచె.

వ. ఇవ్విధంబున రుధిరోద్గారిముఖద్వయతిలకీకృతతృతీయలోచనద్వితయంబును శాతచంచూపుటవిపాటితహరిదంతదంతికుంభకూటంబును బ్రహసితగ్రహ మణకిరణధారాపరిణాహసితప్రహరణఘృణిద్విగుణీకృతవలయమణికిరణభుజా దండంబును నఖండపక్షవిక్షేపప్రక్షుభితనభోభూమిభాగపాతాళగోళసంచారి సంచయంబునుదర్పితసర్పహారకర్పూరప్రకారకాంతిసంతానవర్ధితశరశరదభ్ర విభ్రమంబును జతురచరణచంక్రమణసంచలితకులాచలనిచయంబును నపార వీరావేశఘోరాటోపదీపితాంతరంగతరంగితక్రోధరసవికసనచకితజఠరస్థజగ జ్జాలంబు నై యాభీలం బగుశరభాకారంబు తోరంపుబింకంబునం గొంకక తనకట్టెదుటం జూపట్టుటయు నాకంబంపుంబుట్టు వాజగజెట్టి తన బెట్టిదంబు వారించుటకు నై చేరిన మారవిరోధి మతకంపురూపుగా నెఱింగి కోపంబు లోపలనే యడంచి గాంభీర్యగౌరవకాఠిన్యగర్వగర్భితవాక్యసందర్భంబున ని ట్లనియె. ౧౫౮

క. నీయందము నీచందము, నాయందములోనియవియు నాళీకహిత
చ్ఛాయకు లోపడనితమం, బేయెడ నున్నది యెఱుంగవే వికృతఖగా. ౧౫౯

సీ. అర్థపౌరుషము నీకనురక్తమైనది యాలంబుమీఁదనె ట్లాసపుట్టెఁ
గరతలామలకమ్మై కనుపట్టు శూలంబు భవవైద్యుఁ డనుకొంట పాటియగునె
తోలు గప్పియు నెట్లు తొడవనేర్చితి వుగ్రవారవాణము* వీరవర్ణితంబు
భంజళ్లఁ ద్రొక్కింపఁ బాండిత్య మున్నదే యీజంద్గనము విహీనజనము
వెంటబూడిదపం డైనతొంటిమేను, విడిచి యొకపుల్గవై యేలవిఱ్ఱవీఁగె
దింత నిలు పోకుపోకు నీగంతు లెల్ల, మానిపించెద శరభసమాఖ్యతోడ.

క. ప్రద్యోతన తేజంబున, విద్యుత్ప్రభ యడఁగినట్లు విక్రమమున నీ
యుద్యోగము వారించెద, నాద్యంత ముదగ్రవిగ్రహానలశిఖలన్ ౧౬౧

[1] యూఁరిన. *వారవారణ - మూ.

వ. అనిన విని కనలి సరభసంబుగ నాశరభశ్రేష్ఠంబు నిష్ఠురాలాపంబులు దీపింప నాదివ్యహర్యక్షుంబుతో ని ట్లనియె. ౧౬౨

క. కులమును రూపును గుణమును, గలవాఁడవె పోలె నొరులఁ గఠినోక్తులచేఁ గలఁగఁగ నాడెదు నీకును, గులమును రూపంబు నొక్కగుణముం గలదే.

సీ. సర్వ[1]జాతుల యథేచ్ఛాప్రవృత్తివర్తింతు కుహనావిహారి వై రహివహింతు
వేకాకి వైయుండు వీరంపుగుహలందుఁ బట్టిచూడఁగరాదు పరుఁడ వెపుడు
తండ్రిబిడ్డలకైనఁ దలపెట్టుదువు పోరు కాద్రవేయ[2]ము పోలె నిద్రఘనము
పుణ్యజనశ్రేణిఁ బోలియింతు వూరక దామోదరుఁడవు శ్రీధరుఁడ వెట్లు
కొలుచువారలలచ్చి కే[3]క్రుచ్చదంతు, గబ్బుమీఱెద విసుమంతగాని లేవు
నిన్ను నీసుద్దు లన్నియుఁ గన్నవార, మేల నామ్రోల నూరక ప్రేల నృహరి.

క. కదనంబున నాఱెక్కలు, సదనంబుగఁ బొదమునెంచు ఝంఝానిలముల్ వదనంబు సోఁకునప్పుడు, పదనంబుజనాభ తివిచి పఱచెద విచట౯. ౧౬౫

క. ధరఁ దూఱిన గిరిఁ జేరిన, శరనిధిఁ గ్రొచ్చిన నభంబు చని చొచ్చిన నా కరచరణనఖరధారలఁ, బరుసమృగమ నిన్ను నిపుడ పొలియంజూతు౯. ౧౬౬

ఉ. సంధికి వచ్చినాఁడ విను సర్వజగంబులుఁ గ్రోధవహ్ని కి
ట్లింధన మేలచేసెద వొకించుక శాంతి వహించు నీకు మ
ద్బాంధవముద్ర మే లిటులు పల్కుట ని న్గని వీఁగి కాదు ధీ
బంధురు లైనవారిపరిపాటి సుమీ యిది చాటి చెప్పితి౯. ౧౬౭

క. వీరము గొని విఱవీఁగిన, దారుణమత్రోటికోటిదంభోళిమహో
దారతరధారలన నీ, గోరపురూపంబు నడఁగఁగొట్టుదుఁ గలన౯. ౧౬౮

చ. అన విని యట్టహాసభయదాననుఁ డై నరసింహదేవుఁ డా
మినుకుల తేజిపుల్గుదొరమీఁదఁ గఠోరకటాక్షవీక్షణం
బొనరఁగఁ బల్కు నీవు వినవో కనవో దనుజారిపౌరుషం
బునఁ దటు నిన్నుఁ బట్టి యిదె పొట్ట పగిల్చెద బిట్టుఁ గూల్చెద౯. ౧౬౯

## నారసింహశరభయుద్ధము.

క. అని యన్యోన్యముఁ బరుసపుఁ, బెనుఁబలుకులు పల్కి వేల్పుపెగ్గడలు రయం బునఁ గదిసి పోరఁ దొడఁగిరి, కనదనలోగ్రస్ఫులింగకలితేక్షణు లై. ౧౭౦

---

[1] సర్వ. [2] కాద్రవేయను. [3] కృచ్ఛదంతు - మూ.

సీ. చఱచె ఱెక్కల నృకేసరిఁ గిట్టి శరభంబు పక్షీంద్రు గోళ్ల శ్రీభర్త చీరె
శూలి చంచున వనమాలిఫాలము చించె హరి ముష్టిహతి నొంచె నంగజారి
గద నురం బవియించెఁ గమలాక్షుఁ గామారి కొంగవాలున శార్ఙ్గి గొట్టె శివుని
హరుఁడు జానువులఁ గంసారి ప్రక్కలు నొక్కెఁ బ్రమథేశుఁ జక్రి వాలమునఁ జుట్టె
మంత్రితవిభూతి నగ్నులు మండఁ జేసి, విష్ణుదేవుని పైఁ జల్లె విషధరుండు [దర.
భుజగశయనుండు మాయంపుఁ బొగలు ముంచె, బంచనదనునిభూతప్రపంచము
సీ. క్రోధంబు చాలదే కుముదాహితుని మ్రింగఁ గడకంటమిడుఁగుఱుఁగదుపు లేల
యార్పులే చాలవే యఖిలంబు బధిరంబు గావింప బిగినవ్వుఁ గమక మేల
క్షతజంబు చాలదే జలధులు పొంగింపఁ గమియు మేనుల నుబ్బుచెమట లేల
బుసకొట్లు చాలవే పుడమి దిద్దిరఁ ద్రిప్పఁ జటులహుంకారప్రచార మేల
యెంతయుద్రేక మెంతదుర్దాంతశక్తి, యెంత బింకంబు పొంకంబు నెంతయనుచు
నిలిచి దివమున నిర్జరావలులు పొగడ, నమరవృషభులు చేసి రుగ్రాహవంబు.
వ. ఈప్రకారంబున దీప్రాకారంబై యాప్రథమపురుషద్వయం బద్వయం బగు
పౌరుషంబునఁ దారసించి మేరలు మీఱిన వారాకరంబులును నార్పరానియన
లంబులును నుడివోవని యుగ్రవాయువులును నొండొంటిఁ దాఁకిన యుర్వీ
ధరశ్రేష్ఠంబులుం బోలె నాసాముఖనిష్ఠ్యూతకీలికీలాభీలంబుగ నాఁటంబు
సేయుసమయంబున నదభ్రభ్రమణచంక్రమణప్లుతపరివర్తనస్థానకోత్థవణాది
గతి విశేషంబులు గానిపించె నయ్యుద్ధఱయందునుం దారతమ్యంబు ౧౭౩
సామ్యంబు చూపె నప్పుడు.
సీ. దివి మాసెఁ గనుమాసె దినకరబింబంబు కురిసె మేఘములు నెత్తురులవాన
విధి దూలె ధర వ్రీలె వేఁగెఁ దారాపంక్తి దిక్కులు చినచిన వ్రక్కలయ్యె
శిఖ మ్రగ్గె శశి మొగ్గెఁ జింతాభరాక్రాంతి నుడుకెత్తెఁ బ్రజలకు నుదరసేటి[1]
ఫణి గుండెఁ గిటిగుండెఁ బ్రథమకచ్ఛపరాజు తలపొట్టలోఁ దూర్చె మలలువడఁకె
మునులు వెఱచిరి సిద్ధులు ముచ్చముడిఁగి, రసురలోకంబు నసురుసురయ్యె సిద్ధ
సాధ్యగంధర్వయక్షులు జలదరించి, రాశరభనారసింహుల యాహవమున.
చ. హరి శరభంబుఁ దోలియును నాశరభేంద్రుఁడు నారసింహునిం
దెరలఁగఁ జేసియు న్మగుడ దీకొనియు న్సరిపోరి పోరి యా
సురగతి నుండువేళ హరుచుట్టునఁ బారిషదుల్ నరాదులు ౧౭౪
న్సురియలు దాల్చి నిల్చిరి వచోనిచయారభటీవృతాశులై.

[1] నుదరపెట్టి.

క. మున్నాఁడి యసురవీరులు, పెన్నాటిక మైన సేన పిలపిల మనఁగా
నన్నారసింహుఁ గదిసిరి, కన్నారం జూచుఖచరగణములు వొగడన్. ౧౭౬

చ. అలఘుభుజాబలప్రథితు లాశరపుంగవు లుగ్రసాధనం
బుల నరకేసరిం బొదువఁ బూనినయంత నె తన్నృసింహుచూ
పులయెఱనుంటలం జిమిడిపోయిరి జీర్ణములైరి జీవము
ల్దొలఁగిరి తూలి రొటఱిరి తొట్రిలి వ్రాలిరి కూలి రందఱున్ ౧౭౭

ఉ. ఆసమయంబునం బ్రమథు లార్చి రయంబొనగూర్చి పేర్చి బా
ణాసనసంప్రయుక్తనిశితాస్త్రములం బరఁగింప భూతసం
త్రాసకరంబులై నిగుడు తచ్ఛరము ల్నరసింహవక్త్రని
శ్వాసభవాగ్నిచే నడఁగి సర్వము భస్మము లయ్యెఁ జయ్యనన్ ౧౭౮

వ. ఇట్లు నరసింహదేవుండు. ౧౭౯

క. ప్రమథులు సంగరలీలా, విముఖులఁ గావించుటయును విఱిగి పఱచి త్రా
సమున శరభేశు వెనుకకుఁ, గమియఁజనిరి నృహరి నిలిచెఁ గల్పాగ్నిరుచిన్

గీ. విఱిగి వచ్చినప్రమథుల వెఱపు దేరఁ, బలికి సంగరసన్నాహభయదలీల
నూలుకొనఁ జేసి నంది యుల్లోలరోష, భీషణాకృతి నని మొనఁ బెరిఁగి నిలిచి.

వ. పక్షికులాధ్యక్షుండు వీక్షింప మనుజహర్యక్షుంబు నాక్షేపించుచు నక్షీణ క్ష్వేళాముఖరితహరిన్ముఖుం డై ఖరకరసహస్రసహస్రోతయు భూతజాతభయానకప్రభాపటల చటులంబును ద్రిపురపురపురంధ్రీక పోలతలము కురనికరమ కరిపత్రికాలతాలవిత్రంబును నిజప్రతాపదహన ధవిత్రంబు నగు నాకట్టశక్తిం బ్రయోగించిన శేషజిహ్వాంచలాకారంబై తోరం బై మెఱయుచు నప్పర మసాధనంబు మాధవరూపాంతరంబు పై నిగిడిన నాబలుమగండు గండు మెఱసి దండధరదండోదారం బగు నాక్రూరంపుటలుగును నేలం బెట్టి కాలం జమరి కదియుటయు మదనహరదౌవారికుండు వైరంబు పేరిన మనో వికారంబున ఘోరాననుం డై నారాచాసారంబు గురియుచు నరమహా వీరంబుఁ గదిసి బెట్టిదంబుగ నిట్టు లనియె. ౨౮౧

సీ. కనుఱెప్ప వేయక కనలిచూచిన నేమి సర్వతోముఖలీలఁ జనిన నేమి
ఘుర్ఘురధ్వనులతోఁ గొప్పరించిన నేమి బలునోరు దెఱచి గర్జిలిన నేమి
భువనసంపూర్తిగాఁ బొడవుసూపిన నేమి క్రొన్నెత్రు మైఁ బుల్ముకొన్న నేమి
యడవినుండక పోయి కడలి దాఁటిన నేమి మాయలముసలివై మనిన నేమి

కపటమునివృత్తిఁ బ్రౌఢిమ గనిన నేమి, కొదమ సామ్రాణి నెక్కి తూఁగొనిన నేమి
నీకు నెఱతునె పోర నాళీకపత్త్ర, నయన శంకరభృత్యుఁడు నందివీఁడు. ౧౮౩

క. నను గెలిచి కాక శరభేం, ద్రునిపై నడరంగ వశమె దోషాచరమ
ర్దన నీబీరము గీరము, గనిపింపుము నాకుఁ గలనఁ గలనాశక్తిన్. ౧౮౪

క. అనుటయు నమ్మాటకు మదిఁ, గనలి యనలశిఖలఁ బోలు కాండము లేసెన్
దనుజారి నందికేశ్వరు, తనువున నవి గ్రోలెఁ దొణఁగెఁ దద్రుధిరంబుల్. ౧౮౫

క. కడుదురులు గఱచి నట్లై, యొడలు విదృచుకొనుచు నంది యును బఱచిన నా
కడసంజపాడువుదేవర, వెడనవ్వుగ నవ్వి శరభవీరుని బొదివెన్. ౧౮౬

లయగ్రాహి.

వారిరువురుం గదిసి పోరిరి లయాంబుధులు పోరు నెఱజోకను దవారణకులేంద్రుల్
పోరుగతి సింగములు పోరు నెసకంబున సుదారుణభుజంగములు పోరు మరియాద
న్ఘోరదవవహ్నులొగిఁ బోరు చటులస్ఫురణమారుతములుద్దవిడిఁ బోరు బలువీఁకం
దారలిలరాలఁ దిమిరారి రుచి వ్రీల[1] బలవైరి నెరిదూల నిజపౌరుషము వాలన్.

మ. శరభేంద్రుండు మనంబులోఁ దలచె రక్షస్సైనికాభీలముం
జిరవైరోద్ధతభాస్కరోద్భవశిరశ్ఛేదక్రియామూలముం
బురవప్రావళిభూరిమేఘవిలయప్రోద్భూతవాతూలము
న్వరఘంటాజనితాతిదీర్ఘనినదవ్యాలోలము న్శూలమున్. ౧౮౭

సీ. గబ్బిమే నుబ్బునఁ గదిసిన గజదైత్యుకండలు చెండిన గదురుకంపు
నలచిత్రకాయకాయము విదారించినఁ గడుఁ జుట్టుకొను విస్రగంధలహరి
యంధకారఃకవాటాంతర్విపాటన మాచరించుటనైన నీచువలపు
కొనగోరఁ జిమ్మివాకులకొమ్మమగని యాదల గ్రున్నఁ బొదువు మేదంపుఁబొలసు
సురకరవిముక్తమందారతరులతాంత, గంధములఁ బొత్తుగలసిన బంధురాత్మ
కీర్తిసౌరభవైభవస్ఫూర్తిచేత, నుడువుకొను శూల మడరె నమ్మృడుని మ్రోల

క. పుటములుగొను పెటపెటలుం, జిటచిటలుం గలిగి విలయశిఖు లుదయించెన్
జటిలములై నిజతేజః, కుటిలములై మూఁడుమొనల క్రూరాస్త్రమునన్.

వ. ఇట్లు సాక్షాత్కరించిన యాశుశుక్షణికీలంబునుం బోని శూలంబుఁ గేలం గీలించి శరభుం డసురభంజనుపై వైవం బూనుటయు. ౧౯౧

ఉ. విక్రమసత్త్వసంయుతుఁడు వీరనృసింహుఁడు లోఁ దలంచె ని
ర్వక్రపరాక్రమక్రమధురంధరసాహసికత్వవిభ్రమో

[1] వీల - మూ.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౫. క్షయనామసంవత్సరము. మార్గశిర-ఫాల్గునమాసములు. సంచిక ౫, ౬

## ఆంధ్ర సాహిత్య పరిషత్సమ్మేళనము.

ఆ 1927 సంవత్సరము జనవరి ది 29, 30 తేదులలో, కాకినాడ ఆంధ్రసేవాసంఘనాటకభవనములో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్పంచదశవార్షిక సభావృత్తాంతము.

సభకు దయచేసినవారిలోఁ బ్రముఖులు.

1. శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరు గారు—పిఠాపురము మహారాజావారు.
2. శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు, ఉయ్యూరు జమీందారువారు, (సభాధ్యక్షులు.)
3. మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు
4. వఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు
5. విద్వాన్ దువ్వూరి వేంకటరమణశర్మగారు
6. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు
7. వెన్నేటి రామచంద్రరావుగారు బి. ఏ., బి. ఎల్.
8. ఆదిపూడి ప్రభాకరరావుగారు
9. మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిగారు
10. శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు
11. చిలుకుల అప్పయ్యశాస్త్రిగారు
12. వెంపటి కుటుంబయ్యశాస్త్రిగారు
13. కేతవరపు వేంకటశాస్త్రిగారు

14. తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు
15. విష్ణుభొట్ల సూర్యనారాయణగారు
16. అనంతపంతుల రామలింగస్వామిగారు
17. నందిరాజు చలపతిరావుగారు
18. కోరాడ రామకృష్ణయ్యగారు ఎం. ఏ.,
19. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
20. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు
21. రాళ్ళబండి సుబ్బారావుగారు ఎం. ఏ. ఎల్. టి.

మఱియును ననేకులు పౌరులు దయచేసిరి. ఈసభ ది 29 వ తేది మధ్యాహ్నము 1 గంటకు బ్ర॥ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి ప్రార్థనశ్లోకము, శ్రీత్రిపురాన వేంకటప్రసాదరావుదొరగారి యాశీర్వచనపద్యములతోఁ బ్రారంభ మైనది. పిమ్మట ఆహ్వానసంఘాధ్యక్షు లగుబ్ర॥ ములుకుట్ల అచ్యుత రామయ్యపంతులుగారు పరిషత్సభకు విచ్చేసినవారికిఁ దమయుపన్యాసముతో స్వాగత మొసంగిరి. బ్ర॥ జయంతి రామయ్యపంతులుగారు శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరుగారి సుగుణములను సామర్థ్యాదికమును స్తుతించి సభాధ్యక్షులుగా నుపపాదించినంత బ్ర॥ శ్రీ॥ గొల్లకోట గంగాధరసోమయాజులు ఎం. ఏ., బి. ఫుల్., గా రాయుపపాదనమును బలపఱుపఁగా నేకగ్రీవముగ సభ్యులు యావన్మందియు నంగీకరింపఁగా శ్రీవా రధ్యక్షపదవి నధివసించి ప్రారంభోపన్యాసముం గావించిరి.

తమకుఁదమకుఁ గలకార్యగౌరవములచేఁ గొందఱు భాషాభిమానులు సభకు రాఁజాల మైతి మని వ్రాసినయుత్తరములు కార్యదర్శిగారు చదివి సభవారికి వినిపించిరి. వెన్నేటి రామచంద్రరావు బి. ఏ., బి., యల్ గారు పరిషత్ప్రశంసాపద్యములం జదివిరి. అనంతర మీక్రిందివ్యాసములు చదువఁబడినవి.

1. విద్వాన్ దువ్వూరి వేంకటరమణశర్మగారు. బాలవ్యాకరణ హరికారికల ప్రకృతివికృతిభావ విమర్శనము
2. వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు— ఆంధ్రచంద్రాలోకము.
3. మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు— అలంకారప్రాచీనత.
4. బండారు తమ్మయ్యగారు— పాల్కురికి సోమనాథకవి గద్యకృతులు.
5. అనంతపంతుల రామలింగస్వామిగారు— కృతిస్వీకృతి.

6. కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు- కరుణరసము.

7. అత్తిలి సూర్యనారాయణగారు- నవ్యకవిత.

8. కోరాడ రామకృష్ణయ్యగారు- ఎం. ఏ. భాషాశాస్త్రము-చరిత్ర

ఈవ్యాసములు చదువఁబడినపిమ్మట, ఆంధ్రసేవాసంఘమువారు పరిషత్సభవారి నానందపఱుచుటకై స్వాగతపద్యములను చదివి "జహ్వారీ ళాయి" యను నొకనాటకములోని కొన్నిభాగములను బ్రదర్శించి స్తోత్రపాత్రులైరి.

ది 30 జనవరి ఉదయమున, కార్యనిర్వాహకసభ జరిగినది. మధ్యాహ్నము- 1 గంటకు మరల సభ ప్రారంభమై యీక్రింది వ్యాసములు చదువఁబడినవి.

1. నందిరాజు చలపతిరావుగారు- ఆంధ్రభాషాపారిభాషికపదప్రవేశము
2. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు- కావ్యభాష.
3. శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు- మచ్చ లక్ష్మీనారాయణకవీంద్రజీవితము.
4. పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు- వైదికకవులు.
5. విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు రాజాల మని పోస్టులో పంపిన దేవేంద్రవర్మ చీడివలసశాసనములోని కొంతభాగము చదివింపఁబడినది.
6. మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిగారు- సాముద్రికశాస్త్రప్రశంస.
7. నాభి రామమూర్తి పంతులుగారు-, కొన్నిశ్లోకములు.
8. కేతవరపు వేంకటశాస్త్రిగారు- పెద్దనకవితారచనానైపుణి.
9. రాళ్ళబండి సుబ్బారావుగారు ఎం.ఏ—ప్రాచీనకళింగదేశచరిత్రము.
10. గున్నేపల్లి మృత్యుంజయకవిగారు-వాగ్దేవీప్రశంస.
11. ఆదిపూడి ప్రభాకరరావుగారు- స్వాగతాదిపద్యములు.
12. ఉేకుమళ్ళ అచ్యుతరావుగారు ఎం. ఏ., రానికారణమున, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవివ్యాసము చదివినట్లు భావింపఁబడినది.
13. విద్వాన్ కోపల్లి శివకామేశ్వరరావుగారు-కవిత.

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి ఆంధ్రశబ్దానుశాసనమునందలి కొన్నిలోపములు బుద్ఘాటించుచు స్థూలరూప

ముగా నుపన్యసించిరి. ఉమర్ ఆలీషాగారు కొన్ని పద్యములు, పిసుపాటి చిదంబరశాస్త్రిగారు కొన్ని శ్లోకములుఁ బద్యములు, చివుకుల అప్పయ్యశాస్త్రిగారు శ్లోకములుఁ బద్యములు చదివిరి. కందుకూరి రామభద్రరావుగారు ఆంధ్రభాషలోఁ గృషిచేయుటకై విద్యార్థులను హెచ్చరించుచుఁ జమత్కారముగా నుపన్యసించిరి. సత్యవోలు రాధామాధవరావుగారు వసుచరిత్రములోని కొన్ని పద్యములు రాగతాళములతోఁ బ్రబంధగానము గావించిరి. కోటీశ్వరరావుగారు భాషాదుస్థితిని గుఱించి చెప్పిరి. సర్వా వేంకటశేషయ్యగారు బి.ఏ. యల్.టి. కొన్ని చక్కని పద్యములం జదివిరి. అమలాపురము సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారును బద్యములం జదివిరి.

తరువాత అగ్రాసనాధిపతులు సభముగిసిన దనియు, నిచ్చటఁ జదువఁబడిన వ్యాసములపై నభిప్రాయములను దెల్పుటకు వాని వానిలోని విషయముఁ జక్కఁగా సావకాశముగాఁ బరిశీలింపకుండఁ జెప్ప వలనుగా దనియు సెలవిచ్చిరి. జయంతి రామయ్యపంతులుగారు అధ్యక్షులను, సభ్యులను, ఆంధ్రసేవాసంఘమువారిని, స్తుతించిరి. కార్యదర్శిగారు, అందఱకువందనము లర్పించి రాఁబోవు పదాఱవవార్షికసభ బల్లారిలో జరుపఁబడు నని తెలియఁజేసిరి.

ఈ రెండుదినములందును నాటకభవనము ప్రేక్షకులచేఁ గ్రిక్కిఱిసినది. ప్రేక్షకులెల్లరును నెమ్మదిగా నుపన్యాసములను వినుచుఁ దమకుఁ గలభాషాభిలాషను వెల్లడిచేసిరి. పెక్కురు నారీమణులు సభ నలంకరించిరి. పరిషత్సభ జయప్రదముగా జరిగినది.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు.

ఆ 1927 సంవత్సరము జనవరినెల ది 30 తేది ఆదివారము, ఉదయమున 9 గంటలకు కాకినాడ ఆంధ్రసేవాసంఘనాటకభవనములో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహక సభావృత్తాంతము.

—◆ వచ్చిన సభ్యులు ◆—

1 మహారాజశ్రీ శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరు వారు అధ్యక్షులు.

2 ,, జయంతి రామయ్యపంతులుగారు బి. యే. బి.ఎల్,

3 ,, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు

4 మ॥ రా॥ శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు
5 ,, దర్భా వేంకటశివరామరావుగారు బి.ఏ. బి. యల్
6 ,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు
7 ,, మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు
8 ,, వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు
9 ,, గోడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ.యల్.టి.
10 ,, అళక్కి వేంకటరామయ్యగారు
11 ,, శ్రీకాకోళపు వేంకటరావుగారు
12 ,, కేతవరపు వేంకటశాస్త్రిగారు
13 ,, దేవులపల్లి వేంకటరామయ్యగారు బి. ఏ.
14 ,, గాడిచెర్ల సూర్యనారాయణగారు
15 ,, కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ. బి.యల్.
16 ,, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు
17 ,, ఉపాధ్యాయుల వేంకటేశ్వరశాస్త్రిగారు
18 ,, గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు బి. ఏ.
19 ,, వడలి లింగన్నశాస్త్రిగారు
20 ,, కోరాడ రామకృష్ణయ్యగారు ఎం. ఏ.
21 ,, త్రిపురాన వేంకట సూర్యప్రసాదరావుదొరగారు
22 ,, కేశవరపు కామరాజుగారు బి. ఏ.
23 ,, వంకాయలపాటి బంగారురాజుగారు
24 ,, వింజమూరి లక్ష్మీనరసింహారావుగారు
25 ,, అయినాపురపు సోమేశ్వరరావుగారు
26 ,, బుద్ధవరపు పట్టాభిరామయ్యగారు
27 ,, అనంతపంతుల రామలింగస్వామిగారు
28 ,, దివాకర్ల వేంకటావధానిగారు

—: తీర్మానములు :—

I క్రోధననామసంవత్సర కార్యనివేదనము ఆమోదింపఁబడినది.

II ఆంధ్రసాహిత్యపరిషత్తుయొక్కయుఁ దత్పత్రికయొక్కయు నభివృ
ద్ధిని గుఱించి సభ్యులు మిగులఁ జర్చించి సాధ్యమైనంతవఱకు నభివృద్ధిలోనికిఁ

పెచ్చుటకై యేర్పాటులు చేయవలయు నని కార్యనిర్వాహకసంఘమువారిని షేచ్చరించుచున్నారు.

పరిషన్నిబంధనములు కొన్ని యీ క్రిందివిధముగా మార్పఁబడినవి.

III రెండవనిబంధనలో 'మదరాసు' అనుపదమునకు మాఱుగా "కాకినాడ" యను పదము చేర్పఁబడినది. ఆఱవనిబంధనలో "పరిషత్తులోని సభ్యులెన్నుకొనునట్టి యేఁబదిమంది సభ్యులు కార్యనిర్వాహకసభ (Senate)గా నేర్పడి పరిషత్తుయొక్క కార్యముల నిర్వహించు చుండవలయును" అనుదానికి బదులుగా పరిషత్తులోని సభ్యులచే నెన్నుకొనఁబడిన పదిమందియు, యావజ్జీవ పరిషదధ్యక్షులచే నియమింపఁబడిన వారైదుగురును వెరసి పదునైదుగురునుజేరి కార్యనిర్వాహక సభగా నేర్పడి పరిషత్తుయొక్క కార్యములు నిర్వహించుచుండవలయును" అని చేర్పఁబడినవి.

ఆనిబంధనలోనే "పారిషదులు కార్యనిర్వాహక సభవారిలో నొకని అగ్రాసనాధిపతిగను మూవురనుగార్యదర్శులుగను నియమించు కొనవలయును" అనుదానికి బదులుగా "పారిషదులు కార్యనిర్వాహకసభవారిలో నొక్కరిని అధ్యక్షులుగను ఇద్దఱను గార్యదర్శులుగను నియమించుకొనవలయును" అని చేర్పఁబడినవి.

IV సభవారీ క్రిందిపదిమందిసభ్యులను గార్యనిర్వాహకసభాసభ్యులనుగా నేకగ్రీవముగా నెన్నుకొనిరి.

1 శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు, సిద్ధాంతము.
2 అళక్కి వేంకటరామయ్యగారు, పెద్దాపురము.
3 తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, కావూరు.
4 దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారు బి. ఏ, కాకినాడ.
5 దివాన్‌బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు, కాకినాడ.
6 కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు కాకినాడ.
7 అనంతపంతుల రామలింగస్వామిగారు, సామర్లకోట.
8 దర్భా వేంకటశివరామరాసుగారు బి.యే. బి.ఎల్. కాకినాడ.
9 కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం.ఏ. బి. ఎల్, కాకినాడ.
10 జయంతి రామయ్యపంతులుగారు బి.ఎ. బి.ఎల్. ముక్తేశ్వరము.

V పైపదిమందిలోని దర్భా. వేంకటశివరామరాసుగారు, కిళాంబి రాఘవాచార్యులుగారును, పరిషత్కార్యదర్శులుగను జయంతి రామయ్య పంతులుగారు పరిషత్కార్య నిర్వాహకసభకు యావజ్జీవాధ్యక్షులుగను నెన్నుకొనఁబడిరి.

VI క్షయసంవత్సరమునకు ఆయవ్యయపట్టిక యీ క్రిందివిధముగా నిర్ణయింపఁబడినది.

| (1) ఆయము :— | | (2) వ్యయము:— | |
|---|---|---|---|
| ఉద్ధారకులవలన ....... | రు 7500-0-0 | జీతములు ... | రు 1500-0-0 |
| పోషకులవలన ....... .... | 700-0-0 | ఇంటిఅద్దె ... ... | 80-0-0 |
| యావజ్జీవసభ్యులవలన ... | 500-0-0 | ప్రయాణవ్యయములు | 100-0-0 |
| సాధారణసభ్యులవలన .... | 600-0-0 | ఏజంటువ్యయము | 300-0-0 |
| పత్రికచందాలు ... ... | 200-0-0 | పుస్తకభాండాగారము | 300-0-0 |
| పుస్తకవిక్రయమువలన.... | 100-0-0 | పత్రికముద్రణవ్యయము | 900-0-0 |
| బ్యాంకివడ్డి ... .... ... | 850-0-0 | ఇతరవ్యయములు ... | 200-0-0 |
| | 10450 0 0 | | 3380 0 0 |

VII అక్షయసంవత్సరవార్షికసభ బళ్లారిపురమున జరుపవలయు నని బళ్లారిపురవాస్తవ్యులు కోరుచుఁ బంపిన యాదరపూర్వకాహ్వానమును బరిషత్సభ్యులు సంతోషపూర్వకముగ నంగీకరించిరి.

# కృతిస్వీకృతి.

——అనంతపంతుల రామలింగస్వామిగారు——

శా. ఏరాజ్యంబున కిద్ధదర్పణముగా నేపారు గోదావరీ
ధారాళాపగ, రాణ్మహేంద్రపురచింతారత్న మేరాజ్యచూ
డారాజన్మణి, సత్కళానిచయభాండాగార మేరాజ్య మా
శ్రీరమ్యం బగురెడ్డిరాజ్యము యశశ్శ్రీనుండె నాంధ్రావనిన్. 1

సీ. జగనొబ్బగండఁ డాదిగనుండు బిరుదాళి నేరాజమౌళి మహిన్వహించె
సుకళాభిమానియై ప్రకటపండితపక్షపాతి నై యేరాజు ఖ్యాతిఁ గాంచె
వైరికల్లోలదుర్వారోన్నతాద్రియై యేరాజు ధృతిని రహిన్వహించె
అరిపార్శ్వభల్లవిఖ్యాత మా కొండవీడ్రాజ్యంబు నేరాజు రక్షిఁ బెంచె
ఆంధ్రదేశాన సకలాశలందు నెవని, దానశాసనవిలసితస్తంభపంక్తి
నిండియెవనియశముఁజాటుచుండునేఁడు, గూడనతఁడనవేమరాట్కుంజరుండు

క. ఆరాజ్యం బుచితవిధం, బార న్పాలించుచుండె నాభూపాలుం
డేరాయిడి లేక ప్రజా, వారము సంతుష్టినొంది వర్ధిలుచుండెన్.

చ. కవనముఁ జిత్రలేఖనము, గానము నాఁబడు సత్కళల్ మహీ
ధవవరుపాలనంబున యథావిధిగా నభివృద్ధినొంద స
త్కవులును జిత్రలేఖకులు, గాయకు లెందఱో వచ్చుచుండి రా
యవనిపుదర్శనార్థ మనయంబును గానిక లొందుకోర్కెనై. 4

చ. కవనమునందుఁ బ్రేమ మధికంబగు రాజున,కాక తాన స
త్కవులను బిల్చి కబ్బము లఖండవిధాన రచింపుఁడంచు గా
రవమునఁ గోరుచున్ బిరుదరాజి నొసంగుచు, నగ్రహారస
న్నివహము నిచ్చుచుం జెలఁగె నిస్తులరీతిఁ గళాధినాథుఁడై. 5

ఉ. రా జన నిట్టివాఁడె గదరా యని పౌరులు మెచ్చ సద్యశ
స్తేజము నొంది పాలనము దివ్యతరంబుగఁ జేయు చొక్కనాఁ
డాజనపాలమౌళి ముద మారఁగ నోలగ ముండె వారకాం
తాజన మాడ గాయకవితానము పాడఁ గవుల్ నుతింపఁగన్. 6

చ. కృతిపతి నోట కేమువలవించెద నాకవిరాజు తాను నన్
కృతిపతిఁ జేతునంచు వచియించియు నేఁటికి మాస మయ్యె, నే

కతమున రాక మానెనో? తగ న్గడు వేగెడు నేఁటితో, నీకే
కృతికయి, యేకవిప్రవరు నెంచెద నంచు నృపాలుఁ డున్నెడన్. 7

సీ. "నూనూఁగుమీసాలనూత్నయౌవనము"తోఁ గండపెండెరపుడాకాలితోడ
ఫాలసీమను స్నిగ్ధభస్మరేఖలతోడఁ జెవిసందుమారేడుచివురుతోడ
మీనుమీసలఁబోలు మేలిజందెములతోఁ జంద్రికాధవళవస్త్రములతోడ
మెయినిండు మృగమదమిళితచందనముతో నోటఁదాంబూలంపునీటుతోడ
సరసశృంగారభక్తిరసైకమూర్తి పూర్ణరాకాసుధాకరస్ఫూర్తికీర్తి
సకలకవిజనతామరసవనహేళి, వచ్చె శ్రీనాథకవిసార్వభౌమమౌళి 8

ఉ. ఆకవిరాజురాకఁ గని యల్లనఁ జందురుపొడ్పుఁ గాంచి సీ
రాకర ముబ్బుమాదిరి ధరాపతి సమ్మదమంది లేచి తాఁ
బ్రాకటరీతి నర్ఘ్యమును బాద్యమొసంగి సగౌరవంబుగా
వాకులనాడి వాని కొకస్వర్ణసుఖాసన మిచ్చి యిట్లనెన్. 9

మ. వెదకంబోయినతీవ కాలఁ దవిలెన్ వేవేగ నన్నట్లు నా
హృదికాంక్ష న్దనియించుమిమ్ముఁ ద్రుటిలో నీక్షింపఁగాఁ జాలినా
నిదియే మామకపూర్వపుణ్యఫల మం చే నెంతు నో సత్కవి
త్రిదశాధీశ! కృతీశుఁ జేసి ననునర్థి న్బ్రోవుమా మ్రొక్కెదన్. 10

చ. అని యనవేమరెడ్డి కృతినందుట కువ్విళులూరుచుండుటం
గని కవిరాజు రాజుఁగని "క్ష్మాపతి రేపు కృతీశ్వరుండవో
దనుకొను, మింక నీదుహృదయార్తిని బాయుము, తన్మహోత్సవం
బున కను వొప్ప యత్నములు పూని ఘటింపు మనన్ నృపుండనెన్. 11

మ. కవిరాజా! యిఁక నేఁగృతార్థుఁడ నమస్కారంబిదే యంచుఁ గే
ల్గవఁ దామోడ్చి నుతించె నాతని ధరాకాంతాగ్రగుం, డాపయిన్
నవసంతోషముతో నమాత్యుఁ గని యన్నా! వీట నీవార్త ను
త్సవ మేపారఁ బ్రజాళికిం దెలియఁగాఁ జాటింపుమం చంతటన్. 12

గీ. ఓలగంబును జాలింపనూహ సేయు, ప్రభునెదుటనిల్చి యొకపేదబాఁపఁడంత
రాజ నిజుపేదనయ్యా! నారాయిడివిని, నన్నుఁబోషింపునీకగుఁ బున్నెమనిమె.

గీ. పేదబాఁపనిమాటలు వినుచు నిలిచి, పలికె ననవేమరెడ్డియీపగిది "నయ్యా!
కవితఁజెప్పెదో, చిత్రలేఖనమెఱుఁగుదో, గాయకుండవో ఘోషప్రజ్ఞగలదో చెపుము

గీ. అంత నాపేదబాపఁడిట్లనియె "నెట్టి, ప్రజ్ఞయును నాకు లేదు నీసాలఁ బడితిఁ
బేదబాపనిఁ గాపాడు విధి నెఱింగి, పృథ్వీపతి! నాకు జీవనభిక్ష నిడుమ!"

ఉ. ఏకళ నైనఁ బ్రజ్ఞఁగని యెన్నఁడు గ్రమ్మఱనన్నుఁ జూచెదో
యాకళ నోమ నేర్పఱుచు నర్థమునం దొకయింత నీకుఁ నేఁ
జేకుఱఁజేతు నయ్య! యని చెప్పి మహీసురు నేగఁబుచ్చి తా
వీకనుబోయెఁ బార్థివుఁడు వెంటనె సభ్యులువోయి రిండ్లకున్. 16

ఉ. ఆమఱునాఁడు వీడు సముదంచితరీతి నలంకృతంబుగాన్
బామరులెల్లఁ జేయలతిపల్లెలనుండి రయానవచ్చియా
గోమునుగాంచి సంతసిలి గొంతులనెత్తి నుతించుచుర్వ దిశా
స్తోమమునందుఁ బర్వ జనతోయధినాఁ బురమొప్పె నయ్యెడన్. 17

గీ. ఒకఁడొకఁడుగాఁగఁ బండితు లొడయునోల, గంబునందునఁ జేరిరి ఘంటమ్రోగె
నంత ననవేమరెడ్డి సింహాసనంబు, నెక్కి శ్రీనాథురాకకై యెదురుచూచె.

క. శ్రీనాథుఁడు నృపదుర్గ, స్థానసమీపమును జేరెఁ దత్సమయమునం
దానిఱుపేద యెదురువడి, వానికెఱఁగి నిలిచి యిట్లు వాకొనఁదొడఁగెన్

గీ. నృపసభాగారమునయందునిన్న నన్నుఁ, గాంచియేయుంద్రు మీరునగానమందొ
కవనమందొ, విచిత్రలేఖనమునందొ, ప్రజ్ఞఁగనిరమ్మనెను గాదె పార్థివుండు.

ఉ. గానము నేర్చికొంట యతికష్టము, కంఠము వీణవోలె వి
న్నాణముగాఁ జెలంగవలె, నాదిఖరస్వరమేమిసేతు, నే
మైననుగాని నేర్తునన నాపని కేండ్లును బూండ్లుఁబట్టు నీ
లోననె నాసతీసుతు లలోయని యేడ్చి కృశింత్రు లేవడిన్. 21

చ. అరయఁగఁ జిత్రలేఖనమునం దొకప్రజ్ఞఁ గొనందలంచుచో
సురుచిరహస్తలాఘవము చొప్పడఁగావలె నందు, నొక్కచోఁ
దిరముగఁ గూరుచుండవలె ధీనిధి కావలె, వేయునేల యా
సిరిగలవానికేఁ దగును జిత్రకళాభ్యసనప్రయత్నముల్. 22

చ. కవనమునభ్యసించుటొక కష్టముగాఁగనుపట్టలేదు, మా
నవులకు లేదు దానను ధనవ్యయమింతయు, నేవనాననో
యవనిధరాననో, గృహమునందుననో మఱియేస్థలాననో
కవనము [illegible] నెంచిరిన్. 23

ఉ. మాటలు పోగుఁజేయు నెడ మంచి కవిత్వము గాక మానునా
మాటలు లేని కైత నొకమానవుఁడైనను జెప్పి యుండెనా
మాటల కేమిలోటగును మానవజన్ముఁడ నైననాకు నే
మాటలు పోగుఁజేతునని మానసమందుఁ దలంచి వెండియున్. 24

చ. చెవి విని కంటఁ గాంచి విరచింత్రుగదా కవు లేకతాన నం
చవనిధరంబుఁజేరి నిశియం దొగిఁ బుల్గులు గూయవింటిఁ గ
న్గవ నటవాగుల న్గని యనందగినాడఁ బదాలు రెంటిఁ న
య్యవి విని నాసతీతిలక మల్లెను మూఁడవపాద మల్లనన్. 25

ఉ. నాలవపాద మాబిడకు నాకును దోఁపక పోయె, తేనిపే
రోలగ మానుబోయని రయోద్ధతినిల్వెడివచ్చి త్రోవలో
బాలకవీశు నొక్కనిని బ్రార్థనచేయఁగ నాతఁ డాదటన్
నాలవపాదమాడె నరనాథుని ప్రోలఁ బఠింప నేగెదన్. 26

ఉ. భూమిపుచెంత కేగుటకుఁ బూర్వమె మీకడనేఁ బఠింతు నా
నేమము నెంచి పద్దెమునఁ జిన్నెలువన్నెలు వెట్టవయ్యా! యీ
భూమిని మిమ్ముఁబోలుఁ గవిపుంగవు లెవ్వరు లేరటండ్రు, మీ
రేమన నద్ది పద్దెమయి యింపులు సొంపులు గుల్కకుండునే! 27

గీ. అనుచు వచియించు నవ్విప్రు నరసి యంత, నని యెఁగవిరాజు వానికిట్లయ్య! కవులు
నొక్కరిని మించి వేఱొకరున్నవారు; కవితలారీతిఁ దరతమగతుల నుండు.
గీ. అరయఁ బరిపూర్ణ పాండిత్య సరణిధరణి, యందు నాశాంత రేఖ నానమరుచుండి
చేరెడు కొలందినరులకు దూరమగుచుఁ, దొలఁగునద్దాని దరియుట దుర్లభంబు
చ. చదువుము నిర్భయాన మహిజానికురంగట నీదుపద్దె మం
దొదవెడు లోటుపాటులకు నుత్తరవాదము సేయు దేను, నన్
వదలుము, సత్వరంబుగ సభాస్థలి కేగుట కయ్యె వేళ, నీ
చదివెడు పద్దెమింక వినఁజాలను విప్రకులావతంసమా! 30
గీ. అనుచు శ్రీనాథుఁడేగె నత్యంతమైన, జవమునను రాజసభకు సుస్వాగతంబు
నొసఁగిరి నిజాసనావళి నుండి లేచి, జనపతియు సభ్యులెల్లరుత్సవము మెఱయ
సీ. చెప్ప వింటిని గాని శ్రీనాథుఁగన లేదు సుదినంబు నేఁ డనె సూరి యొకఁడు
ఘనకవితా చంద్రికలు వీనిముఖచంద్రు నాశ్రయించుట నిజమని యెనొకఁడు
శాలివాహనసప్తశతి కృతి [illegible] యనియె నొకఁడు

కలఁడె యీతనిఁబోలు కవిరాజతల్లజుం డఖిలాంధ్రదేశమం దనియెనొకఁడు
సభ్యులెల్లరునాసభాసదనసీమ, నిట్లు మదినెంచిమాటాడి యెలమినుండ
నంతకృతినిచ్చుటకు వేళయైనదనుచుఁ, బృథులరవభేరిచాటెనావిభునికోట

గీ. ఖంగుమని ఘంట మ్రోగె శంఖములు మొఱసె
జయజయధ్వని సభలోన సాంద్రమయ్యె
లేచి కేల్మోడ్చి యనవేమరెడ్డి ప్రస్తు
తించి శ్రీనాథకవిని బ్రార్థించె నిటులు. 33

సీ. సురుచిరాపస్తంబసూత్ర! భారద్వాజగోత్ర! సత్పండితకులపవిత్ర!
భీమాంబికామారయామాత్యసుకుమార! మారోపమానశరీర! ధీర!
ఉభయభాషాకవిత్వోద్యోగపారీణ! యఖిలపురాణవిద్యాధురీణ!
శస్తమీమాంసాది శాస్త్రవాదనదక్ష! కుకవీభహర్యక్ష! సుకవిరక్ష!
రసికజనమోద! బ్రాహ్మీవరప్రసాద! కవివిబుధమాన్య! శ్రీనాథకవివరేణ్య!
సరసకృతి శాలివాహనసప్తశతిని, ననువదింపుము నాకింక నంకితముగ!

క. అన నిష్టదేవతాప్రా, ర్థన మొనరిచి కాసెకొక దాఁచినకృతిఁ జే
తనుగొని యనవేముని గని, యనేఁ గవిరా జంతలోన నతిహర్షమునన్

గీ. మనసుచే వాక్కుచేతఁ గర్మంబుచేత, సరసకృతిశాలివాహనసప్తశతికిఁ
దగినకృతిభర్త వీవనితలఁచి చేతు, నధిప! యనవేమభూప! నీ కంకితముని.

శా. ఆదిన్ మధ్యమునందు, నంతమున నాయాభాగముల్ శిష్టమ
ర్యాదం దా వినిపించి కావ్యమును, దీర్ఘాయుర్బలారోగ్యవి
ద్యాదరోన్నతకీర్తి ధాన్యధనసంస్థానుండుగా భూపతిన్
శ్రీదాక్షాయణి ప్రోచుఁగాతమని యాశీర్వాదము న్జేయఁగన్. 37

ఉ. మంగళతూర్యనాదము లమందగతి న్వినువీథి ముట్టె, వా
రాంగన లాడిపాడిరి, చిరాయురుపేతుఁడుఁగా, యశోంగనో
త్సంగసుఖాసనప్రమదసాంద్రుఁడుగాఁ గనకాక్షత ల్సభా
రంగవిరాజమానుఁడగు రాజుశిరంబునఁ జల్లి రెల్లరున్. 38

గీ. అంతనన వేముఁ డత్యంతహర్షమొంది, లలితకాశ్మీరపున్నాలువులనొసంగి
సప్తశతరత్నములు స్వర్ణశస్తభాజ, నంబు నందుంచియిచ్చె శ్రీనాథకవికి!

ఉ. ప్రాఁచితరీతిఁ బద్దెములు పండితులెల్ల పఠించి తేని దీ
వించ [illegible] బాఁపఁ డ

సించుచుఁ బారితోషికముఁ జేరి నృపుం బతియించెఁ దాను ని
ర్మించినగీత మిట్లు విపరీతముగాఁ గరయుగ్మ మూఁపుచున్. 40

భావగీతము—కొండమీద విన్న గూగూలు !
కొండ క్రింద గన్న వాగూలు !
అప్పన్న చెవినున్న పోగూలు !
అన వేమా రెడ్డి యీగూలు ! 41

ఉ. పక్కన రెడ్డితేడునగెఁ, బండితు లెల్లరునవ్వి, రంత న
ల్దిక్కుల హాసగర్జలు ప్రతిధ్వను లీనఁగనయ్యెఁ బేదవాఁ
డొక్కఁడె తెల్లవోయి సమయోచితబుద్ధివిహీనుఁ డౌచు నా
కెక్కడి కైత వచ్చెనను చెంతయుఁ జింతిలు చున్నయంతలో ! 42

"గీ. పాటుఁడా! సిగ్గు లేదె నీపాడు కైత, నిట్టి సభలోన వచియింప నియ్యకొంట
కింతకన్నమతేదేని హీనవృత్తి, ఘనము కాదేమొ యోజించుకొనుము నీవ!

గీ. ఉబుసుపోనట్టి మంగలి యోర్మిమీఱఁ, బిల్లితలఁగొఱిగెనఁటతద్విధముగాఁగ
నన్యమేమియుఁ దోఁపకయల్లినావొ, రోఁతఁగలిగించు నట్టినీకైత వెడఁగ!

గీ. ఘనతరులురాల్చు పత్రార్ధకాండములను, గావుకావని యార్చుచునావనిఁగొని
కూర్చి కాకవిరచియించుఁగూడు వోలు, కైత యొకకొంతమిన్న నీకైతకన్న

సీ. రసము నేనెఱుఁగనా? ప్రారబ్ధమిదియేమి! తమిళదేశాన్నసత్రముల నిడరె?
సముచితాలంకారసమితి నేనెఱుఁగనా? మగువలు ధరియించునగలుగావె?
యతినినే నెఱుగనా? క్షితిలోనఁ గాషాయవస్త్రధారుండైనవాఁడు గాఁడె?
గురువునే నెఱుఁగనా? సరిసరి! యక్షరాభ్యసనంబుసలిపినయతఁడు గాఁడె?
శబ్దమననే నెఱుంగనా?-చప్పుడుగదె?యనుచువచియించునజ్ఞానజనములోన
నగ్రగణ్యుండ వగునీవహా! కవిత్వ, మును రచించుటభామకుముప్పగాదె !

మ. కలుగున్ గంటముఁ దాటియాకులకు నేకష్టంబుఁ గాన్పింప, దీ
యిలఁ గార్యాంతర మేది లేదనుచు నీయిష్టానుసారంబుగాఁ
గిలుకంజన్నె కవిత్వ మంచు నెదియో, గీర్వాణశుద్ధాంధ్రభా
షలముక్కున్మొగమైన నేరకయె; భాషాద్రోహి! భావింపుమా! 47

గీ. దున్న యీనినదన దూడనుగట్టుమం, చనెడు నెద్దుమొద్దుజనపతివలె
నన్ను నెంచినావొ, సన్నకసన్న నా, దృష్టిపథమునుండి తెఱలిపొమ్ము!"

మ. అను చాభూపుఁడు బాపనిం గినుకమై నందుండిపో నాడఁ జ
యృన శ్రీనాథుఁడు జాలిఁబొంది కడునెయ్యంబొప్ప వాక్రుచ్చె నో
జననాథా! యొకమాట, యీతనిని నీచప్రాయునింగాఁగ నీ
వనరా దీతఁడుగా కవీశ్వరుఁడు, భావాతీతభావుండిలన్. 49

ఉ. నిన్నటిముద్దుబాపఁ డెటునేఁడు కవీశ్వరుఁడంచు నెంచ కు
ర్వి న్నరజన్మలెల్లరుఁ గవిత్వగుణంబును గల్గువార లో
యన్న! కవీశులన్నయొక యద్భుతమానవజాతి యేడనో
యున్నదటంచు నీవు మది నూహయొనర్పకు మింకఁ దెల్విమై. 50

గీ. కవనగానవిచిత్రలేఖనములందు, నెందునైనను బ్రజ్ఞ నీవొంది రమ్ము
టంచు నిన్నను వీని కీ వంటిగాదె, మాతయగు నవసరము నిర్మాణమునకు.

క. జననీస్తనమే లోకం, బనితలఁచెదునంతకాల మలనిసువున కే
మనఁబని లేదీకఁ దదుపరి, ననవలెఁగాయదియు నిదియు నందుటకవనీ

క. కవనము నుడువనిచో నీ, యవనీశ్వరుఁ డిడఁడు జీవనాధార మటం
చవనీసురుఁ డేకాగ్రత, ను వఱలి కవియయ్యెఁ దా వినూత్నవిధముగా.

క. ఏకాగ్రతార్కతేజము, లోకాజ్ఞానాంధకారలోప మొనరుపం
బ్రాకట మగుమంత్రంబని, యోకువలయనాథ! నీవ యోజింపు మికన్.

మ. యతులం బ్రాసములన్ గణంబులను శబ్దార్థంబులన్ సద్రసో
చితులన్ శయ్యల, జాతులన్ వితతశాస్త్రీయప్రయోగంబులం
గృతులం జేయఁదలంచువార లిల నొక్కింతైన నాచార్యసం
గతిఁ దామెంతయు నేర్వకే రచనము న్గావింపరా దందువో! 55

చ. జలచరకోటిఁ గల్గదవొ? చారుమణిప్రభ నొందుదో? మహీ
వలయముఁజుట్టి రాఁగలవొ? వారిద మందెదవో? సముద్రమున్
బలె సెలయేఱ! యేల యిట పాటలువాడుచుఁ ద్రుళ్ళుచుంట? భూ
స్థలి విడనాడు మీవన రసజ్ఞులు పక్కననవ్వకుందు రే! 56

మ. కవితావేశముఁ గల్గువారలు నిరాఘాటాతివృత్తప్రమో
దవిహారప్రియులై మహన్నియమబంధాతిక్రమోద్వేగభృ
న్నవకూలంకషసామ్యత న్దగి యనన్యప్రాప్తధీజాతభా
వవిశేషానిలధూయమాను లయి కావ్యావిర్భావము న్జేయ రే? 57

శా. భావావేశము, భావభూతి, విలసద్భావాధికాభాసముల్
భావావజ్ఞత, భావనిఘ్నతయుఁ దద్భావప్రభాలోక మే
జీవుం డొందునొ యాతఁ డొందె కవితాశ్రీశక్తి సృష్టిస్వభా
వావిర్భూతరహస్య మిద్ది యను మాంద్యగ్రస్తజీవాళికిన్. 58

గీ. భావకవియని వానిని వాకొనఁదగు, వాఁడు విరచించునదియగుభావకవిత
భావకవి యగు ఈపేదబాపఁ డధిప! వీనికవితను భావ మువ్విళ్లులూరు.

చ. తనదుకవిత్వతత్త్వ మది తజ్ఞులు మెచ్చఁ బ్రచార మొంది కీ
ర్తినిఁ గొనునట్టికాలము ధరిత్రిని రామిని, బేదబాపఁ డా
ర్తినిఁ దనపొట్టకూటి కయి దేవురుగొట్టువలెన్ రచించి కె
వ్వునఁ దన కైత నాడుటనుబో పరిహాసపరీతుఁ డైతగెన్. 60

ఉ. కోమలరాగభోగ, మెలకొమ్మలు, సత్సుమనోవిలాస, ము
ద్దామవరాళులు, న్వలపుఁదాపముఁ బల్లవకోటి నిందు నా
యామనివేళఁ బాడఁదగునట్టిపికం బిలఁ దా నకాలమం
దేమటి పాడి శ్రోతలకు నింపును సొంపు ఘటింపకుండునే? 61

గీ. పూర్వకవులయం దపూర్వభావము లేదొ, కారెవారు భావకవులుపేద
బాపఁ డొక్కఁడెట్లు భావకవీశ్వరుఁ, డనుచు నడిగెదేమొ యాలకింపు.

క. కనకలతామణిమంజరు, లొనరుకవనపంజరముల నుంచిరి తమమో
హనభావరాజకీరము, లను మునుపటికవులు కావ్యలక్ష్మీధవులై.

మ. వితతాగాధమహారసాయతన మై పెంపారువృత్తాబ్ధి సు
స్థితునిం గాఁ దను డించి భావకవి యెందేఁ బోవ నద్దాని సం
స్మృతిచిహ్నంబుగ నెంచి భావకవి నిర్మించు న్బ్రయత్నించి ప్ర
స్తుతపద్యాకృతిపంజరం బొకటి సద్యోమోదసంప్రాప్తికై. 64

గీ. పూర్వకవి పద్యపంజరంబులను వెలయు, భావకీరములను సెపు నీవుగాంతు
నేటి యీకవిపద్యంపునీడమందు, నీవు గనలేక పోవచ్చు నృపతిచంద్ర!

మ. తనగీతంబున నీవు గన్గొనసి యేతద్భావతత్త్వంబు నీ
వనుమం జాతనిఁ బ్రశ్న సేయకుము స్వప్నాంతర్గతానంద మే
జనుఁడైన న్దగ వాకొనంగలఁడె? యిచ్ఛానంద మీవొంది త
ద్ఘనభావాండజపంక్తి తో నెగిరి యాతత్త్వంబుఁ జింతింపుమా! 66

ఉ. ఈకవితత్త్వముల్ మఱియు నీకవిభావకవిత్వతత్త్వముం
బ్రాకటలీల నేనిపుడు భావన చేసితిఁ గాన నీనిప
ద్యాకలితప్రభావము దురత్యయమంచు వచింతు నింక నీ
కోకుతలాధినాథ! విను ముత్సుకత న్వడనాడ కోపికన్. 67

సీ. కొండవీడ్రాజ్యసంకుచితనామము కొండ యంచు భవత్ప్రజ లాడుచుంట
గూగూలు మీఁగాడిఁ గూర్చి ఖగోళాన స్వర్గస్థులాలింపఁ జాటుచుంట
తమదానధారాజలము వాగులై రసాతల మేగి మీఁగాడిఁ దెలుపుచుంట
ఆకందుకూరుసింహాచలవ్యాప్తమై భవదీయరాజ్యంబు ప్రబలుచుంట
మెన్నసింహాద్రినాథుఁ డప్పన్న చెవుల, దనరుబంగారుపోగులు తావకీన
భక్తిసంయుక్తవితరణశక్తిఁ జాటు, చుంట యగు దీనిభావ మోయుర్వరేశ!

గీ. అనుచు శ్రీనాథుఁడనునుపన్యాసము విని, సింహపీఠిక విడి నృపశేఖరుఁడు
సంభ్రమాశ్చర్యములుమదిసందడింప, సాఁగి శ్రీనాథునకు నమస్కారమిడుచు

మ. సము లెవ్వారలు లేరు నీకుఁ గవిరాజా! కృష్ణపక్షాత్తకా
కము నిక్కంబుగ శుక్లపక్షయుతకాకం బంచు వాదించి, గె
ల్పమరం బొందెడుకౌశలం బణువునం దక్రీంద్రము న్జూపుజ్ఞా
నము నీసొమ్ము కృతార్థుఁడన్, సమధికానందంబు నేనొందితిన్. 71

మ. కవినామం బతిసార్థకం బగును లోకంబందు నీపట్లఁ ద
త్కవిసృష్టిం బరమార్థ మొంచు నతఁడొక్కండె జుమ్మా నిక్కపుం
గవి ధాత్రిం, గవినామమాత్రగులు ప్రఖ్యాతార్థశూన్యుల్ గదా
కవినామంబును నీటికాకమును లోకంబందుఁ దానొందదే? 73

క. అని కవితిలకుని ఘనముగ, వినుతి సలిపి పిదప ధరణివిభుఁడలరుచు బాఁ
పని గని పనివడి యనె నా,ననమున నునునగవులెనయ నలువగు నుడులన్

చ. బళిబళి! యెంతలోనఁ బ్రతిభావిభవంబు వరించెనిన్ను, నీ
కలరెడుప్రజ్ఞ పేదఱికమం చనినాఁడవుకాదె నిన్న, ని
స్తులగిరినిర్ఝరప్రథితతుల్యకవిత్వపటుత్వధార నీ
యిల నొకఁడైన నేఁడెనయఁ డీవు కృతార్థుఁడ వైతి వేసుమా! 74

క. వాణీనిశ్శ్రైతుకదయ, రాణను నీవొందకునికిఁ బ్రార్థించితిమో
వాణీశుని శ్రీనాథుని, [illegible] వాక్సహాయముఁ జేయన్.

క. శ్రీరామాయణపఠనము, భారతభాగవతసత్ప్రబంధపఠన మహా
శారా! కవితాధోరణి, కారయ నవసరము కా వటంచుఁ దెలిసితిన్. 75

ఉ. ఎంతవిచిత్రపుంగవన మిద్యది, పద్దెము నెంతఁగాంచినన్
నంతయు భావగోచరము చొప్పడ దద్దిర! కాని పాదపా
దాంతరసీమలందున రహస్యవిభావము గల్గనోపు, నీ
కెంతయు నీమకైత తగు నెన్నఁగ నీదగుశక్తి యల్పమే! 76

గీ. కృత్యనంతరోత్సవమున కేగువేళ, సచివవరుఁ గనుఁగొని రాజచంద్రుఁడంత
నీయపూర్వఁపుఁగవికి నీవిమ్ము నర్ఘ్య, పారితోషిక మని సభవాసి చనియె!

మ. పులినోటన్బడి తప్పిపోయినటు లూప్పు ల్వొచ్చుచుం జేదవాఁ
డెలమిన్ దావెలలేనికానికల నెన్నే నొంది శ్రీనాథుని
బలుమా టెన్నుచు నాఁటియుత్సవపుశోభ ల్గూడ నూహింపకే
యిలు సేరెం దనభార్యయున్ సుతులుఁ దన్నీక్షించి యుప్పొంగఁగన్ 78

సీ. ఒకచేత ఖడ్గంబు నొకచేతఁ గావ్యంబుఁ గొని యేన్గుపైనేగు నినునిఁగనుచుఁ
బ్రభుపార్శ్వభాగాన రాజిల్లు శ్రీనాథకవిరాజునకు నమస్కార మిడుచుఁ
బలుచుల్కలను మించి పరిహాసించుచు మీఁది కెగురుచువ్వలఁ బరికించినగుచు
వరకృపాణములతో వంశదండములతోఁ జతురులు విరచించు సాముఁ గనుచు
నతులమంగళతూర్యవాద్యములు వినుచు
నాటవెలఁదులనృత్యమునీటుఁ గనుచు
నుత్సవాలోకనాగతు లుత్సుకతను
నొండొరులఁ ద్రోసికొను చేగు చుండి రపుడు. 79

× × × × × × × × × × × ×

మ. వరశృంగారరసప్రధానకవితావైదగ్ధ్యసంపూర్ణుఁ డీ
శ్వరపాదాంబుజచింతనామృతరసాస్వాదప్రమత్తుండుఁ గా
కవిమత్తేభగణోగ్రసింహుఁ డవనీకాంతాత్రిసేవ్యుండు నే
కవిశ్రీనాథుని సంస్మరించుచు నమస్కారంబుఁ గావించెదన్. 80

# దేవేంద్రవర్మ చీడివలసశాసనము.

(విద్వాన్ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారు)

---

ఈతామ్రశాసనము గంజాముజిల్లా నరసన్నపేటకు 2 మైళ్ళ దూరమున నున్న చీడివలస యనునొకపల్లెటూరునం దొకరైతునకుఁ బాటిమట్టి త్రవ్వుచుండఁగా దొరకినది. ఈశాసనము బయలుపడినది మొదలుగ శ్రీయుతులు ఈ రేంజీస్కూళ్ళ డిప్యూటీఇన్‌స్పెక్టరుగారు దానిని సంపాదించుట కనేకప్రయత్నములు చేసి తుద కొకసంవత్సరమునాఁటికి నరసన్నపేట రేంజి ప్రాథమికోపాధ్యాయసంఘమువారికిఁ గాను మూఁడురూపాయ లిచ్చి దీనిని గొని యాసంఘమువారికి స్వాధీనపఱిచిరి. ఆసంఘమువారు దానిని సవిమర్శముగఁ బ్రకటింపవలసిన దని నాకొసంగిరి. వారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

2. ఈశాసనమున మూఁడురాగిరేకులు గలవు. అందు మొదటిరేకు మొదటిప్రక్కను ఏమియు వ్రాయఁబడలేదు. అం దొకశంఖము మాత్రము చెక్కఁబడినది. మూఁడవరేకు రెండవప్రక్కను మూఁడుపంక్తులలో శాసనవిషయమును దానిక్రింద నంగుళముదూరమున నొకపూవు రెండు మొగ్గలు (ఆకులు) గలతామరతీఁగ యును లిఖింపఁబడినవి. ఒక్కొక్క రేకుపొడవు 8 అంగుళములు, వెడల్పు $3\frac{1}{4}$అంగుళములు దళసరి $\frac{1}{8}$ అంగుళము. ఈ మూఁడు రేకులకు నెడమభాగమున సంచునకు $1\frac{1}{8}$ అంగుళముదూరమున $\frac{3}{8}$ అం. వ్యాసముగలరంధ్రములుగలవు. ఆరంధ్రములలోనుండి $1\frac{1}{8}$ చుట్టుకొలత 12 అంగుళముల పొడుగుగల రాగికడియము దూర్పఁబడి దానిరెండుకొనలును రాజముద్రికగల యొకదిమ్మలో సంధింపఁబడినవి. రాజముద్రిక గలదిమ్మ గుండ్రముగా $2\frac{1}{4}$ అంగుళముల పరిమాణము గలది. సుమారు $\frac{3}{4}$ అంగుళములదళసరి గలది. ముద్రికయం దడుగున నొకసనాళకమలము దానిపై నొకపీఠము దానిపైఁ బండుకొనియున్న నందివిగ్రహమును దానిపైని ప్రాచీనదేవనాగరిలిపిలో శ్రీదేవేంద్రవర్మ యనురాజనామమును దానిపైని జంద్రకళయును బోఁతపోయఁబడినవి. శాసనమందలిభాష సంస్కృతము. గ్రామనామములు మాత్రము తెలుఁగుభాషాత్మకములే. ఇం దెనిమిది అనుష్టుప్‌శ్లోకములు నొకయుపేంద్రవజ్రావృత్తము నొకవియోగినీవృత్తమును మిగిలినది గద్యగా నున్నవి. శాసనగ్రంథమును బరిశీలింపఁ గవి రెవరో తెలియరాలేదు. "ముఖపేన లిఖితం"

అని కలదు. ఆముధపయే రచయిత యై యుండునేమో ? భట్టశ్రీధరుఁడును భట్టయజ్ఞువును నుల్లిఖితమైనదీనిని బరీక్షించిరఁట. ఒకటి రెండుస్థలములందుఁ దక్క నెక్కడను విసర్గ ముండవలసినచోట లేదు. కొన్నిస్థలములందు ద్విత్వ ముండవలసినచోట నదియు లేదు. "యశాఃఅనేక" అనుచోట గద్యమందుఁ గూడ "యశోనేక" అని దుస్సంధి గావింపఁబడినది. రాజవంశవర్ణనావసరమున "నూతి స్తద్గుణకీర్తనం" అనియసంబద్ధముగా వాక్యము ముగింపఁబడినది. ఈ దోషములు లేఖకునివో యుల్లేఖకునివో తెలియదు. "కల్పాంతసంకల్పితాన ల్పజనసామ్రాజ్య మోహితమహామహిమ్నా" అని రచించినరచయితయుఁ బరీక్షకులుఁగూడ దీనిలోఁ బాలు పంచికొనక మానరుగదా ?

లిపి :—అకారాకారములకును, ఇకారేకారములకు, దకారడకారములకు, చకారధకారములకును, వకారబకారములకును భేదము లేదు. ఇప్పటి గకారమునకుఁ గుడినైపున నుండుగీటు తీసివేసిన శాసనమందలి రేఫ మగును. "ఙ్జ" "ణ్డ" లకును భేదము లేదు. ణకారలకారములకు భేద మల్పము. అకార మిప్పటి అకారమువలెఁగాక యెడమనైపున మూఁడంకెవలె నున్నభాగమునందు క్రిందిభాగము పెద్దదిగను మీఁదిభాగము చిన్నదిగ నుండి మీఁదిభాగమందే కుడిచేతినైపు గీటునకు నెడమభాగమునకును సంధించు నడ్డుగీటు గలదు. ఆకారమునకుఁగూడ నిదియేరూపము. ఒకదానిప్రక్క నొకటిగా రెండుబిందువులు వ్రాసి వాని క్రింద నాగరితొమ్మిదంకె వ్రాసిన నది ఇకారము ఈకారముగూడ నగును. ఉకారఋకారఌకార ఏకారైకార ఔకారములు స్వతంత్రముగ నీశాసనమున నెచ్చటను రాలేదు. ఇప్పటి నాగరితొమ్మిదంకె వ్రాసి దానికుడివైపునఁ బెద్దసున్నచుట్టిన నది ఓకార మగును. ఈయక్కర మొక్కచోట మాత్రమే వచ్చినది. హల్లులపైని ఆకారము సామాన్యముగ నిప్పటివలెనే కుడివైపున నొకగీటు నిలువుగా గీయుటవలనఁ జూపఁబడినది. కొన్నిస్థలములందుఁ దలమీఁదఁ జిన్నయడ్డుగీఁత గీసి దానికిఁ గొంచెము కుడిప్రక్క క్రిందికి వంచి విసరుటవలనఁ గూడఁ జూపఁబడినది. ఇకారము నీకారము ప్రమాదవశమునఁ గావలయు నటనట నొకదాని కొకటి పడినవి. ఉకారఊకారము లిప్పటి కొమ్ములను మాత్రమే పోలియున్నవి. ఋకార మిప్పటివలెనే గలదు. వ్రావడి గలయక్షరమునకు గుడి యీవలసినచోట నట్లీయక రేఫకారములకు బహుళముగ వట్రువసుడి యీఁబడియున్నది. ఏకారైకారము

లిప్పటివలెనే కలవు. కుడివైపున దీర్ఘముంచి తలమీఁదియడ్డుగీటు నెడమప్ర
క్కకుఁ గొంచెము వంచుటచే ఓత్వము చూపఁబడినది. హల్లులు సంయోగిం
చునపు డొకహల్లుక్రింద రెండవహల్లును వ్రాయుటయే ప్రాయికముగా నగప
డును. గిలక యక్కరము తలమీఁదఁజిన్ననిడువు గీటు గీచి దానినడుమ చిన్న
యడ్డుగీటు గీయుటవలనఁ జూపఁబడినది. క్రావడి రేఫమీఁదితలకట్టు తీసి య
క్కరముక్రింద నతికిన నగును. హల్లులకుఁ బూర్వము బిందువు రావలసిన
పుడు ప్రాయికముగాఁ బరసవర్ణమే కలదు. ఒకానొకయెడ బిందుపరసవర్ణ
ములు రెండును గలవు. గిలకవచ్చినహల్లు ద్విత్వమునొందుట సామాన్యము.
పకారయకారసకారము లీషద్భేదముతో నొకదానితో నొకటి పోలియు
న్నవి. పకారమధ్యమున నడ్డుగీటు గీసిన షకారమగును. యావత్తిప్పటి తెలుఁ
గువలెనే యున్నది. హకారమిప్పటిడకారమువలె నుండును. ఇప్పటి ఊకా
రమువలె ఝకారమున్నది. కకారమునకు రెండువిధము లగురూపము గలదు.
ఒకరూప మిప్పటి కకారమువలె నుండును. రెండవది తెలుఁగు ఏడంకెవలె
నుండును. సకారము తెలుఁగు ఏడంకెవలెనే యుండును. నకారమునకుఁ దల
కట్టునుండి క్రిందివైపున కొకనిలువుగీటు గీచి యారెంటింటి నడుమ నడ్డుగీ
టుతో సంధించిన మకారమగును. ఇప్పుడును మకార మట్లే యుండును. భకా
రమిప్పటివలెఁ గుడివైపు నిలువుగీటు లేక వామార్ధభాగమున కడుగునఁ గొ
మ్మిచ్చినట్లున్నది. క్షకారము రెండువిధములు. నకారమునకుఁ గ్రింద కోలపా
టినున్నచుట్టి దానికిఁ గుడివైపున తకారమువంటి గుర్తువ్రాయుట యొకటి.
ఇప్పటికకారమునకుఁ గ్రింద చతురస్రముగా సున్నవ్రాసి దానిమధ్య నడ్డుగీటు
వ్రాయుట రెండవది. హకారమున కిప్పటి ఉకారమువంటి రూపము గూడఁ
గలదు. జకారము క్రింద నిప్పటికొమ్ముదీర్ఘము వంటిగుర్తు వ్రాసిన జ్ఞకారమ
గును. జకార మిప్పటి రేఫము కుఱుచగా వ్రాసిన నెట్లుండునో యట్లుండును.
ఇది పరసవర్ణముగానే కాని స్వతంత్రముగా నెక్కడను రాలేదు. ఖకారగ
కారశకారము లీషద్భేదముతో ధనురాకారముగా కాఁడలేని ఓడలంగరువలె
నుండును.

శాసనకాలము :—గాంగవంశమున కలంకారమైన భూపేంద్రవర్మకు
పుత్రుఁడగు దేవేంద్రవర్మ గాంగేయప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరములు
మూఁడువందల తొంబదియెడవయేట సూర్యగ్రహణనిమిత్తముగా కోలువెన్న

నియందలి కందలివాడగ్రామవాస్తవ్యు లగు ఆదిత్యభట్ట యజుభట్టప్రముఖులకు చీడివలస ప్రదేశమును సర్వకరపరిహారముగా దానముచేసెను. ఈశాసనముసం దీతనివంశావళి విస్తారముగా వర్ణింపఁబడలేదు. గోత్రము చెప్పఁబడలేదు. కలింగమును బాలించిన రాజవంశములు రెండుగా నగపడుచున్నవని విమర్శకు లందురు. ఒకవంశమువారు రెండుమూఁడుపురుషాంతరములకంటె నెక్కుడుగ వంశవర్ణనము గావింపఁలేదు. గోత్రము తెలుపలేదు. తమశకమును దప్ప శాలివాహనశకమును వ్యవహరింపలేదు. రెండవతెగవారీపనులన్నియుఁ గావింతురు. ఇంతియకాక మొదటివంశమువారు "గాంగామలకులతిలక" యనువిశేషణమును రెండవవంశమువారు "గంగానా మన్వయ మలంకరిష్ణోః" అనియుఁ దమభేదమును నిరూపించుచున్నారు. రెండవవంశమువాఁ డగుకామార్ణవునితండ్రి వీరసింహునకుఁ బూర్వము కళింగమును బాలించిన 81 రు రాజు లుండి రని యనంతవర్మశాసనములవలనఁ దెలియుచున్నది. కాని వారి నామములు మొదలగున వేవియుఁ దెలియరాలేదు. ఇది యిట్లుండ మొదటి తెగకుఁ జెందినరాజులశాసనము లనేకములు గానవచ్చుచున్నవి. గాంగశకవత్సరములు 80 లో హస్తివర్మ ఉర్లామశాసనము, 87 లో ఇంద్రవర్మశాసనమును, 91 లో ఇంద్రవర్మరాజసింహునిశాసనము, 128,146 లలో ఇంద్రవర్మశాసనములు, 183 లో గుణార్ణవునికుమారుఁ డగుదేవేంద్రవర్మశాసనము, 284 లో అనంతవర్మశాసనమును, 351 లో సత్యవర్మశాసనమును గానవచ్చుచున్నవి. ప్రకృతశాసనము గాంగశకము 397 నాఁటిది. ఇంతవఱకగపడిన గాంగశాసనములలో నిదియే కడపటిది. ఈరాజులకాలనిర్ణయము చేయుటకు సరియగు నాధారము లేవియును లభింపలేదు. * హస్తివర్మ ఉర్లామశాసనమును బ్రకటించినవారెవరో కాని వారు గాంగశకమునకును శాలివాహనశకమునకును క్రీస్తుశకమునకును భేదమును గణించి క్రీస్తుశకము 270 లో గాంగశకారంభమని నిర్ధారణచేసి యున్నారు. నేనును దానినే యనుసరించెదను. కావున 270కి 397 కలిపిన 667 క్రీస్తుశకప్రాంతమున నీదేవేంద్రవర్మ రాజ్యముచేసినట్లు కానవచ్చుచున్నది.

రాజధాని:— కళింగము నేలినగంగరాజుల రాజధానీవిషయమును నిర్ణయించుట కింకను బ్రబలాధారములు దొరకలే దని యనేకులతలంపు కాని గాంగులయు గంగులయు శాసనము లన్నిటియందును గూడ "విజయ

* చూ. శా|| ది సం|| ఉ దాదిసంచిక. 217—124

కళింగనగరాత్” అనికళింగనగర మొకటి పేర్కొనఁబడినది. గంజాముజి ల్లాలోని ముఖలింగమే కళింగనగర మని కొందఱును కళింగపట్టణము కళిం గనగర మనికొందఱును వ్రాయుచున్నారు. ముఖలింగమునకు సమీపముగా నుండినగరికటకమే శాసనములందుఁ బేర్కొనఁబడిన విజయకళింగనగర మనుట సమంజస మని నాయూహ. కళింగమునకు కటకము రాజధానియని కొన్నిచారిత్రికగ్రంథము లుండుటచేతను, అనంతవర్మచోడగంగదేవుని కొన్నిశాసనమునందు ద్వితీయకామార్ణవుని రాజధాని తిరస్కృతత్రివిష్టప మగునగరమని యుండుటచేతను పై రెండుపేళ్లు గలసి యే నగరికటకమునకుఁ జిరకాలవ్యవహార ముండుటచేతను నగరికటకమే గాంగులకును గంగులకును గూడఁ బూర్వస్థాన మగువిజయకళింగనగర మనుట సాహసము కానేరదు. ఇది ముఖలింగమునకు సమీపము. గంగవంశమునకు మూలపురుషుఁడగుకా మార్ణవుఁడు పినతండ్రిచే రాజ్య మపహరింపఁబడఁగా దూర్పుగాఁ దనతమ్ము లతోఁ బ్రవాసమువచ్చి శబరాదిత్యుని జయించి దంతాపురమును రాజధాని గాఁజేసికొని 30 సంవత్సరములు రాజ్యముచేసె నఁట. మఱియుఁ దన తమ్ము లలో నొకఁడగు దానార్ణవుని యువరాజుగాఁ జేసి గుణార్ణవున కంబవాడివిష యము మారసింహునకు సోదామండలము వజ్రహస్తునకు కంటకవర్తనియు ననువిషయముల నొసంగెను. దంతాపురము ఇప్పుడు నశించినది. కాని యం దలికోటమాత్రము శిథిలమై ప్రాకారములు గిరులంబోలె నిప్పటికి నగపడుచు దంతవక్త్రునికోట యని పిలువఁబడుచున్నది. దీనిలోపలి విస్తారము సుమారు 3 మైళ్ళు. అది నగరికటకమునకు సమీపముననే యున్నది. సోదామండలము సోద యనుపేరున వ్యవహరింపఁబడుచు నాప్రాంతముననే కలదు. అంబవాడి కూడ అంబావెల్లి యనివ్యవహరింపఁబడుచు నగరికటకమునకుఁ గొన్నిమైళ్ళ దూరముననే యున్నది. కావున వీరిరాజధాని యీనగరికటకమే కాని ముఖ లింగనగరమును కటకమును గానేరవు. మఱియు గాంగుల గంగుల శాసన ములందలి క్రోష్టుకవర్తని, కంటకవర్తని, కోలువర్తని, వరాహవర్తని యనువి షయము లన్నియు శ్రీకాకుళముతాలూకాలోనివే యై యున్నవి. కావున వీని కిని సుప్రసిద్ధమయిన కటకమునకును సంబంధముండుట పొసఁగనేరదు. అట్లే కేవలసముద్రతీరమున నున్నకళింగపట్టణముకంటె రాష్ట్రమునకు నడుమనున్న నగరికటకమే రాజధానిగా నుండుట [illegible] దీనికి [illegible] 12 కోసులదూరమున

కళింగపట్టణము ఒక్కనైపునను ఒకనైపున మఱికొంత యెక్కువదూరమున మహేంద్రగిరియును గలవు. కావునఁ గళింగరాజులకు మహోదధిమహేంద్రాధిపత్యములు దుర్ఘటములు గావు.

రెండు తెగలకు నంతరకాలము:— మొదటి తెగవారిలో మొదటి వాఁడు హస్తివర్మగానే యగపడుచున్నాఁడు. అతఁడు గాంగశకము 80 లో నున్నాఁడు. ఇతనికంటె నొకరిద్దఱు ముందున్నవా రని యూహించినను వారి చరిత్రమేమియుఁ దెలియరాలేదు. ఈతనితో ప్రకృతశాసనకర్తవఱకు 397సం॥ గాంగశకము ప్రవర్తించినది. అనంతరము రాజులు గాంగశకమును వ్యవహరింపలేదు. అయినను గంగవంశములోని వాఁడై కళింగమును బాలించిన అనంతవర్మచోడగంగదేవునివఱకును 18 గురు రాజులు 352¼ సంవత్సరములు రాజ్యముచేసినట్లు తెలియుచున్నది. అనంతవర్మతండ్రి యగురాజరాజు శా. శ. 999 లో పట్టాభిషిక్తుఁడయ్యెను. ఆసంవత్సరము 1077 క్రీస్తు వత్సరమునకు సరిపోవుచున్నది. 1077లో 352 తీసివేయఁగా 725 వచ్చును. ఆసంవత్సరముననే కామార్ణవుఁడు శబరాదిత్యునిజయించి కళింగమును గ్రహించుట జరగియుండును. ఇదియే రెండవతెగవారి రాజ్యారంభకాలము. 667 లోని దేవేంద్రవర్మకును 725 లోని కామార్ణవునికిని అంతరము 58 వత్సరములు మాత్రమే. ఈ యేఁబదియెనిమిది వత్సరములలోను చాళుక్యుఁడగు బాలాదిత్యుఁ డీదేశము నేలె ననుట యంతగాఁ బొసఁగి యుండలేదు. ఫ్లీటరు దొరగారు శబలాదిత్యుఁ డను పాఠమును భ్రమచే బాలాదిత్యుఁ డని చదివిరే కాని వేఱుకాదు. మొదటి తెగలో నీదేవేంద్రవర్మ తరువాత శబరాదిత్యుఁ డొకఁడుండి పాలించుచుండ వానిని జయించియే మొదటి కామార్ణవుఁడు కళింగమును స్వాధీనపఱుచుకొనె ననుట సమంజసముగా నగపడుచున్నది. రెండవతెగవారు వారిలో వారే తగవులాడి యొకరి నొకరు జయించుకొనుచు వచ్చినట్లు శాసనములవలననే తెలియంగ నగును. కావున క్రీస్తుశకము 270 నుండి 1113 వఱకు నీదేశమును గాంగ గంగ వంశముల రాజులే పాలించియుండి రని యూహింపవచ్చును.

రెండు తెగలకును భేదము:— ఈ రెండు తెగలకును గలభేద మేమి? అది యేల కలిగెను? అని విచారింపవలసియున్నది. రెండు తెగల వారికిని మహేంద్రాచలశిఖరప్రతిష్ఠితుఁ డగుగోకర్ణస్వామి యిష్టదైవము. రెండు తెగల

కును విజయకళింగనగరము రాజధాని. ఇరు తెగలవారును బరమమాహేశ్వర పరమభట్టారకులు, మహోదధిమహేంద్రాధిపులు, కాని, మొదటి తెగవారికి గోత్రము లేదు. రెండవ తెగవారి దాత్రేయసగోత్రము. మొదటివారు గాంగామలకులతిలకులు, రెండవవారు గంగాన్వయులు. ఇంతమాత్రమే వీ రిరు తెగలవారికి గలభేదము. ఇది యేల కలిగెనో యూహింప నవకాశము కలుగలేదు. సామాన్యముగా క్షత్త్రియులు సూర్యవంశస్థుల మని కాని చంద్రవంశస్థుల మని కాని చెప్పుకొందురు. గాంగవంశమువారీ రెండువంశములలో దేనికిని జెందినవారుగాఁ జెప్పికొనలేదు. పైగాఁ దాము దానమిచ్చుచున్న బ్రాహ్మణులగోత్రప్రవరలను జెప్పుచుఁ గూడఁ దమగోత్రముల మాటనైనఁ దలంపలేదు. దీనివలన మొదటివారార్షగోత్రములకుఁ జెందినవారు కారేమో యనియును ఈదేశమునఁ బ్రకృతకాలమున సెగిడీలు అను నొకజాతిశూద్రులు గలరు, వారు గంగవంశపుక్షత్త్రియుల మని చెప్పుకొందురు, వారికి గోత్రప్రవరలును జన్నిదములు ధరించుటయు లేవు. వీరి నిప్పుడు శూద్రులుగా నందఱు బరిగణించుచున్నారు. బహుశః వీరు మొదటి తెగకు సంబంధించినవారేమో యనియును సందియ ముదయించుచున్నది. వజ్రహస్తుఁడు తనశాసనమున ఆత్రేయగోత్రమును దెలుపుటయు గంగాన్వయ మని కులముపేరు మార్చుటయు మొట్టమొదటఁ గావించెను. ఆమార్గమునే తరువాతివారు నవలంబించిరి. మొట్టమొదట శాలివాహనశకమును బేర్కొని గాంగశకము నుపేక్షించినవాఁడు నీతఁడే. ఈతనినాఁటికిఁ జాలుక్యచోడాదీతరరాజులతోడి వ్యవహారము లధిక మగుటవలన వారిమర్యాదల ననుసరించి తాను మార్పు గావించి యుండును. ఇంతమాత్రమున నీరెండు తెగలు వేఱువే అనుట న్యాయ్యము గాదేమో? పైగా రెండు తెగలవారికిని గలసాధర్మ్యము బలీయమై యేకత్వమునే బోధించుచున్నది, కావున, నీతెగలు రెండు నొకటిగానే భావింపవచ్చును.

శాసనస్థలము:— కోలువర్తనియందు కందలివాడగ్రామవాసికుటుంబుల సమీపమున నవిడ్డిపదేశమును దానముచేసినట్లు శాసనమునఁ గలదు. ఈశాసనము నరసన్నపేటకుఁ దూర్పుగా 2 మైళ్ళదూరమునఁ గలచీడివలస యను గ్రామమునకుఁ బశ్చిమముగా నంటియున్న పాటిదిబ్బలో దొరకినది. ఆపాటిదిబ్బలను [illegible] వ్యవహరించుచున్నారు. సామా

న్యముగా నీ దేశములోఁ గూరగాయలు వ్యవసాయముచేయు భూములు పొందరిగుడ్డ లందురు. ఆవ్యవసాయము చేయుపొందరు లను ఓఢ్రశూద్రులవలన వీని కీపేరు కలిగినది. ఈచీడివలసలో నెన్నఁడును పొందరులును గూరగాయలవ్యవసాయమును లేవు. కావున నీపాటిదిబ్బకు నామసామ్యమునఁ గలిగిన పామరజనవ్యవహారమాత్రమే కాని వాస్తవముగ నివి పొందరిగుడ్డలు గావు. పామరవ్యవహారమువలన కందలివాడ పొందరిగుడ్డగా మాఱినది. ఈ నశించిన కందలివాడదిబ్బపైని పూర్వ మూ రుండెడి దనియు నదియే కారణముననో నశింపఁగాఁ జీడివలసయున్న స్థలమునఁ దిరిగి కట్టి రనియు నక్కడిజనులు చెప్పుకొందురు. కావున నీపొందరిగుడ్డలే పూర్వము కందలివాడ గ్రామ మనియు చీడివలసయే దానమీయఁబడిన సివిడిప్రదేశ మనియుఁ దెలియుచున్నది. చీడివలస యిప్పటికిని అగ్రహారముగానే యున్నది. కాని యందు బ్రాహ్మణు లెవ్వరు నివాసముగా లేరు. అది యొక బైరాగిమఠమునకుఁ జెందియున్నది. ఇంతమాత్రముదక్క శాసనమునఁ జెప్పఁబడిన సరిహద్దుగ్రామము లేవియు శాసనోదాహృతరీతిని సరిగాఁ దెలియరాలేదు.

దానప్రతిగ్రహీతలు:— భారద్వాజసగోత్రు లగు ఆదిత్యభట్టాదులకు దానమిచ్చినట్లు శాసనమునఁ గలదు. శాసనము దుపయోగింపఁబడిన విశేషణములవలన వీరు బ్రాహ్మణులుగానే యగపడుచున్నారు, కాని యిప్పుడాయూరను గాని తత్ప్రాంతమునఁ గాని యొక్క బ్రాహ్మణకుటుంబ మైనను లేదు. ఈ దేశమున నున్న కాళింగులలోఁ గొందఱకు ఋషిగోత్రప్రవరలును భట్టబిరుదములును పౌరోహిత్యమును గలవు. ఉపనయనమును యజ్ఞోపవీతధారణమును గలవు. కొందఱు బ్రాహ్మణులమే యని చెప్పుచుందురు. ఇట్టివారు అనంతవర్మచే మూఁడువందల బ్రాహ్మణులకు దానము చేయఁబడినకొళిగ్రామమునను నాపరిసరగ్రామములందు ననేకులు గలరు. వీరుపూర్వమునుండి యీదేశమున వసించుచున్న కాళింగబ్రాహ్మణు లనియు వీ రేదానప్రతిగ్రహీతలనియు మత్స్యమాంసాశనము వీరిని వీడలే దనియు, శాఖాహారులగు బ్రాహ్మణు లీదేశమునకుఁ గ్రొత్తగా నాంధ్రదేశమునుండి వలసవచ్చినవారనియు నగపడుచున్నది. ఈకాళింగబ్రాహ్మణులు దిప్పు డుపనయనాదిచిహ్నము లగపడుచున్నను నవి పౌరాణికముగానే గాని వైదికముగఁ గావు. వేదమునకును వీరికిని సంబంధము లేదు. శాసనకాలములందు వీరికి వేదాధికార ముండెడి దనియు [illegible] నశించిన దనియు నూహింపనగును.

కళింగరాజులమతము:— గాంగగంగవంశములవారిరువురును బరమ మాహేశ్వరు లైనట్లు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. అనంతవర్మ చోడగంగదేవుఁడు మాత్ర మొక శాసనములోఁ బరమమాహేశ్వర పరమ బ్రహ్మణ్య పరమవైష్ణవబిరుదములను దన కుపయోగించికొని సర్వమతసమాన మును సూచించుచున్నాఁడు. కాని తనపూర్వులెల్లరును బరమమాహేశ్వరు లనియే తెలిపెను. ఈశాసనకర్తమాత్రము పరమశైవుఁ డనియే కాక తాను బరమవీరశైవుఁడనియుఁ గూడఁ దెలియఁజేసినాఁడు. దానభూమికి సరిహద్దు లను దెలుపుటలో సామాన్యముగ నెవ్వరైనను బ్రాచిమొదలుకొని యీశా న్యమువఱకును జెప్పుదురు. ఈతఁ డట్లుగాక తనదైవ మగునీశానదిక్కును మొదటఁ జేర్కొని తన పరమమాహేశ్వరత్వమును బ్రకటించియున్నాఁడు.

విశేషములు:—సామాన్యముగ గాంగవంశమువారు హస్తివర్మశాసన మును గంగవంశమువారు వజ్రహస్తునిశాసనములను జూచియే కొంచెముకొం చెము మార్పుల నొనర్చుకొనుచు శాసనముల వ్రాయించిరి. అనంతవర్మశాస నములందు వర్ణనములు మాత్రము స్వతంత్రముగా నధికముగాఁ జేర్పఁబడినవి. మొదటితెగవారు చిన్న చిన్న భూములను దానముచేయుచు వచ్చిరి. ఆకాల మున వారిరాజ్యమంతగా విస్తృతముగాలేదు గాఁబోలును. రెండవవంశమువారు గ్రామములకు గ్రామములే యగ్రహారములుగా నిచ్చిరి. వీరిరాజ్య మతివిస్తీర్ణ మని శాసనములే చెప్పుచున్నవి. పూర్వమునుండియుఁ గలింగదేశభాష ఆం ధ్రమే. వారిలిపికూడ నాంధ్రమే. హస్తివర్మశాసన మాంధ్రలిపియందేకలదు. సీసపద్యముగల దీర్ఘాసిశాసనముకూడ నిదివఱకుఁ బ్రకటింపఁబడియే యున్నది. ఇంక ననేకవిషయములవలనఁ గళింగ మాంధ్రదేశమున నవాంతరభాగ మనియు నుత్కలదేశసంబంధము లేనిదనియుఁ దెలియవచ్చుచున్నది. ఈశాసనముదొర కినస్థలమందే దొరికిన యింకొకశాసనమును అంధవరం కా॥మ॥ గోటేటి లిం గమూర్తిపంతులుగారు సంపాదించి యాంధ్రపత్రికాకార్యాలయమున కంపి రని తెలియుచున్నది. దానిని గూడఁ ద్వరలోఁ బ్రకటించిన నింక నేమేని విశేషవిషయములు బయలుపడు నేమో! త్వరలో నది ప్రకటింపఁబడుఁగాక. ఈ వ్యాసమువ్రాయుటలో ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలోఁ బ్రకటింపఁబడిన హస్తి వర్మ ఉర్లాంశాసనమును భారతిలో మ॥గిడుగు సీతాపతిపంతులుగారిచేఁ బ్రక టింపఁబడిన అనంతవర్మచోడగంగదేవుని కోర్ని శాసనములును నాకత్యాలెన

హాకారు లయినవి. కావున వారి కనేకవందనము లర్పించుచున్నాఁడను. శాసనము సంపాదించుట, శాసనమును శుభ్రపఱుచుట మొదలగుపనులు గావించి లిపిఁగనుఁగొనుటలో నఖండసాహాయ్య మొనరించి ప్రకటించువఱకు ననేకసాహాయ్యము లొనర్చిన శ్రీయుతులు స్కూల్ల డెప్యూటీ యినస్పెక్టరుగారు, తెంపల్లి సూర్యనారాయణమూర్తి పంతులుగారికిఁ గృతజ్ఞతాపూర్వకవందనములు పదింబదిగ నొనరించుచున్నాఁడను.

## ——♦ శాసనమూలము ♦——

(1) ఓం స్వస్తి శ్రీమదనేకదేవకులాకులా దమరపురానుకారిణ (?) కల్పాన్తసఙ్కల్పితాన

(2) ల్పజనసాంమ్రాజ్య మోహితమహామహిమ్నా మహితలతిలకాత్ కలింగ

(3) నగరాత్ ప్రసిద్ధసిద్ధతాపసాధ్యాసితకన్దరోదరమహేన్ద్రగిరిశిఖర

(4) శేఖరస్య సురాసురగురో స్సకలత్రిభువనమహాప్రసాదనిర్మాణైక

(5) సూత్రధారస్య భగవతో గోకర్ణస్వామిన శ్చరణకమలసం

(6) భవసలిలక్షాలితకలికాలకలంకో గంగామలకుల చూడా

(7) మణి (౧) స్స్ఫూర్జం నిజభుజ I న్ప్రజ (భ్రా) జితసకలకలింగాధిరాజ్యా (౧) మందాని

(8) లవేలాకులకల్లోల జలధిమేఖలావని తలామలయశో౽నేకభీష

(9) ణసమరసంక్షోభజనితజయప్రతాపావనతసమస్తసామంత

(10) కిరీటకిరణమంజ్జరీపుఞ్జరంజ్జితచరణః పరమమాహేశ్వరో మాతా

(11) పితృపాదానుధ్యాతో మహారాజాధిరాజపరమేశ్వర శ్రీమత్ భూపేన్ద్రదేవవర్మణ సూ

(12) నుః శ్రీదేవేన్ద్రవర్మ్మా స్వాసిదారాదినిఖి(౯) వనకలాంతాతిమ త్వాలః యోరక్షతి

(13) క్షితింధిరః క్షితీశో నాన్యశాసనాత్ ప్రాప్త వేస్వాశిత్వా యస్యాకీ ర్తయః స్వ

(14) ననిర్మ్మలా (౧) అన్యోన్యం వారయంతీవ విచయశ్చ్రమ పాదాభా యస్మి న్వసుమతీం

---

(1) [illegible] (2) [illegible]

(15) పాతి స్తేయశబ్దోనిరర్థక(ః) పరద్రవ్యాపహరణ విరహా(ః)ప్రత్య
యా దభూత్ మార

(16) సింహః పితా యస్య వజ్రీ చైవ పితామహః స్వయం దేవేన్ద్రో
వర్మేతి సూతి స్తద్గుణకీర్తనం। సహి

(17) కోలువత్తన్యాం కన్దలివాడగ్రామనివాసికుటుమ్బిన(ః) సమవే
తానాజ్ఞాపయతి యథా

(18) యం ధర్మో మాతాపిత్రో రాత్మనశ్చ పుణ్యాభివృద్ధయే
మయా ఇజ్యాధ్యయనక్రియార

(19) తేభ్య(ః) తే కే సిపిడిగ్రామవాస్తవ్యాః వేదవేదాంగావేదిన (ః)
శ్రుతిస్మృత్యు

(20) దితం ధర్మమనిశం పర్యుపాసతే తేభ్యః ఆదిత్యభట్టయజ్ఞభట్ట
శండిదేవభట్ట

(21) ప్రముఖేభ్యః సిపిడిగ్రామార్జిత గోజాదీక్షిత[4]వంశ్జేభ్యః బార
ద్వాజగోత్రేభ్య(ః) ఆజ్ఞ్

(22) రసబార్హస్పత్యభారద్వాజప్రవరేభ్య (ః) సూర్యగ్రహణనిమిత్తే
సివిడి [5] ప్రదేశః కన్ద

(23) లివాడగ్రామేద (త్తః) సర్వకరపరిహారే ణాచన్ద్రార్కం యథో
చితభోగభాగాది

(24) నాసుఖం ప్రతివసథేతి తతః ప్రాదాక్షిణ్యేన సీమాలిఙ్గానిలిఖ్యం

(25) న్తే ఈశాన్యాందిశి సివిడిభాదివాడకన్దలివాడానాం త్రికూటే తిం
త్రిణీవృక్ష(ః) త

(26) తో వనరాంజీ తత శ్శిలాసముద్ర(ః) తత(ః) ప్రాచ్యాదిశి సైవ
వనరాజీ తింత్రిణీవృక్ష

(27) సహితా యావత్ గుల్మసహితవాల్మీక(ః) తదకా (న్యా) గ్నే
యాం దిశిభూశిలాపంక్తి(ః) యా

(28) వత్ పర్వతితత(ః) శిలాసఙ్ఘ(ః) తతో నేకనింబసహితా వనరాజీ
తతో దక్షిణాస్యాం

(29) దిశి సైవ వనరాజీ షారిత్రావృక్షసమున్వితే వాల్మీకసహితా సైవ
తింత్రిణీ

---

(3) పృథయ. అనిమూలము. (4) అర్ధము స్పష్టము.

(5) సివిడిప్రదేశం,......గ్రామమో అనికలదు.

(30) వృక్షసహితా వాల్మీకసహితా తత(ః) నైరుత్యాందిశి తింత్రిణీ వృక్షద్వయసహితా తత కన్ద

(31) లివాడ కోర్లమ్మరినా వేదావాడానాం త్రికూటే వాల్మీక[ః]తత[ః] ప్రతీచ్యాందిశి తింత్రిణీతాలప

(32) ఙ్క్తిసహితా తత[ః] శాల్మలీవృక్ష[ః] తత[ః] కన్దలివాడనాపితవాడ సిడిడీనాం త్రికూటే తాల

(33) ద్వయహరిద్రావృక్షసహిత సైవ వనరాజీ భవిష్యద్భూపానాం జ్ఞాపయతి త్రాణాయ లోకస్య

(34) గ్రహీతచాపాం నాగామినోహం ప్రణతో బ్రవీమి।సాధారణః సర్వనరాధిపానాం ధ

(35) ర్మో విరుద్ధో భువిపాలనీయ॥ విదితం నియతం క్రియాఫలం చరితం సచ్చపురాణభూ

(36) భృతాం కతిచిచ్చ దినాని జీవితం హరణా త్పాలనమేవ శో హితం పాత్రే సమర్పణాదేవ కృతా

(37) ర్థోహం నరాధిపాః త(స్మి) న్మిత్త మపుణ్యం మే్వా మాభూదితి నివేదితం ఆహచవ్యాసః। స్వదత్తాం పర

(38) దత్తాం మ్వాయత్నా ద్రక్షయుధిష్ఠిర।మహీం మహీంమతాం శ్రేష్ఠ దానాచ్ఛ్రేయో నుపాలనం షష్టి

(39) వర్షసహస్రాణి స్వర్గేతిష్ఠతి భూమిదః। ఆక్షేప్తా చానుమంతాచ తాన్యేవనరకే వసేదితి।

(40) ప్రవర్ధమానవిజయరాజ్యసమ్వత్సరాణాం శతత్రయసప్తాధికా నవతి అంకేనాపి

(41) ౩౯౭॥ మధపేణలిఖితం సప్వదపేనో(ల్లి)ఖితం భట్ట శ్రీధరేణ భటయజునచ

42 పరిక్షితం

ఆంధ్రానువాదము:— ఓం. స్వస్తి శ్రీమంతము లగునేకదేవాలయములచే వ్యాప్తమైనదియు, సురలోకమునకు సాటియగునదియు, కల్పాంతము దనుకరింపఁబడిన యధికజనసామ్రాజ్యముచే మోహింపఁజేయఁబడినమహా మహిమగలదియుఁ భూతలమున కలంకారము నగుకళింగనగరమునందుండి; వేస్ను లగుపేన్లుచేశను దానము ... ... ... ... ... మహిమాన్విపఁబడిన గుణశిఖరములు ...

గలమహేంద్రపర్వతశిఖరమునకు శిరోభూషణమైనట్టియు సురాసురులకు గురు
వును ముల్లోకము లనుగొప్పమేడల నిర్మించు శిల్పాచార్యుఁడును, భగవంతు
ఁడునగు గోకర్ణస్వామియొక్క పాదోదకముచేఁ గడిగివేయఁబడిన కలికాలక
ల్మషము గలవాఁడును గంగవంశమునకు శిరోరత్నమైనవాఁడును తళతళలాడు
తనభుజము లనువజ్రములచేనలరింపఁబడిన కళింగాధిరాజ్యము గలవాఁడును,
చల్లనిపిల్లతెమ్మెరలచే వ్యాప్తమగు తీరమునందలి తరంగములు గలసముద్రము
లను మొలనూలుగల భూమియందు వ్యాపించిన నిర్మలయశము గలవాఁడును
అనేకయుద్ధములందుఁ గలిగినజయముచేఁ బ్రకటింపఁబడిన ప్రతాపముచే వంచఁ
బడిన సకలసామంతరాజులయొక్క కిరీటములందలి రత్నములకాంతులచేఁ బ్ర
కాశింపఁజేయఁబడిన పాదములు గలవాఁడును, పరమమాహేశ్వరభక్తుఁడును,
తలిదండ్రులపాదములను ధ్యానించువాఁడును మహారాజాధిరాజపరమేశ్వరుఁ
డును, శ్రీమద్భూపేంద్రవర్మతనయుఁ డగుశ్రీదేవేంద్రవర్మ; ఏవీరుఁడు తనకత్తి
చే నఱకఁబడిన సకలరిపుకులము గలవాఁడై అనన్యశాసనమువలన భూమిని బా
లించుచున్నాఁడో నీటినురుగులవలెఁ దెల్లనైన యౌవనికీర్తులు మహావాదధీ
రమున వ్యాపించి యలలతోఁ బ్రోవుడుచున్నవో, ఎవఁడు రాజ్యము సేయు
చుండఁగాఁ బరద్రవ్యాపహారణము లేకుండుటంజేసి స్తేయశబ్దము వ్యర్థమయి
నదో ఎవనికి [భూపేంద్రవర్మకు] మాతసింహుఁడు జనకుఁడు వజ్రి [ఇంద్రవర్మ]
పితామహుఁడు దేవేంద్రవర్మ యనుతాను కుమారుఁడో, ఆభూపేంద్రవర్మ
గుణకీర్తన మిది. [పైవర్ణనము] ఆభూపేంద్రవర్మ కుమారుఁ డగుదేవేంద్రవర్మ
కోలువర్తనివిషయమందలి కందలినాడగ్రామనాను లగుకుటుంబముల నొక్క
చోటఁ గూడినవారి నాజ్ఞాపించుచున్నాఁడు. నాతలితండ్రులయొక్కయు నా
యొక్కయుఁ బుణ్యాభివృద్ధికై యొనర్చిన యీధర్మమును మీ రెఱుంగుదురు
గాక; నాచేతను యజ్ఞముచేయుట వేదములుచదువుట మొదలగు సత్కా
ర్యములం దాసక్తిగలవారును సివిడిగ్రామవాస్తవ్యులును వేదములను వేదాం
గములను జదివినవారును ఎప్పుడును శాస్త్రచోదితమయిన ధర్మమును నడపు
వారును సివిడిగ్రామార్జితగోజాదీక్షితవంశమునం బుట్టినవారును ఆంగిరసబా
ర్హస్పత్యభారద్వాజప్రవరాన్విత భారద్వాజగోత్రులు నగు ఆదిత్యభట్టు యజ్ఞ
భట్టు శంబిదేవరభట్టు మొదలగు వారికొఱకు సూర్యగ్రహణసమయమున
కందలివాడగ్రామమందలి సివిడిప్రదేశము ఏవిధమగుపన్నులు లేకుండ దాన
ముచేయఁబడినది. ఆచంద్రార్కముగా దానిని ఉచితభోగభాగాదులతో సుఖ
ముగా ననుభవింతురుగాక.

కుడివైపునుండి యెల్లలు లిఖింపఁబడుచున్నవి:— ఈశాన్యదిక్కునందు సిపిడి భాదివాడ కందలివాడల త్రికూటము [మూఁడుత్రోవలు కలయుచోట] చింతచెట్టు తరువాత వనరాజి తరువాత శిలాసముద్రము.

తరువాత తూర్పుదిక్కునందు పొదలతోఁగూడిన పుట్టవఱకును చింత చెట్లతోఁగూడిన యావనరాజియే. ఆగ్నేయమున కొండవఱకుఁగలభూశిలా పంక్తి తరువాత శిలాసంఘము దానితరువాతఁ బెక్కువేపచెట్లు గలవనరాజి. దక్షిణమున హరిద్రావృక్షముతోఁగూడిన పుట్ట గలయావనరాజియే. మఱియుఁ జింతచెట్టుతోఁగూడిన పుట్టగలదియును.

నైరుతిదిశను జోడుచింతలు గలయావనరాజయే. దానితరువాత కంద లివాడ కోలఁమ్మురినా వేదావాడల త్రికూటమందు వాల్మీకము పడమరను చిం తచెట్లు తాటిచెట్లు గలయావనరాజియే, తరువాత బూరుగుచెట్టు తరువాత కందలివాడనాపితవాడసిపిడిగ్రామముల త్రికూటమున రెండుతాఁటిచెట్లు హరి ద్రావృక్షము గలయావనరాజియే. భవిష్యభూపాలుర నాజ్ఞాపించుచున్నాఁడు. లోకమును గాచుటకై ధనువు చేఁబూనిన యాగామిరాజులను వినతుఁడనై యిద్ధమైన దైనను ధర్మమును బాలించుట రాజు లందఱకును సాధారణమై నది. సత్కర్మయొక్కఫలము నియతమైనది. పూర్వరాజులసచ్చరిత్రము నెఱిఁ గినదే. బ్రదుకుటకొన్ని దినములు మాత్రమే కావున ధర్మమును హరించుట కంటెఁ బాలించుటయే మీకు మేలు. రాజులారా! పాత్రమునం దిచ్చుటచే తనే నేను కృతార్థుఁడనైతిని. దానిని హరించుటవలన నాకు లోపము లేదు. కాని దానిని హరించుటవలన మీకుఁ బాపము రాఁగూడ దనుతలంపుతో నిట్లు చెప్పఁబడినది. వ్యాసభగవానుఁడు కూడ ధర్మాత్మజా నీచే నీయఁబడిన దిగాని పరులచే నియమింపబడినదిగాని యగుభూమిని మిక్కిలి యత్నముతోఁ బాలింపుము. దానముచేయుటకంటె దత్తమును బాలించుటయే శ్రేయము. 60 వేలయేండ్లు భూదాన మొనర్చినవాఁడు స్వర్గమందుండును. దానము నా క్షేపించువాఁడును అయాక్షేపమునను మతించువాఁడు నంతకాలమే నరకమం దు వసింతురు. అని యాజ్ఞాపించుచున్నాఁడు. ప్రవర్ధమానవిజయరాజ్య సంవ త్సరములు మూఁడువందలతొంబదియేడు. అంకెలతోఁగూడ 397. ముదపచే లిఖింపఁబడినది. సప్పదపచే జెక్కఁబడినది. భట్టశ్రీధరునిచేతను భట్టుయజుపు చేతను బరీక్షింపఁబడినది.

# బాలవ్యాకరణ హరికారికల పౌర్వాపర్య విమర్శనము

(విద్వాన్ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు)

బాలవ్యాకరణమునకు బ్ర॥ కల్లూరి వేంకటరామశాస్త్రులవారు గుప్తార్థప్రకాశిక యను నొకటీక వ్రాసి గ్రంథాంతమున "మునుమదుపజ్ఞం బగుచుం, దనరినవ్యాకృతిని సూత్రతతి యొకకొంతం, దెనిఁగించి యిదిఘటించితి, ననయము బాలావబోధ మగుభంగిఁ దగన్" అను చిన్నయసూరిగారిపద్యమునకుఁ డీక వ్రాయు సందర్భమున సూరిగారు బాలవ్యాకరణమును స్వతంత్రముగ రచింప లేదనియు, శిష్టు కృష్ణమూర్తికవిగారి హరికారికల నాంధ్రీకరించి రనియు నీవ్యాకరణమును స్వతంత్రముగా రచించుటకుఁ దగినపాండిత్యము సూరిగారికి లేదనియు, నిరూపించుచుఁ దదుపష్టంభకముగఁ గొన్ని (14) యుక్తులుచూపి సూరిగారిని మిక్కిలినిరసించుచుఁ గొంతచర్చ నడపియున్నారు. పరవస్తు చిన్నయసూరిగారును శిష్టు కృష్ణమూర్తికవిగారునుగూడ దేశవిఖ్యాత మగుపాండిత్యముగలవారు కావున వా రిరువురిలో నెవ్వరిని నిరసించుటయు ధర్మంబుగాదు. దాని కిది మూలమా? దీని కది మూలమా? యనుచర్చ వచ్చినపుడు రెండుగ్రంథములను సావధానముగాఁ బరిశీలించి సిద్ధాంతము తేల్పవలయునే గాని గ్రంథముల సంబంధింపని పైయుక్తులచే సిద్ధాంతీకరించుట న్యాయ్యము గాదు. ముందు వరుసగా వారియుక్తులను బరిశీలించి పిమ్మట నా రెండుగ్రంథములలోని విషయములంబట్టి దేని కేది మూలమో నిర్ణయించుకొందము.

1. బాలవ్యాకరణప్రారంభమున సూరిగారు గురువందనము చేసియుండనందున వీ రేగురువునొద్దను సంస్కృతవ్యాకరణము నభ్యసించియుండనట్లు తెలియుచున్న దనియు సూరిగారు బ్రాహ్మణేతరు లయినందున వ్యాకరణశాస్త్రపాటవము లభించుట దుర్ఘట మనియు, వ్యాకరణజ్ఞానము లేకుండుటవల్లనే "శ్రీస్తనాఞ్చితకస్తూరీ పఙ్కసంకలితోరసే" యని కబ్విరహితప్రయోగము చేసియున్నా రనియుఁ గావున శాస్త్రజ్ఞానశూన్యు లగుసూరిగారు స్వతంత్రించి బాలవ్యాకరణమును రచింపఁజాల రనియు శాస్త్రులవారి మొదటియుక్తిలోని సారాంశము.

ఈయుక్తి ప్రకృతాంశమున కే మేని సాధకముగా నున్నదా? గురువందనము చేయనంతమాత్రమున గురువు లేఁ డనికాని గ్రంథాదినిఁ దనకుఁ బ్రకృతగ్రంథరచనోపయోగి యగుశాస్త్రజ్ఞానము కలదని కంఠోక్తిగాఁ జెప్పుకొనకున్నంతమాత్రమున నాజ్ఞానము లేదని కాని నిర్ణయింప నగునా? కృష్ణమూర్తికవిగారి కీప్రశ్న తగుల రాదని కాఁబోలు బ్రాహ్మణునికి గురునమస్కారరూపమంగళము మానసికమై యుండవచ్చు ననిరి. బ్రాహ్మణేతరునికి మాత్రమయ్యది మానసికమై యుండరా దనుటకుఁ దగినహేతు వేమి?

గ్రంథకర్తకుఁ గలజ్ఞాన మాతఁడు రచించుగ్రంథమువలననే చదువరులు గ్రహింపఁగలుగుదురు. అట్లుగాక స్వయముగాఁ జెప్పుకొనియేతీఱవలయునని గ్రంథకర్త కిది యొకనిర్బంధమా? పోనిండు శాస్త్రులవారిమతము ననుసరింతమన్నను గృష్ణమూర్తికవిగారుమాత్ర మాంధ్రవ్యాకరణరచనకు వలసిన సంస్కృతవ్యాకరణజ్ఞానము తమకుఁ గల దని చెప్పికొని యుండలేదే! షడ్దర్శనీస్వతంత్రుల మని వ్రాసికొనియున్నారు. న్యాయవైశేషికములు, సాంఖ్యయోగములు, పూర్వోత్తరమీమాంసలు గదాషడ్దర్శనములు. ఇందు వ్యాకరణము చేరియుండలేదు. ఈషడ్దర్శనీస్వతంత్రత యాంధ్రవ్యాకరణరచన కెట్లుపచరించును? ఇందుఁ జెప్పుకొనకుండుటంబట్టి కవిగారికి సంస్కృతవ్యాకరణజ్ఞానము లేదందురా? ప్రాచీను లెందఱో తత్తద్గ్రంథరచనకుఁ దగినజ్ఞానసామగ్రి తమకుఁ గల దని స్వయముగాఁ జెప్పుకొనకుండఁగనే గ్రంథములు రచించినవారు లేరా? ఆంధ్రశబ్దచింతామణిని రచించుట కెట్టిజ్ఞానసామగ్రి తనకుఁ గలదో వాగనుశాసనుఁ డెచ్చటనేని నిరూపించెనా?

విశ్రుతివివేకరచనకు నాకిట్టిసామగ్రి యున్న దని యథర్వణాచార్యులా విష్కరించిరా? కావ్యాలంకారసంగ్రహకర్త యగు రామరాజభూషణుఁడు (భట్టుమూర్తి) తన కలంకారశాస్త్రజ్ఞాన మేగురువువలన లభియించెనో తెలిపియుండెనా? ఇట్టివారి నెందఱినో చూపవచ్చును. వీరందఱకును దత్తద్గ్రంథరచనోపయోగిజ్ఞానసామగ్రి లేదనియే నిర్ణయించుట సమంజసమా? కాదు. కొందఱు మాకింతజ్ఞానము గలదని స్వయముగఁ జెప్పికొనుట కిచ్చగింతురు, మఱికొందఱట్లుగాక తమ గ్రంథములలోనే తమజ్ఞానము ప్రతిఫలించి యయ్యది లోకవిశ్రుత మగునుగదా యని యుదాసీనులై యుందురు. సూరిగారీవిషయమున నుదాసీనపక్షమువారు. ఈయన గొప్పపండితుఁ డని పండితలో

కమున నెంతో ప్రతీతి గలదు. అట్టిపాండిత్య మున్నందుననే చెన్నపురి శాస్త్ర కళాశాల (ఇప్పటి ప్రెసిడెన్సీ కాలేజి) లోని పండితపదవిని గొంతకాల మలంకరించియున్నారు. ఈపదవివిషయముననే పురాణము హయగ్రీవశాస్త్రిగారును జిన్నయ [సూరి]గారును నభ్యర్థులుగా నిలిచినట్లును, నప్పటి విశ్వవిద్యాలయ కార్యదర్శి యగు ఆర్బత్తుదొరగారు గొప్పపండితుల నెవరినో రావించి వీరిరువురను బరీక్షింపఁజేసి నట్లును, నాపరీక్షలోఁ జిన్నయఁ [సూరి]గారే యుత్తమముగ గెలుపొందినందున వారికిఁ బ్రధానాధ్యాపకపదవి యేర్పఱుపఁబడినట్లును నపుడు విశ్వవిద్యాలయకార్యదర్శులు చిన్నయసూరి యనుపేరు చెక్కఁబడిన బంగారుకడియమును సీమనుండి తెప్పించి సూరిగారికిఁ బారితోషికముగ నొసంగినట్లును సూరిగారిద్వితీయపుత్రుని బావమఱఁది యగు శ్రీ రేకము భాష్యకారులయ్యగారు వ్రాసి రని యింకను మఱికొన్ని విశేషములతో సూరిగారి జీవితచరిత్రమును నాంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమువారు ప్రచురించియున్నారు.—వలసినచో—10 వ. సంపు 1 వ సంచిక చూడుఁడు—

మఱియు సూరిగారికి సమకాలికు లయి శబ్దరత్నాకరము, త్రిలింగలక్షణశేషము మున్నగుగ్రంథములు రచించిన బహుజనపల్లి సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరపీఠికలో (5 వ పేజి) "......... ఈ లోపంబుం బాపఁ గొంతకాలంబునకు ముందు సంస్కృతాంధ్రములయందు విశేషపాండిత్యంబు గలిగి యాసేతుహిమాచలము చాలఁ బ్రసిద్ధివహించియుండిన పరవస్తు చిన్నయసూరిగారు జీవితులై యుండినకాలంబున దీర్ఘసూత్రతతో ననేకగ్రంథపరిశోధనంబు గావించి మిగుల విరివిగాఁ బ్రయోగసహితంబుగ......
...నిఘంటు వొకటి వ్రాయం బ్రారంభించి నడపుచుండిరి. ఆమహాప్రారంభముం జూచి యది పూర్తియగుటకు బహుకాలము చెల్లునని......యూహించి...
దీని వ్రాయ నుద్యమించితిని." అని ప్రస్తావవశమున వీరి నెంతయుం బ్రశంసించియున్నారు. వెనుక సూరిగారు గొంతవఱకును రచించియుంచిన యానిఘంటువు ప్రస్తుతము పీఠికాపురమున శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యాలయమున నున్నట్లును నానిఘంటువునుబట్టి సూరిగా రెన్నో యాంధ్రగ్రంథములలో నెంతయో పరిశ్రమచేసియుండి రని తెలియుచున్నట్లును నచ్చటి పండితులు చెప్పుచున్నారు. వ్యాకరణరచనావిషయ మ టుండనిచ్చి నిర్వివాదమగునీతిచంద్రికను జూచినను సంధి [illegible] ప్రయోగములు సూరిగారి సం

స్కృతవ్యాకరణజ్ఞానమును వెల్లడించుచున్నవి. అదిగాక బాలవ్యాకరణరచ
నకు మహాభాష్యాదులలో వైదగ్ధ్య మంతగా నావశ్యకముగాదు. సిద్ధాంతకౌ
ముదిలో నిష్కృష్ట మగువ్యాసంగము చేసియుండినఁ జాలును. ఈపాటి సం
స్కృతవ్యాకరణజ్ఞానముగూడ బ్రాహ్మణేతరు లయినంతమాత్రమున సూరిగారికి
దుర్లభ మని యాగ్రహముతో వ్రాయుట ధర్మమా? సిద్ధాంతకౌముదిలోఁ
జక్కని యనుభవము గలబ్రాహ్మణేతరులను గొందఱను మన మిప్పుడు చూ
చుచుండలేదా? కావున సూరిగారికి సిద్ధాంతకౌముదిలో సమగ్రమగు నను
భవము కలిగియుండె ననుట యెంతమాత్రమును నసంభావ్యము కానేర దని
నాయభిప్రాయము.

ఇఁక నేది యెటు లున్నను గ్రంథరచనోపయుక్తసామగ్రిని గ్రంథకర్త
చూపకతీఱ దందురేని, బాలవ్యాకరణరచనకు సంస్కృతవ్యాకరణజ్ఞానము
కంటె లక్ష్యగ్రంథపరిశీలన మావశ్యకతరము గదా! అది తాము చేసినట్లు
"పెక్కులక్ష్యములు పలుమాఱు సావధానముగఁ బరిశీలించి రచనాప్రణా
ళి నిర్ణయించుకొని ప్రకృతగ్రంథరూపముగా రచించినాఁడ" అని సూరి
గారు స్పష్టముగాఁ బీఠికలోఁ దెలిపియేయున్నారు. దాని కింతచర్చ యెందుకు?

ఇఁక గురువందన మేలచేయలే దందురేమో! వీరొకరియొద్దనే ప్రధా
నముగ విద్యనభ్యసింపక నలుగురముగ్గురయొద్ద విద్యాభ్యాసము చేసియుండ
వచ్చును. అట్టిసందర్భమున నొకరిని బేర్కొని వేఱొకరిని విడుచుట కిష్టప
డక యందఱకును మానసికవందనమే చేయుద మని తలంచి య ట్లాచరించి
యుండవచ్చును. ఇంతయెందుకు? షడ్దర్శనీస్వతంత్రుల మనిచెప్పికొన్న కృష్ణ
మూర్తికవిగారు మాత్ర మేమేదర్శనము లుపదేశించుట కెవ రెవరు తమకు
గురువులో నిర్దేశించియున్నారా?

ఇఁక "పంకసంకలితోరసే" అను క్త్వప్రత్యయవిరహితప్రయోగము
సూరిగారి శ్రుతపాండిత్యమునే చాటుచున్నదని శాస్త్రులవారు వ్రాసియున్నారు.
ఈసందర్భమున నొక్కవిషయము చెప్పవలసియున్నది. సూరిగారు విశిష్టా
ద్వైతమతస్థు లగుట సుస్పష్టముగదా! నిత్యమును వైష్ణవు లెల్లరు తిరువారా
ధనసమయమున ననుసంధించు మంగళాశాసనశ్లోకములలో "అస్తు శ్రీస్తనక
స్తూరీవాసనావాసితోరసే, శ్రీహస్తిగిరినాథాయ దేవరాజాయ మఙ్గళమ్"
అనుశ్లోక మొకండు గానంబడుచున్నది. చిరపరిచిత మగునీ శ్లోకమునే యాద

ర్యముగఁ గొని సూరిగారద్దాని నించుక మార్చి "శ్రీస్తనాఞ్చితకస్తూరీపఙ్క సంఙ్కలితోరసే పఙ్కజాక్షాయ నాథాయ వేఙ్కటేశాయ మఙ్గళమ్" అని బాలవ్యాకరణాంతమున రచించియున్నారు. ఇందలి కబభావమును వారు గుర్తించియే యుందురు. అయినను సమాసాంతవిధి యనిత్యమని ప్రాచీనసంస్కృతవైయాకరణుల యనుమతి యుండుటవల్లనే పూర్వాచార్యు లిట్లు ప్రయోగించియుందు రని తలంచి చిరకాలమునుండి ప్రాచీనాచార్యపరంపరాప్రాప్తమై వచ్చుచున్న యీప్రయోగమును సవరింప నొల్లక 'దాని నట్లే ప్రయోగించి యుందురు. వీరివ్యాకరణజ్ఞానమున కిది యొకకొఱంత కానేరదు. ఇఁక రెండవయుక్తిని బరిశీలింతము.

(2) సూరిగారికంటెఁ గవిగారెంతో గొప్పపండితు లనియుఁ గనుక సమానస్కంధులు గాకుండుటచే వారిరువురకును వివాదము జరిగియుండుటయే యసంభావ్యమనియుఁ, గావున సామాన్యపండితు లగుసూరిగారిమీఁదఁ గవిగారి కసూయకలుగుటకు హేతువే లేదనియు నసూయ లేనపుడు బాలవ్యాకరణమును సంస్కృతీకరింపవలసినప్రసక్తి కవిగారికి లేదనియు శాస్త్రులవారి యుక్త్యంతరము.

వా రిరువురకును వివాదము జరిగినట్లు పండితలోకమునఁ గింవదంతి గలదు. ఇట్టికింవదంతులు నిర్మూలముగ జనింపవు. సూరిగారికంటెఁ గవిగారు గొప్పపండితులే కావచ్చునుగాక. అంతమాత్రమున వారి కసూయకలుగుటకు హేతువే లేదా ? ఏల యందురేమో! సూరిగారిపదవినిబట్టియు వారిజ్ఞానమునుబట్టియు నప్పటివా రాయనను మిగుల గౌరవించుచుండినట్లు వారిజీవితచారిత్రమునుబట్టి మనకుఁ దెలియుచున్నది. విద్యాశాలియగు పురుషుని సకలజనులు సన్మానింతురుగదా! సూరిగారికి విద్యాప్రయుక్తముగ నంతగౌరవము జరుగుచున్న సమయమున వారిరువురును సమావిష్టులైయుండవచ్చును. "సంస్కృతపండితునిదృష్టి తెనుంగునం దంతఘనంబుగాఁ బోవనేరదు" ని శాస్త్రులవారే వ్రాసియున్నారు. కావుననే కవిగారి కాంధ్రభాషాపరిశీలనవిషయమొక ప్రధానకృత్యమై యుండియుండదు. వారిరువురును సమావిష్టులైనపు డాంధ్రమునఁ బ్రధానపరిశ్రమ గలసూరిగారే వేనికొన్నిక్లిష్టవిషయములఁ గవిగారితో బ్రసంగించియుండవచ్చును. ఆవిషయములఁ జర్చించుసందర్భమున వారికి ద్వేషభావము కలిగియుండవచ్చును లేదా యాంధ్రకవులచరిత్రమున వీరేశలింగము

పంతులవారు వ్రాసినరీతిని వారిరువురకు సిద్ధాంతకౌముదిలోని సూత్రవిచారము కొంత నడచి తత్సందర్భముననైనను వారికి మాత్సర్యము కలిగియుండవచ్చును. వారిద్దఱకును వివాదము జరిగె ననుటయుఁ దన్మూలమున వారికి మాత్సర్యము జనించె ననుటయు నెంతమాత్రమును సంభావ్యములు కానేరవు. అదిగాక యిది మనకు నిర్ణేయాంశము కానే కాదు. ఒకరిగ్రంథము నొకరు పరివర్తనముచేయుటకు వారిరువురును విరోధులే యయియుండ నక్కఱలేదు, మిత్రులైనను గావచ్చును. తటస్థులైనను గావచ్చును. ప్రౌఢవ్యాకరణమునకు సంస్కృతకారికలు పుట్టియుండలేదా? దానింబట్టి తత్కర్తలిద్దఱకును నేదోవిరోధ ముండక తప్పదని యూహించుట యావశ్యకమా? ప్రస్తుతము సూరిగారాంధ్రీకరించిరా? లేక కవిగారు సంస్కృతీకరించిరా? యనునది నిర్ణేయము కనుక నీయప్రస్తుతచర్చ విడిచి యిఁక మూఁడవయుక్తిని బరికింతము.

(3) కారికలు ప్రవాహరూపంబున ధారాళంబుగ నుండుటచే నయ్యవి స్వయంభువులే కాని యొకగ్రంథమును జూచి భాషాంతరీకరింపఁబడినవి గావని శాస్త్రులవారి యభిప్రాయము.

తెలుఁగును జూచి రచింపఁబడిన శ్లోకము లింతకంటెను ధారాళముగా నుండుట కవకాశమున్నది. అవి గ్రంథకర్తృకవితాచాతుర్యమును బట్టి యుండును. కావున నీకారికలు ధారాళముగా నున్నవని మనకుఁదోఁచినచోఁ గవిగారిసంస్కృతకవితాభ్యాస పాటవమును మనము ప్రశంసించుకొనవలయునే గాని పరివర్తితములు గా వనుట కీయుక్తి యెంతమాత్రమును జాలియుండలేదు. ప్రౌఢవ్యాకరణకారికలలోఁ గూడ నిట్టిధారాశుద్ధి లేకపోలేదు. అంతమాత్రమున నవియే ప్రౌఢవ్యాకరణముకంటెఁ బ్రాచీనము లందురా?

(4) బహుగ్రంథకర్త యగుకవిగారు సూరిగారి గ్రంథమును దొంగిలించి సంస్కృతీకరించి యద్దాని నొకసంస్థానాధిపునికిఁ గృతియిచ్చెననుట యసందర్భముగా నున్న దని యెంతోపరిహసించుచు నొకయంశమును శాస్త్రులవారు వ్రాసియున్నారు.

ఇం దేమియు నసందర్భము కానరాదు. కవిగారాసంస్థానాధిపునివలన ధనము సంపాదింపఁదలంచినకాలమునకుఁ దా మితరులకుఁ గృతియీయని గ్రంథ మిదియొకటియే యుండియుండవచ్చును. దీనిని గృతియిచ్చెద నన్నచో నిది బాలవ్యాకరణమునకు సంస్కృతమో లేక స్వతంత్ర గ్రంథమో యావిచార

మాసంస్థానాధిపున కెందుకు? తనయాస్థానపండితుఁడు శ్లోకరూపముగ నేదో గ్రంథము రచించుకొని వచ్చినాఁడుగదా యనుమాహాత్మ్యముతోఁ దనకుఁ దోఁచిన సత్కార మేదియో చేసియుండును. అదిగాక బాలవ్యాకరణ మప్పటికంతగాఁ బ్రచారములో నుండకుండుటచే నట్టివిచారణ మాసంస్థానాధిపుఁడు చేయుటకు బొత్తిగా నవకాశము లేదు. కాలక్రమమున నీవిషయము వెల్లడియైనను నాసంస్థానాధిపుఁడు పశ్చాత్తాపపడవలసిన యావశ్యకతయు లేదు. తనకాశ్రితుఁడైన పండితునికిఁ దనశక్త్యుత్సాహములననుసరించి సత్కారము చేయుట యుదత్కృతిస్వీకారముచేఁ దనపేరు కొంతకాలము ప్రఖ్యాతమగుటయు మాత్రమేయాతని కపేక్షితములై యుండును. కావున నిం దసందర్భ మేమియు గోచరింపకున్నది.

మఱియు శాస్త్రులవా రీసందర్భమున "సూరికృతమైన సంస్కృతగ్రంథంబునకు మరల కృష్ణమూర్తిశాస్త్రులవారు వేఱుమాటలతో సంస్కృతము చేసిగాని లేక దొంగిలించిన సూరికృతగ్రంథము మొదటను దాను రచియించినట్లు సూచించునట్టి పంచషశ్లోకంబులను బూర్తి చేసిగాని సూరిగారి జీవితకాలములో సంస్థానాధిపతికిఁ గృతియిచ్చిరి యని చెప్పవలసి యుండును" అని యాపత్తిరూపముగ నొకవికల్పమును జూపియున్నారు. సూరిగారిసంస్కృత గ్రంథమునే మొదట నాలుగైదుశ్లోకములు చేర్చి కవిగారు తమదిగాఁ బ్రకటించుకొని రని యెవ్వరును దలంచుట కవకాశములేదు. స్థూలదృష్టికి బాలవ్యాకరణమును హరికారికలును సరిగా నగపడుచున్నను సూక్ష్మముగాఁ బరిశీలించినచో వాని కచ్చటచ్చటఁ గొన్నిభేదములు గానవచ్చును. ఆభేదములనుబట్టి యా రెండుగ్రంథములను రచించినవా రొకరు కారనుట సుస్పష్టమగును. మఱియు బాలవ్యాకరణకర్త స్వీయప్రణాళికతోఁ దనగ్రంథము రచించుకొనినట్లును హరికారికాకర్త యితరప్రణాళికను జూచి భాషాంతరీకరించినట్లును గూడ నాభేదములు నిరూపింపఁజాలియున్నవి. ఆభేదములను గమనించినచో రెండుగ్రంథములును నేకకర్తృకము లేమో యనువికల్పమునకు లేశమును నవకాశములేదు. ఆభేదములు ముస్ముందు వివరింపఁబడును.

ఇఁక నీసందర్భమునఁ బ్రసక్తానుప్రసక్తముగ సూరిగారు సంస్కృత గ్రంథమును రచింపనే లేదేమో యనియు నయ్యది నామరూపములు లేని వ్యాకరణమై యుండునేమో యనియుఁ బరిహసించుట సమంజసము గాదు.

బాలవ్యాకరణమును బ్రచురించినపిమ్మట దానివ్యాప్తి ని జూచి యాసంస్కృత గ్రంథమును బ్రచురింపవలసినపని లేక సూరిగారు ప్రచురింపకయుండవచ్చును. అందుచే నది ప్రసిద్ధముగాక యెందో యణఁగియుండవచ్చును. సూరిగారు తమ టీకలో నీవిషయమును స్పష్టముగా సూచించియేయున్నారు. సూరిగారు సంస్కృతవ్యాకరణమును రచించినను రచింప కున్నను నది మనప్రకృతాంశమునకు సాధకముగాని బాధకముగాని కానేరదు. అట్టిస్థితిలో నేవో స్వైరప్రసంగములు దెచ్చి గ్రంథము పెంచి పరిహసించునవకాశము నెట్టెటో కల్పించుకొనుట మాత్రము న్యాయ్యముగాదు.

ఇఁక నీవిషయమున వీరేశలింగముపంతులవారు కవులచరిత్రమున శాస్త్రులవారియభిప్రాయమున కనుకూలముగ వ్రాసినట్లు తలంచి వారిని బ్రమాణముగఁ గొని కొన్నియంశములను వ్రాసియున్నారు. ఇట దాని నించుక వివరింపవలసియున్నది.

"ఈకృష్ణమూర్తి కవి కాళహస్తిలో నున్నప్పుడు చేయఁబడిన ప్రధానగ్రంథ మింకొకటి కలదు. ఆకాలములో నీయనకును చెన్నపురిశాస్త్రపాఠశాలలో నాంధ్రపండితుఁడైన పరవస్తు చిన్నయసూరిగారికిని సిద్ధాంతకౌముదిలోని సూత్రవిచారము కొంతనడచెను. మనపండితులు సాధారణముగా మత్సరగ్రస్తులగుట సుప్రసిద్ధమేగదా! అట్టివా రీర్ష్యచేతఁ దమకు లాభము లేకపోయినను పరులకు నష్టముగలుగుటయే తమయభీష్టసిద్ధిగా భావించి కొన్నిసమయములయందుఁ బరులకీర్తికి భంగము గలిగింపఁజూతురు. అంతకుఁ బూర్వము కొంతకాలముక్రిందటఁ జిన్నయసూరి బాలవ్యాకరణమును రచియించెను, దానితో సరిపోల్పఁదగిన యాంధ్రవ్యాకరణ మావఱకు వేఱొకటి లేదు. ఇట్లుండఁగాఁ గృష్ణమూర్తిగారిచేఁ జేఁయబడిన వ్యాఖ్యానముతోఁ గూడిన హరికారికలనఁబడెడి యాంధ్రవ్యాకరణ సూత్రగ్రంథమొకటి యటుతరువాత నల్పకాలమునకు వెలువడెను. అదియే హరిభట్టకృతమై యథర్వణాదులచేఁ బేర్కొనఁబడిన కారికావళి యైనపక్షమునఁ జిన్నయసూరి తన వ్యాకరణములోని సూత్రము లన్నిటిని హరికృతగ్రంథమునుండి దొంగిలించి తనపేరిట ప్రకటించినట్లు స్పష్టమగును. అయినను మూలగ్రంథములోఁ జూపఁబడిన లక్ష్యములు కొన్ని యథర్వణాచార్యుల కీవలియాధునికగ్రంథములలోని వగుటచేత వ్యాఖ్యానమునుమాత్రమే గాక మూలగ్రంథమును సహితము కృష్ణమూర్తిగారే

రచియించిరేమో యని పలువురు సందేహపడుచున్నారు. అట్టిగ్రంథమును రచియింపఁగలసామర్థ్య మావిద్వత్కవికిఁ గల దనుటకు సందేహము లేదు. ఈయన యిటువంటిగ్రంథకల్పనము చేయ సంశయపడువారు కారని చూపుటకై చరమదశయందు మాడుగల్లులోనున్నపు డొక్కరాత్రిలోఁ జేసినట్టి యన కారోపింపఁబడిన యశ్వశాస్త్రకథ కొంత తోడ్పడుచున్నది, అని వీరేశలింగముపంతులవారు వ్రాసియున్నారు. (కవులచరిత్ర-588-పుట) ఇట్లుండఁ బైగ్రంథములోఁ దమకు విరుద్ధముగా నున్నవిషయమునంతను జాఱవిడిచి శాస్త్రులవారు "అదియే హరిభట్టకృతమై యథర్వణాదులచేఁ బేర్కొనఁబడిన కారికావళి యైనపక్షమునఁ జిన్నయసూరి తనవ్యాకరణములో సూత్రముల నన్నిటిని హరిభట్టకృతగ్రంథమునుండి దొంగిలించి తనపేరిటఁ బ్రకటించినట్లు స్పష్టమగును. అయినను మూలగ్రంథములోఁ జూపఁబడిన లక్ష్యములుకొన్ని యథర్వణాచార్యుల కీవలి యాధునికగ్రంథములోనివి యగుటచేత వ్యాఖ్యానము మాత్రమే గాక మూలగ్రంథముసహితము కృష్ణమూర్తిశాస్త్రులవారే రచియించి రేమో యని పలువురు సందేహించుచున్నారు. అట్టిగ్రంథమును రచియింపఁగల సామర్థ్య మావిద్వత్కవికిఁ గలదనుటకు సందేహము లేదు" అనువాక్యములను మాత్ర ముదాహరించి వీరేశలింగముపంతులవారు గూడఁ దమమతము నంగీకరించియున్నట్లు వ్రాసియున్నారు. వీరేశలింగముపంతులవారిని బ్రామాణికులుగాఁ గైకొనుసందర్భమునఁ దేటతెల్లముగా నున్నపంతులవారి యాశయమును సాకల్యముగా వివరింపవలయునే గాని యిట్లు మాటుపఱుచుట ధర్మమా? పోనిందు వీరు చూపిన వాక్యములు మాత్రము వీరిప్రధానవిషయమున కేమియనుకూలించుచున్నవి? కృష్ణమూర్తికవిగారు గ్రంథరచనాసమర్థు లనియు హరికారికలు కృష్ణమూర్తికవిగారు రచించినవేగాని యథర్వణాదులచేఁ బేర్కొనఁబడిన హరిభట్టురచించినవి కావనియు నీవాక్యములు చెప్పఁగలవు గాని హరికారికలనుబట్టి బాలవ్యాకరణము పుట్టినదనుటలో నివి యుపష్టంభకములు కాఁగలవా? కానినాఁడు వాని నిట నుద్ధరించుట యెందులకు? కారికలు భట్టకృతములు గావనుటలో విప్రతిపన్ను లెవరు? ఎంచి వీ రుదాహరించుకొన్న పైవాక్యములు వీరిముఖ్యాంశమునకు సాథకములు గావు సరిగదా సూక్ష్మముగాఁ బరికించినచో బాధకములు గూడ నగుచున్నవి. కారికలు హరిభట్టకృతములైనచో సూరి యాకారికలను దొం

గలించి తెనిఁగించి తనపేరిటఁ బ్రకటించుట స్పష్ట మగుట ననువాక్యమువల్ల హరిభట్టకృతములు కానిచో సూరిగారిది స్వతంత్రగ్రంథము కాఁదగు నని స్ఫురించుచుండలేదా ? ఈస్ఫురణములమాట యటుండనిండు. పైని నేను జూపిన పంతులవారి గ్రంథమువల్ల బాలవ్యాకరణమును జూచియే కవిగారు కారికలు రచించి రని పంతులవారు నిశ్చయించినట్లు సుస్పష్టముగదా! ఇది యును గాక పంతులవారు గుప్తార్థప్రకాశికను గూర్చి తమయామోదపత్రము ను (opinion) బంపియుండిరి. దానిని గుప్తార్థప్రకాశికాకారులు గ్రంథాదిని బ్రకటించుకొనియున్నారు. అందు " ప్రకీర్ణపరిచ్ఛేదావసానమునందు గ్రంథ కర్తలవిషయమున మీరిచ్చిన యభిప్రాయముతో నే నేకీభవింపఁజాలనందులకుఁ జింతిల్లుచున్నాఁడను " అని పంతులవారు నిష్పక్షపాతముగ నిస్సందేహముగ దమయభిప్రాయమును వ్యక్తీకరించియున్నారు. (చూ-గుప్తా-పీఠి-10-పుట) ఇంతవిరుద్ధాభిప్రాయముతో నున్నపంతులవారు వీరిప్రకృతాంశమున కెట్లను కూలింతురు ?

(౫) " సంధిపరి-లోని (18) సూత్రమునొద్ద ఇప్పటిప్రాపంచికజ్ఞానం బునఁ దక్కువయనుభవంబుగల (కృష్ణమూర్తి) శాస్త్రులవారు 'చందోయి'యని యుదాహరింపఁగా నట్టియుదాహరణంబు చదివి పాఠశాలలోని బాలురు నవ్వుదు రని యెంచి చెన్నపురి శాస్త్రపాఠశాలలో నాంధ్రోపాధ్యాయుండై లౌకికజ్ఞానంబునఁ బూర్ణుండైన సూరిగారాయుదాహరణంబును జూచి తీసివే సి 'కందోయి' యనిబహిరంగముగాఁ జదువఁదగిన యుదాహరణముగా దిద్ది నట్లులు స్పష్టమగుచున్నది " అనుశాస్త్రులవారి సిద్ధాంత మెట్లున్నదో తిల కింపుఁడు.

(1) ఏమ్యాదులయిత్తునకు...... బాలవ్యా-సంధి-౫-సూ.
(2) జకారమిత్తుగా బా—తత్స—19
(3) వర్ణమిత్తునాఁబడు బా—తత్స—19
(4) జకారమిత్తుగావున బా—తత్స—22
(5) క్రియాపదంబులందిత్తునకు బా—సంధి—6
(6) మధ్యమపురుషక్రియలందిత్తునకు బా—సంధి—7
(7) స్వార్థంబైనయిత్తునకు బా—ఆచ్ఛి—8
(8) తుంట్లు తుంటలు బా—ఆచ్ఛి—12

(9) కన్నెఱికము, లంజె బా—తద్ధి—3

(10) యువతివటీరజస్వలలుగు బ్బెతమిండతెముట్టుతలునాఁబడుదురు
బా—తద్ధి—21

ఇవన్నియు బాలవ్యాకరణమునఁగలవుగదా? చందోయి యనుపదమును విన్న చో బాలురు నవ్వుదు రని సూరిగారు సందేహించి కందోయియని మార్చుటయే సత్యమైనచోఁ బైని జూపినవన్నిటిని వినికూడ బాలురు నవ్వుదు రని యేల వారు మార్పలేదు? చందోయి కంటెను హెచ్చుగా హాసమును బుట్టించునవే యిందుఁ బెక్కు లగపడుచున్నవే? కావున నిది యుక్తిసహముగాదు. ఇట్టిమాటలు గ్రంథములలో నగపడినచో బాలురకు హాసము జనించుట స్వాభావికమే గాని యద్దానినివారించుటకు లాక్షణికు లెవ్వరును యత్నింపరు. శబ్దస్వరూపబోధక మగువ్యాకరణములలో నట్టియత్న మావశ్యకము గూడఁ గాదు. యత్నించినను గొన్నియెడల నట్టిపదముల విడుచుటకు వీలు గూడ నుండదు. పైప్రయోగములంబట్టి సూరిగారి కట్టియత్నము లేనట్లు స్పష్టమగుచున్నదిగదా? శాస్త్రులవారు సెలవిచ్చినరీతిని గవిగారు ప్రాపంచికజ్ఞానమునఁ దక్కువయనుభవంబు గలవారును సూరిగారు లౌకికజ్ఞానపూర్ణులును నయియుండిన నుండవచ్చును కాని దానినిబట్టి ప్రకృతమున నుదాహరణవ్యాసము సంభవించిన దనియుఁ దన్మూలకముగఁ గారికలు మొదటివని తెలుచున్న దనియుఁ దలంచుటకుమాత్ర మవకాశము లేదని నాయభిప్రాయము.

(6) "అట యిఁక చుఁడు శబ్దములఁదప్ప నుడితొలిహ్రస్వముమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు" (బా-సంధి-22) అనుసూత్రమునకు "శబ్దాద్యహ్రస్వతో నార్ధబిందు ర్లోపో ద్రుతస్యచఁవినేఁకాఁటా" అను కారిక యగపడుచున్న దనియు సూరిగారిసూత్రమునవే చూచి యున్నచోఁ గారికాకర్త చుఁడుశబ్దమును విడుచుటకు హేతువు లేదనియుఁ గావునఁ గారికనే సూరిగారు చూచి యాలోచించి చుఁడుశబ్దమును గూడఁ జేర్చియుందురనియు శాస్త్రులవారియభిప్రాయము.

నుడితొలిహ్రస్వమునకుఁ దర్వాత నర్ధబిందు వుండదను విధానములో నట్టిబిందువులు గలశబ్దములను బర్యుదాసించుట యావశ్యకము. ఇచట సూరిగారు పర్యుదాసించిన మాఁటిలోను 'చుఁడు' శబ్దపర్యుదాసము సరికాదని



పొంతు, రెండు, కందు,

మున్నగు శబ్దములవలె ‹చుఁడు’ చుండు, శబ్దములు బాలవ్యాకరణము చేఁ గాని హరికారికలచేఁ గాని సాధింపఁబడవు. ‹చుఁడు’ శబ్దమును నిపాతముగా సాధింపవలసియుండును. శబ్దరత్నాకరములో నట్లే వ్రాయబడియున్నది. అట్లొకవేళ నిపాతముగా గ్రహింపఁబడినపుడట్లు నిపతించుకొనుటవలననే యందలియర్ధబిందువుకూడ నిపతింపఁబడిన దగును. కాఁగాఁ దత్పర్యుదాసమిచట ననావశ్యకమని కవిగారు తలంచినట్లూహింపనగును. లేదా ‹చుఁడు’ శబ్దమితరశబ్దముల కనుప్రయుక్తమై ప్రయోగింపఁబడునదే గాని యిఁకాదులవలె స్వతంత్రముగా బ్రయోగింపఁబడదు. అదిగాక శబ్దస్వరూపపర్యాలోచముచేసినచోఁ “చుఁడు” అనునది చూడుఁడు, అనుదానికిఁ గ్లిష్టరూపమైనట్లు తెలియఁగలదు. కావున దీని నికాదులతోపాటు పర్యుదాసింపవలసినప్రసక్తి లేదని తలంచి రనవచ్చును. ‘ఈవు కలుగంగఁబట్టి గా కిందువదన’ మున్నగుచోట్ల స్వతంత్రప్రయోగములేని యగుధాతునుజ్యంతరూప మగుఁ కస’ అనెడియను ప్రయుక్తశబ్దమునందలి ప్రథమహ్రస్వమునకుఁ బరమందున్న ద్రుతమున కరసున్నరాలేదా? దానిని బర్యుదాసించిరా? మఱియు, ఏ× నాఁడు, ఎన్నఁడు- అనుదానిలోని ‹నఁడు’ శబ్దమును బర్యుదాసించిరా? కావున నిట్టిస్వతంత్రప్రయోగములు లేనట్టియు శబ్దస్వరూపపర్యాలోచనచే నర్థబిందువు సుబోధమగుటకు వీలున్నట్టియు శబ్దములఁ బర్యుదాసింప నక్కఱలే దని యూహించి కవిగారు ‹చుఁడు› శబ్దమును విడిచియుందు రని తలంపనగును.

(7) “కర్మధారయంబు త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణపూర్వపదంబై యుండు,” ననుసూరిగారిసూత్రములోని త్రికపదము “ముగన్తసర్వనామాఽఽయే స్త్రీసదృగ్ధాతుభేదకైః సపూర్వపదకః కర్మధారయో హ్యత్రదృశ్యతే” అనుకారికలో నగపడక దానికిమాఱుగఁ సర్వనామ + అ + ఈ + ఏ = సర్వనామాఽఽయే, అనుక్లిష్టసంధులతోడి పదమగపడుచున్న దనియు సూరిగారి సూత్రమునే కవిగారు చూచియున్నచోఁ ద్రికసంజ్ఞను విధించుకొని త్రికయనియే వాడియుందు రనియుఁ గావున సూరిగ్రంథమే యర్వాచీన మనియు శాస్త్రులవా రూహించియున్నారు.

ఇట్లే యూహింపనేల? బాలవ్యాకరణమును జూచినను నీత్రికసంజ్ఞ ప్రాచీనలక్షణములలోఁ గవిగారు చూడకుండుటవల్లను, నీగ్రంథమునన్ నైనను నేరొకచు సూచుచుస్థలములందో తప్ప దీనికి విశేషప్రయోజనము లేకుండుటవల

ల్లను గారికారచనసమయమున నీసంజ్ఞను విడిచినచో శ్లోకము సరిగాఁ గుది రినట్లు స్ఫురించుటవల్లను దీనిని వారు విడిచియుందు రని యూహింపరాదా ? అంతమహాకవి కీపాటిశ్లోకము కుదురదా యనిశంకించుకొని యేదో శ్లోకము దీనికి సరిపడునట్లు రచించి యీరీతిని రచించుట కవిగారి కసాధ్యముగా దని శాస్త్రులవారు వ్రాయుటగూడ ససిగా నగపడదు. ఒక్కొకకవి కొక్కొకస మయవిశేషమున నొక్కొకవిధ మగుస్ఫురణ ముండును. అప్పటికిఁ ద్రికసం జ్ఞను విడుచుటయే ఛందోనుకూలముగా నున్నట్లు స్ఫురించియుండవచ్చును. పోనిండు శాస్త్రులవా రనుచున్నట్లు కారిక లే మొదటి వందము. ఆపక్షమునఁ గారికలు చూచినసూరిగారు ఛందోనిర్బంధాదులు లేక, ఆ, ఈ, ఏ, యని విడిగాఁ జెప్పుకొనుటకుఁ గూడ నవకాశము గలబాలవ్యాకరణములోఁ గారి కలం దగపడని త్రికసంజ్ఞ నేల క్రొత్తగాఁ గల్పించుకొనవలసివచ్చెనో చెప్పవల సినభారము శాస్త్రులవారిపై నిలిచియుండ లేదా ? ఎప్పుడైనను బద్యరూపమున లక్షణములు రచించువారు ఛందోనిర్బంధాదులచేఁ గొన్నియంశములు విడు చుకొనుటయుఁ గొన్నిటిని గల్పించుకొనుటయు సంభవించు నేగాని వాక్య రూపమున లక్షణములు రచించువారి కట్టినిర్బంధ మేమియు లేకుండుటచే వారు మూలగ్రంథమున కనావశ్యకముగ మార్పులు గల్పించుట యెట్లు తట స్థించును ? కావునఁ బైని జూచినరీతిని గవిగారు త్రికసంజ్ఞను విడుచుకొనిర నుట సహేతుకముగాని సూరిగారు కారికలు చూచియు నందులేని దానిని గల్పించుకొని రనుట సయుక్తికము గానేరదు.

(8) "ప్రత్యేకం లాండు బ్రువురు నుముజ్ఞ్ స్యాద్ధూర్వ హేంతమ్" "శృంగారభూషణమతే ద్రుతాదపి పరోద్రుతః" ఇత్యాదికారికలలో ధూర్వ హాదులు పేర్కొనఁబడి రనియుఁ గవిగారికిఁ లోపశ్శాకల్యస్య ఇత్యాదులంద లి సంస్కృత వ్యాకరణశయ్య యలవడినందున నట్లు ప్రాచీన నామోద్ఘాట న పూర్వకముగ రచింపఁగలిగి రనియు బాలవ్యాకరణమే గతియైనచో నందు లేనియీనామములఁ బేర్కొనుట యెట్లు పొసంగు ననియుఁ గారి కలు చూచినను సూరిగారికి సంస్కృతవ్యాకరణశయ్య యలవడనందునను, నీనామోద్ఘాటనమునావశ్యక మనీ తలంచినందునను సూరిగారు విడిచియుం దు రనియు శాస్త్రులవా రుక్తియుక్తిని జూపియున్నారు

"ధూర్వహాస్యవాతోత్రు............

"పరుషావా స్వరూపేణ.........ఇతి శృంగారభూషణః"

అని యిట్లథర్వణాదులు విషయాంతరములలో ధూర్వహాదులనామ ములనుద్ఘాటించియున్నారు; అయినను నాధూర్వహాదుల యాంధ్రవ్యాకరణములను మనమెన్నఁడును జూడకుండఁగనే వారినామములఁ బేర్కొని యా ప్రాచీనులవ్యాకరణము లన్నియు మేము చూచితి మనుబడాయికొఱకై లేనిపోనిహడావుడి చేయనేల యని సూరిగారామార్గమునకుఁ బోలేదనియుఁ గవిగారిది చూచియు నథర్వణకారికలలో నాపేరు లుండుటవల్లను ధూర్వహాదివిరచితములై తమచూచిన యాంధ్రవ్యాకరణము లెవ్వి యని మనలనడుగువారెవ్వరను తలంపువల్లను బ్రాచీనపరంపరానుసారముగాను బాదపూరణోపయుక్తముగాను నట్లు కొన్ని నామములుగ్గడించియుందు రని నాయభిప్రాయము. ఈసందర్భముచే సూరిగారికి సంస్కృతవ్యాకరణశయ్య యలవడలేదని శాస్త్రులవారు నిర్ణయించుచున్నారు. ఏవో లేనిపోని ప్రాచీననామములరెంటిని సూత్రములలో సంఘటించుటయే పాణినీయశయ్యాభ్యాసపాటవమునకుఁ బరమావధి యగునా? ఇది యిట్లుండఁగా సూరిగారు; తమ కేవ్యాకరణము క్రొత్తగా స్ఫురించిన దని "మును మదుపజ్ఞం బగుచున్" అను గ్రంథాంతపద్యములో సూచించియున్నందునఁ బూర్వులనామము లుగ్గడించినచోఁ దమకీర్తికి లోపము కలుగునని సంశయించి కారికలు చూచియుఁ బూర్వులనామంబు లుదాహరింపక విడిచిరని కూడఁ దోఁచుచున్న దనియు వ్రాసియున్నారు. ఈయాంధ్రవ్యాకరణమున కిట్టిసూత్రరూపప్రణాళికను నేను క్రొత్తగాఁ గల్పించితినని పైపద్యమున కర్థముగాని యింతకుఁబూర్వము వ్యాకరణములే లేవని స్ఫురింపఁజేయుట సూరిగారి కభిప్రేతమగు? అట్టి యభిప్రాయమే యున్నచో

1 సంస్కృతీయంబునకు సంధియగునని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు"
బాల–సంధి–4

2 ,వాగనుశాసనులు యదాతదా యన్గ్రహించుట ప్రపంచార్థమని
బా–సంధి–13

యెఱుంగునది.
బా–సంధి–44

3 ,ఎందు'శబ్దమున కవిగాగము కొందఱులేదండ్రు–

4 ,అనుకృతిని నిఃషుదకుం గుఱుచయగునని యొకండువలికెనది నిరా
బా–సంధి–54

కరంబు ...

5 ,కొందఱు నావి యనియు నాదేశంబగునండ్రు    బా-తత్స-63

6 ఏండ్లు, కాండ్లు, ఇత్యాదులందు డాకు ళాదేశంబు కొందఱు వ క్కాణించిరి?    బా-ఆచ్ఛి-15

7 ,ఇయ శబ్దంబునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి.    బా-ఆచ్ఛి-23

8 ,ద్వితీయైకవచనంబు పరంబగునపు డౌపవిభక్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి.    బా-ఆచ్ఛి-29

9 ,కుచధాతువునకు గుణంబు లేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబు గాదు-    బా-క్రియాప-68

10 పూనుపొదవుల కాదిలోపం బొకండు వచియించెనది యవిచార మూలకంబు,    బా-ప్రకీర్ణ-10

ఇట్లెన్నిస్థలములలో నన్నయభట్టు అథర్వణాచార్యులు వెల్లంకి తాతంభట్టు, అప్పకవి. అహోబలపండితుఁడు, మున్నగు ప్రాచీనగ్రంథములను సూరిగా రెందులకుఁ బరామర్శింతురు.? ఇంతమంది ప్రాచీనుల నుగ్గడించి యీ కాలపువా రెవ్వరును నెన్నఁడును నెఱుఁగని ధూర్వహాశృంగారభూషణుల నామస్మరణము చేసినచోఁ దమకీర్తికి లోపము కలుగునని భయపడి రనుట యొంతయుక్తి సహృదయ విమర్శకు లూహింతురుగాక.

(9) "లోట్స్యాల్లఙ్వ్యతిరేకే స్యాత్........" "అనుబన్ధో లృటికలఙ్త్రజిత్యతులోభవేత్" ఇత్యాదికారికలందు లఙ్,కలఙ్,నుఙ్,మిఙ్, కఙ్,ఇత్యాదులు హల్మాత్రమయిన ఙకారమే యనుబంధము కలవిగా (ఙిత్తులుగా) విధింపఁబడినవనియు, బాలవ్యాకరణమున నవియన్నియు లఙి, కలఙి, మున్నగు రీతిని ఙిత్తులుగా నగపడుచున్న వనియు, నీయంశముగూడఁ గవిగారి గ్రంథకర్తృత్వంబునే ధ్రువపఱుచుచున్న దనియు, ఙిత్తులుగా విధించుట సూరిగారి సంస్కృతవ్యాకరణమందలి శ్రుతపాండిత్యగంధమును జాటుచున్నదనియు, ఙకారమాత్రమునే యనుబంధముగాఁ జేర్చినచో 'హలన్తమ్'అనుపాణినీయసూత్రముచే నిత్సంజ్ఞవచ్చుటకు వీలున్నదనియు, ఙియనునది యనుబంధమైనచో దానికిత్సంజ్ఞను విధించుసూత్రము పాణినీయమునఁగాని మఱియొచ్చటను గాని గగనకుసుమంబై కానరాదనియు శాస్త్రులవారియుక్త్యంతరము.

సూరిగారి శ్లేషకల్పనములో వీరుచూపినదోషమునకు సమాధానము వ్రాయవలసియున్నది.

జీయను జకారసంఘాతమున కిత్సంజ్ఞాలోపముల విధించుసూత్రము పాణినీయమునఁ గాని మఱియెచ్చటంగాని గగనకుసుమంబై కానరాదనికదా వీరియాక్షేపణము. కరతలామలకమై కానవచ్చుచున్న దని దానికి నాసమాధానము. అది పాణినీయమున లేనిమాట సత్యమే. ఇత్సంజ్ఞాలోపముల విషయమునఁ బాణినీయమునుండి యెరవుతెచ్చుకొనవలసిన యావశ్యకత లేకుండునట్లుగను నుక్,నిక్,ఇత్యాదులందు వ్యంజనమాత్రములకును లజీ ఇత్యాదుల జీయనువర్ణమునకును ననుగతముగ నిత్సంజ్ఞాలోపములు సిద్ధించునట్లు "కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమై ప్రయోగించునపుడు మానంబడు వర్ణమిత్తు నాఁబడు"నని తత్స-19వసూత్రమునొద్ద సూరిగారు స్పష్టముగా విధించియున్నారు. ఇదిసూత్రము కాదందు రేమో! సూత్రకర్త స్వయముగా వ్రాసినవిధివాక్యము సూత్రముతోఁ దుల్యముగఁ బ్రమాణమై విధాయకమగునే గాని వేఱగునా? ఇట్లిచ్చటనే గాక పెక్కుస్థలములలో సూరిగారు సూత్రరూపముగాఁ గాక వృత్తులలోఁ బ్రత్యేకవాక్యములచే ననేకవిధులను బోధించియున్నారు.

| | | |
|---|---|---|
| 1 | 'ఉపధయనఁగాఁ దుదివర్ణమునకు ముందువర్ణము | బా-సంజ్ఞ-10 |
| 2 | 'వీనికి సంధివైకల్పికము' | బాల-సంధి-9 |
| 3 | 'ఈకార్యము కళలగుక్రియాపదంబులమీఁద సహితము కానంబడియెడి' | బాల-సంధి-13 |
| 4 | 'ఈయాగమం బొకానొకచో స్థిరంబుపరంబగుచోఁ గానంబడియెడి' | బా-సంధి-25 |
| 5 | 'ఇందుజవ్వనిశబ్దంబునకు జవాదేశంబని యెఱుఁగునది | బా-సంధి-30 |
| 6 | 'ఈకార్యము కర్తృవాచిమువర్ణకమునకుఁ గలుగదు | బా-సంధి-46 |
| 7 | 'నామంబనఁగాఁ బ్రాతిపదికంబు | బా-తత్స-21 |
| 8 | 'దయాభుశబ్దంబున కిట్లు రేఫంబుగానంబడియెడి | బా-తత్స-38 |
| 9 | 'ఈలోపంబు సమాసంబులందుం జూపట్టెడు | బా-ఆచ్ఛి-21 |
| 10 | 'అధికరణంబు నా నాధారంబు | బా-కారక-17 |

గ్రంథవిస్తరభీతి నుదాహరింపనైతినిగాని యిట్టివింకను నెన్నియో వాక్యములు గలవు. తత్సూత్రవృత్తులలోని యీవాక్యము లన్నియు నాయాకార్యవిశేషములను విధించుచుండ లేదా

ఇఁక 'కార్యార్థము—వర్ణమిత్తునాఁబడు ననునాక్యములోని వర్ణశబ్దము చే నుక్,నిక్,మున్నగువానిలో నిక్,మున్నగువ్యంజనమాత్రములే గ్రహింపఁ బడుననియు లజి,మున్నగువానిలోని యికారవిశిష్టజకారములు (జి) గ్రహింపఁబడవనియు నాశంకింతురేమో! అట్టియాశంక కించుకయు నవకాశములేదు క్ మున్నగువానికిని నజ్విశిష్టములగు క్,కి, మున్నగువానికిని గూడ వర్ణముల ను వ్యవహారము లోకమున రూఢమైయున్నది. లోకవ్యవహారవిషయ మ ట్లుండనిచ్చినను బాలవ్యాకరణములో నే సూరిగారు పెక్కు-చోట్ల నజ్విశిష్ట వ్యంజనములను వర్ణశబ్దముతో వ్యవహరించియున్నారు.

| | | |
|---|---|---|
| 1 | వు,వూ,వో,వర్ణాదులగుశబ్దంబులు | బాల–సంజ్ఞ–17 |
| 2 | యి,స్,రి,వర్ణంబులు | బా–తత్స–15 |
| 3 | పూర్ణబిందుపూర్వకబువర్ణంబు | బా–తత్స–42 |
| 4 | ముందటిలువర్ణంబునకు | బా–ఆచ్ఛిక–11 |
| 5 | వివర్ణసలలువర్ణంబులకు | బా–ఆచ్ఛి–16 |
| 6 | కలన్వాదులనువర్ణంబు | బా–ఆచ్ఛి–18 |
| 7 | ఇ,టి,తి,వర్ణంబులు | బా–ఆచ్ఛి–28 |
| 8 | మూఁడుశబ్దముడువర్ణంబునకు | బా–పమా–17 |
| 9 | నామ్వాదికనుమ్వాదులమువర్ణంబులు | బా–సమా–19 |
| 10 | చువర్ణంబుతోడదుగ్ధకారంబు | బా–క్రి–108 |
| 11 | —అరుగ్వాదుల—గువర్ణంబు | బా–క్రి–111 |
| 12 | చుక్వరకరువర్ణంబునకు | బా–ప్రక్–20 |

ఇట్టి వింకను నెన్నియో గలవు. కావున సూరిగారివాక్యములోని వర్ణ శబ్దముచే జయనునది గృహీత మగుట నిర్వివాదము. కాఁగా నిత్సంజ్ఞాలోప ములకుఁ బయివాక్యమే సర్వథా విధాయకమై యున్నది.

ఇట ఫలభేద ముండునపు డనుబంధభేద ముండుట యుక్త మని తలం చియు సిద్ధరూపములఁ బరిశీలించియు జిత్త్వమును జీత్త్వమును గల్పించియుం డిరి. కవిగారు తమగ్రంథమున నిత్సంజ్ఞాలక్షణమును సూరిగారివలెఁ జెప్పక పాణినీయమునుండియే సంపాదించెద మనుసవరణము చేసినవారు గనుక నట్టి సూరిగారిరచనమును ద్రోసివేసి యంతటను జిత్త్వమును మాత్రమే నిలిపి సూరిగారిజీత్త్వఫలమును సంపాదించుటకై 'అత్ర భ్యాసుతో భవేత్తే'ను సూ

త్రమును గ్రొత్తపద్ధతిలో రచించియుండిరి. ఈరచనములోఁ బాణినీయము వలన నిత్సంజ్ఞ లభించునుగాని కొన్నిరూపములలో దోషములు సంభవించు చున్నవి. ‹అత్రజిత్యదుతోభ వే త్తనుసూత్రమువలన ధాత్వధికారము లేనిచో లనే జిత్తుబిందుపూర్వం బగు ననునర్థము లభించునని శాస్త్రులవారు వ్రాసి యున్నారు. ఈసూత్రమువలన నిట్టియర్థమును సంపాదించినను 'చేఁయడు' చేయుఁడు మున్నగువ్యతిరేకక్రియలలో నెల్లెడల బిందువు సిద్ధింపకుండుటయు ‹చేయుఁడు చేయుండు' అని యిట్లుండవలసిన లూణ్మధ్యమపురుషబహువచ నాంతరూపము లన్నియుఁ చేయడు మున్నగురీతి నుకారబిందువిరహితములుగ నపరూపములగుటయు సంభవించుచున్నది.

(10) "తద్ధర్మాదిషు లేడాశీశ్శాపసంప్రార్థనే విధౌ లోట్స్యా ల్లజ్ వ్యతిరేకేస్యాత్" అని కారికలో లేట్, లోట్, అని లకారములు సంస్కృత వ్యాకరణప్రసిద్ధములైనవే స్వీకరింపఁబడిన వనియు సూరిగారు సంస్కృతవ్యా కరణానుభవము లేనందున లాట్టు, లూట్టని క్రొత్తలకారముల గ్రహించిర నియు శాస్త్రులవా రొకవిషయము చూపియున్నారు.

శాస్త్రులవారిమతముచొప్పున సంస్కృతవ్యాకరణానుభవము లేకున్నను సూరిగారు కారికను జూచియుండిరిగదా! అయినచో నందలి లేట్టులోట్టులను విడుచుటకుఁ బ్రబలమగు హేతు వేదియో నిరూపింప నక్కఱలేదా? ఈ లకారములపరిచయమునకుఁ బాణినీయపాండిత్య మవసరము లేదు. శబ్దరత్నా వళిమాత్రము చదువుకొన్న బాలునికైనను నీలకారములతోఁ బరిచయ ముండును. సూరిగారు లట్టు, లిట్టు, లృట్టులను బాణినీయములోనివానినే గ్రహించుటకును లజ్,లాట్టు,లూట్టులను గ్రొత్తవానిని గ్రహించుటకును గార ణాంతర మున్నది. మొదటి మూఁటికిని వర్తమాన, భూత, భవిష్యదర్థబోధ కత్వము సంస్కృతమునను నాంధ్రమునను సరిగా నుండుటచే వానినే గ్రహిం చిరి. ఇఁకఁ గ్రొత్తవి యగువ్యతిరేకార్థమును దద్ధర్మతచ్ఛీలాదులను శాపాదుల ను బోధించు లకారముల నిర్దేశింపవలసియుండ వానినిగూడఁ బాణినీయోక్త ములనే గ్రహించినచోఁ బాణినీయపరిచయము గలబాలవ్యాకరణాధ్యేతలకు సంస్కృతంబునందలి యర్థములు స్ఫురించి భ్రాంతికలుగుచుండు నని యెంచి యద్దానిని వారించుటకై క్రొత్తలకారములను నిర్దేశించియున్నారు. అట్లయి నను నర్థనిర్దేశపూర్వకముగ లకారములు విధింపఁబడుటచేతను నట్టిలకారము

7

లు లక్ష్యములో వినిపింపనివగుటచేతను నట్టిభ్రాంతి గలుగనేర దనియుఁ బ్రసిద్ధములగు లకారములకు మాఱు లకారములను సూరిగారు గల్పించుట యనావశ్యక మనియుఁ దలంచి కవిగా రిట్టిసవరణము చేసి రని గ్రహింపవలసియున్నది. కాఁగా నీవిషయముగూడఁ గారికలయర్వాచీనతనే బోధించుచున్నది.

(11) "నిడునడుకడుచిఱుకుఱుగతడఱయోః ప్రాణేపరేతు డాద్వాస్తః। గసడదవాః పరుషాణాం పరతః ప్రథమాన్తతస్తుబహుళం స్యుః" అను కారికలోఁ బూర్వార్ధమున నిట్టూరుపు మొదలగు సమాసములందలి సంధిరూపములును నుత్తరార్ధమున వాఁడు గొట్టె మున్నగు వ్యస్తపదములందలి సంధిరూపములును సాధింపఁబడిన వనియు నిందు మొదటిదగు సమాససంధిరూపములు, సంధి 27-28-29-30 సంఖ్యగల సూత్రములయొద్ద సాధించి చూపవలసియున్నను ఛందోనిర్బంధముచేఁ బ్రకరణవిరోధమునకుఁ దలయొగ్గి యార్యావృత్తములో నిముడుటకు వీలున్న గసడదవాదేశవిధాయకసూత్రముతో గలిపి కవిగారు కక్కుఱితిపడి రనియు, నీప్రకరణవిరోధమును గమనింపఁ జాలక సూరిగారుగూడ నీసూత్రక్రమము నిల్పి యుంచిరనియు, నట్లుగాక స్వతంత్రముగ సూరిగారు బాలవ్యాకరణమును రచించినచో నిట్టిప్రకరణవిరోధము తటస్థించుట కవకాశము లే దనియు శాస్త్రులవారి వేఱొకసారాంశము.

ఇందుఁ బ్రకరణవిరోధ మేమియుఁ గానరాదు. అచ్చుల కచ్చులు పరమగునప్పుడు వచ్చెడియణాదేశముల నన్నిటిని నిరూపించి యిక గసడవాదేశము మొదలుకొని హలాదేశముల నిరూపింపవలసియుండ దానిలోనచ్చున కచ్చు పరమగునపుడే వచ్చెడిహలాదేశము ప్రథమోపస్థిత మగుటవల్లను నిట్టిహలాదేశ మిది యొక్కటియే యుండుటవల్లను ద్విరుక్తటకారాదేశసూత్రము హలాదేశప్రకరణప్రారంభమునఁ జెప్పఁబడినది. వ్యస్తపదసంధులను సమాససంధులను వేఱువేఱుగా నిరూపింపవలయు ననునియమము సంధిపరిచ్ఛేదమునఁ జేసికొనఁబడియుండలేదు. కావుననే మఱికొన్నిచోట్లఁగూడ వ్యస్తవిషయకములును నగుసూత్రములు సంకీర్ణములై యగపడుచున్నవి. సంధిపరిచ్ఛేదములోఁ బ్రారంభమున నచ్చుల కచ్చులు పరమగునప్పటి యణాదేశములును, బిమ్మట నచ్చుల కచ్చులు పరమగునప్పటి హలాదేశములును బిదప నచ్చులకు హల్లులు పరమగునప్పటి హలాదేశములును నీసంద

ర్యమున సరళాదేశ ప్రసంగవశమునఁ బ్రాప్తమగు ద్రుతప్రకృతిక ప్రకరణమును, తరువాత నచ్చుల కచ్చులు పరమగునప్పటి యాగమములును, హల్లులు పరమగునప్పటి యాగమములును, నామ్రేడితసంధులును, నలుక్సమాసమందలి యాదేశాగమములును, లోపప్రకరణమును, ద్రుతప్రసంగమున ననుకరణసంధులును నిరూపింపఁబడియున్నవి. ఈ క్రమమునుబట్టి ద్విరుక్తటకారవిధాయక సూత్రము గసడదవాదేశసూత్రమునకుఁ బూర్వముండుటలోఁ బ్రకరణవిరోధము గానరాకున్నందున నీవిషయము గ్రంథపౌర్వాపర్యచర్చ కుపచరింపదని నాయభిప్రాయము.

(12) "ఏతేలడాదయః కర్తృకర్మణోస్స్యు స్సకర్మకాత్ । పరస్మాత్కర్తరి" యనుకారికకు "లకారంబులు సకర్మకంబులకుం గర్తృకర్మంబులందు ను లాఁతికిం గర్తయందు నగు"ననుసూత్ర మగపడుచున్న దనియు, నిట ఛందోనిరోధంబునంజేసి శ్లోకములో 'అకర్మకాత్' అనునది యునుడక 'పరస్మాత్' అని కవిగారు ప్రయోగించి రనియు, నిదిచూచినవారు గనుకనే సూరిగారుగూడ దానికిఁ బ్రతిబింబముగా నుండునట్లు 'లాఁతికిఁ' అని ప్రయోగించిరనియు, నట్లుగాక ముందుగానే స్వతంత్రముగా సూరిగారు సూత్రమును రచించినచో 'లః కర్మణి చ భావే చాకర్మకేభ్యః, అనుపాణినీయసూత్రమువలె ధారాళముగా నకర్మకంబుల కనుపదమునే యుపయోగించియుండు రనియుఁ గావున నీయంశము కారికలే మొదటివని స్థాపించుచున్న దనియు శాస్త్రులవా రూహించియున్నారు.

ఇ ట్లూహింపవలనుపడదు. సూరిగారి యీసూత్రములో 'లాఁతికిఁ' అనియున్న పక్షముననే 'లః కర్మణిచ భావే చాకర్మకేభ్యః' అనుపాణినీయ సూత్రమువలె నిది చక్కనిసూత్రశైలిలో ధారాళముగా నున్న దని చెప్పఁదగును. ఈపాణినీయసూత్రములోమాత్రము 'సకర్మకేభ్యః' అనుపదము ప్రయుక్తమై యున్నదా? అదిలేకున్నను సందర్భవశంబున 'సకర్మకేభ్యః కర్మణి కర్తరిచ స్యుః' అనునర్థము లభించుచున్నది గదా? ఒకయర్థము ప్రకారాంతమున లభించునపుడు తద్బోధకమగు పదమును సూత్రములోఁ బ్రయోగింపకుండుట యే ప్రౌఢమగు సూత్రశైలికి లక్షణముగదా? అట్టిదృష్టితోడనే సూరిగారు 'సకర్మకంబులకుఁ గర్తృకర్మంబులందును నకర్మంబులకుఁ గర్తయందు నగు'నని యకర్మకపదంబును గూడ గ్రహించినచో శైలిశిక్షి-

లి పేలవముగా నుండుననియు, లాఁతిశబ్దముచే నెట్లును నకర్మంబులే గ్రహింపఁబడునుగదా యనియు నూహించి యించుక ప్రౌఢ మగురీతిలో 'లాఁతికిం గర్తయందు నగు' ననిసూత్రించియున్నారు. ఈరచనమే సూత్రశైలి కను రూపముగా నున్నది. సూత్రశైలి ప్రౌఢముగను లాఘవానుబంధిగను నుండ వలయునేగాని వాక్యశైలివలె ధారాళముగా నుండవలయు ననుట సరిగాదు.

ఇట్లీయొక్కస్థలముననేగాక మఱికొన్ని యెడలఁగూడ నిట్టిరీతి బాల వ్యాకరణములోఁ గలదు. 'డుమువున లేకవచనంబులు' 'లువర్ణంబు బహువచనంబు' నని చెప్పినపిదప 'తక్కినవి యుభయంబులు' (బా-తత్స-13) అను సూత్రము కలదుగదా? ఇందు ధారాళముగా నుండుటకై 'తక్కినవి'యను పదమునకు బదులుగా నువర్ణకాదుల నన్నిటిని బేర్కొనవలయు నందురా? మఱియు డుఙ్ ప్రత్యయములలో 'రుములు బహువచనంబులు' అని చెప్పిన పిమ్మట 'పెఱ లేకవచనంబులు' (క్రియా-10) అని కలదుగదా? అచట 'డుఙ్,వు,ను, లేకవచనంబులు' అనియుండుట సమంజసమా? కాదు. ఇట 'తక్కినవి' 'పెఱలు' అనుపదము లుండుటయే సూత్రశైలిలో సరసముగానుండును. ఇట్లే ప్రకృతసూత్రమున 'లాఁతికిఁ' (పరస్మాత్) అనుటయే యుచితమైయుండ నయ్యది సమంజసము కాదనియుఁ, దన్మూలమునఁ గారికలప్రాథమికత్వము స్థిరపడుచున్న దనియుఁ దలంచుట కవకాశము లేదు.

(13) 'పుంలిఙ్గాన్మహతో డుఙ్ స్యాత్, మూనాద్గా దేడు రేకత్వే, నల్లాదిభ్యో గుణేభ్యోనః, పేర్వాదిభ్య ఇమిర్భవేత్' ఇత్యాదిరూపముగఁ గవిగారు ప్రత్యయవిధాయకసూత్రములలో 'ఙ్యాప్ప్రాతిపదికాత్' మున్నగు పాణినీయసూత్రములలోని పంచమ్యంతములవలె 'పుంలిఙ్గాత్' మున్నగురీతిని బంచమ్యంతములనే ప్రయోగించి రనియు, నిట్లే తెలుఁగునఁగూడఁ బుంలింగము కలెపె 'డుజ్జను' మొదలగురీతిని గంటెవర్ణకముతోడ వ్యవహరింపవలసియున్న దనియు, బంచమ్యంతప్రయోగముచే సందర్భవశంబునఁ బరమై, యని యర్థముతోఁచు ననియు, సంస్కృతవ్యాకరణసంప్రదాయ మెఱుంగక సూరిగారు షష్ఠ్యంతములు ప్రయోగించి రనియు, నీషష్ఠ్యంతప్రయోగముచే స్థానాదేశభావము స్ఫురించి యపరూపములు సంభవించు ననియు నీపాటి సంస్కృతవ్యాకరణమర్యాద నెఱుంగని సూరిగారు స్వయముగా బాలవ్యాకరణమును రచింపఁజాలి యుండ రనియు [illegible]

తెలుఁగునఁ బూర్వము, పరము మున్నగువానితో సంబంధమున్నపుడు కంటెవర్ణకమును, కువర్ణకమును గూడ వ్యవహారసిద్ధములై యున్నవి. ఇటఁ బంచమియు షష్ఠియు రెండువిభక్తులును నుండవచ్చు నని సూరిగారు కారక పరిచ్ఛేదము 12వ సూత్రమునొద్ద స్పష్టముగాఁ జెప్పియున్నారు. ఈరెండిటిలో షష్ఠియే యిప్పటివ్యవహారమున రుచిరముగను బ్రచురముగను నగపడుచుం డును. ఈవ్యవహారప్రాచుర్యముంబట్టియే పెక్కుచోట్ల సూరిగారు 'పులింగము నకు' మున్నగురీతిని షష్ఠినే యుపయోగించియున్నారు. పంచమ్యంతమును బ్ర యోగించినపుడు శాస్త్రులవారు సెలవిచ్చినరీతిని 'పరమై' యనునర్థమెట్లుతోఁ చునో యట్లే షష్ఠ్యంతము ప్రయుక్తమగునపుడు మాత్ర మాయర్థము తోఁచు టకుఁ బ్రతిబంధక మేమిగలదు? ఇట్టియెడ ననఁగాఁ బూర్వపరాదియోగం బున సంస్కృతభాషలోఁ బంచమియే గాని షష్ఠిని బ్రయోగించుసంప్రదాయ మగపడదు. ఈవిషయమును గొంతవఱకు గమనించుటవల్లనే సంస్కృతకారిక లలో నచ్చటచ్చటఁ బంచమ్యంతములు ప్రయుక్తములై యున్నవి. ఇది సం స్కృతాంధ్రములకుఁ గలకారకనియమభేదమును బట్టి వచ్చినవ్యత్యాసము గాని, కవిగారిపాండిత్యవిశేషమును బట్టియు, సూరిగారి పాండిత్యలోపమును బట్టియు వచ్చినవ్యత్యాస మని తలంచుటమాత్రము ధర్మముగాదు, ఇఁక ష ష్ఠ్యంతప్రయోగమువల్ల స్థాన్యాదేశభావము స్ఫురింపదా యందురేమో! స్థాన్యాదేశభావస్వరూపమును దెలిసికొనఁ గలిగినంతటి వ్యాకరణపరిచయము గలబాలురు ప్రకృతికెప్పుడును బ్రత్యయము పరముగానే వచ్చునను సామా న్యవిషయమును గ్రహింపఁగలిగియే యుందురు గావున నిట్టియెడఁ బరపదా ధ్యాహారము చేసికొనియే సమన్వయించుకొందురు. అట్లు గాక ఇట్టి యెడఁ బ్రత్యయము ప్రకృతి కాదేశమై వచ్చునా లేక పరముగా వచ్చునా యనుశంక యొవరికేని గలిగినను నాయాసూత్రములకు సూత్రకర్తయే వ్రాసె నవృత్తులును నాతఁడే చూపిన లక్ష్యములును నట్టిశంకను వెనువెంటనే నివా రింపఁగలిగియున్నవి. ఇట్టియాపత్తి కేవలసూత్రములు రచించిన వారివిషయ మునఁ జూపవలయునేగాని స్వయముగా సూత్రార్థముల వివరించి లక్ష్యము లంగూడ నిర్దేశించియున్నవారి విషయమునఁ జూపుటకు వీలులేదు. ఇదిగాక సూరిగారు కారికలు చూచి తెనిఁగించిరనికదా శాస్త్రులవారి నిశ్చయము. ఆపక్షమున 'పుంలింగాత్', అనుదానికిఁ బుంలింగముకంటె నని సరిగా సూరిగా

ర్యాంధ్రీకరింపనందులకుఁ దగినహేతు వేదియో వీరు నిరూపింపవలసియుండును. అట్లు మక్కికి మక్కిగా నర్థము వ్రాయుటకు వ్యాకరణపాండిత్య మావశ్యక ముగాదు గదా!

ఇది యట్లుండ నిచ్చట మఱొక్క విశేషము గలదు. 'పుంలిఙ్గా న్మహతో డుక్ స్యాత్' ఇత్యాదిప్రత్యయవిధాయక సూత్రములలో షష్ఠ్యంతములఁ బ్రయోగింపక పంచమ్యంతములఁ బ్రయోగించుటవలనఁ గవిగారివిశుతపాండిత్యచాకచక్యమును పుంలిఙ్గం బగుమహద్వాచకమునకు డుఙ్గగు మన్నగుసూత్రములలోని షష్ఠ్యంతప్రయోగములవలన సూరిగారిశ్రుతపాండిత్యమును వెలువడుచున్న వని శాస్త్రులవారు వ్రాసియున్నారు. వీరుగుప్తార్థప్రకాశికాంతమునఁ దమయొద్దనున్న మాతృకనుబట్టి స్వయముగా ముద్రింపించిన హరికారికలలో 'అదంతానా మమహతాం క్లీబానాంచ ముపర్ణకః' అను ముప్రత్యయవిధాయకసూత్రమందును 'గవోకారాంతశబ్దానాం సర్వత్రాపి వువర్ణకః' అనువుప్రత్యయవిధాయకసూత్రమందును, 'తిరశ్చామపి కామతః' అను క్వాప్రత్యయవిధాయకస్థలమందును 'స్వార్థే కేషాంచి దేషః' అను ఈప్రత్యయవిధాయకస్థలమందును నగపడుచున్న షష్ఠ్యంతప్రయోగముల కేమిసమాధానము చెప్పెదురు? సూరిగారిషష్ఠ్యంతప్రయోగముపైని శాస్త్రులవారు చూపినస్థాన్యాదేశభావస్ఫురణరూపదోషము గవిగారి యీ నాలుగుసూత్రములందును నున్నట్లంగీకరింపవలసియే యుండునా? మఱియు నీస్థలమున విమర్శకు లెల్లరును దూరదృష్టితోఁ బరికింపవలయును, అల్లుఁడును శిష్యులును నగుకొమ్రలక్ష్మీనారాయణశాస్త్రిగారు వ్రాసికొన్న హరికారికలు మూలగ్రంథమును వివరణములు నుదాహరణములును సంపూర్ణముగా నున్న తాళపత్త్రగ్రంథమును, కరపగ్రామములోఁ జూచినాఁడను. అయ్యది లక్ష్మినారాయణశాస్త్రిగారి పుత్రులును కృష్ణమూర్తి కవిగారికి దౌహిత్రులును నగుకొమ్ర శ్యామలకామశాస్త్రిగారియొద్ద నున్నది. దానిని వారే నాకుఁ జూపియున్నారు. వేంకటరామశాస్త్రులవారు తమప్రకృతాంశమునకు సాధకమని యూహించి యుదాహరించిన 'నల్లాదిభ్యోగుణేభ్యోనః పేర్వాదిభ్య ఇమిర్భవేత్' అనుకారిక యాతాళపత్త్రగ్రంథములోఁ బంచమ్యంతములలో లేనేలేదు. 'నల్లాదీనాం గుణానాంనః పేర్వాదీనా మిమిర్భవేత్' అని స్పష్టముగా షష్ఠ్యంతములతో నగపడుచున్నది. ఈయొక్క స్థలమునందే గాక 'ఋకారాదీనా మికచ్చ స్యాత్', 'ఈస్వా

దటమటాదీనాం' 'ఇకవర్ణోగలాదీనాం మున్నగు పెక్కు కారికలలో షష్ఠ్యంత ములే యగుపడుచున్నవి. దీనినిబట్టి యాతాళపత్రగ్రంథమునకు మాతృక యగుకృష్ణమూర్తి కవిగారి తాళపత్రగ్రంథములోఁ గూడ నిట్లు షష్ఠ్యంతముల తోనే పాఠముండియుండు నని దృఢముగాఁ దోఁచుచున్నది. గురువుగారి గ్రంథ మును జూచి ప్రాజ్ఞు లగుశిష్యులు వ్రాసికొనినపుడు మన ప్రస్తుతవివాదమున కనుకూలించున ట్టీస్థలముననే యింతమార్పు గలిగెననుట సంభావ్యము గానే రదు. ఇదంతయుఁ జూడ వేంకటరామశాస్త్రులవారియొద్ద నున్నప్రతిలోని ష ష్ఠ్యంతములు పంచమ్యంతములుగ సవరింపఁబడియుండు నని తోఁచుచున్నది. షష్ఠ్యంతము లిట్టియెడ సాధువులు గావని తలంచి యట్లు సవరించినవారు కారికల నన్నిటిని సరిగాఁ బరిశీలించియుండనందునఁ గావలయును పైని నేను జూపిన నాలుగుషష్ఠ్యంతములను దిద్దక విడిచిపెట్టినారు. ఏదో యొకప్రయో జనమును మనమునం దిడుకొని కవిప్రయోగము నిట్లు దిద్దివేయుట ధర్మము గాదు. ఆలోచింపఁగాఁ గవిగారు ప్రయోగించినషష్ఠ్యంతములు తప్పు లనుట కును నవకాశము లేదు. ప్రత్యయవిధులలోఁ బంచమ్యంతము లుండుట న్యాయ మైనను 'మధుబభ్ర్వో ర్బ్రాహ్మణకౌశికయోః' 'దదాతిదధాత్యోర్విభాషా' 'భీహ్రీభృహువాంశ్లువచ్చ' మున్నగు పాణినీయసూత్రములందును 'సర్వత్రో ర్భవతి మువత్' 'డుజ్మహత్పదానాంవా' 'సర్వేషాం బహువచనేరు ఇతి స్యాత్' 'చురిత్రిక్రియాపదానాం' 'సర్వేషాం వర్తమానకాలే స్యాత్' ప్రతిషే ధవాచినాం నిః' 'భూతార్థానాం తునః క్రియాణాంస్యాత్' మున్నగు నన్న యభట్టీయ సూత్రములందును 'భవేద్ధర్మాదిశబ్దానాం ముచ్చవుశ్చాత్ర కుత్ర చిత్' మనువట్యాదిశబ్దానాం నుడుజ్నిశ్చ ప్రయుజ్యతే' మున్నగు నాథర్వణ సూత్రములందును షష్ఠ్యంతములు పెక్కు లగపడుచునేయున్నవి. వానితో పాటుగ నీహరికారికలలోని షష్ఠ్యంతములు సాధువులనుకొనుట కవకాశము గలదు. ఇట్టిస్థితిలో దీనికై యింతప్రయత్నముతో సవరణ మేలచేయవలసివ చ్చెనో తెలియకున్నది.

(14) క్త్వార్థకము ద్రుతప్రకృతికము గాదు. వ్యతిరేకక్త్వార్థకము విక ల్పముగా ద్రుతప్రకృతిక మగును. అనుప్రయుక్తంబైన కొనుధాతువునకుఁ గొం దఱిమతంబునఁ గశబ్దంబు సర్వాదేశంబగును, అనునర్థముగల సర్వత్రసద్రుతః క్త్వార్థే వ్యతిరేకేతు బాధ్యతే ... కం బుధాః కేచి

ఇకి కోర్వ్యాదుల కగు బా—కృ—16

వువర్ణకంబు మన్వాదుల కగు బా—కృ—17

అవర్ణకంబు గీత్వాదుల కగు బా—కృ—18

అనువీనికి

"తతో బడిః ఏల్వాదే రస్తుగత్వాదేః వుర్మవ్యాదేస్తథాభవేత్, కోర్వాది భ్య ఇకిః స్తద్వత్ పేర్వాదిభ్యో గడోమతః" అనియు నిట్లే యింకను ప్రకీర్ణ కపరిచ్ఛేదమున,

"దక్కు లోనగువాని దాకు డకారంబు విభాష నగు-" బా-ప్రకీ-14

"ఏతాదులకు మువర్ణకంబు పరమగునపుడు దీర్ఘంబు విభాష నగు-" బా-ప్రకీ-15

అనుసూత్రములకు

"నైతాదీనాం మాతు దీర్ఘో, దక్కాద్యాదే ర్దశ్యవాతు డః" అనియు

"అబ్బురాదులం దుత్వమునకు లోపము విభాషనగు" బా-ప్రకీ-19

"చుక్కరకరువర్ణంబునకు ముందఱిదువర్ణంబు నుత్వంబున కు లోపంబు విభాషనగు. అగుచోఁ దత్పూర్వంబు గురువుగాదు" బా-ప్రకీ-20

"జూదాదులదాకు జకారంబు విభాష నగు-" బా-ప్రకీ-21

అనుసూత్రములకు

"వాబ్బురాదే రుతో లోపా జూదాదే ర్దస్య జస్తథా
చుక్కరే రాభవే ద్ధూతో లుగ్వా నాదిస్తతో గురుః"

అనియు ఛందస్సునకై సూత్రక్రమమును గవిగారు మార్చినట్లు తేటపడుచున్నది. కారికలనే చూచియున్నచో నందలి సూత్రక్రమమును సూరిగారు మార్చుకొనుటకు హేతు వగపడదు.

(2) సూత్రఘటకగణనామభేదము.

వృద్ధాదులడుజ్జునకు లోపము విభాష నగు బాల-తత్స-56

స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు బాల-తత్స-57

చరిత్రాదులమువర్ణంబునకులోపంబుబహుళంబుగానగు బాల-తత్స-58

అని సూరిగారిసూత్రములకు వృద్ధాదే ర్వాడు జ్లోలోటో బహుళం మోర్వ థాదిషు స్త్రీలింగ ప్రథమైకస్య లోపః అను కారిక యగుపడుచున్నది. ఇటఁ

చరిత్రాదిశబ్దముల ముపర్ణకము లోపించునని సూరిగారు చెప్పియుండఁ "జరిత్రాదిపదము శ్లోకములోనిముడక బహుళం మోర్వధాదిషు" అని కవిగారు మార్చియున్నారు. సూరిగారు కారికను జూచినయెడల వారును వధాదులని యే నిరూపింపక దానినిమార్చి చరిత్రాదులనవలసిన ప్రసక్తి వారికిలేదు.

ఇట్లే "కంధరాదులుక్లీబతుల్యంబులుబహుళంబుగానగు బాల-తత్స-66 అనుసూత్రమునకు " భిక్షాదయోభజన్తత్ర బహుళంక్లీబతుల్యతామ్ " అను కారిక గలదు. ఈపట్టున, కంధరా, నాసికా, భిక్షా, దంష్ట్రా, గ్రీవా, పాదుకా, ఉల్కా, ప్రభృతులు కంధరాదు లనిసూరిగారివాక్యమునుజూచి యందు వర్ణత్రయఘటితములగు వానిలో మొదటిదగు భిక్షాశబ్దమును గవిగారు గ్రహించియున్నట్లు స్పష్టపడుచున్నది.

(౩) రచనావిరోధములు.

" ఉకారాన్తగోశబ్దములకంతట వుపర్ణకం బగు బా-తత్స-48

" వుపర్ణకేతరవిభక్తి పరమగుచో నుకారాన్తములకు బహుళంబుగా గోశబ్దమునకు నిత్యముగా వుగాగమం బగు బా-తత్స-49

" ఉకారాన్తం బగుమహత్తునకు వుపర్ణకము బహుళంబుగా నగు బాల-తత్స-50

" కద్రువనాగమాత బాల-తత్స-51

అని సూరిగారిరచనము ఇటనుకారాన్తములకు వుపర్ణకమును వుగాగమును వచ్చుస్థలము లన్నిటిని జూపి యీసందర్భమునఁ గద్రూ శబ్దమునకుఁగూడ మొదటిసూత్రముచేఁ వుగాగమును బ్రాప్తించుచుండ దానిని వారించుటకై కద్రువ యని నాల్గవసూత్రమున నిపతించియున్నారు. ఈసూత్రములకు.

" గవోకారాన్తశబ్దానాం సర్వత్రాపి వుపర్ణకః
విభక్తౌ వుగ్వ్యభిన్నాయాం గోర్నిత్యం బహులంతు వామ్
" ఉకారాన్తాత్తుబహులం మహతస్స్యా ద్వుపర్ణకః
అహిప్రసూం వినాకద్రూ మస్యవస్స్యా ద్రుయోగతః "

అనుకారికలుగలవు. ఇట "అహిప్రసూం వినా కద్రూమ్" అనునది యేవాక్యముతో సమన్వయించును? సన్నిహితమగు—' ఉకారాన్తాత్తు బహులం మహతస్స్యా ద్వుపర్ణకః' అనుదానితోఁ గదా యన్వయింపవలయును. అవ్వా

క్యము మహాచ్ఛబ్దవిషయకమగుటచే నావిధి కద్రూశబ్దమున కెంతమాత్రము ను సంబంధింపదు. కావున నీపర్యుదాస మసంబద్ధ మగుచున్నది. ఈపర్యుదాసము "గవోకారాన్తశబ్దానాం సర్వత్రాపి వువర్ణకః" అనుదానిలో నున్నచోఁ గొంతవఱకు సమంజసముగా నుండును. ప్రకరణాంతమున నున్నకద్రూశబ్దవిషయక మగుపయి సూరిగారిసూత్రమును జూచినవారు గావుననే కవిగారు మొదటిమూఁడుసూత్రములను రచించినపిమ్మటనే దీనిని రచించియున్నారు. ఆరచించుటలో. సూరిగారివలెఁ గేవలనిపాతరూపమున విధించియున్నచో బాధ లేకుండెడిది. పర్యుదాసము చెప్పుటవల్ల సమన్వయమునకు వీలులేకున్నది. సూరిగారియీసూత్రక్రమమును జూడకుండగ స్వతంత్రముగనే కవిగారు కారికలను రచించినచో నన్వయవిరహితముగ నీరీతిని రచించి యుండరు. సూరిగారిసూత్రక్రమమే వీరినిట్లు భ్రమపెట్టియుండుట స్పష్టమగుచున్నది. కావున నీవిషయము బాలవ్యాకరణప్రాథమికత్వమును దృఢముగా స్థాపింపఁజాలియున్నది.

"సమానాధికరణం బగునుత్తరపదంబు పరంబగునపు
డు మూఁడుశబ్దము డువర్ణంబునకు లోపంబును
మీఁదిహల్లునకు ద్విత్వంబునగు బాల-సమాస-17

అనుసూత్రమునకు

"ఉత్తరస్మి న్సమానాధికరణేతు పవేడుజః,
మూఁడుశబ్దస్య లోపస్స్యా ద్ధలోద్విత్వం తథోపరి"

అనుకారికయగపడుచున్నది. సూరిగారు సంఖ్యావాచకశబ్దములకుఁ బ్రకృతిప్రత్యయవిభాగము చేసి ప్రక్రియను జూపియుండలేదు. పరినిష్ఠితరూపముల పట్టికను మాత్రము చూపియున్నారు. వీరిగ్రంథమునుబట్టి మూఁడుశబ్దములోని 'డు' అనునది డుజ్ఞని (జీత్తుగా) తలంచుట కెంతమాత్రమును నవకాశములేదు. ఈడువర్ణము ప్రకృతిసిద్ధము. కావుననే మూఁడిటిని మూఁడిటికి మున్నగు ద్వితీయాదివిభక్తులందుఁ గూడ నిదియగపడుచుండును. కారికలలోఁ గూడ నెచ్చటను నిందలిడువర్ణము జీత్తుగా విధింపఁబడియుండలేదు. బిందుపూర్వక మగుటచే నియ్యది డుజ్ఞనికొందఱు భ్రమించుటకలదు. ఇట్టిభ్రమవల్లనే కొన్నిబాలవ్యాకరణప్రతులలో 'మూఁడుశబ్దము డుజ్వర్ణంబునకు లోపంబు' నను నపపాఠము వెలయుచున్నది. ఈసూత్రమునొద్ద గుప్తార్థప్రకాశికలో

శాస్త్రులవారుగూడ "కొన్నిపొత్తంబులలో మూలసూత్రంబునందు డుజ్వర్ణం బునకు అనిపాతము కలదు. అయ్యది ప్రామాదికంబు"అని స్పష్టపఱిచి యున్నారు.

పైసూత్రమునఁజూచినను గవిగారు మూఁడుశబ్దము ప్రథమాంతమును నందలిడువర్ణము బిందుపూర్వముగను నగపడుచుండుటవలన నయ్యది డుజ్ఞని భ్రమించి "డుజః" అనివ్రాయుట సుసంభవమని తేటపడుచున్నది. ఇతరులు రచించినప్రక్రియాగ్రంథము నప్పటి కపుడు చూచి యందలిప్రణాళికలను సాకల్యముగ గ్రహించి ధారణచేయుట కష్టముగానఁ గవిగారిట్లు భ్రమపడుటకుఁ గొంతయవకాశము కలదు. ఇట్లుగాక కవిగారే మొదటఁ గారికలు రచియించిరన్నచోఁ దమప్రణాళికను దామే గుఱుతింపఁజాలక పూర్వాపరప్రక్రియావలోడనము లేకుండ స్వగ్రంథవిరోధము గలుగునట్లు డుజ్ఞని ప్రయోగించి రనవలసివచ్చును. ఇటఁ గవిగారు తమప్రక్రియలోని పూర్వాపరసందర్భములఁ దామే గుఱితింపలేకపోయి రనుట యుచితమో, లేక యిది భ్రాంతిజనకమగుస్థలముగావున సూరిగారిసూత్రమును జూచి భ్రాంతిపడి రనుట యుచితమో విమర్శకులే యూహింతురుగాక.

తత్సమపరిచ్ఛేదప్రారంభమునఁ బ్రథమావిభక్తిప్రత్యయముల స్వరూపము ను బోధించుసూత్రములలో 'చేతతోఁడా కొఱకుకైచ తుర్థీ త్వదపంచమీ'అను కారిక గలదు. ఇట సూరిగారు 'కొఱకు, కయి, చతుర్థి' అని వ్రాసియుండఁ దదనుసారముగ 'కొఱకు కయి'అన్నచో ఛందస్సు కుదురదు గావున 'కై'యని గ్రహించి యున్నారు. కాఁగా నైకారాంతమైన 'కై'యనునది ప్రత్యయస్వరూప మని మొదట బోధించినట్లు తేలుచున్నది. మరల నొకచోట 'షష్ఠి యొక్క కయిా న్వినా'అని కయిప్రత్యయమును గ్రహించి దీనికి నుగాగము రాదని దెలిపియున్నారు. మొదటి సంజ్ఞాసూత్రములలో 'కై' యని గ్రహింపఁబడిన యీప్రత్యయమునకు 'కయి' అనురూప మెట్లు సిద్ధించును? క్రియాపరిచ్ఛేదములోని 'భవేతా మయ్యవుమవక్రతమా బహులమాచ్ఛికే' (అచ్ఛికంబులం దయి యవులకు వక్రతమంబులు బహులంబుగా నగు బా-క్రియ-103) అనుసూత్రముచే 'అయి'అనుదానికి నైకారాదేశము వచ్చునుగాని యైకారమునకు 'అయి' యనునాదేశమురాదు గదా! "వక్రతమా అయ్యవుా- భవతః (పలా, అయి అవుగామాఱును)అని యన్వయిం

చినచో 'కయి' అనురూపము సిద్ధించునుగాని యీయన్వయములో నీసూత్రము నొద్దనున్న 'అయిరేని, ఐరేని' అనునుదాహరణము మిక్కిలి యసంగతమనవలసివచ్చును. ఈయుదాహరణమును బట్టియుఁ గారికలలోని ప్రక్రియాపద్ధతిని బట్టియు 'అయి అవులు వ్యక్రతమములుగా మాఱు ననియే పైసూత్రము నర్థము చెప్పితీరవలయును. కాఁగా 'కయి' అనురూపము సిద్ధింపకుండఁగనే యున్నది. ప్రణాళిక యితరుని దయినపుడే యిట్టిపూర్వాపరవిరోధము సంభవించు ననుట న్యాయ్యముగాని కవిగారి వంటిపండితులు స్వయముగాఁ ప్రణాళిక నేర్పఱుచుకొన్నగ్రంథములో నిట్టిపూర్వోత్తరగ్రంథవిరోధము లుండునని యూహించుట యట్టివారికిఁ దగనిలోపమును గల్పించుట యగునని నాయభిప్రాయము.

"అగున కనుకనులకు ముజ్జీత్తులు పరంబు లగునపుడు
కానాకానలు విభాషనగు (బా-క్రియా. 96)

అను సూత్రమునకు

"ముత్యగోరనుకనోర్శ్చ కానాకానాభవన్తివా"

అను కారికగలదు——

అగుధాతువునకు ముజ్జు పరమగునపుడు "కా" యనియు, అనుధాతువునకు జీత్తులు పరమగునపుడు "నా" యనియు, కనుధాతువునకు జీత్తులుపరమగునపుడు "కాన" యనియు నాదేశములు వికల్పముగా రావలసియున్నవి. సూరిగారిసూత్రములోని యుద్దేశ్యనిమిత్త, విధేయములకు యథాక్రమముగ నన్వయముచేసికొన్నచో నీయర్థము సరసముగా లభించుచున్నది. ఈసూత్రము ప్రాప్తాప్రాప్తవిభాషగా నారంభింపఁబడినది. కారికలో ముజ్జీత్తు లను నిమిత్తములు విడిగా గ్రహింపఁబడక "ముత్త"ను విశిష్టసంజ్ఞావాచకపదము గ్రహింపఁబడియుండుటచే 'అగు' అను, కను అనునీమూఁడిటికిని 'ముత్తు' పర మగునపుడెల్ల నీవిధి ప్రవర్తింపవచ్చునని తెలుచున్నది. ఇట్లు ప్రవర్తించినచో అగుధాతువునకు, అగఁడు, అగమి, అగక, అగని, మున్నగునవియు, అనుధాతువునకు ("నీవు), నమ్మ (మీాపు) నండు" అనునవియు, కనుధాతువునకు నీవు 'కానము' మీారు 'కానఁడు' అనునవియు ననేకములగు ననిష్టరూపములు సంభవించును. మఱియు నుద్దేశ్యవిధేయవాచకముల విన్యాసముగూడ, అగునకు 'కా' నా, కానను మూఁడును, అనుకనులకును, కానా, కానలుమూఁడును

వచ్చు ననునర్థము లభించురీతిగా నున్నది. దీనివలన మఱికొన్ని యపరూపములు సంభవించును. మఱియు నీపద్ధతిలో, ,,వచ్చో శ్చాచో రగో శ్చోచ్ఛో వాన్చాచుః కాశ్చో రుఘ్నతి" అని యగుధాతువునకు ముత్తుపరమగునపుడు కాదేశమును నిత్యముగా విధించుట కేవలము నిరర్థక మగుచున్నది. కవిగారు సూరిగారిసూత్రములో ముజ్జీత్తులను పదముచూచి ,,ముజ్జీత్తులు ముత్తునాఁ బడు" ననుసంజ్ఞ యున్నది. గాన నాసంజ్ఞాపదమునే వ్యవహరింత మని యూహించి 'ముతి' యనియు, 'కా'నాకానలనుచో 'కా' యనునది వ్యస్తపదమని గ్రహింపక యదంతయుద్వంద్వసమాసమే యని తలంచి ,,కా నాకానాభవ త్తివా" యనియు రచించిరేగాని సూరిగారిసూత్రములోని క్రమపద్ధతిని గమనింపరైరి. ఏతత్సూత్రరచనావిషయమునఁ గవిగారికి స్వబుద్ధిప్రకల్పిత మయిన యుద్దేశ్యనిమిత్తాదినిర్ణయ మున్నచో సూత్రమింతయజాగరూకమై యుండదు

,,కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు

బా-కృ-1—

ధాతువునకు విహితం బగుదుశ్ఛిన్నప్రత్యయంబు కృత్తునాఁబడు కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృకర్మాద్యర్థంబులు మహాజనవ్యవహారానుసారిగా నెఱుఁగునది" అను సూరిగారిగ్రంథమునకు

,,యథావ్యవహృతి జ్ఞేయాః కృతామర్థా మనీషిభిః దుశ్ఛిన్నప్రత్యయో ధాతో ర్విహితః కృది తీష్యతే వక్ష్యమాణా భావకర్తృకర్మాద్యర్థాః కృతామివా మహాజనస్య విజ్ఞేయా వ్యవహారాను సారతః"

అనుకారికలు గానంబడుచున్నవి.

బాలవ్యాకరణమునఁ గృదంతపరిచ్ఛేదమున ,,కవర్ణకం బలుగ్వాదుల కగు" మున్నగురీతిని నర్థనిర్దేశము లేకుండఁ బ్రత్యయములు మాత్రము విధింపబడియున్నవి. కావుననే వానియర్థము శిష్టవ్యవహారమున ననుసరించి తెలియఁదగునని సూరిగారు వ్రాసియున్నారు. కారికలలోఁ గూడఁ గృదంతపరిచ్ఛేదమునం దంతటను నర్థనిర్దేశవిరహితముగఁ గేవలప్రత్యయవిధానమే వెలయుచున్నది. ఇట్లుండ నిటమీఁదఁ జెప్పఁబడు భావాద్యర్థములను నర్థముగల ,,వక్ష్యమాణా భావకర్తృకర్మాద్యర్థాః" అనుకారికావాక్య మెట్లు సంగతమగున? బాలవ్యాకరణకృదంతపరిచ్ఛేదమున నర్థములు నిర్దిష్టములై యున్నవో లేవో యనికూడఁ గవిగారు పూర్వాపరపర్యాలోచనము చేయనందున గ్రహించి

యుండలేదు. ,,కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృకర్మాద్యర్థంబు ల" నువాక్యములో ,,వక్ష్యమాణంబు లగు" అనిభ్రమించి యర్థము జేసికొని వక్ష్యమాణపదము భావకర్తృకర్మాద్యర్థములను దానికి విశేషణముగా సమన్వయించుకొని యున్నందున వీరుఁ వక్ష్యమాణాభావకర్తృకర్మాద్యర్థా" అని వ్రాసియుండుట తేటపడుచున్నది. సామాన్యముగాఁ దెలుఁగువచనములలో విశేష్యమునకుఁ బూర్వము విశేషణపదప్రయోగము తఱచుగా నుండుటవల్లను 'కు, గు, అను రెంటికిని నుచ్చారణాదులలో సన్నిహితసంబంధముండుటవల్లను వీరి కిచ్చట నిట్టిభ్రాంతి కలిగె ననుట యసంభావ్యము కానేరదు. ఇట్లుగాక వీరు స్వయముగానే రచనాప్రణాళిక నిర్ణయించుకొని రన్నచోఁ దాము కృత్తుల కర్థముల నిర్దేశింతురో లేదో తమకే తెలియలే దనవలసి యుండును. ఇట్లు తమప్రణాళికను దామే హృద్గతము చేసికొనఁజాలకపోయి రనుట సంభావ్యమో ప్రణాళిక యితరుని దగుటచే నది యప్పటికప్పుడు హృద్గతము కాక పైరీతిని భ్రమించిరనుట సంభావ్యమో విమర్శకులే యూహింతురుగాక —

## (4) సూత్రస్థపదక్రమవ్యత్యాసము.

—: తదుదాహరణ పద్ధతి :—

| బాలవ్యాకరణము— | హరికారికలు— |
|---|---|
| తాను నేను పదంబులద్రుతం<br>బునకుసంశ్లేషంబు లేదు- బా-సంధి-23 | అస్మదాత్మ ద్రుతస్సంశ్లే<br>శ్లేషభాక్చన— |
| తాఁజదివె తావినె<br>తాను జదివె తానువినె | తాఁజదివె తావినె<br>తానుజదివె తానువినె |

ఈస్థలమునఁ 'ఆత్మ స్మత్' అనుసూరిగారి క్రమమును దీసికొన్నచో ఛందస్సు కుదురదని యెంచి కవిగారు 'అస్మదాత్మ' అని కారికలో మార్చి యుదాహరణములను మాత్రము సూరిగారిచ్చినక్రమముననే యిచ్చియున్నారు. సూరిగారి యుదాహరణములఁ జూడక స్వయముగనే కవిగారుదాహరణములఁ జూపియున్నచోఁ దమకారికలో మొదటిదగు 'నేను' అనుదాని యుదాహరణములఁ జూపక దానిని విడిచి రెండవ దగు 'తాను' పదమును సూరిగారిదానికి సరిపడునట్లు చూపుట యెట్లువొసంగును?

| బాలవ్యాకరణము. | హరికారికలు.— |
| --- | --- |
| కయి, పట్టి, యొక్కలకు నుగాగమంబు లేదు—బా-తత్స. 9 | (నుల్ టా దేః) పట్టియొక్క క యాస్వినా. |
| రామునికయి, జ్ఞానముఁబట్టి, రాముని యొక్క— | రామునికయి, జ్ఞానముఁబట్టి రామునియొక్క.— |

ఇటఁ గవిగారు తమ సూత్రమునకు లక్ష్యములను జూపునపు డందలిక్రమము ననుసరించియే చూపవలసియున్నది. అయినను సూరిగారిక్రమమును జూచుటవల్లనే తదనుసారముగ లక్ష్యములు చూపఁబడియున్నవి. ఇచట సూరిగారిక్రమమును జూడకున్నను లోకములోని విభక్తిక్రమము ననుసరించి వారట్లు చూపియుందు రేమో యనుశంక మనకుఁ గలుగవచ్చును. కాని యిది విభక్తులక్రమమును బ్రధానముగఁ జూపవలసినస్థలముగాదు. నుగాగమము రానియీప్రత్యయములను దమ సూత్రమందుపాత్తమయిన క్రమమునందే వారు చూపవచ్చును.

| బాలవ్యాకరణము— | హరికారికలు— |
| --- | --- |
| చేతతోడలోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికము శేషించు—బా-తత్స-10. | చేతలోపల తోడానాం శేషఆద్యక్షరస్యవా. |
| రామునిచే, రామునితో, వనములో | శివునిచే, శివునితో, వనములో, |

ఇట గూడ, చే, లో, తో, అనుక్రమములో నుదాహరింపవలసియున్నను సూరిగారిక్రమములోను దాహరణము లగపడుచున్నవి.

| బాలవ్యాకరణము— | హరికారికలు— |
| --- | --- |
| "ఆగమము, వువర్ణంబుల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబు విభాష నగు" | "వుమ్వోరాగమ యో రందాను గ్భవేత్తు విభాషయా" |
| (1) వనమునందును, వనమందును | (1) వనమునందును వనమందును, |
| (2) ధేనువునందును, ధేనువందును | (2) ధేనువునందును, ధేనువందును |

ఇచ్చట మువువర్ణంబుల కనుదానిని 'మువ్వోః' అనిసంస్కృతీకరించి వ్వోః వువర్ణకము స్పష్టముగా నుండదని తలంచి 'వుమ్వోః' అని మార్చుకొనిరి. కాని తత్క్రమానుసారముగా నుదాహరణములఁ జూపక సూరిగారిక్రమము ననుసరించియే యుదాహరణములఁ జూపియున్నారు. కవిగారు బాల

వ్యాకరణోదాహరణములను జూడనిచోఁ దమకారికలోని క్రమమునకు విరుద్ధముగను సూరిగారి యుదాహరణక్రమమునకు సరిపడునట్లును నుదాహరణములను జూపుటకు వీలున్నదా ?

"అన్నిప్రభృతులు సర్వనామంబులు" బా-ఆచ్ఛి-24.

అన్ని, ఇన్ని, ఎన్ని. కొన్ని, పెక్కు. పలు, ఆ, ఈ, ఏ, నా. మన. తా. సంఖ్యావాచకంబులు. అని సూరిగారి గ్రంథము ఇట "వికృతౌ సర్వనామా న్యన్నీన్నికొన్యెన్ని పెక్కుచ పల్వాయే (పలు-ఆ-ఈ, ఏ) నీనామనతా తద్వత్సంఖ్యార్థకా అపి" అనుకారిక కలదు.

అన్ని. ఇన్ని, ఎన్ని, కొన్ని, యను నీక్రమములో నున్నయెడల ఛందోభంగ మగు నని అన్ని ఇన్ని కొన్ని ఎన్ని యని కవిగారు మార్చుకొని యుండుట స్పష్టము. కారిక చూచినచో సూరిగారు మార్పవలసినప్రసక్తి యేమి గలదు ?

మూలకారికలోని మార్పువిషయ మిటుండ నిచ్చటియుదాహరణములఁ బరికింపుఁడు.

| బాలవ్యాకరణము— | హరికారికలు— |
|---|---|
| సర్వతావదర్థకము— | అందఱు అందోఱు అన్ని |
| అందఱు అందోఱు అన్ని | ఇందఱు— ఇన్ని. |
| ఇయదర్థకము. | అయమియదర్థః |
| ఇందఱు— ఇన్ని. | |
| కియద్యావదర్థకము. | ఎందఱు—ఎన్ని |
| ఎందఱు—ఎన్ని | అయంకియద్యావదర్థః |
| కతి పయార్థకము. | కొందఱు—కొన్ని. |
| కొందఱు—కొన్ని. | అయం కతిపయార్థః |

ఈసందర్భములో ఛందస్సునకై కారికలో 'కొన్యెన్ని' అని క్రమమును మార్చుకొనుటయు నుదాహరణములఁ జూపుటలోఁ దమకారికలోని వ్యత్యాసమును గుర్తింపక సూరిగారిక్రమముననే యనుసరించి యుదాహరణములఁ జూపుటయుఁ దేటపడుచున్నది. సూరిగారియుదాహరణములే యెదుట లేనిచోఁ దమకారికాక్రమమునకు విరుద్ధముగను సూరిగారిక్రమమునకు సరిపడునట్లును నీక్రమము వీరికెట్లు స్ఫురించును ?

"క్వొండొకచో నామ్వాదికనుమ్వాదుల మువర్ణంబులు పఙ్వర్ణంబులగు" (బా-సమా-19) అనుసూత్రములోని నామ్వాదికనుమ్వాదిపదముల పౌర్వాపర్యమును ఛందోనుకూలముగ మార్చి 'క్వచిత్సేఘుకనుమ్వాది నామ్వాదిగతమోః పపఙ్' అని రచించియున్నారు. సూరిగారే దీనిని జూచి యచ్చో గనుమ్వాదినామ్వాదుల యను నీక్రమముననే రచియించియుందురు గదా ?

కనుమ్వాదియనుదానికంటె నామ్వాదియనునది యల్పాచ్కమగుటచే నీద్వంద్వమున దానికే పూర్వనిపాత ముండవలయు ననియుఁ గారికలోఁ గనుమ్వాదిపదమునకుఁ బూర్వనిపాత ముండుట తప్పనియు భావించి సూరిగారే మార్చిరేమో యని శంకింపవలనుపడదు. "సముద్రాభ్రాద్ఘః" ,,లక్షణహేత్వోః క్రియాయాః" మున్నగుపాణిని సూత్రప్రయోగములంబట్టి పూర్వనిపాతప్రకరణ మనిత్యమని పాణినీయులసిద్ధాంతము గావునఁ గారికలోని ప్రయోగము దుష్ట మనుట కవకాశములేదు. కావున సూరిగారు మార్పవలసినపని యేమి ?

మఱియు నిచ్చట రెండుగ్రంథములలోని యుదాహరణములను ముఖ్యముగ గమనింపవలసియున్నది.

బాలవ్యాకరణము—
నాఁపచేను, పాఁపతేఁడు,
కనుపపులు, జనుపనార,
నాము, పాము, ప్రేము, వేము,
అమ్ము, ఎమ్ము, ఇవినామ్వాదులు.
కనుము, ఇనుము, ఉడుము, ఎనుము, జనుము, మినుము, ఇత్యాదులు కనుమ్వాదులు.

హరికారికలు—
నాఁపచేను, పాఁపతేఁడు.
కనుపపులు, జనుపనార.
నాము, పాము, ప్రేము, వేము.
అమ్ము, ఎమ్ము, ఇతినామ్వాదయః.
కనుము, ఇనుము, ఉడుము, ఎనుము, జనుము, మినుము, ఇత్యాదయః కనుమ్వాదయః.

ఇచటఁ గారికరచనమే మొదటిదైనచోఁ దమకారికలోని క్రమమునకు విరుద్ధముగ సూరిగారి క్రమమునకు సరిపడునట్లుగను గవిగారు నామ్వాదులను ముందుగను బిమ్మటఁ గనుమ్వాదులను జూపుటకు వీలున్నదా ?

బాల—త—18

మిత్రశరణ ప్రధానపాత్రాదులు మిత్రాదులు

అని సూరిగారు మిత్రాదిగణములోని శబ్దముల నీక్రమముగ నిర్దేశించియున్నారు. ఈ క్రమములో నున్నచో ఛందస్సునకానుకూల్య ముండదని

మెంచి కవిగారు "మిత్రం ప్రధానం శరణం పాత్ర మిత్యాది తద్గణః" అని మార్చియున్నారు. సూరిగారే యీకారికను జూచియున్నచో వారికి మార్పవలసిన ప్రసక్తి లేనందున మిత్రప్రధానశరణపాత్రాదులు మిత్రాదు లనియే వారు వ్రాసియుందురుగదా!

బాలవ్యాకరణము—

గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్తయగు నది ప్రేరణంబునం గర్మంబగు

బా-క్రి-123.

పొందు మొదలయినవి గత్యర్థకంబులు.
తెలియు మొదలైనవి బుద్ధ్యర్థకంబులు తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు. విను చెప్పు చదువు మొదలైనవి శబ్దకర్మంబులు.
అకర్మకంబులు ప్రసిద్ధంబులు.

హరికారికలు—

గతిబుద్ధ్యదనార్థేయేఽకర్మకాశ్శబ్దకర్మకాః, తేషామప్రేరణే కర్తా ప్రేరణే కర్మభావభాక్.
పొంద్వాదయో గత్యర్థాః
తెలియ్వాదయో బుద్ధ్యర్థాః
తిన్వాదయః అదనార్థాః
విను, చదువు, చెప్ప్వాదయశ్శబ్దకర్మకాః
అకర్మకాః ప్రసిద్ధాః.

వెనుకఁ జూపినమువువర్ణంబులకనుచో 'మువ్వోః' అనినచో వువర్ణము స్పష్టముగ నుండదని తలంచి 'వుమ్వోః' అనిమార్చినట్లే యిచటఁగూడ సూరిగారి క్రమము ననుసరించి 'విను చెప్పు చదువ్వాదయః' అన్నచో 'చదువు' అన్నదానిన్వరూపము సంధిలోఁ జెడునని యూహించి 'విను చదువు చెప్ప్వాదయః' అని కవిగారు మార్చియుందు రని తోఁచుచున్నది. మఱియు నిట సూరిగారి క్రమమును జూడకున్నచోఁ దమసూత్రములోని క్రమమునకు విరుద్ధముగను సూరిగారి క్రమమునకు సరిపడునట్లును నిచటి వివరణగ్రంథ ముండుటకు హేతువు గానరాదు.

రెండుగ్రంథములను సంబంధించిన విషయము లిటుండఁ గవిగారిజీవితచరిత్రలో మఱొక్కయంశము గలదు.

అశ్వశాస్త్రరచన.

"ఈకృ. కవి మాడుగులలో నుండఁగాఁ గృష్ణభూపతియొక్క మోహపుత్రుఁ డగుజగన్నాథుఁ డనునతఁ డొకగుఱ్ఱముం దీయుటకు యత్నింప దానికి నశ్వశాస్త్రవేత్తలు [illegible] గలదనియు వది యొకదోష

మనియుఁ జెప్పిరి. అయినను నాగుఱ్ఱముయొక్క పొంకమును సురూపముం జూచి జగన్నాథుఁ డద్దానిని వదలలేక యాకృ.కవికిఁ గనుసైగ జేసి, కృష్ణభూపతితో నీకృ.కవియును అశ్వశాస్త్రములో మిగులఁ బండితుఁడు. వారికడ గ్రంథము లేనైన నుండును. వారియభిప్రాయము నరయుట మంచి దని విన్నవిప నటులైన మీకడ నుండుగ్రంథముం దెప్పింపుఁ డని కృష్ణభూపతి కృ. కవికిఁ జెప్పెను. అపుడు కృ.కవి తాను మఱునాఁడు దర్శనమునకు వచ్చినపుడు తెచ్చెద నని విన్నవించెను. అంతట నీజగన్నాథుఁడు కృ.కవి యింటికిఁ బోయి తన కాగుఱ్ఱముం గొనిపించునట్లు గ్రంథముఁజూపించిన విశేషధన మొసంగెద నని చెప్పిపోయెనఁట. దానికిఁ గృ.కవి సమ్మతించి రాత్రి భోజనముచేసి తనదౌహిత్త్రుండగు కృష్ణమూర్తినామునిం బిలిచి ప్రాతతాటాకుల యలేఖములం దెమ్మని చెప్పి వాని నొకగ్రంథములో మధ్యనిమిడించి సంస్కృతముతో నారదమహాముని యొకరాజన్యునకుఁ జెప్పిన ట్లశ్వశాస్త్రసంప్రదాయము లన్నియుఁ బుంఖానుపుంఖములుగ మూఁడునాల్గువందలశ్లోకములు చెప్పి తెల్లవాఱుసరికి గ్రంథము సిద్ధముచేసి దానికి వర్ణము వేసి ప్రభువునకుం జూపించెనట. అట్టిగ్రంథము వినుట కందఱు నద్భుతమందిరి. అందు గుఱ్ఱములకు గోఁగు కల్గియుండిన దానివలన దోషము లేకుండుట యే కాక గుణవిశేషములు కూడఁ బెక్కులు కలవని సూచింప దానికి సభవారందఱు నంగీకరించి యాగుఱ్ఱమును విలిపించి యాముహూర్తముననే జగన్నాథుని దానిపై నెక్కించి రఁట. పిమ్మట జగన్నాథుఁడు మిక్కిలి సంతసించి కృ. కవికి విశేషబహుమానంబుల నిచ్చె నఁట. ఈకథ నంతయు నారాత్రి కృష్ణమూర్తి కవియున్న స్థలములోనే కూర్చుండి కృ.కవివలన నాచమత్కృతిఁజూడఁ గోరఁబడినట్టియు నపుడిరువదిసంవత్సరముల వయస్సులో నుండియు నిపుడేఁబదిసంవత్సరముల వయస్సులోనుండు నాస్నేహితు లొకరు చెప్పుటచే దీని నిందుఁ బొందుపఱిచితిని" అని కవిజీవితములలో గురుజాడ శ్రీరామమూర్తిగారు వ్రాసియున్నారు. (చూ-కవిజీవితములు-4౨౯ పేజి.)

పూర్వోదాహృతము లగునంశము లన్నియు బాలవ్యాకరణమే ప్రాథమిక మని స్థాపింపఁజాలియుండుటవల్లను, సూరిగారు విద్వాంసు లని పండితపరంపరాయాత మగు ప్రసిద్ధి యుండుటవల్లను, నాంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమువారు ప్రచురించిన సూరిగారిజీవితచారిత్రమును బట్టియు, సూరిగారు

రచించిన నిఘంటువును బట్టియు, వీరిట్టివ్యాకరణ గ్రంథమును స్వతంత్రముగా రచించుటకు సమర్థులని స్పష్టముగాఁ దెలియుచుండుటవల్లను, బూర్వోదాహృత మగునశ్వశాస్త్రకథనుబట్టి కవిగా రిట్టిగ్రంథకల్పనము చేయఁ గలిగినవారని స్పష్టపడుచుండుటవల్లను, హరికారికలకు బాలవ్యాకరణమే మూలమని నాయభిప్రాయము.

ఈవ్యాసములోని యంశములన్నియు సావధానముగఁ బరికించి మున్నీచర్చను వెలువరించిన కల్లూరి వేంకటరామశాస్త్రులవారును నితరవిమర్శకులును దమహృదయములకు స్ఫురించిన తత్త్వమును వెలువరింతురుగాక—

అవిసంవాది సల్లోకప్రసిద్ధం మహతాం యశః
నయ తేతఖలీకర్తుం ప్రమాణై రుపబృంహితమ్॥

# కరుణరసము.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

బృందావనవిహారియగు వల్లవీంద్రుడు పొన్నగున్ననీడను నిలచి వేణునాళమును జేబట్టి పూరించినతోడనే యామ్రోత సప్తస్వరమండితమై యుల్లములఁబల్లవింపఁజేయనగు లోకమోహనగానముగా మాఱి సకలచేతనసృష్టినెట్లు తాఱుమాఱుచేయఁగల్గెనో, యటులనే సారస్వతవిపినసంచారి యగు కవీంద్రుఁ డున్నతసాహితీరసాలచ్ఛాయ నాసీనుఁడై కలపుగొట్టమును గైకొని లిఖించిన వెంటనే యామ్రోత నవరసభాసితమై మ్రోడులను గూడ వికసింపఁజేయఁజాలు కవితాసుధాధారగాఁ బరిణమించి విబుధలోకమును దబ్బిబ్బు చేయుచున్నయది.

కవిచంద్రుల వాగమృతమునందు లోకమోహనశక్తియే లేకున్న దరిలేని వియోగదుఃఖపయోధిమధ్యమునఁ బడి యవియఁచున్న జనుల కఠోర విలాపములు కర్ణసుఖదములై పాఠకుల యంతరాత్మల నానందార్ణవమున నెట్లోలలాడింపఁగలవు ?

బ్రహ్మవేత్త యగు వరగురుఁడు సర్వవస్తువులయందును నాత్మస్వరూపమును బ్రత్యక్షము చేయు కరణి, శబ్దబ్రహ్మాభిజ్ఞుఁడగుకవివరుఁడు సమస్త రసములయందును నానందమును గోచరింపఁజేయఁగలఁడు. అట్టిరసములలో నుత్తమతమతానిర్ణయము చేయవలసి వచ్చినప్పుడు కరుణరసము సకలరససార్వభౌమమని చెప్పుటయే యీవ్యాసోద్దేశము.

మహోన్నతకవితాఘనగిరితటమున జనించి వ్యంగ్యభంగీతరంగవిలసితములై తమ్మాశ్రయించువారి నానందరత్నాకరముఁజేర్చు నవరసతరంగిణులలోను కరుణరసవాహిని దైర్ఘ్యవైశాల్యగాంభీర్యమాధుర్యాదులయందసమానమై వెలయుచున్నది. మానవమానసకేదారముల ఘనభావసస్యసంపదల ఫలింపఁజేయుసార మీశైవలినీపయఃపూరమునకున్నట్లితరరసనదీజలౌఘమునకు లేదు. బాలుఁడు మొదలు వృద్ధుఁడు వఱకును గల మనుష్యసమూహ మొక్కపెట్టునఁ దనయందు లయమై సుఖపారవశ్యము నందునటులఁ జేయుటలో నీకరుణరస మెల్లరసములలో నగ్రస్థాన మలంకరించియున్నది. లలితకళలలో గానకళవలె రసములలోఁ గరుణరసము సర్వజనహృదయాకర్షకమై తేజరిల్లుచున్న దన్నమాట రసరహస్యవేదులకుఁ దెలియనిదికాదు.

శృంగారరసమును వర్ణించి యానందమును బుట్టించుట పెరుగును జిలికి వెన్న ను దీయుటవంటిది. కరుణరసమును వర్ణించి సంతోషమును నుద్భవింపఁజే యుట నీరమును మథించి యమృతమును జనింపఁజేయుటవంటిది. ఈయమృ తసారమును జదువరులు జక్కగ ననుభవించుటలోనే కష్టమున్నప్పుడు దాని సరసముగ సమకూర్చుటలో కవివరులకుఁగలుగు శ్రమను గూర్చి శంకింప నగత్యములేదు.

కరుణరసవిలసితములగు కావ్యములఁ బఠించునప్పు డుదయించు భావ ములకును, శృంగారరసభాసితములగు కబ్బములఁ జదువునపుడు పుట్టుతలఁపు లకును గల తారతమ్యమును బాఠకులు బరిశీలించినచో బాగుగ గమనింపఁ గలరు. శాకుంతలమున ద్వితీయతృతీయాంకములలో శృంగారనాయకుఁడుగాఁ జిత్రింపబడిన దుష్యంతుని రూపమును, నాగానందమునఁ జతుర్థపంచమాంక ములలోఁ గరుణనాయకుఁడుగా వర్ణింపబడిన జీమూతవాహనుని రూపమును నొక్కసమయమునఁ జూచినచో దుష్యంతాకారముకంటె జీమూతవాహన రూపము జూపరుల నెక్కుడుగ నాకర్షించుననుటకు సందియము లేదు. శృం గారచేష్టలకన్నఁ గరుణవిలసనములు హృదయపరివర్తనమునకు ముఖ్యతమసా ధనములు. కవి యారితేరిన యనుభవజ్ఞుఁడు గాకున్నచోఁ గరుణరసమును మనోహరముగ వర్ణింపనేరఁడు. శృంగారవర్ణనమున కంతటిపరిపాక మగత్య ములేదు. కావుననే లోకమునఁ గరుణరసప్రబంధములు కొలఁదివిగను, శృం గారకావ్యము లమితములుగను గన్పట్టుచున్నవి.

గుణజ్ఞుఁడగు వైద్యశిఖామణి కటువులగు వస్తువులను గూడ ద్రాక్షార సాదులలోఁ గలపి పాకమొనర్చి రుచ్యమగు రసాయనముగ మార్చి భౌతిక దేహసంపద సంఘటింపఁజేయు నటుల రసజ్ఞుఁడగు కవివరేణ్యుఁడును దుర్భర ములగు వియోగములఁగూడ జక్కని భావములతోఁ జేర్చి మనోహరమగు కావ్యముగా మార్చి యాత్మానందభాగ్యమును సమకూర్చుచున్నాఁడు. కాని భిషక్కవు లిరువురును నేర్పరులు కాకున్నచో వస్తుశుద్ధియుఁ బాత్రనిర్మలతయు లేక రసాయనపాకముచెడి యెట్లారోగ్యహంతకమగునో, యటులనే పదార్థ శుద్ధియుఁ బాత్రౌచితియు లేక రసపాకముకూడఁ జెడి యానందభంజకమగును.

శృంగారరసమునుండి జనించు సంతోషకుముదమును వికసింపఁజేయు టకును కరుణరసమునుండి యుద్భవమగు నానందారవిందమును బ్రకాశింపఁ

జేయుటకును జాల భేదమున్నయది. ఈరసపరిణామనైపుణ్యము సామాన్యకవి జనదుర్లభము. ద్రుపదాత్మజ నిజకళ్యాణసమయమున స్వయంవరమంటపమున నిలచి పూలదండను గరమునఁ గీలించి యచట నాసీనులై యున్న రాకొమరులఁ గలయఁజూచునపుడు పఱపిన మురిపెంపు చూపుల సోయగమును బలకపై వ్రాయు చిత్రకారుని కుంచె చురుకుగా సాగుచుండును. ఆసొగసును గాగితముపైన్వ్రాయు కవివరుని కలము వేగముగ బోవుచుండును. ఆ రమ్యతను రంగస్థలమునఁ బ్రదర్శించు నటశేఖరుని యభినయము త్వరితముగ నడచుచుండును. కాని యాపాంచాలియే ద్యూతాంతమున రాజసభాభవనమున నేకవస్త్రయై నిలచి దుశ్శాసనాకృష్టమగు చీరను గట్టిగాఁ జేబట్టి భీష్మాదిసభ్యవరులపైఁ బ్రసరింపఁజేసిన కరుణావలోకనరమ్యతను బటముపైఁ జిత్రించు రూపనిర్మాతశలాక మునుపటివలెఁ జురుకుగా ముందునకు బోవక యాగి సాగుచుండును. ఆసౌందర్యమును కావ్యమున వర్ణించు కవిశేఖరుని కలము పూర్వమువలె వేగముగాఁ జనక ప్రతిపదమునను నిలచి నిలచి జరుగుచుండును. ఆసొబగును నేపథ్యమునఁ జూపు కుశీలవుని యభినయము వెనుకటివలె ద్రుతగతి లేక మందముగా మెలఁగుచుండును.

కొందఱు శృంగారమునకు రసములలో నగ్రస్థానము నొసగుచున్నారు కాని యట్లు చేయుట న్యాయము కాదు. ఏమందురా బాలాదిసర్వజనీనమగు నానందజనకత కరుణ నున్నయటుల శృంగారమున లేదు. బాల్యయౌవనకౌమారవార్ధకావస్థల నన్నిటను గరుణకుఁ బ్రచారము కలదు. శృంగారమునకో యౌవనకౌమారముల యందుమాత్రమే ప్రమేయము కలదు.

అఖిలరససార్వభౌమమగు కరుణరసము యొక్క యథార్థరూపమును మనసు కరుగునట్లు సుందరముగ వర్ణించినవాఁడే కవిచంద్రుఁ డనదగియున్నాఁడు. కరుణరసవర్ణన మత్యున్నతమగుటచేతనే ,,ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే ,, అని భవభూతి మహాకవి యుత్తరరామచరితమునఁ గరుణరసమును బహు నిపుణముగ వర్ణించుటచేఁ గాళిదాసునికన్న మిన్నయని లోకప్రసిద్ధి వచ్చినది.

సర్వమానవ మానసలోహములఁ గరగించి యానందరూపములుగా బోతపోయుటలోఁ గరుణరసమునఁ గలదీప్తి యితరరసముల నంతగాఁ గాన

రాదు. శృంగారగీతములకన్న భక్తిభరితములగు కృతులు శ్రోతల నెక్కుడుగ నానందింపఁ జేయఁగలవు. ఇందుకుఁ గారణము భక్తియందుఁ గరుణరసము నిండియుండుటచేతనే. భక్తిశిఖామణి యగు త్యాగరాజులవారి కృతుల విను నపుడీ యానందస్వరూపము ప్రత్యక్ష మగుచుండుట లోకవిదితమే,

ఆలంకారికులు కొందరు విప్రలంభమునంతను శృంగారమున కర్ధదేహముగా వర్ణించిరి. కాని పరిశీలించి చూడ కరుణవిప్రలంభమునకు శృంగారముతోఁ జేరికకన్నఁ గరుణతోఁ గలయిక హెచ్చుగాఁ గానవచ్చును. కావున గరుణవిప్రలంభమును గేవలశృంగారాంగముగఁ దెలుపుట కంటెఁ గరుణకరణముగ నిశ్చయించుటయే సమంజసమని తోఁచుచున్నది. కరుణవిప్రలంభవర్ణనము వలనఁ గరుణోదయమగురీతిని శృంగారావిర్భావము కానేరదు. కరుణరసమును వియోగమనియు, విరహమనియు ద్వివిధముగాఁ జెప్పనగును. వియోగమన నిష్టవస్తువినాశజనితము విరహమన నిష్టవస్తుతీవ్రవిశ్లేషసంభవము. రఘువంశము నందలి యెనిమిదవసర్గలోని యజునియవస్థ వియోగకరుణరసజనకము. శ్రీమద్రామాయణములోని యరణ్యకాండము నందలిరాముని యవస్థ విరహకరుణరసజనకము వియోగకాలమునను విరహసమయమునను నాయకునకుఁ గలుగునది శోకమే.

వియోగకరుణరసము యొక్క ఘనతను తెలియఁజేయుటకు కవిసార్వభౌముఁడగు కాళిదాసునిచే రఘువంశకుమారసంభవముల యందు వర్ణింపఁబడిన యజరతీవిలాపముల యొక్క భావములఁ జదువరులకు బోధపడుటకై యాక్రిందఁ బొందుపఱచుచున్నాను. ఈయుభయవిలాపములఁ జదువునపుడు దుర్భరవియోగసమయమున స్త్రీపురుషులెట్లు సంతాపభాషితములఁ బలుకుదురో యాతారతమ్యము కరతలామలకమట్లు భావగోచరమై కన్నుల నానందబాష్పములు గ్రమ్ముచుండును. మఱియు వీనిఁ జదువునపుడు కరుణరసవర్ణనమునఁ గాళిదాసుఁడు భవభూతికిఁ దీసిపోవువాఁడు కాఁడనియుఁ బరిశీలించినచో భవభూతికంటెఁ శ్లాఘుడని కూడ చెప్పవచ్చుననియు నూహ లుదయించుచుండును. కావునఁ బాఠకులు వానిఁ బరిశీలనముతోఁ బఠింపఁగోరుచున్నాను.

## అజవిలాపము.

సూర్యకులావతంసుఁడగు నజమహారాజు శైశవమున సకలవిద్యావైశద్యమును సమగ్రముగ సాధించి నవయౌవనసంపన్నుఁడై సుగుణరాశియనియు, సౌందర్యనిధియనియు బ్రసిద్ధిగాంచిన విదర్భరాజానుజయగు నిందుమతిని స్వయంవరమునఁ బరిణయమై యాసుందరాంగిని స్వమందిరమునకుఁ గొనివచ్చి నిస్సపత్నముగాఁ బ్రియపత్నీసమాగమసంతోషముల ననుభవించుచు వనవిహారకుతూహలియై యొకవసంతవాసరమున నిందుమతితో నారాజేంద్రు డుద్యానమున కేగి వనవీథుల విహరించి కొంతవడి కొక వివిక్తరమణీయపేశలశాద్వల దేశమున నాసీనుఁడై నెచ్చలితో నేవియో యనుభవరుచ్యములగు ముచ్చట లాడుచుండెను.

అంత నాకసమునుండి యాకస్మికముగా నొక దివ్యసుమమాలిక యాశుకవాణియురమునఁ బడ వెంటనే యాకోమలాంగి గతజీవితయై నిజవల్లభునివక్షముపై నొరగెను. ఇట్లు హఠాత్తుగా రాహుస్పర్శముచేఁ జంద్రికావిరహితమగు నిందుకళ నభస్స్థలమునుఁ బోలె సుమాహార సంసర్గముచే జీవకళావిరహితయై తనయురమునఁ బడియున్న యిందుమతి నీక్షించి యాకువలయేశుఁ డిట్లు విలపింపసాఁగెను.

## రతీవిలాపము.

సురహితకార్య సాధనాభిలాషచే గుసుమశరుఁడు ప్రియసఖుఁడగు వసంతునితోఁ గూడి హిమనగకాననాంతరసీమను దపమాచరించుచున్న నాగరాజభూషణునకు నగరాజ సుతపై ననురాగబీజ మంకురింపఁ జేయఁగోరి చలిమల కేగునపుడు పతిగతియగు రతియు నిజవల్లభునితో నుల్లాసముగ సహజసుందర తుషార శైల విపినభూముల విహరింపఁ గోరి యాచంచలాక్షి పంచబాణునితో మంచుమల కేగెను

ఇట్లు రతీవసంతులతో మనసిజుఁ డటకుఁబోయి చలిగాలులచే జొరవీలుకాని హిమగిరిదరిని దేవదారు ద్రుమచ్ఛాయను తుహినోపల వేదికపై వ్యాఘ్రాసనమున సకలేంద్రియముల నిరోధించి యాత్మానంద సంధానసమాధిమగ్నుఁడై రెండవ హిమాచలశిఖరము వలెఁ దేజరిల్లుచున్న చంద్రమౌళిని గాంచి యాతుంటవిలుకాఁడు పొంచి యమ్ములపొదినుండి యెంచి యొకమంచి బాణమును దీసి యాముక్కంటిపై విడువ వెంటనే భవనేత్ర

## అజవిలాపము.

కోమలములగు కుసుమములుగూడ సోకినమాత్రమున జీవులఁ గూలఁద్రోయు సామర్థ్యము కలవియే యగుచో అయ్యో! హంతకుఁడగు నాకృతాంతున కీలోకమున నెద్ది మారణసాధనము కాకుండును ?

కాదు కాదు. నేనిట విధిని దూఱరాదు. ప్రాజ్ఞుఁడగు నాహంతకుఁడు సుకుమార వస్తువుల మృదుసాధనముల తోడనే హతమొనర్చును. నన్నునిమంచుతుంపరలచే విపన్నయగుచున్న పద్మిని యిందుకు నిదర్శనము.

కాని నిజముగాఁ గోమలసుమదామమే నా ప్రియాప్రాణహారి యగుచో నది నాహృదయముపైఁ బడినపు డేల నన్నుఁ జంపదాయె? కాని యిట్లు శంకింపఁజనదు. ఈశ్వరేచ్ఛచే నొకపుడు విష మమృతముగను వేఱొకసమయమున నమృతము విషముగను మాఱుచుండును.

లేదా నా భాగ్యలోపముచే విధి యీమృదుసుమహారమునుకులిశముగాఁ జేసియుండును. అదేమిచిత్రమో.

సంజాతవహ్నికీలలు రతీకాంతుని భస్మావశేషునిగాఁ జేసెను. ఇట్లవితర్కితముగా భస్మరాశియై పడియున్న నిజవల్లభు నీక్షించి రతి యిట్లు విలపింపఁ దొడఁగెను.

## రతీవిలాపము.

ఓ జగన్మోహనా ! సౌందర్యాతిశయమున నేనీరూపము విలాసవంతుల కుపమానముగా వెలయుచుండెనో అట్టి నీమనోహరాకార మిట్టి దుర్దశ నందియుండ నాడెందము వ్రక్కలగుట లేదేమి ? ఆహా ! కాంతలతికఠినస్వాంతలు గదా.

ప్రాణేశ్వరా! భగ్నసేతుబంధమగు వారిపూర మనన్యగతికమగు పద్మినీలతిక నట్టేవీడి పారిపోవునట్లు త్వదాయత్తజీవితనగు నన్ను విడచి క్షణభిన్నస్నేహపాశుఁడవై యెటకుఁ బర్విడితివి ?

ఓ ప్రియవల్లభా ! నీవు నాకెట్టి యప్రియమును జేసియుండలేదు. నేనును నీకెట్టి ప్రతికూలమును నాచరింపలేదు. అట్టి తఱిని నిష్కారణముగా నీకై విలపించుచున్న యీరతికి నీదర్శన మీయకుంటకుఁ గారణమేమి?

ఓస్మరా ! నీవు నన్నన్యకాంతల పేరెత్తి పిలచినపుడు నాచేఁ జేయఁబడి నమేఖలాబంధములను స్మరించి యిట్లు

కాని యీకుసుమాశని చెట్టనంటియు
న్న లతికను హత మొనర్చెనే కాని
తదాశ్రయమగు మహీరుహమును మ
డియింపదాయె !

ఓదయావతీ ! నేను సాపరాధుఁడ
నైనను ప్రేమించి పలుకరించు మృదుల
స్వాంత వగు నీవు నేఁడేల నిరపరాధి
యగునీదీనునితో మాటలాడకుంటివి?

ఓ సుచిస్మితా ! నీవు నన్ను శఠుని
గను, కృత్రిమమిత్రునిగను నిశ్చయించి
యుందువు. అటులఁ గాకున్న నన్నడు
గకయే యీలోకమునుండి పరలోక
మున కేలపోయెదవు?

ఈనాహతజీవితము మొదట నా
దయిత వెంటనంటి పోయి తిరుగ నే
హేతువుచే మరలివచ్చినది? సరే! ఈ
యవివేకకృత్యముచే నిది దుర్భరదుఃఖ
దావాగ్నికీలలఁ బడి తపించుగావుత!

ప్రాణేశ్వరీ! సుమవన విహారముచే
నీ వదనసరోజమున జనించిన స్వేద
బిందులవము లాఱకముందె నీవ స్తమిం
చితివి. యిస్సీ! సారహీనమగు నీయ
స్థిరదేహసంపద నాసింపరాదు.

విదుషీమణీ! మున్నెన్నడును మన
ముఁగూడ నీక ప్రియము [illegible]

చేసితివా లేక కేసరవిరహితములై
పరాగపటలముచేఁ గన్నుల నొప్పించు
నవతంసోత్పల తాడనములఁ దలచి
యిటు లొనర్చితివా ?

ఓసుందరాంగా ! నేను నీహృద
యములో లీననై యుంటినని నాతో
నీవన్నమాట బూటకము. తప్పక
యిది నన్ను సంతోష పెట్టుటకన్న
కల్లబాసయే. అట్లుకాకున్న నీవనంగు
డవైయుండ రతి యక్షతనై యుం
డుట యెట్లు పొసగును ?

ఇపుడె పరలోకమునకేగిన నిన్ను
నేను వెంటనే కలసికొందును కాని
దేహధారులసుఖములు నీయధీనము
నములగుటచేఁ బాపము మారహారి
యగు మురహారునిచే లోకులు వం
చింపఁబడిరనుటకు సందియము లేదు.

ఓ సదయా! నిశీథసమయమునఁ
దిమిరాచ్ఛాదిత మగు దుర్గమమార్గ
మున ఘననినదభీతలగు నబలలఁ బ్రి
యమందిరముల క్షేమముగాఁ జేరుట
కు నిన్నువినా వేఱెవరు సమర్థులు?

నేత్రముల నెఱ్ఱబార్చి భ్రమింపఁ
జేయుటకును మాటిమాటికి మాటలఁ
దబ్బిబ్బుఁజేయుటకును సమర్థమగు నా
సవామోదము నీవులేనినాడు మదవ
తులకు నిరర్థకము.

ఓయనంగా! నీనర్మసఖుఁడగు చం
ద్రుఁడు బంధుప్రియుఁడవగు నీవ స్తమిం

తెలియఁగనట్టి స్థితిలో నన్నేల విడచి పోతివి? నేను నామమాత్రముచే క్షితిపతిని. నానిష్కళంకానురాగ మన్ననో నీయందే కలదు.

ఓ మోహనాంగీ! సుమాళిభూషితములును, సువల్లీవిలసితములును, వరాళిసదృశములును నగు నీలలితకుంతలములఁ గదల్చుచున్న గంధవహుఁడు నాకు నీపునస్సమాగమాభిలాష నంకురింపఁ జేయుచున్నవాఁడు.

కావున నో ప్రాణేశ్వరీ! నిశాసమయమునఁ దుహినాచలగుహాగతతిమిరపటలమును నోషధికాంతులు దొలఁగించు రీతిని నీసుభాషితసుధావర్షధారలచే నాహృదయమునఁ గ్రమ్మియున్న విషాదవిషమోహమునుదొలఁగింపఁజేయుము.

వితతకుంతలాలంకృతంబును, గళితసంతసాలాపమునగు నీవదనముకురము తమీనిమీలితమును విరతషట్పదనాదమునగు పంకజము బలె నన్నుఁ బరితపింపఁ జేయుచున్నయది.

శుభాశయా! శర్వరి చంద్రుని, జక్రవాకి రథాంగమును, దిరుగఁ జేరును గావున వానికి విరహము సహ్యమగును. కాని, పునస్సమాగమాభావ దుర్భరమగు నీవియోగము నాకెట్లు సహింప శక్యమగును?

ఓ శుభగాత్రీ! ఏ నీకోమలతరదేహమునకు నవపల్లవకల్పితపేశలతల్ప

చుటను దెలసికొని విఫలోద్యముఁడై శుక్లపక్షమునఁ గూడ నిజకార్యము నతిదుఃఖముగా విడువఁగలఁడు.

ఓ వీరశిఖామణీ! హరితారుణవృంతవిలసితమై, పుంస్కోకిలకలకూజితసూచితమై, వెలయు క్రొత్తమావిపూవీక నెవనికి బాణము కాఁ గలదో చెప్పుము!

ఓ వల్లభా! నీచే ననేకపర్యాయములు, కార్ముకగుణకృత్యమున సమకూర్పఁబడిన యీయళిపాళి తనకరుణనాదములచే దుస్సహశోకపీడితనగు నాతో సమముగా విలపించుచున్నట్లున్నయది.

ఓ కాంతుఁడా! తిరుగ నీమనోహరరూపమును జేకొని లేచివచ్చి మధురాలాపముల నిసర్గపండితయగు నీపికసుందరిని రతీదూతీకార్యముల నియోగింపుము.

ఓ సరసుఁడా! నమస్కారపూర్వకముగా సంపాదింపఁబడి ఘనానురాగకంపితములై వెలయు నీగాఢాలింగనములను నిరుపమానములగు నీశృంగారచేష్టలను దలఁచి నాడెందము దహించుచున్నయది.

ఓ రసికుఁడా! నీచే స్వీయముగా వాసంతీ [illegible] రచియింపఁబడిన

ము కూడఁ బరితాపకరమగుచుండెనో యట్టి నీసుమసమగాత్రమును నేనెట్లు కఠినతమకాష్ఠములపై నిడఁగల్గుదునో తెల్పుము.

ఓ ప్రియభాషిణీ! నీ కత్యంతరహస్యసహచరియగు నీరసనావధూటి గతజీవితవగు నిన్నుఁ జూచి దుఃఖితమై నీతోఁగూడ నిశ్శబ్దముగా నీరసించిన దనుటకు సంశయింప నగత్యము లేదు.

ఓ దయావతీ! నీవు స్వర్గగమనోత్కంఠవయ్యు నాయెడ జాలికలదానవగుటచే నాకు సంతోషమును గలిగించు నభిలాషతోఁ గోకిలలయందుఁ గలభాషితములను, గలహంసలయందు సుందరగమనములను, మృగీగణములయందపాంగావలోకనములను, పవనకంపితోపవనలతలయందు విలాసములను, నుంచి దివి కేగితివి. కాని నీ వియోగ దుస్సహదుఃఖపంకమగ్నమగు నాహృదయము నివెవ్వియు నుద్ధరింపఁ జాలవని తలఁపనేరవైతివి.

ప్రియసఖీ! ఈమావిగున్నయు నీగురివింతతీవెయు నీచే దంపతులుగా నిశ్చయింపఁబడినవి కదా! అట్టితరి నీలతావిటపములకుఁ బరిణయోత్సవము జరుపకయే పరలోకమున కేగుట నీపట్టి పూఁబోఁటికిఁ బాటికాదు.

ఓకుటిలకుంతలా! ఈయశోకలతిక నీచేఁ గృతదోహదమై పుష్పింపఁబో

సుమాలంకార మట్లనే నిలచి యున్నది. కాని నేత్రానందమును సమకూర్పు నీమనోహరదేహము మాత్రము కానవచ్చుట లేదు.

ఓ ప్రియసఖా! నిర్దయులగు నిర్జరులచే నీవు ప్రారంభించిన నావామచరణాలంకార కార్యము పూర్తికాకమున్నే పిలువఁబడితివి. కావున తిరుగ వచ్చి యాపాదమును లాక్షారాగరంజితముగఁ జేయుము.

ఓ జీవితేశ్వరా! స్వర్గమున నీవు జాణలగు సురరమణుల దృగ్బాణములకు గోచరుఁడవగుటకుఁ బూర్వమే పతంగమార్గమున వచ్చి తిరుగ నేను నీయుత్సంగమునఁ గూర్చుండెదను.

ఓ మనోహరా! నేనీప్రదేశమును వీడి పరుగిడి పరలోకమున నిన్నుఁ దప్పక కలసికొందును కాని రతి పతివిరహితయై క్షణకాలము జీవించి యున్నదను నపవాదము నా కీలోకమున సుస్థిరమై యుండును.

ఓ ప్రియవల్లభా! ఇట్లు తలఁపని తలంపుగా శరీరజీవితములతో నాకు

వుచున్నయది. ఆహా! నీలలితాలక ములనలంకరింప నర్హములగు నీయశోకప్రసూనముల నేనెట్లు నీకు నివాపదానముగాఁ గూర్పఁగల్గుదును?

ఓ సరసిజచరణా! తదితరతరుదుర్లభములగు నీమంజుశిఞ్జితనూపురసుందరచరణాను గ్రహాతాడనములఁ దలచి యీయశోకపాదపము శోకమునొందుకొనఁ జాలక సుమబాష్పముల రాల్చుచున్నట్లున్నది కనుము.

ఓకిన్నరకంఠీ! నీనిశ్వసితము ననుకరించు నీవకుళకుసుమములలో మనచే రచింపఁబడుచున్న విలాసమేఖలాకార్యము పూర్తిచేయకయే నీవు నిద్రించుట యేల? ...

ఓబంధుప్రియా! నీతో సమశోకముగల సఖీజనమును, నీవలె సమానానురాగినైన నన్నును, బాలేందుసుందరుఁడగు నిజనందనుని, నొక్కపెట్టున వీడి నీవు త్రిదివమునకుఁ బోవుటచూడఁ గ్రూరతరస్వభావవనితోఁ చుచున్నది.

సారి పరలోకమున కేగిన నీకు నే నెట్లవసానాలంకారములనొనర్పఁగలను!

అయ్యయ్యో, ఇక్షుశరాసనమును తొడపై నిడికొని చూతబాణమును సవరించుచు మాధవునితో నీ వాడిన మందస్మితసుందరములగు మధురాలాపములను వరరాగాంచితములగు క్రీగంటిచూపులను స్మరించుచు నేయుంటిని.

ఓ ప్రియుఁడా! నీకుఁ గుసుమబాణముల సమకూర్చు నీ యాంతరంగికసఖుఁడగు వసంతుఁడేడ? ఒకచో నతఁడు గూడ నీవలెనే తీవ్రకోపియగు త్రిపురారిచే భస్మీకృతదేహుఁడాయెనా యేమి?

ఈరీతి రతీ దీనపరిదేవనాక్షరములు విషలిప్తశిలీముఖములవలె హృదయము నొప్పింప వసంతుఁడాయాపన్ను నూరడింపఁగోరి యాసాధ్వికిఁ బ్రత్యక్షమాయెను. అంత నాకాంత వసంతు నీక్షించి దుఃఖమినుమడింపఁ గరముల నురమును బాదికొనుచు నధికముగా విలపింపసాఁగెను. నిజమే దుఃఖమాప్తులు గంటఁబడినతోడనే తలుపు తెఱచినట్లు వెలికిఁ ద్రోసికొనివచ్చునుగదా! పిమ్మట శోకాకులిమానసయగు నారతి వసంతునికడ నిటుల విలపింపఁదొడఁగెను.

ఇపుడు నాధృతి చెడిపోయినది. ... ఓమాధవుఁడా! నీమిత్రున కెట్టియ

నా ప్రేమ శూన్యమైనది. నాగానము డిగిపోయినది నాకీమనోహరవసంతకాల ముత్సవరహితమైనది. నాకీయాభరణధారణము నిష్ప్రయోజనమైనది. నాకీశయనమందిర మానందశూన్యమైనది.

ఓప్రాణేశ్వరీ! నాగృహలక్ష్మియు నాహితబంధువును, నానర్మసఖియు, లలితకళాభ్యాసమున నాప్రియశిష్యయు, నిన్నపహరించిన నిర్దయదైవముచే నొక్కమారపహరింపఁబడెను.

వస్థ తటస్థించినదో కంటివా? ఆతని మనోహరదేహము కపోతపోతకర్బుర మగు భస్మముగా మారి గాలిచే నెగరగొట్టఁబడుచున్నది. చూడుము.

ఓ ప్రియసఖుఁడా! ఈలోకమున మగవారికి సుహృజ్జనులపైఁ గల ప్రేమ యబలలమీఁది యనురాగమువలె నస్థిరము కాదు. కావున నీదర్శనోత్కంఠితుఁడైయున్న వసంతునకు నీమోహన దేహమును జూపి సంతసింపఁజేయుము ఈచెలికాఁడు నీకు బాసటనై తామరదారమునారిగాను పేలవప్రసూనాళి బాణపాళిగాను గలిగి వెలయు నీచెఱుకువింటియానలకు లోకమునఁ గల సురాసురవీరవారమెల్ల లోఁబడునట్లు చేసిన పూర్వవృత్తముల మఱవఁబోకుము.

ఓమాధవుఁడా! వాతాహతదీపము పగిదినీమిత్రుఁ డస్తంగతుఁడయ్యె. తిరుగ రాజాలఁడు. ఆహా! నేనాయాఱిపోయినదీపపువత్తివలె దుస్సహావేదనాధూమితనై నిలచియుంటిచూడుము.

ఓసౌమ్యుఁడా! మీనకేతనహననసమయమున నన్నువిడచిన విధిచే నసమర్థవధ యాచరింపఁ బడినది. నిరపాయమగు నాశ్రయద్రుమము గజభగ్నమైనచో దాని నల్లుకొనియున్న వల్లికిఁ బతనమే గతియగును.

కావున నోదీనజనశరణ్యా! ప్రియవియోగఖిన్న నగు నాకు నగ్నిసంస్కారమొనర్చి నాకుఁ బతిసమాగమసుఖ మొడగూర్చి నీసుహృజ్జనసాహాయ్యతను బ్రకటింపుము.

వెన్నెల చందురుని వెంటను తటి ల్లత మేఘునితోడను బోవుటనుజూడ మానినులు మగలదారి నేగవలయు నన్న మర్యాద యచేతనజాతికిగూడ దెలియునని విదితమగుచున్నది గదా.

ఈ శుభదమగు మారదేహభసితముతోనే భూషితగాత్రినై నవపల్లవ తల్పమున వలె నగ్నికీలల నాశరీరము నర్పింతును.

ఓసదాశయా! నీవు మాయిరువురకుఁ బెక్కుసారులు పూలపాన్పుల నమర్చుటలో సహాయుఁడ వైతివి. గావున నిపుడుకూడ దోసిలొగ్గివేడుచున్న యీరతికి నవిలంబితముగఁ చితి సమకూర్పుము.

ఓ మదిరాక్షీ! మధురతరమగు మదాననమధుపానమును గ్రోలిన నీవిపుడు నాచే నొసఁగఁబడు బాష్పదూషితమగు చప్పని తర్పణోదకమును బరలోకమున నెట్లు పానము చేయఁగలవు?

స్మరుఁడు నన్ను వీడి యొకక్షణముగూడ నిలువఁజాలఁడనునది నీవెఱింగియుంటచే నేఁచితిగతనైన పిమ్మట నాపైనిడిన యనలుని మందానిలవీజనములచే వేగముగఁ బ్రజ్వాలింపఁ జేయుము.

ఓసుదతీ! ఇతర విభవము లెన్నియున్నను నీవు లేకుంటచే ద్వైదైకాయత్తానురాగియగు నీయజునకు సమస్తసౌఖ్యమస్తమించినదని గణింపుము.

మఱియు నోయాప్తుఁడా! ఈరీతిగా నాకు దహనదానమొసంగి, పిమ్మట మాకిరువురకు నొకేతర్పణ మర్పింపుము. దాని నీ మిత్త్రుఁడు పరలోకమున నాతోఁ గలసియే చేకొనును.

ఓవసంతుఁడా! నీమిత్త్రుఁడు చూతమంజరీ ప్రియుఁడగుటచే బారలౌకికకార్యమున మన్మథు నుద్దేశించి విలోలపల్లవరమ్యము లగు సహకారవల్లరుల దానమొసంగుము.

...

ఓమ్

# సూర్యనారాయణీయాంధ్రభాషానుశాసన ప్రామాణ్య విచారము

శ్రీ పా ద ల క్ష్మి ప తి శా స్త్రి గా రు.

కొంతకాలమునుండి యాంధ్రదేశమున నాంధ్రభాషావేత్తలలో నభిప్రాయభేదములు గలిగి గ్రాంథికభాషాభివాదులని కొందఱును గ్రామ్యభాషాభివాదులని కొందఱును అందుగ్రామ్యపదస్థానమున వ్యావహారికపదముపయోగించి అల్పాభిప్రాయభేదముతో వ్యావహారికభాషావాదులని కొందఱును బయలుదేఱి వాదప్రతివాదములు తీవ్రతరముగ జరిపిరి జరుపుచున్నారు జరుపఁగలరు. వ్యావహారికభాషావాదులు వారివాదమును గార్యరూపమునఁ బరిణమింపఁజేయఁ బాఠశాలలలోను గళాశాలలలోను వ్యావహారికభాషతో రచించిన గ్రంథములు పఠనీయములుగా నియమింపఁజేసిరి. తర్వాత నది యనర్థమని యెంచి గ్రాంథికవాదులు భగీరథప్రయత్నములు చేసి వ్యావహారికభాషాగ్రంథములు పఠనీయములుగా నియమించుట యాఁపుచేయించినారు. వ్యావహారికభాషావాదు లూరకుండక వీలుదొరకినపుడెల్లఁ దమవాదమును నిలఁబెట్టుకొనఁదగిన యత్నములు చేయుచునేయున్నారు. గ్రాంథికభాషావాదులు దాని నామోదింపక నిరసించుచునే యున్నారు.

ఈవాదము లెవరెట్లు దీర్పఁగలరని యాలోచించుచుండఁగ రాజమహేంద్రవరకళాశాలాంధ్రపండితులగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారు ఆంధ్రభాషానుశాసనమను నొకక్రొత్తవ్యాకరణగ్రంథము నవతరింపఁజేసిరి. అందు వారుభయపక్షములకును మధ్యస్థులై యాగ్రంథము రచించినట్లు వ్రాసినారు. దానికి మిగుల సంతోషించి గ్రంథము చదువఁ బూనఁగాఁ గొంతయాశాభంగము జనించినది. వీరిపద్ధతి ప్రామాణ్యసహమగునా? కాదా? యనిసంశయము కలిగినది. నాకుఁ గలిగిన భావములలోఁ గొన్నిటినిమాత్రము మీకుఁ దెలుపుచున్నాను. ఆంధ్రభాషావేత్తలు వీరిగ్రంథ మాదరపూర్వకముగాఁ జదివి గుణదోషంబుల గ్రహింతురుగాక.

సంజ్ఞాప్రకరణమున మూఁడవసూత్రముక్రింద పూర్వానుశాసనములుండఁగా నీయనుశాసనమేల యని శంకచేసికొని పునరనుశాసనావశ్యక

తను దెలుపుచు నిట్లువ్రాసిరి. "భాష ప్రవాహగతిని మాఱుచుండుటయు మాఱిన శబ్దజాల మందర్వాములైన శబ్దములను తమకావ్యములఁ బ్రయోగించుచుండుటయు, అట్లు శిష్టులవాడుకలోను గ్రంథములలోను గనవచ్చు శబ్దముల కనుగుణముగా నయ్యాకాలములందు భాషాసంప్రదాయవేత్త లనుశాసనము చేయుటయు ననుధర్మములు ఏజీవద్భాషకైనను దప్పవు. అతిప్రాచీనమైన సంస్కృతమునకుగూడ నిట్టిధర్మముగలదని మనమెఱుఁగుదుము. తొల్లి భారద్వాజుఁడు గార్గ్యుడు శాకల్యుఁడు శాకటాయనుఁడు మున్నగు మాన్యులనేకు లయ్యాకాలములందు సంస్కృతభాషకు వ్యాకరణములు వ్రాసియుండగా వానియందలి లోపము లరసియుఁ దమనాఁటికి భాషలోఁ గనవచ్చిన మార్పులవలోకించియు వానికిఁదగినట్లుగా బాణిన్యాచార్యులు మరల వ్యాకరణము రచియించిరి. దానిలోఁగూడ లోపములను గనిపెట్టి పెక్కు వేలశబ్దములకు వార్త్తికరూపమునఁ గాత్యాయనుఁడు మరల ననుశాసనము చేసెను. అట్లే ఆంధ్రశబ్దచింతామణి అథర్వణవ్యాకరణము మొదలుగా రావిపాటి గురుమూర్త్తిశాస్త్రి తెనుఁగువ్యాకరణము వఱకుఁ గలపూర్వలక్షణములందు భాషలో మాఱిన శబ్దజాలమంతకును సమగ్రముగాఁ గాకపోయినను కొంతకైనను భాషాసంప్రదాయమునను సరించి కొన్నికొన్ని సూచనలు గానవచ్చును".

వీరు చెప్పినట్లే అయినచోఁ బాణిన్యాచార్యులు గార్గ్యాదులకాలమునకుఁ దర్వాతఁ బయఁలుదేఱిన గ్రంథములలోని పదములనుజూపి వానికనుశాసనము చేసియుండవలయును. అట్లే కాత్యాయనుఁడు పాణిని విడిచినవానికిని తర్వాతకాలమున మార్పులుచెందిన పదములకును వార్త్తికములు రచియించి యుండవలయును గదా. మనప్రాచీనగ్రంథములలోఁ బౌర్వాపర్యము నిర్ణయించుటకు సాధనసామగ్రి తక్కువ. ఉన్నవానిలో దొరకగాశే పరమప్రమాణమనక మనసంప్రదాయమెఱిఁగినవారు దొరలనుగ్రహించిన సాహాయ్యముతో సత్యము నిర్ధారణచేయ యత్నింపవలయును. ప్రకృతము సిద్ధముగానున్న సాధనములను భాష్యాదివాక్యములను జక్కఁగఁ బరిశీలించినచో బాణినికిఁ బూర్వమందున్న గ్రంథములలోని కొన్నిపదములకు పాణిని సూత్రములు రచింపకవిడువఁగా కాత్యాయనుఁడు వానికి వార్త్తికముల రచించెగాని శ్రీశాస్త్రులువారనునట్లు "తమనాఁటికి భాషలోఁ గనవచ్చిన మార్పులవలోకించి వానికిఁ దగినట్లుగా వ్యాకరణము రచియించుటలేదని తోఁచుచు

స్నది. కాత్యాయనుఁడు వార్త్తికములతో సాధించిన పెక్కుపదములు పాణిని
గూడ తనసూత్రములయందు నుపయోగించియే యున్నాఁడు. కొన్ని గూఢ
ముగా సూచించియున్నాఁడు కాత్యాయనుఁడు ప్రవాహగతిని గాలక్రమమున
మార్పులు చెందినవానిని సాధించెననుట చింత్యము అట్టిరూపములు కొన్ని క
ఁబడినను అవి పాణినికాలమునకు లేక తర్వాత మార్పుచెందిన రూపముల
నియు బ్రాచీనములు గావనియు సాధించినగాని శాస్త్రులవారియభిప్రాయ మం
గీకరింపవీలులేదు. ప్రాచీనరూపములలోఁ గొన్ని పాణిని చూడక విడిచియుండ
వచ్చును. వానికిఁ గాత్యాయనుఁడు వార్త్తికములను రచించియుండవచ్చును.
వాడుకలో మార్పుచెందినపదములకు సాధుత్వముకల్పించియుండఁడు. కాత్యా
యనుఁడు వచించిన వార్త్తికములలోఁ గొన్నిపరిశీలింపుడు. "త్యబ్నేర్ధ్రువే"
అనువార్త్తికమున కాత్యాయనుఁడు నిత్యశబ్దమును నిరూపించెను. అది పాణిని
కాలమునకు లేదా ? పాణినియే "నిత్యవీప్సయోః" అనుసూత్రమున దానినుప
యోగించియున్నాఁడు. పర్వతశబ్దమునకు పాణినీయసూత్రము లేదు. వార్త్తిక
కారులు "తపిపర్వమరుద్భ్యాం" అనివార్త్తికముచేసిరి. ఆపదము పాణిని తర్వా
తికాలపుమాట యందుమేని పాణినియే "ఆయుధజీవిభ్యశ్ఛః పర్వతే" అను
సూత్రమున దానినుపయోగించినాఁడు. మాతులశబ్దమునకు "ఇంద్రవరుణే"
త్యాదిసూత్రమునఁ బాణినిప్రయోగమున్నను దానిప్రకృతి ప్రత్యయనిర్వచ
నము పాణినిచేయలేదు. కాత్యాయనుఁడు "మాతుర్డులచ్" అనివార్త్తికముచే
నిరూపించెను. ఇట్లే పితామహమాతామహాదిశబ్దములు పరస్పహ్రాసములు
గలవు.

శ్రీ శాస్త్రిగారిపద్ధతిని సంస్కృతభాషయం దర్వాచీనప్రయోగములలో
మార్పుచెందినరూపములు (వానిని దప్పులనుఁడు ఒప్పులనుఁడు) క్రమముగా
ననుశాసితములైనపుడు ఆర్షములనియుఁ బ్రౌఢప్రయోగములనియు నిరంకుశ
ప్రయోగములనియు వ్యాఖ్యానకర్త్తలును వ్యాకరణకర్త్తలును గొన్నిపదముల
ను తప్పులని యేల సూచింపవలసి వచ్చినది ? అట్టి పదములుగల పురాణ
ములు, ఇతిహాసములు వైద్యగ్రంథములు జ్యోతిషగ్రంథములు అప్పుడు లేవం
దురా ? వానిలోని యార్షప్రయోగాదులు సాధువులని యేల సాధింపఁబడ
లేదు ? శ్రీ శాస్త్రులువారు అతిప్రాచీనమైన సంస్కృతమునకుగూడ నిట్టిధర్మ
ముగలదని మనమెఱుఁగునట్లు వ్రాసినారుగదా.

పోనిండు సంస్కృతభాషావిషయమును విడిచి జీవద్భాషయగు మన యాంధ్రభాషయందుఁగూడ కొన్నిమార్పులు గలిగినవారికి లాక్షణికు లను శాసనములు చేసినట్లు కొన్నిసూచనలు గానవచ్చుచున్నవని శాస్త్రులుగారు వ్రాసిరి గాని అవియేవియో సూచింపరైరి. శాస్త్రులగారి భావముప్రకారము కొంతకాలము తప్పులనుకొన్నవి మఱికొంతకాలమునకు నొప్పులగునని మన మొప్పుకొని వారియనుశాసనగ్రంథము విచారింతము.

శ్రీశాస్త్రులువారు పూర్వకవిసమ్మతములు తత్తుల్యములు నైన శిష్టవ్యవహారికములు సాధువులని తెలుపుటకు నీయనుశాసన మావశ్యకమగుచున్న దనిరి. "శిష్టవ్యవహారికములు, సాధువులు" అవిమెట్టివి? పూర్వకవిసమ్మతములు తత్తుల్యములు నైనవి అనిగదా యావాక్యమున కన్వయము పూర్వకవిసమ్మతతుల్యత్వమననేమో ఏవిషయమునఁ దుల్యత్వమో? ఆంధ్రభాషాపదమాత్రతుల్యత్వమో పదమాత్రతుల్యత్వమో తెలియదు. తుదకు పూర్వకవిసమ్మతి లేకున్నను శిష్టులు వ్యవహరించినదైనచో గ్రాహ్యమే యని తాత్పర్యము తేలినది కాని సంజ్ఞాపరిచ్ఛేదమున ౫౪. సూ "శిష్టవ్యవహారసిద్ధము పూర్వకవిప్రయుక్తము నైన భాష గ్రాహ్యము " పూర్వలాక్షణికసమ్మతము కాకపోయినను ఇప్పుడు దేశమునలుగడల శిష్టులు వాడుచున్నదియుఁ బూర్వకవులు తమకావ్యంబుల వాడినదియు నగు భాష గ్రహింపఁదగును." అనువీరిసూత్రవివరణములను బట్టి పూర్వకవిప్రయోగము శిష్టవ్యవహారమునను రెండులక్షణములును బట్టినవియే గ్రాహ్యములని తేలినది.

మొదట వీరివిజ్ఞప్తియందు నాల్గవపొరటలో "ప్రయోగమూలముగా నీయనుశాసనము చేసినను గవిశిష్టప్రయుక్తములుగాఁ గనవచ్చుచున్న ఇస్తిని వచ్చినా, వస్తూపోతుంటేను, వస్తాడు, కూర్చొని మొదలగు పెక్కురూపముల కనుశాసనముచేయక నేనుప్రమాణముగాఁ గొన్న "ప్రయోగమూలం వ్యాకరణ"మ్మను నార్యోక్తి యిప్పటికి మీఱినవాఁడనైతిని? అనివీరు వ్రాసినదానినిబట్టి విచారించినచోఁ గొన్నిపదములకుఁ బూర్వకవిప్రయోగమును శిష్టవ్యవహారమును గూడనున్నను వానికనుశాసనముచేయక వారు ప్రమాణముగాఁ గొన్న యార్యోక్తి యిప్పటికి దాఁటినారు. ఆపదము లేమిపాపము చేసికొన్నవో, శాస్త్రులవారియనుగ్రహమునకుఁ బాత్రములు గాలేదు. క్రమముగాఁ గాగలవన్నచో మొత్తముమీఁద విజ్ఞప్తిలోని యీచిన్న వాక్య

ముతో వీరు సూత్రమునఁ దెలిపిన నియమ మెగిరిపోవలసినదే కదా. ఏమైనను "శిష్టవ్యావహారికములు" గ్రాహ్యములనుట వీరికిసమ్మతము.

ప్రకృతము మనయాంధ్రదేశమున ఆంధ్రభాషావిషయమునఁ బ్రమాణముగా గ్రహింపఁదగిన శిష్టులెవరు? అనివిచారింపవలసియున్నది. ఘనాంతస్వాధ్యాయము వల్లించి యాంధ్రభాషాగంధ మెఱుఁగని యవధానులుగారా? ఆంధ్రభాషాప్రవేశముగల యాంగ్లభాషాపట్టభద్రులా? ఆంధ్రభాషాగ్రంథములు చదివి యాపాఠములను జెప్పునప్పుడో యావ్యాసములను దిద్దునప్పుడో తక్క మిగిలినసమయమున నందఱకంటె నపభ్రంశముగ మాటలాడునాంధ్రోపాధ్యాయులా? అవియన్నియు నెందులకు? అందఱును వ్యవహారమున సమానముగానేయున్నారు. గాన ఆంధ్రభాషమాటలాడువారందఱును శిష్టులేయందమా. చివరకదే బాగుగానున్నట్లున్నది కాని ఆంధ్రభాష మాటలాడు వారిలో జాతుల ననుసరించియు దేశముననుసరించియు భాష కొన్ని మార్పులు చెందియున్నది. కావున బ్రాహ్మణులా? క్షత్రియులా? వైశ్యులా? శూద్రులా? తదితరులా? ఎవరు? న్యాయమువినుఁడు. ఇదివఱకుఁ బంచములనఁబడి యిపుడాదిమాంధ్రు లనఁబడువారు ఆంధ్రభాష కాదిశిష్టులనుట యుచితమని యనవలసివచ్చునేమో? మనయనుశాసనకర్తగారు బ్రాహ్మణులే శిష్టులందురు కాఁబోలు. వారిభావ మదికాకున్నచో నొక్క బ్రాహ్మణజాతివారుదక్క మిగిలిన యాంధ్రప్రపంచమంతయు నిత్యమును వాడుకొను లెగు, కూకో, ఆడు, ఈడు, తొంగో, చూస్కో, వుంది, వున్నాది, చేస్తూన్నాను, వస్తున్నాను, ఎంకి, ఏఁటి, ఏంది, మొదలగు వానికి అనుశాసనము చేయక పోవుటయేకాక వానిలోఁ గొన్నినిషేధించుటకూడనేల? అందులోఁ గొన్ని ద్రావిడసంప్రదాయము ననుసరించినచో సాధ్యములగును. కొన్ని, కొన్ని మండలము లందలివారు వాడుకొనుచున్నవి. కొన్ని ప్రయోగసమ్మతములు. శాస్త్రులుగారు చెప్పిన కవిప్రయోగతుల్యధర్మవిశిష్టత్వము కొన్నిటికిఁ బట్టవచ్చును. కావున వ్యావహారికభాషావిషయమున నన్నిజాతులవారికి సమానాధికారము కలదు. క్రమముగా జాతి కొకభాష యేర్పడి యొకజాతివారి గ్రంథము మఱియొకజాతివారికిఁ దెలియని స్థితి సంభవించును. అంతేకాక మండలభేదము ననుసరించి భాషాపదముల గ్రహించి గ్రంథములు రచింపఁబూనినచో నొక [illegible] గ్రంథము మఱియొకమండలమువారికిఁ దెలి

యని దుస్థితి సంభవించును. ఇట్టిస్థితి కన్నడదేశమం దిప్పుడున్నదనియు దానిని దొలఁగించి సర్వసామాన్యగ్రాంథికభాష నేర్పఱుచుటకై కర్ణాటసాహిత్యపరిషత్తువారు యత్నించుచున్నారనియుఁ దెలియుచున్నది.

ఇంక పూర్వకవిప్రయోగములు శరణమనుచున్నారు. అది వలదన్నవారెవరు? వీరుచూపినవి ప్రమాణములవునా కావా యనివిచారింపవలసియున్నది. పెక్కువ్రాతప్రతులు లేఖకదోషసమన్వితములై యున్నవని యందఱు నొప్పుకొనవలసినదే. ఉన్నవియున్నట్లే ముద్రించినచో నాశోభయడుగనక్కఱలేదు. చెప్పనక్కఱలేదు. లేఖకదోషములేవో కవిదోషములేవో పరిశీలించి ముద్రింపఁజేయుట ప్రకటించువారిభారము. వారిలోపముచేత బహుగ్రంథములు తాఱుమాఱైన వన్నమాట నిజమే. అప్పుడుకూడ కవిదోషములు దిద్దుమని నాయభిప్రాయము కాదు. అవి కవి పొరపాటున నుపయోగించినపుడు తప్పులుగానే పరిగణింపఁబడును. కాళిదాసనన్నయాదులకుఁ గూడ పొరపాటులు గలవు. ఒక్కొక్కప్పుడు కవి సాధువనుభ్రాంతిచేతనో మెఱపువుచేతనో కార్యాంతరాసక్తిచేతనో తోఁపకయో, ఓపికలేకయో, అప్పటికేదోయొకవిధముగా పూర్తిచేయుటయుఁ గలదు. అట్టివి మనము పరమప్రమాణముగా గ్రహింపవచ్చునా? వివాదాస్పదమైనపదములను బెక్కండ్రు బహుళముగా నుపయోగించినచో ఆపాఠములే భిన్నదేశస్థగ్రంథములలో దొరకినపుడు వానివిషయమాలోచనీయము. శాస్త్రులవారు చూపినప్రయోగములలోఁ గొన్నివారు స్వయముగాఁజదివి సంపాదించినవి. కొన్నివారివిజ్ఞప్తిలో వ్రాసినట్లు వారిమిత్రులసాహాయ్యమున సంపాదించినవి. అన్నియుఁజేర్చి యుదాహరణములకడ పుస్తకములపేళ్లు మాత్రము తెలిపిరి. ఆశ్వాససంఖ్యమైన నీయలేదు. వీరుచూపినవానిలోఁ గొన్ని ముద్రితపాఠమునకు భిన్నముగా నున్నవి. ఏదియోయొకపుస్తకమున నున్నవన్నియుఁ బ్రమాణములే యన్నచో నీక్రిందివానికిఁ గూడ ననుశాసనము చేయవలసినదే.

వడ్డోలగము పండితారాధ్య-౩-పొరట-౨౩ పం.

తథ్యగా బస.పు-౬౦పా-౮ పం.

కొన్ని వేల్పులు (కొందఱనుటకు) డిటో-౯౧-పా౪ పం.

నిత్య (నిత్యములనుటకు) డిటో-౧౦౯-పా-౭ పం.

అభిమాని (అభిమానసనిఅనుటకు) పండితా-౯౨-పా-౯ పం.

అనాక (అనక అనుటకు) మనుచ-3-ఆ-౧౦-౨ ప.
మాలర్కము (మాలతీకములనుటకు) కాశళ-౧౧౧.
రోసింది, పూసింది, చేసింది డిటొ-౭౧.
పొగడర్థులు (పొగడునర్థులనుటకు) ప్రబంధరాజ-3౧.
ఇట్టిసంధి వీరు ప్రత్యేకించి నిషేధించినారు.
నివర్తించు (నిర్వర్తించుఅనుటకు) రంగరాయ-౫౬.
ఇట్టి వనేకములు కలవు. వీరు ప్రమాణముగాఁ గొన్న సజీవకవులలోఁ గొంద ఱు, తెలిసియో తెలియకయో మేము ప్రయోగించిన తప్పులు ఒప్పులుగా గ్రహించుట తమకభీష్టము కాదనుచున్నారు.

ప్రకృతము ఆంధ్రభాషాస్థితినిబట్టి చూచినచోఁ గొందఱు తప్పులన్న వి మఱికొందఱు ఒప్పులందురు. ఈస్వర్గమునుండి తొలఁగించినవానికి ఆస్వ ర్గద్వారము తీసియేయుండును. అందును గొన్నిటికి నుభయభ్రష్టత వచ్చినది. నియమమేమియుఁ గన్పడదు. అవియన్నియు నెందులకు?

బ్రహ్మశ్రీశాస్త్రులగారీ గ్రంథమురచించిరి. వారు కళాశాలాంధ్రపండితులు. వారాంధ్రమునకై యెంతయో పాటుపడినవారు. వారనుశాసించునది వేద వాక్కుగా గ్రహింపఁగూడదా? యనియందురేమో. ఆవిషయముగూడఁ గొంత విచారింపవలసినదే. ఆంధ్రపదములకు నాధారమైన తాటియాకులో ఱల్లో వ్రాఁతలో బహుప్రయాసముమీఁదను కాలవ్యయముమీఁదను గాని పరిశీలింపఁ వీలులేదు. అప్పుడు గాని వీనిప్రామాణ్యాప్రామాణ్యములు పలువు రకుఁ జూపవీలులేదు. అది ప్రకృతము కట్టిపెట్టెదము.

వీరాంధ్రభాషాపదములకుఁ జేసిన యనుశాసనముతోపాటు గీర్వాణ భాషాపదములకుఁగూడ ననుశాసనము గావించిరి. దానికిఁ దాటియాకులు తాలుఁ దడవుట యవసరములేదు. అది యిదివఱకే ఆంధ్రదేశమునసే గాక అన్నిదేశములందు ధ్రువమయిన విషయము. దానికి పరమప్రమాణభూతగ్రం థజాలము కలదు. అట్టిపదములకు వీరు చేసిన యనుశాసనము ఎంతశాస్త్రీ యమో చూచిన తద్గ్రంథప్రామాణ్యమెంతయో మీరే నిర్ధారణము సేయవ చ్చును. నేను ప్రకృతము స్థాలీపులాకన్యాయముగాఁ గొన్నిమాత్రమే చూ పెదను. తరువాత విమర్శకులు విపులముగా విమర్శింతురుగాక. ఆంధ్రభా షానుశాసనము ప్రథమభాగమున 96వ పొరటలోఁ గొన్ని శబ్దములకుఁ బూర్వ

ర్థకములను దెలిపిరి. అందు "మహద్వాచకమగు చతుర్థుఁడు అనుపదము నకు మహతి చతుర్థ యనిరి. మహద్వాచకమగు దశముఁడు అనుపదమునకు మహతి "దశమ" అనిరి. "చతుర్థశబ్దము మొదలుగాగలవి తిథులర్థమగునపుడు ఈకారాంతములగును. తెనుఁగున హ్రస్వము వచ్చును. ఉదా......— చతుర్థి, పంచమి, షష్ఠి, మొదలయినవూహ్యములు" అనిరి. తిథివాచకము లు కాని చతుర్థదశమశబ్దములు మహతీవాచకము లయినపుడు ఆకారాంత ములగునని శాస్త్రులుగారినిశ్చయము. ఏయర్థమునకైనను మహతీవాచకము లయినపుడాపదములు ఈకారాంతములేయగునుగాని ఆకారాంతములుకావు

ఇంక విద్వచ్ఛబ్దము "విదేశ్శతుర్వసుః" అనుపాణినిసూత్రప్రకారము కృదంతము. శ్రీశాస్త్రిగారు దీనిని మత్వర్థీయాంతములలోఁ బరిగణించినారు. అంతేకాదు విద్వచ్ఛబ్దమాత్రమున నిలుపునపుడు విద్వాంసుఁడు అనురూప మగును. దానిని సూత్రించుటకు శ్రీశాస్త్రులుగారు ద్వితీయభాగమున 9 వ పొరటలో 25 సూత్రమున "మత్వర్థీయాంతములయిన సంస్కృతశబ్దముల ద్వితీయైకవచనరూపములు తెనుఁగున నామములగును. అగుచోతుదిమకార ములోపించును. ఉదా :—శ్రీమంతమ్, శ్రీమంత ఇట్లు 'గుణవంత, విద్వాం స' ఇత్యాదులు అనిరి. అంతేకాక 26 సూత్రమున తత్సమమతుబంతనామ ముల కుదాహరణముగా విద్వాంసుఁడు అనివ్రాసిరి. ఇదేమి ? పాణిని, కాత్యా యన పతంజలి ప్రభృతులకుఁగూడ గతిలేకపోయినదే. ఈసందర్భమునఁ జిన్న యసూరిగారు బాలవ్యాకరణమున "మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతు ల్యంబగు" అనితత్సమపరిచ్ఛేదంబున 70వ సూత్రమునఁ దెల్పిరి. వారిసూత్ర ములో ఆదిశబ్దము చేత విద్వాంసుఁడు గ్రహింపఁబడినది. శ్రీ శాస్త్రిగారు అదియైనఁ జూచియుండరా ? చిన్నయసూరిగారు వ్రాసినట్లు వ్రాసిన విశేష మేమున్నదనుకొనినారుఁ గాఁబోలు పోనిండు దానికేమి ? ఈవిశేషము వి నుడు నీ రెండవభాగమున 102 వ పొరటలో "తద్ధితప్రత్యయము లపత్యా ర్థకాదిభేదమున బహువిధములు.

అర్హార్థ :—వధ్యుఁడు, పూజ్యుఁడు, దండనీయుఁడు అనిరి. 'వధ్యుఁడు' అనుచోట వధార్హుఁడు వధ్యుఁడు అనవచ్చును. దండనీయుఁడు అన్నది కృదం తము గాని తద్ధితాంతము కాదు. దండార్హుఁడు దండ్యుఁడు అగును. దండ్యశ బ్దము తద్ధితాంతము. కృదంతముగా గ్రహించిన దండనీయుఁడు మాత్రము

కృదంతమే కాని తద్ధితాంత మెన్నఁడును గాదు. దండ్యుఁడని వ్రాయఁదలంచి దండనీయుఁడని పొరపాటున వ్రాసినారందుమా! ఇంత పొరపాటు వీరికీ యనుశాసనవిధానముననే యున్నపుడు తాటియాకులోఁ దప్పులు పడఁగూడదా? పూజ్యుఁడనుపదము తద్ధితాంతమనుటకు బ్రమాణము పూజ్యమే. తద్ధితములలో "య" ప్రత్యయము రాఁదగిన గణములో నిది లేదు. ఇదికృదంతము. కృత్తద్ధితభేదము పరిగణింపఁబడలేదు. ఇట్టివెన్నియో కలవు. వీరియనుశాసనప్రకారము మానవేశ్వర, మహారాజు మున్నగునవి సాధువులైనవి వానిని గురించి వ్రాయఁబూనిన నొకగ్రంథమగునని ప్రకృతము విరమించుచున్నాను.

వీరు తప్పుల నొప్పుల గావించుటయే గాక ఒప్పులన వీలుగానున్న పదములు కొన్ని తప్పులపట్టికలోఁ బొఱనైచిరి. అందు "దారాపుత్రులు" అను పదము వీరిమతమునఁ దప్పటఁ. చూ. సంజ్ఞా. ౬౩. సూత్రము. దారాపుత్రాదులని వాడుక కలదు. దారాశబ్ద మాకారాంతశబ్దమును గలదని నాములింగానుశాసనవ్యాఖ్యాతయగు భానుజీదీక్షితులు ప్రమాణము చూపెను. అమరకోశమున "భార్యా జాయాథపుంభూమ్ని దారాః" ద్వితీ మనుష్య ౬. వాఖ్యలోటాబంతోపి "శ్లో॥ క్రోడాహారా తథాదారా త్రయఏతే యథాక్రమం కోడేహారేచ దారేషుశబ్దాః ప్రోక్తా మనీషిభిః॥ ఇతివ్యాడి శుభాంకా" అనియున్నది. సర్వశబ్దసంబోధినీనిఘంటువున ఆకారాంతమునుఁ గలదు. మఱియు హరిశ్చంద్రనలోపాఖ్యానమున 4 ఆ. 3 పద్యమునను రాఘవపాండవీయమున ౧. ఆ. ౭౩. పద్యమునను (వావిళ్ళవారిప్రతులు) ప్రయోగము గలదు. అహోబలపండితీయమున నిది ధ్రువపఱుపఁబడియున్నది.

దీనిని వారేలకో తప్పులపట్టికలోఁ బొఱనైచిరి. శ్రీశాస్త్రిగారియనుశాసనము ప్రామాణ్యార్హమగునో కాదో వివేకవంతులు నిర్ణయింతురు గాక. శ్రీశాస్త్రిగారియందు నిదివఱకుండు ప్రామాణ్య మిపుడు శిథిలమగుచున్నది.

ఇంతకు వారు చేసిన యనుశాసనమునందు వారికే ప్రామాణ్యము లేనట్టు గనఁబడుచున్నది. ఇది చిత్తగింపుఁడు. వారివిజ్ఞప్తిలోనే V పొరటలో "నేననుశాసించినశబ్దముల నీయనుశాసనరచనమున నిపుడుపయోగింపక భాషాసంప్రదాయవేత్తల యనుమతికై దృష్టి నిలిపితిని" అనివ్రాసినారు. వారికి దృఢప్రామాణ్యమున్నచో వారనుశాసించినపదములు వారేల యుపయోగింపరు? వారియుద్దేశానుసారముగానే దీనిప్రామాణ్యమును గుఱించి యితరు...

లు గూడఁ బెద్దలయనుమతిపై దృష్టి నిలుపవలసియున్నది. వారట్లు పెద్దల యనుమతికై నిరీక్షించుచున్నపుడు ఆంధ్రసాహిత్యపరిషత్తువారును ఆంధ్రభాషావేత్తలును సాధ్యమగునంతత్వరలో నీగ్రంథమందలి గుణదోషవిచారణము గావించి వారియాశయములు దెలియఁజేయుట యుక్తము. అంతవఱకు శ్రీ శాస్త్రులవారితోపాటు ఇతరులుగూడ దీనిప్రామాణ్యాప్రామాణ్యవిషయమయి నిశ్చితాభిప్రాయులగుటకు వీలులేదు.

అన్నిటికంటెఁ జిత్రము. ఆంధ్రభాష కక్షురములుగూడఁ బెరిఁగినవి. ఇంకను వింతవింతపద్ధతులెన్నియో యున్నవి. వానిలోఁ గొన్ని బాలురకు సుబోధమగుట కనువుగా నుండుటకై రచించియుందురు. వారుచిరకాలానుభవముతో రచించిన యీగ్రంథమున గుణములు గూడఁ గొన్నియున్నవని చెప్పగలను. అట్లయినచో దోషములను విడిచి గుణములుమాత్రము గ్రహింపరాదాయని కొందఱనవచ్చును. "ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అనికాళిదాసు చెప్పినమాటయు సత్యమే. కాని ఆయార్యోక్తి యితరవిషయమున నుపయోగింపవచ్చును కాని కావ్యావిషయమున నుపయోగింపఁగూడదని లాక్షణికుఁడైన యహోబలపతి యహోబలపండితీయమను నాంధ్రశబ్దచింతామణివ్యాఖ్యానమునఁ గంఠోక్తిగా వచించినాఁడు చిత్తగింపుఁడు. అహోబలఁగసం-107 పు॥ "తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన స్యాద్వపుస్సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్" అనియు ౨౩ పొరటలో "ఏకోహిదోష ఇతిన్యాయస్తు కావ్యవ్యతిరిక్తవిషయ ఇతి ద్రష్టవ్యమ్" అనియునున్నది.

కావ్యముననే యీన్యాయము గూడదనుచుండఁగా ననుశాసనగ్రంథ విషయమునఁ గూడదని వేఱచెప్పవలయునా ? కావున ఆంధ్రసాహిత్యపరిషత్తువారు నిష్పక్షపాతబుద్ధితో సూర్యనారాయణీయము విమర్శించి యందలి గుణదోషములు లోకమున కెఱిఁగింతురుగాక యని ప్రార్థించుచున్నాను.

---

# కవిత.

విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావుగారు.

భృతకోపాధ్యాయవృత్తియను దుర్దశాసింధువున మునుఁగుచుఁ దేలుచు నీఁదుచలము బలము నశింప నిరాశులై యెదురుచూచు మమువంటి సాహిత్యజిజ్ఞాసాపరుల కెన్నఁడో యిట్టిద్వీపము కన్పించుట; కొంచెము శ్రమమును దీర్చుకొనుట మఱల విధిని నిందించుకొనుచుఁ బ్రాణముల నఱచేతనిడుకొని యానిరాశాసింధువున హరహరాయని దుమికి మఱల ననంతబాధావికలమనస్కులమగుటయు నేఁటికాలమునఁ బేదఱికముకతమున సహజమైనది. కవిత, కవి, మున్నగు విషయములను జర్చించుచుఁ బురాతనాధునాతన ప్రాచ్యపాశ్చాత్యమతములను సాధ్యమయినంతవఱకు విమర్శించుచు నాయాయిమతములు మనపురాతనాధునాతన భాషాకావ్యముల నెంత వఱకిమిడియున్నవో తెలుపుచు సాహిత్యమీమాంస యనుగ్రంథము నొకదాని వ్రాయసంకల్పించితిని. అందు విషయములు విపులముగాఁ జర్చింపఁబడు. ఇచ్చటఁ గవితనుగుఱించి యందునను గవిత్వసామాన్యలక్షణమును వివరించుచున్నాను. మిమ్ము శ్రద్ధధానులఁగండని విన్నవించుచున్నాను.

చం. కవులకు మ్రొక్కి తత్కవితకై మరణవ్యథనొందు శాస్త్రపా
టవకటులైనవారి వికటభ్రుకుటిం జిఱునవ్వుతూఁపుతోఁ
గవిసి జయించి వాగ్గుణనికారము నూఁతఁగ దొంగత్రోవలన్
దవులను నిల్చిప్రేలు కవితామతబాహ్యుల ధిక్కరించెదన్.

శోకము శ్లోకత్వమును బొందెను; కవిత యానాఁడే యంకురించెను. శ్రీరాముఁడు ప్రత్యక్షమయ్యెను; సీత యిలవేల్పయ్యెను. పుట్టతేనియ వెల్లివిరిసి ప్రపంచమునంతను మధురోన్మాదమునఁ దమోవ్యాప్తిలేని నిద్రావశమునుగాఁ జేసెను. ఇది కవితానిర్ఝరీజననము; తద్వాసయోగ్యప్రపంచసృజనము తత్సౌందర్యపిపాసువు లందుకొనినఫలము. అందుఁగలది మధువు. ఆరసము నెంతగ్రోలినను దాహము తీరదు: తృప్తి లేదు. అందుఁదఱుగుటయుఁ గానసే తము. ఈమధుపానమునకు ఫలమువిషయమాంద్యము: స్వయంప్రకాశమును సత్యమును జ్ఞానము ననంతమునగు నానందైక్యము. ఈకవితాప్రపంచమునకు వ్యవహారార్థము నామరూపములున్నను నిజమునకు లేవు. అమృతమును జవిచూచినవారికి నిర్జర[illegible]. కాని సుఖదుఃఖాదిద్వంద్వములకతీత

త్వము కలుగదనియుఁ జెప్పుదురు. కావ్యామృతమును జవిచూచిన వారికో నిర్జరతయందుఁగల జన్మవ్యథలేదు సరిగదా తదమృతస్వాదూపులైనై యానం దులగుదురు. దుఃఖమేది? ఏమయ్యెనో తెలియదు. ఈదృశప్రపంచమును సృజించువాఁడు కవి. ఇదికావ్యసృష్టికథనము.

ఈసృష్టికిని బరిదృశ్యమానజగత్సృష్టికిని సంబంధమును గలదు: స్వర్గమున సంబంధము. స్థితిని బార్ధక్యము బాహ్యదృష్టికిగోచరించును. అందువలన నదియిద్ధి కాదు కాని యందలి ధర్మమిందును నిందలి ధర్మమందును బొడఁ గట్టును. అదిమూలము గావున నింద్రియగోచరవస్తువిచారజ్ఞులు, "తద్భిన్న త్వేసతి తద్గతభూయోధర్మత్వ" మన్నారిట్టిదానిని. ఇచట బ్రహ్మసృజనమా ద్యమా, కవిసర్గమాద్యమా దేనినేది యనుసరించినది యను జిజ్ఞాసపొడచూపును. ఇట్టి సందేహము మోపెత్తుట తగవేకాని సృష్టియును సృష్టికర్తయును భిన్నప్రకృతులైనపుడును బ్రహ్మయుఁ గవియు వేఱుగాఁ బరిచ్ఛిన్నులైనపుడును నీదృశసందేహమున కవకాశముండును గాని "తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్" నియు 'బ్రహ్మైవరసః; రసోవైసః' యనువాక్యములు హృదయకుహరమునఁబ్రతిధ్వనించువారికట్టి సంశయముకలుగనేరదు. అయితే యచట నానంతర్యద్యోతకమగు క్త్వార్థమునకు సమాధానమేమందురా? వినుఁడు, నిలఁబడిపాడువానిలో నిలచి యనంతరము పాడవలయునను నియమములేక యాకార్యద్వయ మేకకాలమునం దెటుల జరుగునో యటులనే దానిని సృజించియందు బ్రవేశించుటయు నానంతర్యనియమములేక జరుగుననియు రసనిర్మాతయగు కవియు రసమునను ప్రవేశించుననియు బ్రహ్మ యేరసము, రసమే బ్రహ్మయునైనపుడు కవికిని బ్రహ్మకు నభేదమే నిశ్చయమనియు సులువుగాఁ దెలియనగునుగదా. ఇపుడు బ్రహ్మసృష్టికంటె భిన్నమయ్యు బ్రహ్మసృష్టియందలి భూయోధర్మమును గలిగి యున్నది. కావ్యసృష్టియను మతమనాదరణీయమని యీయుక్తి స్థిరపరచుచున్నది.

కవిబ్రహ్మలకుఁ బార్ధక్యము లేమింజేసి కవిసృష్టియు బ్రహ్మసృష్టియు నొక్కటి. ఆనందము బ్రహ్మస్వరూపము. అదినిర్గుణము; సత్యము; జ్ఞానము; అనంతమును, అందు సృజనకర్మలేదు. ఆనందమేయది. వికృతినెఱుంగదు. దానియందు సంకల్పము కలిగెను. అదిశక్తి. ఆసంకల్పమహామికాపూర్వకము అందుచే, ప్రబాంధ్మ...[illegible] ...సెను. కర్తలో

యందు కర్మయిమిడియున్నది. ప్రపంచమావిర్భవించెను. అదితత్కర్తకంటె నన్యముకాదు. కనుకనే, 'యోవేదనిహితం గుహాయా'మ్మన్నారు పెద్దలు.

ఈసృష్టిని జేయుటకుఁ బూర్వము బ్రహ్మతనపుట్టువునకుఁ గారణమును గ్రహింపనేరక యనేకకాలము తపస్సుచేసినాఁడు. ఈతపః ఫలమాత్మసాక్షాత్కారముచేఁ దనజన్మమునకుఁ గారణమును గ్రహించి సర్గప్రతిపాదనమునకు బ్రారంభించుట. ఆదిని నిర్మింపఁబడినది సరస్వతి. ఈమె వాక్కు; వేదము.

ఇఁకఁ గవిబ్రహ్మ వాల్మీకి తపముచేసెను. కారణమును గ్రహించెను. సీతారాములను మనకుఁ బ్రసాదించెను. ఈతపమున కర్థమేమి? తపముకార్శ్యమును గూర్చును. శల్యావశిష్టుని జేయును. ఇది యగ్నివలె దహించును. ఈతీవ్రవేదనాభరము నాకునాకుఁ గావలయుననియు, నేను నేను మోయుదుననియుఁ బూనుకొనుట యాచించుట, యత్నించుట వెట్టితనమని మూఢులనుకొనెదరు. ఈ వేదనయే, ఈబాధయే, యీకార్చిచ్చే, యీవస్తువిరాగమే జ్ఞానసాధనమని చెప్పెదము. ఈవిరాగము జ్ఞానపథగామినిగాఁ జేయునుగనుక 'యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్'న్నారు పెద్దలు. ఇది నిశ్చయము. మఱియు నీవేదనామృతమును జవిచూచిన వారిని మఱియు నందుఁగాపురముచేయువారిని శాంతమూర్తులని చెప్పుచున్నాము. నిర్వేదము శాంతమునకు స్థాయి ఈనిర్వేదమే తపస్సు ఆవిరాగమే మహాతపస్సు. ఈతపస్సును ధన్యతములు చేయుదురు. ఆధన్యతములలో ధన్యుఁడుమహాకవి. ఈమహాకవులలో బ్రాగ్రసరుఁడు వాల్మీకి, అతఁడు తపమునుజేసెను. శోకము శ్లోకతనొందుటకు గల కారణమరసెను. సర్గమునకు మొదలిడెను. ప్రపంచమును నిర్మించెను. అదుఁదానను ప్రవేశించి సుఖమున్నాఁడు. ఇది సహృదయునకుఁ బ్రత్యక్షమయి యతఁడు 'కూజన్తం రామరామేతిమధురం మధురాక్షరమ్। ఆరుహ్య కవితాశాఖాం వన్దే వాల్మీకికోకిలమ్మ్' నిధ్యానము నిరతమును జేయుచున్నాఁడు. ఇదియే కవితారహస్యము.

అయితే గానము చిత్రలేఖనము నేతాదృశములే కదాయని యందురు నిజమే. ఆమాటయందునను సత్యము లేకపోలేదు. అందుకనియే కాఁబోలు 'నేనుభయకార్యప్రౌఢిఁబాటించు శిల్పమునస్ బారగుఁడ'ననికవిబ్రహ్మవాకొనియున్నాఁడు. పూర్వులు చతుష్షష్టికలలున్నవన్నారు. అందు ముఖ్యములు మూఁడని పాశ్చాత్యులనుచున్నారు. ఆమూఁడుగాన చిత్ర లేఖనకవితలు. ఈమూ

టికిని ఫలమానందమే మైనను భిన్నమార్గముల నిప్పు ప్రదర్శింపఁబడుచున్నవి. ఇది లోకవిదితమే. ఇందుఁ గవిత శ్రేష్ఠమని పాశ్చాత్త్యులును ఘంటాపథముగాఁ జాటినారు. వారిమాటలివి.

Language, colour, form and religious and civil habits of action, are all instruments and materials of poetry; they may be called poetry by that figure of speech which considers the effect as a synonym of the cause. But poetry in a more restricted sense expresses those arrangements of language, and especially metrical language, whose throne is contained within the invisible nature of man. And this springs from the nature itself of language, which is a more direct representation of the actions and passions of our internal being and is susceptible of more various and delicate combinations than colour, form or motion and is more plastic and obedient to the control of that faculty of which it is the creation. For language is arbitrarily produced by the imagination, and has relation to thoughts alone; but all these materials, instruments and conditions of art have relations among each other, which limit and interpose between conception and expression. The former is as a mirror which reflects the latter as a cloud which enfeebles the light of which both are mediums of communication. Hence the fame of sculptors, painters and musicians although the intrinsic powers of the great masters of these arts may yield in no degree to that of those who have employed language as the hieroglyphic of their thoughts, has never equalled that of poets, in the restricted sense; as two performers of equal skill will produce unequal effects from a guitar and a harp. (Shelley.)

ఈపై ప్రమాణీకరించిన వాక్యములవలన స్పష్టముగాఁ గవితయితర శిల్పములకంటె నెక్కుడనియు యశోదాయకమనియుఁ దెలియును. అంతియకాక భావముతో భాష యప్రయత్నముగా బయలు దేరుననియు కలదు. అనఁగా భాషకు భావమునకు జన్యజనకభావము కలదని తేటతెల్లము. మఱియొకొక యభిప్రాయమునుగూడ వెల్లడించుచున్న వావాక్యములు. ఊహలకు సంబంధముకలది భాషయొక్కటియే యను జ్ఞానమునుద్ఘాటించుచున్నవి. ఈయభిప్రాయములవలన మనకుఁ దెలినవిషయము కవితాసృష్టికి నత్యంతానుకూల్యముకలది భాషయని. అందుకనినే Croacheయను లోకతత్త్వవేత్త Eas

thetic is expression అని యన్నాఁడు. ఇదిపాశ్చాత్యుల యభిప్రాయము. ఇఁక మనవారీవిషయమున నేమనుచున్నారు? శబ్దార్థములు కావ్యమనియో యర్థప్రతిపాదకశబ్దము కావ్యమనియో చెప్పుచున్నారు. అట్లుచెప్పి యంతటితో నాగలేదు. ఇంకొకయడుగు ముందునకుఁ బోయినారు వారిముందడుగు నటుండనిచ్చి పాశ్చాత్యవిజ్ఞానమునకు దత్తులును వారిననుసరించి యింత యస్థిరయశమును సంపాదింపఁ దలంపుఁగొనిన పండితమ్మన్యులు నేఁటికాలమున శబ్దార్థములమాట కావ్యలక్షణమున వినంబడఁగనే యేమో కొంపమునిఁగిపోయినట్లది కావ్యలక్షణము కానేరదని మీఁదికి ధుముకయత్నించుచున్నారు. వారిమాట యేమందురనిన వారికి నాచెప్పు సమాధానమిది. ఫలములక్షణము కాదనియుఁ గావ్యమువలన బ్రహ్మానందసబ్రహ్మచారి యగు నానందము కలుగుట నిజమనియు మఱియు నాయానందము గానశ్రవణమువలనను చిత్రలేఖనము దర్శించుటవలనను గూడఁ గలుగుటచే నుత్కృష్టశిల్పము లన్నింటికది ఫలమనియు నీయానందము కలుగుటకు హేతువు మనముచూచిన, విన్న, చదివిన చిత్రగానకావ్యములయందలి భావమనియు నీభావమునే ప్రధానలక్షణముగాఁ జెప్పుదమనుచో నిదియును నామూఁడిటికి సామాన్యలక్షణమే యగుననియుఁ జిత్తరవు వ్రాయుటకు రంగులు మొదలగునవియు సంగీతమును బాడుటకు స్వరాదులును నెట్లుముఖ్యములో నట్టులనే కావ్యమునకును నాశిల్పత్రయమునుండి ప్రత్యేకముగా గ్రహించుటకువలయు నసాధారణలక్షణము శబ్దార్థములని మనపూర్వులు వేనోళ్ళఁజెప్పిరనియు మనవిచేసికొనుచున్నాను. ఈవిషయము సులువుగాఁ దెలియునను తలంపుతోఁ 'శబ్దార్థామూర్తిరాఖ్యాతౌ' యన్నారు పెద్దలు, శబ్దార్థములను శరీరమని యన్నారేకాని శరీరమనఁగా జీవుఁడనికాని ప్రాణమనికాని జీవస్వరూపుఁడైన పరమాత్మయని కాని యనలేదు. అందలి యభిప్రాయమేమి? శరీరియున్ననాఁడే శరీరమునకు నాదరము. శరీరిలేనినాఁడు శరీరము శవము. కనుక కవితకు శరీరము శబ్దార్థములు. ఈశబ్దార్థములను శరీరముననున్న శరీరికవిత, అది యానందము; రసము; ధ్వని.

ఈవిషయమున నింకొకరహస్యము కలదు. 'వర్ణవర్ణక్రియావిస్తారగుణవచనేషు' అని ధాతుపాఠము. ఈధాతువునుండియే వర్ణమనుశబ్దము వచ్చినది. రసభావములకు వర్ణము వర్ణమువలననచ్చినది. రసభావములను విస్తరించుటకు సాధనమువర్ణము. గుణములు రసభావములకు గుణము గల్పించునదివ

ర్ణము. ఈవర్ణములు అ ఇ ఉ మొదలగునవి. కవితకు వ్యక్తీకరణమందు,మూర్తికల్పనమందు వర్ణములు ప్రధానములు. ఈయర్థము వర్ణశబ్దమునందే లభ్యమగుచున్నది. ఈవర్ణములయుత్పత్తిని 'చేతనేన జ్ఞాతార్థవివక్షయా తద్బోధకశబ్దనిష్పాదనాయ ప్రేరితమంతః కరణం మూలాధారస్థిత మనలం చాలయతి, తచ్చాలితోఽ నలస్తత్స్థలవర్తి వాయుచాలనాయప్రభవతి. తచ్చాలితేనవాయునా తత్రైవసూక్ష్మరూపేణోత్పాదితః శబ్దః పరావాగిత్యభిధీయతే.' యనునిది మొదలుగాఁగల చతుర్విధవాక్కులనుగా జెప్పిరి, శాస్త్రజ్ఞులు, ఈ వర్ణములు ప్రయోగార్హానన్వితై కార్థబోధకములై పదసంజ్ఞను బొందును. యోగ్యతాకాంక్షాసత్తియుక్తములై యీపదోచ్చయము వాక్యమగును. వాక్యోచ్చయము మహావాక్యమగును. అందుకని యేపెద్దలు 'స్వార్థబోధే సమాప్తానామంగాంగిత్వ వ్యపేక్షయా। వాక్యానామేకవాక్యత్వంపునః సంహత్యజాయతే' అనిచెప్పినారు. రామాయణాదులు మహావాక్యములు.

ఎదురైనచో దనమద.........మనుచరిత్రంబందు ............
బిరుదైన కవిగండ.........కోకటగ్రామాద్యనేకాగ్ర .........
ఆంధ్రకవితా పితామహయల్లసాని పెద్దనకవీంద్ర యనినన్ను
బిలచునట్టిఁ కృష్ణరాయలతో దివికేగలేక బ్రదికి......వంబనగుచు,

ఈ మొదలగునవి వాక్యములు, ఇంతకు నీవిచారణమువలన నిర్ణయింపఁబడిన విషయము కావ్యశరీరము శబ్దార్థములని.

కవితశబ్దమునే శరీరమునుగా గ్రహించి వ్యక్తమగునదియను విషయమును నిర్ధారించుటకు ముఖ్యమగు రహస్యమింకొకటి కలదు. దానినను సరించి రసభావములను శబ్దముద్వారమున వ్యక్తముచేయువాఁడు కవియనియర్థము వచ్చును. అప్పుడుశబ్దమే రసాదివ్యక్తీకరణమునకుఁ బరమసాధనమని నమ్ముటకు వీలుకలుగును. చూడుఁడు ధాతుపాఠమును మఱలనొక పర్యాయము. 'కుశబ్దే'యని ధంకాధ్వనిని జేయుచున్నది. కవియననెవఁడో యిప్పుడు వ్యక్తమేకదా. ఇదియునుగాక పెద్దలు 'కవవర్ణనే' యనియు ననుచున్నారు. వర్ణశబ్దార్థము వివిధమార్గముల నిదివఱకు నిరూపింపఁబడినదిగదా. ఇప్పటికిఁ బ్రాచ్యపాశ్చాత్యపద్ధతుల ననుసరించినను గావ్యమునకు ముఖ్యసాధనము శబ్దమనియే తెలియుచున్నది. రసభావాదులను వక్తీకరించు కవికిని దద్రసాదులనుగ్రహించి యనుభవించు సహృదయునకు శబ్దమె సాధనము.

ఈశబ్దము ననుశాసించిరి పెద్దలు. ఈయనుశాసనము వలనిప్రయోజనములు పెక్కులు. పదిమందికిఁ దెలియుట ముఖ్యప్రయోజనము. అందుకొఱకు వ్యాకరణము. చక్కనిసార్థకమగు శబ్దముగాని రసాదులను వ్యక్తీకరింపలేదు. అందుకనియే ఏకశ్శబ్దః సమ్యజ్ఞాతః సుప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి' యన్నారు. వ్యాకృతి యన్యోన్యవ్యవహారయోగ్యములగు శబ్దములనసంఖ్యాకములను బ్రయోగార్హలనుగాఁ సంస్కరించి తెలుపుచు 'తేఽసురా హేలయో హేలయఇతికుర్వన్తః పరాభిభూవుస్తస్మాత్ బ్రాహ్మణేన నమ్లేచ్ఛితవైఽపభాషితవై మ్లేచ్ఛోహవా ఏషయదపశబ్దః' యను నభిప్రాయమునుగూడఁ బ్రమాణీకరించుచున్నది. కాని కవిత కేవల వ్యవహారయోగ్యమగు పదజాలమునంతను స్వీకరింపదు. ఆరసమునకు, నాభావమునకు ననుకూలమగుకొన్ని పదములను మాత్రమే స్వీకరించును. కవితాభాష వేఱు. లోకవ్యవహారభాష వేఱు. కవితాభాషనుండి జన్యమై తత్సమీపవర్తి యగునదేయెల్లవారలనోటినుండి మనమనుదినమువినునది. అదియునుగాక కవిత రసాదివ్యక్తీకరణమందు నియమమును నమితముగా నపేక్షించును; మఱియు తత్తద్రసాదుల కనుకూలమైన గమనమును సహజముగాఁ గల్గియుండును గావున ఛందోబద్ధమునగుచున్నది. అందుకనియే వ్యాకరణముచే సాధువులైనను గొన్ని శబ్దములు కావ్యమునందపేక్షణీయములు కావనియు వానిని బరిహరించుటనుగూడ సత్కవి కాఁదలఁచుకొనువాఁడు శాస్త్రముల నభ్యసించినపిదప సుకవిసన్నిధానమునఁ గావ్యపాతమును జేసి యభ్యసింపవలయుననియు నీక్రిందివిధముగాఁ బెద్దలనుచున్నారు.

అధిగతసకలజ్ఞేయః సుకవేః సుజనస్యసన్నిధానియతమ్
నక్తందిన మభ్యస్యేదభియుక్తః శక్తిమాన్ కావ్యమ్॥ నను యభ్యధిగతసకలజ్ఞేయః శక్తిమాంశ్చేత్కిం సుజనస్యసుకవేః సన్నిధానేఽభ్యస్యతిసత్యమ్ ఛందోవ్యాకరణాదివిషయ లక్షణాతిరిక్తమన్యదపి జానాతిజ్ఞేయమ్, యన్మహాకవిలక్ష్యేషుదృశ్యతే యథావ్యాకరణే వర్వర్షి; అజఘ్నాః. సస్తి; దర్ద్రిష్టే; ఈక్టే; ఈర్ష్యతి; జిహ్వేయకయిషతి; అడ్డిఢిషతీత్యేవమాదీని పదానిని ప్రయోజ్యాని కావ్యస్య మాధుర్యలాలిత్య వినాశప్రసంగాత్.

అట్లగుటచే లోకభాషకు విస్తృతమైన వ్యాకృతియుండవచ్చును గాని కావ్యభాషకుఁ గూడ నవ్యాకరణమే మూలశాసనము నందలి వలయు పదములే

గ్రాహ్యములుగాని యన్నిమాటలు గ్రాహ్యములుకావని నిశ్చితాభిప్రాయము. ఇంతియకాదు వ్యాకరణవిరుద్ధత మొదలుగాఁ గలవి కావ్యదోషములనియుఁ బెద్దలందురు.

ఎవరేమన్నను భాషకుబంధనమేమి ? వ్యాకృతిభాషను బంధించి తద్వారమునఁ గవికి నంకుశమగుచున్నదని కొందఱు కవిమ్మన్యులు సహృదయమ్మన్యులు భాషావిజ్ఞానము లేకయు, భాషాస్వామ్యము లేకయుఁ, గావ్యభాషామధురిమను గుర్తెఱుంగమియు నోరికివచ్చినట్లుఁ బ్రేలుచున్నారు. అత్యన్తనియమమునపేక్షించు కవితాలతాంగి నియమనికారమున సంచరించు సామాన్యవంటిదిమాత్రము కాదని సహృదయులకు విన్నవించుచు నాత్మస్వరూపమైన రసమెంత మాధుర్యమును గలదియైనను నామధురిమసువ్యక్తము కావలయునన్నచో శరీరమావశ్యకము గనుక నాశరీరము వికలమైనచో నేహ్యముకొందఱకు ననుకంప కొందఱకు నెట్లుకలుగునో యశ్లేయపశబ్దమును గల కావ్యమునినియు, నాకారణముననే శరీరమంతయు నెంతయందమును గలదియైనను 'శ్విత్రేణైకేనాపి దుర్భగ'మ్మని మనయాలంకారికులునుడువుచున్నారనియు నందుచేతనే కేవల శబ్దార్థములనో కేవలార్థప్రతిపాదకశబ్దమునో కావ్యలక్షణమునుగాఁ జెప్పక సహృదయులగు పెద్దలు, 'అదోషౌశబ్దార్థౌ'అని చెప్పినారనియు విజ్ఞాపించుచుఁ గావ్యవ్యాకరణభాషలకుఁ గలసంబంధమును మిక్కుటముగా నిచటవిమర్శించుట యప్రస్తుతమగునుగావున నావిషయికచర్చనింతతో నాపుచున్నాను; మన్నింపుఁడు.

పూర్వులు కావ్యలక్షణమును జెప్పుచు నింక నొకింతదూరము కూడ వెళ్ళిరి. అలంకారములుకూడ గావ్యములందవరసమే యనిరి. దీనినే మనపాశ్చాత్యవిజ్ఞాన పరిపూర్ణభ్రములగువారు నవ్వాత్మణీకరించుచున్నారు. వీరి విజ్ఞానోపలబ్ధికిఁ గారకులైన పాశ్చాత్యులేమనుచున్నారో పైనుదాహరించిన వాక్యములవలననే యొకింత తేట పడఁగలదు. మఱియు నీపాశ్చాత్యులలో **Walt Whitman** చే నుప్తబీజమై **Browning** రూపమున మొసెత్తి **Maeterlink** నామమున పూచిఫలించిన **Mystic poetry** అను ఫలరసమునకు జైతన్యనిర్మితియగు వైష్ణవమునుగలిపి యారగించుచున్న రవీంద్రునివఱకుఁ గలవారలేమనుచున్నారో యొకపర్యాయము కన్నెత్తియో తలనెత్తియో చూచిన విశేషముకాఁగలదు. అలంకారభూయిష్టమగు భాషనే (**Metaphorical**

language) కావ్యము పేక్షించునుగాని తదన్యమును సహింపదని విశాలాకా
శమునుండి వర్షామేఘములవలె గర్జించుచున్నారు. పాశ్చాత్యవిజ్ఞాన పోషణ
మునఁబెరిగి తాము తద్విజ్ఞానమును వెల్లడించుచున్నామని ఘోషించుచుఁ
జన్నుఁగుడిచి ఱొమ్ముఁ దన్నువానివలెనటించు మూర్ఖులజోలి మనకేలయని
యింతతో నావిచారమును సమాప్తినిజేసి దత్తులైన మనవారిటులంటకుఁ గల
కారణమును గొంచెముగా వ్యక్తీకరింప సాహసించుచున్నాను.

సాహిత్యమీమాంసయం దలంకారములను గూర్చి తెలుపుట యొక
భాగము. పూర్వులు సహృదయులందఱు నావిధముననే చెప్పుచుఁ బాశప్రవ
చనములందును దద్రీతినే యనుసరించుచువచ్చిరి. కాని కోపపడకుఁ డొక
మాటచెప్పెదను. కేవల తార్కికులనుగూర్చిలోకమున సార్గాపీం యోనిమా
విసేత్తను నొకప్రవాదము కలదు. ఆశాపమునుండి తప్పించుకొనుటకు నెవ్వఁ
డును దర్కాధ్యయనముతో విద్యను బరిసమాప్తి నేటికిసి జేయుటలేదు.
న్యాయవిద్యతోఁబాటు మఱియొక శాస్త్రాధ్యయనము చేయుటయుఁ బిమ్మట
జదువునకు స్వస్తి చెప్పుటయు వాడుక. ఏపదిపండ్రెండేడులో గురుసన్నిధిని
దీక్షతోఁ దర్కమునే బాధాంతమో చదివి పిమ్మటనింకను నధ్యయనము
చేయుటయందుఁ దలంపుగలిగి యితరశాస్త్రములను జదువువారరిది. కాని
రెండవశాస్త్రమును గూడ చదువవలయును. అట్టితరి సామాన్యముగా నెల్ల
వాఁడు సుఖాధ్యయ నానుకూలమని సాహిత్యమీమాంస వైపునకు వచ్చుట
కటస్థించెను. అందును "బ్రధానేకృతో యత్న" యను వాక్యముననుసరించి
సాహిత్యమీమాంసకలంకార శాస్త్రమని పేరుకలదు కనుక నలంకారములను
గుఱించి చదువుట పరంపరగావచ్చినది. ఏబాధాన్తమో చదివినతార్కికున
కవచ్ఛేద కావచ్ఛిన్న కార్యతాకారణతాదులు లేని కావ్యభాష పేలవముగాఁ
గన్పించుటచే వారికొఱకుఁ గాఁబోలుఁ గువలయానందాదిక గ్రంథములు
బయలువెడలినవి. వారిపాలఁబడినది క్రమముగా నలంకారవిద్య. అందలంకా
రములు తర్కపరిభాషా శృంఖలాబద్ధములై యితరులకగోచరప్రాయములుగా
నున్నవి. అట్టితరి చిన్ననాఁడే స్వభావనుమఱచి యన్యభాషావిజ్ఞానమునఁ బ్ర
వేశించిన వారికి దుర్గమారణ్యములుగా నున్నవవి. అందనిపండ్లు పుల్లనివి.
మఱియు సాధారణముగా నలంకారగ్రంథముల యందలంకారముల యన్యో
న్యభేదమే ప్రధానముగాఁ జెప్పఁబడినట్లు ప్రతిభాసించుట యొకటి. ఈరెండు

కారణముల నలంకారములన నసహ్యము కలుగుచున్నది నేటివారికి. ఇఁక నీ ప్రసంగవశమున వచ్చిన విషయమునాపి యసలు సంగతివిచారింతము.

కావ్యమునకు శబ్దార్థములును నలంకారములును బ్రధానములని నిర్ణయించితిమి. ఇఁక బూర్వులు గుణములనుగూడ కావ్యలక్షణమునఁ జెప్పిరి. ఈగుణములు శబ్దధర్మములు నర్థధర్మములునై యొకకొన్ని దోషనివారణార్థమును మఱికొన్ని శరీరికిశౌర్యాదులునువలె గుణాధాయకము లైనవనియుఁ బ్రాచీను లనుచున్నారు. ఇవి శబ్దార్థముల సాన్నిధ్యావిచ్ఛిన్నతాదికమును వివరించుచుఁ తన్మార్గమున నాహ్లాదమును గూర్చునవియు నగును.

చం. కఁడుబసిబిడ్డ, వీఁడొకటిఁగాదవునా నెఱుఁగండు ముందఱె
య్యెడనొకపాటెఱుంగఁడెద యెంతయుఁ గోమల మెప్పఁడైననే
గుడువఁగఁ బిల్తుఁగాని తనకుంగల యాఁకటి ప్రొద్దెఱుంగఁడీ
కొడుకిటు వోకకున్మనము గుందెడు నిన్ననియూఱడిల్లెడున్.

కం. వీరెవ్వరయ్య ద్రుపదమహారాజులె యిట్లు కృపణులై పట్టుపడన్
వీరికివల సెనె యిపుడు మహారాజ్యమదాంధకారమది వాసెనొకో.

మ. వివిధోత్తుంగ తరంగఘట్టనచల ద్వేలావనైలావలీ
లవలీలుంగ లవంగసంగతల తాలాస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ సనికాంచిరంతనెదురం దత్తీర దేశంబునం
దవదాంబుజఫేనపుంజనిభు నయ్యాశ్వోత్తముస్ దవ్వులన్.

శా. త్రేతాద్వాపరసంధి నుద్ధతమదాంధీభూత విద్వేషిజీ
మూతోగ్రశ్వసనుండు. రాముఁడలుకన్ ముయ్యేడుమాఱుల్ రణ
ప్రీతిన్ వైరిధరాతలేశ్వరులఁ జంపెన్బల్వురన్ దీర్ఘని
ర్ఘాతక్రూరకుఠారలూన నిఖిలక్షత్రోరుకాంతారుఁడై.

మ. బహురత్నద్యుతిమేదురోదరదరీభాగంబులందుండి యి
మ్మహికాహార్యమునన్ జరింతుమెపుడున్ బ్రేమన్నభోవాహినీ
లహరీశీతల గంధవాహపరిఖేలన్మంజరీ సౌరభ
గ్రహణేందిందిరతుందిలంబు లివిమత్కాంతారసంతానముల్.

ఈపైనఁ బేర్కొనిన వానిలోఁగల ప్రసాద సౌకుమార్యాది గుణములను సహృదయులు గ్రహింతురుగాక యని యావిచారమును వదలుచున్నాను

ఈకవిత సర్వోచిత విషయమున సర్వప్రతిపాదక శబ్దమని ధ్యేకప్పుడు

చెప్పితిని. మఱిలదానిని దోషాదికావ్యాలక్షణాంగములను జెప్పుచు విడిచితిని. గుణదోషాలంకారముల స్వీకార్యములు వర్జనీయమని రేదాని ఫలమాలక్షణమున రమణీయశబ్దముచే నిర్వహింపఁబడినది. అంతియకాక కలాత్రయసాధారణలక్షణమగు పరమానందమును దీనివలన నుద్ద్యోతింపఁబడును. కావున రమణీయార్థప్రతిపాదకశబ్దము కావ్యమని పెద్దలు లక్షణమును జెప్పినారు. ఇది ప్రౌఢమగు వాక్యము. సులువుగా నందఱకును దెలియు లక్షణవాక్యము దోషరహితములును గుణాలంకార సహితములును ధ్వనిరసములను గలదియు కావ్యమని.

భావకవితయని యిప్పుడు వ్యవహారములో నున్నదానికి మీనుడివిన పైలక్షణముసరిగాఁ బట్టునాయని యడుగవచ్చును. భాషాస్వామ్యము లేక పాశ్చాత్యాదిపరదేశీయుల గ్రంథపఠనములందుఁ గాలమునంతయువినియోగించినమ్మాట స్వభాషాభిమానముచేతనో, తామభ్యసించిన భాషయందుఁగవితఁ జెప్పితద్జ్ఞుల మెప్పింపనరిదియను భయముననో, తామేభాషాకవుల గ్రంథములనుండి భావాదులను గ్రహించుటయో దొంగిలించుటయో చేయుచున్నారో యాభాషావేదులకది విన్నవించిననవ్వుదురను స్వసామర్థ్యజ్ఞానముననో, పరభాషావిజ్ఞులగువారే యున్నతపదవుల నలంకరించుచున్నారుగనుక వారి చెవులకెక్కునటులఁ దొక్కుమాటలతోఁ గవితను జెప్పవలయుననియో, వారిప్రాపునజేరి పండితులను ధిక్కరించినను గెలువఁగలమనుధైర్యావేశముననో మాదిభావకవిత, భావకవితయని యుద్ఘోషించు కవిమ్మన్యులమాట కాదుగాని భావము ప్రధానముగాఁగల యదియుఁ గవితయనిపించుకొనును. అయితే రసము, ధ్వనికావ్యమునకును నితరశిల్పద్వయమునకును నెట్టుల ప్రాణతుల్యములో యట్టులనే భావమును నగుకవితను మనపూర్వులు గ్రహింపకపోలేదు అందుచేభావము శిల్పములనూఁటికి సామాన్యలక్షణము. కవితకు మఱల మేము పైనఁజెప్పిన లక్షణమసాధారణము. భావకవితయన నేమందురా? వినుఁడు. రసము, భావము, రసాభాసము, భావాభాసము, భావోదయము, భావసంధి, భావశబలత, భావప్రశమమను నాలంకారికవాక్యములు పండితులారా! మీఱువినిన జ్ఞప్తి లేదా. వీనిలో భావమననేమియో యదిప్రధానము, ప్రాణముగాఁగలది భావకవిత. దీనికి వివాదమొందులకు? ఆపేరువిన్న మీకసహ్యమేల? ఈపైఁడాబులతోనేమి; భావలక్షణమును నిర్వచింపుమందురా?

కోపపడకుఁడు. రసాత్మకమగు వాక్యము కావ్యమనిచెప్పి రసమున కుదాహరణమిచ్చి పిమ్మట 'భావోయథా' యని—యెవరో తెలియునా తార్కికపంచాననుఁడైన విశ్వనాథకవిరాజు గర్జించినాఁడు దీనిని.

యస్యాలీయత శల్కసీమ్ని జలధిః, పృష్ఠేజగన్మండలమ్,
దంష్ట్రాయాంధరణీ, నఖేదితిసుతాధీశః, పదేరోదసీ,
క్రోధేక్షత్రగుణః, శరేదశముఖః, పాణేప్రలంబాసురో,
ధ్యానే విశ్వ, మసావధార్మికకులం కస్మైచిదస్మైనమః॥ ఈశ్లోకము నుదాహరించి యంతతో నూరకొనక 'అత్ర భగవద్విషయారతిర్భావః' యన్నాఁడు. ఇదేమిటయ్యా లక్షణముచెప్పుమన్న నుదాహరణమును జెప్పెదవు దురా? శాంతింపుఁడు. లక్ష్యమునుండి లక్షణమును మనము నిర్మించుకొనఁగలముఁగదా. ఈమాటకు మీరులక్షణకర్తలా యందు రేని యవసరమైనచో నగుదుముగాని పెద్దలమాటలే మీకువినిపించెదను వినుఁడు. సావధాన చిత్తులరైవినుఁడు.

సంచారిణః ప్రధానాని దేవాదివిషయారతిః
ఉద్బుద్ధమాత్రః స్థాయీచభావ ఇత్యభిధీయతే.

ఇంతియ కాదు.

ఇంకను బూర్వు లేమనుచున్నారో వింటిరా
"నభావహీనోఽస్తిరసా నభావో రసవర్జితః
పరస్పరకృతాసిద్ధి రనయో రసభావయోః"

కావునఁ బండితులారా సహృదయతగాని కవిత్వముగాని కేవలపాండిత్యమువలనఁ గలుగుననుభ్రమను బొందకుఁడు. ఒకవేళ మనయాలంకారికులు భావప్రధానమగు కవితనుగూర్చి చెప్పలేదనుకొనుఁడు. పరులనుండియే దానిని గ్రహించితిమనుకొనుఁడు. "అతఏవపశవః" యనఁగానే అతఏవతృణవః యనిన హాస్యాస్పదుఁడు కాఁడోవాఁడు. తెలియని వన్నితప్పులని దిట్టతనానవచింపకుఁడు. ముప్పువాటిల్లును. పరులవాక్యమని నిరసించుటయు, స్వవాక్యమని యాదరించుటయు దోసఁగే. గుణము గ్రాహ్యము, స్వపరభేదము గుణగ్రాహణము పట్టునజూపకుఁడు.

కాని యింకొకమాట యీభావకవితకర్థమును గాని తాత్పర్యమును గాని చెప్పుటకు వీలులేదనుచున్నారల యందురా? వినుఁడు. దీనికిఁ దధ్యమ

గు కారణమును మిథ్యయగు కారణమునుగలవు. కవితయందు సన్నివేశచాతు ర్యలగు శబ్దములుండును. వానినివిఱిచి పర్యాయపదములను జొనిపి చెప్పిన మాధుర్యము నశింపదా. మఱియు సాయాశబ్దార్థముల ననుసరించియూ యా శబ్దార్థగోచరమగునపుడే "ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్ యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతిలావణ్యమివాంగనాసు". ఈభావమును వివరించుట చేతనున్నపూవును సౌందర్యపిపాసకలవాఁడు నలిమి చూచుటవలె నుండుననరా. అదియును గాక శబ్దవినిమయమును సహింపనిదే కవితయని మనపూర్వులు సహృదయులగు లాక్షణికులు కొందరనలేదా. ఇది తథ్యపక్షము,

ఇఁక మిథ్యగా డాంబికముగా చెప్పువారునుగలరు. వారిచరితము శోచ నీయమే. Shelley వ్రాసిన వాక్యములే తనసాహిత్యమీమాంసకు మూలము లుగాఁ బాశ్చాత్యులగు నూహాకవులే (Mystic poets) తన భావోద్రేకము మూలపురుషులుగాఁ జైతన్యుని మతసారమే దేహబలముగా రామమోహ నుని సిద్ధాంతములే తనకుఁ బ్రాణములుగా నేటిపాశ్చాత్యకవులలోఁ బేరుగాం చుటయే జీవయాత్రగా కవితావిద్యాగురువనఁదగు మధుసూదనదత్తు చూపి నమార్గముల దేదీప్యమాన ప్రభతో వెలుఁగు రవీంద్రుఁడుమొదలగువారినుండి సాంక్రామికవ్యాధివలె వంగదేశీయుల విజ్ఞానము వారివచోధోరణియు మన వారి నంధులనొనర్చి వారిమాటలఁ బలికించుచు భ్రష్టులను జేయుటవ ల్ల నట్లందు రేకాని వేఱులేదు. బాలవిలసితములను క్షమింపఁదగును. కపిచేష్ట గోపగించుట పాడిగాదు క్షమింపుఁడు.

ప్రాజ్ఞులకుమనవి. పాశ్చాత్యవిజ్ఞాన వాహనీయజలములను దమ విద్యా సాంప్రదాయశర్కరను జేర్చి పానీయమునుగా వంగదేశీయులు గ్రోలుచు న్నారు. అదిన్యాయమే. వారుగేయులే, కానిభిక్షులో భిక్షపెట్టు సామర్థ్య ముండుటయరిది. మఱియు మనకును వలయునంతటి పాశ్చాత్య విద్యాసంప్ర దాయజ్ఞత లేకపోలేదు. వంగదేశీయుల ననుసరించి వికృతభాషను, వికృతభా వమును, వికృతస్వరూపమును నేర్చికొనుటకంటె స్వసాహిత్య జ్ఞానామృతము నకుఁ బాశ్చాత్యవిజ్ఞానస్రోతోంబువులఁ జేర్చి సామరస్యము చేయుటతగవని వి న్నవించుచున్నాను.

కవి సర్వప్రపంచమునకుఁ దేజమునొసఁగు సూర్యుఁడు కవిసర్వమును నిర్మించువిధాత. కవిసర్వము సుఖమునుగాఁ జేయఁగలసమర్థుఁడు. కవియూల పించినదే మనమ తముజీవితము. అదియేకవిత. కావున

ఏకో ఽభూన్నలినాత్ పరశ్చపులినాత్ వల్మీకతశ్చాపరః
తేసర్వే కవయస్త్రిలోకగురవస్తేభ్యోనమస్కుర్మహే॥

# పాలకురికి సోమనాథకవి—గద్యకృతులు.

బండారు తమ్మయ్యగారు.

ఉ. తేనియసోనలన్ జిలుకు తేటగుజాను తెనుంగుఁబల్కులన్
వీనులఁ దన్పుకబ్బముల నిక్కపుదేసి తెలుంగుఁగైతకున్
బ్రాణము వోసినట్టి కవివంద్యుని శ్రీబసవేశచింతనా
సూనృతచిత్తుఁ బాల్కురికి సోమయదేశికు సంస్మరించెదన్.

దేశభాషలందెల్ల లెస్సయని వాసికెక్కిన మన తెలుఁగుబాస వికాసవిలాసములకై కృషియొనర్చిన సకల విద్యాసనాథులగు ప్రాచీనకవి పుంగవులలోఁ బాలకురికి సోమనాథుఁడొకఁడు. కవిత్రయమునందు మిన్నలయి వన్నియగన్న నన్నియ తిక్కనల నడిమికాలమందనఁగాఁ బదిరెండవశతాబ్దియందు ప్రసిద్ధివహించి యాంధ్రవాఙ్మయసింహాసన మధిష్ఠించి భాషాసతిని బహుభంగుల నలరించిన విద్యానాథుఁడు మనసోమనాథుఁడు. ఈతని ప్రతిభ సర్వంకషమయినది. పాండిత్యము సర్వతోముఖమయినది. ఈవిషయమాంధ్ర కర్ణాటగీర్వాణభాషల యందీతఁడొనర్చినగ్రంథములవలన వ్యక్తముకాఁగలదు. ఆంధ్రకవులలో సర్వజ్ఞవిఖ్యాతికి దగినవారు లెక్కకు మిక్కిలి తక్కువగనున్నారు. ఆకొలఁదిమందిలో సోమనాథుఁడొక్కఁడు. పదునొకండవశతాబ్దియందు నన్నియభట్టారకునితో నాంధ్రకవితారచనము సంస్కృతపదభూయిష్ఠముగ నారంభమయి యుండుట సర్వవిదితముగదా ! ఇట్టిపరిస్థితిలో మనసోమనాథుఁడు తెలుంగుకవితజీవము నిక్కమగు తెలుఁగుఁ బలుకుబడులయందకలదనితలంచి నన్నియమార్గమునకు వన్నె వెట్టుచు జాను తెనుంగుఁబల్కుల పెక్కువతో బసవపురాణపండితారాధ్యచరిత్రాది కావ్యములరచించి. కవితానిర్మాణమునకయి తిక్కనాది మహాకవులకు మార్గమునుదీర్చి యాంధ్రసారస్వతమునకు మహోపకారమొనర్చి యున్నాఁడు మఱియుఁ దననాఁటి కాంధ్రభాషలో నాంధ్రీకరణయుగ మారంభమయి స్వల్పకాలమేమైనను నట్టియాంధ్రీకరణకార్యమునకుఁ గడంగక స్వతంత్రకావ్యనిర్మాణమునకు దొరకొనిన యీతని ప్రతిభాస్వాతంత్ర్యము లెంతయుఁగొని యాడఁదగియున్నవి. కావ్యవ్యాకరణతీర్థబిరుదాంచితులు బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ఆంధ్రపత్రిక పదియవసంవత్సరాది సంచికలో "ద్విపదకవిత్వము" అనువ్యాసమున

సోమనాథునిఁగూర్చి లిఖించిన యీక్రిందివాక్యము లత్యంతము సత్యసమ్మత ములయి యున్నవి.

"ఈ రెండు గ్రంథములు (బసవపురాణ పండితారాధ్యచరిత్రములు) నెక్కడఁజూచిన నక్కడ నవరసములుపొంగి పొరలిపోవునంతటి రసోదంచిత ములుగ ద్విపదలలోఁ గూర్పఁబడినవి. హిమవద్భూధర గుహాగ్రములనుండి యనర్గళముగా దుమికివచ్చెడు గంగాప్రవాహముంబోలె నీమహామహునికవి త్వము పాఠకులమనంబుల నానందపూరమున నోలలాడించుచుండును. భక్త శిరోమణియగు పోతన్న భక్తిపారవశ్యపు కవిత్వమునకును, కవిసార్వభౌముఁ డగు శ్రీనాథమహాకవి నుడికారముల గడుసుతనంపుచిన్నెలకును, కర్ణాటరా జ్యరమానాథుఁడు నాంధ్రభోజుడు నాంధ్రకవియునగు కృష్ణదేవరాయమహా రాజుల యాముక్తమాల్యదమున్నగు కృతులలోని యద్భుతవర్ణన పటిష్ఠము లగు సందర్భములకును, దీనికిదానికని యేల ఇంత దనుక మన యాంధ్రసార స్వతమునఁగల హృద్యములగు రసవద్వర్ణనోదంచితములగు కావ్యపుమెఱుఁ గుల కన్నిటికిని, ఈ రెండుద్విపదకావ్యములే మార్గదర్శకములయి రాజిల్లినవి యనుటలో నేమియు సందియములేదు." ఆంధ్రవాఙ్మయమున కిట్లు శాశ్వత మహోపకారమొనర్చి చిరస్మరణీయుఁడయిన యీసుకవిసోముని జీవితకవి త్వవిశేషాదులను గూర్చి నాకుఁ దోఁచినవిషయములతో నయిదేండ్ల క్రిందట నాంధ్రపత్రికదుందుభిసంవత్సరాది సంచికలో నొకవ్యాసమును వ్రాసియుం టిని. అప్పటికిలభింపని యీకవివరుని గద్యకృతులుకొన్ని నాకీమధ్యనూతన ముగా లభించినవి. అవియింతవఱకు భాషాప్రపంచమునఁ బ్రకటితములయినట్లు కానరాదు. కావున వానివిశేషములను లోకమున కించుక ప్రకటింప నెంచి నాఁడను.

సోమనాథుఁడు రచించిన గ్రంథములనీతని శిష్యప్రశిష్యకోటిలోఁ జేరినవాడును నీతని బసవపురాణమును బద్యకావ్యమొనర్చిన వాఁడునునగు పిడుపర్తి సోమనాథకవి తనగ్రంథములోని క్రిందిపద్యములో నుదాహరించి యున్నాఁడు.

సీ. బసవపురాణంబు పండితారాధ్యుల చరితంబుననుభవ సారమునుజ
తుర్వేదసారసూక్తులు సోమనాథభాష్యమ్ము శ్రీరుద్రభాష్యమ్ము బసవ
రగడగంగోత్పత్తి రగడ శ్రీబసవాఢ్య రగడయుసద్గురు రగడ చెన్న
మల్లునీసములు [illegible] నమస్కారగద్యను వృషాధిపశతకంబు నక్షరాంక

గీ. గద్యపద్యముల్ పంచప్రకారగద్య యష్టకముపంచకమునుదాహరణయుగ్మ
మాదియగుకృతుల్ భక్తహితార్థబుద్ధిఁజెప్పెనవిభక్తసభలలోఁ జెల్లుచుండ

"వీనిలో బసవపురాణము పండితారాధ్యచరిత్రము చతుర్వేదసారము వృషాధిపశతకము చెన్నమల్లుసీసములు తెనుఁగుగ్రంథములు; సోమనాథభాష్యము శ్రీరుద్రభాష్యము బసవనపంచగద్య, నమస్కారగద్యము, అక్షరాంకగద్యము, పంచప్రకారగద్యము, అష్టకము, పంచకము, ఉదాహరణయుగ్మముసంస్కృతములు; బసవరగడ, గంగోత్పత్తిరగడ శ్రీబసవాఢ్యరగడ, సద్గురురగడ కర్ణాటకములు" అనిశ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు తాముప్రకటించిన వృషాధిపశతకపీఠికలో వ్రాసియున్నారు. వీరిట్లువ్రాయుటకు శ్రీవీరేశలింగముపంతులుగారి కవుల చరిత్రమందలి వాక్యములును, వీరేశలింగముగారి వ్రాతలకుఁ గర్ణాటకకవి చరిత్రకారుల వాక్యములునుజాల వఱకాధారములయి యుండునని నాకుఁ దోఁచుచున్నది. కర్ణాటకచరిత్రకారులకుఁ గాని శ్రీవీరేశలింగముగారికిఁ గాని సోమనాథుని యీగ్రంథములన్నియు లభించియుండుననియు వానిని జూచి చదివిన మీఁదటనే వారిట్లు వ్రాసియుందురనియుఁ దోఁపదు. కర్ణాటకవిచరిత్రకారులు తమకు సోమనాథుని కృతులలో శీలసంపాదనము, సహస్రగణనామమాలిక, శరణుబసవరగళెయను కన్నడకృతులుతప్పఁ దక్కినవి దొరకలేదనియే తమగ్రంథములలో వ్రాసియున్నారు. పయివానిలో, పంచప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య, బసవరగడ, త్రివిధలింగాష్టకము (అష్టకమని పిడుపర్తి సోమనాథుని పద్యములోఁ జెప్పఁబడిన దిదియేయైయుండునని తోఁచెడిని) అనునవియే నాకుఁ గ్రొత్తగాదొరకిన సోమనాథునికృతులు. వీనిలో, అష్టకముతప్పఁ దక్కినవన్నియుఁ గేవల సంస్కృతకృతులనిగాని కర్ణాటకకృతులనిగాని చెప్పవలనుపడదనియు సంస్కృతపద భూయిష్ఠములయినను నవి యాంధ్రకృతులుగనే గణింపఁదగునవనియు నాయభిప్రాయము. ఈగద్యకృతులన్నియు బసవేశ్వరస్తోత్రపరములయి సోమనాథుని యితరగ్రంథములవలెనే బసవేశ్వరునిమీఁద నాతనికిఁ గల భక్తిపారవశ్యమును బ్రకటించుచున్నవి. సోమనాథుఁడు బసవేశ్వరునిఁ గూర్చి కొన్నిగద్యకృతులు రచించినట్లు పండితారాధ్యచరిత్రములో

బసవన్నమహిమ శుంభద్భక్తి యుక్తిఁ
బసరించితిమిగద్య పద్యాదికృతుల

నర్ణవావృతధాత్రి యందొప్పబసవ
వర్ణనల్ చేసితి వరుసనవేను
లారంగగురుమల్లి కార్జునపండి
తారాధ్యుల చరిత్రమర్థివర్ణింపు.

అనిభక్తు లీతనిగూర్చి బలికినట్లుగా వ్రాసిన వాక్యములఁబట్టి స్పష్టమగుచున్నది. అపారభక్తి రసపారావారమున నోలలాడుచుఁ దనివిమెఱుంగక యాతఁడు బసవస్తోత్రములను బహుముఖములుగాఁ బలు తెలుంగులకృతులుగా రచించియున్నాఁడు. పండితారాధ్యచరిత్రమందలి

బసవనిపుత్రుండ బసవగోత్రుండ
బసవేశు శ్రీపాద పద్మశేఖరుఁడ
బసవనిఁ బొగడఁ బొల్పడు కవీంద్రుండ
బసవన్నఁబొగడఁ బొల్పడు పాఠకుండ
బసవన్న దూతనే బసవన్నబంట
బసవన్న యిలుపుట్టు బానిసకొడుక
బసవన్న లెంకనే బసవన్న లెంగి
బసవన్నపన్నీల పన్నఁగావునను

ఇత్యాదిగా వ్రాసికొనిన వాక్యములనుబట్టి చూడ బసవనితోడిదేలోకమనియు బసవేశ్వరచరిత్ర మహిమాదులను లోకమున బహుముఖములుగాఁ బ్రచురించుటకే యాతనిజన్మ ముద్దేశింపఁబడినట్లును స్పష్టమగుచున్నది కావుననే

"చ. అసదృశతన్మహామహిమ మారవితారకమై చెలంగశ్రీ
బసవచరిత్రముర్వి సకల భక్తకథామణి సూత్రభాతిగా
వెసరచియింపు మీపుపృథివీస్థలికిం జనినాఁగభృంగిసం
తసమునఁబుట్టెఁ బాల్కురికి నామపురీవరసోమనాథుఁడై.

అని పిడుపర్తి సోమనాథకవియు, ,,సముదం చద్వృషభస్త వామరమహేజారామనం సోమనం" అనికర్ణాటకవి సోమరాజును స్తుతించుటకుఁ గారణమయినది.

సోమనాథుఁడు తనగ్రంథములో "గద్యపద్యాది కృతులు" అనితెఱుఁగుగా నుదాహరించియున్నాఁడు. పద్యరచనము వెలయకపూర్వము మన

యాంధ్రభాషలో నీగద్యకృతులే బహుళముగా రచింపఁబడియుండ నోపును. నన్నియభట్టారకునకుఁ బూర్వము పద్య (వృత్త) రచనమున్నను లేకపోయి నను సోమనాథుని గద్యకృతులవంటికృతులు తెలుచుగా నాంధ్రవాఙ్మయము ననుండి యుండుననుట సత్యదూరము కాఁజాలదని నాయభిప్రాయము.

"ఉరుతరగద్య పద్యోక్తులకంటె సరసమైపరఁగిన జాను తెనుంగుఁ
జర్చింపఁగాసర్వసామాన్యమగుటఁగూర్చెదద్విపదలు గోర్కెదైవార

(బసవపు ఆ ౧)

"ఆరూఢగద్యప ద్యాదిప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగాసర్వసామాన్యంబుగామి జాను తెనుఁగు విశేషప్రసన్నతమే
నట్టులుగాక కావ్యప్రౌఢిపేర్మి నెట్టనరచియింప నేర్చినఁ జాలు
నుపమింపగద్యపద్యోదాత్తకృతులుద్విపదయు సమమభావింపనెట్లనిన"

(పండి. ఆ ౧)

అనువాక్యములను జూడ సోమునికాలమునాఁటికి గద్యపద్యకృతులు ప్రౌఢముగ సంస్కృతభాషాభూయిష్ఠముగ రచియింపఁబడు చుండెననియు నం దుచేతనే వాని నుదాత్తకృతులుగా నాతఁడు సంభావించి యుండుననియుఁ దోఁచుచున్నది. మఱియు సోమనాథుఁడు మొదట బసవస్తోత్రములనిట్టి గద్య పద్యకృతులలో నొనర్చి యవిజనసామాన్యమునకు సుబోధకముగామిఁ దన మతప్రచారమున కంతగాఁ నుపకరింపకపోవుటచే నతఁడు జాను తెనుంగురచ నమే తనమనోరథసిద్ధికి సహాయకమగునని తలంచి యట్టిరచనమునకుమిక్కిలి యనుకూలించునది ద్విపదయనుటచేనట్టి ద్విపదరచనమునకుఁ గడంగి బసవపు రాణపండితారాధ్య చరిత్రాదికములగు తన ప్రధానగ్రంథములను ద్విపదకావ్య ములుగా రచించెననియు గ్రహింపఁదగియున్నది. సోమనాథుఁడు మల్లమదేవీ పురాణమను గ్రంథముకూడ నొనర్చెననియు నదిగూడ నాలుగాశ్వాసముల ద్విపదకావ్యమనియు వినవచ్చుచున్నది. మల్లికార్జున పండితారాధ్యుఁడు గూ డఁ గొన్ని గద్యకృతులు రచించినట్లు సోమనాథుని గ్రంథములవలనఁ గోచర మగుచున్నది. చూడుఁడు.

"సీ. శ్రుతి "ఏకఏవరు ద్రోనద్వితీయాయతస్థే" యనుట యథార్థంబుతలఁప
నవల "నణోరణీ... ..." ... యనూనపదము

పంబియవాగ్గోచ రంబను నప్రాప్య మనసాసహాయనుమాట నిజము
ఏదియుఁ గాదనియెడి పరమేశ్వరుఁడె యెఱుంగునెద్ది దన్నెఱుఁ గదనెడు
గీ. నెట్టులనుచుసంశ యింపకశివతత్వ సారగద్యపద్య సమితిశివుని
మహిమ తెల్పినట్టి మల్లికార్జునపండి తయ్యగారిఁదలఁతు ననుదినంబు.

(అనుభవసారము)

"ఉద్యత్ప్రసక్తి లింగోద్భవదేవు గద్యంబునానొక్క గద్యంబుచెప్పి"

(పండి. మహిమాప్రకరణము)

పాంచభౌతికపంచ పంచేంద్రియప్రపంచదూరుని తెంచుఁబంచగద్యలను
శివతత్వసార సంచితమహామహిమ శివతత్వసారమస్ శివకృతిఁబొగడు

(పండి. దీక్షాప్రకరణము)

పయివానిలో, అనుభవసారపద్యమును గూర్చి వ్రాయుచు కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు శివతత్వసార పీఠికలో నిట్లు వ్రాసి యున్నారు.

"దీనినిబట్టి చూడఁ బండితయ్య శివతత్వసారమను గ్రంథమును గద్య పద్యములుగఁ జేసినట్లు కానవచ్చుచున్నది. "గద్య" అనుపదము "హృద్య" కుమాఱుగ లేఖక ప్రమాదమునఁ బడినదేమో? అట్లుగాక "గద్యపద్య" మన్న పాఠమే నిజమగునేని పండితుఁడు గద్యమందును నొకశివతత్వసారమును రచించియుండును. ఇప్పుడుమనకు దొరకినది కేవలము పద్యమయము. ఇందే కొంత గద్యమున్న యెడల లేఖకుఁడు దానిమాత్రము వ్రాయకుండునా?" శ్రీ లక్ష్మణరావుగారి సమన్వయము సరిగాదేమోయని సందియమందుచున్నాను. ఇది ద్వంద్వసమాసమనియు "శివతత్వసార" "గద్యపద్యసమిత" అనునవి యాసమాసమందలి వేర్వేఱుపదములనియు, శివతత్వసారమునను గద్యము లను, పద్యసమితిని బండితుఁడు శివునిమహిమల నుద్ఘాటించెనని సోమనాథుని భావమైయుండుననియు నాకుఁదోఁచుచున్నది. అందులకుఁ బండితారాధ్యచరి త్రమందలి పయివాక్యములుగూడఁ దోడ్పడఁగలవు. కావున సోమనాథునికా లమునాఁటికి గద్యకృతి రచనముకొలఁదిగనో గొప్పగనో ప్రచారములో నుండినట్లు స్పష్టమగుచున్నది.

ఇఁక నీగద్యకృతుల లక్షణస్వరూపాదులను మనకు దొరకిన సోమనా థుని కృతులనుబట్టి యించుక పరిశీలింతము.

గీ. పరఁగుగవిత గద్య పద్యంబులనఁ బాద
కల్పనంబువలదు గద్యమునకుఁ
బాదనియతినొప్పు బద్యంబులవియువృ
త్తములు జాతులనఁగ నమరుఁగృష్ణ.

క. కనుఁగొన బాదరహితమై
పనుపడి హరిగద్దెవోలె బహుముఖరచనం
బున మెఱయు గద్యమదిదాఁ
దెనుఁగుఁ గృతుల వచనమనఁగ దీపించుఁగడున్.

అని యనంతుఁడు తనఛందోదర్పణమున గద్యలక్షణమును నిర్వచించి యందులకు "స్వస్తిశ్రీ సమస్తభువనరక్షాదక్ష శ్రీపుండరీకాక్ష; భుజగపతి సింహాసనారూఢ, సురనికరమకుటఘటిత సురుచిరమణి గణప్రభావిభాసిత పాదపీఠ—ఇత్యాదిగా లక్ష్యమునొసంగినాఁడు. అప్పకవిగూడ నిట్లే.

మ. ధరసాహిత్యము గద్యపద్యములనం దారెండు భేదంబులై
పరఁగున్గద్యమునందుఁ బాదనియతుల్ భావింపగా లేవువా.
క్స్ఫురణంబై విలసిల్లఁగా నుడువనొప్పుంగావ్యఁడెం తేనియున్
మరు తండ్రీ! మఱి దీనికే వచననామం బయ్యెనాంధ్రంబునన్.

అనిగద్యమును వచనపర్యాయముగనే నిర్వచించి లక్ష్యలక్షణోదాహరణములలో అనంతునినను వదించినాఁడు. ఇఁకఁ బద్యలక్షణమును నిర్వచించు నాతఁడు

గీ. కొంగను నిషాదుఁడేయఁగ న్గాంచినవామ
లూరుభవుని శోకంబుల కారసహిత
మైకదా శ్లోకమయ్యెఁ బద్యంబు నందు
దానిఁగొందఱు నాల్గుపాదముల కలిమి

గీ. పాదనియమంబుఁ గలయట్టి పద్యసమితి
వృత్తములు జాతులునన ద్వివిధమయ్యె
నిట నిసర్గగణంబుల వృత్తములగు
జాతు లుపగణమాత్రల జరగుచుండు

అని వ్రాసియున్నాఁడు మఱియు

క. హృద్యాన పద్యకావ్యము
గద్యము పద్యమని చెప్పఁగా ద్వివిధమగున్

గద్యం బపాద పదనిక
రద్యోదిత నవరసార్థ రచనలఁజెల్లుస్.

క. నాలుగు పాదంబులచే
నాలుగుప్రాసల్లు గూడి నంబద్యము ప
ద్యాలియు నిరుతెఱఁగై చను
నోలిని వృత్తములుజాతు లొనరంగృతులస్.

అని భీమనకవి జనాశ్రయమునందును.

మ. కమనీయంబగు గద్యపద్యమయమై కావ్యంబు గద్యంబునా
నమరుం బాదనియంత్రణానియమవిన్యస్తప్రశస్తార్థమై
రమణీయాంఘ్రిచతుష్టయ స్ఫుటవళి ప్రాసాభిరామంబు ప
ద్యము; తత్పద్యము వృత్తజాతులన రెండై పర్వుఁగావ్యంబునస్.

క. వృత్తంబనఁ జతురంఘ్రిసు
వృత్తంబై వళులన్రాల వెలయును; మాత్రా
యత్తగణంబుల చేతఁబ్ర
వృత్తాకృతిఁ బరఁగుజాతి వితతులుకృతులస్.

అనిపెద్దన కావ్యాలంకర చూడామణి యందునుగూడఁ బయికీతినే గద్యపద్యలక్షణములను నిర్వచించియున్నారు. వీనినిబట్టి పాదనియతిలేనిదిగ ద్యమనియు, చతుష్పాదనియతిగలది పద్యమనియు నీలక్షణకారుల మతమయి నట్లు స్పష్టమగుచున్నది. మనమెఱింగిన యాంధ్రచ్ఛందో లక్షణకారులెల్ల గద్యపద్యలక్షణముల నిట్లే నిర్వచించియున్నారు. కానిమన సోమనాథుని కృతులిందులకు విలక్షణములుగా నున్నవి. అనంతుఁడు అప్పకవి లక్ష్యములుగా నుదాహరించిన గద్యలవంటివేగాక ద్విపాదనియతిగలిగి మాత్రాగణబద్ధము లగు రచనములనుగూడ సోమనాథుఁడు గద్యలుగా గణించినట్లు లాతనిగద్య కృతులలోని యీ క్రింది యుదాహరణములఁబట్టి గ్రహింపఁదగియున్నది. పండి తారాధ్య చరిత్రములో

"జాతులు మాత్రాను సంధానగణవి
సీతులుగాన "అనియతగద్యై" ర
నియును "ప్రాసోవా" యనియు "యతిర్వా" య
నియుఁ జెప్ప ఛందోవినిహితోక్తి గానఁ

గీ. పరఁగుగవిత గద్య పద్యంబులనఁ బాద
కల్పనంబువలదు గద్యమునకుఁ
బాదనియతినొప్పు బద్యంబులవియువృ
త్తములు జాతులనఁగ నమరుఁగృష్ణ.

క. కనుఁగొన బాదరహితమై
పనుపడి హరిగద్దెవోలె బహుముఖరచనం
బునమెఱయు గద్యమదిదాఁ
దెనుఁగుఁ గృతుల వచనమనఁగ దీపించుఁగడున్.

అని యనంతుఁడు తనఛందోదర్పణమున గద్యలక్షణమును నిర్వచించి యందులకు "స్వస్తిశ్రీ సమస్తభువనరక్షాదక్ష శ్రీపుండరీకాక్ష; భుజగపతి సింహాసనారూఢ, సురనికరమకుటఘటిత సురుచిరమణి గణప్రభావిభాసిత పాదపీఠ—ఇత్యాదిగా లక్ష్యమునొసంగినాఁడు. అప్పకవిగూడ నిట్లే.

మ. ధరసాహిత్యము గద్యపద్యములనం దారెండు భేదంబులై
పరఁగున్గద్యమునందుఁ బాదనియతుల్ భావింపగా లేవువా.
క్స్ఫురణంబై విలసిల్లఁగా నుడువనొప్పుంగావ్యుఁడెం తేనియున్
మరు తండ్రీ ! మఱి దీనికే వచననామం బయ్యెనాంధ్రంబునన్.

అనిగద్యమును వచనపర్యాయముగనే నిర్వచించి లక్ష్యలక్షణోదాహరణములలో అనంతునినను వదించినాఁడు. ఇఁకఁ బద్యలక్షణమును నిర్వచించు నాతఁడు

గీ. కొంగను నిషాదుఁడేయఁగ గ్గొనినవామ
లూరుభవుని శోకంబుల కారసహిత
మైకదా శ్లోకమయ్యెఁ బద్యంబు నండ్రు
దానిఁగొందఱు నాల్గుపాదముల కలిమి

గీ. పాదనియమంబుఁ గలయట్టి పద్యసమితి
వృత్తములు జాతులునన ద్వివిధమయ్యె
నిట నిసర్గగణంబుల వృత్తములగు
జాతు లుపగణమాత్రల జరగుచుండు

అని వ్రాసియున్నాఁడు మఱియు

క. హృద్యాన పద్యకావ్యము
గద్యము పద్యమనిచెప్పఁగా ద్వివిధమగున్

గద్యం బపాద పదనిక
రచ్యోదిత నవరసార్థ రచనలఁజెల్లుస్.

క. నాలుగు పాదంబులచే
నాలుగుప్రాసల్లు గూడి నంబద్ధ్యము ప
ద్యాలియు నిరుతెఱంగై చను
నోలిని వృత్తములుజాతు లొనరంగృతులస్.

అని భీమనకవి జనాశ్రయమునందును.

మ. కమనీయంబగు గద్యపద్యమయమై కావ్యంబు గద్యంబునా
సమరుం బాదనియంత్రణానియమవిన్యస్తప్రశస్తార్థమై
రమణీయాంఘ్రిచతుష్టయ స్ఫుటవళి ప్రాసాభిరామంబు ప
ద్యము; తత్పద్యము వృత్తజాతులనరెండై పర్వుఁగావ్యంబునస్.

క. వృత్తంబనఁ జతురంఘ్రిసు
వృత్తంబై వళులన్రాల వెలయును; మాత్రా
యత్తగణంబుల చేతఁబ్ర
వృత్తాకృతిఁ బరఁగుజాతి వితతులుకృతులస్.

అనిపెద్దన కావ్యాలంకర చూడామణి యందునుగూడఁ బయిరీతినే గద్యపద్యలక్షణములను నిర్వచించియున్నారు. వీనినిబట్టి పాదనియతిలేనిదిగ ద్యమనియు, చతుష్పాదనియతిగలది పద్యమనియు నీలక్షణకారుల మతమయి నట్లు స్పష్టమగుచున్నది. మనమెఱింగిన యాంధ్రచ్ఛందో లక్షణకారులెల్ల గద్యపద్యలక్షణముల నిట్లే నిర్వచించియున్నారు. కానిమన సోమనాథుని కృతులిందులకు విలక్షణములుగా నున్నవి. అనంతుఁడు అప్పకవి లక్ష్యములుగా నుదాహరించిన గద్యలవంటివేగాక ద్విపాదనియతిగలిగి మాత్రాగణబద్ధము లగు రచనములనుగూడ సోమనాథుఁడు గద్యలుగా గణించినట్లు లాతనిగద్య కృతులలోని యీక్రింది యుదాహరణములఁబట్టి గ్రహింపఁదగియున్నది. పండి తారాధ్య చరిత్రములో

"జాతులు మాత్రాను సంధానగణవి
సీతులుగాన "అనియతగద్యై" ర
నియును "ప్రాసోవా" యనియు "యతిర్వా" య
నియుఁ జెప్ప ఛందోవినిహితోక్తి గానఁ

ప్రాసమైనను యతిపై పడిమైన
దేసిగానిలిపియా దిప్రాసనియతి
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు"

అని సోమనాథుఁడు పద్యభేదములలో నొకటగుజాతి వృత్తలక్షణ మును నిర్వచించి యాజాతులలోఁ జేరినద్విపదల ను దల్లక్షణానుసారముగ రచించుట యొప్పిదే యున్నది. కాని యీలక్షణానుగుణముగనే మాత్రాగణ బద్ధముగ ద్విపాదనియతితో రచించిన కృతులనుగూడ గద్యలుగా గణించుటలో నాతనియుద్దేశ మేమయియుండునో తెలియరాకున్నది. మఱియు నీతఁడు బసవపురాణ పండితారాధ్యచరిత్రములలో నాశ్వాసాంతము లందలి గద్యలను ద్విపదపంక్తులలోనే వ్రాసియున్నాఁడు కర్ణాటక చ్ఛందోలక్షణకర్త యగు నాగవర్మకూడఁ దనఛందోంబుధిలో మనయాంధ్రచ్ఛందోలక్షణ కారులవలెనే గద్యవచనములను బర్యాయపదములుగా నుపయోగించియున్నాఁడు. సోమనాథుని గద్యకృతులు నాగవర్మ గద్యలక్షణమునకుఁ గూడ సరిపోవుట లేదు. సోమునికాలమునాఁటి యాంధ్రచ్ఛందోలక్షణగ్రంథములు మనకు లభింపలేదు. వానిలో జాతులకు గద్యలకుఁగూడ నించుమించుగ నేకరూపలక్షణమే చెప్పఁబడియుండెనా? విజ్ఞులు విచారింతురుగాక! ఇఁక సోమనాథుని గద్యలలోనుండి యుదాహరణముల నొసంగెదను

## పంచప్రకారగద్య

అయిదువిధములగు గద్యరచనము లిందుండుటనే సోమనాథుఁడు దీని కిట్టి పేరిడియుండునని తోఁచుచున్నది. మల్లికార్జునపండితుఁడు రచించిన "పంచగద్యలు" కూడ నిట్టివేకాఁబోలును గద్యారంభమున బసవస్తోత్రపరమగు నీక్రింది శ్లోకమున్నది.

శ్లో. స్వస్తిశ్రీప్రమథాన్వయోత్త మశిలాద శ్రీమునీంద్రాత్మజః
శ్రీకంఠప్రతిబింబమూర్తి రనఘశ్శ్రీనందినాథోవిభుః
తస్యాంశోద్భవ దండనాథబసవశ్రీ నామధేయప్రభో
త్వత్కారుణ్య తరంగితం మయిసదానిక్షిప్యతాం వీక్షణమ్.

## గద్య మొదటివిధము.

(1) జయజయబసవ శ్రీమన్మహావృషభేంద్రావతార సమంచితవీరమాహేశ్వరా చారసార-ప్రమథగణాలంకార- జగత్త్రయాధార- దేవబసవా

(2) నిరాకుల నిరర్గళ నిరతిశయ నిజభక్తి తాత్పర్యశరణగణ చరణార విందమకరంద ధారాభిషేకసంగత మంగళాలంకార విరచితోత్తమాంగ అన వరతసుఖానుషంగ- జ్ఞానవైరాగ్యైశ్వర్య విభ్రాజితగుణోత్తుంగ- సకలలోకప్ర సారితకీర్తి కాంతాభుజంగ- దేవబసవా.

(3) సకల వేదాంతాపాదితలింగ ప్రసాదవిముఖ మదోన్మత్తనిషాద సంహారధారణకారణ ప్రత్యలలాటేక్షణ- ఆశుశుక్షణీ సదృక్షవిపక్షభక్షణ-సకల జగదవన కళావిచక్షణ- సంచిత సద్భక్తిలక్షణ- జంగమావతార సంగమేశ్వ రలలాటతటతృతీయేక్షణ- దేవబసవా.

ఈవిధమున నిందులో నెనిమిది గద్యములున్నవి. మచ్చునకు మూఁడు మాత్రము యుదాహరించితిని. అనంతుఁడు మున్నగు లాక్షణికులు చెప్పిన గద్యలక్షణమున కివి సరిపడుచున్నవి. ఇఁక

రెండవ విధము.

అపిచమహా మహిమోన్నతవిభవా- భవపాశోత్కరశాతలవిత్రా- వి త్రాసిత బిజ్జలధరణీశా- ధరణీశప్రకరార్చితచరణా- చరణద్యుతి జితకోమల పద్మా- పద్మభరప్రముఖామరవినుతా- నుతగాంధర్వసుఖస్ఫురితాంగా- అం గానంగవికారవిరహితా- హితశివయోగానందసుఖాశ్రమ- ఆశ్రమధర్మాధర్మ వివర్జిత- జితమదవిహ్వల మానుషజన్మా- జన్మజరామరణాదివిదూరా- దూర నిరాకృతభవసంసర్గా- సర్గస్థితిలయపాలనచరితా- చరితార్థాఖిలజంగమభక్తా భక్తజనాంతః కరణనియుక్తా- దేవబసవా-

మూఁడవ విధము.

జయజయ నిరవధినిర్మలగాత్రా - జయజయదురితలతాచయదాత్రా జయజయ కేవల భక్తికళత్రా- జయజయ భావాతీతచరిత్రా- జయజయ తను గుణపరిషదమిత్రా- జయజయ వివిధేంద్రియమదజైత్రా- జయజయసద్గుణ మణిగణపాత్రా- జయజయ దుఃఖాబ్ధివహిత్రా...... దేవబసవా-

ఇట్టివే 33 పాదములతో నిది గూర్పఁబడినది. ఎనిమిదిమాత్రమే యు దాహరించితిని. ఈ రెండు మూఁడువిధముల గద్యములను బరికింపనివి నాలుగు మాత్రలుగల గణములు నాలుగింటితోఁ గూర్పఁబడినట్లు కనఁబడుచున్నది. మొదటిదానిలో ముక్తపదగ్రస్తమును రెండవదానిలో నంత్యప్రాసమును బా టింపఁబడినవి. నాగవర్మ ఛందోంబుధిలో

క. గణనియమ విపర్యాసదొ
ళేనోవడె దెళ్పెసెదుమాత్రె సమనాగెగుణా
గ్రణియమతదింధె తాళద
గణ నెగొడంబట్టు దదువె రఘటాబంధం.

అని రగడలక్షణమును నిర్వచించినాఁడు అక్షరగణములతోఁ గాని కేవల మాత్రాప్రధానముగఁగాని గాక తాళమునకు సరిపడునట్లు కొన్ని నియతగణములలో నిముడు సమానమాత్రలుగల పాదములతోఁ గూర్పఁబడినది రగడయని దీనిభావము. మఱియు

క. మందా నిలలలితోత్సవ
వెందేరగళెగళ నామమక్కుంక్రమదిం
దొందకెపది నాటిర్ప
త్తొందక్కిర్పత్తునాల్కు మాత్రెగళబవే.

క. ఇప్పత్తుమాత్రెల లితెగె
బప్పదు పదినాలుమాత్రె మందానిలకం
తప్పదు వుత్సాహక్కుఱొ
మొప్పవు దిప్పత్తునాల్కుమాత్రె గళబవే.

అని కన్నడములో ముఖ్యముగా మందానిలము, లలితము, ఉత్సాహముఅను త్రివిధరగడలు గలవనియు నందు మందానిలమునకుఁ బదునాలును, లలితకిరువదియు, ఉత్సాహమున కిరువదినాల్గును మాత్రలుండుననియు నాతఁడు వ్రాసియున్నాఁడు. దీనిని బట్టియు రఘటారచనమున కాతఁడుచెప్పిన సామాన్యలక్షణమునను సరించియు నాలుగేసి మాత్రలుగల గణములు నాల్గింటిని గల్గినది లలితరగడయనియు, మూఁడేసి మాత్రలుగల యెనిమిది గణములగల్గునది యుత్సాహరగడయనియు శ్రీకిట్టైలుదొరగారు సోమనాథుని పయిరెండు మూఁడువిధముల గద్యములును నాలుగేసి మాత్రలుగల గణములు నాలుగుగలిగి యుండుటచే నాగశర్మచెప్పిన మందానిలరగడలక్షణమునకు సరిపోవుచున్నవి. కాని రెండవదానిలో రగడలక్షణమున కావశ్యకమగు నాద్యంత ప్రాసనియతికానరాదు. మూఁడవదానిలో యతినియమము దక్కినచో నిది తెలుఁగురగడలలో మధురగతిరగడలక్షణమునకు సరివచ్చును

నాలుగవ విధము.

జయదురితపరిహరణ- జయసుకృతవరచరణ- జయనికృతరవికిరణ- జయసుకవినుతికలిత- జయవికచముఖలలిత- జయవినయనయమిళిత- జయనిగరిణితమదన- జయపరమసుఖసహిత- జయవిషయ గుణరహిత- జయవృషభనామహిత- దేవబసవా-

ఇందుఁ బాదమునకు రెండు పంచమాత్రాగణములుండి మూఁడుపాదములకొక యంత్యప్రాసము పాటింపఁబడినది. ఇందలి రెండుపాదములు గలిసినఁ గన్నడమందలి లలితరగళె పాదమునకును నిప్పటి దెలుఁగునందలి ద్విరదగతిరగడ పాదమునకును సరివచ్చును.

అయిదవ విధము.

జయశివరంజన- జయభవభంజన- జయకరుణాకర- జయపరభీకర- జయమితభాషణ- జయశ్రితపోషణ- జయగుణరాజిత- జయగణపూజిత- జయజయ శ్రీబసవదండనాథ నమస్తే నమస్తేనమః

ఇందుఁ బాదమునకు నాలుగుమాత్రలగణములు రెండుండి రెండుపాదములు గలిసినఁ గన్నడమందలి మందానిలరగడ పాదమునకును, తెలుఁగునందలి మధురగతిరగడ పాదమునకును సరివచ్చుచున్నది. గద్యముచివరను

"బసవస్య కృపామూర్తేః సోమనాథప్రసాదినాం
అనవద్యమిదం గద్యం నిరుద్దితజగన్నుతం" అను శ్లోకమున్నది.

మాలిని. జయజయ బసవాఖ్యా స్స్వానుభూత్యైకసౌఖ్యాః
ప్రమథగణచరిత్రః ప్రస్ఫురద్భక్తిగోత్రః
ప్రణమితబుధవర్యః స్ఫారదైశ్వర్యధుర్యః
ప్రథిత వృషభరూపో బాహుశౌర్యప్రతాపః

శ్లో. శ్రీకంఠోద్భవ వేదచోదితలసద్వీరవ్రతప్రక్రియా
చర్యాదేశక దేశికాయ భువనస్తుత్యాయ నిత్యాయస
ద్భాండాగార ధురంధరాయ సుమహారుద్రాయభద్రాయ తే
సాక్షాచ్ఛ్రీవృషభాధిపాంశ బసవాధీశాయ తస్మైనమః.

అను శ్లోకములతోఁ బ్రారంభమయి యిది 58 చరణములతోఁ గూర్పఁబడినది. ఒక్కొక్క చరణమునకుఁ బ్రాసతోఁగూడిన రెండేసిపాదములు నాలింటితోఁ గూర్పఁబడిన ప్రతిపాదము నాలుగుమాత్రలగణములు

మశ్శబ్దముతో నంతమగుచుండును. నమస్కారాంతములగు చరణములతోఁ జెప్పఁబడుటచేనిది నమస్కారగద్యయని పేర్కొనఁబడినట్లు తోఁచుచున్నది. మచ్చునకుఁ గొన్ని పాదము లుదాహరించుచున్నాను.

అపిచశ్రీ ప్రమథేంద్రాయనమో వ్యపగతహృద్గతతాంద్రాయనమః
సాధితచాళుక్యేంద్రాయనమో మేధాజిత వాణీంద్రాయనమః
సుగుణానందకరండాయనమో జగదవన కళాశౌండాయనమః
సురుచిర శమదమషండాయనమో దండితదురితోద్దండాయనమః
ఖండితపితృపతి దండాయనమో దండితదురితోద్దండాయనమః
శమితమదాసమ కాండాయనమో విమలయశోజ్జ్వాండాయనమః
ప్రగణితభక్తి శిరస్కాయనమో జగదురుతర తేజస్కాయనమః
సంగతభుజగోరస్కాయనమో లింగవి లీనమనస్కాయనమః
సారాగమ విస్తారాయనమో భూరివికారని కారాయనమః
సూరిసుఖదమందారాయనమో భూరిదయామృత పూరాయనమః.

ఇట్లే గద్యపాదములన్నియు నంత్యప్రాసముతో నలంకరింపఁబడి యున్నవి. అంతమున "మంగళప్రసంగసంగన బసవలింగాయతే నమస్తే నమస్తే నమః" అను నమోవాకముతో గద్యముగింపఁబడినది.

అక్షరాంక గద్య.

నమస్కార గద్యారంభముననున్న మాలినీవృత్త శ్లోకముతో నిది గూడ నారంభమయ్యె, అకారమాదిగ క్షకారమంతముగఁగల యక్షరసమామ్నాయమందలి ప్రత్యక్షరముతోను వరుసగా నంకితములయిన చరణములతోఁగూర్పఁ బడియన్వర్థాభిధానమున నొప్పుచున్నది. పాదాంతమున నిలుపబడిన ప్రణవాక్షరముగాక ప్రతిపాదము పంచమాత్రలుగల రెండుగణములతోఁ గూర్పఁబడినవి చూడుఁడు.

అపిచశివ శృంగారఓం ఆదిపదవిస్తారఓం
ఇహపర సుఖాధారఓం ఈషణత్రయ దూరఓం
ఉద్ధుర గుణోపేతఓం ఊర్ధ్వరేతోజాతఓం
ఋషభినామఖ్యాతఓం ౠజమాయాతీతఓం
ఌశ్లాఘ్యసఁదేశఓం ౡజనకసంకాశఓం
ఏకాంగవీరేశఓం ఐక్యసాఖ్యావేశఓం

ఓమితిపదోన్నద్ధఓం ఔపరాపరశుద్ధఓం
అంధ్యాన సుసమృద్ధఓం అఃకవితగుణబద్ధఓం
కలిమలాపహాశౌర్చ ఖలనిరస నాచార్యఓం
క్షురవిముఖచారిత్రఓం అక్షరస్తుతిపాత్రఓం
శివకర శ్రీబసవన దండనాథఓం నమస్తే నమస్తేనమః.

గద్యయొక్క యంతమున నీక్రింది శ్లోకమున్నది.

శ్లో. అకారాది క్షకారాంత మకరోదక్షరమాలికా
ప్రసాది సోమనాథాఖ్యః బసవస్యకృపానిధేః.

బసవరగడ.

ఉ. శ్రీవరాజదేవరాజ సిద్ధసాధ్యయక్షర
క్షోవిహంగ రాట్పతంగ సోమధూమకరమరు
జ్జీవితేశవిధృతపాశ సేవితోద్యదంఘ్రిరా
జీవనిమ్మనాం పొగళ్వె శ్రీవృషాధినాయకా.

అను నుత్సాహవృత్తముతో నిది యారంభమగుచున్నది. కవి దీనికి బసవాష్టోత్తర శతనామములను పేరుగూడ నుంచియున్నాఁడు. అందుచే నిది 108 చరణములు గలిగియుండునని తోఁచుచున్నది. నాప్రతిలోఁ గొన్నిపాదములు లోపించి 98 మాత్రమేయున్నవి. కర్ణాటకవి చరిత్రకారులు దీనినే "శరణుబసవరగళె" యను కర్ణాటకభాషాకృతిగా గ్రహించి యందుఁ గూర్చి తమగ్రంథములో నీక్రిందివిధమున వ్రాసియున్నారు. "ఇదరల్లి 108 కందగళివె. ఒందొందుకందపూశరణు బసవ ఎందుముగియుత్తదె. ఈగ్రంథద అంత్యదల్లి ఈకందవిదె.

వే. శరణస్తవ కల్పకుజాం
కురపదశాఖాభి జాతనవకుసుమాష్టో
త్తరశతనామంగళబస
వరనం గర్పిసెదపాల్కురికి సోమాంకం.

వీరుదాహరించిన యీకన్నడ కందపద్యము నాప్రతిలోఁగూడ నీరగడచివరనున్నది. అంకితపద్య మొక్కటియే కందమందున్నదిగాని తక్కినగ్రంథమంతయు రగడపాదములతోనే గూర్పఁబడియున్నది. కర్ణాటకకవి చరిత్రకారులు దీనియందు 108 కందములున్నవని వ్రాయుటప్రమాదము. మచ్చునకీక్రింది పాదములు చిత్తగింపుఁడు.

శ్రీవృషాధినాయక ప్రసిద్ధభావశరణు బసవ
తావకాంఘ్రిసేవకాఘదావది హాశరణుబసవ
నందితద్వితీయ శంభునామధేయ శరణుబసవ
వందితత్రిలోకవిబుధవరని కాయశరణుబసవ
అచలశైవధర్మ నిర్మలావతార శరణుబసవ
ప్రచురయుగమితాంఘ్రిధర్మ పదవిహారశరణుబసవ
ప్రకటభవలతావితానపటుల విత్రశరణుబసవ
వికటభవిసమిత్సమూహ వీతిహోత్ర శరణుబసవ
వ్యక్తవేదయుక్తనాద శక్తిమోద శరణుబసవ
శక్తిచైత్రయుక్తిపాత్ర భక్తిగోత్ర శరణుబసవ
ధర్మరూపశరణుబసవ దమితపాద శరణుబసవ
నిర్మలాంగశరణుబసవ నికృతభంగ శరణుబసవ.

నాగవర్మ ఛందోంబుధిలోని యుత్సాహరగళె లక్షణమునకిది సరివచ్చుచున్నది గాని పాదమున కెనిమిది సూర్యగణములుగలిగి యైదవగణము మొదటియక్షరమునందు యతిసిలుపఁబడి యిది సర్వవిధముల మనతెలుగు నందలి తురగవల్గనరగడతోఁ దుల్యమగుచుండుటచే దీని నాంధ్రభాషాకృతి గనే గణింపఁదగునని నాయభిప్రాయము. బసవపురాణమున, బ్రథమాశ్వాసాంతమునఁ గథాశ్రోతయగు గొబ్బూరి సంగామాత్యుని సంబోధించుపట్టున "బసవనామావళి పాఠకాసక్త బసవనామావళి పఠనానురక్త" అని సోమనాథుఁడు వ్రాసియున్నాఁడు. ఈబసవనామావళి యనునది బసవాష్టోత్తర శతనామావళియను నామాంతరముతో రచింపఁబడిన యీబసవరగడయే యై యుండునని తోఁచుచున్నది.

### త్రివిధ లింగాష్టకము.

ఇది కేవల సంస్కృతకృతియైనను దీనినిగూర్చి కూడ నించుకవివరించి యీవ్యాసమును విరమించుచున్నాఁడను. ఇదియనుష్టుప్ శ్లోకముతో రచింపబడినది. ఇష్ట, ప్రాణ, భావలింగములను త్రివిధలింగము లొక్కొక్కటిని గూర్చి యెనిమిదిచొప్పున మొత్తమిరువదినాలుగు శ్లోకములు రచింపఁబడినవి రెండుచొప్పున నుదాహరించుచున్నాను.

శ్లో॥ శ్రీలింగరూపసంకాశం శంకరం దేవపూజితం
నాదోజ్జ్వలకళాకారం స్వేష్టలింగమహం భజే

శ్లో. పంచాకాశమహాకాశం పంచాచారప్రకాశితం
పంచాక్షరమయాకారం స్వేష్టలింగమహంభజే.
శ్లో. జీవాధారం శివాధారం జ్ఞానాధారం పరాత్పరం
సర్వవ్యాపకమంత్రార్థం ప్రాణలింగమహంభజే.
శ్లో. చైతన్యం శాంతరూపంచ మంత్రార్థం మంత్రరాజితం
చిన్నాదంచిత్కళాబిందు ప్రాణలింగమహంభజే
శ్లో. భావాతీతం శుభానందం మండలత్రయమధ్యగం
లింగత్రయత్రిలక్ష్యాంతం భావలింగమహంభజే.
శ్లో. ఆత్మజ్యోతి రహంకారం త్రివేణీసంగమోజ్జ్వలం
త్రికూటస్థానసంకాశం భావలింగమహంభజే.

చివరను "పండితసోమనాథేన కృతంలింగాష్టకత్రయం
యఃపఠేత్ సతతం విద్వాన్ భుక్తిముక్తి ఫలప్రదం"
అనుశ్లోకముతో ఫలశ్రుతి చెప్పఁబడినది.

మహాశయులారా! ప్రాచీనాంధ్రవాఙ్మయ స్వరూపమును దెలియఁ గోరువారికి సోమనాథుని కృతులవలనఁ బెక్కువిశేషములు తెలియు నవకాశములు గాన్పించుచున్నవి. కావున నాతని ప్రాథమికకృతులుగాఁ గానవచ్చు నీగద్యకృతులను లోకమునకించుక పరిచయ మొనర్చు తలంపుతో నీవ్యాసము నున్వ్రాసినాడను. పండితులిందలి లోపములను మన్నింతురుగాక యని ప్రార్థించుచున్నాఁడను. ఈకృతులను సమగ్రముగా సాధ్యమయినంతత్వరలో భారతిలోను సాహిత్యపరిషత్పత్రికయందును బ్రకటించి లోకమున కర్పింపనెంచినాడను. ప్రాజ్ఞలోకము వానినిదగు రీతిని సంభావించి తద్విశేషములను వెల్లడించుఁగాత!

---

# అరవమునందలి వింతయక్కరము తెలుగున గలదా?

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

మన తెలుంగుబాసయు వర్ణసమామ్నాయమును మాతృభాష యగు సంస్కృతముతోఁ గలిసిపోయి వేఱువేఱుగ విడఁదీయరాని సారూప్యము నందియున్నవి. ఐనను విమర్శకు లగుపండితు లాదినుండియు నీరెండుభాషలకుం గలభేదమును విస్పష్టముగాఁ జూపఁబ్రయత్నము చేయుచునేయున్నారు. శబ్దశాస్త్రరహస్యజ్ఞు లగుమనప్రాచీనపండితులు సంస్కృతమున లేనట్టియు తెలుఁగున మాత్రమేయున్నట్టియు నక్కరము లాఱు కల వని నుడివియుండిరి. అయ్యవి (1)ఎ, (2)ఒ, (3)ౘ, (4)ౙ (5)ఱ, (6)ఁ, అనునవియై యున్నవి. ఈయక్షరషట్కము సంస్కృతమున లేదు. మనపూర్వులు చెప్పిన కేవలాంధ్రాక్షరము లీయాఱేయై యుండఁగా నవీను లింకొక్క కేవలాంధ్రాక్షరమును గనుఁగొంటి మనియు నయ్యది పూర్వపుటాంధ్రశాసనములలో మాత్రమే వాడఁబడుచుండెడి దనియు నిటీవల వాడుకలోనుండి తప్పిపోయిన దనియు నయ్యది యడ్డుగీటులేని శకటరేఫాకృతి ననఁగా(ఴ) నీరూపమున నుండెడిదనియుఁ గొందఱు నుడువుచున్నారు. ఈయక్షరరాజము పూర్వకాలమునందు తెలుంగుశాసనములలోఁ బూర్వముండెడి దని మొదటఁ గనుంగొనినవారు దొరతనమువారి పూర్వశాసనలిపిజ్ఞులఁట. వారియుపజ్ఞం బగు నీయక్కరము తెనుంగులో నున్నట్లు తెనుంగుబాసలో మొదటఁ ప్రచురింపఁ బ్రారంభించిన వారు కీర్తిశేషులయిన కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుపంతులవారు. వీరీయక్షరరహస్యమును లిపిశాస్త్రజ్ఞులనుండి తెలిసికొని యాంధ్రసాహిత్యపరిషత్పత్రికారాజములో నొకవ్యాసమును బ్రచురించిరి. ఈయక్కరము ద్రావిడభాషయందలి ழ అనువింత యక్కరపుధ్వనిని గలిగియుండెడి దఁట. దీనిని యుద్ధమల్లశాసనమునుండి తామే కనిపెట్టినట్టుగా లక్ష్మణరావుగారు వ్రాసిరి. ఇది నిజముగా మనభాషయందుఁగల వింతయక్కరమే యగుచో దాని కొకవింతశోభను గలిగించిన దని మనము చెప్పఁగొనవచ్చును ఈధ్వనియు నక్కరమును దొల్లికర్ణాటభాషయందుఁ గూడ నుండెడిదనియు వీరు చెప్పుచున్నారు. ఇది ప్రతిపక్షులవాదము.

పరిశీలించి చూడఁగ నీవింతధ్వని యాంధ్రమున నెన్నఁడును లేనియట్లు

తోఁచుచున్నది. ఈయక్కర మనఁగా నడ్డుగీటులేని శకటరేఫాకృతి గల సంజ్ఞ యొకటి మనలో నుండెడిది కాని యది యరవమునందలి వింతధ్వని వంటి ధ్వనిగలది కాదు. అయ్యది డకారధ్వని గలిగి యుండెడిది. అనఁగా డకారముయొక్క మాఱురూపముగా నుండెడిది. ప్రాచీనాంధ్ర శాసనములలో డకారధ్వనిని దెలుపుటకై రెండుసంజ్ఞలు వాడఁబడియున్నవి. మొదటిదిన డుమ గీటులేని ఉకారమువలెనుండి పైనతలకట్టు గలిగి యుండునది అదిట్లు ఉండును [illegible]. దీనిని మొదటిరూప మనవచ్చును ఈవ్యాసములో మొదటిడ కారరూపమని చెప్పఁబడినప్పుడెల్లఁ జదువరు లీయక్కరమునే గ్రహింపవ లెను. రెండవది అడ్డుగీటులేని శకటరేఫాకృతిగా నుండునది. ఇది యిట్లుండును (ఱ) ఇది రెండవరూపము ఈవ్యాసమందు రెండవడకారరూపమని తెలిపినపు డీ యక్కరమునే గ్రహింపవలెను తెలుఁగువాఙ్మయము నంతను బరిశోధించి చూడఁగఁబ్రతివాదులు విలక్షణాక్షరయుతము లనిచెప్పిన ఏడు, కోడి, అడు చుమున్నగు శబ్దములు డకారప్రాసస్థానములందుండి డకారయుతము లైనట్లే కాన్పించుచున్నవి. కాని విలక్షణాక్షరయుతము లైనట్లుగాఁ గాన్పించుటలేదు. కావున అడ్డుగీటులేని శకటరేఫరూపము తెలుఁగున డకారధ్వని గలదియే కాని విలక్షణాక్షరధ్వని కలది గాదు. అనునది యస్మద్వాదము.

ఈయక్కరముం గూర్చియు, తద్ధ్వనింగూర్చియు నాకును లక్ష్మణరా వుగారికిని దత్పక్షమువారికిని వాదోపవాదములు జరిగియున్నవి. దీనివలనఁ దెలుఁగున నరవమునందలి వింతధ్వనిగల యక్కరము లేదని స్థిరపడవలసి యున్నది. ఇట్లుండఁగా నీయక్కర మాభాషలో నుండెడిదనువాద మిదివఱ కెన్నఁడును జేసియుండనట్టియు కీ. శే. లక్ష్మణరావుగారి విమర్శనమునకు గుఱియైనట్టియు శ్రీజయంతి రామయ్యపంతులుగారు నాన్రాసినదానికై ఖండ నమును వ్రాసి మొన్నఁటిపరిషత్పత్రికలోఁ బ్రచురించిరి. వీర లీవింతయక్కర మును ధ్వనియును దెనుఁగులో యుద్ధమల్లశాసనము నాఁటి కుండెడి దనియుఁ దరువాత మాఱిపోయిన దనియు నప్పటినుండియు నీవింతయక్కరము డకార ధ్వనిని దెలుపునదిగా నుండెడి దనియు లిఖించిరి. ఇది వింతను బుట్టించుచు న్నది. ఏమన, యుద్ధమల్లశాసనమును మొదటఁబ్రచురించినవా రీరామయ్య పంతులుగారే. వారీ యడ్డుగీటులేని శకటరేఫముల మొదట డకారధ్వని గలవానినిగనే ప్రచురించిరి ఇప్పుడు తమవాదమునకు విరుద్ధముగా యుద్ధము

ల్లశాసనమున (కన్నడము) నరవమునందలి వింతయక్కరము కాన్పించుచున్నదని లిఖించిరి. వీరిట్లభిప్రాయమును మార్చుకొనుటకుఁ గలప్రబలకారణము లేవియుఁ గాన్పించుటలేదు. ఉండిన వారివాదమును శిరసావహింపవలసినదే కాని పరిశీలనముచేసి చూడ రామయ్యపంతులవారివాదము బహునిస్సారమైనదిగాఁ గాన్పించుచున్నది. కాన నీపునర్విమర్శనము సత్యనిర్ధారణార్థమై వ్రాయవలసివచ్చినది.

ఇదివఱకు జరిగినవిమర్శనములవలనఁ బ్రతివాదులు మొదటఁదలంపని విశేష మొకటి తేలినది. అడ్డుగీటులేని శకటరేఫాకృతిగల యీయక్కరము యుద్ధమల్లుని శాసనమున కీవలిశాసనములలో వింతయక్కరపుధ్వనిని దెలుపుటకుఁగాక డకారధ్వనిఁ దెలుపుటకై వాడఁబడినదని ప్రతివాదులెల్లరు నంగీకరింపవలసివచ్చినది. ఈవిషయమై పంతులవారే యిట్లు వ్రాసిరి.

"ఈయక్షరము యుద్ధమల్లుని శాసనమునందును అంతకు ముందు బుట్టిన శాసనములలోను మాత్రమె కనఁబడుచున్నది" మఱియు నిట్లువ్రాసిరి డకారయుక్తచో డశబ్దము గలశక్తివర్మశాసనము యుద్ధమల్లశాసనము పిదప బుట్టినదే" మఱియు శ్రీరామయ్యపంతులవారు లక్ష్మణరావుగారిపేర వ్రాసిన లేఖలో యుద్ధమల్లశాసనము నాటికే యీయక్కరము తనవింతధ్వనిని పోగొట్టుకొని డకారధ్వనికలదైనట్లే క్రిందిరీతిని లిఖించిరి.

"ఈయక్షరమునకు మొదట కన్నడములోవలెనే తెలుఁగునను ఉచ్చారణ బహుశః ఉన్నను యుద్ధమల్లుని శాసనమువఱకు నది మాఱి యప్పటినుండి యిది డకారమునకు అభేదభావముతో నితరడకారముతోఁబాటు వాడబడుచుండెను. అని నాయభిప్రాయము. నేను ఇందునుగురించి వ్యాసము వ్రాయనున్నాను" ఇది యీయక్కరమునకు డకారధ్వని యుద్ధమల్లశాసనము నాటికే యున్నట్లొప్పుచున్నది.

తామీ వింతయక్కరము డకారముగ దలంచుటకుఁగల కారణముం గూర్చి వీరిట్లు తమనూతనవ్యాసములో వ్రాసిరి. "నేనప్పుడీ యక్షరముస్వరూపమును జక్కగాఁ బరిశీలింపక స్థూలదృష్టిచేత డకారముగా గ్రహించితిని" ఇది సత్యముకాదు. వీరు స్థూలదృష్టిచేఁ జూచినప్పుడు మాత్రమేగాక ఇదిడకారమా వింతయక్కరమా యనువివాదము వచ్చినపిమ్మటఁ గూడ సూక్ష్మదృష్టిచేఁ బరికించి చూచి యుద్ధమల్లశాసనమందున్న యడ్డుగీటులేని

శకటరేఫాకృతులు డకారంబులే డకారధ్వనిగలవే, యనిసిద్ధాంతముఁ జేయుట యేగాక, ఆసిద్ధాంతమును ఋజువుచేసికొనుచు నొకవ్యాసమును వ్రాయుట కుఁగూడ నుద్యమించిరి. ఈయంశములు తాములక్ష్మణరావుగారిపేర వ్రాసిన *యుత్తరముంబట్టి విస్పష్టమగుచున్నవి. ఇంతలోనే హేతువుచేతనో యూహలుమారినవి. తాము వింతయక్కరము డకారధ్వనికలదని స్థూలదృష్టిచే జూచినప్పుడుమాత్రమే తలంచితిమని నేడు లోకమునకు తెలుపఁబ్రయత్నించుట ధర్మముకాదు. సూక్ష్మదృష్టిచే సిద్ధాంతముఁ జేసికొనిన యంశములను గూడ నిటీవల తగినహేతువు లభించినచో దిద్దుకొనవచ్చును. కాని యట్టి ప్రబల హేతువుం దీనిని వీరు తమ నూతనవ్యాసమునందు జూపియుండలేదు.

ఈవలి శాసనములలో నీవింత యాకృతినిలిచియుండి డకారధ్వనిని దెలుపునదిగా నున్నవు డంతకుఁబూర్వపు శాసనములలోఁ గూడ నాధ్వనిని దెలుపుటకయియే యిదివాడబడి యుండునని తలంచుట ధర్మము. కాని యాకారమాత్రమే సత్యనిర్ధారణమున కాధారమైనప్పుడు కొన్నిటి విషయమున మఱియొకలాగున దలంపదగదు. ఇట్లుండ తమతొంటి నిర్ధారణమును త్రోసివేసికొని శ్రీరామయ్యపంతులువారు యుద్ధమల్లశాసనములో నీయక్కరము వింతధ్వనిని దెలుపుచున్నదని వ్రాయుటవింతను బుట్టించుచున్నది. పరికించి చూడ యుద్ధమల్లశాసనమునందు నీవింతయక్కరము కలదనుటకంటె లేదనుటయే సమంజసముగఁ గాన్పించుచున్నది. అందుకుఁగల కారణముల నీక్రింద నిచ్చుచున్నాఁడను,

శకటరేఫాకృతి గలిగి వింతయక్కరమా, డకారమాయను సందియమును గలిగించుతావులు అయిదుకలవు. (1) అస్సి అనుపదమునందలి ప్రథమాక్షరము (2) అఱిసిన అనుశబ్దమునందలి ద్వితీయాక్షరము (3) అఱిపుట యను శబ్దమునందలి ద్వితీయాక్షరము (4) చెఱగులను శబ్దమునందలి ద్వితీయాక్షరము (5) వేఱులను శబ్దమునందలి తృతీయాక్షరము.

ఈమైదింటిని రామయ్యపంతులవారు మొదట డకారయుతములుగనే చదివిరి. కాని యిప్పుడు మొదటిమూఁడు పదములును అరవమునందలి వింత ధ్వనిగల విలక్షణాక్షరము లనియు నాల్గవదానియందుఁ గలది డకారమే కాని వింత యక్కరము కానేరదనియు, నయ్యది యితర డకారము లె

---

* ఇదికానూరి వీరభద్రేశ్వరరావుగారి వ్యాసమునకుదాహృతము

ట్టిరూపము గలిగియున్నవో అట్టిరూపమునే గలిగియున్న దనియు వాదింప మొదలిడిరి. ఇదవశబ్దముంగూర్చి వీరేమియు వ్రాసియుండలేదు. ఇట్లేల తెలి పితీరవలసివచ్చినదో యాప్రబలకారణములను వేనిని శ్రీరామయ్యపంతుల వారు తమవిమర్శనమున నిచ్చియుండలేదు. వీరు తలంచినట్లు తలంపవలసిన యవసరమేదియుఁ గాన్పించుటలేదు. సరేకదా యట్లు తలంచిన హాని కూడ వాటిల్లుచున్నది.

ఎట్లనిన, శాసనములో "యొట్టుఅస్సిమలినురై" అనియున్నది. వీరు ప్రారంభమున "నీయొట్టుడస్సి" యనియే చదివిరి. ఇప్పుడు ఋస్సి అని చదువ వలె ననుచున్నారు. అట్లుచదివిన నర్థముండనేరదు. ఏమన ఈశబ్దమునకు మూల మరవమునందుఁగాని కన్నడమునందుఁగాని కాన్పించుటలేదని లక్ష్మణ రావుగారే వ్రాసియున్నారు. మనవాఙ్మయములో నీశబ్దమును దానియర్థము ను నెచ్చటను నిదివఱకు గానవచ్చుటలేదు గాన దీని కేమియర్థము చెప్పఁగ లము ? శ్రీరామయ్యపంతులవారు దీనికర్థము చెప్పఁబ్రయత్నింపలేదు. కాని యీ ఋస్సికి మఱియొక శాసనములో ఋచ్చి అనురూపము గాన్పించుచున్న దని మాత్రము వ్రాసిరి. మనకు ఋస్సి యెంతదేవరహస్యముగా నున్నదో యీ ఋచ్చియు నంతదేవరహస్యముగా నున్నదికాని మనకర్థావబోధము కలి గించుటకై యవకాశము నిచ్చునదిగా లేదు. కాన ఋస్సి యనిన నర్థము వ్యర్థమగుచున్నది. ఇఁక దీనిని డస్సియనిచదివిన నెంతయో యర్థవంతమై యలరారుచున్నది డయ్యుధాతు వకర్మక మనియు, నిచట సకర్మకముఁగా వాడఁబడిన దనియు "నీయొట్టు డస్సిమలినురై"యన నీయొట్టును చెడఁగొట్టి మలినురై యని యర్థమనియు నిదివఱకు రామయ్యపంతులవారే వ్రాసిరి. కాని యకర్మక మగుడయ్యుధాతు విచ్చట సకర్మకముగా వాడఁబడినదనిమాత్రము మనము దలంపఁబనిలేదు. ఇచ్చట నీధాతు వకర్మకముగా నున్నదనియే తలం పవచ్చును. ఇచటి "డస్సి" యనునది డయ్యుధాతువుయొక్క క్త్వార్థకరూ పము ఈయది హేతుక్త్వార్థకము. హేతువుం దెలుపునప్పుడు క్త్వార్థక ము వాడుట మనసారస్వతమున వాడుకయై యున్నది. "వాఁడు జ్వరము వచ్చి చచ్చె" అనినఁ జచ్చుటకు జ్వరము వచ్చుట కారణమైనదని తెలిసి కొనవలెను. "పొత్తముల్ చదివి ప్రాజ్ఞుఁడాయె" ననఁబ్రాజ్ఞుఁడగుటకుఁ బుస్త కములు చదువుట హేతువగుచున్నది. ఇట్లూహించుకొనునవి కాన 'నీయొ

ట్టుడస్సి మలినులై యున నీయొట్టు బలహీనమగుటచేత, అనఁగాఁ దప్పిపోవుట చేత మలినులైయని భావము. డయ్యుట యనఁగ బలహీన మగుటయని యర్థము నిఘంటువులం దీఁబడియేయున్నది. ఈవిధముగా వాక్యమునకు సరి యగు నర్థమునిచ్చుచున్న డస్సిశబ్దమును ద్రోసిరాజని దానితావున బలవంత ముగా ఱ స్సిశబ్దమును దెచ్చిపెట్టిన వాక్యమర్థశూన్య మగుచున్నది. కావున శ్రీరామయ్యపంతులవారు మొదటఁ జదివినరీతిగా డస్సియని చదువుటయే సమంజసముగా నున్నది కాని వింతయక్కరముతోఁ జదువుట సమంజసము గలేదు.

ఇఁక అఱిసిన అఱిపుటగూర్చి ముచ్చటించుకొందుము. దీనిని పంతు లవారు మొదట అడిసిన, అడిపుటయనియే చదివిరి. ఇప్పుడు అఱిసిన అఱి పుట అని చదువుదు మనుచున్నారు. ఇట్లేల చదువవలెనో తెలియవచ్చుట లేదు. మనభాషలో అడుచుట యనుధాతువు కలదు. దానికినాశనము చేయు టయని యర్థము కావున నీఅడిసిన అడిపుటలు తద్ధాతుసంబంధము లనుకొ నుట తగియేయున్నది. మూలములో "లింగంబడిసినపాపంబు" అని కలదు లింగమును నాశనముచేసినపాపము అనియర్థము. అట్లు చెప్పుకొన్న సర్వవి ధముల సరిపడియే యున్నది. ఇట్లు మనభాషలోని పదములవాడిన నర్థము సరిపోవుచుండిననుగూడ నీధాతువునకు నాశనమని యర్థము చెప్పుటకయియే మనభాషనువిడిచి ద్రమిళాది పరభాషలయందలి అఱి మున్నగు విరుద్ధధాతు వులను శరణముగాఁగొని తద్ద్వారముగా అఱిసిన యనిన నాశనముచేసిన యనునర్థమును శ్రీరామయ్యపంతులవారు చెప్పెదురఁట. ఇట్టి చిక్కేలపడవ లయును? ఇట్టివ్యర్థప్రయత్న మేలచేయవలయును? మనభాషయందు తగిన శబ్దము కాన్పింపనప్పుడు గదా పరభాషలకై పరువులిడుట। మనలో అడుచు ధాతువు కలదాయె. నాశనముచేయు అనునర్థము దానికి వెలసియుండె. ఆ యర్థమున నన్నపాదులు నీధాతువును భారతాదులలో వాడియుండిరి ఆప్ర యోగముల నీవఱకు చూపియే యున్నాను. కావున యుద్ధమల్లశాసనమునం దలి అడిసిన అడిపుట అని చదివిన సరియగు నర్థము కలుగుచున్నప్పు డన్య భాషల సాహాయ్యమునకై పరుగులిడుట ధర్మముకాదు. అడుచుధాతువు అగుచో "అడిచిన" యుండవలెను గాని "అడిసిన" యెట్లుండు నందురేని యుద్ధశాసనములో నొకయక్కరమునకు నింకొకయక్కరము వచ్చుట సర్వ

సాధారణముగనే యున్నది. అదిగాక పూచినయనుటకు పూసిన యనియు కాచిన యనుటకు కాసిన యనియు నిత్యాదిప్రయోగములను జూచుచునే యున్నాము. శ్రీపంతులవారు తమ మొదటిప్రకటనములో ''అడిసిన– (పం. ౨౦–౨౧) అడిచిన'' అని లిఖించియే యున్నారు.

ఇంక నాల్గవపద మగు బెడగుశబ్దముంగూర్చి ముచ్చటించుకొందము ఈబెడగుశబ్దమునందలి ద్వితీయాక్షరము మొదటి డకారమేకాని మఱియొకటికాదని రామయ్యపంతులవారు సెలవిచ్చిరి. కాని యిదియామొదటి డకారమువలె లేదు. ఈడకారము మనశాసనములో 28 తావుల వచ్చియున్నది ఈతావునఁదప్ప మఱియెచ్చటను నీరూపమున లేదు. 28 రూపములను నించుమించుగ నొక్కవిధముగా నున్నవి. ఇదిమాత్ర మితరములైన మొదటిడకారములను వేనిని పోలక విరుద్ధముగా నున్నది. కావుననే యీశాసనమునం గల డకారములనన్నిటిని వరుసగ బేర్కొనిన లక్ష్మణరావుపంతులు గారు దీనిని బేర్కొనక విడచియుండిరి. వారి కీయక్షరముంగూర్చి యిదమిత్థమ్మని వ్రాయ నవకాశము చిక్కినది కాదు. కావుననే వారు దీనిని జల్లగ జాఱవిడిచిరి. దీని మాట యేమిచెప్పెదురని యడిగినను మౌనమునే వహించిరి. శ్రీరామయ్య పంతులవారు చెప్పు నీడకారముయొక్క వీపునుండి పైకొకగీటులేచి గుకారమువైపునకు వంగినది. ఇట్టిగీత తక్కినడకారములకు వేనికిని లేదు. ఈగీత మూలముగా దీనికి శకటరేఫాకృతివచ్చినది. గుకారమువైపునున్న కొననుండి లోన నొకగీటు బైలువెడలి వంపుగాఁబోయి తుదికొనను దాఁకినది. మఱియును పంతులవారుచెప్పు డకారములకుఁ దూర్పువైపున ననఁగా గుకారమువైపున నక్షరము కలిసిపోక ఉకారమునకువలెఁ గొంతమొఱ్ఱి యుండును. ఈయక్షరమున కట్లెడము లేక తూర్పువైపుననున్న కొనలు రెండును గలిసికొనిపోయి యొక్కగీత యైపోయినవి. కావున నియ్యది శకటరేఫాకృతి కలిగియున్నదని తెల్లవిదగి యున్నది. పరికించిచూడ నియ్యది సరియగు నడ్డుగీటు లేని శకటరేఫాకృతినిగాని డకారాకృతినిగాని గలిగియున్నదనుటకు నిశ్శంకమగు నాధారము కలుగుటలేదు. కాని యిది గలశబ్దము బెడగుశబ్ద మని ప్రతివాదులు అనఁగా రామయ్యపంతులుగారు వీరభద్రేశ్వరరావు గారు ముస్నగుపా రంగీకరించుచున్నారు గావున దీనిని డకారరూపమే యనవలసివచ్చుచున్నది. ఈ డకారరూపము రెండవది యగుననుగాని మొదటిది గానేర,

 [illegible]

ము. కొన్ని భాగములు త్రోసివేసి దీనిని మొదటి డకార రూపమని చెప్ప పం
తులుగా రుద్యమించిరిగాని యట్లు చేయుట ధర్మముగాదు. ఇది మొదటి
డకారరూపమున లేదు కావుననే లక్ష్మణరావుగారు దీనిని తమ డకారపట్టిక
లో నీయక విడిచివేసిరి. టస్సి శబ్దములోని టకారమునగూడ లోన కొంత
యడ్డుగీటుగలదు. వేరటు శబ్దములోని టుకారమునగూడ నడ్డుగీటు గలదు.
వానిని మన మెట్లు త్రోసివేసినామో అట్లే యాటకారమున నడుగునకు పం
గిపోయియున్న గీటును మనము లెక్కలోనికి తీసికొనకుండిన నిది రెండవ
డకార మగును. కావున బెడగుశబ్దమందలి ద్వితీయాక్షరము పంతులుగారి
వాదమునకు గొంతహానికరము గాకపోలేదు.

ఇంక నైదవదియగు వేరటుశబ్దమును గూర్చియు ముచ్చటించుకొంద
ము. దీనిని వేరడు అని రామయ్యపంతులవారు చదివిరి. వేరఱు అని చదు
వుద మనియు దీనితుదియక్కరము 'శకటరేఫముకాని మఱియొకయక్కర
ము కాదనియు నడ్డుగీటు స్పష్టముగ గాన్పించుచున్న దనియు గావున శకట
రేఫ మనితీరవలెననియు లక్ష్మణరావుగారు సెలవిచ్చిరి. అర్థమేమన పకార
మునకు వకారము లేఖకునిచే ప్రమాదమున వాడబడినదనియు కావున దీనిని
పేరఱు అనవలెననియు అనగా పేర్ అఱు అని పదవిభాగము చేయవలెనని
యు అఱు అనుశబ్దమునకు ధర్మము అనునర్థము చేయవలయు ననియు ధర్మ
మనునర్థముగల అఱుశబ్దము అఱవమున గలదనియు కావున పేరఱిన పెద్ద
ధర్మమని యర్థము చెప్పవలెననియు లక్ష్మణరావుగారు సెలవిచ్చిరి. ఇంకను
ధర్మమనునర్థముగల అఱుశబ్దము తెనుగున 'నెచ్చటను గాన్పించుట లేదనికూడ
వారంగీకరించిరి. ఐనను ధర్మమను నర్థముగల అఱుశబ్ద మఱవమున గలదు
కావున దానిసోదరియగు తెలుగునందుఁగూడఁ బూర్వ ముండెడిదని యూ
హింపవలెననిగూడ వీరు సెలవిచ్చిరి. ఇట్లూహలపై శబ్దార్థనిర్ణయము చేయ
వలసివచ్చుచున్నది. ఇట్లు మనయిచ్చవచ్చిన ట్లూహించిన మన మెంతటి
యాకాశహర్మ్యములనైన నిర్మింపవచ్చునుగదా. ఈశాసనమునందుగాక మ
ఱి యేప్రాచీనాంధ్రశాసనమునందైన ధర్మమను నర్థముకొఱకై అఱుశబ్దము
వాడబడియుండినయెడల మనము లక్ష్మణరావుగారు చెప్పునర్థమును తీసికొన
వచ్చును. అట్టియుదాహరణ మేదియును గాన్పించుటలేదు. ప్రతిపాదులు
చూపగలిగియుండ లేదు. మనప్రాచీనశాసనములందు ధర్మమను నర్థము తెల్ప

వలసివచ్చు నెడల ధర్మశబ్దమే వాడబడుచున్నది. ఇందులకు యుద్ధమల్లశాసనమే తార్కాణము. దీనియందు పైభావము కలుగుటకై "ధర్మువు కామస్రవులకు" అని వ్రాయబడియున్నది. తరువోజశాసనమునగూడ ధర్మశబ్దమే వాడబడినది. కావున అఱవమునందలి అఱుశబ్దమును దీసికొనివచ్చి తెనుగుశాసనమునందు దగిలింపబోవుట యెంతమాత్రమును దగదు. అది యటులుండ, బులిమీదపుత్ర యికనొకటి వచ్చినది. మనలక్ష్మణరావుగారిది పేరఱు శబ్దమనుకొని పేర్ అఱు అని విడదీసి అఱు అనగా ధర్మమని యర్థము చెప్పిరి. కాని శాసనమునం దున్నది వేరెఱుశబ్దముకాని పేరఱుశబ్దముకాదు. 'పే'కు 'వే' వచ్చిన దనుకొనిన పేరెఱుశబ్ద మగును. దొరతనమువారి లిపిశాస్త్రజ్ఞుడు వేఱెఱు అని చదివియుండెను గాని వేరఱు అని చదివియుండలేదు. ఈశబ్దము యొక్క ద్వితీయాక్షరముపై నెత్వము స్పష్టముగ గాన్పించుచున్నది. కావున నియ్యది (పే) పేరెఱుగాని వేరఱుగాదు. ఇక్కారణమున లక్ష్మణరావుగారి పదవిభాగమును అఱుశబ్దమును సదృశ్యమైనవి. కావున లేఖకప్రమాదజనితమైన అడ్డుగీటును లెక్కలోనికి తీసికొనకుండిన దీనితుదియక్కరమును 'డు' అనవచ్చును. ఈవిధముగా శకటరేఫాకృతినున్న డకారములు యుద్ధమల్లశాసనమునందే కాన్పించుచున్నవి. శ్రీ రామయ్యపంతులవారీ పేరెఱుశబ్దముం గూర్చి యేమియువ్రాయక మౌనమువహించిరి. అట్లుచేయుట ధర్మముకాదు. ఏమైననేమి, యుద్ధమల్లశాసనమును పరిశీలించి చూడ నించుమించుగ శకటరేఫమువలెనుండు డకారము దానియందే యున్నట్లును అది డకారధ్వని కలిగియున్నట్లును స్పష్టమగుచున్నది. అయినను ప్రతివాదు లితరస్థలములయందు శకటరేఫాకృతిగల డకారము నంగీకరించి యుద్ధమల్లశాసనమునందు మాత్రము దానిని అఱవమునందలి వింతధ్వనికలదానినిగా భావింతుమనుటకు నవకాశమేదియో బోధపడుటలేదు. ఈశాసనమున వింతయక్కరము కలదనుచో దీని నర్థముచేసికొనుటకై అఱ్ఱి మున్నగు నరవధాతువులకును అఱు మున్నగు నఱవశబ్దములకును బహువు లిడవలసివచ్చుచున్నది. అయినను ఆస్సి మున్నగుతావుల నర్థమగుటలేదు. ఇం దున్నవింతయక్కరమనునది డకారమే యనుకొని మనయాంధ్రభాషాసాహాయ్యముననే శాసనమునంతను నర్థము చేసికొనుట కవకాశము చిక్కుచున్నది. కాన నీశాసనముంబట్టి వింతయక్కర మాంధ్రమున నుండెడిదని చెప్పబోవుట యుచితముగాదు.

అడ్డుగీటులేని శకటరేఫాకృతి డకారధ్వనిని దెలుపునది యనుటకై యుద్ధమల్లశాసనముకంటె ప్రాచీనమని ప్రతివాదు లెంచు గణగవిజయాదిత్యుని కాలమునాటి దనబడు తరువోజశాసనమునుండికూడ నొక యుదాహరణ మిదివఱ కిచ్చితిని. అందు కొండద్దము అనికలదు. ఈ కొండశబ్దమునందలి డకారము అడ్డుగీటులేని శకటరేఫాకృతివలె నున్నది. లక్ష్మణరావుగారు దీనిని డకారమనియే చదివిరి. ఈయది వారి చిత్రాడోపన్యాసమును జూచుకొనిన దేటపడగలదు. రామయ్యపంతులవా రీశాసనాక్షరమునుగూర్చి యేమియు వ్రాసియుండ లేదు. ఇట్లు గచ్ఛద్విమర్శనములఁ జేయుటవలన సత్యము తేలఁజాలదు.

పంతులవారు సంస్కృతపదములం దీయక్కరము కాన్పించుటలే దని శంకించిరి. ఈశ్వరభట్టసోమయాజిశాసనమునందు మండలి మున్నగుపదములలో నీయక్కరముండుటను నేను జూపియేయున్నాను. మండలి అఖండ మున్నగునవి సంస్కృతపదములు కావా? వానికి తలకట్టు కలదను నాక్షేపణము నొక్కదానిని పంతులవారు దెచ్చిరి. పూర్వశాసనములలో కొన్నిచోట్ల నొకయక్కరమునకే తలకట్టుండుటయు మఱికొన్ని తావుల లేకుండుటయు గలదు. యుద్ధమల్లశాసనమునందే గకారము కొన్నికడలఁ దలకట్టుగలదిగను కొన్నికడల నదిలేనిదిగను నున్నది. ఈయంశము నేనిదివఱకు వ్రాసియేయున్నాను. కావున తలకట్టుండినంతన భిన్నాక్షరమనుట ధర్మముకాదు. నేను కొన్ని శాసనములనుండి యడ్డుగీటులేని శకటరేఫాకృతిని డకారధ్వనిని దెలుపుటకై వాడబడిన దానిని జూపియుండగా నాశాసనములు గుండ్రకత్తున నున్నవనియు నాఘాతువుచే డకారములట్లు కాన్పించినవి కాని యవి యడ్డుగీటులేని శకటరేఫాకృత్యులై యున్నవనదగవనియు పంతులవారు 'కత్తు' మీదికి భారము త్రోసివేసిరి. పరిషత్పత్రికలో గుండ్రకత్తుగల శాసనములఁ బంతులవారే ప్రకటించియున్నారు. అవియెంత గుండ్రకత్తుగలవైనను, వానియందుగల డకారము లడ్డుగీటులేని శకటరేఫాకృతిని లేవు. చూ॥ ప్రథమచాళుక్యభీముని అత్తిలితామ్రశాసనము- పరిషత్పత్రిక ౧౧ సంపుటము ౬ సంచిక. ఇది గుండ్రకత్తుగలదని లక్ష్మణరావుగారే వ్రాసిరి.

శ్రీరామయ్యపంతులుగారు అడ్డుగీటులేని శకటరేఫము యుద్ధమల్లశాసనము నాటికి నరవమునందలి వింతధ్వని కలదికాని డకారధ్వని కలదికాదని ...

వలసివచ్చునెడల ధర్మశబ్దమే వాడబడుచున్నది. ఇందులకు యుద్ధమల్లశాసన
మే తార్కాణము. దీనియందు పైభావము కలుగుటకై "ధర్మువు కామస్వ
పులకు" అని వ్రాయబడియున్నది. తరువోజశాసనమునగూడ ధర్మశబ్దమే వా
డబడినది. కావున అఱవమునందలి అఱుశబ్దమును దీసికొనివచ్చి తెనుగుశా
సనమునందు దగిలింపబోవుట యెంతమాత్రమును దగదు. అది యటులుండ,
బులిమీఁదపుట్ర యికనొకటి వచ్చినది. మనలక్ష్మణరావుగారిది పేరఱు శబ్ద
మనుకొని పేర్ అఱు అని విడదీసి అఱు అనగా ధర్మమని యర్థము చెప్పిరి.
కాని శాసనమునం దున్నది వేఱెఱుశబ్దముకాని పేరఱుశబ్దముకాదు. 'పే'కు
'వే' వచ్చిన దనుకొనిన పేఱెఱుశబ్ద మగును. దొరతనమువారి లిపిశాస్త్రజ్ఞుడు
వేఱెఱు అని చదివియుండెను గాని వేరఱు అని చదివియుండలేదు. ఈశబ్దము
యొక్క ద్వితీయాక్షరముపై నెత్వము స్పష్టముగ గాన్పించుచున్నది. కావున
నియ్యది (పే) పేఱెఱుగాని వేరఱుగాదు. ఇక్కారణమున లక్ష్మణరావుగారి
పదవిభాగమును అఱుశబ్దమును సదృశ్యమైనవి. కావున లేఖకప్రమాదజనిత
మైన అక్షరగీటును లెక్కలోనికి తీసికొనకుండిన దీనితుదియక్కరమును 'డు'
అనవచ్చును. ఈవిధముగా శకటరేఫాకృతినున్న డకారములు యుద్ధమల్లశా
సనమునందే కాన్పించుచున్నవి. శ్రీ రామయ్యపంతులవారీపేఱెఱుశబ్దముం
గూర్చి యేమియువ్రాయక మౌనమువహించిరి. అట్లుచేయుట ధర్మముకాదు.
ఏమైననేమి, యుద్ధమల్లశాసనమును పరిశీలించి చూడ నించుమించుగ శకట
రేఫమువలెనుండు డకారము దానియందే యున్నట్లును అది డకారధ్వని క
లిగియున్నట్లును స్పష్టమగుచున్నది. అయినను ప్రతివాదులితరస్థలములయం
దు శకటరేఫాకృతిగల డకారము నంగీకరించి యుద్ధమల్లశాసనమునందు
మాత్రము దానిని అఱవమునందలి వింతధ్వనికలదానినిగా భావింతుమనుటకు
నవకాశమేదియో బోధపడుటలేదు. ఈశాసనమున వింతయక్కరము కల
దనుచో దీని నర్థముచేసికొనుటకై అఱ్ఱి మున్నగు నఱవధాతువులకును అఱు
మున్నగు నఱవశబ్దములకును బరువు లిడవలసివచ్చుచున్నది. అయినను అస్సి
మున్నగుతావుల నర్థమగుటలేదు. ఇం దున్న వింతయక్కరమనునది డకారమే
యనుకొని మనయాంధ్రభాషాసాహాయ్యముననే శాసనమునంతను నర్థము
చేసికొనుట కవకాశము చిక్కుచున్నది. కాన నీశాసనముంబట్టి వింతయక్క
ర మాంధ్రమున నుండెడిదని చెప్పబోవుట యుచితముగాదు.

అడ్డుగీటులేని శకటరేఫాకృతి డకారధ్వనిని దెలుపునది యనుటకై యుద్ధమల్లశాసనముకంటె ప్రాచీనమని ప్రతివాదు లెంచు గణగవిజయాదిత్యుని కాలమునాటి దనబడు తరువోజశాసనమునుండికూడ నొక యుదాహరణ మిదివఱ కిచ్చితిని. అందు కొండల్దము అనికలదు. ఈ కొండశబ్దమునందలి డకారము అడ్డుగీటులేని శకటరేఫాకృతివలె నున్నది. లక్ష్మణరావుగారు దీనిని డకారమనియే చదివిరి. ఈయది వారి చిత్రాడోపన్యాసమును జూచుకొనిన దేటపడగలదు. రామయ్యపంతులవారీశాసనాక్షరముంగూర్చి యేమియు వ్రాసియుండలేదు. ఇట్లు గచ్ఛద్విమర్శనములఁ జేయుటవలన సత్యము తేలఁజాలదు.

పంతులవారు సంస్కృతపదములం దీయక్కరము కాన్పించుటలేదని శంకించిరి. ఈశ్వరభట్టసోమయాజిశాసనమునందు మండలి మున్నగుపదములలో నీయక్కరముండుటను నేను జూపియేయున్నాను. మండలి అఖండ మున్నగునవి సంస్కృతపదములు కావా? వానికి తలకట్టు కలదను నాక్షేపణము నొక్కదానిని పంతులవారు దెచ్చిరి. పూర్వశాసనములలో కొన్నిచోట్ల నొకయక్కరమునకే తలకట్టుండుటయు మఱికొన్నితావుల లేకుండుటయు గలదు. యుద్ధమల్లశాసనమునందే గకారము కొన్నికడలఁ దలకట్టుగలదిగను కొన్నికడల నదిలేనిదిగను నున్నది. ఈయంశము నేనిదివఱకు వ్రాసియేయున్నాను. కావున తలకట్టుండినంతన భిన్నాక్షరమనుట ధర్మముకాదు. నేను కొన్నిశాసనములనుండి యడ్డుగీటులేని శకటరేఫాకృతిని డకారధ్వనిని దెలుపుటకై వాడబడిన దానిని జూపియుండగా నాశాసనములు గుండ్రకత్తున నున్నవనియు నాఘోతువుచే డకారములట్లు కాన్పించినవి కాని యవి యడ్డుగీటులేని శకటరేఫాకృతులై యున్నవనదగవనియు పంతులవారు 'కత్తు' మీదికి భారము త్రోసివేసిరి. పరిషత్పత్రికలో గుండ్రకత్తుగల శాసనములఁ బంతులవారే ప్రకటించియున్నారు. అవియెంత గుండ్రకత్తుగలవైనను, వానియందుగల డకారము లడ్డుగీటులేని శకటరేఫాకృతిని లేవు చూ!! ప్రథమచాళుక్యభీముని అత్తిలితామ్రశాసనము- పరిషత్పత్రిక ౧౧ సంపుటము ౬ సంచిక. ఇది గుండ్రకత్తుగలదని లక్ష్మణరావుగారే వ్రాసిరి.

శ్రీరామయ్యపంతులు గారు అడ్డుగీటులేని శకటరేఫమ్ము యుద్ధమల్లశాసనము నాటికి నరవమునందలి వింతధ్వని కలదికాని డకారధ్వని కలదికాదని

భావించుటకుగల కారణమొక్కటి వారు చెప్పనది కాన్పించుచున్నది. పరికించిచూడ, అదినట్టి కారణాభాసమగునుగాని నిజమగుకారణముగా నేరదు. డకారధ్వనిని దెలుపుటకు యుద్ధమల్లశాసనములో మొదటి ఢకారరూపము గలదనియు అదియుండగ మరల నాధ్వనినిఁ దెలుపుటకే శకటరేఫాకృతిగల రెండవయక్షరము కలదని చెప్పట భావ్యము కాదనియు ధ్వనులకు ప్రతిమలుపుట్టుటలో నొక్కొక్కధ్వని కొక్కొక్క ప్రతిమపుట్టువేగాని యేకకాలముననే బహుప్రతిమలు పుట్టవనియు కావున రెండవడకారము తప్పక వేఱక్కరమై యుండవలెననియు శ్రీరామయ్యపంతులవారు వాదించుచున్నారు. ఈవాదమున కనేకవిధములగు నాతంకములిదివఱకే సిద్ధపడియున్నవి.

(1) అడ్డుగీటులేని శకటరేఫాకృతిగల యక్కరము నన్నయకీవలనైన 'డ'కారధ్వని కలిగియున్నదని ప్రతివాదు లంగీకరించిరికదా అప్పుడు మనయక్షర సమామ్నాయములో మొదటి ఢకారరూపము లేదా? అదియుండగా నీరెండవది యెందులకు వచ్చినదనిన వీరేమిచెప్పదురు? అందులకే ఆదికాలముననని తెల్పితిమందురా? యుద్ధమల్లశాసనము కాలమునాడే మనయాంధ్రధ్వనులకు నక్షరము లేర్పడినవనుట కాధారమేదైన గలదా? అంతకుపూర్వమెన్నడో యెన్నిశతాబ్దములక్రిందనో యాంధ్రాక్షరము లేర్పడియున్నవి కాదా కావున శ్రీపంతులవారి యాదికాలవాదమిచట సరిపడదు.

(2) ఒకధ్వనికే రెండుమూడు సంజ్ఞలు వాడబడియుండుటను మన యుద్ధమల్లశాసనము నుండియే నేననేకములు చూపినాను. వానిలో గొన్ని యజ్ఞ్రూపములును కొన్ని హ్రస్వరూపములునుగలవు. రామయ్యపంతుల వారాక్షేపముచేసి విశేషముగా నున్నయజ్ఞ్రూపములదృష్టిలో నెగురగొట్టబయత్నించిరి అజ్ఞ్రూపముల లెక్కలోనికి తీసికొననవసరములేదని రాజాజ్ఞగా సెలవిచ్చిరి. అట్లేల చేయవలెను? స్వరములు ధ్వనులుకావా? వానిని దెలుపుటలో మాత్ర మొక్కొక్కధ్వనికి ననేక సంజ్ఞలుండనేల? తగినహేతువు జెప్పకయే స్వరములుకిట్టి రూపములుండుటను గూర్చి విచారింపనవసరము లేదని త్రోసి వేయుట యేటిధర్మము? ఇంకను హల్లులవిషయములో చేబ్రోలనుశబ్దమును దెలుపుటకై యుద్ధమల్లశాసనములో చేబ్రోలనియు, చేబ్రోలనియు రెండు రూపములు వాడబడియున్నవి. ఒక్కరేఫము దెలుపుటకై శాసనములో రెండురేఫములు వాడబడి యుండ లేదాయని నేను శంకించపరెండవని శకట

రేఫముకాదనియు శకటరేఫమే రేఫమునకు పరముగా ప్రమాదమున లేఖకు
నిచే వాడబడి యుండవచ్చుననియు నంతమాత్రముచే రేఫమును శకటరేఫ
మును నొక్కయక్కరమే యనుట ధర్మమాయనియు మనపంతులవారు శం
కింపజొచ్చిరి. పరికించిచూడ నిదియును తగినవాదము కానేరదు. శకటరేఫా
కృతి యితరస్థలములందు శకటరేఫధ్వనిని దెలుపుటకై వాడబడినను యిందా
ధ్వనిని దెలుపుటకై వాడబడియుండలేదు. క్రారతోఁగూడిన చేబ్రోలుశబ్దము
కవిధముగను శకటరేఫాకృతితో వాడబడిన చేబ్రోలుశబ్దమును మఱియొక
విధముగను మీరుచదువుదురా? మొదటిచేబ్రోలునకును రెండవచేబ్రోలునకును
భేదము గలదందురా? అట్టిది లేనప్పుడు శకటరేఫాకృతి రేఫమును దెలుపు
సంజ్ఞగనే వాడబడినదనియుఁ దనశకటరేఫతను నాతావునగోల్పోయి రేఫసం
జ్ఞగనే వాడబడినదనియు దలంచుటయుచితముకదా ఇదిప్రమాదము కావ
చ్చునని పంతులవారనిరి. ఒకచోనైనఁ బ్రమాదమున వచ్చును. కాని గొండ్రు
అను పదమునగూడ క్రారకుబదులుగా శకటరేఫమే వాడబడినదిగాన దీనింబ్ర
మాదమనరాదు. లేఖకుడుద్దేశించియే క్రావడికి రెండురూపముల వాడినాడు.
కావున హల్లులను దెలుపునప్పుడుగూడ నొకధ్వనికి వేఱుసంజ్ఞలు యుద్ధమల్లు
శాసనములో వాడబడియున్నవని మనము గ్రహించుకొనవలెను. "హల్లుల
లోనొక ధ్వనికి రెండుచిహ్నములు తెలుగులోలేవు" అని మీరు వ్రాసిరి. ఇట్ల
నదగదు. కకారమునకు రెండుసంజ్ఞలు (క. క) గలవు. ఖకారమునకు రెండు
రూపములు (ఖ. ఖ) గలవు. కకారపుటొత్తునకు రెండురూపములు గలవు.
(౯. ౬) అర్కాదిశబ్దములు రెండువిధముల వ్రాయుదుము. (అర్క. అర్క)
నకారము 'న' అనియు (న) (నకారముమీద బొట్టు) అనియు రెండువిధముల
లేదా నకారమునిలువు గీటుపైతలకట్టు, పానపెనుండి తలకట్టుతో కలసికొని
పోయియుండుట అనురూపముల రెండిటినిఁగలిగి యుండలేదా? పకారము
"ప" అనియు వ (వకారముమీద బొట్టు) అనియు రెండువిధముల లేదా?
ఇవి హల్భేదములుకావా? ఒకధ్వనికే రెండుచిహ్నములు కాన్పించిన నయ్యె
విమొదట వేఱువేఱుధ్వనుల దెలుపుటకే యేర్పడినవై యుండుననియు నిటీ
వల మార్పుగలిగి యుండవచ్చుననియు పంతులుగారు వ్రాసిరి. మనలిపిలో
కకారమునకు రెండురూపములు కలవుగదా? అవి వేఱువేఱుధ్వనుల దెలు
పుటకే యేర్పడిన వనవచ్చునా? వీనిఁగూర్చి యుద్ధమల్లు [illegible] చరాదో విలక్షు

క్షరవిషయమునను, నట్లే యెంచరాదు. రెండుసంజ్ఞలుండినంత రెండుధ్వనులుండ నవసరములేదు.

ఒక్కొక్కధ్వనికి వేఱువేఱు సంజ్ఞలుండిన నయ్యది భాషావైభవమునే సూచించుననను భావమును నేను తెలిపియుండగా శ్రీపంతులవారందులకునన్నుం బరిహసింపఁబోచ్చిరి. ఒకధ్వనికి రెండుమూడు సంజ్ఞలుండుట భాషావైభవమును దెలుపునని వ్రాసినవాడను నేనొక్కడనే కాను. అయ్యది యాంధ్రవిజ్ఞాన సర్వస్వములోఁగూడ లక్ష్మణరావుగారిచే వ్రాయబడియున్నది. అది సత్యమే మన తెలుగులిపిలో కకారమును దెలుపుటకై రెండుసంజ్ఞలుగలవని పైన జూపియే యున్నాను. ఏదియెట్లైనప్పుడు రాసెండు. ఇప్పుడా రెండుసంజ్ఞలును మన లిపియందు వాడుకలోనున్నవి. ఒకపురుషుడే యొకవిషయముఁగూర్చి యొకకాలమందువ్రాయు నొక్కతావుననే యీ రెండు సంజ్ఞలును వాడుచున్నాడు. వీరేశలింగం పంతులుగారు తమస్వీయచరిత్ర మొదటిభాగములో కృతినిచ్చు సందర్భములో నీరెండు కకారములును వాడిరి. ఇందు వారి వ్రాతయక్షరములే యీబడియున్నవి*. ఇంతయేల ఒక్కొక్కధ్వనిని దెలుపుటకై యనేకవిధములగు సంజ్ఞలాంగ్లభాషలో వాడబడుచుండును. ఒక యుదాహరణము సకారధ్వని దెలుపుటకై S. S. అనుసంజ్ఞల సాధారణముగా వాడుచుందురు ఇట్టివనేకములు కలవు. ఇవన్నియు వర్ణసమామ్నాయా సమగ్రతను దెలుపునని రామయ్యపంతులవారు సెలవిచ్చిరి కాని యదిసరికాదు. ఒక్కొక్కయక్షరమునకు ననేక సంజ్ఞలున్నందులకై యాంగ్లలిపిలోపము కలదిగా విజ్ఞులెవ్వరిచేతను తలంపఁబడుట లేదు. ప్రతిలిపియందును గూడ ఒకధ్వనికే రెండు మూడు సంజ్ఞలుండుటకలదు. ఆసంజ్ఞ లొక్కతావుననే వాడబడుట కూడ గలదు. నాగరాక్షరములందున్న చేకూరు శాసనము గూర్చి దానిని ప్రచురించిన టి. ఏ. గోపినాథరావు, యం. ఏ, గారాంగ్లభాషలో సిద్ధాంతదీపికయను పత్రికలో నిట్లువ్రాసిరి.

"The language of the record is in Sanskrit prose. The alphabet closely resembles that of the early Kudamba plates published by Dr. Fleet in Indian Antiquary Vol. VI, of the Kudgere plates of Mandhatri Varman and of the Nilamber plates. The engraver employs both the looped and the

* ఈ యంశమును నేను నావ్యూర్వవ్యాసములో వ్రాసియే యున్నాను. వానికి బంతుల వారేమియు సమాధానము చెప్పియుండ లేదు.

Curvilinear forms of the Consonant t (త) e g the looped form occurs in Yayati (యయాతి) in l 3, in Kshtriyai in l 4, in Bhagavastridasa in line 6, Vapta in l 7,......Where as the Curvilinear Variety is formed in Swasti in l 1, in Prachuta in l 4, Gitasesha in l 8, in Buddyata in line 14, etc. The letter Kha (ఖ) is also written in two ways; the usual form occurs in Abhimukha (అభిముఖ) in l, 2, and the other Variety in the same word occuring in l 2".

దీనింబట్టి సమస్తలిపులందును నొకధ్వనికే రెండుమూడుసంజ్ఞల నొకతావుననే వాడుటకలదని తెలియవచ్చుచున్నది.

వింత యక్కరమునకే రెండు సంజ్ఞలుండుట :—

క్రీ. శ. 804 లోని దగునొక కర్ణాటశాసనములో "శకనృపకాలాతీత సంవత్సరంగళ్ ఏళ్ నూరే ఱిప్పత్తారనేయ" అను పదములందలి వింత యక్కరము గర్భమున నడ్డుగీటులేని శకటరేఫాకృతినిగాక రెండునున్నలొక దానితో నొకటి చేర్చినట్లున్నదని శ్రీ వీరభద్రేశ్వరరావు గారు వ్రాసిరి. ఇది మన వింతయక్కరమున కొక రూపాంతరమని లక్ష్మణరావుగారు వ్రాసిరి. ఈ వ్రాతలను బట్టిచూడ నొకకాలమందే వింతయక్కరమునకు రెండు సంజ్ఞలు కర్ణాటమున వాడబడినట్లు తేలుచున్నది.

లక్ష్మణరావు గారు చెప్పిన 'డ'కార అడ్డుగీటులేని బండి 'ఱ'కు తలకట్టుంచిన నదితలకట్టు'డ' యగునని ప్రతివాదులు వ్రాయుచున్నారు ఈ 'డ'లలో రెండు తెగలుకలవఁట. తలకట్టు కుడికొనపై నుండునది యొకటి. ఇది హైదరాబాదు ప్రాంతము లందలిదఁట; ఎడమవైపు కొనమీద తలకట్టున్నది యొకటి. ఇది యుతరప్రాంతములందుఁ గలదట. శ్రీరావుగారు చెప్పనీరెండు డాలునుగూడ నీశ్వరభట్ట సోమయాజి శాసనమునందే వాడబడినవి.

దీనిం బట్టిచూడ నొకధ్వనికి రెండుసంజ్ఞలుండుటయు నవి యొకచోటనే యుండుటయు గూడఁ గలదని తేలుచున్నది. కాఁబట్టి యుద్ధమల్లశాసనమున డకారధ్వనిని దెలుపుటకై 'డ'యను రూపమును ఱ అను రూపమును గూడ వాడబడుట యసమంజసముగా లేదు శ్రీ రామయ్యాపంతులవారే యుక్తినాధారముగా దీసికొని తమవాదము నిలుపుకొన బ్రయత్నించిరో యాయుక్తిపై వ్రాతచే పూర్వపక్షమైపోయినది కావున, నస్మద్వాదమే సమంజసమని తేలుచున్నది.

పంతులవారు చేయు వాదమిక నొకటికలదు. ఏయక్కరము కన్నడమున నఱవమునందలి వింతధ్వనినిఁ దెలుపుటకు వాడబడుచున్నదో యాయక్కరమే తెనుగుశాసనములందుఁ గాన్పించుచున్నది కావునను లిపికన్నడమునకును తెనుఁగునకును నొక్కటియే కావునను నీయక్కరమునకు కన్నడముననే ధ్వనికలదో తెలుగునను నదియే ధ్వనికలదని తలంచుట సమంజసమని పంతులవారు వాదించుచున్నారు ఇదియు మంచిహేతువు కానేరదు. లిపి యొక్కటియేయైనను భాషలు వేఱువేఱగుటను యాయాభాషలందలి ధ్వనులు కొన్నితావుల భిన్నమై యుండుటను సంజ్ఞలన్నియు నొక్క భాషయం దేధ్వనిని దెలిపిన రెండవభాషయందును నాధ్వనినే దెల్పవలెనని భావించుట యుచితము కాదు. కన్నడములోలేని ధ్వనులు తెలుఁగునఁగలవు. అనుస్వారము రెండుభాషలందును గలదు. కాని కన్నడమున బూర్ణానుస్వారము మాత్రమేకలదు తెలుఁగున నర్ధానుస్వార పూర్ణానుస్వారములు కలవు. కన్నడశాసనాదులలో బిందువు వచ్చినప్పుడు సర్వదా పూర్ణానుస్వారముగనే చదువవలెను. అయ్యది తెలుఁగు శాసనాదులలో వచ్చియుండినచో కొన్నితావులఁ బూర్ణానుస్వారముగా నుచ్చరింపవలెను. మఱికొన్నితావుల నర్ధబిందువుగా నెంచి యుచ్చరింపకుండవలెను. ఎట్లన, యుద్ధమల్లశాసనములో "రమణతో బెజవాడ కెల్లబెడంగును రక్షయుంగాను" అని కలదు. ఇందుగల బెడంగనుశబ్దమును బెడఁగని చదువవలెను. బిందువుపూర్తిగ నున్నదికాని దాని నర్ధానుస్వారముగా గ్రహింపవలెనుగాని పూర్ణానుస్వారముగా గ్రహింపవలను కాదు. ఏమన పద్యలక్షణము చెడును. ఈబెడంగు శబ్దమునందు పూర్ణానుస్వారముండినను తెలుంగు శాసనమైన కతమున దానినుచ్చరింపక విడిచినాము. ఏమన నీభాషయం దర్ధానుస్వారముకూడ గలదు. కావున దీనినీతావున నర్ధానుస్వారముగా గొనినాము వెంటనే "రక్షయుంగాను" అనుపదము వచ్చినది. అందును బూర్ణబిందువు కలదు. దానిని యున్నది యున్నట్లే యుంచినాము. ఈ బిందువులే కన్నడ శాసనములో కాన్పించినచో " బెడంగును రక్షయుంగాను " అనిచదువవలెనే కాని తెనుగునందువలె బెడఁగును రక్షయుఁగాను అని చదువుటకు వలనుపడదు ఏమన గన్నడమ్మున ఖండబిందువు లేదు. లిపియొక్కటియే యైనను ఆయాభాషలయందు గల ధ్వనులు భిన్నముగా నున్నవి. కావున భిన్నధ్వనులు ఒక యక్కరమునకే రెండు భాషల

లోను వేర్వేరుగ గలుగుచున్నవి దంత్యములగు చజలును, ఖండబిందువును కన్నడమున లేవు. వింతయక్కరము తెలుగున లేదు. కన్నడమున అడ్డుగీటు లేని శకటరేఫము అరవమునందలి వింతయక్కరపుధ్వని కలదిగానుండినను తెలుంగున నట్లుండబనిలేదు. ఇందాధ్వని లేదు కావున దీనియందాయక్కరమే మఱియొకధ్వని కలదైనది. అది యేదియన డకారధ్వనికలదని ప్రతివాదులును నంగీకరించియే యున్నారు. కావున తెలుంగు నందాయక్కరము తద్ధ్వనికలదని తలంచుటయే యుచితము అట్లు తలంపకున్న యుద్ధమల్లశాసనాదు లర్థశూన్యములగుచున్నవని యిదివఱకే చూపియున్నాను. కావున యడ్డుగీటులేని శకటరేఫరూపము నాంధ్రమున నెప్పుడును 'డ'కారధ్వనిని దెలుపు దానినిగానే భావించుకొనుట యుచితముగా గాన్పించుచున్నది. నాగరలిపినుండియే కర్ణాటాంధ్రలిపి పుట్టినదని ప్రాజ్ఞులు చెప్పుచున్నారు. నాగరలిపియందలి యుపధ్మానీయచిహ్నమే కర్ణాటాంధ్రలిపిలో శకటరేఫచిహ్నమైనదని లక్ష్మణరావుగారే వ్రాయించిరి. నాగరలిపి యందుగల యుపధ్మానీయరూపమే తెలుంగులో శకటరేఫమైనదన మూలలిపిలోని ధ్వనిని బోగొట్టుకొని తెలుఁగులోఁ గ్రొత్తధ్వని నందినదని భావముగదా. కావున నొకచిహ్నమే యొకభాషలో నొకధ్వని కలదైన నిక నొకభాషలో మఱియొకధ్వనిని దెలుపుటకై వినియోగములోనికి వచ్చుట లిపులసాంప్రదాయమును బట్టి సరిగనే యున్నది.

కాన యుద్ధమల్లశాసనమునందు నరవమునందలి వింతధ్వనిని దెలుపుటకే యడ్డుగీటులేని శకటరేఫరూపము వాడబడినదని తలంచుట యసంగతము ననర్థదాయకమునై యున్నది కావునను నన్నయకీవలి శాసనములలో నీయక్కరమువచ్చిన నయ్యది డకారధ్వని కలదియే యగుచున్నది కావునను యుద్ధమల్లశాసనమునందు గల యీ యక్కరమును గూడ నిస్సంశయముగా డకారధ్వనినిగల దానినిగనే తెంచుట యుక్తక్రమము అట్లు తలంచిననే యుత్తారము సంభవించును పంతులవారు వింతయక్కరము కలవియని తెలుపు ఏఱు అఱుచు అనుపదములందలి ద్వితీయాక్షరములు నన్నపాది నిర్మితసారస్వతమున డకారముతో ప్రాసమైత్రి కలిగి యున్నకారణమున యుద్ధమల్లశాసనాదులందుఁ గూడ వింతధ్వనిగల వింతయక్కరము లేదని తలంచుటయే ధర్మముగణక విజయాదిత్యునికాలమునాటి దనబడు తరునోజశాసనములో కొండెయను పదమున నీవింతయక్కరము డకారధ్వనిని దెలుపునదిగానే యున్నది

కదా. దీనింబట్టి యుద్ధమల్లశాసనమునకుఁ బూర్వమునందును బరమునందును గూడ నిదిడకారధ్వని కలదియే యగుచున్నది కదా?

ఈ యక్షరలక్షణమును గన్నడ శాస్త్రకారులిచ్చిన దానిని దెలుపుటలో బంతులవారు కొంత తప్పుదారిని ద్రొక్కి యీక్రిందిరీతిని వ్రాసిరి. "శబ్దమణిదర్పణకారుడు ఱ, ళ, ఴలను కలిపి సూత్రించుచు రేఫముపుట్టిన స్థానమందు ఱకారమును ఱకారస్థానమందు డకారమును లకారస్థానమందు ళకారమును అధికప్రయత్నముతో నుచ్చరించుటచేత బుట్టినవనియు నివి దేశ్యతద్భవశబ్దములందేవచ్చుననియు, వానికిని వానిబోలిన లఘ్వక్షరములకును ప్రాసమందుగాని యమకమందుగాని మైత్రి లేదనియు శాసించెను."

కేశిరాజును నాగవర్మయు ర, ల,డలు క్రమముగా ఱ, ళ, ఴలైనవని వ్రాసిరేకాని శ్రీపంతులవారు చెప్పినట్లుగా ఱకారాదులు డకారాదులైనవని చెప్పలేదు. నాగవర్మ కర్ణాటకభాషాభూషణములో వ్రాసిన వాక్యము నీక్రింద నిచ్చుచున్నాను.

"సూత్రం. 10 లరడా ఏవ ళఱఴాః ప్రయత్నాశ్రయాత్"

మఱియును కేశిరాజును నిట్లేయొక కన్నడ కందపద్యమున సూత్రించె దీనింబట్టిచూడ డకారమే కన్నడములో నొత్తిపలుకుటచే వింత యక్కరమైనట్లు తేలుచున్నది. కావున దెలుగునందుగల కోడి, ఏడు మున్నగునవియే మూలపదములు అవి క్రమముగా గొన్నినాళ్ళకు కోఱి, ఏఱు అనురూపములై యటుపిమ్మట కోళి, ఏళుమున్నగు రూపములఁ గన్నడమున నందినవి. తెలుగులో మొదటినుండియు మొదటిరూపమే నిల్చియున్నది.

పంతులవారు పూర్వశాసనములలో సంస్కృతపదములం దీయక్కరము కాన్పించుటలేదని వ్రాసిరి. అది సరికాదు. మండలిమున్నగు పదములం దీయక్కరముగల దని నేనుదాహరణము లిచ్చియే యున్నాను. వింతయక్కరములేని కొండాది దేశ్యములందును నిది కలదు. కాన దెల్గుననిది డకారమే

శ్రీరామయ్యపంతులవారు "ఇంతియేగాక డకారఱకార రూపములు రెండును వాడుకలో నున్నప్పుడవి యెట్లుపయోగింపబడినవో దానిని బట్టి వాని పరస్పరసంబంధము నిర్ణయింపవలెను" అని యొక ధర్మమును బోధించిరి కాని యీ రెండక్షరములును వాడుకలో నున్నవని తెల్పబడు కాలముంగూర్చి తమకును లక్ష్మణరావుగారి పక్షము వారికిని అభిప్రాయభేదములు కలిగినవి.

త్రాము యుద్ధమల్లశాసనమువఱకే యీయక్కరము నిలచినదనియు ఆశాస
సము నన్నయకు పూర్వమునందు బుట్టినదనియు నిర్ణయించిరి. లక్ష్మణరావు
గారి పక్షము వారన్నో నీయక్కర మించుమించుగా పదుమూడవ శతాబ్ద
మువఱకు ననగా నన్నయకుఁ దరువాతనుగూడ వాడుకలో నున్నదనియు వింత
ధ్వని పోయిన తరువాతగూడ వ్రాతలో నిల్చియున్నదనియు వ్రాసిరి. ఇందులో
నేదిసత్యమని గ్రహింపవలెను? పరికించి చూడ పంతులవారి వాదమే పూ
ర్వపక్షము చేయదగినదిగా గాన్పించుచున్నది. ఏమన, నన్నయకు తరువాతి
శాసనములందుగూడ నీయక్కరము డకారధ్వని కలదై కాన్పించుచున్నది.
గోదావరీ మండలమునందలి ద్రాక్షారామభీమేశ్వరుని యాలయములో కొన్ని
శాసనములు కలవు అవి 1924 వ సంవత్సరములో దక్షిణహిందూస్థాన
శాసనములనుపేర దొరతనమువారు ప్రచురించిన సంపుటములలో నాల్గవదా
నిలో నీఁబడియున్నవి. వానిలో నారాయణభట్టు కూతురగు కుప్పమ్మ శా.శ.
977 లో వేయించిన శాసనముకలదు. అందుఁ గొలతను దెలుపు 'పడి'యను
పదముగలదు. అడ్డుగీటులేని శకటరేఫాకృతి నున్నది. ఈపడియను పదము
ద్రావిడభాష లన్నిటియందును 'డ'కారధ్వని కలదయియే యున్నది. శాసన
సంఖ్య 185. 190 సంఖ్యగల శాసనములో నాణెమును దెలుపుమాడ అను
పదమున నిదిగలదు. 187 సంఖ్యగల శాసనములో మేడియసెట్టి యనుపద
ములో నిదికలదు. శ్రీకాకుళాంధ్ర దేవుని గుడిలోని శాసనములలో 992 సం
ఖ్యగలదానిలో 'నడపం గలవారు' అనుపదమున నిదికలదు. ఇంతయేల ఇట్టి
వనేకములు కలవు. ఈసంపుటములోఁ బలుతావులఁ బుటలకడుగున In this
inscription the letter 'ఱ' is written without talakattu
'అని వ్రాయబడుచు వచ్చినది. విషయమిట్లుండగా పంతులవారు యుద్ధమల్ల
శాసనమువఱకే యీయక్కరము నిల్చినదని సిద్ధాంతము చేయుటవింతను
బుట్టించుచున్నది. ఈయక్కర మీశాసనము పుట్టువఱకు నెట్టెట్లో కొనయూ
పిరితో నిలచినదట అదిమైన వెంటనే గతించినదట ఈవింతయక్కర మీవిం
తశాసనము కొఱకే పుట్టియుండనోపు అయినను నీశాసనమునందుగల డస్సె,
అడిచిన అడుపుట అనుపదము లానాటికిని డకారయుతములనుటలోనే సార
స్యమెక్కుడు గలదని పైన ఋజువుచేసి యుంటిమికదా? కావున పంతుల
వారు వ్రాసినది సర్వవిధముల ప్రమాదయుతమై యున్నది.

మఱియును శ్రీపంతులవారు "లిపియందేకాక భాషాస్వరూపలక్షణ ములందును గర్ణాటాంధ్రములకు దగ్గఱ సంబంధముగలదు. కాబట్టి కర్ణాట సంప్రదాయమును బట్టి తెలుగు ఱకారరూపమును నిర్ణయించుట యసమం జసము కాదు" అనిలిఖించిరి. రెండుభాషలకును సంబంధమున్నమాట సత్యమే అంతమాత్రముచే ప్రతివిషయమునందును సంబంధముఁ గలుపరాదని నేనిదివ ఱకే వ్రాసినాను. ఇంతయేల, వింతయక్షరము గూర్చియే యీరెండు భాష లకును భేదమేర్పడుచున్నది. తెలుగులోని కోడి కన్నడములో కోళియైనది. ఏడుపఱు అయినది. ఇట్టిభేదమేల కలుగవలెను? కావున కన్నడముంబట్టి తెలుగుధ్వనుల నిర్ణయింతుమనుట ధర్మముకాదు. కర్ణాటశాస్త్రకారులు ఎ, ఒ, ఱ ళ అను నాల్గుమాత్రమే తమ దేశీయాక్షరములనిరి. మన శాస్త్రకా రు లక్షరషట్కమును జెప్పిరని పైనదెలిపియే యున్నాను. దేశీయాక్షరకలి తత్వముననే నీరెండు భాషలకును జాలభేదముకలదు. గాన యుద్ధమల్లశాసన మునాటికి గాని యంతకు పూర్వముగాని యడ్డుగీటులేని శకటరేఫరూపము 'ఱ'కారధ్వనియొక్క ద్వితీయసంజ్ఞగా తలంచుటయే యుచితము అనునది సిద్ధాంతమగుచున్నది. కావున కేవలాంధ్రాక్షరములు పూర్వులు దెలిపినట్లుగా యాఱేకాని నవీనులు తెలిపినట్లుగా యేడుకావని లోకము గ్రహించుకొనుగాక

యుద్ధమల్లశాసనమునందు నీవింతయక్షరము కలదని వాదించు పం తుల వారాంధ్రసారస్వతము పుట్టుటకుఁబూర్వమే యీయక్షరము తెనుగు లిపినుండి లోపించినదనుట వింతను బుట్టించుచున్నది. పంతులవారీ శాసనము మొదటి చాళుక్యయుద్ధమల్లుని నాటిదనివ్రాసిరి దానిని ఖండించి లక్ష్మణరావు గారిది రెండవయుద్ధమల్లుని నాటిదనిరి. దానిని పూర్వపక్షముచేసి యిది రాజ నరేంద్రున కించుక తరువాతిదని జగన్నాధరావుగారు సిద్ధాంతము చేసిరి. దాని నించుక సవరించి యిదియంతకంటెను తరువాతిది అనగా నీశ్వరభట్ట సోమ యాజి శాసనానంతరమున బుట్టినదని నేనుఋజువుచేసితిని విషయమిట్లుండగా నాంధ్రసారస్వతము పుట్టుటకు మునుపే నీయక్షరమాంధ్రమునుండి లోపించి పోయినదనియు, నన్నపాదు లీయక్షరము తెలుగులిపిలో నుండెడిదనుసం గతి యెఱుఁగనే యెఱుఁగరనియుఁ వ్రాయుట వింతగనున్నది. మనసారస్వతము పంతులవారి వాదమునకు బాధకముగానున్నదని చెప్పకతప్పకున్నది.

నన్నపాది పూర్వలాక్షణికుల కాలమున నీయక్షరము లేదు 'కాని

వారు దానింగూర్చి ముచ్చటింపలేదని పంతులవారు వ్రాసిరికదా. వారికాల మునాటికి సారస్వతము లేకున్నను శాసనములు కలవుగదా. ఆశాసనము లలో నీయక్కరము వెలుగనుండుట సంభవించిన దానింగూర్చి వారేల వ్రాయకుందురు? పూర్వశాసనముల మనపంతులవారివంటి యధునాతనులేకాని ప్రాచీనులు పరిశోధించెడి వారుకారా? లిపిపాఠకులు పూర్వముండెడి వారు కారా? లోకులు చదువుకొనుటకే కదా శాసనములు వేయబడినవి? ఇవి యిరువదియవ శతాబ్దము వారికొఱకే పుట్టియుండలేదు గదా? మనకాలము నందుకంటె నన్నపాదుల కాలమున శాసనముల జదువువాడుక హెచ్చుగ నుండుననుకొనదగినది. శాసనములలో నున్నది యీయక్కరమే యగుచో నన్నపాదిపూర్వలాక్షణికులు దానిపరిచయము కలిగియుండి దానిని గూర్చి ముచ్చటింపకపోరు. కాన పూర్వలక్షణ గ్రంథములలో నీయక్కరము గూర్చిన ప్రశంస లేకపోవుట పంతులవారి వాదమునకు భంగకరము గాకపోలేదు వారిబారినుండి తప్పించుకొనుటకై పంతులవారు లాక్షణికులు పుట్టుటకు బూర్వమే యీయది తెలుగున నశించినదను నపూర్వవాదము నభినవముగ దెచ్చిపెట్టిరి.

నేటి పండితవరులగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రుల వారీ వింతయక్కరముంగూర్చి తమ యభినవశబ్దానుశాసనములో ముచ్చటించియుండిరి. వీరికాలమున నీయక్షరము లోకవ్యవహారమునఁ గాని సారస్వతమునఁగాని కానరాదు. ఇయ్యది నన్నయనాఁటికే యదృశ్యమైనదని ప్రతివాదులే యంకగీరించినారు. అయినను శాస్త్రులవారు తమవ్యావహారిక భాషానుశాసనములో వేలకొలఁది సంవత్సరములక్రింద నశించినదనఁబడు నక్కరముంగూర్చి ప్రశంసింపవలసిన వారైరి. ఏ హేతువుచేత? మిక్కిలి పూర్వకాలపుశాసనములలోనీయక్కరముండెడి దని యొకరిద్దఱు ప్రశంసించి యుండుటచేత. అట్టి స్వల్పకారణమున నిప్పటి శబ్దశాస్త్రకారులకే యిదిప్రశంసార్హమగుచోఁ దమ కనతిదూరకాలమున వాడుకలో నుండియున్న దీనింగూర్చి నన్నపాదులు ప్రశంసించుట తటస్థమయియే యుండవలసియుండును గదా. తమకుఁ బూర్వమందున్న శాసనములందైన నిదియుండిన దానింగూర్చి మనశాస్త్రులవారివలెనే ముచ్చటించి యుందురు. అట్లు ముచ్చటించి యుండకుండుట ప్రతివాదుల వాదమునకుఁ గొంత హానికరము కాకపోలేను.

ఇంకను చోటశబ్దములోని ఱ, ళ మైపోయిన దనియు కోటి శబ్దము లోని ట డమైపోయినదనియు శాస్త్రులవారు సెలవిచ్చుట వింతను బుట్టించు చున్నది. ఏమన? చోళపదము మనభాషలో డకారయుతముగఁ గూడఁ గాన్పిం చుచునే యున్నది. నన్నిచోడాదిపదము లుదాహరణము కర్ణాటభాషాశాస నకారులు డకారమే వింతయక్కరమైనదని వ్రాసియుండి రని యిదివఱకే వ్రాసినాఁడను. నన్నయనాఁటి కీయక్కరము చచ్చినదికాన వారు తమశబ్దా నుశాసనములోఁ జేర్పలేదని ప్రతివాదులు వాదించుచున్నారు. నేఁడది మరల బ్రదుకుటచేఁ గాఁబోలు మనశాస్త్రులవారు తమవ్యావహారిక భాషానుశాసన ములో దీనింగూర్చి యిచ్చవచ్చిన రీతిని బ్రసంగించిరి.

లక్ష్మణరావుగారు వింతయక్కరము తెలుఁగులో డ యగునని నవీన కన్నడములో ళ యగునని సూత్రించియుండగా మన సూర్యనారాయణశా స్త్రులవారు తెలుఁగులో నీవింతయక్కరము కొన్నిచోటుల డయగునని కొ న్నిచోటుల ళ యగునని సూత్రించిరి. లక్ష్మణరావుగారి సూత్రమే యుచిత మని తలంపఁదగును.

ఈవింతయక్కరము ళకారమువలె మూర్ధన్యమై యున్నదని శ్రీశాస్త్రు లవారు వ్రాయించిరి. ళకారము దంత్యముగాని మూర్ధన్యముగాదు. నాగ వర్మ కర్ణాటభాషాభూషణములో లకార మేస్థానమందుఁ బుట్టినదో ళకార మునుయాస్థానమందేపుట్టినదని వ్రాయఁబడియున్నది. కావున ళకారము దంత్య ముగాని శాస్త్రులగారు తలంచినట్లుగా మూర్ధన్యముగాదు. శాస్త్రులుగారు వింత యక్కరముంగూర్చి తమయను శాసనములోవ్రాసినదంతయు వింతగానున్నది.

నేను తాడపశబ్దము తాఱప, తాడప, తాలప, తాళపలను భిన్నరూ పములతో వ్రాయబడియున్నదని తెలిపియుండగా నాశబ్దమన్నివిధముల వ్రాయ బడియున్న కారణమున ల, ళ, డ, ఱ అన్నియు నొక్కటేధ్వనిని దెలుపున వగునాయని రామయ్యపంతులవారు నన్నధిక్షేపించిరి. తాడపశబ్దము పైరీ తిగా బహువిధముల వ్రాయబడుచున్నట్లు నేనెందులకు దెలిపితినో తెలిసికొ నక పైయాక్షేపణము గావించిరి. ఆశబ్దమన్నివిధముల వ్రాయబడుచున్న కార ణమున ఱకారము డకారమేయని తెలుపుటకై నేను వాడియుండలేదు. నా ప్రతిపక్షులగు శ్రీవీరభద్రేశ్వరరావుగారు వింతయక్షరముగల పదములన్నియు సదా వింతయక్కరముతోడను మాత్రమే వ్రాయబడుచున్నవనియు నట్లుండు

టకు గారణమేమనియు వాదించియుండుటచే యావాదనైరస్యమును చూపు టకై తాటపాదిశబ్దములు సదా యడ్డుగీటులేని శకటరేఫముతోనే వ్రాయబ డక మొదటి డకారాదులతోఁగూడ వ్రాయబడుచున్నట్లు ఋజువుచేసితిని. దీని చేవీరభద్రేశ్వరరావుగారి వాద మెగిరిపోయినది. అందులకై నేను తెచ్చినవా దమును శ్రీ రామయ్యపంతులవారు సరిగ జూచుకొనక నన్నధిక్షేపించియుం డిరని యిందుమూలముగా విన్నవించుకొనుచున్నాడను ఇట్లేకొన్ని యనవ సర విమర్శనములగూడ వారు కావించిరి. వానికి సమాధానము చెప్పుట కూడ నవసరముకాదు కావున విడిచివైచితిని. యుద్ధమల్లశాసనము కాక మఱికొన్ని శాసనములందుఁగూడ నడ్డుగీటులేని శకటరేఫము కాన్పించినది కాన వింతయక్కరము తెనుఁగులోఁ బలుతావుల వింతధ్వనిని దెలుపుటకై వాడబడినదని పంతులవారు తెలిపిరి. వీరెన్నిశాసనముల నామముల జదివి నను వింతయక్కరముతో నున్నట్లు చూపఁగలిగిన పదములు (1) ఱస్సె (2) అఱుచు (3) ఏడుఅనునవి మాత్రమే ఇతరపదములన్నియు గ్రామనామ ములో మనుజనామములో అయియున్నవి. అయ్యవి మేఱాంబాదికములు. ఈపురుషాది నామములందుగల 'ఱ'కు వింతధ్వనియేకాని డకారధ్వని లేదని నిర్ణయించుటకు నెవరికిని తరముకాదు. ఒకవిధముచే డకారధ్వని కలదను టయే యుచితము ఎట్లన తెనుగులో మేడయను పదముకలదు. సౌధమర్థము కాన మేడాంబయననర్థము కలదు. మేఱాంబయన నర్థమేలేదు. ఇట్టివియే యితరములును కాన పంతులవారు పురుషాదినామములుగల శాసనముల లెక్కలోనికి దీసికొనుటవలన విశేషమేదియును లేదు. నేనీవాదమును సల్పు టకు వలయు సామగ్రిని అనగా ఱాతినుండి తీసిన యుద్ధమల్లశాసన ప్రతిబిం బమును దానిని బ్రకటించిన ఎపిగ్రాఫియా యిండికాఅను పత్రికను నావిమ ర్శకై నేను కోరియుండగా దయతో వానిని నాకు బంపినందులకు శ్రీరామ య్యపంతులవారి యెడల నేనెంతయు గృతజ్ఞుడనై యున్నాను.

# విమర్శనములు.

నన్నె చోడకవికాలము :— ఆంధ్రచారిత్ర పరిశోధకమండలివారిచేఁ బ్రచురింపబడిన పత్రికయందు (Journal of the Andhra historical Research society Vol. 1 Part 3) బ్రహ్మశ్రీ వెంపరాల సుబ్రహ్మణ్యాం గారు నన్నిచోడ కవికాలమునుగూర్చి నూతనాంశములనుఁ గొన్నిటినిఁ దెల్పి యున్నారు. నన్నిచోడుడు నన్నయభట్టునకుఁ బూర్వుడని కొందఱును, నన్న యకర్వాచీనుడని కొందఱును బత్రికలయందు విశేషముగ జర్చను జరిపి యున్నారు. సుబ్రహ్మణ్యముగారు ప్రస్తుతాభిప్రాయములకు విరుద్ధముగను, నిరాధారముగను వ్రాసినయంశములలో గొన్ని యిటసూచింపబడినవి

(a) 'మునుమార్గకవిత లోకంబున వెలయగ దేశికవితబుట్టించి'— యిందలి మార్గకవితయు, దేశికవితయు, సంస్కృతదేశభాషాపరములుగా కవి వాడియున్నాడని విమర్శకులందరు నంగీకరించిన విషయమే. అందుకు వ్యతిరే కముగా వ్యాసకర్తగారు మార్గకవితయన పాటలు, పదములనియు (Ballad Literature) దేశికవితయనఁ బ్రబంధాది గ్రంథములనియు (Works of Poetic Art) వ్రాసినసంగతి సమంజసముగాదు.

(b) 'సత్యాశ్రయునిదొట్టి చాలుక్యనృపుల్' యను పద్యము నుద హరించి సత్యాశ్రయుడు పశ్చిమచాళుక్య వంశోద్ధారకుడగు ప్రథమపులకేశి (550 A D) అనివ్యాసకర్తగారి యభిప్రాయము. పైన నుదహరించిన పాద మునకుఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్' అనిపాఠాంతరము గానవచ్చి నది. అది యటుండనిండు. విమర్శకులలో గొందఱు సత్యాశ్రయుడన రాజ రాజనరేంద్రుడనిరి. మరికొందఱు తూర్పుచాళుక్యులలో రాజరాజునకు పూర్వ పురాజులలో నెవరోయొకరని వ్రాసియున్నారు. పశ్చిమచాళుక్యాన్వయమున మొదటిరాజ గుపులకేశియని యెవరిమతమును గాదు. మరియు దెనుగుభా షనుద్ధరించి దేశికవితను బుట్టించినది వాతాపిపురవాసులగు పశ్చిమచాళుక్యు లనుట కడునసంభవము.

(c) వ్యాసకర్తగారు నన్నెచోడుని కాలనిర్ణయమున నాతనిగూర్చి దెల్పు శాసనములను బూర్తిగవదలి, ఔెంకణాదిత్యుడని కవికిఁ బేరనియు బిరు దముకాదనియు వ్రాసెరి. కవి యాశ్వాసాంతగద్యములలో నన్నెచోడ దేవ

ప్రణీతంబని వ్రాసికొనియున్నాడు. గ్రంథమున నన్నెచోడ జనవిభుండ (1-52) సత్కవిభువినన్నెచోడు డలె (1-57) యనుప్రయోగములు గన్పట్టుచున్నవి. కవిరాజశిఖామణి, టెంకణాదిత్యుడనుపదములాతని బిరుదములని విమర్శకులు వ్రాసియున్నారు. టెంకణాదిత్యుడన దక్షిణదిశాసూర్యుడని యర్థము. చోళ వంశస్థాపకుడగు ఆదిత్యుడే (880 A D) కవియగు నన్నెచోడుడను వాదము నకై యిట్టియపూర్వకల్పన మొనరింపవలసి వచ్చినది. వ్యాసమున నన్నెచోడ చోడబల్లి, శ్రీసతిపదములచర్చ యొకింతయు గానరాదు. శాసనవిషయములు గాని కవికృతినొసంగిన జంగమమల్లికార్జున కాలనిర్ణయముగాని యీవ్యాస మున గానరావు. ఇంకను ప్రమాణరహితములగు నూతనాంశములు చాల గలవు. పండితులు సహృదయులై యీవ్యాసమును విమర్శించి సత్యాసత్య నిర్ణయ మొనర్తురు గాక.

## పత్రికా స్వీకారము.

1. కవిత. ఇయ్యది బ్రహ్మశ్రీ వేదుల కామశాస్త్రిగారిచే సంపాదిత మగు మాసపత్రిక. ఆలమూరునందలి కవితానికేతనమున వెల్వడి 'భావకవి తాప్రపూజ్యతను' వహించి సనాతనాధుని కాంధ్రకవితా వితానముల కాట పట్టనదగు నటుల బ్రకటింపబడుచున్నది. అట్టికవితకు స్వాగత మొసంగుచుం జిరకాల మాంధ్రకవితామతల్లికి సేవజేయుచు మన్ననవడయుగాతయని యా శీర్వదించుచున్నాము. చందా సం॥ కు 2-0-0.

2. ఆరోగ్యప్రకాశిని. సంపాదకుడు మద్దూరి చలమయ్యపంతులు గారు యేలూరు ఈవారపత్రిక యారోగ్యాభివృద్ధి సాధకమగుచు, దేశోద్ధరణ మొనర్చుచు జిరకాలము వర్ధిల్లగలదని నమ్ముచున్నాము. చందా సం॥కు రు 2-8-0.

3. యథార్థభారతి. ఇది బ్రహ్మశ్రీ పండిత కాశీభట్ట కృష్ణరాయశా స్త్రిగారిచే సంపాదితమగు యాధ్యాత్మవిషయక మాసపత్రిక—మార్చి నెల లో బ్రకటింపబడిన సంచికయందు ముముక్షువుల కుపయోగించు. భావానందీ యము, ధ్యానము మొదలగు వ్యాసములుగలవు. శ్రీశంకర భాష్యానుసార ముగ నీశావాస్యోపనిషత్తు ప్రకటింపబడుచున్నది.

సంవత్సరమునకు జందా 2-4-0. యథార్థభారతి కార్యాలయము 5 కొండలయ్యరు వీథి మింటు బిల్డింగ్సు పోస్టు మదరాసు.

## గ్రంథవిమర్శనము.

1. అనసూయామహిమ ఈగ్రంథమాదవాని పురవాస్తవ్యులగు గార్ల దిన్నె సుబ్బరాయ ప్రణీతమగు చిన్ని నాటకము. బాలికలకు నీతిదాయకముగా నుండునటుల మహాపతివ్రతయు, నత్రిమహాముని భార్యయునయిన యనసూయాచారిత్రమును, త్రిమూర్తులామెను బరీక్షింపవచ్చి బాలకులగుటయు, దత్తాత్రేయజననమును మొదలగు పురాణవిషయములిందు సరసముగాను, హృద్యముగాను వర్ణింపబడినవి. గ్రంథకర్త దత్తమండలవాసి యగుటచే దత్తమండల ప్రయోగములుకొన్ని గానవచ్చుచున్నవి. జనసామాన్యమగు కథలనువిడచి, యనసూయాచరిత్రమును నాటకము గరచించిన గ్రంథకర్త యుద్యమమెంతయు బ్రశంసనీయము.

2. శ్రీకృష్ణదేవరాయ చరిత్రము. మద్దూరి శ్రీరామమూర్తిగారిచే రచింపబడినది. ఈగ్రంథము కృష్ణదేవరాయల చరిత్రమును బ్రజలుచెప్పుకొను కల్పితగాథలను గలిపి వ్రాయబడినది. ప్రథమభాగమున కర్ణాటరాజ్యము, కృష్ణదేవరాయల రాజ్యపాలనము, వివాహములు మొదలగు విషయములు వర్ణింపబడినవి. ద్వితీయభాగమునం దాతని యాస్థానమునందలి యష్టదిగ్గజములని పేర్కొనబడిన పెద్దన, తిమ్మన, ధూర్జటి, మల్లన, పింగళి సూరన, రామభద్రుడు, రామకృష్ణుడు, రామరాజభూషణుడును సమకాలికులుగారని కవులచరిత్రములు దెల్పుచున్నవి. వారలనుగూర్చి వ్రాసినగాథలప్రమాణములు, నసత్యములని రూఢిగా జెప్పవచ్చును, ఈగ్రంథము చారిత్ర్య కవిమర్శనాదివిషయములు విశేషముగలేక పామరజనులకొరకు సులభమగు శైలితో వ్రాయబడినది. గ్రంథకర్త కర్ణాటరాజ్యసార్వభౌముడగు కృష్ణరాయల చరితమును వ్రాయుచో జారిత్ర్యకవిషయములమాత్రము ప్రమాణముగ గైకొనిన బాగుగనుండి యుండునని తలంచుచున్నాము.

వెల ప్రతి 1 కి 1-0-0 రాజమండ్రి పసుపులేటి వెంకట్రామయ్య బ్రదర్సుయొద్ద దొరకును.

3. సంగీత విష్ణులీలలు—గ్రంథకర్త మద్దూరి శ్రీరామమూర్తి గారు కాకినాడ. గ్రంథకర్త శ్రీమన్నారాయణుని దశావతారములలోను మత్స్య కూర్మవరాహనారసింహ వామనావతారముల యొక్కయు, పరశురామ, శ్రీరామ బుద్ధావతారముల యొక్కయు కథలను గైకొని, శ్రీకృష్ణుని కథను వానితో జేర్చుచు, వలయుస్థలముల భాగవతమునుండి పద్యములను సంగ్రహించి రసవంతముగా శ్రీకృష్ణప్రబంధమును రచించియున్నాడు. ఈ గ్రంథము రాజమండ్రిలో [illegible] గారి యొద్ద దొరకును.

